జాతి గొప్పదైనను మతదేశభేదములచే దుర్బలముగ నున్నది. మంగోలియాజాతి యేకమతదేశపాశబద్ధమై బలీయమై యజేయము కాఁగలదు. భావిప్రపంచపరిణామమునందు మంగోలియారక్తసమ్మిళితమైన రుష్యాప్రజలకును జపాను చీనాసామ్రాజ్య ప్రజలకును సంయోగము కలిగినప్పుడు ప్రపంచపరిస్థితులు పొందగల విపరీతదశ వర్తమానమునందు దురూహ్యము.

### సంగ్రామ ఫలము

సంగ్రామఫలమును చూచుటకు లోకము త్వరపడుచున్నది. లోకము 64 మాసములు తీవ్రమైన సంగ్రామవేదన ననుభవించినది. మహాసంగ్రామము సామ్రాజ్యముల నంతము చేసినది. పరిశ్రమలను పాడుచేసినది. ప్రజానాశనమునకు తోడ్పడినది. లోకప్రవృత్తికి మూలబీజమైన పదార్థోత్పత్తిని వికలము చేసినది. సకలమును నూతనాకృతిఁ దాల్చుచున్నది. యుద్ధారంభమునందు మహాప్రతాపవాక్యములను బ్రకటించిన జర్మను చక్రవర్తి 1919-వ సం॥ నవంబరు 20-వ తేదిని రాజ్యత్యాగము చేసి ప్రచ్ఛన్నప్రవాసమును స్వీకరించెను. యుద్ధమునకు మూలకారణమైన ఆస్ట్రియా సామ్రాజ్యము నామరూపములు లేక నశించినది. విజయప్రాప్తికి అమెరికా సంయుక్తరాష్ట్రములు అంత్యదశయందు సాధనము లయినను బ్రిటీషు సామ్రాజ్యబలమే ప్రధానసాధనము. గ్రేటుబ్రిటను యుద్ధనిర్వహణమునకు 9,60,00,00,000 నవరసులను వ్యయము చేసెను. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములు 75,60,00,000 నవరసులను వ్యయము చేసినవి. యుద్ధనిర్వాహణమునకై సంయుక్తరాష్ట్రములు 57,04,416 మందిని, కనడా 6,28,864 మందిని, ఆస్ట్రేలియా 4,16,809 మందిని దక్షిణాఫ్రికా 13,670 మందిని, ఇండియా 14,00,000 మందిని సైనికులను సిద్ధము చేసినవి. ఈ సైన్యమునందు లక్షలకొలంది సామ్రాజ్యరక్షణమునకై ప్రాణములను సమర్పించిరి. రణరంగములం దుభయపక్ష సైనికులును 8,55,00,000 మంది యుద్ధము చేసిరి. ఆ సైనికులందు 70 లక్షల మంది మృతి నొందిరి. 180 లక్షలమంది క్షతగాత్రులైరి. 60 లక్షలమంది తప్పిపోయిరి. సముద్రరంగమునందు వివిధరాజ్యముల పొగయోడలు నయిదువేలు నాశనము నొందినవి. యుద్ధమువలన పరిశ్రమలకును వ్యాపారములకును నపారమైన నష్టము కలిగినది. ఈ మహాయుద్ధమునకు కలిగిన ప్రతిఫలము స్వల్పమని వర్తమానపరిస్థితులు తెలుపుచున్నవి. యుద్ధమువలన జర్మనురాజ్యమునకు యూరపుఖండమునందు 40000ల, ఇతర ప్రాంతములందు 112600ల చదరపుమైళ్ల ప్రదేశము తగ్గిపోయినది జర్మనుల యుద్ధనౌకలు మిత్రమండలికి సంక్రమించినవి. జర్మనుల సైనికబలము స్వల్పసంఖ్యకు నేమింపఁబడినది. జర్మనుల నౌకానిర్మాణము విమాననిర్మాణము నేమింపఁబడినది. జర్మనులు ముప్పదియాఱేండ్లలో మిత్రమండలి రాజ్యములయుద్ధవ్యయపూరణమునకు 17,72,00,00,000 నవరసుల ద్రవ్యము నిచ్చునట్లు నిర్ణయింపఁబడినది. జర్మను చక్రవర్తిని మహాపరాధిగ విచారించుటకు నిర్ణయింపఁబడినది. జర్మనుల బలవిలయము ఫ్రాన్సుదేశ భయనిర్మూలనమునకు కారణంబైనను లోకప్రవృత్తియందు శాంతిస్థాపనమునకు సాధనము గాలేదు. శాంతిస్థాపనము నూతనరాజ్యనిర్మాణమును చేసినది. జకోస్లావుజాతి ప్రజలకు జకోస్లావాకియా రాజ్యము దక్షిణస్లావుజాతికి జూగోస్లావియా రాజ్యము, ఏర్పడినవి. ఎస్తోనియా ఫిన్లాండు లిథుయేనియా పోలాండు రాజ్యములు నిర్మింపఁబడినవి. రుష్యా జర్మనీ ఆస్ట్రియా రాజ్యముల దౌర్జన్యమువలన మూఁడుశతాబ్దములు కష్టపరంపరల ననుభవించిన పోలాండురాజ్యము పునర్నిర్మితమై స్వాతంత్ర్యస్థితిని పడసినది. విధివశమున నూతనప్రతిష్ఠితరాజ్యములందును ప్రజలకు శాంతి గలుగలేదు. ప్రజలన్నాతురులై వ్యాధిగ్రస్తులై కలహనిమగ్నులై మడియుచున్నారు.

### రుష్యా బొల్షి విజయము

రుష్యాదేశచరిత్ర మతివిచిత్రముగ నున్నది. ఆ దేశమునందు నిరంకుశాధికారాంతముతో శాంతిసుఖములు కలుగుటకు బదులు విప్లవదుఃఖములు విహరించుచున్నవి. దేశము పీట్రోగ్రాడునుండి వ్లాడివోస్టాకువఱకును విప్లవమయమై రక్తసిక్తమగుచున్నది. భిన్నప్రదేశములందు కోల్చకు డెనికిను మొదలగు నాయకులు స్వతంత్రరాజ్యములను స్థాపించిరి. ఈ నాయకులకు బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు సహాయము చేయఁదలపెట్టినవి. ఆంగ్లసైన్యములు ఆర్కేంజలు ముర్మను మండలములందు కోల్చకుపక్షమునకు సహాయము చేసినవి. కాని, ప్రజాభిప్రాయప్రాతికూల్యమును కోల్చకుసైన్యదౌర్బల్య

మును బ్రిటిషుసైనికులను స్వదేశోన్ముఖులఁ జేసినవి. బ్రిటిషు రాజ్యాధికారు లవలంబించిన యాహార వ్యాపార ప్రతిషేధకతంత్రము రుష్యాయందు భిన్నపక్షముల వారికి సంయోగమును కలిగించినది. బాల్షివికుపక్ష ప్రతిఘటకులైన రుష్యాజాతీయవాదులు స్వజాతీయాభిమానమును ప్రజ్వరిల్లఁ జేయుచు బాల్షివికుపక్షానుకూల్యమును పూనిరి. ఆపత్కాలమునందు భిన్నపక్షములవారి కాత్మసంరక్షణమునకై సంయోగము కలుగుట సహజము. మిత్రమండలి ప్రతిషేధకతంత్రము బాల్షివిక్కులకు బలమును గలిగించినది. మిత్రమండలి రాజ్యనీతిజ్ఞులు తలఁచినట్లు రుష్యాప్రజలు మిత్రమండలిపక్షసైనికనాయకులకు సహాయము చేయలేదు. డెనికిను కోల్చాకు సైన్యములు పరాజయముఁ బొందినవి. బోల్షివికుల బలము ప్రబలినది. బోల్షివికులు సర్వశక్తిపరాక్రమముతో రుష్యాను పాలించుచు నితర రాజ్యములకు భయభ్రాంతులను గలిగించుచున్నారు. యూరపు రాజ్యముల యాహారపదార్థములకు సదనమైన రుష్యాదేశ మిపుడు పాడుపడి ప్రజాపోషణమున కననుకూలముగ నున్నది. క్షామదేవత యుద్ధదేవత జాడ్యదేవత రుష్యాయందు విహరించుచున్నవి. రుష్యాస్థితి దురవగాహముగ నున్నది. సర్వసమత్వపరిపాలనము సుఖశాంతులను స్థాపించిన దని కొందఱు ప్రతిపాదించుచున్నారు. బాల్షివికుల పరిపాలనము జారు నిరంకుశాధికారమును మీఱిన దనియు, సంఘస్వామ్యనాశనము మానవధర్మవికాసమునే మూలచ్ఛేదము చేసిన దనియు మఱికొందఱు ప్రతిపాదించుచున్నారు. రుష్యాస్థితి యెటులున్నను రుష్యావ్యవహారములందు ప్రమేయము గల్పించుకొనుట యనాలోచిత మను మత మిపుడు యూరపు రాజ్యములలో వ్యాపించినది. రుష్యాగతిని రుష్యావశము చేయుట వివేకమని రాజనీతిజ్ఞులు తలఁచుచున్నారు. రుష్యాప్రజలు సాంఘికమహాపరివర్తనముఁ జేయఁ దలపెట్టినారని వారి వ్యవహారక్రమము వ్యక్తము చేయుచున్నది. సర్వజనసమత్వప్రతిపాదకమైన సాంఘికధర్మస్థాపన యెంతవఱకు నిత్యవ్యవహారములందు ప్రయోగయోగ్యము కాఁగలదో కాలపరిణామము వ్యక్తము చేయఁగలదు.

వర్తమాన సాంఘిక రాజకీయార్థిక సంరంభములందు నిత్యవ్యాప్తిని గాంచిన బాల్షివికు సోవియటు పదముల భావార్థమును తెలిసికొనుట సాంఘికధర్మస్వరూపముఁ దెలిసికొనుటకు సాధనముగా నుండఁగలదు. బాల్షివికుపదము రుష్యాభాషయందు బాహుళ్యాధికారమును సూచించుచున్నది. సోవియటుపదము స్లావుభాషలయందు "మహాసభ" యను నర్థమును నిరూపించుచున్నది. సర్వియా ప్రభుత్వము 1805 వ సంవత్సరమున సోవియటు అని పిలువఁబడినది. కాని ఈ రెండుపదములకు నిపుడు రుష్యాప్రజలును నితర దేశీయులును విశేషార్థమును కల్పించుచున్నారు. రుష్యాదేశీయులు, అనుననను సాంఘికధర్మప్రతిపాదకులు ఆ పదములను సాంఘికస్వామ్యధర్మమునం దుపయోగించుచున్నారు. వారి దృష్టియందు సకలైశ్వర్యములును సకలజనస్వామ్యమునకును సకలజనానుభోగమునకును తగియున్నవి. రాజులు భూస్వాములు యంత్రాధికారులు ప్రత్యేకస్వాతంత్ర్యములను స్వామ్యములను గలిగియుండఁజనదు. సంపదలు పంటలు లాభములు సకలజనులకును సమానముగ ననుభోగ్యములు. సకలజనులు రాజ్యమునకు పోషణార్హులు. సకలజనులు నుచితముగ విద్యాశిక్షణము లందనర్హులు. ముఖ్యముగ శిశువులు వృద్ధులు రాజ్యపోషణమునకు అర్హులు. స్త్రీపురుషులు సకలవ్యవహారములందును సమానస్వత్వములను గలిగియుందురు. సంబంధబాంధవములందు సామాన్యకులీనభేదములు పరిత్యాజ్యములు. రాజ్యవ్యవహారములందు మండలసంఘములు గ్రామసంఘములు పరిపాలనభారమును వహించుటకు నిర్ణయింపఁబడినను ఆచరణమునందు సైన్యాధికారము ప్రబలముగ నున్న దని వార్తలు తెలుపుచున్నవి. రుష్యాయం దవలంబితమైన పరివర్తనమునకు లెనిను మహానాయకుఁడు. ఆ మహానాయకునకు ట్రోట్‌స్కీ సేనాధ్యక్షుఁడు. ఈ యుభయనాయకులును రాజకీయార్థికసాంఘికపరివర్తనములను ప్రపంచమునందు స్థాపింప సమకట్టినట్లు వార్తలు తెలుపుచున్నవి. బాల్షివికు సైనికులు 20,00,000 మంది గల రనియు, వారు వారి ధర్మమును ప్రాగ్దేశములందు వ్యాపింపఁజేయ బ్రబలప్రయత్నములు చేయుచున్నా రనియు వార్తలు తెలుపుచున్నవి. రుష్యాయందు నిరంకుశాధికారము నిర్మూలము చేసిన పరివర్తనకారులు నిరంకుశాధికారమును తిరిగి వ్యాపింపఁజేయుటవలన ఆ దేశమునకు సుఖశాంతులు గలుగఁజాలవు. పూర్వము ముప్పది లక్షల ప్రజలు కలిగిన పెట్రోగ్రాడు నగర మిపుడు ఏడు లక్షల ప్రజలు మాత్రమే కలిగియున్నది. ప్రజ లన్ని భాగములందును ఈతిబాధలకు లోనై కృశించి నశించుచున్నారు. రుష్యాదేశమును స్వయముగ సందర్శించిన యొక యాత్రికుఁ డిటులు వ్రాయు

చున్నాఁడు: "బహుపాలకధర్మము మనగల సాంఘిక
వ్యవస్థ గాదు. వివేకవిజ్ఞానముల శత్రుత్వము సంఘశుభ
స్థితికి మూలాధారము కాదు. బహుపాలకధర్మఫలము
కేవలము నిర్మూలనము. ఈ ధర్మ మింతకు ముందు
గల సంఘధర్మస్థితిని ముందు దుస్సాధ్యము చేసినది."
బాల్షివికు ధర్మము సకల దేశములందును బహుభం
గుల భయమును కలుగఁజేయు చున్నది. సుస్థిర దశా
రహితము లయిన మధ్యస్థప్రాగ్దేశములందు ఈధర్మవ్యాప
నమున కవకాశములు కల వని బ్రిటిషురాజ్యాధికారులు
భయపడుచున్నారు. బ్రిటిషు రాజ్యాధికారప్రాబల్యము
గల మెసపొటేమియా పరిష్యా అఫ్గనిస్థానము హిందూ
దేశము మొదలగు దేశములందు ఈ ధర్మవ్యాపనమున
కవకాశము లుండఁజాలవు.

ధర్మసంరంభము

రుష్యాపరివర్తనమునందు ప్రవృత్తిపరికల్పితమైన
ధర్మరహస్యము సందర్శనీయము. ప్రవృత్తి నిరంతర
సంచలనము నభిలషించుచున్నది. రాజ్యాధికారు లధిక
రాజ్యమును కాంక్షించెదరు. వర్తకు లధికవర్తకము నభి
లషించెదరు. శ్రీమంతు లధికసంపదలను కోరెదరు. అధి
కారు లధికాధికారమును వాంఛించెదరు. అధికాధి
గమనాపేక్షకు మూలబీజము సామాన్యముగ స్వోప
భోగము పరపీడనము గాని పరహితము పరపోషణము
గాదు. కడచిన ఘోరసంగ్రామముల కివియే మూలబీజ
ములు. ధనవంతులు ధనరహితులను, విద్యావంతులు
విద్యావిహీనులను, పండితులు పామరులను, సురూపులు
కురూపులను, కులీనులు సామాన్యులను నిందించుట
నిరసించుట లోకమునందు పరిపాటి యైనది. అష్టైశ్వ
ర్యములు ప్రాజ్ఞులకు సన్మార్గమునకును మూర్ఖులకు
దుర్మార్గమునకును గారణంబు లగుచున్నవి. స్వీయ
విద్యాధనాధికారములను పరపీడనమునకై వినియోగిం
చెడి మానవధర్మవినాశకులతో లోకము నిండియున్నది.
దుఃఖపరంపరల ననుభవించిన లెనిను దుఃఖనాశనము
నకు పూనుకొనుట సహజ మైనను, అతఁడు అవలంబిం
చిన వ్యవహారవిధానము దుఃఖనాశనమునకు సాధనము
గాఁజాలదు. ఇంతవర కేభోగ్యపదార్థములు లోకమునందు
దుఃఖప్రవృత్తికి మూలబీజము లైనవో అభోగ్యపదార్థము
లు భావికాలమునందు పరివర్తనరూపమున సుఖప్రవృత్తికి
సాధనములు కాఁజాలవు. పరపీడనమును నధికసంఖ్యాకులు
చేసినను స్వల్పసంఖ్యాకులు చేసినను అది దుఃఖప్రవృత్తి
యందు పరిణమించుచున్నది. లెనిను నవయుగధర్మస్థాప
నమునందు యూరపుతత్త్వజ్ఞులకు చిరపరిచిత మైన యధిక
సంఖ్యాలాభసిద్ధాంతమును గ్రహించుచున్నాఁడు గాని
బుద్ధదేవునివలె మానవకల్యాణప్రయోజనమును కనుఁ
గొనుట లేదు. దుఃఖనివృత్తి భోగత్యాగములలో దేని
యందు సంభవము అగును. యను మహాసమస్యను వర్త
మానయుగము తిరిగి నిర్ణయింపవలసియున్నది. కురు
క్షేత్రమునందు శోకసంవిగ్నమానసుఁడై నిశ్చేష్టుఁడై
నిలువఁబడిన యర్జునునకు శ్రీకృష్ణుఁ డుపదేశించిన
మహాయోగమునే లోకకల్యాణమునకై లోక మిపుడు
గ్రహింపవలసియున్నది. దుఃఖనివృత్తి ప్రవృత్తిపరి
వృతు లైన మానవులకు కేవలము ప్రవృత్తియందుఁ
గాని కేవలము నివృత్తియందుఁ గాని సాధ్యము గాదు.
ప్రవృత్తి నివృత్తియందు దుఃఖనివృత్తి సాధ్యము. కేవ
లము కర్మయోగము గాని కేవలము సన్న్యాసయోగము
గాని విజయునకు దుఃఖనివృత్తిని కలుగఁజేయు లేదు.
కర్మయోగ మఖండ మైన ప్రవృత్తి పాశబంధము
లను కల్పించుచున్నది. సన్న్యాసయోగము ప్రవృత్తి
మార్గమును నిరసించుచున్నది. కర్మసన్న్యాసయోగము
ప్రవృత్తి నివృత్తి మార్గములను సమన్వయము చేయు
చున్నది. ఫలాపేక్షారహిత మైన ప్రకృతి భోక్తృత్వము
బంధమునకుగాకను మోక్షమునకు సాధనంబగుచున్నది.
కర్మసన్న్యాసయోగమువలన విజయునకు దుఃఖనివృత్తి
గలిగినది. తీవ్రవేదన ననుభవించుచున్న లోకమునకు
దుఃఖనివృత్తి భోగ-త్యాగయోగ మూలముననె కలుగఁ
గలదు. సకలజనులు శ్రీకృష్ణుఁ డుపదేశించినట్లు యోగా
రూఢులై భోగద్వేష లాభభావములను పరిత్యజించి
త్యాగప్రేమసేవాభావము లనుభవించుటయందె దుఃఖ
నివృత్తి సాధ్యము.

శ్లో. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతిమృచ్ఛతి.

సంధిమహాసభ

సంధిమహాసభ 1919-వ సంవత్స రారంభము
నందు వర్సేలునందు సమావేశమైనది. ఆ మహాసభ
యందు అమెరికాసంయుక్తరాష్ట్రములు బ్రిటిషుసామ్రా
జ్యము ఫ్రాన్సు ఇటలీ జపాను మొదలగు రాజ్యములు
చేరినవి. ఈ పెద్దరాజ్యములు పంచమహారాజ్యము లని

పే రొందినవి. సంధిమహాసభయందు మాంటేగు గారు బికనీరుమహారాజు భారతవర్ష ప్రతినిధులు. జర్మనులు సంధినియమములను జూను 20-వ తేది నంగీకరించిరి. ఆ నియమములు జర్మనురాజ్యబలమును నిర్మూలము చేసి ఆ రాజ్యమును సామాన్యరాజ్యస్థితికి మార్చుచున్నవి. జర్మనుదేశము పరివర్తనమయమై అశాంతస్థితియందున్నది. గతించిన యాఱు మాసములలో రాజ్యపరివర్తనముఁ జేయుటకై సైనికాధికారులు ప్రయత్నించిరి. కాని, ఇంతవఱకును ప్రజాస్వామ్యాధికారులు రాజ్యాధికారమును పూని సంధినియమములను నిర్వహించుటకు ప్రయత్నించుచున్నారు. జర్మను రాజ్యమును పూర్వదిశయందు బాల్షివికుల విప్లవమును పశ్చిమదిశయందు ఫరాసుల సైన్యదౌర్జన్యమును పీడించుచున్నవి. సరిహద్దుప్రాంతములందు నూతననిర్మితరాజ్యములు దేశాక్రమణముఁ జేయుచున్నవి. మిత్రమండలి కోరినట్లు జర్మనుచక్రవర్తిని వారి వశము చేయుటకు హాలండు ప్రభుత్వము నిరాకరించినది. ఈ నిరాకరణమును మిత్రమండలి రాజ్యములు ప్రతిఘటింపఁ దలఁచినట్లు సూచనలు లేవు. ఇతరాపరాధులను స్వదేశ న్యాయస్థానములందు జర్మనులు విచారించి దండించుట కంగీకరించిరి. మిత్రమండలివారు జర్మనుల వ్యవహారక్రమము నంగీకరించిరి.

జర్మనులయెడ నితరరాజ్యములకు సానుభూతి కొంత కలుగుచున్నను, ఫ్రాన్సుదేశమును మాత్రము భయభ్రాంతు లింకను బాధించుచున్న వని వ్యవహారక్రమము విశదము చేయుచున్నది. ఫరాసులు జర్మనుపురములైన ఫ్రాంకుఫోర్టు మొదలగు పురముల నాక్రమించుకొనినపుడు బ్రిటీషురాజ్యాధికారులు వారిని మందలింపవలసిన యవసర మేర్పడినది. ఫరాసు రాజ్యాధికారుల సమాధానము తాత్కాలికోపశమనమును కలిగించినను ఫరాసుల స్వభావమునకు నిదర్శనముగ నున్నది. ఫరాసులు స్వప్రయోజనమునకై సంధినియమముల నుల్లంఘించి సంధిమహాసభకు దుర్బలత్వమును కలిగించిరి. ఇంగ్లాండు ఫ్రాన్సు రాజ్యములు సంధివ్యవహారములందు కాఠిన్యమును చూపుచున్నను, అమెరికాసంయుక్తరాష్ట్రములు మార్దవస్వభావముఁ జూపుచున్నవి. మే నెల నుండియు యథాప్రకారము వ్యాపారవ్యవహారములను జర్మనురాజ్యముతో నడుపుటకు సంయుక్తరాష్ట్రప్రభుత్వము తీర్మానించినది. భావికాలమందు జర్మనురాజ్యస్వరూప మెట్లు పరిణమించినను మిత్రమండలి రాజ్యములం దీ విషయమై నిర్ణీతాభిప్రాయము లే దని వర్తమానరాజ్యతంత్రము విశదము చేయుచున్నది.

ఆస్ట్రియాదేశము 1919 సెప్టెంబరు 10-వ తేదిని సంధినియమముల నంగీకరించినది. అనేకశతాబ్దులుగా యూరపురాజ్యములకు కలహకారణమైన యాస్ట్రియా రాజ్యము నామరూపములు లేక పతించినది. ఆ రాజ్యము పోయి నూతనరాజ్య మేర్పడినను కలహాంకురములు నశించిన వని విశ్వసించుట కవకాశము లేదు.

బల్గేరియాదేశము 1919 నవంబరు 27 వ తేదిని సంధినియమముల నంగీకరించినది. బల్గేరియా మేసిడోనియా త్రేసు దేశములందు తనహక్కులను విడనాడినది. నష్టపూరణమునకై మిత్రమండలికి విశేషధనమును సమర్పింప నంగీకరించినది.

శత్రురాజ్యము లైన హంగరీ తురుష్క దేశములు సంధినియమముల నింకను నంగీకరింపలేదు. హంగరీరాజ్యసంధినియమము లేరూపము దాల్చినను ఆ నియమములందు లోకప్రయోజనములు విశేషముగ గనఁబడవు. తురుష్కరాజ్యసంధినియమములు మహమ్మదీయప్రపంచమును భరతవర్షమును కలవరపఱచుచున్నవి. ఇదియే ప్రస్తుతాందోళనమునకు కారణమైన ఖిలాఫత్ సమస్యకు మూలము. ఇందు మహాసమస్యలు చేరియున్నవి. క్రైస్తవమహమ్మదీయమతసమస్య పాశ్చాత్యప్రాచ్యవిజ్ఞానసమస్య యూరపు ఆసియాఖండముల సమస్య స్వజాతీయ విజాతీయసమస్య—ఇవన్నియు ఖిలాఫత్ సమస్యకు మహాబలమును కలిగించినవి. తురుష్కసామ్రాజ్యము స్వతంత్ర మహమ్మదీయ రాజ్యములయందు ప్రధానరాజ్యము. ఆ రాజ్యము మహమ్మదీయమతపీఠమునకు మూలస్థానముగఁ బరిగణితము. మహమ్మదీయ నవహృదయము మహమ్మదీయ బలరక్షణవ్యాపనమునకు తురుష్కసామ్రాజ్యము మూలాధారమని నమ్మినది. తురుష్క యువజనకక్షి మహమ్మదీయప్రాభవవ్యాప్తి నపేక్షించుచు మహాసంగ్రామమునందు జర్మనుపక్ష మవలంబించినది. జర్మనులు తురుష్కులకు మహమ్మదీయప్రపంచాధిపత్యమును నిర్ణయించిరి. తురుష్కులాశాప్రేరితులై యనవసరముగ మిత్రమండలితో ప్రతిఘటించిరి. యుద్ధసమయమందు తురుష్కులు క్రైస్తవులను చిత్రవధలకు పాలుచేసి రను నపవాదము కలిగినది. సన్నిహితప్రాగ్దేశములం దే డెనిమిది శతాబ్దముల

నుండియు మహమ్మదీయజాతులకు క్రైస్తవజాతులకు ప్రచండసంరంభము పర్యాప్తంబగుచున్నది. ఏవిధముననైనను మహమ్మదీయపీఠమును కాన్స్టాంటునోపిలు నుండి వెకలింపవలయు నని యూరపు రాజ్యతంత్రజ్ఞులు తలఁచుచుండిరి. రుష్యారాజ్యము విప్లవముపాలు గాకుండిన తురుష్కుల నిర్గమన మవితర్కితముగ జరిగియుండును. జర్మనుల పరాభవము మహమ్మదీయ నవహృదయమున కాశాభంగమును గలిగించినను రుష్యా విప్లవ మాశోద్ధరణమునకు కారణ మైనది. యుద్ధము ప్రస్తుతము మహమ్మదీయప్రాభవవ్యాప్తిని మూలచ్ఛేదము చేసినది. మహమ్మదీయమతమునకు మూలావలంబనమైన తురుష్కసామ్రాజ్యము విలయము నొందినది. ఆసియా ఆఫ్రికా ఖండములందుఁ గలఁ యే మహమ్మదీయ రాజ్యమునకును మహమ్మదీయప్రాభవత్వసిద్ధికి తోడ్పడుటకు ప్రతిపత్తి గాని ప్రతిభ గాని బలము గాని లేదు. యూరపుఖండమునుండి తురుష్కరాజ్యము నిర్గమించినపుడు మహమ్మదీయ ప్రతిభ యస్తమించు ననుభయము మహమ్మదీయహృదయములందుఁ గలుగుట సహజము. కాని కాన్స్టాంటునోపిలు తురుష్కరాజ్యమునకు రాజధానీనగరముగ నుండుటవలన దానికి గలుగఁగల బలము మాత్రము సంశయాస్పదము.

మహమ్మదీయప్రాభవవ్యాపనమునం దైహికాముష్మికధర్మములు చేరియున్నవి. ఇరువదవ శతాబ్ది ఆరంభముతో లోకమునందు నూతనయుగ మారంభమైనది. ఆసియాఖండమును నూతయుగ కాంతులు మేలుకొలిపినవి. జపానుదేశ మాసియాఖండవాసుల కాత్మబలమును తెలియఁజేసినది. జపానురాజ్యము ప్రసరింపఁజేసిన ప్రబోధకాంతు లాసియాఖండము నావరించినవి. రణరంగములందును వ్యాపారతంత్రమునందును పరిశ్రామికనిర్మాణమునందును జపానీయులు చూపిన ప్రావీణ్య మాసియాఖండవాసుల ప్రక్షిప్తబలమును వ్యక్తము చేసినది. శ్వేతజాత్యాధిక్యసిద్ధాంతము నిరాధారమైనది. ఆసియాఖండవాసుల యసహాయస్థితికి మూలకారణ మవకాశాభావము గాని సామర్థ్యాభావము గాదని ధ్రువపడినది. ఐరోపామహాసంగ్రామ మీ విశ్వాసమును వేయిరెట్లధికము చేసినది. జపానీయులు సులభముగ విజయములను బడసిరి. తెల్లజాతుల విజయములకు నల్లసైన్యములు సాధనభూతము లైనవి. శ్వేతజాతుల ధర్మపాలనసిద్ధాంతమును సాహస ధైర్య ప్రతిభలను బలప్రభావవిశ్వాసమును వివేకభావమును మహాసంగ్రామము నిర్మూలము చేసినది. మహమ్మదీయులు నూతనప్రబోధమును ఖిలాఫత్ సమస్యను సమన్వయము చేయుచున్నారు. భారతీయులును స్వజాతీయ స్వదేశోద్ధరణమునకే ప్రబోధమునె నమ్ముచున్నారు.

మహమ్మదీయమతస్థాపకుఁ డైన మహమ్మదునకు అరాబియా జననస్థలము. మహమ్మదీయపీఠాధిపతులకు ప్రథమమున మక్కా-మెదీనాలును తదనంతరము బాగ్దాదు కాంస్టాంటినోపిలులును వాసస్థలములు. పీఠాధిపతులు మొదటను అరాబులు, తదనంతరము తురుష్కులు. ఇపుడు పీఠాధికారులు తురుష్కు లని కొందఱును అరాబు లని కొందఱును వాదించుచున్నారు. పీఠాధిపత్యము తురుష్కరాజ్యమున నిలిచియుండిన, మహమ్మదీయప్రపంచము పొందఁగల వ్యాపనమున కధికతరావకాశములు కలుగఁగలవు. పీఠాధిపత్యము అరాబియా రాజ్యాధీన మైన, మహమ్మదీయప్రపంచమునకు విశేష మైన బలము కలుగఁజాలదు. అరాబియారాజ్యము యుద్ధమునకు పూర్వము తురుష్కసామ్రాజ్యమునందు సామంతరాజ్యముగ నుండెను. సంగ్రామానంతర మొక స్వతంత్ర రాజ్యముగ స్వయంనిర్ణయధర్మము ననుసరించి నిర్మింపఁబడినది. బ్రిటీషు సామ్రాజ్యాధికారుల ప్రాపకమువలన నేర్పడిన యరేబియారాజ్యము స్వయంవ్యక్తిత్వము గల రాజ్యముగ నేర్పడఁజాలదు. మహమ్మదీయ ప్రపంచబలమునకీ వ్యవహారము విశేషప్రయోజనము నొడఁగూర్పదు. ఖిలాఫత్సమస్య కేవలము మతసమస్య కాదనియు మహమ్మదీయప్రపంచస్వాతంత్ర్యసమస్య యనియు వ్యక్తమగుచున్నది. లోకమునకు భావికాలమునం దుపకారాపకారములు అరాబియాప్రజలవలన కలుగునో తురుష్కులవలన కలుగునో దైవమునకే యెఱుక. ప్రపంచశుభోదయము మతాధిపత్యమును రాజ్యాధిపత్యమును విడఁదీయుటయందుఁ గలదు. గాని యేకము చేయుటయందు లేదని మతకలహములు చాటుచున్నవి. మతావేశమును పూని సకలమతములవారును మానవజాతికి మహాపరాధములు జేసిన విధమును మతచరిత్రలు చాటుచున్నవి. హిందువులు క్రైస్తవులు మహమ్మదీయులు మతావేశముచే చేసిన హత్యలను సకలమతప్రవర్తకులును గమనింపవలయును. క్రైస్తవ మహమ్మదీయ మతప్రవర్తకుల ప్రచండవాద ప్రతివాదములకు కారణంబైన ఖిలాఫత్సమస్య నీ దృష్టితో విమర్శించి నిర్ణ

యించుట ధర్మము. మహమ్మదీయప్రాభవము నీ ధర్మదృష్టితో నిర్ణయించినపుడే దానివలన లోకమునకు కలుగఁగల యుపద్రవము పోయి పరమప్రయోజనము కలుగఁగలదు. దాని నైహికదృష్టితో నవలోకించుట వలన ననర్థపరంపరలు గలుగ గలవు.

### నానాజాతిసమితి

ఐరోపామహాసంగ్రామమునకు నానాజాతిసమితి నిర్మాణము మహాఫల మని పరిగణింపఁబడుచున్నది. ఆ పరిగణన మెంతవఱకు యథార్థము కాఁగలదో భావి కాలము దెలుపఁగలదు. ప్రపంచమునఁ గల యెనుబది స్వతంత్ర సామంత రాజ్యములలోను మూడువంతుల రాజ్యములు నానాజాతిసమితియందు చేరి సమితినిర్ణయముల నామోదించినవి. వర్సేలు సంధిపత్రమునందు 1919 జూను 28-వ తేదిని సంతకము చేసిన రాజ్యముల వారీసమితియందు మూలసభ్యులుగ నున్నారు. బెల్జియము, బొలీవియా, బ్రజీలు, బ్రిటీషుసామ్రాజ్యము, కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజిలాండు, ఇండియా, చైనా, క్యూబా, జెకోస్లావాకియా, ఈక్వడారు, ఫ్రాన్సు, గ్రీసు, గ్వాటమలా, హయాటి, హెజాజ, హాండూరాను, ఇటలి, జపాను, లైబీరియా, నికరాగ్యువ, పనామా, పెరూ, పోలాండు, పోర్చుగలు, రుమేనియా, సర్వియా, సయాము, ఉరుగ్వే, అమెరికా సంయుక్తరాష్ట్రములు మూలసభ్యత్వము వహించిన రాజ్యములు. అనంతరము మఱికొన్ని రాజ్యములు సమితియందు చేరినవి. జాతిసమితియందు స్వతంత్ర పరిపాలనము గల రాజ్యము లన్నియును రెండువంతుల రాజ్యముల సమ్మతులను బడసినప్పుడు సభ్యత్వమును పడయఁ గలవు. సమితికి ప్రధానకార్యస్థానము జినీవానగరము. సమితికి ముఖ్య ప్రయోజనము అంతర్జాతీయ సాహచర్యము నభివృద్ధి చేసి అంతర్జాతీయ యోగక్షేమములను యుద్ధసహాయము లేకయే సాధించుట యని తెలుపఁ బడినది. ఇందునకు సాధనములు: 1. నానాజాతుల వ్యవహారములు ధర్మమార్గమున బహిరంగపద్ధతులను నిర్వహించుట; 2 వివిధరాజ్యముల వ్యవహారము లందును అంతర్జాతీయ న్యాయసూత్రములను స్థాపించుట; 3. వివిధజాతులు నంతర్జాతీయ సంధినియమములను ధర్మైకదృష్టితో న్యాయసరణి నవలంబించుట.

సమితియందు చేరిన జాతులస్వాతంత్ర్యమును దేశమును సంరక్షించుటకు జాతిసమితి బాధ్యత వహింపఁ గలదు. సమితియందు చేరిన రాజ్యములకు కలహకారణములు సంప్రాప్తము లైనపుడు పంచాయతీవిచారణ వలన నివారణోపాయము నిర్ణయింపఁబడును. సమితి నియమముల నతిక్రమించి యుద్ధమునకు దిగిన రాజ్యము మీఁద నితరరాజ్యములు శత్రుభావమును పూనఁగలవు. ప్రతిఘటించిన రాజ్యమును సామదానభేదదండోపాయములచే సన్మార్గమునకు మరల్చుట కితరరాజ్యములు పూనుకొనును. సమితియందు చేరిన రాజ్యమునకును సమితియందు చేరనిరాజ్యమునకును కలహకారణము లంకురించినపుడు చేరనిరాజ్యమును సమితియందు చేర్చి కలహకారణములను నివర్తించుటకు ప్రయత్నములు సలుపఁబడును.

నిబంధనలందు 23-వ నిబంధన వివిధదేశములందలి కార్మికులకు సౌకర్యములు కలుగఁజేయుట కేర్పడినది. కర్మోపజీవులైన స్త్రీపురుషులు బాలబాలికలు అర్హమగు ప్రతిఫలము పొందుటకును కాలనియమానుసారముగ పనిచేయుటకును స్వదేశవాసులు న్యాయమార్గమున చూడఁబడుటకును శ్వేతస్త్రీవ్యభిచారవృత్తి నాఁపుటకును నిర్ధారణ చేయఁబడినది. సమితి నిర్ణయించిన 26 సూత్రములును సద్భావభరితములై యున్నవి. విల్సను మహాశయుఁడు తలపోసిన పదునాలుగు విషయములలోను కొన్ని యీసూత్రములందు చేర్పఁబడినవి. జాతి సమితికి కార్యనిర్వాహకసంఘముగ తొమ్మిది రాజ్యముల ప్రతినిధులు నియమింపఁబడిరి. అమెరికాసంయుక్తరాష్ట్రములు బ్రిటీషుసామ్రాజ్యము ఫ్రాన్సు ఇటలీ జపాను రాజ్యములకు ప్రతినిధులను నియమించు నధికారము గలదు. సమితియందు చేరిన రాజ్యములకు నలుగురు ప్రతినిధుల నెన్నుకొను నధికారము గలదు. సమితియందుఁ గల యొక రాజ్యపు వ్యవహారము వివాదాంశమైనపుడు ఆ రాజ్యమున కొక ప్రతినిధిని నియమించుటకు స్వాతంత్ర్యముగలదు. ఏ రాజ్య మైనను సమితికిఁ గల బాధ్యతలను నివర్తించిన తరువాత రెండేండ్ల గడువు పెట్టి సమితినుండి తొలఁగిపోవచ్చును.

సమితియందు చేసిన ధర్మసంస్థాపన లన్నియు శాంతిప్రతిష్ఠాపనమున కనుకూలముగ నున్నవి. కాని యుద్ధము చేసిన రాజ్యముల హృదయములందు పశ్చాత్తాపపురస్కృతంబు లైన శాంతిబీజములు ప్రక్షిప్తము లైన వని నమ్ముటకు సూచనలు గోచరములు కాలేదు.

సకల రాజ్యములును శత్రువినాశనము నధికలాభమును గోరుచున్నవి గాని పరశ్రేయస్సమానమును కోరుట లేదు. సంధినియమములను రాజ్యవిభాగములను విమర్శించినపుడు విజయవంతము లైన రాజ్యముల ప్రయోజనము గోచరం బగుచున్నది. కాని పరాజితము లైన రాజ్యముల ప్రయోజనములు గోచరము లగుట లేదు. వియన్నా పారిస్ సంధినియమములవలె వర్సేలు సంధినియమములును ప్రబలరాజ్యభంజన ధర్మము ననుసరించి నిర్మింపఁబడినవి. ఆ సంధినియమములవలె వర్తమాన సంధినియమములును కలహ మహాబీజములకు నిలయములు. రాజ్యవిభాగములు తటస్థ రాజ్యనిర్మాణములు నష్టపూరణములు రాజ్యగ్రహణములు గత సంధినియమములను సకలవిధములఁ బోలియున్నవి. శత్రురాజ్య దేశములు మిత్రమండలి రాజ్యములకు సంక్రమించినవి. జర్మనుల వలసరాజ్యములు మిత్రమండలి రాజ్యములకు సంక్రమించినవి. ఇటలీ సర్వియా రొమేనియా రాజ్యము లాస్ట్రియారాజ్యభాగములను గ్రీసు ప్రాన్సు గ్రేటుబ్రిటను పొందనున్నవి. ప్రాన్సు చిరకాలము పలవరించిన యాల్సేసులొరేనులను ఇతరదేశములను పొందినది. మిత్రమండలితో చేరిన రాజ్యములన్నియు రాజ్యలాభమును ధనలాభమును వడసినవి. ఈ ప్రత్యేకలాభము లన్నియు భావికలహ కారణమునకు మహాబీజము లని ప్రాజ్ఞులు గ్రహించుచున్నారు. ఆల్సేసులొరేనుమండలముల పునర్గ్రహణమునకును శత్రుసంహారమునకును ప్రాన్సుదేశము పరితపించినది. కలవరించినది. మహాతపంబును చేసినది. విజయము రాజ్యలాభము ప్రాన్సు హృదయమునకు సంతృప్తి కలుగఁజేయలేదు. నలువదేండ్లు ప్రాన్సు హృదయ మనుభవించిన మహావేదననే నేఁడు జర్మనుహృదయ మనుభవించుచున్నది. ప్రాన్సు పొందిన తపఃఫలమునే కాలాంతరమున జర్మను హృదయము పొందఁగలదు. సంగ్రామబీజములు శాంతిఫలములను కలుగఁజేయనేరవు.

యూరపుఖండమునందలి మూఁడు వంతుల దేశములలో సంగ్రామబీజములు వికసించుచుండఁగా జాతిసమితి నిర్ణయములవలన స్థిరశాంతి లోకమునకు కలుగునని తలంచుట కేవలము భ్రమ యని తోఁచుచున్నది. విప్లవదశయం దున్న రుష్యా జర్మనీ బాల్కను రాష్ట్రములకును ప్రాన్సు ఇటలీ-గ్రేటుబ్రిటను రాజ్యములకును బాహ్యాభ్యంతర సౌహార్దస్వభావము సమకూడినపుడే యూరపుఖండమునందును లోకమునందును స్థిరశాంతి సాధ్యము కాఁగలదు. పదునెనిమిదవ శతాబ్దియారంభమునుండియు లోకమునందు జరిగిన మహాయుద్ధములకు యూరపురాజ్యములే మూలకారణములు. యూరపురాజ్యముల మహాతృష్ణయే పంచమహాఖండములందును సంగ్రామబీజముల నాటి ప్రజానాశనముఁ జేసినది. ఐరోపా మహాసంగ్రామము యూరపురాజ్యముల తృష్ణను పెంచినది గాని తగ్గింపలేదు. లోకమునందు స్థిరశాంతి స్థాపిత మగుటకు యూరపురాజ్యము లవలంబించిన రాజ్యాక్రమణతంత్రము పోయి విల్సనుమహాశయుఁడును నితరరాజ్యధర్మజ్ఞులును సంగ్రామసమయమునందు ప్రతిపాదించిన స్వయంనిర్ణయధర్మము సకలరాజ్యములకును సమన్వయింపవలయును. యూరపురాజ్యములే అమెరికనుల ప్రతిఘటనస్వభావమునకు కారణ మని తోఁచుచున్నది. విల్సను మహాశయుఁడు ప్రతిపాదించిన జాతిసమితినిర్ణయములను సెనెటు సభ నిరాకరించినది. కేవలము త్యాగదృష్టితో యుద్ధమునందు చేరి ధర్మబలములకు విజయమును కూర్చిన యమెరికారాజ్యమువలననే లోకమునకు స్థిరశాంతి కలుగవలయును. కాని మహాసామ్రాజ్యభారము వహించుచు ననేక దేశములను పాలించుచున్న బ్రిటీషురాజ్యాధికారుల సాహచర్యము వర్తమాన ప్రపంచస్థితియందు స్వయంనిర్ణయ ధర్మబద్ధమైన స్థిరశాంతిస్థాపనమునకు పరమసాధనముగ నున్నది. క్లేశబాహుళ్యసమస్యావృత మైన వర్తమాన విషమదశయందు లోకప్రవృత్తిని నిర్ణయించుటకు మహారాజ్యములు స్వీయధర్మబలసంపదలను సమర్పించి భగవత్సంకల్పమును సమర్థించును గాత!

## బ్రిటిషుసామ్రాజ్యము

బ్రిటిషుసామ్రాజ్యము వర్తమానకాలమున నున్నతదశయందున్నది. విస్తీర్ణమునందును జనబాహుళ్యమునందును సహజసంపదలందును మహాబలమునందును రాజ్యాంగపరిజ్ఞానమునందును బ్రిటిషుసామ్రాజ్యమునకు సాటియైన సామ్రాజ్యము లోకమునందు వేఱొకటి లేదు. సామ్రాజ్యమునందుఁ గల భిన్నజాతులు భిన్నమతములు భిన్నప్రయోజనములు భిన్నస్వత్వములు భిన్నలక్ష్యములు సామ్రాజ్యభారమును దుర్భరము చేయుచున్నవి. యుద్ధనిర్వహణమునందు బ్రిటీషురాజ్యనీతిజ్ఞులు చూపిన రాజ్యాంగపరిజ్ఞానము బ్రిటిషు ప్రజల సామర్థ్యమునకు

నిదర్శనము. లోకప్రవృత్తియందు వ్యక్తులు రాజ్యములు భగవద్దత్తము లైన విజ్ఞానబలసంపదలను లోకోద్ధరణమునకై వినియోగించుట భగవత్సంకల్పము. భగవంతుఁడు ప్రసాదించిన బుద్ధిబలసంపదలను సత్పురుషులు యజ్ఞార్థ మువయోగించి కృతార్థు లగుదురు. స్వార్థపరాయణులు స్వార్థమునకై వినియోగించి పాపభాక్కు లగుచున్నారు.

శ్లో. యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్.

బ్రిటిషు ప్రజలు తమ సామ్రాజ్యబలసంపదలను లోక కల్యాణమునకు వినియోగించినపుడే భగవత్సంకల్పము సఫలము కాఁగలదు.

వర్తమానకాలమునందు బ్రిటిషుసామ్రాజ్యమును క్లిష్ట మైన బాహ్యాభ్యంతరసమస్యలు ప్రతిఘటించుచున్నవి. గ్రేటుబ్రిటనునందు కార్మికుల సమస్య తీవ్రతఁ దాల్చుచున్నది. ఐర్లాండునందు సిన్‌ఫీనరులు చెలరేగుచున్నారు. ఈజిప్టునందు జాతీయవాదులు ప్రబలుచున్నారు. భరతఖండమునందు రాజ్యాంగసంస్కరణములు ఖిలాఫత్ సమస్య మహాందోళనమును కలుగఁజేయుచున్నవి. దక్షిణాఫ్రికా మధ్యమాఫ్రికా దేశలందు శ్వేతప్రజలు భారతీయులను స్థానభ్రష్టులఁ జేయ నునుకట్టుచున్నారు. బాల్షివిక్కులు సామ్రాజ్యమునందు విప్లవవ్యాపనముఁ జేయఁ దలపెట్టుచున్నారు. ఈ విషమపరిస్థితులలో, సామ్రాజ్యభారమును సంయుక్త మంత్రివర్గము లాయడ్ జార్జి ముఖమున నిర్వహించుచున్నది. ప్రధానమంత్రి లాయడ్‌జార్జి చతురోపాయములచే సామ్రాజ్యభారమును వహించుచున్నాఁడు. ప్రధానమంత్రిని పదచ్యుతునిఁ గావించుటకై చేసిన ప్రయత్నములు విఫలము లైనవి సంయుక్తపక్షబలము ప్రబలముగ నున్నది. పార్లమెంటునం దిపుడు సంయుక్తపక్ష సభ్యులు 470 మంది, వ్యతిరేకసభ్యులు 307 మంది గలరు. అందు కార్మికులు 65 మంది, సంయుక్తవాదులు 48 మంది, లిబరలులు 33 మంది, సిన్‌ఫీనరులు 73 మంది, జాతీయవాదులు 7 మంది, స్వతంత్రులు 10 మంది గలరు.

యుద్ధానంతరము కార్మికపక్షమునకు బలము కలిగినది. కార్మికపక్షబలము క్రమముగ నభివృద్ధిఁబొందుచున్న విధము నుపనియోజనములు వెల్లడి చేయుచున్నవి. ఉపనియోజనములలో కార్మికుల సమ్మతులు వేల కొలఁది హెచ్చినవి. కార్మికుల సంఘములందు ముప్పది లక్షల సభ్యులు గలరు. భావికాలమున బ్రిటిషు పరిశ్రమల యోగక్షేమములు కార్మికుల యధీనము లనే గలవు. గత సంవత్సరము గ్రేటుబ్రిటనునందు 1157 సమ్మెకట్టులు జరిగినవి. అందు 24,82,000 మంది పనివాండ్రు చేరియుండిరి. పనివాండ్రు ఎక్కువ జీతమును తక్కువ కాలమును కోరుట పరిపాటి అయినది. వారమునకు 48 గంటలు పని కోరుచున్నారు. ఈ సమ్మెకట్టులలో సెప్టెంబరు మాసమున జరిగిన రైలు పనివాండ్ర సమ్మెకట్టును, మార్చి మాసమున జరిగిన గనుల పనివాండ్ర సమ్మెకట్టును, ప్రముఖములు. సామాన్యముగ సమ్మెకట్టులయందు పనివాండ్రకు విజయము కలిగినది అధికవ్యయము పదార్థనిర్మాణవ్యయమును వృద్ధిచేసి సకలపరిశ్రమలకును దుర్బలత్వముఁ గలిగించినది. ఇంగ్లాండునందు గనుల పనివాండ్రకును రయిలు పనివాండ్రకును యానముల పనివాండ్రకును గలిగిన సంయోగమువలన కార్మికత్రితయమునకు ఫలము కలిగినది.

గతసంవత్సరము బొగ్గు గనుల పనివాండ్ర స్థితిగతులను విచారించుటకై నియమింపఁబడిన సాంకీపంచాయతీసభాతీర్మానము బొగ్గు పరిశ్రమమునందు నూతన ధర్మమును స్థాపించినది. సాంకీనివేదనమునందు పనివాండ్రకు దినమునకు 2 షిల్లింగులు హెచ్చించుట (2) దినమునకు ఆఱు ఏడు గంటలు పని చేయుట (3) గనులు రైలు మార్గములు మున్నగు ముఖ్యపరిశ్రమలను జాతీయస్వామ్యాయత్తము చేయుట ముఖ్యవిషయములు. సంకీనివేదనమున కనురూపముగ జీతములు హెచ్చించుటకును కాలనియమముఁ జేయుటకును పార్లమెంటునందు శాసనము నిర్మింపఁబడినది. జాతీయస్వామ్యము విషయమై కార్మికులకును ధనస్వాములకును ప్రబల మైన సంరంభము సంప్రాప్తము కానున్నది. కార్మికుల జయాపజయములను నిర్ణయించుటకు భావికాలమున ప్రజాసంపత్స్వామ్యసమస్య భయంకరరూపముఁ దాల్పఁగలదు. ధర్మపునర్నిర్మాణసమస్యయం దీ సమస్యకు మహాబలము కలుగఁగలదు.

### ప్రత్యక్షాచరణము

కార్మికపక్షమునకు క్రమముగ రాజ్యాంగరంగమున బలము కలుగుచున్నను, ప్రత్యక్షాచరణాయుధప్రయోగము కార్యసాధనమునకు మూల మని యువ

జనవర్గపు విశ్వాసము నమ్ముదున్నది. కార్మికవర్గము స్వీయ సంకల్పములను సిద్ధింపఁజేసికొనుటకు కార్మిక ప్రతినిధులు గలరు, సమ్మతులు గలవు వినియోగవర్గము గాదు. పారిశ్రామిక సమస్యలను రాజకీయలాభములకై ప్రయోగించుట సంఘోపద్రవమునకు కారణ మగును కాని ధనస్వాముల నష్టమునకు కారణము కాఁజాలదని సంయుక్త పక్షమువారు వాదించుచున్నారు. కార్మిక మహాసభయందీ విషయము స్థిరపడకపోయినను కార్మికజనాభిప్రాయము ప్రత్యక్షాచరణమున కున్ముఖముగ నున్నటులు తోఁచుచున్నది. భావిసాంఘిక సంరంభమునందు ప్రత్యక్షాచరణము జాతీయస్వామ్యము కార్మికుల శక్తిపాత్రముగఁ బ్రయోగింపఁబడుట సంభవము. కార్మిక పరివర్తన పరిణామఫలమును వర్తమానపరిస్థితులందు నిర్ణయించుట దుస్తరము. భావిప్రపంచప్రవృత్తిని వర్ణించుచు లాయిడు జార్జి గారు తెలిపిన సద్భావములు లోకమున కాదర్శములుగ నుండఁగలవు:

"ప్రపంచమునందు నవజీవనప్రవృత్తికి లక్షల కొలఁది వీరులు పోరాడిరి. వారి విషయమున చేసిన ప్రతిజ్ఞలను పాలింపకేని మన మగౌరవమునకు పా లగుదుము. ప్రాచీనజీవనప్రవృత్తి యంతము నొందవలయును. ఆ ప్రపంచప్రవృత్తియందుఁ గల దారిద్ర్యము దుఃఖము నిర్వ్యాపారము దేహక్లేశము నిరాధారత్వము మొదలగు దుఃఖకారణములు పోవలయును. పక్షాభిమానమును పరిత్యజించి సకలజనులును స్వకర్మఫలభోక్తృత్వమున కనురూపమైన నవప్రవృత్తినిర్మాణమునకు తోడ్పడవలయును."

ప్రధానమంత్రిముఖవినిర్గతమగు సద్భావములు సకలజాతులకు నాదర్శభూతములు. నవప్రవృత్తి నిర్మాణము భరతఖండమున మిగుల నవసరం బని దేశమునందు ప్రాప్తం బగుచున్న నిత్యసంరంభము వ్యక్తీకరించుచున్నది. భారతనాయకానుచరులును మంత్రివర్యుఁ డుపదేశించిన రీతి నాత్మోత్కర్షపురస్కృతంబైన పక్షాభిమానమును మానిపవిత్రమైన మానవాభిమానమును వహించెదరుగాత!

సంగ్రామనిర్వహణమునకు గ్రేటు బ్రిటను అపారమైన ద్రవ్యమును వ్యయము చేసినను, దేశార్థికస్థితి శుభస్థితియందు కల దని యాయవ్యయములు వ్యక్తము చేయుచున్నవి. గతసంవత్సరాయము 11,6,86,50,000 సవరనులు; వ్యయము 1,64,22,95,000 సవరనులు. అధికవ్యయము 47,36,45,000 సవరనులు. ఈ సంవత్సరము బడ్జెటునందు వ్యయము 1,11,74,58,000 సవరనులు; ఆదాయము 1,13,16,50,000 సవరనులనియు నధికాదాయము 16,40,00,000 సవరనులనియు కోశాధ్యక్షుఁడు ఛేంబర్లినుగారు మదింపు వేసిరి. సంవత్సరమున కప్పులమీఁది వడ్డీకేగాను ఇంగ్లాండు 40,00,00,0,00 సవరనులను చెల్లింపవలసియున్నది. అయినను, అప్పుల మీఁద నితరరాజ్యము లీయవలసిన మొత్తమును విశేషముగ కలదు. ఆదాయము నభివృద్ధి చేయుటకు క్రొత్త పన్నులు విధింపఁబడినవి. బ్రిటిషు ద్వీపములందు మద్యాదాయము దినదినాభివృద్ధిఁ గాంచుచున్నది. మద్యపానమునకై 1918-వ సం॥ నందు 25,93,00,000 సవరనులు వ్యయము చేయఁబడినవి. యుద్ధకాలములో 1,00,00,00,000 సవరనులు మద్యపానమునకు వ్యయము చేయఁబడినట్లు మదింపు వేయఁబడినది. అమెరికాయందు మద్యపాననిషేధమును బోధించిన జాన్సను గారింగ్లాండునందును నిషేధమును బోధింప నుద్యమించుచున్నారు. బ్రిటిషుద్వీపములయాదాయమును భరతఖండాదాయముతో పోల్చినపుడు హిందూదేశపు దరిద్రస్థితి వ్యక్తమగుచున్నది. అయినను, అధికారులు హిందూదేశార్థికస్థితిని వ్యవహారములందు గమనింపకుండుట సంతాపకరము. గత సం॥ర వ్యయమూదాయమును మించినను ప్రజారోగక్షేమమునకు మూలబీజములైన గృహనిర్మాణము శిశురక్షణము ఆరోగ్యపోషణము విద్యాప్రదానము మొదలగు మహద్విషయములకు కోట్ల సవరనులు వ్యయము చేయుట కేర్పాట్లు చేయఁబడినవి. ఆర్థికపత్రసమర్పణ సమయమునందు ఛేంబర్లిను గారు తెలిపినటు లార్థికస్థితియందు బ్రిటిషుద్వీపము లద్వితీయస్థానము నలంకరించుచున్నవి.

### ఐర్లాండు

బ్రిటిషు రాజనీతిజ్ఞులను ప్రతిఘటించుచున్న విషమసమస్యలలో ఐర్లాండు సమస్య క్లిష్టముగ నున్నది. గడచిన యెన్నికలలో సిన్‌ఫీనరులు 73 స్థలముల నాక్రమించుకొనఁగలిగిరి. సిన్‌ఫీనరుల నాయకుఁడు డీవేలెరా కారాగృహమునందు బద్ధుఁడై యుండెను. సిన్‌ఫీనరులు స్వదేశమున స్థాపింపఁదలపెట్టిన రిపబ్లికునకు డీవేలెరాను అధ్యక్షునిఁ జేసిరి. సిన్‌ఫీనరులు స్వపరిపాలనమును స్థాపించుటకును బ్రిటిషుపరిపాలనమును దుస్తరము చేయుటకును సమకట్టిరి. గతసంవత్సరారంభమున సిన్‌ఫీనరుల సభలో "పరపరిపాలనమును నిర్మూ

లము చేసి స్వపరిపాలనమును స్థాపించుటకు కృతనిశ్చయులము. ఆంగ్లేయధర్మమును ఐర్లాండు ధర్మమును విమర్శించుటవలన జాతీయస్వాతంత్ర్యమును కాపాడుటకు శాశ్వతపోషణము గలుగవలయును." అని తీర్మానింపఁబడినది. సిన్‌ఫీనరులు పంపిన యీ సందేశము నెవ్వరును విశ్వసింపలేదు. అది యమెరికారాజ్యమునందు మాత్రము కొంత సంచలనము గలిగించినది. గతసంవత్సరమధ్యభాగమునందు డీవేలెరా చెఱసాల నుండి తప్పించుకొని అమెరికాదేశము చేరెను. అచట 20,00,000 సవరనులను దేశప్రయోజనములకై పొందఁగలిగెను. ఆ ద్రవ్యసహాయమువలనను ఇతరసాధనములవలనను సిన్‌ఫీనరులు తమ దేశమునందు హత్యలను చేయుచున్నారు. సంక్షోభము నభివృద్ధి చేయుచున్నారు. ఈ సంక్షోభపరిణామము నెప్పుడు నిర్ణయించుట దుస్తరము. దినదినాభివృద్ధి చెందుచున్న క్రూరహత్యలు దోపిడులు దౌర్జన్యములు మతాధిపతులకు సయితము విషాదమును గలిగించుచున్నవి.

ఆస్క్వితుమంత్రివర్గము శాసించిన స్వరాజ్యశాసనమును సర్ ఎడ్వర్డు కార్సన్ ప్రభృతులు ప్రతిఘటింపఁదలపెట్టినవిధము లోకమునకు సువ్యక్తము. ప్రధానమంత్రి లాయడ్ జార్జి వేఱొకశాసనమును గతమాసమున నిర్మింప సమకట్టెను. ఆస్క్వితుశాసన మైర్లాండు సమస్య నేకదృష్టితో నిర్ణయించుట కేర్పడినది. అపుడు లిబరలు పక్షమునకు బల మధికముగా నుండెను. లిబరలు పక్షము జాతీయవాదులకు సానుభూతిఁ జూపినది. లాయడ్ జార్జి గారి శాసన మైర్లాండుసమస్యను ద్వైధీభావదృష్టితో చూచుచున్నది. ఐర్లాండునందు రెండు భాగములను స్థాపించుచున్నది. అలస్టరు భాగమునకు ప్రత్యేకపరిపాలనము నొడగూర్చుచున్నది. అయిర్లాండు దేశము నీ విధముగ విభజించి రెండు భాగములందును వేఱువేఱు పరిపాలనవ్యవస్థలను స్థాపించుటకు జాతీయవాదులు సమ్మతింపరు. సర్ ఎడ్వర్డు కార్సను గారి యాశీర్వాదము వడసిన శాసనమును జాతీయవాదులు దీవింపఁజాలరు. వర్తమానకాలమునందు సంయోగవాదుల బల మధికముగ నున్నది. పార్లమెంటునందు నూతనశాసన మనతికాలమున నామోదిత మగుట సహజము. కాని, ఈ శాసన మెవరికిని తృప్తి గలుగఁజేయ దని తెలియను ఆస్క్విత్తుగార్ల ప్రసంగములు వ్యక్తము చేయుచున్నవి; అయిర్లాండునందు కనడారాష్ట్రములందు గల స్వపరిపాలనమును స్థాపించుటకు అల్‌స్టరువాసులు నంగీకరించుచున్నారు. కాని అయిర్లాండువాసుల కందఱకును నీ విషయమై సంయోగాభిప్రాయమెట్లు గలుగునో కాలము నిర్ణయింపవలయును; సామ్రాజ్యవాది యైన కార్సను గారికిని రిపబ్లికనువాది యైన డివేలెరా గారికిని సాహచర్యము సాధ్యమా? అయిర్లాండునకు సంపూర్ణస్వాతంత్ర్యము నొసఁగుట కాంగ్లేయు లెవరును సమ్మతించుట యసంభవము. సామ్రాజ్యాంతర్గత మైన స్వరాజ్యము నొసంగుట సాధ్యము. దేశక్షేమాభిలాషు లైన సకలపక్షములవారును దేశక్షేమమునకై భిన్నాభిప్రాయములను విడిచి స్వరాజ్యస్థాపనము చేయుట బ్రిటిషుసామ్రాజ్యబలమునకును, అయిర్లాండుక్షేమమునకును పరమసాధనము కాఁగలదు.

### ఈజిప్టు

ఈజిప్టునందును అయిర్లాండునందువలె సంక్షోభమేర్పడినది. ఈజిప్టు బ్రిటీషుసామ్రాజ్యమునందలి సంరక్షితరాజ్య మని విల్సను మహాశయుఁ డంగీకరించెను. ఈజిప్టు జాతీయవాదులు స్వతంత్రపరిపాలనమును స్థాపింప సమకట్టిరి. జాతీయవాదులు సంధిమహాసభయందు జాతీయాశయములను ప్రకటింప నుద్యమించిరి. జాతీయవాదనాయకులు నిర్బంధప్రవాసమునం దుంచఁబడిరి. ఈజిప్టులో కలవర ముదయించి హత్యలు జరిగినవి. మఱియు బ్రిటీషు సైన్యాధికారులు సైనికులు వధింపఁబడిరి. దేశమున సైనికశాసనము ప్రయోగింపఁబడినది. స్వదేశీయోద్యోగస్థులు మూఁడు దినములు కట్టు కట్టి పని చాలించుకొనిరి. అలెంబె సేనాధ్యక్షుఁడు రక్షకుఁడుగ నియమింపఁబడెను. మంత్రిని చంపుటకు సెప్టెంబరు మాసమున ప్రయత్నములు చేయఁబడినవి. అక్టోబరునందు అలెంబరు ప్రభువుపాలకుఁడుగ నియమింపఁబడెను. రాజ్యాంగవిధానమును నిర్ణయించుటకు మిల్నరుపంచాయతీసభ నియమింపఁబడినది. జాతీయవాదులు మిల్నరు పంచాయతీసభను బహిష్కరించిరి. మిల్నరుగారు తమ నివేదికను పార్లమెంటున కచిరకాలముననే సమర్పింపఁగలరు. వారి నివేదిక మోంటుఫర్డు నివేదికకంటె నుదారతరముగ నుండు నని తలఁచెదము. ఈజిప్టునందు ప్రవర్ధమానం బగుచున్న సంక్షోభము సామ్రాజ్యబలమునకు కంటకముగ నున్నది.

దక్షిణాఫ్రికాయందు జాతీయవాదులు విరో

గమును స్వతంత్రపరిపాలనమును గోరుచున్నారు. మెసపొటేమియాయం దరాబు లపుడపుడు హత్యలను చేయుచు రాజ్యభారవహనమును దుర్భరము చేయుచున్నారు. అరాబియాయందును పరిష్యాయందును బ్రిటీషుసామ్రాజ్యము ధర్మరక్షణభారమును స్వీకరింప నంగీకరించినది. సామ్రాజ్యాంతర్భాగములందు ప్రజ లన్నాతురులై పరితపించుచున్నారు. మహమ్మదీయప్రపంచమును ఖిలాఫతు సమస్య కల్లోలపఱచుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యమునందు 10,00,00,000 మంది మహమ్మదీయులు గలరు. మహమ్మదీయప్రసన్నత్వము సామ్రాజ్యశాంతి కత్యంతావశ్యకము. ఈ విషమపరిస్థితులందు సామ్రాజ్యధర్మనిర్వహణమునఁ గల సాధకబాధకములను రాజ్యాధికారులు గ్రహించి సామ్రాజ్యబలమును ధర్మనిర్వహణమునకు వినియోగపఱచుటకు భగవదనుగ్రహమువలన ప్రయత్నింతురు గాక!

### భరతవర్షము

భరతవర్షము బ్రిటిషుసామ్రాజ్యమునకు మకుటమను నార్యోక్తి నైరోపాసంగ్రామము సహస్రవిధముల నమర్థించినది. ఫ్లాండర్సులో సంకటదశయందు, భారతయోధులు యూరపియనుసభ్యత్వమును సంరక్షించిరి. యుద్ధనిర్వహణమునకు భరతఖండము తోడ్పడిన విధము లాయడ్ జార్జి, కర్జను ప్రభువు, మెస్సుఫర్డు ప్రభువు మొదలగు రాజనీతిజ్ఞులు ప్రశంసించిరి. హిందూదేశము యుద్ధనిర్వహణమునకు పది లక్షల యోధులను పది లక్షల పరిచారకులను సమకూర్చినది. బ్రిటీషుద్వీపవాసులకును రణరంగమందలి సైనికులకును నాహారపదార్థముల నందఁజేసినది. కోట్ల రూప్యములను సహాయార్థము సమర్పించినది. పూర్వరంగములందు యుద్ధసామగ్రులను సమకూర్చినది. మెసపొటేమియా పలస్తీను రంగములందలి విజయములకు భారతయోధులే మూలకారకు లని బ్రిటీషు రాజనీతిజ్ఞులు తెలిపియుండిరి. దరిద్రదశయందున్న భరతఖండము రణరంగములందలి సైన్యవ్యయభారము వహించినది. 1918 సంవత్సరమున 2,00,000 అధికసైనికుల వ్యయభారమును భరించుట కంగీకరించినది. ఈవ్యయము 4,50,00,000 సవరను లగును. 1916 సంవత్సరమునందు 100,000,000 సవరనుల నుచితముగ సమర్పించినది. బ్రిటిషుదేశమునకై భరతఖండము 110,000,000 సవరనులను సామగ్రికై వ్యయము చేసినది. హిందూదేశమునుండి మిత్రమండలికి 40,000,000 సవరనుల యాహారపదార్థములు పంపఁబడినవి. అనేకకోట్ల రూప్యములు విలువగల బట్టలు నంచులు కంబళ్లు లోహములు లోహసామగ్రులు బాగుగ మిత్రమండలి రాజ్యములకు పంపఁబడినవి. రోగార్తులకు రాజులు ప్రజలు లక్షలరూప్యములను దానముచేసిరి. జాతీయవికాసమున కవకాశములు లేని భరతవర్షము బ్రిటిషుసామ్రాజ్యరక్షణమునకు సకలసంగ్రామరంగములయందు నపార మైన సహాయము చేయఁగలిగినది. జాతీయవికాసమునకు సంపూర్ణావకాశము లుండినప్పుడు ముప్పది మూడు కోట్ల ప్రజలును నపార మైన సహజసంపదలును గల భరతఖండము సామ్రాజ్యసంరక్షణమునకు మహత్తర మైన సహాయము చేయఁగలిగియుండును. బ్రిటిషురాజనీతిజ్ఞులు నిరంకుశపరిపాలనమువలన భరతఖండజాతీయజీవనప్రవాహమున మందగమనము కలిగినది. లోకావృతం బైన స్వజాతీయప్రత్యభిజ్ఞానము భారతీయుల హృదయములం దుదయించినది. నిరంకుశాధికారాచ్ఛాదిత మైన యధికారవర్గదృష్టికి మాత్రమీ ప్రత్యభిజ్ఞానము దురవగాహముగ నున్నది. విజాతీయు లైన యాంగ్లేయులు భారతజాతీయహృదయస్వరూపమును గ్రహించుట దుష్కరము. పరాధీనరాజ్యములం దీకారణముననే సజాతీయవిజాతీయవిజ్ఞానములకు సంరంభము సంప్రాప్తమగుచుండును. ఈ సంరంభమునందు చైతన్యము గల సజాతీయవిజ్ఞానమునకు విజయము సంప్రాప్తమగుచుండును. విల్సను మహాశయుఁడు ప్రతిపాదించిన స్వయంనిర్ణయధర్మమును పోషించుటకు సజాతీయవిజ్ఞానసంరక్షణమే మూలబీజము. లోకప్రవృత్తియందు సకలజాతులును దేశకాలస్థితి ననురూపముగ వికసించుచున్నవి. జాతీయవికాసమునందు వివిధజాతులు భిన్నమార్గముల నవలంబించినను సకలమార్గములును ప్రపంచప్రవృత్తికి సాధనాంతరములుగ నుండఁగలవు. జాతీయప్రయోజనమును జాతీయదృష్టితో చూచినపుడే ప్రవృత్తియందలి మహావిలాసము గోచరం బగుచున్నది. దురహంకారపూరితు లైన విజాతీయులు పరాధీనజాతుల విజ్ఞానమును నాశనము చేయుట సామాన్యముగ సంభవించుచున్నది.

భరతఖండమునందు విజాతీయసజాతీయవిజ్ఞానములకు సంరంభము చిరకాలమునుండి గలుగుచున్నది. గ్రీకులు హూణులు యవనులు మహమ్మదీయులు

యూరపీయనులు తమతమ విజ్ఞానమును వ్యాపింపఁజే యుటకు చేసిన ప్రయత్నములను దేశచరిత్రము బహు భంగుల తెలుపుచున్నది. కాని జాతీయప్రత్యభిజ్ఞానమునకు పాశ్చాత్యవిజ్ఞానసంసర్గమువలన కలిగిన వికలత్వ మింతవఱకెప్పుడును కలుగలేదు. భారతీయుల భావములు భాషలు మతసాంప్రదాయాచారములు చిత్తప్రవృత్తులు పాశ్చాత్యవిజ్ఞానాచ్ఛాదితములై జడత్వముఁ దాల్చినవి. ఆత్మోల్లంఘనము పరప్రకర్షణము భారతీయప్రవృత్తికి సహజావస్థగఁ బరిణమించినవి. ఈ విశ్చలదశలో మహాసంగ్రామము సంప్రాప్తమై భారతీయులందు ప్రత్యభిజ్ఞానము నుదయింపఁజేసినది. ఆంగ్లేయ రాజనీతిజ్ఞులు భారతజాతీయభారము వహించుచున్నట్టు ప్రచారము చేయుట పరిపాటియైనవి. సంగ్రామ మా ప్రగల్భముల నంతము నొందించినది. భారతీయులకు మహాసంగ్రామ మాత్మస్వరూపమును స్ఫురింపఁజేసినది. బంకించంద్ర చట్టోపాధ్యాయుఁడు సంకీర్తనము చేసిన మాతృస్వరూపము మనోగతమైనది.

వందే మాతరమ్.

సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం — వందే మాతరం.
శుభ్రజ్యోత్స్నా పులకితయామినీమ్
ఫుల్లకుసుమితద్రుమదళశోభినీమ్
సుహాసినీం సుమధురభాషిణీమ్
సుఖదాం వరదాం మాతరం — వందే మాతరమ్.
త్రింశత్కోటికంఠకలకలనినాదకరాళే
ద్విత్రింశత్కోటిభుజధృతఖరకరవాళే
కథయంతి జనాస్త్వాం కథం మాతరబలాం
బహుబలధారిణీం నమామి తారిణీం రిపుదలవారి
ణీం మాతరం — వందే మాతరం.

భారతజాతీయజీవనప్రవృత్తియందు సకలమును నూతనాకృతిని దాల్చినది. స్వరాజ్యస్థాపనము జన్మ స్వాతంత్ర్యముగాని పరరాజ్యదేయము గాదనుభావము ప్రబలినది. భారతీయులను బలిష్ఠ మగుపాశ్చాత్యాధికారవ్యామోహము విడిచినది. ప్రపంచావృతమైన స్వాతంత్ర్యప్రకాశ మావరించినది. అధికారవ్యామోహమునకును జాతీయప్రకాశమునకును పర్యాప్తంబైన ప్రచండసంరంభమును గతవత్సరమునందు పర్యాప్తంబైన రాజ్యాంగజీవనచరిత్రము వ్యక్తము చేయుచున్నది.

మోంటుఫర్డు రాజ్యాంగ నివేదిక ననుసరించి రాజ్యాంగసంస్కరణశాసనము పార్లమెంటునందు ప్రవేశమును పొందినది. ఆ చిత్తుశాసనము శాసనరూపమును నిర్విఘ్నముగ తాల్చుటకు పార్లమెంటు జాయింటుకమిటీవిమర్శనమున కాశాసనము సమర్పితము. జాయింటుకమిటీయందు నార్తుంబరులాండు ప్రభువు, క్రూ ప్రభువు, సెల్బోరను ప్రభువు, బ్రోడికు ప్రభువు, ఐలింగ్టను ప్రభువు, సైడెన్హాము ప్రభువు సింహాప్రభువు, బెన్నెటు, సర్ హెని క్రెయికు, మాంటేగు, మేజరు ఆర్మస్బి, సర్ జాన్ డి. రీసు, స్పూరుగారులు సభ్యులు. సంయుక్తోపసంఘమునకు సెల్బోరను ప్రభు వధ్యక్షుఁడు. సంయుక్తోపసంఘసమక్షమున సాక్ష్యము నిచ్చుటకు భిన్నపక్షములవారు చేసిన ప్రయత్నములు నిందలకును నసూయలకును కారణంబులైనవి. మోంటుఫర్డు నివేదిక పుట్టించిన విభేదములను భిన్నపక్షావలంబనులు సంయుక్తోపసంఘసమక్షమున బలపఱచిరి. సంయుక్తోపసంఘ సమక్షమున నిచ్చిన సాక్ష్యమును (1) అధికారసాక్ష్యము (2) అనధికారసాక్ష్యము అని ద్వివిధముగ విభజింప నగును. అధికారాభిప్రాయమునందు క. సైడెన్హామువర్గము సంస్కరణములకు పరాఙ్ముఖులు. గ. ఆంగ్లేయోద్యోగస్థులు అర్థాంగీకారపరులు; చ. వర్తమాన ప్రభుత్వోద్యోగస్థులు మోంటుఫర్డు నిర్దిష్టమైన ద్విరాజ్యాంగవిధానామోదకులు. జ. అనధికారులు. ట. బ్రాహ్మణేతరులు. సైడెన్హామువర్గ మిత్రులు. సంస్కరణపరాఙ్ముఖులు. త. మితవాదులు. మోంటుఫర్డువిధానరూపమైన సంస్కరణమున కామోదకులు. ప. జాతీయవాదులు. జాతీయమహాసభా ప్రతిపాదిత సంస్కరణాకాంక్షకులు. ఈ వివిధపక్షముల వారి పక్షమున 70 మంది సాక్ష్యము నిచ్చిరి. వారిసాక్ష్యము 590 పుటలయందు 10176 ప్రశ్నోత్తరములరూపమున ప్రచురింపఁబడినది. దానియందు ముఖ్యాంశములనైనను ప్రచురించుట దుస్తరము. కాని సంస్కరణశాసన స్వరూపమును గ్రహించుటకు భిన్నపక్షములవాదముల సారాంశమును గ్రహించుట యవసరము.

సైడెన్హాము ప్రభువుగారు విశాలమైన సంస్కరణములు బ్రిటీషుసామ్రాజ్యక్షేమమునకును హిందూదేశా



The Seventh Andhra Conference, Anantapur

సప్తమాంధ్రమహాసభ, అనంతపురము

The Reception Committee, Andhra Conferences, Anantapur



ఆంధ్రమహాసభల సన్మానసంఘములు, అనంతపురము

The Cochin Maharajah's Family, and Dewan



కొచ్చిను మహారాజకుటుంబము, దివాను

భ్యుదయమునకును ప్రతిబంధకము లని వాదించిరి. కారణము నిరంకుశాధికార ప్రియత్వము. విద్యావంతుల పొడ వీరికి గిట్టదు. విద్యావంతులు రాజ్యాధికారమును వశము చేసికొనెదరనియును ప్రజాస్వామ్యము మాటలయందుమాత్ర ముండు ననియును వీరు వాదించిరి. రాజ్యాంగసంస్కరణము లనర్థదాయకము లని ఘోషించెడి బ్రాహ్మణేతరనాయకులతో వీరికి మిత్రత్వము గలిగినది. సకలదేశములందును విద్యావంతులు ప్రజానాయకులుగ నుందు రను సామాన్యవిషయమును వీరు మఱచుట విచిత్రముగ నున్నది. బ్రాహ్మణేతర ప్రతినిధులు రావుబహాదరు రెడ్డినాయుడుగారును రామారాయణింగారును కులప్రాతినిధ్యము కులనియోజకవర్గమేర్పడిన సంస్కరణములపట్ల సుముఖత్వముఁ దెలిపిరి. పంచములవిషయమై బ్రాహ్మణులను దూఱుచు నాయుడుగా రారోపించిన నిందలు సత్యదూరములై గర్హ్యములుగ నున్నవి. నాయుడుగారి నావహించిన బ్రాహ్మణభయము విచిత్రముగ నున్నది. సింహా ప్రభువుగారి ప్రశ్నలు రెడ్డినాయుడుగారిని నిరుత్తరుని జేసినవి. పంచమగృహములందు నాయుడుగా రెన్నిసారులు సేవను జేసినదియును వారిమిత్రులును స్వగ్రామవాసులుఁ దెలుపగలరు. భారతప్రభుత్వము ద్విరాజ్యాంగవిధానము నామోదించినది. సామ్రాజ్యప్రభుత్వమునందు సంపూర్ణాధికారమభేద్యముగ నుండవలయు నని వారు కోరిరి. కార్యనిర్వాహకసభయందును శాసనసభయందును రాజ్యసభయందును నిరంకుశదుర్గము దుర్భేద్యముగ నుండవలయు నని ప్రభుత్వప్రతినిధి మెస్టను ప్రభువు ప్రతిపాదించెను. మంత్రాంగసభయం దిరువురు భారతీయులు మాత్ర ముండవలయును. శాసననిర్మాణసభ కార్థికవ్యవహారనిర్ణయాధికార ముండఁ జనదు. రాజ్యసభకు సమర్థాధికార ముండవలయును. ప్రజాయత్తశాఖలు స్వల్పముగ నుండవలయును. సమర్థనాధికారము మహోపసంఘాధారమున రాష్ట్రపాలకుల కుండవలయును. సంస్కరణముల ననంతపాశబద్ధములను జేసి నిర్వీర్యముఁ జేయుట ప్రభుత్వప్రతినిధుల సంకల్పము. అనధికార ప్రతినిధులయందు బ్రాహ్మణేతర ప్రతినిధుల వాదము విచిత్రముగ నున్నది. కులప్రాతినిధ్యము కులనియోజకవర్గము గలిగినపుడు సంస్కరణము లవసరములు. ఇవి లేనపుడు సంస్కరణము లనుపయోగములు. కులప్రాతినిధ్యముతో సంస్కరణము లవసరములగు ననుట యొక వింత. చెన్నరాష్ట్రవిభేదములను పాటించి భరతఖండము నంతను మూలఁద్రోయుట మఱియొక విచిత్రము. బ్రాహ్మణేతరనాయకుల సిద్ధాంతములు కేవలము స్వార్థప్రయోజనసంజాతము లని విదిత మగుచున్నది. మితవాద ప్రతినిధులు మోంటుఫర్డువిధానమును బలపఱచుటకు కృతనిశ్చయులై యుండిరి. రాష్ట్రప్రభుత్వములందు ద్విరాజ్యాంగవిధానము నామోదించుచు నావిధానమునే సామ్రాజ్యప్రభుత్వమునందును నవలంబింపవలయు నని మితవాదనాయకులు కోరిరి. అనిబిసంటమ్మగారు వీరితో జేరక పోయినను వీరి మార్గమునే యవలంబించినది. శ్రీనివాసశాస్త్రి రామచంద్రరావు పంతులుగార్లు మొదలగువారి వ్యాఖ్యానములు సంస్కరణశాసనమును విశాలముచేసిన వని యంగీకరించినను మూలసిద్ధాంతములందే వీరి వ్యాఖ్యానములకును జాతీయవాదుల వ్యాఖ్యానమునకును భేదము గలదు. డిల్లీ కాంగ్రెసునందు "1. భారతీయులు స్వపరిపాలనమున కర్హులు. 2. సంస్కరణశాసన మాశాభంగకరము, అసంతృప్తిజనకము. 3. రాష్ట్రములందు సంపూర్ణస్వపరిపాలనమును స్థాపింపవలయును. 4. సామ్రాజ్యప్రభుత్వమునందు పదేండ్లలో స్వపరిపాలనమును స్థాపింపవలయును." అని జాతీయవాదులు వాదించిరి. ఈ వాదమునే పటేలు లోకమాన్యతిలకు మహాశయుఁడు మొదలగు జాతీయవాదులు ప్రతిపాదించిరి. ఇంగ్లాండునందు స్వదేశమునం దుదయించిన విభేదములు విపరీతముగఁ బెరిగినవి. దేశక్షేమమునకై భిన్నపక్షములవారికి సంయోగాచరణము గలుగకుండుట సంతాపకరము. సంతు నిహాలుసింగు వ్రాసినటులు నాయకుల సిద్ధాంతములకు వారి భావసమర్థనము ప్రధానమైనది గాని దేశక్షేమము ప్రధానము గాలేదు. ఇప్పటికిని నింగ్లాండు ప్రాతినిధ్యము విషయమై జరుగుచున్న వాదప్రతివాదములు నిందారోపణములు నాయకుల యభిమానమునకు నిదర్శనములుగ నున్నవి.

సంయుక్తోపసంఘము నవంబరు మాస మధ్యమునందు నివేదికను ప్రచురించినది. నివేదికానురూపముగ శాసనము డిసంబరుమాసాంతమునకు నిర్మింపఁబడినది. శాసనము రాష్ట్రములందు ద్విరాజ్యాంగమును సమర్థించుచున్నది. సంయుక్తకోశమును సమర్థించుచున్నది. సభాధిపతులను ప్రత్యేకముగ నియమించుచున్నగి. మంత్రులకు కార్యనిర్వాహకసభ్యులకు సమాన ప్రతి

పత్తిని గలుగఁజేయుచున్నది. నియోజకవర్గమును విశాలముచేయుచున్నది. బ్రాహ్మణేతరులకు చెన్నరాష్ట్రమునందు ప్రత్యేకప్రాతినిధ్యము నంగీకరించుచున్నది. సామ్రాజ్యశాసనసభయందు ఆర్థికపత్రప్రతిపాదనము నంగీకరించుచున్నది. సమర్థశాసనమునకు రాజ్యసభను స్థాపించినది. కార్యనిర్వాహకసభయందు ముప్వు రనధికారసభ్యులకు స్థానములను గల్పించుచున్నది. సంస్కరణము కొంతవఱకు కుదారమైనను ప్రస్తుతావసరములకు తగియుండదని జాతీయవాదులు వాదించుచున్నారు. శాసనము సామ్రాజ్యప్రభుత్వమునం దధికారము నొసగుటలేదు. ఆర్థికస్వాతంత్ర్యమును కలుగజేయుటలేదు. ఈ భావము ననుసరించియే జాతీయ మహాసభయందు రాజ్యాంగ ప్రతిపాదన మామోదింపఁబడినది. జాతీయ మహాసభయందు జాతీయప్రత్యభిజ్ఞానమున కనురూపముగ రాజ్యాంగసంస్కరణతీర్మాన మామోదింపఁబడినది. జాతీయ ప్రవృత్తి కనురూపముగ జాతీయ జీవనమునందు భావములు వికసించుచుండును. బొంబాయి మహాసభయందు ద్విరాజ్యాంగవిధానము నంగీకరించి జాతీయవాదులు, ఢిల్లీ అమృతసరము సభలయందు దానిని నిరాదరించుట యనుచితమని మితవాదులు ప్రశ్నించుచున్నారు. భారతజాతీయప్రవృత్తియందు కలుగుచున్న తీవ్రవేగమును వీరు గమనించుట లేదు. లోకమంతయును స్వాతంత్ర్యవేగావృతమై తీవ్ర గమనమును జేయుచున్నది. ఎస్తోనియా లిథుయానియా అరాబియా ఆర్మీనియా మొదలగు దేశములు స్వాతంత్ర్యమునకు తగియుండినను ప్రాచీనసభ్యత్వమున కలవాటుపడిన భరతవర్షము స్వాతంత్ర్యస్థితికిఁ దగదా? యను ప్రశ్నమును జాతీయవాదులు వేయుచున్నారు. జాతీయవాదులు కోరెడిస్వాతంత్ర్యము బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతమైన స్వాతంత్ర్యముగాని ప్రత్యేకస్థితి గాదు. భారతీయు లందఱును తదేకదృష్టితో స్వాతంత్ర్యప్రాప్తికి పాటుపడి భారతవిజ్ఞానమును సంరక్షించుట పరమధర్మము.

గతసంవత్సరాంతమునందు శ్రీ పంచమజార్జి రాజేంద్రుఁడు ప్రకటించిన యభయప్రదానమును సహాకారప్రతీక్షణమును గమనార్హములు.

ప్రకటనము.

భారతదేశమున నున్న నా రాజప్రతినిధికిని, స్వదేశ సంస్థానాధీశులకును, నా భారతప్రజలకును అభినందనములు:

1. భారతదేశ చరిత్రమున నేఁడు నూతనయుగము ప్రారంభమైనది. భారతదేశమున కెక్కుడు సుపరిపాలనము లభించుటకును, ఆ దేశ ప్రజలెక్కుడు సంతృప్తహృదయులుగ నుండుటకును, పార్లమెంటు సభవారు చేయు ప్రధానశాసనములలో నొకటి యగు నీ శాసనమునకు నేను నా సమ్మతి నొసంగుచున్నాను. 1778, 1784 సంవత్సరములలో నిర్మితములైన శాసనములు తూర్పు ఇండియా సంఘపాలనమున దేశమునందు న్యాయము నిర్వహింపబడుటకు యంత్రనిర్మాణము జరిగినది. 1833 సంవత్సరపు శాసనమువలన ప్రభుత్వోద్యోగములలో భారతీయులకు ప్రవేశము కలిగినది. 1858 సంవత్సరపు శాసనమూలమున పరిపాలనము కంపెనీ వారియొద్దనుండి సార్వభౌముని హస్తగతమై, నేఁడు భారతదేశమున గల ప్రజాహితజీవనమునకు మూలకారణమైనది. 1861 సంవత్సరపు శాసనము ప్రతినిధిప్రతిష్ఠాపనబీజముల నాటినది. ఆ బీజమే 1909 సంవత్సరపు శాసనమువలన మొలకలెత్తి వృద్ధిఁజెంద మొదలిడెను. ప్రస్తుతము నిర్మితమైన శాసనమువలన ప్రజాప్రతినిధులకు ప్రభుత్వనిర్వహణమున పాల్గొన నవకాశము లభ్యమై, బాధ్యతాయుత ప్రభుత్వమునకు మార్గ మేర్పడుచున్నది. ఈ శాసనోద్దేశములు సఫలము లగువెడల మానవాభ్యుదయమున కెంతయు లాభము చేకూరగలదు. కావున మీ రెల్లరు నాతో నేకీభవించి ఈ పరిస్థితులను గుర్తించెదరని విశ్వసించుచున్నాను.

2. భారతదేశక్షేమము మాకు వశీకృత మైనప్పటినుండియు ఆ దేశ సంరక్షణము మా పవిత్రధర్మముగ నెంచుచున్నాము. 1858 వ సంవత్సరమున శ్రీ విక్టోరియా రాణి, ఇతర ప్రజలందువలెనే భారతప్రజలయెడలను మాకు సమానధర్మములు కల వని ప్రకటించియుండెను; మఱి స్వాతంత్ర్యమును, న్యాయసమత్వమును ఎల్లరకు నిష్పక్షపాతముగ నామె యొసంగియుండెను. 1903 వ సంవత్సరమున నా తండ్రి యగు సప్తమ ఎడ్వర్డు సార్వభౌముడు ఆ విధముగనే న్యాయసమ్మతముగ పాలించెద నని ప్రకటించియుండెను. మఱల నాతడు 1908 వ సంవత్సరమున ఏబది వత్సరములకు పూర్వ మీయబడిన వాగ్దానముల నెల్ల నామోదించుచు మఱియొక ప్రకటనము గావించియుండెను. 1910 వ సంవత్సరమున నేను సింహాసనము నధిష్ఠించినపుడు భారతదేశపు సౌఖ్యమును సౌభాగ్యమును నెల్లప్పుడు నామనస్సున నగ్రస్థానము నాక్రమించు నని వాగ్దానము గావించియుంటిని. అటుపిమ్మట నేను భారతదేశమును సందర్శించినప్పుడు ఆ దేశములయెడ నాకు గల సానుభూతిని వారిక్షేమమునెడ నాకు గల అభిలాషను వెల్లడించియుంటిని.

3. మేమును, మా పూర్వులును నిట్టి ప్రేమపూరితమానసులమై యుండగా, పార్లమెంటు సభవారును, ఈ దేశజులను, భారతదేశమున నున్న మా ఉద్యోగులును భారతీయుల నైతికార్థికాభివృద్ధికై యీ వఱకెన్నే పట్టుదలఁ గనబరచియున్నారు. పరమేశ్వరుడు మాకిచ్చిన సౌకర్యముల నన్నిటిని వారికి నొసంగుచున్నాము. కాని, ఆ దేశీయులు తమ దేశవిషయములను నిర్వహించుకొని, తమ క్షేమ

మును సంరక్షించుకొనుటకు స్వాతంత్ర్యము లభించువఱకు దేశాభివృద్ధి సాధ్యము కాదు. విదేశముల బారినుండి భారతదేశమును సంరక్షించుట సామ్రాజ్యధర్మము. దేశవిషయ నిర్వాహణమునకై భారతీయులు ప్రయత్నింపవచ్చును. కాలము పరిపక్వమై, అనుభవము లభించినగాని అట్టి భారమును సంపూర్ణముగ వహించుట కష్టసాధ్యము కాని యిప్పు డట్టి అనుభవజ్ఞాన మలవడుటకును బాధ్యత వృద్ధియగుటకును అవకాశ మీయఁబడును.

4. నా భారత ప్రజలలో ప్రజాప్రతినిధి ప్రతిష్ఠానముల యెడల వృద్ధియగుచున్న అభిలాషను నేను సానుక్రోశ పూర్వకముగ తిలకించుచున్నాడను. స్వల్పవిషయములలో ప్రారంభమై, యీ ఆశయము దేశమునందలి ధీమంతుల నెల్లర నావరించుచున్నది. నిర్మల మానసముతోడను, ధైర్యసంపత్తితోడను ఇది న్యాయసమ్మతమార్గముల ననుసరించుచున్నది. దేశభక్తి యను పేరుతో దుర్నయముల చేయువా రాయుద్యమముపై నెట్టి కళంకమును పడద్రోయుచున్నను, అది అట్టి ఆటంకముల దాటి అచంచలముగా నిలిచియున్నది. మహాసంగ్రామమున బ్రిటిషు సామ్రాజ్యము సమర్థించిన ఆదర్శములచే నిది ప్రేరిత మైనది. మన విజయమునకు భారతదేశము తోడ్పడియున్నదను కారణముమీద నది ఆధారపడుచున్నది. బ్రిటిషు దేశమునకు భారతదేశముతోడి సంబంధము మూలముననే రాజకీయబాధ్యతా నిర్వాహణకుతూహలము భారతీయులయం దుద్భవించినది. బ్రిటిషువారు భారతీయులకు నేర్పినవిద్యయే యిందులకు కారణము. అది లేనిచో భారతదేశమున బ్రిటిషువారు చేయుచున్న పని అసంపూర్ణమగును. కావుననే, అనేకవత్సరములకు పూర్వము ప్రతినిధి ప్రతిష్ఠాపనములు ప్రారంభింపబడి యుండెను. అవి క్రమవికాసము నొంది, తుదకు బాధ్యతాయుతప్రభుత్వమునకు మార్గదర్శక మగు వాస్తవాంతరము సమీపమునకు వచ్చినవి.

5. ఈ విధ మగు సానుభూతితోడను, ద్విగుణీకృతోత్సాహముతోడను ఈ మార్గమున చేకూరు పురోవృద్ధి నీక్షించుచుందును. మార్గము నిరాఘాటముగ నుండదు. గమ్యస్థానము చేరుటకు భారత ప్రజలలో నన్నితరగతులవారికి సహనభావమును, కార్యశూరతయు నత్యవసరములు. ఈ ఉత్కృష్టలక్షణములు సమయమునకు బయల్పడునని తలంచుచున్నాను. నూతనముగ స్థాపితములైన ప్రతినిధిప్రతిష్ఠాపనములు ప్రజల వాంఛలను వ్యక్తీకరించుచుండవలెనుగాని నిరోజకస్వాతంత్ర్యము లేనివారల క్షేమమును మఱపుజెందరాదు. ప్రజానాయకులును, మంత్రులును అట్టిబాధ్యతవహించి, ప్రభుత్వక్షేమమునకై స్వార్థత్యాగముతో వర్తించు, దేశభక్తి, పాక్షిక సాంఘిక బుద్ధుల కతీత మని గ్రహింపవలెను. శాసనసభలుకూడ అల్పవిభేదములను పాటింపక, ప్రధానదృక్పథమును మఱపుజెందక, నా ఉద్యోగులతో సహకారభావముతో మెలంగవలయును. మఱియు నా యుద్యోగులు తమ క్రొత్త సహోద్యోగుల నాదరించి వారియెడల దయ గలిగియుండవలె ననియు, స్వాతంత్ర్య ప్రతిష్ఠాపన లబ్ధికి వారికి సహాయము చేయవలె ననియు, నూతన ధర్మనిర్వాహణమున నా ప్రజలకు ఘనసేవ చేయవలయు ననియు వెల్లడించుచున్నాను.

6. ఇట్టి సమయమున నా ప్రజలకును నా ఉద్యోగులకును గల ద్వేషభావములను సాధ్యమైనంతవఱకు తొలగింపవలె నని నా యభిప్రాయము. రాజకీయాభివృద్ధి యందలి యుత్సాహముతో నిదివఱకు శాసనోల్లంఘనమును గావించినవా రెల్లరును భావికాలమున శాసనమును గౌరవింప వలయును. శాంతిరక్షణమునకు బాధ్యులగువారు తా మంతము నొందింప నెంచిన విషయములను మఱపు జెందవలయును. నూతనయుగ ముదయింపనున్నది. నా ప్రజలును, నా ఉద్యోగులును ఏకాశయమునకై పరస్పర స్నేహభావములతో కృషిసలుపుట కను వేర్పడవలయును. కావున, ప్రజాక్షేమమున కనుగుణ మని తనకు తోచిన రీతిని రాజకీయ నేరస్థులకు విమోచనమును నా పక్షమున గల్పింపవలయు నని నేను నా రాజప్రతినిధికి తెలియఁజేయుచున్నాను. ప్రభుత్వశాసనానుగుణముగ గాని, లేక అవసరశాసనానుసరణముగ గాని నిర్బంధితులైనవారి కీపద్ధతిపై ఈ యుత్తరువు ననువర్తింప జేయవలయు నని నా అభిప్రాయము. ఈ విధముగ విముక్తి జెందినవా రికముం దిట్టి కార్యములను జేయకుందు రనియు, నా ప్రజ లెల్లరును అట్టి శాసనములను ఆచరణలోనికి దెచ్చు నవసరము కలుగురీతిని వర్తింపకుందు రనియు నమ్ముచున్నాను.

7. బ్రిటిషు ఇండియాలో నీ నూతన రాజ్యాంగ యంత్రముతోపాటు, స్వదేశసంస్థానాధీశుల సభను కూడ నెలకొల్పుటకు నే నంగీకరించితిని. వారి సలహావలన స్వదేశసంస్థానములకును, సామ్రాజ్యమునకును మేలు కలుగగల దని భావించుచున్నాను. స్వదేశాధీశుల హక్కులను, మర్యాదలను సంరక్షించుటయే నా నిశ్చితాభిప్రాయ మని మఱియొకమాఱు దెలుపుచున్నాను.

8. సంస్థానాధీశుల సభను బ్రిటిషు ఇండియాలో నూతన రాజ్యాంగయంత్రమును ప్రారంభించుటకు నా పక్షమున నా కుమారుడు, ప్రిన్సు ఆఫ్ వేల్సును, రాబోవు శీతకాలమున భారతదేశమునకు బంపుట కుద్దేశించుచున్నాను. దేశభావిస్థితికి కారణభూతులగువారియందు పరస్పర సద్భావమును, విశ్వాసమును ఉండి, తన్మూలమున వారిపాలనము క్రమాభివృద్ధి నొందవలెనని నా కోరిక. సర్వేశ్వరుడు భారతదేశమున కెక్కుడు భాగ్యమును, నెక్కుడు సంతృప్తిని నెలకొల్పి, రాజకీయస్వాతంత్ర్యమును సంపూర్ణముగ వ్యాప్తి నొందించుగాక యని నా ప్రజలతోపాటు నేనును అతనిని ప్రార్థించుచున్నాను.

(సభాముఖము లగు రాజప్రతినిధి యుత్తరువు ప్రకారము)

ఆర్. ఏ. గ్రాహాము,

ఆక్టింగు చీఫు సెక్రటరీ

ఈ ప్రకటన వ్యాఖ్యానమునందును జాతీయవాదులకును మితవాదులకును భిన్నాభిప్రాయములు గలిగినవి. జాతీయమహాసభ యందీవిషయమై ఈ క్రింది తీర్మాన మామోదితము.

స్వపరిపాలనమునకు దేశీయు లిదివఱకే అర్హులు. సంస్కరణ చట్టము అపర్యాప్తమును అసమగ్రము, అసంతృప్తికరము. స్వయం నిర్ణయసూత్రము ననుసరించి పార్లమెంటువారీ దేశమునందు త్వరలో సంపూర్ణస్వపరిపాలనము నేర్పరుపవలెను. శ్రీ సార్వభౌముడు కోరిన చందమున నీ సభవారు సహకారులై చట్టము ననుసరించి ఈ సభవారు మాంటాగుగారికి వందనముల నర్పించెదరు.

మితవాదిమహాసభయందధికతరామోదమును తెలిపెడి తీర్మాన మామోదితము. ఉభయపక్షములకును జాతీయప్రత్యభిజ్ఞానమునందుఁ గల భిన్నభావమునకే తీర్మానములు ప్రమాణములు. జాతీయవాదు లాత్మావలంబనధర్మము నధికతరముగ విశ్వసించుచున్నారు. మితవాదులు పరావలంబనబలము నధికతరముగ నపేక్షించుచున్నారు. భారతజాతీయోద్ధరణము భారతీయులమూలమున సాధ్యము గావలసి యుండును. కాని జాతీయహృదయము నెఱుఁగని పరావలంబనమూలమున సాధ్యముగాఁజాలదు.

## పంజాబుహత్యలు

గతసంవత్సరమునందు భారతజాతీయప్రవృత్తిని కలవరపఱచిన విషయములయందు పంజాబుహత్యలు ప్రముఖములు. ప్రజలహృదయములను రాజ్యాంగసంస్కరణశాసన మాకర్షించినను పంజాబు హత్యలు చండశాసనప్రయోగమును శాశ్వతము గావించినవి. గతసంవత్సరమునందు రౌలటుశాసనము గొప్పకలవరమును గలిగించినది. రౌలటు శాసనోపసంహారమునకై గంధిమహాత్ముఁ డుపదేశించిన సత్యాగ్రహవ్రతము భారతీయుల ధర్మబలమును వ్యక్తము చేసినది. పశుబలారాధకుల కీ ధర్మబలవిజయము హృదయశల్యముగఁ బరిణమించినది. నిరంకుశాధికారాధీశుఁడైన సర్ మైకేలు ఓడ్వ్యాయరుగారు బాహుబలముతో ధర్మబలమును నిర్మూలము చేయ సమకట్టిరి. ఓడ్వ్యాయరు గారికిని రైజాదా భగతురాముగారికిని జరిగిన సంభాషణము వారి పశుబలాభిమానమునకు నిదర్శనము:

ఓడ్వ్యాయరుగారు జలంధరునందు హరితాళము ఎట్లు జరిగినదని ప్రశ్నించిరి. భగతురాముగారు 'పూర్ణమైన హరితాళము జరిగినది. అల్లరు లేమియుఁను జరుగలేదు. గంధిమహాత్ముని యాత్మబలము దీనికి మూలము' అని ప్రత్యుత్తర మిచ్చిరి. ఓడ్వ్యాయరుగారు పిడికిలి బట్టి చేయి యెత్తి 'గంధియాత్మబలమును మించిన బలము గలదని రైజాదాసాహిబూ నీవు గమనింపుము!' అనియెను.

పంజాబుహత్యలకు ఓడ్వ్యాయరుగారి దురహంకారము దురభిమానము నిరంకుశాధికారాభిమానము గారణములని ఓడ్వ్యాయరుగారి స్వభావమును పంజాబుదేశచరిత్రమును వ్యక్తము చేయుచున్నవి. సామ్రాజ్యశాసనసభయందు 1917 సంవత్సరము సెప్టెంబరుమాసమునందు ఓడ్వ్యాయరుగారు భారతజాతి నంతను నిరసించిరి. "బ్రిటీషు సైన్యము నౌకాదళము గలుగ జేసిన యోగక్షేమములను మఱచి బ్రిటీషుసామ్రాజ్య మనుభవించుచున్న కష్టములను నిర్లక్ష్యము చేసి రాజ్యాంగసమస్యలను నిరసనభావముతో చర్చించుచు రాజేంద్రు ప్రభుత్వము మీఁదను నాయకులు సత్యాగ్రహమును బోధించుచున్నారు." అని నిరసనవాక్యముల నుపయోగించిరి. ఈ నిరసనవాక్యముల నుపసంహారము చేసికొనిరి. ఏప్రిలు 7 వ తేదిని శాసనసభయందు చేసిన ప్రసంగమునందు పంజాబునుండి 3,55,000 మంది సైనికులు సైన్యమునందు చేరినట్లు ప్రశంసించిరి. వేఱొక సందర్భమునందు పంజాబులు "ఉదారస్వభావు లనియును విశ్వాసపాత్రు లనియును శత్రుసముదాయమును నంతఃకలహములను నిర్మూలము చేయఁగల బ్రిటీషు ప్రభుత్వ మాందోళనకర్తలను నిర్మూలము చేయఁగలదు" అని అధికారస్తోత్రవాక్యములను ఉపయోగించెను. ఈభావముల కనురూపముగ ఓడ్వ్యాయరుగారు పంజాబును బాలించెను. అధికారాభిమానము ప్రజానిరసనము ఓడ్వ్యాయరుగారి పాలనధర్మములు. ఈధర్మము లిరువదవ శతాబ్దియందు స్వయంనిర్ణయప్రతిపాదకమైన మహాసంగ్రామానంతరము నిరుపయోగము లని ఓడ్వ్యాయరుగారు గ్రహింపకుండుట సంతాపకరము. సైనికులను సమకూర్చుటయందును ఋణపత్రములను సమకూర్చుటయందును పంజాబునందు నిరంకుశమార్గము లవలంబింపబడిన వని పంజాబు ప్రజలు ప్రకటించుచున్నారు. ఓడ్వ్యాయరుగారి నిరంకుశత్వము హరితాళముతో ఫలించినది. పంజాబునకు గంధిమహాత్ముని యాగమనము నిరోధింపఁబడినది. కిచిలు, సత్యపాలుగారులు నిర్బంధప్రవాసమున నుంచఁబడిరి. ప్రజలు చెలరేగి అమృతసరము మొదలగు ప్రదేశములందు దౌర్జన్యకార్యములను జేసిరి. ప్రజల హృదయవీర్యమును నిర్మూలము చేయుటకై ఓడ్వ్యాయరుగారు పంజాబునందు చండశాసనమును ప్రయోగించిరి. డయరు జాన్సను ఓబ్రీను బాస్వర్తు స్మిత్తు శ్రీరామసూరు మాలికుసాహెబు ఖాను గారులు

చండశాసనము నవహానకరముగ నుపయోగించిరి. హంటరుకమిటీయెదుట వారిచ్చిన వాఙ్మూలమే వారిని దోషులను జేయుచున్నది. జాలియన్వాలా బాగునందు నిరాయుధులు నిరపరాధులు 1200 మంది గుండ్లవాతఁబడిరి. చండశాసకులు విధించిన కొరడాదెబ్బలు ప్రాఁకెడి శిక్ష నిర్బంధములు ధర్మవిరుద్ధము లని యంగీకరింపవలయును. గుజ్రన్వాలాయందు నిరపరాధులమీఁద విమానములనుండి బాంబులు వేయఁబడినవి. ప్రజలనుండి దండనద్రవ్యము వసూలుచేయబడినది. ఓడ్వయరుగారును వారి నియమితానుచరులును చండశాసనమును నిర్దాక్షిణ్యభావముతో వాడిన విధమును ఓడ్వయరుగారి స్వభావమును డయరుగారి వాఙ్మూలమును ధ్రువపఱచుచున్నవి.

పంజాబుహత్యలను విచారించుటకై నియమించిన హంటరుసంఘమువారి నివేదిక ఈ యభిప్రాయములను ధ్రువపఱచుచున్నది. జాతీయమహాసభోపసంఘము నియమించిన యుపసంఘము 1700 సాక్షుల వాఙ్మూలములను బరిశీలించి స్థలములను సందర్శించి నివేదికమును సిద్ధముచేసినది. నివేదికను సిద్ధముచేసిన గాంధి దాసు తయ్యాబ్జి జయకరు గారులు భారతీయుల కృతజ్ఞతకు పాత్రులు. సుప్రసిద్ధన్యాయవాదులైన వీరినివేదికను ద్రోసివేయుట కవకాశములు లేవు. నివేదికమునందు ప్రజల దుర్మార్గము గర్హింపఁబడినది. పంజాబునందు తిరుగుబాటు లే దని నిర్ణయింపఁబడినది. చండశాసనమును బ్రయోగించుట కవసరము లే దనియును చండశాసన మనవసరసమయమునందు చిరకాల ముపయోగింపఁబడిన దనియును తీర్మానింపఁబడినది. ప్రజ లనుభవించిన కష్టములకు ప్రతీకారముగ నీక్రిందివిషయము లాచరణీయములని నిర్ణయింపఁబడినది.

1. రౌలటు శాసనోపసంహారము, 2. సర్ మైకేలు ఓడ్వయరును పదభ్రష్టుని జేయుట, 3 జనరలు డయరు మున్నగువారికి రాజ్యమునం దేయుద్యోగమును నీయకుండుట, 4. అపరాధములను జేసిన చిన్నయుద్యోగస్థులను వారి యపరాధము స్థిరపడినపుడు తీసివేయుట 5. శ్రీ చెమ్సఫర్డుప్రభువును స్వదేశమున కంపుట, 6. దండనద్రవ్యమును తిరిగి ఇచ్చుట; ఇతరదండనకార్యముల నుపసంహరించుట.

నివేదిక సూచించిన ప్రతీకారకార్యములు సౌమ్యములుగ నున్నవి. దురహంకారపూరితులైన యధికారులిట్టి దుండగములను జేయుట కవకాశములు పరిపాలనమునుండి పోయినఁ గాని స్వాతంత్ర్యము సున్నయగును. పంజాబుహత్యలు ప్రజలయందు కలిగించిన నూతనచైతన్యమునకు అమృతసరపు జాతీయమహాసభ నిదర్శనము. కాశీయాత్రకువలె అమృతసరముయాత్రకు వేలకొలఁది ప్రతినిధులు పోయి జాలియన్వాలాబాగునందు భస్మధారణమును జేసి పవిత్రులైరి. భారతజాతీయజీవనమునందు పంజాబుహత్యలు దుండగములు మహాప్రబోధమును గలిగించినవి. పంజాబు వ్యవహారములు భారతీయుల దురవస్థను లోకమునకు వ్యక్తము చేసినవి. ఆసేతుహిమాలయపర్యంతము గల భారతీయుల హృదయములందు పంజాబుచర్యలు రోషానలమును ప్రజ్వలింపఁజేసినవి. జాతీయమహాక్షేత్రమును సందర్శించుటకై 20,000 భారతీయులు చేరియుండిరి. అమృతసరమునందు పర్యాప్తంబైన యుత్సవపరంపరలు కోలాహలము భారతీయుల ప్రకృతిని వ్యక్తము జేసినవి. సత్యపాలు కిచులుగారల కొకమహోత్సవము జరిగినది. సౌకతాలీ మహమ్మదాలీగారల కొకమహోత్సవము జరిగినది. అమృతసరము నగరముత్సవపరంపరలతో నిండి ప్రతిధ్వనించినది. నాయకుల యూరేగింపులు వారికి సమర్పించిన పుష్పాంజలులు పుష్పహారములు నీరాజనములు జయఘోషములు ప్రజలయుద్రేకపూరితమైన ప్రకృతికి పరమప్రమాణములు. అమృతసరమునందలి వీథులు లక్షలకొలఁదిజనులతో క్రిక్కిఱిసినవి. సౌధాగ్రములనుండి సుందరాంగులు పూలవానలను గురిపించిరి. వీరుల యానములు పుష్పహారములతో నిండినవి. జయఘోషము లాకసమును నింపినవి. హిందువులు మహమ్మదీయులు సమానోత్సాహముతో నుభయమతనాయకులకును స్వాగతము నొసంగిరి. పంజాబుహత్యలు హిందూమహమ్మదీయసంయోగమును బలపఱచినవి. కష్టకాలమునందు భిన్నమతావలంబకులకు జాతిమతభేదము లంతరించి మిత్రత్వసంయోగములు సహజముగ గలుగుట ప్రకృతిధర్మము. హిందూమహమ్మదీయనాయకులను హిందూమహమ్మదీయులు సమభావముతో నభినందించి సన్మానించిరి. హిందూమహమ్మదీయవ్యక్తిత్వభావము పోయి భారతజాతీయవ్యక్తిత్వము పరిస్ఫుటమైనది.

చిరకాలమునకు వెలువడిన హంటరుసంఘపు నివేదికయును నీభావమును బలపఱచినది. హంటరుసం

ఘమువా రధికారపక్షపు సాక్షులను మాత్రము విచారించిరి. ప్రజాపక్షపు సాక్షులను విచారించి యుండలేదు. అధికారపక్షపు సాక్షుల వాఙ్మూలములనైనను నివేదికకు మూలాధారముగ గ్రైకొనలేదు. సంఘమునందలి యూరపియను సభ్యు లయిదుగురును నొక విధమునను భారతీయసభ్యులు మువ్వురును వేఱొకవిధమునను తీర్మానమును వ్రాసిరి. హాఫీ గారు భారతీయసభ్యుల తీర్మానముతో నేకీభవించిరి. కాంగ్రెసు సంఘనివేదికకును భారతీయసభ్యుల నివేదికకును విశేషమైనభేదము గలదు. యూరపియను సభ్యులనివేదికకును కాంగ్రెసుసంఘనివేదికకును పోలికయే లేదు. ఉభయులును తిరుగుబాటు లేదని నిర్ణయించిరి. ఒకరు సత్యాగ్రహము దుర్ణయములకు కారణ మనిరి. రెండవవారు సత్యాగ్రహము శాంతికి సాధనమనిరి. ఒకరు ప్రభుత్వము వారిచర్యలను సమర్థించిరి. రెండవవారు ప్రభుత్వము చర్యలను తీవ్రముగ ఖండించిరి. ఒకరు చండశాసనప్రయోగమును ప్రయోగవిధానమును సమర్థించిరి. రెండవవారు చండశాసనప్రయోగావసరమును శంకించిరి. ప్రయోగవిధానమును గర్హించిరి. క్రూరకార్యములను చేసిన డయరుగారి ప్రవర్తనమును సయితము యూరపియను సభ్యులు సమర్థించిరి. హిందూదేశమంత్రి డయరుగారి చర్యలను గర్హించి వారి నుద్యోగమునుండి తొలగించినను డయరుగారిని ప్రభుత్వోద్యోగులను ప్రశంసించిరి. మాంటేగూగారి నిర్ణయము లాశాభంగమును గలిగించినవి. జనరలు డయరుగారు 12 వ తేది యుదయమునను సభలను సమావేశములను నిషేధించినటులు ప్రకటించిరి. ప్రకటనము జనులకు తెలిసినదియు లేనిదియు డయరుగారు కనుఁగొనఁ బ్రయత్నింపలేదు. జలియన్వాలాబాగునందుకూడిన ప్రజలమీఁదను మందుగుండ్ల సామానులయిపోవునంతవఱకును డయరుగారు తుపాకులను ప్రేల్పించిరి. ప్రజలు చచ్చియును గాయములు తగిలియును బాధపడుచున్నను క్రూరమృగముల రీతిని డయరుగారు వీరల నుపేక్షించి వెడలిపోయిరి. పాఱిపోవుచున్నవారిని తుపాకులతో కాల్చి చంపుట నింద్య మని హాంటరు సంఘమువా రంగీకరించియును డయరుగారి క్రూరచర్యలను సమర్థించిరి. అల్లరులు నిలిచిన తరువాతను చండశాసనమును ఉపయోగించుటయును ఆ శాసనమును గతకాలమునకు వినియోగించుటయును చిరకాలమువఱకును నుపయోగించుటయును న్యాయవిరుద్ధము. ప్రజాహితజీవనమునకు ప్రతిఘటనమును బూనిన ఓడ్వయరు గారు పంజాబుకలవరములకు బాధ్యులు. ఓడ్వయరుగారు వారి వ్యవహారచర్యలను ఖండించినవారలకు గుణపాఠమును నేర్ప సమకట్టిరి పంజాబు నాయకుల ననవసరముగ నిర్బంధించిరి. గాంధిగారి యాగమనమును ప్రతిషేధించిరి. శ్రీ చమ్సుఫర్డు ప్రభుత్వమును బెదరించిరి. పంజాబు దుండగములకు కారకులైరి. చండశాసనమును విచ్చలవిడిగ ప్రయోగించి ప్రబలమైన యశాంతిని గలుగఁజేసిరి జనరలుడయరుగారి చర్యల నామోదించుటయే ఓడ్వయరుగారి నిరీక్షణమును వెల్లడిచేయుచున్నది. అయినను హాంటరు నివేదికము మాంటేగుగారి లేఖ ఓడ్వయరుగారిని శ్లాఘించుచున్నవి. చండశాసనపరిపాలన మన్యాయపూరిత మని హాంటరుసంఘము సయితము కొంతవఱ కంగీకరించుచున్నది చండశాసనప్రయోగవిధానము లమానుషము లని కాంగ్రెసు నివేదిక ఘోషించుచున్నది. హాంటరు సంఘనివేదికయును నీవిషయమును కొంతవఱ కంగీకరించుచున్నది.

హాంటరుసంఘనివేదికము నిరంకుశాధికారచర్యలకు పైపూతపూసినది. మూలాధార మధర్మసిద్ధాంతబద్ధమైనపుడు నిర్మాణ మంతయును నధర్మసిద్ధాంతమయమై యుండుటయందు వింత యుండదు. నిరాయుధులు ప్రభుత్వముపట్ల తిరుగుబాటును చేయుట యసంభవము. కుట్రయును తిరుగుబాటును లేదని అధికారపక్షపు సాక్షులు తెలిపియుండిరి. డయరుగారిని తొలఁగించుటయును చండశాసనవిధానమును నిర్మించుటయును హాంటరు సంఘవిచారణకు ఫలములు. నిరపరాధు లెందఱో చండశాసనమునకు గుఱియైనను మహాసంక్షోభమునకు కారకులైన యధికారులు స్తోత్రమునకు పాత్రులైరి. అభయశాసనము సంక్షోభకారకుల కభయము నొసంగుచున్నది. అష్టకష్టములకు పాలైన నిర్దోషులగతికి విమోచనము గలుగలేదు. హాంటరుసంఘనివేదికము యూరపియనులకును భారతీయులకును భారతవ్యవహారములపట్లఁ గల నిరీక్షణమును విదితము చేసినది. హాంటరునివేదికము ప్రజాభ్యుదయమును కనుఁగొనలేదు. ప్రజాస్వత్వములను పరికించుటలేదు. ప్రజాభిప్రాయములను పాటించుటలేదు. కేవల మధికారిదృష్టిని మాత్రము పాటించినది. మాంటేగుగారి లేఖార్థములును నధికారాభిమానమును

బలపఱచినది. ఈనివేదికము యూరపియనుల కాహ్లాదమును గలిగించినను భారతీయులం దన్నిపక్షములవారికి నాశాభంగమును గలిగించినది. హిందూ మహమ్మదీయ సంయోగము జాతీయభావములు దృఢతరములైనవి. పంజాబు యాగములు పరోక్షముగ జాతీయబలమునకు దోహదము నొసంగినవి. ధర్మనిర్వహణమున కేర్పడిన పార్లమెంటునందైనను భరతఖండమునకు న్యాయము గలుగు నని నమ్ముటకు సూచనలు లేవు. పంజాబు వ్యవహారములు రాజ్యాంగసంస్కరణముల పట్ల విముఖత్వమును గలుగజేసినవి. అవసరజాతీయమహాసభ ఈ విషయము నెటుల నిర్ణయించునదియును కాలము తెలుపగలదు.

## సామ్రాజ్య ప్రభుత్వము

నిరంకుశాధికారాధీన మైన భారతప్రభుత్వము ప్రజాశయములకు పరాఙ్ముఖత్వమును జూపుచున్నదను భావము గతసంవత్సరమునందు క్రమముగ ప్రబలినది. సిద్ధాంతమునందు ప్రజాస్వామ్యము ప్రయోగమునందు నిరంకుశాధికారము ప్రభుత్వధర్మము లను భావము భారతీయుల హృదయములందు నాటుకొనినది. మోంటుఫర్డు నివేదిక ప్రచురణానంతరము పర్యాప్తం బైన రాజ్యవ్యవహారము లీభావమును స్థిరతరముచేసి ప్రబలమైన యాందోళనమునకు హేతుభూతము లైనవి. తదనుగుణముగ ఇండియా ప్రభుత్వము సంస్కరణముల పట్ల సంకుచితభావమును ప్రకటించినది. పంజాబునందు చండశాసనప్రయోగము నామోదించినది. అభయశాసనమును ప్రజాభిప్రాయములకు ప్రతికూలముగ నిర్మించినది. అభయశాసననిర్మాణసమయమునందు జరిగిన వాదప్రతివాదములు భారతీయులకును యూరపియనులకును ధర్మనిరీక్షణమునందు గల భేదమును విశదముచేసినవి. చండశాసననిర్వాహకుల కభయశాసనము సంపూర్ణముగ నభయము నొసంగినది. ఈశాసనము చండశాసనమును సద్భావముతో నిర్వహించిన సకలోద్యోగులకును నభయము నొసగుచున్నది. సద్భావమును స్థిరపఱచుటకు ప్రభుత్వకార్యదర్శి ధ్రువపత్రము చాలియున్నది. చండశాసనము ననుసరించి శిక్షలను బొందినవా రందఱును న్యాయముగ శిక్షలను బొందిరని నిర్ణయింపబడినది. ఆస్తికి గలిగిన నష్టమునకు ప్రభుత్వము యుక్తమని తోఁచిన ప్రతిఫలము నొసంగ నిర్ణయింపఁగలదు. ఈయభయశాసనమీమాంస యంతయును పూర్వచరిత్రము. శాసనము ప్రవేశమును గాంచిన సమయమునందు హంటరు సంఘము శిక్షాపాత్రులను నిర్ణయించి న్యాయపరిపాలనమును జేయు నని అధికారులు వాదించిరి. ఈ వాదవ్యాజమును హంటరుసంఘ నివేదికము రుజువుచేసినది. చండశాసనప్రయోగమును సమర్థించి అధికారులను ప్రశంసించిన హంటరుసంఘనిర్ణయములవలన కలిగిన ప్రయోజనము సువ్యక్త మైనది. నిరంకుశాధికారాభిమానులు చండశాసన నిర్వాహకులకు ధర్మాధర్మవివక్షత లేక యభయము నొసగిన విధమును కాంగ్రెసు నివేదికయును హంటరు నివేదికయును విశదముచేయుచున్నవి. అభయశాసనమునకు భారతీయుల ప్రతిఘటనభావము సమయోచిత మని యధికారవ్యవహారములు రుజువు చేసినవి. అభయశాసనము పాలకపాలితసంయోగమునందు కలుగుచున్న భేదభావమును వృద్ధిచేసినది. గతసంవత్సరమునం దంగీకృతములగు శాసనములందు "ఆయుధశాసనసవరణశాసనము" పేర్కొనదగి యున్నది. ఈ శాసనము జాతిమతదశావిభేదము లేక, సకలజనులును సామాన్యముగ లైసెన్సును పొందవలయు నని నిర్ణయించుచున్నది. కాని అధికతరముగ లైసెన్సులు దొరకుట గాని లేనివారినుండి ఆయుధములను తీసికొనుట గాని వాంఛకయుందు సంప్రాప్తము గాకున్నది. ఆయుధశాసనమును రద్దుచేయుఁడని భారతీయులు కోరుచుండిరి. కాని నిర్బంధములను వృద్ధిచేయుఁడని వారు కోరియుండ లేదు. గతసంవత్సరమునం దామోదితములగు శాసనములలో డక్కా విశ్వవిద్యాలయశాసనము పంజాబు హైకోర్టుశాసనము నాగపుర విశ్వవిద్యాలయ నిర్మాణతీర్మానము గణనీయములు. డక్కా విశ్వవిద్యాలయ శాసనము విద్యాశిక్షణమునందు నూతనవిధానమును నిర్ణయించుచున్నది. ఇది ఏకప్రదేశవాసము గల సాశ్రయ విశ్వవిద్యాలయమార్గమున నిర్మింపఁబడును. విద్యానిర్వాహకుల కధికతర మైన యవకాశము లిందుఁ గలుగఁ గలవు. గతసంవత్సరము కర్మకరుల నియమభంగశాసనము సవరణను బొందినది. ప్రజాస్వామ్యత్వ మతివేగముగ పోవుచున్న సమయమునం దీశాసనమును, పండిత మదనమోహనమాలవ్య గారును నరసింహేశ్వర శర్మ గారును నిర్దేశించినటులు, రద్దుచేయక పోవుట పాలకుల సంకుచితభావమునకు నిదర్శనము. కాఫీ తేయాకు

వాటికేశ్వరుల కసంప్రీతిని గలిగించుట కధికారు లంగీకరింపఁజాలరు. గతసంవత్సరపు శాసనసభయందుజాతీయవాదులపక్షమున పటేలు గారును, ప్రజాసామాన్యపక్షమున మదనమోహనమాలవ్య గారును నార్థికసమస్యలందు నరసింహేశ్వరశర్మ గారును జేసిన నిర్భయవాదములు ప్రశంసాపాత్రములు. శ్రీ షెమ్సుఫర్డుప్రభువుచేసిన ప్రభుత్వవ్యవహారసమర్థనమునందు విశ్వాసము గలుగలేదు. తురుష్కసమస్యయందును దక్షిణాఫ్రికా భారతీయులసమస్యయందును రాజప్రతినిధి సానుభూతిని వెలిపినను ప్రయోజనము కలుగలేదు.

ఆర్థికపరిస్థితులు

యుద్ధము 1918 సంవత్సరమునం దంతమును హొందినను 1919 సంవత్సరమునందు ప్రజలలో సంక్షోభము ప్రబలినది. గతసంవత్సరమునందును వర్తమానసంవత్సరమునందును ధరలు విపరీతముగ పెరిఁగినవి. ఆహారపదార్థములు ప్రజలకు దుర్లభములైనవి. భిన్నరాష్ట్రములం దాహారపదార్థముల రాకపోకలకు నిర్బంధము లేర్పఱుపఁబడినవి. ఈనిర్బంధములు రయితులకును సామాన్యులకును ప్రయోజనకరములు గాకపోయినను, వర్తకులకును యంత్రాధికారులకును నపారమైన లాభమును గలిగించినవి. యుద్ధమువలన సామాన్యులు కష్టములపాలగుటయును, కొంతమంది లక్షాధికారు లగుటయును సంభవించినది. ఈ లక్షాధికారులు ధనయంత్రాలయాదిసంఘముల స్థాపనమునకు బూనుకొనినవిధమును గతసంవత్సరవ్యవహారములు తెలుపుచున్నవి. బొంబయియందును కలకత్తాయందును 80 కోట్ల రూప్యముల విలువ గల జాయింటు స్టాకు కంపెనీలు నిర్మింపఁబడినవి. ప్రతిదినము పత్రికయందు నూతనసంఘనిర్మాణములు ప్రకటింపఁబడుచున్నవి. పదేండ్లకు పూర్వము పదిలక్షల మూలధనమును సమకూర్చుట యసాధ్యముగ నుండెను. గతసంవత్సరము 100 లక్షలు మూలధనము గల సంఘముల స్థాపనము సుకరమైనది. బొంబయియందు దూదియంత్రములు, కలకత్తాయందు జనుపనారమిలులు, చెన్నపురియందు చర్మముల వ్యాపారము సర్వత్ర వస్త్రధాన్యాదుల వ్యాపారములు విపరీతలాభముల నొసఁగూర్చినవి. అమెరికా, గ్రేటుబ్రిటను దేశములందు కోటీశ్వరు లేర్పడినటులు హిందూదేశమునందు లక్షాధికారులు గలిగిరి. లక్షాధికారులు పాశ్చాత్యవిధానముల ననుసరించి సంయుక్తద్రవ్యసంఘములను నిర్మించిరి. ఈ సంఘములందు టాటా సంఘములను ప్రమాణసంఘములనుగ పేర్కొనవచ్చును. టాటా కుటుంబమువారు పదిహేనేండ్లకు బూర్వము విద్యుచ్ఛక్తినిర్మాణ యంత్రాలయమును లోహయంత్రాలయమును స్థాపించుటకు లండను నగరమునందు భిక్షాటనమును చేసినను కన్నెత్తి చూచెడివారు లేకుండిరి ఇపుడు వారిచేతులందు మన్ను బంగారముగ మాఱుచున్నది. దేశమునందు యంత్రాలయములను స్థాపించుచున్నారు. విపరీతమైనధరలను బెట్టి స్థలములను మందిరములను గొనుచున్నారు. టాటాకంపెనీలవలె నితరసంఘములును నూతనపరిశ్రమలను స్థాపించుటకు తలపెట్టుచున్నారు. ప్రకటితములైన సంఘములందు కొన్ని సంఘములు సాగకపోయినను సంఘనిర్మాణవిధానము పరిశ్రమయుగారంభమునకు నిదర్శనము. యంత్రపరిశ్రమ వ్యాపనమువలన భావికాలమునందు కలుగఁగల శుభాశుభస్థితుల నిర్ణయించుట దుస్తరము.

హిందూదేశపరిశ్రమలందు నేతపరిశ్రమము ప్రముఖము. ఆదికాలమునుండియును భరతఖండము దూదిపంటకు నేతపరిశ్రమమునకు ప్రసిద్ధిగాంచినది. పూర్వము నూలు వడుకుట గృహపరిశ్రమముగ నుండెను. కంపెనీవారు వారిపుణ్యమున నా పరిశ్రమను నాశనము చేసిరి. ఇపుడు దేశమునందు 262 దూదియంత్రాలయములు గలవు. అందు 20,85,678 బస్తాల దూది వాడఁబడి 61,50,40,464 రతుల నూలు వడుకఁబడుచున్నది. అందు 349580450 రతుల నూలు 1450726160 గజముల బట్టలు నేయఁబడుచున్నవి. శేషించిన 265560014 రతులనూలు చేతిమగ్గములకును ఎగుమతులకును వినియోగపడుచున్నది.

దేశమునందు పండిన దూదియందు 20 లక్షల బస్తాలదూది యంత్రాలయములయందు వాడఁబడి 16 లక్షల బస్తాల దూది ఎగుమతి చేయఁబడుచున్నది. యుద్ధమునకు పూర్వము దూదియెగుమతి అధికముగ నుండియుండెను. హిందూదేశమునకు చాలినన్ని బట్టలను సమకూర్చుటకు నేతపరిశ్రమము రెండురెట్లు వ్యాప్తిని హొందవలసియున్నది. ఈ వ్యాపనమునకు లంకాషైరు యంత్రాధీశుల పోటీయును ప్రభుత్వమువారి యుదాసీనతయును ప్రజల యుదాసీనతయును ప్రతిబంధకములు. స్వదేశయంత్రాలయములయందు వడికిన

నూలుమీదను 1918-19 సంవత్సరములలో 143 లక్షల శుల్కము వసూలుచేయబడినది. ఈ శుల్కారోపణము మన ప్రభుత్వమునకుఁ గల నిర్లక్ష్యమును వ్యక్తము చేయుచున్నది. లోకమునం దంతటను యంత్రాధీశులకును కర్మకరులకును మహాసంరంభము పెరుగుచున్న సమయమునందు దూదియంత్రాలయవ్యాపనమును దేశక్షేమాభిలాషులు బాగుగ నిర్ణయింపవలసియుందురు.

దేశక్షేమమునకు మహాయంత్రాలయములు ప్రయోజనకరములో చేతిరాటములు మగ్గములు ప్రయోజనకరములో నిర్ణయించుట గహనవిషయము. మహాత్మగాంధి దేశక్షేమమునకు దూదియంత్రాలయములను నిర్మూలము చేయుట సాధన మని కోటీశ్వరుడైన సర్ దోరాబ్జి తాతాతో చెప్పినటులు ప్రతీతి కలదు. గాంధిమహాత్ముడు స్త్రీపురుషులు రాటములతో నూలును వడికి మగ్గములమీఁద బట్టలను నేసి స్వదేశవస్త్రాభిమానమును చూపవలయు నని యనవరతము బోధించుచున్నాఁడు. దూదియంత్రములను నిర్మూలముచేయుట గాని, రాటములతో స్త్రీపురుషులు నూలును వడుకుట గాని, వర్తమానభోగభాగ్యయుగమునందు సాధ్య మని తోఁపదు. కాని గాంధిమహాత్ముఁ డుపదేశించినటులు ముప్పదిమూఁడు కోట్ల భారతీయులలో రెండుకోట్లమందియైనను దినమునకు రెండుగంటలకాలము దూదిని వడుకుట కుపయోగించిన, నేతపరిశ్రమవలన దేశక్షేమ మతిశీఘ్రముగ వృద్ధిని పొందగలదు.

దేశమునం దంతటను వర్తమానకాలమునందు సైతము నేతగాండ్రు చేతిమగ్గములమీఁదనే రమణీయమైన వస్త్రములను నేయుచున్నారు. మనుఃగడయందును అందమునందును యంత్రాలయనిర్మితవస్త్రములు చేతిమగ్గముల బట్టలకు సాటిరావని యనుభవజ్ఞులకు విదితమైయున్నది. ఈ బట్టల నూలైనను యంత్రాలయములందు సిద్ధమగుచున్నది. నూలును బట్టలను కేవలము బొమ్మలవలెఁ గాక మానవహృదయముతో సిద్ధముచేయుట మానవధర్మాభ్యుదయమునకు సాధనమని కళాభిమానులందఱును నంగీకరించుచున్నారు. భరతఖండమునందు చేతి నేతపరిశ్రమను నుద్ధరించుటకు చేసిన ప్రయత్నము లింతవఱకును సఫలము కాలేదు. దేశక్షేమమును కోరువా రందఱును వారిదృష్టి నీ పరిశ్రమమునందు నిలిపి దాని నుద్ధరించుటకు సాధనంబుల నన్వేషింపవలసియుందురు.

దేశపరిశ్రమలలో జనుపనార పరిశ్రమము ముఖ్యముగ నున్నది. ఈ పరిశ్రమము యూరపియనుల హస్తమున నున్నది. బంగాళాప్రాంతమునందుఁ గల 76 యంత్రాలయములందును 4284 లక్షలు విలువ గల సంచులు గతసంవత్సరమునందు నేయఁబడినవి. జనుపనారపరిశ్రమము యంత్రాధికారులకు లాభకరమైనను ఆహారపదార్థముల పంటలకును నారోగ్యమునకును ప్రతిబంధకముగ నున్నది. తాతాకంపెనీవారు సాక్షియందు స్థాపించిన లోహపరిశ్రమము గమనార్హముగా నున్నది. గత సంవత్సరమునం దీ సంఘము 130043 టన్నుల ఉక్కుపట్టాలు మొదలగువానిని సిద్ధముచేసినది. దేశమునందు లోహయంత్రాలయములను స్థాపించుట కవకాశములు గలవు. వానిని వెంటనే వృద్ధిచేయుట ప్రభుత్వధర్మము. దేశమునందు నీలిమందు, తేయాకు, కాఫీ, ఉన్ని, పట్టు మొదలగు పరిశ్రమలు గలవు. దేశక్షేమమున కీ పరిశ్రమములను వికసింపఁజేయుట అత్యంతావసర మయినను ప్రభుత్వమువారు విశేషమైన ప్రమేయమును కలుగ జేసికొనుట లేదు. పారిశ్రామికసభ చేసిన నిర్ణయము లెపు డాచరణమునకు వచ్చునదియును తెలియకున్నది. పరిశ్రమశాఖను ప్రజాయత్తశాఖగ జేసి ప్రభుత్వమువారు తమ బాధ్యతను వదలుకొనునటులు ఊహింపఁదగి యున్నది. సామాన్యపరిశ్రమల స్థితిగతు లీరీతి నుండఁగా మూలపరిశ్రమల స్థితిగతులను యోచించుట నిరర్థకము. గ్రేటుబ్రిటను నందు మూలపరిశ్రమలు స్వదేశాయత్తములై యుండవలయు నని మహాదాందోళనము జరుగుచున్నది. భరతఖండమునకు సకలవస్తువులకును పరదేశము లాధారములైనవి. దేశమునందు బొగ్గు, లోహములు, జలపాతములు కలవు. నిర్మాణపదార్థముల కవసరమైన సహజపదార్థములు కలవు సారవంతములైన క్షేత్రములు కలవు. సుజలపూరితములైన నదీనదములు గలవు. ఇ మ్మహాసంపదలను స్వాధీనము చేసికొని ప్రజోపయోగమునకు మార్చినపుడే ప్రజాక్షేమము సాధ్యము కాగలదు. క్షేమమునకు నుత్పత్తివలె భోగము సాధనము కాజాలదు. ఉత్పత్తిని వెంటనే వృద్ధిచేయుటకు వంశానుగతములగు చేతిపనులను వృద్ధిచేయుట యవసర మగుచున్నది.

వ్యవసాయము

భరతఖండమునందు 100 కి 70 మందికి వ్యవ

సాయము జీవనాధారముగ నున్నది. రయితుల పూనిక యనుభవము సరళప్రవృత్తి విఖ్యాతవిషయములు. అయినను దారిద్ర్యమునకు హిందూదేశపు రయితులు ప్రసిద్ధికెక్కి యున్నారు. రయితులలో చాలమందికి కడుపునిండ కూడు లేదు; కట్టుకొనుటకు బట్ట లేదు; నివసించుట కిల్లు లేదు. సుఖపడుట కితరసాధనములు లేవు. రయితుల శుభస్థితి దేశశుభస్థితికి సాధనమని యందఱును నేకగ్రీవముగ నంగీకరించుచున్నారు. ఆహార పదార్థములు దుర్లభమైన కష్టకాలమునందు రయితుల క్షేమమును వృద్ధిచేయుచు పాఁడిపంటల నభివృద్ధిచేయుట దేశక్షేమమునకు మూలాధారము. వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వమువారు వ్యవసాయశాఖ నేర్పాటుచేసి సర్వజ్ఞులైన పౌరసేవప్రౌఢోద్యోగులను భిన్నరాష్ట్రములందు శాఖాధికారులనుగ నియమించిరి. భిన్నరాష్ట్రములందు వ్యవసాయకళాశాలలను స్థాపించి వ్యవసాయకళను నేర్పుచున్నారు. పూనాయందు దొరతనము మూలాన్వేషణాలయమును స్థాపించి మూలాన్వేషణమును జేయుచున్నారు. ఇపుడు వ్యవసాయశాఖయందు 1000 మంది పనిచేయుచున్నారు. దేశమునందు 400 ప్రదర్శనక్షేత్రములు గలవు. ఈ క్షేత్రములందు ప్రత్తి చెఱకు వడ్లు పొగాకు గోదుమలు వేరుసెనగ మొదలగు పంటల వృద్ధిమార్గము లన్వేషింపఁబడినవి. ఈశాఖవలన సంవత్సరమునకు 350 లక్షల రూప్యములు లాభము గలిగినదని ప్రభుత్వాధికారులు నిర్ణయించుచున్నారు. కాని ప్రజలకు మాత్ర మిది గోచర మగుట లేదు.

వ్యవసాయాభివృద్ధికి భూములు నీటివసతులు రయితులు పరికరములు సాధనములు. ఇపుడు దేశమునందు 22,78,47,771 యకరములు సాగగుచున్నవి. ఇంకను వెంటనె 16,00,00,000 యకరములు సాగగుటకు తగినభూమి గలదు. ఈ భూమి సాగుబడి యగుటకు తగిన ప్రతిపత్తిని అధికారులు రయితులకు గల్పింపవలయును. నీటివసతులను వృద్ధిచేయవలయును. ఉన్నవసతుల నందుబాటునం దుంచవలయును. జీవచ్ఛవము లగుచున్న రయితులను ఋణపాశ వినిర్ముక్తులను జేయుటకు మహాప్రయత్నములు జరుగవలయును. పాలకులకు సిస్తు వసూలునందు గల భక్తిశ్రద్ధలు వ్యవసాయాభివృద్ధియందు లేవు. సిస్తు వసూలుచేసెడి పద్ధతులు కష్టములకు కారణంబు లగుచున్నవి. వర్తమానకాలమునందు రయితుల కారోగ్యపోషణము పరపతి వ్యాపకము పశురక్షణము విద్యాశిక్షణము పరమావసరములుగ నున్నవి. ఈ యవసరములు రయితుల పూనికవలననే తీరవలసి యున్నవి. రయితులు వారి బాధ్యతలను ప్రయోజనములను స్వత్వములను గనుఁగొని పాటుపడిన, వారియభ్యుదయము సులభసాధ్యము గాఁగలదు.

వర్తకవ్యాపారములు

గతసంవత్సరమునందు (1918-19) 423 కోట్ల రూప్యముల వ్యాపారము జరిగినది. అందు 169 కోట్లు ఎగుమతులు 239 దిగుమతులు గలవు. ఈ మొత్తము విలువనుబట్టి నిర్ణయించినయధికమైనను పరిమితినిబట్టి నిర్ణయించిన తగ్గుచున్నది ధరలు విపరీతముగ పెరిఁగినందున మొత్తము పెరిఁగినను దుర్భిక్షమువలనను పరిమితి తగ్గినది. ఎగుమతుల ధరలు దిగుమతుల ధరలు 100-కి 20-27 వఱకు పెరిఁగినవి. ఎగుమతులందు జనుపనార వస్తువులు తేయాకు చర్మములు భోజనపదార్థములు ప్రముఖములు. గత సంవత్సరమునందు గ్రేటుబ్రిటనుతో వర్తకము 100-కి 17 వంతున తగ్గి జపాను అమెరికా దేశములతో పెరిఁగినది. దిగుమతులందు బట్టలు నూలు 70 శర్కర 15 లోహవస్తువులు 12 మద్యములు 3, ఉప్పు 2 1/8, ఆహారపదార్థములు 2 కోట్ల విలువ గలవి గలవు. ఈ దిగుమతులు మన యసహాయస్థితికి నిదర్శనములు. దేశమునం దుత్పత్తికాఁగల వస్తువుల నీవిధముగ మనము కొనుచున్నంతవఱకును మనకు పరాధీనస్థితి దుర్భేద్యముగ నుండఁగలదు. ఈ దిగుమతి వస్తువులు మనదేశమునం దుత్పన్నమైన సంవత్సరమునకు 100 కోట్ల రూప్యములు దేశమునందు నిలిచియుండుటయును ధరలు తగ్గుటయును సంభవించును. గాంధిమహాత్ముని స్వదేశవ్రతమున కిదియె ప్రయోజన మని భారతీయు లందఱును మననము చేయవలయును.

ఎగుమతులందు జనుపనార వస్తువులు 52, దూది 31, దూదివస్తువులు 14, ఆహారపదార్థములు 40, చర్మములు 10, నూనెగింజలు 11, లోహములు 3½ కోట్ల రూప్యముల విలువవి గలవు. దూదిని ఆహారపదార్థములను నూనెగింజలను నెగుమతి చేయుటవలన నపారమైన నష్టము గలుగుచున్నది. బట్టలధరలు ఆహారపదార్థములధరలు పెరుఁగుచున్నవి. వ్యవసాయాభివృద్ధి కవసరమైన పదార్థములు విదేశములకు పోవుచున్నవి. ఇదంతయును ననవాజస్థితి యైనను ప్రతీకారము మాత్రము మనకు తోఁచకున్నది. వ్యాపారమంతయును

పరదేశీయుల హస్తమునందు కలదు. విదేశవ్యాపారమున కవసరమైన పొగయోడలు నావికులు పరుల హస్తములందు గలరు. కాని మన హస్తములందు లేవు. ఈ విషమపరిస్థితులందు మనదేశసంపద లేరీతిని వృద్ధిని బొందగలవో ధీమంతులు నిర్ణయింపవలయును.

విదేశప్రవాసము

భారతీయులకు విదేశప్రవాసము దుర్భర మగుచున్న విధమును వలసరాజ్యముల వ్యవహారములు పరిస్ఫుటముచేయుచున్నవి. దక్షిణాఫ్రికాప్రాంతములు భారతీయుల సహాయమున నభివృద్ధిని బొందినవి. తూర్పు ఆఫ్రికాయందు భారతీయులు ప్రథమప్రవాసులు. ఫిజీ ద్వీపముల సంపదలను భారతీయులు వికసింపఁజేసిరి. కొలంబియా బ్రిటిషుగయానా మొదలగు దేశములందు భారతీయులు పాటుపడి దేశాభ్యుదయమునకు తోడ్పడిరి. విదేశములందు భారతీయులు పదిలక్షలమంది యుందురు. భారతీయులను బహిష్కరించుటకు వలసరాజ్యములన్నియును నేకముఖమున పనిచేయుచున్నవి. భారతీయులు విదేశములకు స్వయముగ వెడలలేదు. విదేశీయులు స్వలాభమునకై యాశలను బెట్టికొనిపోయి వారిని నిర్బంధములకు పాలుచేసిరి. భారతీయు లీ కష్టములనుండి గట్టెక్కి స్వతంత్రజీవనముచేయ సమకట్టినపుడు వారిని బహిష్కారముచేయ బ్రయత్నించుచున్నారు. కారణము భారతీయులు తెల్లవారిని జీవనసంరంభమునందు మ్రింగుదురని తెలుపుచున్నారు. తెల్లవారు నల్లవారి దేశముల నాక్రమించుకొనిరి. దేశవికాసమునకు తమకు తోడ్పడిన భారతీయులకు పౌరస్వత్వములను గాని సామాన్య మానవహక్కులనుగాని యొసఁగుటకు నిరాకరించుచున్నారు. తెల్లవారు నోటితో సామ్రాజ్యాభిమానమును బోధించుచు చేతితో భారతీయులను గెంటివేయుచున్నారు. తెల్లవారికి వలసరాజ్యములందు కొమ్ములు మొలచినవి. తెల్లవారు నిరభ్యంతరముగ భరతఖండమునందు వ్యాపారోద్యోగములను జేసి సకలస్వత్వములను బడయవచ్చును. భారతీయులు వారికిఁగల హక్కులను సయితము వదలుకొనవలయును. దక్షిణాఫ్రికానుండి మనసోదరులను స్వదేశమునకు పంపునటులు పంచాయతిసభ నిర్ణయించినటులు తెలియుచున్నది. మన ప్రభుత్వ ప్రతినిధి సర్ బెంజామిను రాబర్టుస నేమియును చేయజాలకుండెను. ఫిజీ దీవులందు చండశాసనమును ప్రయోగించి భారతీయులను హింసించి శిక్షించిరి. తూర్పు ఆఫ్రికాయందు భారతీయులను స్వత్వవిహీనులను జేయుచున్నారు. సామ్రాజ్యాధికారు లీ యన్యాయాచరణమును ప్రతిషేధింపకపోవుట సంతాపకరము. భారతీయుల ప్రవాసము నామోదించిన ఆండ్రూసుగా రిపుడు విముఖత్వమును జూపుచున్నారు. పరాధీనస్థితియందున్న భారతీయులు ప్రతిఘటించుటకు శక్తిలేకను పరితపించుచున్నారు. భారతీయులకు స్వతంత్రస్థితి కలిగినఁగాని వారు కొంత ప్రతీకారము నైనను జేసి యాత్మగౌరవమును గాపాడుకొనఁజాలరు. స్వార్థపరులు కలహబీజములను నాటి పరపీడనమునకు పూనుకొనుట సామ్రాజ్యక్షేమమునకును ప్రపంచశాంతికిని ప్రతికూలము. భారతీయులు వారి యాత్మగౌరవమును కాపాడుకొనుటకు వలస రాజ్యములందు యూరపియనులతో సమాన ప్రతిపత్తి గలిగియుండుట యవసరము. సమానప్రతిపత్తి స్వదేశమునందే యసాధ్యముగ నున్నపుడు విదేశములం దెటులు సాధ్యమొ దురూహ్యముగ నున్నది. ముప్పదిమూడుకోట్ల సంతానులను పోషించుచున్న భారతమాత మఱి పదిలక్షలమందిని పోషింపఁజాలకబోదు. అయినను భారతీయులు వారి జన్మస్వాతంత్ర్యమును సమర్థించుకొనుటకు విదేశప్రవాసస్వత్వమును సకలవ్యవహారములందు సమాన ప్రతిపత్తిని గలిగియుండవలయునని సామాన్యముగ దెలిసియున్నది. దారుణ సంగ్రామ మీ స్వల్పఫలమును గలుగజేయ జాలనపుడు మహాఫలమైన స్థిరశాంతి నొడగూర్చుట కేవలము మాయావాదముగ నున్నది.

విదేశరాజ్యాంగము

భరతఖండము బ్రిటిషు సామ్రాజ్యాంతర్భాగముగ నుండుటవలన కలుగఁగల లాభనష్టములను నిర్ణయించుటకు సమయము సంప్రాప్తమైనది. బ్రిటీషు సామ్రాజ్య ప్రతిభను గాపాడుటకు భారతీయులు సంగ్రామ సమయమునందు హాంగుకాంగునుండి హావరు వఱకును మోసూలునుండి నేటలువరకును ప్రవర్తితంబైన రణరంగములందు ప్రాణములను సమర్పించి విజయములను బడసిరి. బ్రిటీషు సామ్రాజ్యవ్యాపన మధికమైన కొలది భరతఖండభార మధిక మగుచుండును. మెసపొటేమియా పలస్తీను విజయములకు భారతీయులు కారకులు. అయినను భారతీయులకు వలసరాజ్యములందుఁగాని ధర్మకర్తృత్వము గల రాజ్యములందుఁ గాని

నిలువను నీడ లేదు. మెసపొటేమియానిర్వహణభారము కొంతవఱకు భారతీయులమీఁద పడునను వదంతి గలదు. మోసూలు బాగ్దాదులందుగల నూనెగనుల లాభమును పొందువా రాంగ్లేయులు. వెట్టికి పనిచేసెడివారు భారతీయులు. లాభమునుబొందెడి బ్రిటీషుప్రజలు మెసపొటేమియా భారమును వహింపవలయును. భారతీయులేవిధమైనభారమును బూనుటకు నిరాకరింపవలయును. బ్రిటీషు రాజ్యాధికారము గల ఆసియా ప్రదేశముల యందు ప్రమేయము గలిగినపుడెల్ల భారతీయసైనికులకు పని కలుగుచుండును. భారతీయులు పనుల నిర్వహించుటకు పనికివత్తురుగాని లాభమును బొందుటకు పనికిరారు. ఇంతవఱకును పశ్చిమోత్తరసీమాంతముల యందును పారశీకమునందును రుష్యా జర్మను రాజ్యనీతివలన కలిగిన భయభ్రాంతు లిపు డంతరించి నూతన పరిస్థితు లేర్పడినవి. బ్రిటీషు సామ్రాజ్యమును ప్రతిఘటించుచున్న ఖిలాఫాత్ సమస్య భరతఖండమును ప్రతిఘటించుట సంభవము. కాన్స్టాంటి నోపిలునుండి కాబూలువఱకును గల మహమ్మదీయప్రపంచమును ప్రతికూల మైన తురుష్క-సంధినియమములు ప్రతిఘటనమునకు పురికొల్పు చున్నవి. భరతఖండమునందు ప్రజలలో హిందూమహమ్మదీయ సమ్మేళనమును బాహ్యదేశములందు హిందూమహమ్మదీయ సైనిక సంరంభములును సంభవములు. బ్రిటీషు రాజనీతిజ్ఞులు మహమ్మదీయ సంరంభము నాఁపుట సామ్రాజ్యక్షేమమునకును భరతఖండశాంతికిని మూలసాధనము. సాహచర్యనిరాకరణోద్యమము పాదుకొనక పూర్వమే రాజనీతిజ్ఞులు ధర్మమార్గము నవలంబింపవలసి యుందురు.

గతసంవత్సరమందు నిరర్థకముగా నాఫ్గనిస్థానము రాజు అమురుల్లాఖాన్ యుద్ధమునకు దిగెను. అచిరకాలముననే అమురుల్లాఖాను ఓడిపోయి సంధిని చేసికొనెను సీమాంతప్రాంతవాసు లైన వజీరులు మాషుదులు మొదలగు జాతులతో యుద్ధము కలిగినది. వారు చాలమంది ఓడిపోయినను యుద్ధము లింకను ముగియ లేదు. ఈ యుపద్రవమును ఖిలాపాత్ సమస్య వృద్ధి జేయుచున్నది. ఇపుడు రుష్యా జర్మను సామ్రాజ్యములు భయభ్రాంతులకు గారణము గాకపోయినను నూతనపరిస్థితులు సైనిక వ్యయభారమును వృద్ధి జేయు చుండును. గతసంవత్సరము నందు సైన్యపోషణమునకై 55 కోట్ల రూప్యములు వ్యయముచేయఁ బడినవి. సైన్య వ్యయభారము క్రిందను దేశము క్రుంగిపోవు చున్న దని భారతీయులు పెట్టెడి మొరలు నిరర్థకములై వ్యయము మాత్రము నిరంతరాభ్యుదయమును బొందుచున్నది.

### ఆదాయవ్యయములు

యుద్ధము ప్రత్యక్షముగను పరోక్షముగను భరతఖండమునకు లాభములను గలిగింపకపోయినను వ్యయభారమునుమాత్రము వృద్ధిని జేసినది. హిందూదేశమునకు 1913 నందుఁగల 411 కోట్ల రూప్యముల ఋణపు మొత్తము 1919 సంవత్సరమునకు 568 కోట్ల రూప్యములకు పెరిఁగినది. యుద్ధమువలన 150 కోట్ల రూప్యముల ఋణము పెరిగనది. కష్టకాలమునందు సామ్రాజ్యమునకు సహాయమును జేయుట ప్రయోజనకరమైనను విజయమువలనను గ్రేటుబ్రిటను ఫ్రాన్సు ఇటలి కనడా దక్షిణాఫ్రికా మొదలగు దేశములు పొందినలాభములందు కీసపాలై నను భరతఖండము పొంద లేదు. ఋణమునందు విశేషభాగము స్వదేశమునందు సమకూడుట సంతృప్తికర మైనను ప్రతిఫలము లేని వ్యయమునకు 150 కోట్ల అప్పు పెరుఁగుట దేశాభ్యుదయమునకు ప్రయోజనకరము కాదు. ఈ యప్పు సంవత్సరమునకు 9 కోట్ల రూప్యముల వడ్డీని పెంచుచున్నది. మీఁదు మిక్కిలి భారతీయులను వలసరాజ్యములనుండి వెడలఁగొట్టుటకు ప్రబలప్రయత్నములు జరుగు చున్నవి. రాజ్యాదాయము 1913-14 నందు 84262000 సవరనులనుండి 1919-20 నందు 123190800 సవరనులకు పెరిఁగినది. ఆదాయము పెరుఁగుటకు ఉప్పుపన్ను, వృత్తిపన్ను, ఆదాయపుపన్ను, శుల్కములు వృద్ధిచేయఁబడినవి. శుల్కములవృద్ధి సహజ మైనను ఉప్పుపన్ను, ముఖ్యముగ ఆదాయపుపన్ను ప్రజాపీడనమునకు కారణమగుచున్నది. ఉప్పుపన్నును తీసివేయుటయును జనపనార దూదిమెగుమతులమీఁదను శుల్కములను వేయుటయును సన్ననూలుమీఁదను శుల్కము నభివృద్ధిచేయుటయును సమంజసముగా నుండును. ఆదాయమునందు మద్యాదాయము ఆఱేండ్లలో 80 లక్షల సవరనులనుండి 120 లక్షల సవరనులకు పెరుఁగుట ధర్మప్రవృత్తికి ప్రతికూలముగ నున్నది. వ్యయము 1913-14 నందు 83672000 నుండి 1919 నందు 122322700 సవరనులకు పెరిగినది. అధికవ్యయమునందు సైనికశాఖకు 150 లక్షల సవరనుల వ్యయ మధికమైనది. గతసంవత్స

రమునందు పౌరసేవ్యోద్యోగస్థులకు వేతనము లధికముగ వృద్ధి చేయఁబడినవి.

మారకము

బ్రిటీషు సామ్రాజ్య సన్నిహిత సంబంధము భరతఖండార్థికస్థితిని తారుమారు చేయుచున్నది. ఈ సంబంధ మార్థికస్థితిని బాగుచేసినదియును పాడుచేసినదియును భావికాలమునం దార్థిక శాస్త్రజ్ఞులును నిర్ణయింపఁగలరు. యూరోపియనులు దేశసౌభాగ్యమును బాగుచేసినదనియును భారతీయులు పాడుచేసినదనియును ప్రతిపాదించుచున్నారు. ఆర్థికవిపర్యాసమునకు మూలకారణము బంగారు, వెండి మారకముల సంయోగము వలన గలుగుచున్నది. లోకమునం దంతటను ముఖ్యముగ బ్రిటీషు సామ్రాజ్యమునందు బంగారు నాణ్యములు వాడుకయం దుండుటయును భరతఖండమునందు వెండినాణెములు వాడుకయం దుండుటయును విపరీత పరిస్థితులను గలిగించుచున్నవి. ఈ పరిస్థితుల పరిణామ మార్థికనిర్ణయములయందు గోచర మగుచున్నది. భరతఖండమున చెలామణియందు బంగారు, వెండి నాణెములు గలవని సిద్ధాంతమునందు కలదు గాని వాడుకయందు లేవు. వెండినాణెములకును, బంగారు నాణెములకును గల మారకము ధర బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజనముల ననుసరించి నిర్ణయింపఁబడుచున్నది గాని భారతదేశీయ ప్రయోజనముల ననుసరించి నిర్ణయింపఁబడుట లేదు. యుద్ధసమయమునందు కోశాధికారు లవలంబించిన యార్థికతంత్రము విపరీతపరిస్థితులను వృద్ధిచేసినది. వెండి బంగారు మారకపుధరలను మించిన వెలలకు భరతఖండమునందు కౌన్సిలు బిల్లులను విక్రయించుటవలన నపారమైన నష్టము దేశమునకు కలిగినది. ఆంగ్లేయవర్తకు లందఱును ఈ యేర్పాటు వలన నపారమైన లాభము గడించిరి. ధనాగారములందు నిలువ యుండవలసినద్రవ్య మంతయు గ్రేటుబ్రిటనుకు తక్కువ మారకమునకు చేరుటయును తిరిగి యెక్కువ మారకమునకు స్వదేశమునకు చేరుటయును సంభవించినది. ఇపుడు వెండిధర ప్రతిదినమును తగ్గిపోవుచున్నది. స్మిత్తు పంచాయతి సంఘము రూపాయికిని నవరసులకును నిర్ణయించిన రెండుషిల్లింగుల మారకపుధర తగ్గిపోవుచున్నది. ఈమార్పు లార్థిక పరిస్థితులందు కల్లోలమును గలిగించుట సంభవము. యుద్ధకాలమునందు ప్రభుత్వమువా రవలంబించిన బంగారపు దిగుమతుల ప్రతిషేధకము ప్రజలకు నష్టమును గలుగఁజేసినది. ప్రజలకు బంగారముమీఁదగల మక్కువకు మందు బంగారమును విచ్చలవిడిగ నందఁజేయుటగాని దానిని ప్రతిషేధించుట గాదు. ఆర్థికవ్యవహారములను నిర్ణయించుట కెన్నియో పంచాయతిసభ లేర్పడినవి. ప్రయోజన మేమియును గలుగలేదు. ఏదేశమునందును లేని కృత్రిమమైన యార్థికనిర్మాణము భరతఖండమునందు వర్ధిల్లజాలదు. భరతఖండమున కీదురవస్థ యార్థికస్వాతంత్ర్యము గలిగినపుడె తొలఁగఁగలదు. ఆర్థికస్వాతంత్ర్యమునకు వలసరాజ్యములందు గల స్వరాజ్యస్థాపనము శరణ్యము.

ఇంతవరకు గల సామ్రాజ్యప్రభుత్వవిధాన మీయేఁటితో నంతమునొందును. నూతనసంవత్సరారంభమునందు నూతనశాసనసభను శ్రీ యువరాజ స్వయముగ నుపక్రమణము చేయఁగలరు. సామ్రాజ్య పరిపాలనమునందు రాజ్యాంగశాసన మేవిధమైన బాధ్యతను కలుగఁజేయలేదని భారతీయు లేకగ్రీవముగ ఘోషించుచున్నారు. భారతప్రభుత్వము పూర్వమువలె నిరంకుశాధికారమునం దుండును. రాజ్యాంగమునం దన్నిశాఖలును నభివృద్ధిని గోరుచున్నవి. విద్య పరిశ్రమలు పారిశుద్ధ్యము వైద్యము వాణిజ్యము వ్యవసాయము వికాసము నభిలషించుచున్నవి. ఈ వికాసము భారతీయులమూలముననే సాధ్యము కాఁగలదు. నిరంకుశాధికారసర్వజ్ఞత్వము వికాసమునకు ప్రతికూలముగాని యనుకూలము గాదు. భారత ప్రభుత్వమునం దధికారమును బడసి బాధ్యతాయుతపాలనము స్థాపితమగుటకు భారతీయులు నిరంతరము పాటుపడవలసియుందురు.

చెన్నరాష్ట్రము

భరతఖండమునందుఁ గల పదునాలుగురాష్ట్రములందును బర్మారాష్ట్రము గాకను చెన్నరాష్ట్రము విస్తీర్ణమునందు 141726 చదరపుమైళ్లవైశాల్యమును గలిగి రెండవదిగను జనబాహుళ్యమునందు 4,14,05,404 జనులను గలిగి మూఁడవదిగను నున్నది. ఈ రాష్ట్రమును భారత ప్రభుత్వదృష్టి ద్రవ్యోత్పన్నమున కాకర్షించుచున్నది గాని యితరవిషయములం దాకర్షించుట లేదని వ్యవహారచరిత్రము నిర్ణయించుచున్నది. మాఱుమూల రాష్ట్ర మనునామము సార్థకపడుచున్నది. భారత ప్రభుత్వాంశమునం దున్నతోద్యోగముల నిచ్చుటయందును

దేశావసరములకు వలయు నీటిసదుపాయములను రైలుమార్గములను పరిశ్రమలను నిర్మించుటయందును ప్రతిపత్తిని గలిగించుటయందును చెన్నరాష్ట్రమునకు భారత ప్రభుత్వము నిరాదరణమును జూపుచున్నది. భారత ప్రభుత్వమునకు రాష్ట్రీయ ద్రవ్యదానభాగ నిర్ణయమునందు మెస్టను ప్రభువు చేసిన తీర్మాన మీసిద్ధాంతమునకు నిదర్శనము. భాగ్యవంతములైన బొంబయి వంగ సంయుక్తరాష్ట్రములకు 56,63,240 లక్షలరూప్యములను దానభాగము నిర్ణయించుటయును బీదదైన చెన్నరాష్ట్రమునకు 348 లక్షల రూప్యములను నిర్ణయించుటయును పరమాన్యాయ మని పరిగణింపఁబడుచున్నది. ఈయన్యాయము రాష్ట్రీయ స్వపరిపాలనావసరమును నిర్దేశించుచున్నది. చెన్నరాష్ట్రవ్యవహారముల నవలోకించినవారల కారాష్ట్రవికాసమునకు వలయు ద్రవ్యావసరము వ్యక్తమగుచున్నది.

చెన్నరాష్ట్రవాసులందు 100-కి 68 మందికి వ్యవసాయము జీవనాధారము. అందు 100-కి 49 మంది భూస్వాములుగను రయితులుగను నున్నారు. ఈ రాష్ట్రమునందు గల 9,10,49,628 యకరములందును 1917-18 సంవత్సరమునందు 3,88,21,332 సాగైనది. ఇందు 48,00,000 యకరములందు రెండుపంటలు పండుచున్నవి. సాగుబడికిఁ దగినభూమి 2,00,00,000 యకరములు గలవు. అందు వరిపంట 1,16,55,302; పప్పులు కాయధాన్యములు 1,79,73,042; నూనెగింజలు 29,32,169; ప్రత్తి 27,00,487; చెఱకు 2,19,050 యకరములందు పండుచున్నవి. చెన్నరాష్ట్రపు పంటలకు కృష్ణా కావేరీ గోదావరుల నీటికాలువలు, పెరియారు, ఋషికుల్య, నాగవల్లి, తుంగభద్రల నీటికాలువలు పెద్ద తటాకములును నాధారములు. మెరకపంటలకు వర్షము బావులు ఆధారము. వానలు చెడినపుడు పంటలు చెడి కఱవేర్పడుచున్నది. చెఱువులను బాగుచేయుటకును కృష్ణా జలాశయమును తుంగభద్రా జలాశయమును నిర్మించుటకును బావులకును నేర్పాటులను జేసిన 2,00,00,000 య॥ సాగునకువచ్చి ప్రజలకు యోగక్షేమములు గలుగగలవు. ప్రపంచమునంతను దుర్భిక్ష మావరించిన సమయమునం దీ యవసరమును సమర్థించుట యనవసరము. కృష్ణాగోదావరి కావేరి డెల్టాలు ప్రభుత్వమున కనేకరెట్ల ప్రతిఫలమును గలుగజేయుచున్నవి. సర్ ఆర్తరు కాటను రయితుల కన్నదానము చేసి శాశ్వతమైన ప్రతిష్ఠను గడించెను. చెన్నరాష్ట్రమునందు నీటిసదుపాయములకు వ్యయముచేసిన 1114 లక్షలకును ప్రతియేటను 2466 లక్షల రూప్యముల పంటలు పండుచున్నవి. వ్యయముచేసిన మూలధనమునకు పదిరెట్లలాభము ప్రభుత్వమునకు గలిగినది. మూలధనముమీదను 100 కి 10 వంతున వడ్డీ గిట్టుచున్నది. కర్జను ప్రభువు 1901 వ సంవత్సరమునందు నియమించిన జలాధారపరిశోధకసంఘము కృష్ణా తుంగభద్రా జలాశయముల నిర్మాణమును నామోదించినది ముప్పదేండ్లనుండియును నెవరెంత ఘోషించినను నీ నిర్మాణములను భారతప్రభుత్వము తలపెట్టలేదు. మద్రాసు ప్రతినిధు లీ విషయమును హెచ్చరించినపుడు ద్రవ్యము లేదను మామూలుపాటను పాడుటయాచారమైనది. ఈకాలమునందె పంజాబు నందలి నీటివసతులకు 2000 లక్షల రూప్యములు వ్యయముచేయబడినవి. పంజాబునకు నీటివసతులవలన కలిగిన లాభమున కందఱు సంతసించుచున్నారు. చెన్నరాష్ట్రమేమి పాపము చేసికొనిన దను ప్రశ్నకుమాత్రము సమాధానముకలుగదు. భారతదేశ ద్వారపాలకులైన పంజాబు ప్రజలకు జీవనసదుపాయములను గల్పించుట ధర్మము. ఇది కేవలము రాజనీతి గాకను నార్థికనీతియును నై యున్నది. కాని చెన్నరాజ్యమును మఱచుటమాత్రము భారతప్రభుత్వనిరాదరణమునకు నిదర్శనము.

నీటిసిస్తు సగటున యకరమునకు 3-8-0, వసూలగుచున్నను చెన్నరాష్ట్రమునందు యకరమునకు 4-8-0 వసూలగుచున్నది. గతసంవత్సరమునందు చెన్నరాష్ట్రప్రభుత్వము నీటితీరువను యకరమునకు 1-5-0 చొప్పున హెచ్చుచేయఁ దలపెట్టినది. ఇది ఇటులుండగ రెట్టింపు మూడురెట్లు నాలుగురెట్లు తీరువ కట్టి రయితులను వేధించుట కాద్యంతములు లేవు. ఈవిధమున వసూలు చేసిన ద్రవ్యము భారతప్రభుత్వమునకు సమర్పింపఁబడుచున్నది. నీటితరము చెన్నరాష్ట్రమునం దధికముగ నున్న దని విమర్శకులకు విశదము. మదరాసు ప్రభుత్వమునకు భారతప్రభుత్వపు దానభాగము తగ్గిన నీటితరమును తగ్గించుటకును ప్రజాక్షేమమున కవసరమైన నీటి సదుపాయములను గల్పించుటకును సాధనములు కలుగఁగలవు.

ఈరాష్ట్రమునందు వ్యవసాయస్థితి యిటులుండగ పరిశ్రమలస్థితిని విమర్శించుట యె యనవసరము. చెన్నరాష్ట్రమునందు 468 ఆవిరియంత్రాలయములు గలవు.

అందు దూదికి సంబంధించినవి 179 గలవు. దేశము నందు దూదిపంట విశేషముగ నున్నను నూలుబట్టల యంత్రాలయములు 19 నారయంత్రములు 3 మాత్రము గలవు. శేషించిన యంత్రాలయములందు వడ్లమరలు చాల గలవు. చర్మయంత్రాలయములు నాలుగైదు గలవు. పారిశ్రామిక శాఖవారు చేసినయుపకారములందు పెన్సిలు యంత్రాలయము సబ్బుయంత్రాలయము గణనీయములు. చెన్నరాష్ట్రదారిద్ర్యమునకీ యంత్రాలయములు నిదర్శనములు. వ్యవసాయము ప్రధానవృత్తిగ గల చెన్నరాష్ట్రమునందు నాలుగైదు ముఖ్యపరిశ్రములను వృద్ధి చేయుట కవకాశములు గలవు. 1 నేతపరిశ్రమ. ఇయ్యది యంత్రముల మూలముననుం చేతిమగ్గముల మూలముననుం జేయఁదగియున్నది. చేతిమగ్గములను వ్యాపింపఁజేయుటకై పరిశ్రామిక శాఖ కొంతపని చేసినది. దత్తమండలములు గంజామునందుచూపిన ప్రయోగములవలన విశేషమైన ప్రయోజనము గలిగినటులు గనిపించదు. గాంధిమహాత్ముఁడు బోధించినటులు నూలునువడికి బట్టలను నేయుట కేర్పాటునుజేయుట ప్రజాక్షేమమునకు మొదటిసాధనము. 2. నూనెపరిశ్రమము. నూనెగింజలు కొబ్బరి పండెడిదేశమునందు నూనెపరిశ్రమను నుపపరిశ్రములను నెలకొలుపుట కవకాశములు గలవు. టాటా కంపెనీవారు పడమటితీరమునందు గొప్ప యంత్రాలయమును స్థాపించుచున్నారు. తూర్పుతీరమునందునుం స్థాపించుట కవకాశములు గలవు. ఈ యంత్రాలయములందు పశువుల కాహారములను చేల కెరువును సిద్ధముచేయుట కవకాశములు మెండుగ గలవు. 3 చర్మముల పరిశ్రమ. యుద్ధకాలమునందు తోళ్లవర్తకులు పొందిన లాభము చర్మపరిశ్రమ ప్రయోజనమునకు నిదర్శనము. 4 వ్యవసాయపరిశ్రమ. ఇతరపరిశ్రమల మూలముననుం వ్యవసాయపరిశ్రమము నభివృద్ధి చేయవలయును. గతసంవత్సరమునందు వ్యవసాయశాఖ చేసిన 8 లక్షల రూప్యములకు తగిన ప్రతిఫలము కలుగలేదు. కోయంబత్తూరు వ్యవసాయ కళాశాల వ్యవసాయాభివృద్ధికి చేయుచున్న యుపకృతి యతిస్వల్పము. వ్యవసాయకళాపరిజ్ఞానము సహజము గల రయితులకు సహాయము పరపతి గలిగినపుడు వ్యవసాయమువలన రయితులు ప్రజలు లాభమును పొందఁగలరు. గతసంవత్సరమునందు దూదిపయిరును 8,61,121 యకరములందధికముగ పండించుట దేశక్షేమమునకు శుభసూచకము గాదు. ఇది విదేశీయులలాభమున కనుకూలము గాని స్వదేశక్షేమమునకు ప్రయోజనకరము గాదు.

విద్యాప్రవృత్తి

విద్యాప్రవృత్తి దేశావసరముల కనురూపముగ నభివృద్ధిని బొందుటలేదని విషయవిమర్శనము విదితము చేయుచున్నది. 1918-19 యందు కళాశాలలలో 7972 మధ్యమపాఠశాలలందు 143277 ప్రథమపాఠశాలలందు 12,49,925 బాలురు విద్య నభ్యసించుచుండిరి. బాలుర సంఖ్య 347,122 మందికి పెరిగినది. పంచములను సహాయమును పొందినపాఠశాలలందు చేర్చుకొనవలయు నని యుత్తరువు చేయఁబడినది. పంచములకు ప్రత్యేకము 6185 పాఠశాలలు గలవు. ఏతత్సంవత్సరమునందు 248 లక్షలు అనఁగా లోగడియేఁటికంటె 22 లక్షలధికముగ వ్యయము చేయఁబడినవి. ఈవ్యయమునందు 100-కి 53 రాజ్యదాయమునుండియును 47 ప్రజలనుండియును వచ్చినది. ఈయంకె లెటులున్నను విద్యార్థు లధికముగ తప్పిపోవుటయును సాంకేతికవిద్యాశిక్షణమునకు సాధనములు లేకపోవుటయును విద్యాప్రవృత్తియందలి దౌర్బల్యమును బోధించుచున్నవి. ప్రథమతరగతియందు 100 మంది విద్య నారంభించిన, స్కూలుఫైనలుకు 50 మంది తేలుదురు. స్కూలుఫయినలునందు 12 మందియును ఇంటర్మీడియేటునందు ముగ్గురును బి. ఏ. యందొకరును కృతార్థులగుదురు. నూఱుమందియందొకరు మాత్రము విద్యాపాండిత్యమున కర్హుఁడై శేషించినవా రర్హులు కానపుడు విద్యాప్రవృత్తి యంతయును నిజప్రయోజనమునకు విఘాతమును గలుగఁజేయుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ యేఁడు ప్రకటితములైన ఇంటర్మీడియేటు, బి. ఏ. పరీక్షల ఫలితము లీయర్థమును ప్రతిపాదించుచున్నవి. సాహిత్యవిద్యాస్థితి ఇటులుండగ లేని వృత్తివిద్యలను జర్చించుట నిరుపయోగము. విద్యాశాఖానిర్వాహకుల యందు దక్షత్వాభిమానము పోయి యుపయోగాభిమానము ప్రబలినఁగాని విద్యాప్రవృత్తివలన దేశమునకు కలుగఁగల ప్రయోజనము కలుగఁజాలదు.

ఆరోగ్యము

ప్రజారోగ్యము 1918-19 సంవత్సరమునందు మిక్కిలి చెడిపోయినది. అకాలమునందు 17,22,000 మరణములు 11,56,204 జననములు గలిగినవి. జననములకంటె మరణము లాఱులక్షలు హెచ్చినపుడు దేశస్థితిని

వర్ణించుట యనవసరము. మరణములకు విషజ్వరము విశూచిమశూచి జ్వరములు గారణములు. వైద్యసహాయమునకు 721 వైద్యాలయములందు 35 లక్షల రూప్యములు వ్యయము చేయఁబడి 75,43,205 రోగులకు వైద్యసహాయము చేయఁబడినది. రోగికి మందునకు 0-5-8, భోజనమునకు 0-3-8 సగుటున వ్యయమైనది. చెన్నపురి వైద్యకళాశాలయందు 473 మందియును రాయపురము తంజావూరు విశాఖపట్టణము కాలికట్టు వైద్యశాలలందు 820 మందియును విద్య నభ్యసించుచున్నారు. విద్యార్థులందు సగముమంది మాత్రము పరీక్షలందు కృతార్థులగుచున్నారు. వైద్యసహాయము ప్రజలకు సులభముగ లభించుటకు విశేషముగ వైద్యాలయములు వైద్యులు గావలసియుందురు. కాని ఇందులకు తగినప్రయత్నములను ప్రభుత్వము విపులముగ చేయుటలేదు. ఆయుర్వేదము సులభముగను చవుకగను వైద్యసహాయమును సమకూర్పఁగలిగినను దానియందింకను నాంగ్లాభిమానులకు విశ్వాసకనికరములు గలుగుటలేదు. దేశము దినదినము రోగభూయిష్ఠమయి మరణము లభివృద్ధిని బొందుచున్న సమయమునందు ప్రభుత్వము వైద్యసహాయము ప్రజలకు సులభసాధ్య మగుటకు మంచిప్రయత్నములను జేయుట పరమావసరంబగుచున్నది.

### పరపతిసంఘములు

చెన్నరాష్ట్రమునందు వ్యవసాయము ప్రధానవృత్తిగ నున్నది. ప్రజలందు 100-కి 70 మంది ఋణగ్రస్తులై ఋణదాతలకు దాసులై దుఃఖముల ననుభవించుచున్నారు. రయితులకు పరపతిలేదు. షాహుకారులు విపరీతమైన వడ్డినిగట్టుచు ఋణమును పెంచుచుందురు. దరిద్రగ్రస్తులైన రయితులు కిస్తీలను చెల్లించుటకును వాయిదాల నిచ్చుటకును పంటలను చవుకగ నమ్ముటయును తిరిగి ప్రియముగ భుక్తికిగొనుటయును సంప్రాప్తమగుచున్నది. పరపతిసంఘములు రయితుల దురవస్థను దొలఁగించుటకు సాధనభూతములుగాఁ గలవను విశ్వాస మధికారులకు కలదు. కాని పరపతిసంఘములస్థితిని విమర్శించినపుడు రయితులకు విశేషమైన ప్రయోజనము గలుగలేదని విదితమగుచున్నది. గతసంవత్సరమునందు 3573 సంఘములు గలవు. అందు 2,44,297 సభ్యులు గలరు. సంఘముల మూలధనము 34 లక్షలు వ్యవహారధనము 305 లక్షలు. కేంద్రసంఘముల పెట్టుబడి 101 లక్షలు. నికరమైన లాభము 3,58,000 రూప్యములు. ప్రభుత్వమునకు పరపతిశాఖకు వ్యయము 2,26,000 రూప్యములు. ధనమునందును సభ్యత్వమునందును వ్యవహారములందును నభివృద్ధి గలదు. రాష్ట్రీయధనాగారమును నుపయోగకరముగఁ జేయుటకు పరపతి సభాసమావేశములందు విచారణలు జరిగినవి. సామాన్యముగ నన్నిమండలములందును మండలసంఘములు స్థాపింపఁబడినవి. మండలసంఘములకు గ్రామసంఘము లనుబంధముగ నేర్పడినవి. అన్ని మండలసంఘముల మూలధనము 14 లక్షలు మాత్రము గలదు. ఈ మండలసంఘములందుం డిపాజిటులు 84 లక్షలకు పెరుఁగుట భావి శుభోదయమునం దాశను గలిగించుచున్నది. సంఘములందు విశేషభాగము వ్యవసాయదారుల కప్పులనిచ్చుట కేర్పడిన పరపతిసంఘములు. ఆ సంఘములందు గతసంవత్సరమునందు 1320 సంఘములకు మూలధన మేమియు లేకుండుట రయితుల దరిద్రస్థితికి నిదర్శనము. రయితులను బాగుచేయుటకు సొమ్మును పెట్టుబడి పెట్టుటయే కాకను వారిపంటలను మంచిధరల కమ్ముటకును వారికి వలయువస్తువులను చవుకధరలకు సమకూర్చుటయును నవసర మని ఈ యుద్యమాభిమానులు ఘోషించుచున్నారు. గతసంవత్సరమునందిట్టి సంఘములు 89 కలవు. చెన్నరాష్ట్రమునందుఁ గల జనసంఖ్యను గ్రామసంఖ్యను గమనించినపుడీ యభివృద్ధి బహుస్వల్పమని విశదమగుచున్నది. సహకారోద్యమవ్యాపనమునకు ప్రజలును ప్రభుత్వమును విశ్వప్రయత్నములను జేయవలయును. ప్రజలు వారిద్రవ్యమును నగలకు ధారపోసి అప్పులను జేసెడి మార్గమును వదలి ధనమును సంఘములందు నిలువచేసెడి మార్గములను నేర్చుకొనవలయును. భరతఖండమునందు 1913-18 సంవత్సరములందు 1?70 లక్షల నవరనుల బంగారమును కోట్లరూప్యముల వెండియును వస్తువులకు వినియోగింపఁబడినవి. ఈ సొమ్మునందు కొంతయైనను నుత్పన్నమునకై వినియోగించుట కేర్పాటులు చేయుట శుభస్థితికి మూలసాధనము. ప్రభుత్వము తక్కువవడ్డికి రయితుల యవసరములకు వలయు ద్రవ్యమునంతయును మండల ధనాగారములకు సమకూర్పవలయును. యుద్ధసమయమునం దీ వ్యవహారము కష్టసాధ్యమైనను నిపుడు సులభసాధ్యము కాఁగలదు. విద్యావంతు లీవిషయమునందు ప్రజలకు మార్గదర్శకులు గావలసి యుందురు

The Third Andhra Ayurvedic Conference.



తృతీయాంధ్రాయుర్వేదసమ్మేళనము



Rao Sahib Pulamati Adimurti Rao Garu

రావుసాహేబు పులమతి ఆదిమూర్తిరావు గారు



Hatti Siva Rao Garu

హట్టి శివరావు గారు



Hatti Sankara Rao Garu

హట్టి శంకరరావు గారు



Hatti Ramachandra Rao Garu

హట్టి రామచంద్రరావు గారు.

### ఆదాయవ్యయములు

చెన్న రాష్ట్రాదాయము క్రమాభివృద్ధిని బొందు చున్నది. 1919-20 సంవత్సరాదాయము 969, వ్యయము 978 లక్షలు. ఆదాయము మదింపునకు 83, వ్యయము 12 లక్షలు పెరిగినది. 1920-21 సంవత్సరమున కాదా యము 1089, వ్యయము 998 లక్షలు అని మదింపు వేయఁబడినది. ఈయంచనాలు మామూలుగ తప్పిపోవు చున్నవి. ఆదాయమును తక్కువచూపుటయును వ్యయ మును నధికము చూపుటయును నాచారము. ఈయేఁడును నీమార్గ మవలంబింపఁ బడిన దని రాఁగల సంవత్సరపు లెక్కలు విదితము చేయఁగలవు. గతసంవత్సరాదాయ వ్యయ ప్రధానశీర్షికలు

1919-1920 సం॥ రపు—ఆదాయము

| | |
|---|---|
| భూమిసిస్తు ... ... ... | 359.00 |
| స్టాంపులు ... ... ... | 95.00 |
| అబ్కారి ... ... ... | 266.80 |
| ఆదాయపు పన్ను ... ... ... | 57.50 |
| అడవులు ... ... ... | 61.00 |
| రిజిస్ట్రేషను ... ... ... | 33.00 |
| ఇతర బాబతులు ... ... ... | 76.01 |
| మొత్తము ... | 948.31 |

1919-1920 సం॥ రపు—వ్యయము

| | |
|---|---|
| భూమిసిస్తు ... ... ... | 136.28 |
| అడవులు ... ... ... | 36.05 |
| పరిపాలనము ... ... ... | 19.32 |
| కోర్టులు ... ... ... | 99.08 |
| పోలీసు ... ... ... | 141.26 |
| విద్యాశిక్షణము ... ... ... | 128.56 |
| వైద్యము ... ... ... | 85.05 |
| పారిశుద్ధ్యము ... ... ... | 28.19 |
| వ్యవసాయము ... ... ... | 19.12 |
| పరిశ్రమలు ... ... ... | 19.20 |
| ఇతరములు ... ... ... | 7.47 |
| షా మోపహారములు ... ... ... | 9.64 |
| దేశోపయోగకార్యములు ... ... | 87.89 |
| " ... ... ... | 74.65 |
| ఇతరములు ... ... ... | 192.57 |
| మొత్తము ... | 978.73 |

ఆదాయమునం దన్ని శాఖలయందును నభివృద్ధి ప్రతియేఁటను గలుగుచున్నది. భూమిసిస్తు ప్రతియేఁటను 10 లక్షలు పెరుఁగుచున్నది. స్టాంపులు అబ్కారి రివిన్యు పెరుఁగుచున్నవి. అబ్కారి ప్రతియేఁటను 20 లక్షలు పెరుఁగుచున్నది. మద్యాదాయము 1920-21 యందు 300 లక్షలు రావచ్చును. మద్యాదాయాభివృద్ధి పర మానర్థములకు కారణం బగుచున్నది. అమెరికాయందు మద్యవిక్రయమునకు నిషేధములు జరుగుచుండఁగ సప్త మహావ్యసనములం దొక మహావ్యసనముగ బరిగణింప బడిన మద్యపానమునకు మనదేశమున నిషేధప్రక్రి యలు గల్పింపఁబడకపోవుట సంతాపకరము. మద్యా దాయమును రాష్ట్రాదాయముగ మార్చుటయును ప్రజాధీనము చేయుటయును నూతనపరిపాలనమునందు సంప్రాప్తము గానున్నది. ఈ విషయమునందు భారత మంత్రులు ధర్మమార్గము నవలంబింపవలసి యుందురు. గతసంవత్సరమునందు విద్యాశిక్షణమునకు 123, పోలీ సునకు 141 లక్షలు వ్యయము చేయఁబడినవి. విద్యా వ్యయమునందు సగము జనులవలన ముజరా వచ్చు చున్నది. పోలీసు శాఖావ్యయ మీవిధముగ పెరుఁగుట యసంగతమని పరిశోధకులు మొఱలిడుచున్నారు. చెన్న రాష్ట్రపు దొరతన మవలంబించిన లోభప్రవృత్తి యాత్మ విఘాతమునకు కారణంబైన దని మెస్టను ప్రభువు నిర్ణ యించిన భాగదానము విశదము చేయుచున్నది. ఈ రాష్ట్రప్రభుత్వ ముదారస్వభావముతో దేశాదాయ మును దేశావసరములకును నుద్యోగుల వేతనాభివృద్ధి కిని వినియోగించియుండిన మెస్టను ప్రభువు దానభాగ నిర్ణయమున కవకాశ ముండియుండదు. ఇతరరాష్ట్ర ములవలె నీ రాష్ట్రమును నుచితభాగము నియ్యవలసి యుండును. మద్రాసు 350, బొంబయి 55, వంగదేశము 65, సంయుక్తరాష్ట్రము 245, పాంచాలము 180, బర్మా 65, మధ్యరాష్ట్రములు 20, అస్సాము 15, భారత ప్రభుత్వమునకు సమర్పింపవలయునని మెస్టను సంఘము నిర్ణయించినది. ఏడవ యేఁట నైనను మద్రాసుభాగము 170, బొంబయిభాగము 130, బంగాళా భాగము 190 లక్షలు నిర్ణయింపఁబడినది. ఈ యసంబద్ధ నిర్ణయమునకు చెన్న రాష్ట్రపాలకులె బాధ్యులు. ఇపుడు చేయుచున్న యాందోళనమువలన ప్రయోజనము గలుగు నని నమ్ముట కవకాశములు లేవు. 1921-వ సంవత్సరము నందు చెన్న రాష్ట్రమునకు నిలువ 44, బొంబాయికి 389, బంగాళమునకు 343 సంయుక్తరాష్ట్రములకు 76 లక్షలని నిర్ణయింపబడినపు డేపద్ధతిని చెన్న రాష్ట్రమునకు 348 లక్షల దాన భాగమును నిర్ణయించినదియును గోచర మగుట లేదు.

రాష్ట్రీయశాసనసభ

శ్రీ విల్లింగ్డను ప్రభువు గతసంవత్సరమునందు గవర్నరుపనికిఁ బూనుకొనిరి. గత సంవత్సరమునం దామోదితములైన శాసనములందు చెన్నపురి కార్పొరేషను శాసనము గ్రామపంచాయతిశాసనము చెన్నరాష్ట్రపు మ్యునిసిపలు శాసనము ప్రముఖములు. ఈ శాసనములు కొంత యభివృద్ధిని జూపుచున్నను వర్తమానపరిస్థితుల కవసరమైన యభివృద్ధిమార్గమును గనఁబఱచుట లేదు. గతసంవత్సరమునం దాగస్టునందు నూతననిర్మితమైన శాసనసభ గూడినది. అందు రాజాగారు పంచముల ప్రతినిధిగను అరుమైనాథంపిళ్లగారు క్రైస్తవ ప్రతినిధిగను నియమింపఁబడిరి. శాసనసభ యందు పూర్వము గల సంయోగబలము లేదు. ఎవరి ఇష్టానుసారముగ వారు వాదములకుఁ బూనుకొనిరి. పూర్వముగల అధికారానధికారకక్షలు బలరహితములైనవి. అనధికారకక్ష శాఖోపశాఖలుగ చీలిపోయి అధికారకక్ష నెదుర్కొనుటకు సమర్థతను పొందకున్నది. ఇదంతయును భావికాల శాసనసభల వ్యవహారములకు నిదర్శనముగ నున్నది. ప్రథమసమావేశమునందు శాసనసభయందు ప్రసంగము లాంగ్ల భాషయందు జరుగవలయునను నిర్ణయము నధికారులు చేసిరి.

శ్రీ విల్లింగ్డను ప్రభువు కార్యనిర్వాహణమునం దత్యంతసామర్థ్యమును జూపుచున్న విధమును రాజ్యవ్యవహారములు వ్యక్తము చేయుచున్నవి. గవర్నరుగారు సామాన్యముగ నాహుతులైన ప్రదేశములకు పోయి సానుభూతిని దెలుపుచున్నారు. కాని యధికారాధిమానము పూర్తిగ కలదని వ్యవహారములు విశదము చేయుచున్నవి. క్రొత్తశాసనసభ లనతికాలమున రానున్నవి. బాధ్యతాయుతపాలనమున కవి సోపానము లని యధికారులు ప్రతివదించుచున్నారు. గవర్నరు సభాధ్యక్షుడుగ నుండుట స్వతంత్రస్థితికి ప్రతిబంధకము. రాఁగల సంవత్సరమునం దంతయును భగవదనుగ్రహము వలన నూతనాకారమును దాల్చునుగాత!

ఆంధ్రదేశము

భారతప్రభుత్వము చెన్నరాష్ట్రమువల్ల చూపెడి నిరాదరణస్వభావమునే చెన్నరాష్ట్రప్రభుత్వ మాంధ్రులపట్లఁ జూపుచున్నది. చెన్నపురియం దేయుద్యోగకార్యాలయమును జూచినను నీ విషయము బోధపడుచున్నది. సెక్రటేరియటునందును రివిన్యూబోర్డునందును హైకోర్టునందును డైరెక్టరుల కార్యాలయములందును నాంధ్రుల జాడ గనఁబడదు. కారణము ప్రభుత్వపుదృష్టి మద్రాసుమీఁదను దక్షిణదేశముమీఁదను ప్రసరించును గాని యుత్తరదేశముమీఁదను ప్రసరింపదు. విద్యాలయములు వైద్యాలయములు జలాశయములు రైలుమార్గములు యంత్రాలయములు దక్షిణమండలములందువలె నుత్తరమండలములందు స్థాపితము లగుట లేదు. ఈ విషయగణనమును గా. బయ్యా నరసింహేశ్వరశర్మ గారు మొదటి యాంధ్రమహాజన సభయందును గా. కొండ వెంకటప్పయ్యగారు వారి యాంధ్రోద్యమ గ్రంథమునందును విపులముగ వివరించియుండిరి. ఈ మెనిమిదేండ్లయందును నధికారులదృష్టిని నాంధ్రోద్యమము కొంతకు కొంత యాకర్షించిన దని నమ్ముట కవకాశములు గలవు. ఆంధ్రుల ప్రతిపత్తికి తగినరీతిని వారిస్థితిగతులు ప్రభుత్వదృష్టి నాకర్షించుట లేదు. రాజ్యాదాయమునందును వైశాల్యమునందును జనసంఖ్యయందును విద్యావివేకములందును సమానప్రతిపత్తి గలయాంధ్రులేల వెనుకఁబడియున్నారను ప్రశ్న సహజముగ కలుగుచున్నది. సమాధాన మాంధ్రుల యలసత్వమునందు గోచరము కావలసియున్నది. ప్రపంచప్రవృత్తియందు ప్రజలు వారివారి వికాసవిలయములకు వారే కర్త లని శ్రీకృష్ణుఁడు చేసినమహోపదేశము సర్వకాలసర్వావస్థలకును నన్వయించుచున్నది.

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః.

ఆంతరంగిక ప్రవృత్తి కనురూపమైన యాచరణము మహాపురుషార్థసిద్ధికి సాధనము. ఎవరిశుభస్థితికి వారే కర్తలు. ఆంధ్రులు శుభస్థితిని బడయుటకు త్రికరణశుద్ధిగ పాటుపడవలయును. వారియుపేక్ష నిరాదరణమునకు కారణమయినది. వారివ్యవహారపరత్వము వారియాదరణగౌరవములకు కారణము కాఁగలదు. మన గతమునకైనను మనయలసత్వముమాత్రమె నిందార్హము గాని ప్రభుత్వము ద్రవిడసోదరులు నిందాపాత్రులు గారు.

ఆత్మవికాసమున కుద్యోగములు గౌరవపదములు పరమసాధనములు గాకపోయినను స్వయంస్థితిని గనుఁగొనుట కవి సాధనములు గాన ప్రస్తావవశమున వివరింపఁబడినవి. ఆంధ్రులాత్మావలంబనమును నద్మి యాంధ్రోద్యమమును వ్యాపింపఁ జేయుచున్న

విధము నాంధ్రోద్యమవ్యాపకము బోధించుచున్నది. ఉత్కలోద్యమనిర్వాహకులు వారి యుద్యమవ్యాపనమున కధికారావలంబనమును నమ్మియుంచిన విధమును ఉత్కలోద్యమగ్రంథము విశదము చేయుచున్నది. ఉత్కళు లధికారుల నాశ్రయించి వారి ప్రాపకమును నభిప్రాయములను పూజించుచుండిరి. ఆంధ్రులాంధ్రోద్యమారంభమునందు వారి యుద్యమబలమును నమ్మిరి గాని యధికారుల ప్రాపకమును నితరుల స్తోత్రపాఠములను నాశింపలేదు. ఆంధ్రోద్యమధర్మము దిగంతములందు వ్యాపించి యధికారుల యాదరణమునకును మిత్రుల స్తోత్రములకును భాజనంబైనది. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణము నాంధ్రులవలె కర్ణాటకులు మహారాష్ట్రులు ఘూర్జరులు ఉత్కలులు ద్రవిడులు సింధువాసులు హిందుస్థానులు పరమోత్సాహముతో కోరుచున్నారు. భారతమాతృసౌభాగ్యసందర్శనము సర్వాంగసౌభాగ్యసందర్శనమునందె సాధ్యమని విశాలహృదయము గల నాయకు లందఱును నంగీకరించిరి. ఆంధ్రోద్యమ ముద్యోగలాభమున కేర్పడిన సంకుచితోద్యమ మనునపవా దిపుడు తొలఁగినది. ఎంతటి సదుద్యమ మైనను సామాన్యుల హస్తములందు హేళనమునకు గుఱియగుటయును మహాజనుల హస్తములందు ప్రశంసలకు పాత్రమగుటయును లోకాచారము. గంధిమహాత్ముఁడును మోంటేగు మంత్రియును దీవించిన యుద్యమము తిరుగులేకను విజయసింహాసనము నలంకరింపఁగలదు. ఆంధ్రు లీ కాలమునందును నాత్మవికాసమునకు స్వయంసహాయమును నమ్మి కేవలము రాష్ట్రనిర్మాణమునకే కాకను సంగభూతము లైన వివిధాంగవికాసములకును పాటుపడుచున్న విధము నాంధ్రదేశచరిత్ర మనంతముఖముల చాటుచున్నది. వివిధోద్యమముల స్వరూపము లాంధ్రహృదయమున వెలుఁగుచున్న మహాప్రకాశమునకు నిదర్శనములు. కేవలము రాజావలంబనమును గోరక నాంధ్రులు స్వయంసహాయాధారమున నాంధ్రప్రపంచనిర్మాణమునకు పూనుకొనుచున్నారు.

## ఆంధ్రప్రబోధము

శ్లో. బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః.

భారతభూమి చిరకాలము దుఃఖపరంపరల ననుభవించినను ఆంధ్రవిజ్ఞానహృదయమునకు స్తంభనము కలిగినది గాని వికలత్వము గలుగలేదు. స్తంభితమైన విజ్ఞానహృదయమునకు సులభముగ ప్రబోధము గలుగుచున్నది. బుద్ధదేవుని ధర్మప్రవృత్తిని ఆచార్యవర్యుల విద్యాప్రవృత్తిని సిద్ధుల కళాప్రవృత్తిని మహాకవుల భావప్రవృత్తిని గాయకుల గానప్రవృత్తిని ప్రజల సాహిత్యప్రవృత్తిని కుండలిని మేలుకొలిపినది. విస్మృతములైన బౌద్ధారామములు తత్త్వబోధలు కావ్యములు పాటలు సాహిత్యము సంస్మరణమునకు వచ్చుచున్నవి. ఆంధ్రహృదయము నావరించిన యంధకారము నంతరించి జ్ఞానదీపికలు ప్రకాశించుచున్నవి. రామమోహనుని "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను వేదవాక్య మాంధ్రహృదయమునందు ప్రతిధ్వనిని బుట్టించినది. విద్యాసాగరుని యార్తనాద మాంధ్రహృదయమునం దనుతాపమును గలిగించినది. దయానందుని యార్యప్రకాశ మాంధ్రహృదయమునందు ప్రవేశించినది. బిపినచంద్రపాలుని స్వదేశావధాన మాంధ్రహృదయమును జాతీయపరవశము చేసినది. వంద్రెండేండ్లకు పూర్వ మాంధ్రజాతీయ కవి "మేలుకొనుమీ భరతపుత్రుఁడ! మేలుకొనుమీ సుజనమిత్రుఁడ! మేలుకొనుమీ యార్యపుత్రుఁడ! మేలుకొనవయ్యా! వత్సా మేలుకో!" యని ప్రబోధగానమును పాడెను. ఆంధ్రహృదయము నీ ప్రబోధగీతము కలవరపఱచుచున్నది. ఆంధ్రులు జాతీయాత్మస్వరూపమును సందర్శించుటకు పరితపించుచున్నారు. ఆంధ్రహృదయానుతాపము బాహ్యసాధనములందువలె నాంతరంగికసాధనంబులందును గోచరంబగుచున్నది. ఆంధ్రహృదయప్రవృత్తి జాతీయప్రత్యభిజ్ఞానమునకును నిర్మాణమునకును బాహ్యాభ్యంతరసాధనములను సమన్వయము చేయుటకు పరితపించుచున్నది. ఆంధ్రదేశవ్యాప్తంబు లైన వివిధోద్యమముల నీ దృష్టితో నవలోకించినపు డాంధ్రోద్యమతత్త్వము బోధపడఁగలదు.

బాహ్యాభ్యంతరసాధనములు విజ్ఞాతకు జ్ఞేయమునకు సాధకునకు సాధ్యమునకు సాధనభూతము లగుచున్నవి. సాధ్యస్వరూపము నెఱుఁగని సాధకునకు సాధనస్వరూపములును తెలియవు. సాధకుఁడు తనకు కావలసిన పరమార్థమును దెలిసికొనినపు డారూఢమైనసాధనల నవలంబించి గమ్యస్థానమును జెందఁగలఁడు. అక్షరస్వరూపము నెఱుఁగనిపిల్లలు కోఁచినట్లు గీతలను గీచి తామేమేమొ వ్రాసినట్లు లానందించుచుందురు. అక్షరస్వరూపము నెఱిఁగిన

పండితులు యథాక్రమముగ వ్రాయుటకు తగిన సాధనసంపత్తిని గలిగియుందురు. వేషమునందు ఆంగ్లాభిమానద్యోతకము లైన నల్లబణాతు సీమ మల్లు భాషయందు జాతీయాడంబరము స్వస్వరూప గ్రహణమునకు సాధనము గాజాలదు. ఆంధ్రహృదయము స్వస్వరూపగ్రహణమున కవసర మైన బాహ్య సాధనములతో తనివోందక బాహ్యసాధనములకు ప్రాణ మైన యాంతరంగికసాధనమును బడయుటకు బలు తపంబు చేయుచున్నది. ఈ తపస్సునకు దేశమునందు పర్యాప్తం బైన వివిధోద్యమములు నిదర్శనములు. ఆ యుద్యమముల యాంతరంగిక స్వభావమును బరిశీలించిన వార లాంధ్రోద్యమస్వభావమును గ్రహింపఁగలరు.

వివిధోద్యమములు

రాజ్యధర్మప్రాపకముగల వర్తమానయుగమునందు ప్రజలదృష్టి సహజముగ రాజ్యాంగవిధానముమీఁదను ప్రసరించుచున్నది. రాజ్యాంగసంస్కరణములు సకలాభీష్టములను నొడగూర్చు నని కొందఱు నమ్ముచు వారి దృష్టి నంతయును రాజ్యాంగములమీఁదను కేంద్రీకృతము చేయుచున్నారు. వారి భావములు ప్రసంగములు రాజ్యాంగవాసనలతో నిండియుండును. ఈ లక్ష్యము పాశ్చాత్యసంపర్కము గల విద్యాధికులయం దారూఢముగ నిలిచినది. విద్యాప్రవృత్తి వార్తాపత్రికలు ఉద్యోగాభిలాష యూరపియనుల ప్రతిభ ప్రజలయం దీలక్ష్యము నతివేగముగ వ్యాపింపజేయుచున్నవి. పరమానందయ్యశిష్యుఁడు "సర్వరోగాపహారము తిప్పతీగ" యని సిద్ధాంతము చేసినటులు "సర్వాభీష్టప్రదము స్వరాజ్యము" అని రాజ్యాంగలక్ష్యము గలవారు సిద్ధాంతము చేయుచున్నారు. ఈ లక్ష్యమును సాధించుటకు స్వయంసహాయమునకంటెను ప్రభుత్వావలంబన మధికముగ నాధార మగుచున్నది. పరావలంబనము సకలోద్యమముల సిద్ధికిని బాహ్యసాధనముగ బరిణమించుచున్నది. మన మేదో కోరుచుందుము. ప్రభుత్వ మేదో చేయుచుండును. ప్రజలలక్ష్య మంతయును బాహ్యసాధనములందు కేంద్రీకృత మైనపు డాంతరంగిక సాధనములను నిర్ణయించి యవలంబించుట కవకాశములు సంకుచితము లగుచుండును. బాహ్యలక్ష్య ప్రవాహమునం దాంతరంగికలక్ష్యములు మునిఁగిపోవును. రాజ్యాంగాందోళనమునం దితరోద్యమములు మునిఁగిపోవును. ఆంతరంగికలక్ష్యమునకు సాధనము లైన కళలు కావ్యములు ధర్మములు సాహిత్యములు బాహ్యలక్ష్యమునందు విలయమును బొందుచున్నవి. చిరకాలాగతం బైన విజ్ఞానము తాత్కాలికసంభవ మైన లక్ష్యమునందు మాయమగుచున్నది. స్వధర్మస్వరూపములను బోధించెడి విద్యలు కళలు సాహిత్యములు రాజ్యాంగలక్ష్యములందు లయమును బొందుచున్నవి. స్వాధ్యాయనిరతులు పండితులు కవులు గాయకులు సాహిత్యవిశారదులు ప్రతిభావిరహితులై స్వరాజ్యఘోషకుల మహాప్రవాహమునందు కొట్టుకొనిపోవుచున్నారు. ఆంధ్రహృదయపరిజ్ఞానమునకు సాధనభూతు లయిన మహనీయుల ప్రజ్ఞాప్రకర్షణ మాంధ్రోద్యమప్రాప్తి కాంతరంగికసాధనముగ నున్నది. ఆంతరంగిక సాధనములను సాహిత్యపరిషత్తులు, సారస్వతమహాసభలు, గ్రంథాలయములు, సహకారసంఘములు, బాలభటనివహములు, శాఖాసభలు, గ్రంథపత్రికాప్రచురణములు పరిస్ఫుటము చేయుచున్నవి. ఆంధ్రదేశమునందు పర్యాప్తం బైన వివిధోద్యమము లందును ప్రత్యభిజ్ఞానాత్మక మైన యాత్మావలంబనము గోచరంబగుచున్నది. ఆంధ్రోద్యమాంగము లైన వివిధోద్యమములకును సాధన మాత్మావలంబనము గాని కేవలము రాజ్యావలంబనము గాదు. ఆంధ్ర హృదయ మాత్మావలంబనమును నమ్మినను రాజ్యావలంబనమును నిరసించుట లేదని వ్యవహారక్రమము విశదము చేయుచున్నది.

బహిరంగసాధనములు

ఆంధ్రప్రజలును బహిరంగసాధనములందు రాజ్యధర్మమును ప్రధానసాధనముగఁ బరిగణించుచున్నారు. ఆంధ్రరాష్ట్రీయోపసంఘము సంప్రాప్తమైన తరువాతను రాజ్యాంగసాధనములు రాష్ట్రీయమహాసభయందు కేంద్రీకృతములు. రాజ్యాంగసాధనములను నిర్వచించుటయందును నిరూపించుటయందును నాంధ్రరాష్ట్రీయసభ భారతజాతీయమహాసభాసిద్ధాంతముల నవలంబించుచున్న విధమును అనంతపురమునందును మహానందియందును చేసిన తీర్మానములు ధ్రువపఱచుచున్నవి. విద్యావంతులందు జాతీయపక్షము బలీయముగ నున్నను నితరపక్షములవారికిని వీరికిని నితరప్రాంతములందు వలె దూషణభూషణము లాంధ్రదేశమునందు చెలరేగలేదు. అన్నిపక్షముల వారును రాష్ట్రీయమహాసభయందుఁ

గూడి యధిక సంఖ్యాకుల భావములకు బద్ధు లగుచుందురు. అనంతపురమునందు చ్యాపలి సుబ్బారావుపంతులు గారు ప్రకాశముగారి తీర్మానమునకు సవరణ నుపపాదించినను తీర్మానము ప్రతిఘటనము లేక నామోదింపబడినది. అనంతపురమునం దీక్రింది ప్రతిపాదన మంగీకరింపఁబడినది.

"ఇప్పుడు పార్లమెంటువారియెదుట నున్న ఇండియా పరిపాలనపు బిల్లు అసంతృప్తికరముగను ఆశాభంగకరముగను ఉన్నదనియు ఆ బిల్లు బాధ్యతాయుత ప్రభుత్వమునకు సార్థక మగు సాధనగా నుండుటకు ఇంగ్లాండులో విచారణసంఘమువారి యెదుట దేశీయ మహాసభా రాయబారులు నివేదించిన విజ్ఞాపనలోని సవరణలను చేర్చి ఢిల్లీలో ఆ దేశీయమహాసభవారి తీర్మానములకు అనుగుణముగా నుండునట్లు చేయుట ఆవశ్యక మని ఈ సభవారు కోరుచున్నారు."

అనంతపురమునందు రాష్ట్రీయమహాసభకు అయ్యంచర్ల కృష్ణారావుపంతులుగా రధ్యక్షులుగ నుండిరి. వారు మితవాదు లని ప్రతీతి యున్నను జాతీయవాదతీర్మానము నామోదించునటులు చేసిరి. ఆంధ్రుల సామరస్యభావమున కీసాహచర్యము నిదర్శనము. రాజ్యాంగరంగమునందు ప్రత్యేకాభిప్రాయము గలవారు వారి వ్యక్తిత్వమును ప్రకర్షించుచు దేశావసరములకు త్రికరణశుద్ధిగఁ బనిచేయుటయె గవ్యస్థానమును జేరుటకు సాధనముగ నున్నది.

మహానందియందు గతమాసమునందుఁ గూడిన రాష్ట్రీయమహాసభ యాంధ్రులదృష్టిని బాగుగ నాకర్షించినది. సభాసమావేశకాలమును మార్చుట యపోహలకు కారణం బైనది. దత్తమండలములందు త్తరమండలములందు గల ప్రచలనము రాజ్యాంగజీవనమునందు లేకున్నది. జాతీయవాదపక్షబల మెటులున్నదియును గనుఁగొనుట కవకాశములు గోచరము గాకున్నవి. జాతీయస్వరాజ్యసమితి కక్షికి విజయము గలుగు నను భయము పొడచూపినది. ఆంధ్రరాష్ట్రీయసభాసమావేశ మెయసంభవ మను భయము గలిగినది. సంద్యాలునందుఁ గల కక్షుల యభిప్రాయములు పత్రికలయందలి వాదప్రతివాదములు భయభ్రాంతులకు కారణంబులు. సభాసమావేశము సభాధ్యక్షుని నియామకము సక్రమము గాదని కొంద అభిప్రాయపడిరి. కర్తవ్య మగోచరముగ నుండెను. ఆంధ్రులు సందిగ్ధసమయమునందు మాతృసేవానిరతులై మహానందికి గుంపులుగుంపులుగఁ జేరిరి. ఆ మహాక్షేత్రము నందలి నిత్యప్రవాహపరిశోభితములైన నిర్మలోదకములు, గంభీరములైనవృక్షరాజములు, ప్రకృతిసౌందర్యవిలసితంబు లైన పరిసరంబులు, స్థాణుస్వరూపుఁడైన మహానందీశ్వరదర్శనము జాతీయయాత్రికులకు మహదానందమును గలిగించినవి. సభాధ్యక్షులు టంగుటూరి ప్రకాశము పంతులు గారు సభావ్యవహారముల నత్యంతవిచక్షణ సామర్థ్యములతో నిర్వహించిరి. మహాసభకు మోచర్ల రామచంద్రరావు పంతులు గారును అయ్యంచర్ల కృష్ణారావు పంతులుగారును వచ్చి వారి పక్షవాదమును పరిస్ఫుటము చేసిరి. సభ్యులు వారి ప్రసంగములను ప్రశాంతస్వభావముతో నాలకించిరి. సభయం దామోదిత మైన ఈ క్రింది తీర్మాన మాంధ్రరాష్ట్రీయసభ అమృతసరమునం దామోదిత మైన జాతీయమహాసభా ప్రతిపాదన మవలంబించుచున్న విధమును వ్యక్తము చేయుచున్నది. ఈ తీర్మానమునందు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి ప్రతిష్టంభనధర్మము గమనార్హము. సీతారామయ్యగారు పాలుగారు నిర్ణయించిన ప్రతిష్టంభనతంత్ర మాచరణీయ మనియును నవసర మనియును ప్రతిపాదించిరి. ఈ తీర్మానమునందలి భావార్థమును సభ్యు లంగీకరించిరి.

(అ) హిందూదేశము సంపూర్ణ బాధ్యతాయుతపరిపాలనమునకు ఇదివరకే తగియున్నదని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు. అట్లు తగియుండలేదని యెవరు ఎక్కడ చెప్పినను అట్టి అపోహలను ఈ సభవారు ఖండించుచున్నారు.

(ఇ) నూతనసంస్కరణపు చట్టము అపర్యాప్తముగను అసంతృప్తికరముగను ఆశాభంగకరముగ నున్నదని యీ సభవా రభిప్రాయపడుచున్నారు.

(ఈ) స్వయంనిర్ణయసూత్రమున కనుగుణముగా హిందూదేశములో సంపూర్ణ బాధ్యతాయుతపరిపాలనము స్థాపించుటకు ప్రయత్నములు వెంటనే సలుపవలె నని బ్రిటీషుపార్లమెంటువారిని ఈసభవారు కోరుచున్నారు.

ఈ లోపుగా అట్టి సంపూర్ణబాధ్యతాయుత పరిపాలనము త్వరలో లభించునటులు సంస్కరణముల నాచరణలోనికి తెచ్చుటకై ఆంధ్రులు సాధ్యమైనంతవఱకు తోడ్పడి పనిచేయవలయు ననియును అవసరమైనపుడు ప్రతిష్టంభన తంత్ర మవలంబింపవలయు ననియును యీ సభవా రుద్బోధించుచున్నారు.

ఆంధ్రరాష్ట్రీయమహాసభ యామోదించిన రాజ్యాంగసంస్కరణతీర్మానము జాతీయమహాసభాతీర్మానమునకు ముందంజ వేయుచున్నది గాని వెనుకంజ వేయుట లేదు. ఆర్కాటు రంగనాథము మొదలార్యారు గారి పక్షమువారును రాష్ట్రీయమహాసభావిజయమునకు

తోడ్పడిరి. బహిరంగసాధన మాంధ్రరాష్ట్రీయసభ యందు వలె కృష్ణా గోదావరిమండల సభలయందును నిరూపమునని యంగీకృత మైనది. ఆంధ్రుల జాతీయ పరత్వమున కిది నిదర్శనముగ నున్నది. కులసభలయందును శాఖాసభలయందును బహిరంగసాధనము యథోచితముగ నవలంబింపబడుచున్నది. కాని గమ్యస్థానమును జేరుట కాంతరంగికసాధనము మూలసాధన మని యాంధ్రుల యుద్యమములు వ్యక్తము చేయుచున్నవి.

### ఆంతరంగిక సాధనములు

ఆంధ్రుల యాంతరంగిక సాధనావలంబనమునకు వారు సారస్వతమహాసభ యందును విద్యాప్రవృత్తి యందును సాహిత్యారాధనమునందును సహకారోద్యమమునందును నవలంబించిన స్వయంసహాయవిధానము ప్రమాణముగ నున్నది. సారస్వతమహాసభలయందును సాహిత్యపరిషత్తులందును నాంధ్రులు స్వస్వరూపమును వ్యక్తముచేయుచున్నారు. జ్ఞానావృతమైన యాంధ్రసారస్వతస్వరూపమును సారస్వతసభయందు వ్యక్తము చేయుచున్నారు. సాహిత్యనిధులైన మహాపండితులను సత్కరించుటకు ప్రయత్నములను జేయుచున్నారు. చెన్నపురియందు గూడినసభయందు బ్రహ్మశ్రీ వేదము వేంకట్రాయ శాస్త్రిగారిని శ్రీమాన్ మహోపాధ్యాయ బిరుదముతోను 1,116 రూప్యములతోను నాంధ్రమహాజనులు సత్కరించిరి. బరంపురమునందు సమావేశమైన సభయందు కల్లూరి వెంకట్రామ శాస్త్రిగారిని శ్రీమన్మహోపాధ్యాయ బిరుదముతోను పండిత సన్మానముతోను నాంధ్రపండితులు సన్మానించిరి. సభయం దామోదితములైన తీర్మానములును నాంధ్రుల ప్రత్యభిజ్ఞానమునకు నిదర్శనములు. సహకారోద్యమమునం దాంధ్రదేశము నూతనమార్గము నవలంబించుచున్నది. ఆంధ్రదేశమునకు ప్రత్యేకాధికారిని నియమించుట కాంధ్రులు కోరుచున్నారు. సహకారసంఘములందు పంచములకు నిరభ్యంతరముగ ప్రవేశము గలుగుచున్నది. గ్రంథాలయోద్యమము స్వయంసహాయాధారమున వికసించిన విధము విమర్శకుల కానందమును గలిగించినది. ఆంధ్రహృదయమునందు గ్రంథాలయములు సాధకపరిజ్ఞానము నుదయింపఁజేయుచున్నవి. విద్యాప్రవృత్తియం దాంధ్రులవలంబించిన యాత్మావలంబనవిధానమున కాంధ్రజాతీయకళాశాల నిదర్శనముగ నున్నది. ఆ కళాశాలయందు కర్మయోగమును జ్ఞానయోగమును విద్యాప్రవృత్తియందు సమన్వయము చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. దేశమునందుఁ గల సంస్కృతపాఠశాలలును జాతీయోద్యమములును నీ ధర్మమునె విశదము చేయుచున్నవి. ఆంధ్రహృదయము స్వస్వరూపమును సందర్శించుటకు చేయుచున్న ప్రయత్నముల నీ వివిధోద్యమములను ద్యోతకము చేయుచున్నవి. ఈవివిధోద్యమముల ఫలము ఆంధ్రోద్యమమునందు గోచరంబగుచున్నది.

### ఆంధ్రమహాసభ

అనంతపురమునందు గూడిన సభయం దాంధ్రమహాసభ నుపసంహారము చేయవలయునని ప్రతిపాదింపఁబడినను నా ప్రతిపాదనము మహానందిసభకు నిలుపఁబడినది. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమునకట్లు నాంధ్రమండలములందు భేదాభిప్రాయము లేదని యనంతపురమునం దంగీకృతమైన ఈ క్రింది తీర్మానము వ్యక్తము చేయుచున్నది.

"ఇప్పుడు ప్రభుత్వమువారు ప్రవేశపెట్టఁబోవు రాజ్యాంగ సంస్కరణప్రణాళికలో నిమిడియున్న బాధ్యతాయుత మగు పరిపాలన సౌష్ఠవముగ నుండుటకును, అట్టి బాధ్యతను ప్రజలు చక్కగ నిర్వహించుటకును ఇండియాలో రాష్ట్రములు భాషాప్రయుక్తముగ విభజనచేయుట ఆవశ్యకము గావునను అట్టి విభాగమునకొక్క విభజనము మాంటుఫర్డు సంస్కరణ నివేదికయందును, ఇప్పుడు పార్లమెంటు నెదుట నున్న ఇండియా ప్రభుత్వ శాసనమునను అంగీకరింపఁబడియున్నది గనుకను మదరాసు రాజధానిలో ఉత్తరమున నున్న 11 జిల్లాలును చెన్నపురియును చేర్చి ఒక్క ప్రత్యేక ఆంధ్రరాష్ట్రముగా చేయవలసిన దని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు."

ఆంధ్రరాష్ట్రనిర్మాణ మాంధ్రోద్యమ ప్రాప్తికి బాహ్యసాధన మైనను నాంధ్రవ్యక్తిత్వము కేవలము రాష్ట్రమువలనను గలుగఁజాలదు. ఒకవేళ కలిగినను నది ప్రత్యభిజ్ఞానములేని వ్యక్తిత్వముగ పరిణమించును. ఆంధ్రహృదయమునందు సర్వతోముఖమైన ప్రత్యభిజ్ఞానమును నుదయింపఁజేసి పోషించుటకు సకలోద్యమములను నాంధ్రమహాజనసభయందు కేంద్రస్థము చేయుట సాధనము. ఆంధ్రులందరును నీసిద్ధాంతము నంగీకరించుచున్న విధమును మహానందియం దేకగ్రీవముగ నంగీకృతమైన క్రింది ప్రతిపాదనము నిరూపించుచున్నది.

"ఇప్పుడు ప్రభుత్వమువారు నిర్మించిన రాజ్యాంగసంస్కరణ శాసనమునకు మూలాధార మగు బాధ్యతాయుతపరిపాలనము సార్థకముగ నుండుటకును, అట్టి బాధ్యతలను ప్రజలు చక్కగా నిర్వహించుటకును భారతరాష్ట్రములు భాషాప్రయుక్తముగ విభజన చేయుట ఆవశ్యకము గావునను అట్టి విభాగమున కవకాశము ఆ శాసనము నందలి 1[illegible]-వ సెక్షనులో సూచింపబడినది గావునను చెన్న రాజధానిలో నుత్తరమున నున్న పదిరెండుమండలములను చెన్నపురితో చేర్చి యొక ప్రత్యేకమైన ఆంధ్రరాష్ట్రముగ చేయవలయు ననియును;

భాషాప్రయుక్తరాష్ట్రవిభజనకై ప్రయత్నములు చేయుచున్న ఉత్కళ, కర్ణాటక, మహారాష్ట్ర, గూర్జర, సింధు దేశములతో సంప్రతించి రాగల జాతీయమహాసభ నాటికి అఖిలభారతసభ యొకటి సమావేశము గావించి దేశీయమహాసభయందు భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణ విషయమును గూర్చిన తీర్మానమును ప్రతిపాదించుటకును ప్రయత్నింపవలయు ననియు; ఈ ప్రయత్నమునకు వలయు వ్యయములు స్థాయిసంఘ ద్రవ్యమునుండి యొసంగవలయు ననియును ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ఆంధ్రమహాజనసభ స్థాయిగా నేర్పడవలయు ననియు ప్రతి సభ్యుడు సాలు చందా 1 రూపాయకు తక్కువగాని మొత్తముగాని, రూ 0-4-0 లకు తక్కువగాని మొత్తముగాని ఇవ్వవలయు ననియును తీర్మానించుచున్నారు. 18 సంవత్సరములకు పైబడిన వయస్సు గల స్త్రీపురుషులు ప్రతివారును ఈ సభలో సభ్యులుగా నుండవలయు నని తీర్మానించుచున్నారు.

సర్వతోముఖమైన ఆంధ్రోద్యమము కేంద్రీకృతము చేయుట కనురూపమైన యేర్పాటు చేయుటకును స్థాయిసంఘమువారికి అధికార మిచ్చుటకును సభవారు తీర్మానించుచున్నారు.

స్థాయిసంఘము మహాసభకు కార్యనిర్వాహకసభగా నేర్పడి సంవత్సరమునం దంతటను సభోద్దేశ్యములను నెరవేర్చుటకు పాటుపడవలయు నని తీర్మానించుచున్నారు.

స్థాయిసంఘమునందు వివిధోద్యమములందు పనిచేయుచున్నట్టి వారు వారి యుద్యమనిర్వాహకులనుండి యేర్పఱచిన కార్యదర్శిని గాని సభాధ్యక్షుని గాని ఉద్యమనిర్వాహకు లేర్పఱచిన యితరుని గాని ఒకనిని సభ్యునిగా నుండునట్లు తీర్మానించుచున్నారు.

స్థాయిసంఘమునందు ఇదివఱకు వలెనే విశేష సభ్యులను సామాన్యసభ్యులను చేర్చుటకు తీర్మానించుచున్నారు.

ఆంధ్రదేశమున సాహిత్యమునందును కవిత్వమునందును గానమునందును చిత్రలేఖనమునందును శిల్పము మొదలగు కళలయందును పారిశ్రామికవిద్యలందును నైపుణ్యము గాంచిన ప్రసిద్ధపురుషులను ఈ మహాసభాసమావేశములందు సత్కరించుటకును తగురీతిని ధనసహాయము సాధ్యమైనంతవఱకు చేయుటకును ఈ సభవారు తీర్మానించుచున్నారు."

భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతమును సామాన్యముగ నాయకులందఱును నంగీకరించుచున్నారు. ఆంధ్రజాతీయవాద నాయకులు ప్రకాశముపంతులుగారు వారియధ్యక్షోపన్యాసమందును రంగనాథము మొదలియారుగారు వారియధ్యక్షోపన్యాసమునందును ప్రత్యేకాంధ్రనిర్మాణావసరమును బాగుగ సమర్థించిరి. లోకమాన్య తిలకు రాజ్యాంగవిధానపత్రికయందును గంధిమహాత్ముం డుపదేశపత్రములందును భాషాధారమున రాష్ట్రముల పునర్నిర్మాణమును ప్రతిపాదించుచున్నారు. వి. పి. మాధవరావుగారీవిషయము నిదివఱకే యంగీకరించిరి. కస్తూరి రంగయ్యంగారుత్కలోద్యమ ప్రతినిధికి వారి సమ్మతిని దెలిపిరి. తిరునల్వేలియందు కూడిన చెన్నరాష్ట్రీయ మహాసభయందు భాషాతీర్మానమంగీకృతము. ప్రయుక్తరాష్ట్రనిర్మాణ సంస్కరణ శాసనకర్తలు శాసనమునందు నూతన రాష్ట్రముల నిర్మాణమున కవకాశములను గల్పించిరి. ఈయవకాశములను చితరీతిని వినియోగపఱచుట కాంధ్రులు పూనుకొనవలయును. భాషాప్రయుక్త సిద్ధాంత వ్యాపనమునకు మోచర్ల రామచంద్రరావు పంతులుగారొసంగిన రూ. 1000 లును గ్రంథప్రచురణమునకును స్థాయిసంఘమునందు నిలవయున్న ద్రవ్యము సంచారకులకును వినియోగింపవలయునని తీర్మానింపఁ బడినది. తీర్మానము నాచరణమునందు పెట్టుట కాంధ్రులు పూనుకొనవలయును. ఆంధ్రులయం దుదయించిన ప్రబోధమును వికసింపఁజేసి మూలమూలలను వ్యాపింపఁజేయుట కాంధ్రులు వెంటనే పూనుకొనవలయును. వేలకొలది సభ్యులాంధ్ర మహాజనసభయందు జేరి కార్యాచరణమునకు పూనుకొనిన నచిరకాలముననె ఆంధ్రరాష్ట్రము సంప్రాప్తమై సర్వతోముఖమైన యాంధ్రహృదయవికాసము గలుగఁగలదు. సత్త్వముగలయుద్యమములకు ప్రతిఘటనము బలము నొసంగునుగాని వికలత్వము గలుగఁజేయదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు ప్రతిఘటకు లింకనునుండు టసంభవము. ప్రతిఘటనమును తొలఁగించుట కాంధ్రత్వాభిమానులందఱును త్రికరణశుద్ధిగ పాటుపడవలయును. ఆంధ్ర మహాజనసభ కేవలము బాహ్యసాధనముతో సంతృప్తినిబొంద లేదు. అంతరంగిక సాధనములను నిరూపించి వికసింపజేయుట కాంధ్ర మహాజనసభను చైతన్య ప్రదమై షోడశకళాకళాశోభితమైన మహాసభనుగ జేయదలపెట్టిరి. ఈప్రయత్నముల

కాంధ్రులందరును దోడ్పడి స్వధర్మము నారాధించుదురు గాత!

### సింహావలోకనము

సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

వర్తమానకాలము ప్రపంచ పరిణామమునందు మహాసంధి సమయము. మహాసామ్రాజ్యములు వికలత్వమును బొందినవి. అధికారము స్వీయప్రతిభను గోల్పోవుచున్నది. బాహుబలధర్మము కుబ్జాకృతిని దాల్చుచున్నది. ధనబలము పరాజయమును బొందుచున్నది. మతధర్మము పరివర్తనమును బొందుచున్నది. మహాసందిగ్ధసమయమునందు కురుక్షేత్రమున మహాసంగ్రామారంభమునందు పార్థుని నావహించిన శోకసమ్మోహములు ప్రపంచము నావహించినవి. వ్యక్తులు సంఘములు జాతులు సత్యధర్మస్వరూపమును సందర్శించుటకు పరితపించుచున్నవి. చిరకాలానుభవలబ్ధంబైన సంస్కారావరణము ప్రతిబంధకముగ నున్నది. పురుషార్థమునకు బలము భాగ్యములు భోగములు సాధనము లని నమ్మిన జనులు వ్యతిరేకమైన ధర్మస్వరూపమును సందర్శింప జాలరు. శత్రుసంహారమునకు సంఘవిప్లవమునకు మహాసంక్షోభమునకు సాధనంబులైన బాహుబలమును భాగ్యబలమును నధికారబలమును బడయుటకు సకలజాతులు విశ్వప్రయత్నములను జేయుచున్నవి. శిథిలములైన పార్థివస్వరూపనిర్మాణమునందు గల యాసక్తి ధర్మస్వరూపనిర్మాణమునం దపురూపము. మహారాజ్యములు భూవిభాగమునకు భాగ్యవిభాగమునకు పరితపించుచున్నవి గాని ధర్మవిభాగమునకు పరితపించుట లేదు. సూనగనులు బొగ్గుగనులు లోహపుగనులు రాజ్యతంత్రజ్ఞుల నాకర్షించినట్లు మానవహృదయవేదనలు రాజ్యతంత్రజ్ఞుల చిత్తవృత్తి నాకర్షించుట లేదు. సంక్షోభదావానలము ప్రపంచవ్యాపకమును బొందుచున్నది. బోల్షివికులు సాంఘికపరివర్తనకారులు కార్మికులు సంక్షోభదావానలమును వ్యాపింపజేయుచున్నారు. విల్సను మహాశయుడు నిర్ణయించిన శాంతిబీజములు నిర్వీర్యములై విప్లవబీజములు వర్ధిలుచున్నవి. రణరంగములం దుదయించిన సంగ్రామదావానలము సకలసంఘముల నానరించుచున్నది. ప్రపంచవ్యాప్తమైన హృదయసంతాపమును శాంతింపజేయుటకు బలము భాగ్యములు భోగములు నిరుపయోగములుగ నున్నవి.

పార్థివసంపదలు పూర్వమువలె భావికాలమునందును సంరంభమునకు సాధనములుగాని శాంతికి సాధనములుగా జాలవు. లోకవ్యాప్తంబైన మహాసమ్మోహమును బాపుటకు ధర్మారాధనము శరణ్యము. శ్రీకృష్ణుడు విజయునకు ధర్మస్వరూపమును పరిస్ఫుటము చేసి చరితార్థునిజేసెను. యంత్రతంత్రములు శస్త్రాస్త్రములు పరితప్తమైన మానవహృదయమునందు శాంతిని గలుగజేయ జాలవు. రాజ్యలాభములు వ్యాపారప్రయోజనములు జాతీయాభిమానములు మతావేశములు గతయుగములందువలె వర్తమానయుగమునందును సంతాపదావానలమును ప్రజ్వలింపజేయును గాని చల్లార్పజాలవు. సంతాపదావానలమును నుపశమింపజేయుటకు శ్రీకృష్ణుఁడు రణరంగమునందు జేసిన ధర్మోపదేశమునే బుద్ధదేవుడు సంసారరంగమునం దుపదేశించెను. బుద్ధదేవు డుపదేశించిన సంఘారాధనము సత్యారాధనము ధర్మారాధనము వర్తమాన వ్యాపార యుగమునందును క్షాత్రయుగమునందువలె శాంతి స్థాపనమునకు సమారాధ్యములు. భరతఖండమునకు దురారాధ్యమైన క్షాత్రబలము మహాదుఃఖమును గలుగజేసి నపుడు శ్రీకృష్ణుడు భారతసంగ్రామరూపమున క్షాత్రబల సంహారమును జేసి ధర్మారాధనమును స్థాపించెను. బుద్ధదేవుడు సంఘారాధనమునందును సత్యారాధనమునందును ధర్మారాధనమును పరిస్ఫుటముచేసెను. వర్తమాన సంధిసమయమునందు ప్రపంచశాంతికి నిశ్చలమైన ధర్మారాధనము సాధనముగ నున్నది. వర్తమానకాలమునందు పర్యాప్తంబైన రాజ్యవ్యవస్థలు సంఘవ్యవస్థలు వ్యాపారపద్ధతులు సేవానిర్ణయములు ధర్మప్రతిపాదకములైనపుడు ప్రపంచమునకు శాంతిసాధ్యము. శాంతిస్థాపనమునకు వ్యక్తులు సంఘములు జాతులు ప్రత్యేక లాభారాధనమును విసర్జించి ధర్మారాధనమునకు బూనుకొనవలయును. స్వార్థప్రయోజనాపాదితములైన ధర్మముల పరిత్యాగము విశ్వమానవధర్మాపాదితమైన ధర్మారాధనము భగవదారాధనమునకు సంఘారాధనమునకు సత్యారాధనమునకు ధర్మారాధనమునకు పవిత్రసాధనము. వర్తమానకాలమునందు గాంధిమహాత్ముడు ధర్మారాధనము భారతీయులకు తరణోపాయమని బోధించుచున్నాడు. భారతీయులును నితరులును మహానుభావు లుపదేశించిన ధర్మము నారాధించి ప్రపంచమునందు సుఖశాంతులను స్థాపించుటకు పాటుపడి పరమేశ్వరుని ప్రీతికి పాత్రులగుదురు గాత!



The Fourth Andhra Literary Conference, Madras     నాల్గవ ఆంధ్ర సారస్వత మహాసభ, మద్రాసు

The Andhra Sanitary Students, Medical Callege, Madras



ఆంధ్రపారిశుద్ధ్యవిద్యార్థులు, వైద్యకళాశాల, మద్రాసు



Bala Sarasvati Library, Rajahmundry

బాలసరస్వతీగ్రంథాలయము, రాజమహేంద్రవరము

# పంచాంగము

పొన్నాడ సుబ్బారావు గారు, బి. ఏ., బి. ఎల్.

కాలమునకు ఆదియు నంతమును లేదు. కాని సూర్య చంద్రులు భూమిచుట్టు తిరుగు కాలమును సంవత్సర మనియు నెల లనియు నెలలును తిరిగి వార ములు దినములు, గడియలు ఘంటలుగా విభజించు వాడుక ప్రపంచమునం దంతటను ఏదో ఒకవిధముగా నున్నది. వివిధదేశములలో వాడుకలో నున్న కాలవిభ జనమును గూర్చి యిచ్చట సూచ్చటించెదను. సౌరమాన సంవత్సరము చాంద్రమాన సంవత్సర మని సంవత్సరము రెండు విధములుగా నున్నది.

### సౌరమాన సంవత్సరము

ఇది తిరిగి రెండు విధములు. ఒకవిధము మన దేశములోను, రెండవది ఐరోపాఖండమందును వాడు కలో నున్నది. భూమి సూర్యునిచుట్టు తిరుగును. కాని సూర్యుఁడే భూమిచుట్టు తిరుగునట్లు మనకు కనఁబడును. సూర్యుఁడు భూమిని ఒకసారి చుట్టి తాను బయలుదేరిన నక్షత్రము నొద్దకు తిరిగి 365 దినముల 6 గంటల 11 మినిట్ల 31 సెకండ్ల కాలములోఁ జేరును. ఈ పరిమితి యే సౌర సం॥రము (Sidercal year) ఇది మన హిందూ దేశములో వాడుకలో నున్నది. కాని ఋతువులు 365 దినముల 5 గంటల 48 మినిట్ల 28 సెకండ్ల కాలములో తిరుగును. ఈ ఋతు సౌరసంవత్సరము (Tropical year) ఐరోపాలో వాడుకలో నున్నది. ఐరోపా సౌరసంవత్సర మునకును మన హిందూ సౌరసంవత్సరమునకును, 23 మినిట్లు వ్యత్యాస మున్నది. ఈ వ్యత్యాసము సుమా రు రెండువేల సంవత్సరములలో 32 దినము లగును. పదివేల సంవత్సరములలో ఆఱు మాసము లగును. ఐరోపా సౌర సం॥రము ఋతువులను బట్టి నిర్మింపఁ బడిన దగుటచే నెన్నివేల సం॥రములు గడచిన పిదప నైనను మే జూను నెలలలో వేసవియు, నవంబరు డిసెం బరు నెలలలో శీతలమును ఉండును. కాని మన సౌర సం॥ర ప్రకారము పదివేల సం॥రములు గడచినపిదప మేషవృషభమాసములలో (చైత్ర వైశాఖములు) శీతల మును, ధనుర్మకరమాసములలో (మార్గశిరపుష్యములు) వేసవియును వచ్చును. అరవ (ద్రవిడ) దేశములో హిందూ సౌరసం॥రము వాడుకలో నున్నది. సూర్యుఁడు మేషమందు సుమారు ఏప్రిలు తే 13 దిని ప్రవేశించు టచే అరవసంవత్సరాది సాధారణముగా, ఏప్రిలు తే 13 దిని ప్రారంభమగును. పైలెక్క ప్రకారము 60 సం॥ ల కొకసారి ఒకదినము చొప్పున ఐరోపా సౌర సం॥ర మునకు వ్యత్యాసము కాన్పించును.

మన సౌర సం॥రము 12 నెలలుగా విభజింపఁ బడినది. సూర్యుఁడు ఒక్కొక రాశిలో ప్రవేశించునపుడెల్ల ఒక్కొక్క మాస మారంభ మగును. ఈ ప్రవేశమునకే మాససంక్రమణ మని పేరు. రాసుల పేర్లును మాస ముల పేర్లును సమమే.

### సౌరమాసముల పరిమాణము

| | దిన ఘ విఘ | | దిన ఘ విఘ |
|---|---|---|---|
| మేషము | 30-56- 6 | తుల | 29-53-34 |
| వృషభము | 31-25-12 | వృశ్చికము | 29-25-24 |
| మిధునము | 31-38-38 | ధనుస్సు | 29-11- 1 |
| కర్కటకము | 31-28-30 | మకరము | 29-26-52 |
| సింహాము | 31- 1- 4 | కుంభము | 29-49-12 |
| కన్య | 30-26-27 | మీనము | 30-21-10 |

ఐరోపాఖండమందు సౌర సం॥రమును 12 నెల లుగా భాగింతురు. ఆవిధము ఈ క్రింద విపులముగాఁ గనఁబఱచెదను.

### 2. చాంద్రమాన సంవత్సరము

చంద్రుఁడు భూమిచుట్టు ఒకసారి 27 దినముల 7 గంటల 43 మినిట్లలో తిరుగును. కాని భూమి చంద్రు నితోఁ గూడ సూర్యునిచుట్టు తిరుగుచుండుటచేఁ దాను

బయలుదేఱిన నక్షత్రములో తిరిగి ప్రవేశించుసరికి చంద్రునికి 29 దినముల 12 గంటల 43 మినిట్లు (31 గడియ 48 విగడియలు) అగును. ఈపరిమితియే చాంద్ర మాసము. ఇట్టి 12 మాసములు ఒక సం॥ర మగును. దీని పరిమితి 29½ × 12=354 దినములు. ఈ సం॥రము మహమ్మదీయులలో వాడుకలో నున్నది. ఇది సౌర సం॥రముకంటె 11¼ దినములు తక్కువగా నుండుటచే 30 సం॥లలో ఋతువులు ఒకసారి తిరిగి పోవును. పీర్లపండుగ క్రమముగాఁ బ్రతిసం॥రము 11 రోజుల చొప్పున తగ్గి అన్ని ఋతువులలోనువచ్చుట మనము చూచుచున్నాము.

మనదేశములోఁ జాంద్రమాన సం॥రము వాడుకలో నున్నను సౌరసం॥రముకంటె వెనుకఁబడ కుండు నట్లు అప్పుడప్పుడు అధికమాసములు కలుపుచుందురు. 235 చాంద్రమాసముల పరిమితియు 19 సౌర సం॥రముల పరిమితియు సమాన మగును (6939 దినములు). కనుక 19 సం॥లలో, 235 చాంద్రమాసములను సర్దిన యెడల 7 అధికమాసములు మిగులును. కనుక ప్రతి 19 సం॥లకు, 7 అధికమాసములు వచ్చు సం॥రము లుండును. సాధారణముగా ప్రతి 3,6,8,11,14,17,19 సం॥లు అధికమాస సం॥రము లగుచుండును. ప్రతి చాంద్రమాసములోను సౌరమాససంక్రమణము ఉండవలెను. వృశ్చిక ధనుర్మకర మాసములు తప్పఁ దక్కిన సౌరమాసములు చాంద్రమాసములకంటె దీర్ఘముల టచే ఒక మాససంక్రమణము అమావాస్యరోజున పడిన యెడల రెండవ మాససంక్రమణము మరియొక అమావాస్య దాఁటిన పాడ్యమిరోజున పడవచ్చును. అనఁగా ఒక చాంద్రమాసములో సంక్రమణ ముండదు. అట్టి మాసము అధికమాస మగును. మేషసంక్రమణము చైత్రమాసమందును, వృషభసంక్రమణము వైశాఖ మాసమందును, ఈ రీతిగా తక్కిన సంక్రమణములు తక్కిన మాసములలోను వచ్చుచుండును. వృశ్చిక ధనుర్మకరమాసములు చాంద్రమాసములకంటె సన్నము లగుటచే ఆ యా సంక్రమణములు ఆ యా చాంద్ర మాసములలో సరిగా పడును. గనుక మార్గశిర, పుష్య, మాఖమాసము లెన్నఁడును అధికమాసములు కానేరవు. కాని వృశ్చికధనుస్సులయు, ధనుర్మకరములయు, మకరకుంభములయు సంక్రమణములు రెండునుఁ గలసి ఒకచాంద్రమాసములోఁ బడవచ్చును. అట్లు జరిగిన యెడల ఒక చాంద్రమాసము క్షయ మగును. అట్టి క్షయమాసములు చాలకాలమున కొకసారి వచ్చును. ఈవఱకు క్రీ॥ శ॥ 1521 లో మార్గశిరమును, 1540 లోను 1681 లోను 1822 లోను పుష్యమును, క్షయ మాసము లైనవి. తిరిగి 1963 లోఁ బుష్యమాసమును, 1982 లో మాఖమాసమును క్షయమాసము లగును. మార్గశిర, పుష్యమాఖ మాసములు తప్ప తక్కినవి క్షయమాసములు కానేరవు. క్షయమాసము వచ్చిన సం॥ లో ఒకటి గాని రెండు గాని అధికమాసములు వచ్చును. కాన 11 మాసముల సం॥ ర మెన్నఁడును చూడము. ఈ అధికమాసచాంద్రమాస సం॥రమే మన తెనుఁగు దేశములో వాడుకలో నున్నది. చాంద్రమాసముల పేర్లు నక్షత్రములను బట్టి వచ్చినవి. చైత్రపూర్ణిమయందు చిత్తానక్షత్రముండును, వైశాఖపూర్ణిమయందు విశాఖానక్షత్రముండును, ఈవిధముగనే జ్యేష్ఠ ఆషాఢ శ్రావణ భాద్రపదాశ్వయుజ కార్తిక మార్గశిర పుష్య మాఖ ఫాల్గుణ మాసములయందును ఆయానక్షత్రముల యందును చంద్రుఁ డుండును.

3. ఐరోపాఖండచరిత్రము:—రోమ్యులసు క్రీ॥ ముం॥ 753 లో రోము పట్టణమును కట్టెను. అతని కాలములో 304 దినములు గల 10 నెలల సం॥రము వాడుకలో నుండెను. నెలలపేర్లు ఏ వనగా:

1. మార్చి మార్సు అనే దేవుని పేరు.

| | | |
|---|---|---|
| 2. ఏప్రిలు | 5. క్విన్‌టిలీసు | 8. అక్టోబరు |
| 3. మే | 6. సెక్స్టిలీసు | 9. నవంబరు |
| 4. జూను | 7. సెప్టెంబరు | 10. డిసెంబరు |

రోము రెండవరాజైన న్యూమా (Numa) జానసు అను దేవునిపేర జనవరినెలను సంవత్సరాదియందును, ఫిబ్రవరి అని మరియొక దేవునిపేర ఒకనెలను సంవత్సరాంతమందును కలిపెను. క్రీ॥ ముం॥ 452లో ఫిబ్రవరి నెల జనవరితరువాతకు మార్పఁబడెను. అప్పటికి చాంద్ర మాస సం॥రము వాడుకలో నుండెడిది. సౌర సం॥రము

కంటె 11¼ రోజులు తక్కువగా నుండుటచేరెండు సం॥ల కొకసారి ఫిబ్రవరినెల తరువాత 22 లేక 23 దినములు గల నెలను అధికమాసముగాఁ గలుపుచుండెడివారు.

రోము దేశములో పంచాంగము సిద్ధాంతుల చేతులలో నుండుటను బట్టి ఆసిద్ధాంతులు రాజకీయోద్యోగస్థుల ప్రోత్సాహము పైని అధికమాసములు కలుపుటను మానిరి. రోములో ప్రతి సంవత్సరారంభమున మంత్రులు వగైరా గొప్పయుద్యోగస్థులను మార్పు వాడుక ఉండెడిది. అందుచేత ప్రాతయుద్యోగస్థులను వారి పదవులలో నుంచి నియమితకాలమునకు ముందుగా తప్పించివేయు సాధనము పంచాంగములో నధికమాసములు కలుపుట మానివేయుటయే! ఈవిధముగా జరుగుటచే జ్యూలియసు సీజరు కాలమునకు (క్రీ॥ ముం 46) పంచాంగము 3 నెలలు తప్పు వచ్చెను. ఋతువులు మారినట్లు కనఁబడెను. పంచాంగము పొరపడును గాని ఋతువులు మారవు అని సీజరు సిద్ధాంతీకరించి జరిగిన పొరపాటును సవరణచేయుటకు క్రీ॥ ముం 45 లో 90 రోజులు కలిపించెను. ముందు ఇట్టి పొరపాటు జరుగకుండునట్లు చాంద్రమాస సం॥రమును తీసివేసి సౌర సం॥రమును వాడుకలోనికి తెచ్చెను. క్విన్టిలీసు అనునతడు తన పుట్టుక నెలపేరు తనపేరిట జూలై అని క్రొత్త నామ మిడెను. సీజరు సిద్ధాంత మిది.

| | | | |
|---|---|---|---|
| జనవరి 31 | ఏప్రిలు 30 | జూలై 31 | అక్టోబరు 30 |
| ఫిబ్రవరి 29 | మే 31 | సెక్స్టిలీసు 30 | నవంబరు 31 |
| మార్చి 31 | జూను 30 | సెప్టెంబరు 31 | డిసెంబరు 30 |

సం॥రమునకు 365 దినములు. 4 సం॥ల కొకసారి లీపుసం॥రము వచ్చును. అప్పుడు ఫిబ్రవరినెలకు 30 దినములు.

సీజరు గతించిన పిమ్మట అతని దత్తపుత్రుఁడు అగస్టసు రాజ్యమునకు వచ్చి తనపేరు లోకవిఖ్యాతి నొందించు మార్గము ఒకనెలకు తనపేరును పెట్టుకొనుట యని నిశ్చయించి సెక్స్టిలీసు అనుపేరు ఆగష్టుక్రింద మార్చి, తన నెలకు కూడ 31 దినము లుండునట్లు ఆజ్ఞాపించెను. అందుచే సెప్టెంబరు నవంబరులకు 30 దినములును అక్టోబరు డిసెంబరులకు 31 దినములును ఫిబ్రవరినెలకు 28 దినములును సవరణ కావలసి వచ్చెను.

ఐరోపా సౌర సం॥ర పరిమితి 365 దినముల 5 గంటల 48 మినిట్లు సీజరులెక్క ప్రకారం 365 దినముల 6 గంటలు వా॥ 4 సం॥ల కొకసారి లీపు సం॥రము వచ్చుచుండెను. ఈప్రకారము 4 సం॥ల కొకసారి 45 మినిట్లు హెచ్చు కలుపుచుండిరి. ఈహెచ్చు 400 సం॥లకు 75 గంటలు లేక 3 దినములు అగును. సీజరుకాలమునుండి క్రీ॥ వె 325 సం॥నకు 4 రోజులు వ్యత్యాసము కాన్పించెను. క్రీ॥ వె 1582 సం॥రమునరికి మఱి 10 రోజులు వ్యత్యాసము కాన్పించెను. 1582 లో పోపు గ్రిగొరి (Pope Gregory) అక్టోబరు 4-వ తేది తరువాత 15-వ తేది వచ్చునట్లు సవరణచేసి ఇఁకముందు పొరపాటు రాకుండుటకు 400 సం॥లలో 3 లీపు సం॥ములు వదలివేయు మని ఆజ్ఞాపించెను. దీనిప్రకారము 1700 1800 1900 లీపు సం॥లు కావు.

గ్రిగొరి చేసిన మార్పును ఐరోపాలో కొన్ని దేశములవారు ఆచరించిరి. మఱి కొన్ని దేశములవారు నిరాకరించిరి. తుదకు 1751 లో ఇంగ్లండునందు పార్లమెంటువారు ఒకశాసనముఁ జేసిరి. ఆ శాసనమువలన 1752 సం॥రము సెప్టెంబరు 2-వ తేది తరువాత 14-వ తేది వచ్చునట్లు చేయఁబడెను. రష్యాదేశస్థులు నేఁటివఱకు గ్రిగొ మార్పును ఒప్పుకొనలేదు. వారు 1700 1800 1900 లీపు సం॥ములు చేయుటచే 13 రోజులు వ్యత్యాస మున్నది. అందుచే వారు రెండు తేదీలను కూడ నవంబరు $\frac{1,1919}{14,1919}$ అని వ్రాయుదురు.

# ఆంధ్రదేశాభివృద్ధి

దర్శి చెంచయ్య గారు

న్యూటను అను గణితజ్యోతిషశాస్త్రపండితుఁడు క్రొత్తక్రొత్తసంగతులను కనిపెట్టి ప్రపంచమునకు మేలు చేసినాఁడని అందఱును అంగీకరించినారు. అతఁడు నాగరికత నందిన రాష్ట్రములో పుట్టి ఆరాష్ట్రమునందే గణితశాస్త్ర జ్యోతిషశాస్త్రములకు సంబంధించిన జ్ఞాన మెంత వ్యాపించియుండినదో అంత యెరింగికొని పనిచేసినందున చర్వితచరణము కాకుండ అతడు క్రొత్త సంగతులను కనుగొనగలిగెను. న్యూటనంతటి కుశాగ్రబుద్ధి గలవాఁడే ఏ మధ్య ఆఫ్రికా అడవులలోనో పుట్టియుండి ఒకరాతిని ఒకచేతితోను ఇంకొకరాతిని ఇంకొక చేతితోను తీసికొని వాటిని చేర్చి ఇదిగో ఇవి రెండయినవి అని కనిపెట్టియుండిన లోకమునకు ఏమి మేలై యుండును. ఒకవేళ తనతో నుండు తక్కిన అడవిమానసులకు అచ్చెరువును గలిగించి యుండును గాబోలు! ఈరీతినే లోకవిజ్ఞానమునకు తోడ్పడిన ఏ కుశాగ్రబుద్ధిచరిత్రను తీసికొనినను అదివఱలో ప్రపంచమున వ్యాపించిన జ్ఞానానుభవము లేక అతడు ఏ క్రొత్తవిషయమును లోకకల్యాణమునకై కనిపెట్టలేదనుట స్పష్టముగా తెలియగలదు. హిమాలయపు ఆటవికులలో జన్మించియుండినచో డార్విన్ సిద్ధాంతి లోకజ్ఞానమును పెంచియుండఁగలడా? రవీంద్రనాథుఁడు ఆటవికులలో బుట్టియుండినచో ఏ యిరువురు మువ్వురు ఆటవికులకో తృప్తి కలిగించునట్టి ఏరెండుపాటలనో వ్రాసియుండగలుగునే కాని లోకసమ్మోహన మొనర్చు మహాకావ్యముల రచింపగలిగియుండునా?

ఆంధ్రదేశమున కుశాగ్రబుద్ధులు లేరందురా? ఎందఱు అష్టావధానులు, ఎందఱు శతావధానులు, ఎందఱు ఆశుకవులు, ఎందఱు సాంగవేదపాఠకులు, ఎందఱుద్దండసంస్కృతపండితులు!!! మఱి వీరేల నేఁటిదినమున మన పురోభివృద్ధికి తోడ్పడఁజాలకున్నారు? నేఁటికిని వీరికిని శతాబ్దముల యంతర మున్నది. అదియే కారణము. నేఁటి భావప్రపంచముతో వీరికి సంబంధము లేదు. కొన్ని నూఱుల యేండ్లకు మున్ను వీరుండురేని వీరి పేళ్లన్నియు శిలాశాశ్వతములై యుండును. నేఁడో మన యభివృద్ధికి వీరు పనికిరానివారైనారు. నేఁడు పాశ్చాత్యశాస్త్రములు, పాశ్చాత్యసిద్ధాంతములు ఎఱిఁగినవారే కాలగతి నెఱుంగఁగలవారుగ నున్నారు. కాలము ననుసరింపఁగలవారుగ నున్నారు. పాశ్చాత్యశాస్త్రములును సిద్ధాంతములును పరభాషలో నుండుటను బట్టియు, ఆ పరభాష కష్టసాధ్యమై యుండుటం బట్టియు, మనపండితులు ఆ విజ్ఞానమును సాధింపలేకున్నారు. ఆ విజ్ఞానము నంతటిని మనము మనభాషలోనికి భాషాంతరీకరణమూలకముగా నేని, ఇతరవిధములనేని తీసికొనరాఁగలిగితిమా, వీ రెల్లరును మన జాతీయజీవనమునకు మహోత్తమరీతిని తోడు కాఁగలరు.

ఒక్క విషయ మిచ్చట గమనింపఁదగినది. నేఁటి దినము మన దేశములో మనభాషలలో సాధారణముగా వెలసియుండు జ్ఞానము ఎక్కువగా మతవిషయిక మయినది. మానవుని ఇహసౌఖ్యవిదూరునిగ చేయునది. తన యాత్మముక్తిని సమకూర్చుకొనుటకు పురికొల్పునది. ఇది సాత్త్వికగుణమును విపరీతపఱచి మానవుని సంఘము నుండి దూరపఱచుచున్నది. మన మత సిద్ధాంతము యొక్క మూలభావ మిది యని యనుటకు రాదు. అది నిజముగా సర్వశ్రేయోదాయకమై, ప్రజాహితజీవనమును పురికొల్పునదై యుండినదనుటకు మన ప్రాచీనచరిత్రమే సాక్ష్యము కాని నేఁటిస్థితిని ఉన్న దున్నట్టు లాలోచించుట యవసరము. మనలో సామాన్యముగా నుండు విజ్ఞానము ఒక్కొక్కమానవుని ఆత్మముక్తికి సాధనముగా నాలోచింపఁబడుచున్నదే కాని జాతీయముక్తికి సాధనముగా లేదు. మన శాస్త్రులును, పండితులును సంఘముల కేమాత్రము నుపకారముఁ జేయ శక్తిమంతులుగా నుండలేదు. అంటరానివారి సమస్య, వర్ణసమస్య, బాల్యవివాహసమస్య, నిర్బంధవైధవ్యసమస్య, అనేకశతాబ్దములుగ నున్న రాజకీయపరాధీన సమస్య, మున్నగు సమస్య లేవియు వారికి పట్టలేదు. పాశ్చాత్యవాఙ్మయమును చదువం జదువ విలక్షణమగు విలాసము

కలుగుచున్నది. రాజసగుణప్రధానత్వము దానివలన కలుగుచున్నది. ఆరాజకీయ, సాంఘిక, నైతికప్రపంచమంతయు జాతీయజీవనమును విజృంభింపఁజేయుటకై యేర్పడినది. నిందు ప్రపంచముననుండి పోరాడుటకును స్తబ్ధత్వమును పోనాడుకొనుటకును, సంఘసేవా తన్మయత్వమును పొందుటకును ఆ వాఙ్మయము మిక్కిలి సహకారి. మాజినీకృత మగు "మనుష్యధర్మము" లను గ్రంథమును చదివినయెడల మానవుఁడు దేశభక్తిప్రపూరితుఁడై, దేశమునకై సర్వమును త్యాగముచేయునట్టి తెగువ కలవాఁ డగుచున్నాడు. ఇది సాకార గుణము. రూసోకృత "సంఘము వ్యక్త్యంగీకార నిర్మితము." అను గ్రంథమును ఇట్టి గుణమునే కలిగించునదై యున్నది. మనయంతటి నిగూఢంబగు జీవితతత్త్వము పాశ్చాత్యుల కర్థము కాదు గాని వారి జీవితతత్త్వము వారి కెంతో శుభకర మైన దనుట ఎల్ల రెఱింగినదే. నిజముగా మనకంటెను వా రెక్కువ యభివృద్ధి నొందియే యున్నారు. పాశ్చాత్యభూములలో బానిసపద్ధతియు, సామంత పరంపరాపద్ధతియును నశించినవి; నిరంకుశాధికారము ఎక్కడనో భూగర్భమున దాఁగినది; ప్రజాధికారము దినదినాభివృద్ధి నొందినది; స్త్రీలు పురుషులతో సమానముగా నిర్వాచకపదవి నధిష్ఠించినారు; జనులు క్రమక్రమముగా వికాసవంతులై, సంపద్యుక్తులై, సౌఖ్యవరు లగుచున్నారు; త్రాగుడు రమారమి నెల్లయెడల నిరోధిత మగుచున్నది; లోకశాంతిని స్థాపించుటకై ఏర్పడిన "సర్వజాతీయసంఘము" స్థాపిత మగుచున్నది. పాశ్చాత్యజీవితతత్త్వము దేశీయక్షేమమునకై ప్రతిమానవుఁడు త్యాగిగాఁ గావలయు నను సిద్ధాంతముపై నాధారపడినవి. నేఁటిదినము మన జీవితతత్త్వమింకను ఆ యాధారమును గ్రహింపలేదు.

పాశ్చాత్య పౌరస్త్య విజ్ఞాన ప్రవాహములు రెండును నేకమయినప్పుడు రెంటియందలి నెరసులు క్షాళితము లగును. రెంటియందును బలీయశ్శక్తులు విజృంభించును. రెండింటి యైక్యముచే నవీనప్రపంచమునకు పునాది యేర్పడును. భౌతికమాత్రం బగు పాశ్చాత్య దృష్టిపథంబు మాఱిపోవును. చారిత్రికసందర్భముల వలన మన భారతభూమి నావరించియుండు ఆముష్మికరూపపారమార్థిక దృక్పథము మాఱిపోవును. పారమార్థికచింతతో నిండిన నిర్మలమైన భౌతికప్రపంచకదృష్టి నెలకొనును. అనఁగా సర్వలోకసంరక్షకుఁ డయ్యు సర్వలోకత్యాగసమర్థుఁ డైన జనకమహారాజు దినములం బోలు దినములు ప్రసన్నము లగును. క్రౌర్యములకు తావీయని జాతీయజీవనమును లోకజీవనమును వ్యాపించుటకు మార్గ మేర్పడును. పాశ్చాత్యులు, ఏ సర్వసౌభ్రాత్రమునకై తారాడుచు సర్వజాతీయసంఘము నేర్పఱచినారో ఆసౌభ్రాత్రము యథార్థముగఁ గన్పట్టు దినములు రాఁగలవు. కాఁబట్టి ఉత్తమపాశ్చాత్యగ్రంథసముదాయమును మన భాషారూపమును దాల్చున ట్లొనర్చుట ప్రకృతము అత్యావశ్యకము.

మన విద్యావిధానము లోపభూయిష్ఠ మని అందఱు ఒప్పుకొనినదియే! నేఁడు మనదేశములో నగపడియుండు జాతీయజీవనమునందలి యుత్సాహము గాని, మన ప్రజాహితజీవనపరత్వము గాని, మన రాజకీయాంశములు గాని, మన విద్యాపద్ధతుల ప్రభావమువలన కలిగిన వనరాదు. పాశ్చాత్యులతోడి సంబంధముచే కలిగిన వాతావరణము మూలకముగను, పాశ్చాత్యదేశములకు రాకపోకలు జరుగుటమూలకముగను, పాశ్చాత్యపద్ధతుల ననుకరించి నడుపంబడుపత్రికాప్రపంచము మూలకముగను, పాశ్చాత్యరాజనీతిశాస్త్రము నభ్యసించుట మూలకముగను, ముఖ్యముగా ప్రభుత్వపద్ధతి నిరంకుశముగా నుండుటవలనను కలిగిన వని చెప్పవచ్చును. మన విద్యాలయములలో చదివించు పాఠ్యగ్రంథము లింతటిఫలమును సమకూర్పగలవి కావు. నిజమునకు బారెఁడుదూరపు సంగతులు నేర్పు గ్రంథములు కూడ నందు కొన్ని గలవు. తక్కుంగలవి పనికిమాలినవి. చరిత్రశాస్త్రమున పట్టపరీక్షాంచితు లగు మనపండితులలో రాజస్థానకథావళిఁ జదువనివా రున్నారు. కార్లైలు ఫరాసు విప్లవము నెపోలియను వాషింగ్టను జీవితముల, నెఱుంగని వా రున్నారు. అదే రీతిని అర్థశాస్త్రపండితులు దత్తుకృత 'హైందవార్థికచరిత్రము'ను గాని, డిగ్బీకృత 'సంపద్యుక్తభారతభూమి'ని గాని, రానడేకృత 'ఆర్థికసమస్య'లను గాని కారల్ మార్క్సుకృత 'మూలధనయజమాను'లను గాని ఎఱుంగనివా రున్నారు. ఇఁక రాజనీతిశాస్త్రకోవిదు లని పే రొందినవారో ప్లేటోకృత 'ప్రజాసత్తాకము' నెఱుంగరు. అరిస్టాటిలుకృత 'ప్రభుత్వము'ను గాని రూసోకృత 'సంఘము వ్యక్త్యంగీకార నిర్మితము'ను గాని, మాంటెగ్యూకృత

'న్యాయశాస్త్రతత్త్వము'ను గాని, సర్ థామస్ మూర్ కృత 'ఆదర్శభూమి'ని గాని, మిల్లుకృత 'ప్రాతినిధ్య ప్రభుత్వము'ను గాని, చూచినవారు గారు. అన్నిటికంటె నాశ్చర్య మేమి యనఁగా షట్టపరీక్షాంచితు లైనను మన సంస్కృతపండితులు భగవద్గీతముఖము నైనను చూచియుండరు.

విశ్వవిద్యాలయ మన్ని గ్రంథములను చదివించుట కేర్పడినదియా యని ప్రశ్నింపవచ్చును. అందు కేర్పడినది కాదు నిజమే. కాని అట్టి యుద్గ్రంథపఠనమునకు నుత్సాహమును కల్పించి తగు గ్రంథసామగ్రితో పరిచయము చేయవలసిన ధర్మము మాత్రము విశ్వవిద్యాలయమునకు గలదు. ఆపనిని మన విశ్వవిద్యాలయము చేయలేదు. చేయఁజాలదు. పరభాషామూలకముగా నీయుత్సాహముఁ బురికొల్పఁజాలదు. అందుచేత ముందు రాఁదగిన వికాసముఁ గూర్చి ఆలోచించినను దేశభాషలలోనికి నీగ్రంథము లన్నింటిని ప్రకటించుట యావశ్యకము. మనదేశములో నింగ్లీషు చదువుకొనినవారు మిక్కిలి తక్కువగా నున్నా రనుట విదితము. వీ రైనను తమ భావములను భార్యలకు సోదరీమణులకు, తల్లులకు, ఇంగ్లీషురాని తండ్రులు తాతలు బంధువులు మొదలగువారికిని చెప్పలే కున్నారు. ఇతరుల కన్ననో ఇంగ్లీషు రాదు. ఇంగ్లీషు నేర్చుకొనిన కొలఁది మంది కన్ననో సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక విషయములను దేశభాషలలోఁ జెప్పుటకు శక్తి చాలదు. కాఁబట్టి వీరిలో వీరికిఁ గల సంబంధమే తాఱుమాఱై యున్నది. పాశ్చాత్యసాంప్రదాయబద్ధము లగు రాజకీయ, సాంఘికార్థిక, వైజ్ఞానిక గ్రంథములు దేశభాషలలో ప్రకటితము లగునేని ఈసంబంధము మఱల పూర్వరూపమును దాల్చి సహజాభివృద్ధికి మార్గ మేర్పడు ననుట స్పష్టము.

లోకములో ఏ జాతియొక్క వాఙ్మయప్రపంచమును పరిశీలించి చూచినను అందు నుత్తమ మగు భాగము కొంతవఱకు పరదేశవాఙ్మయాధారము పై నిర్మిత మైనదిగానే కన్పించుచున్నది. మన హైందవభూమినుండి ఆధ్యాత్మికవాఙ్మయము నితరు లెరవు దీసికొని మహాలాభమును పొందుచున్నారు. మన రామాయణ మహాభారతములు, మన వేదవేదాంతములు, అన్నియు ఆంగ్లులు, జర్మనీవారు, ఇతర నాగరకజాతులు తమ తమ భాషలలోనికి వ్రాసికొనినారు. మనమును, రాజనీతి, అర్థశాస్త్రము, సంఘశాస్త్రము, విజ్ఞానశాస్త్రములు, వీని విషయమున కొంతవరకు పరదేశజులజ్ఞానమును ఎరవు తెచ్చికొనవచ్చును. సాక్రటిసు, ప్లేటో, అరిస్టాటిలు, క్సెనఫను, ప్లూటార్కు, డిమాస్థనిసు, సిసెరో, మాజినీ, రూసో, వాల్టేరు, మాంటెస్క్యు, హ్యూగో, డ్యూమను, జోలా, మోరు, కార్లైలు, స్పెన్సరు, మిల్లు, వాలెసు, న్యూటను, బేకను, డార్విను, హక్స్లి, కారల్‌మార్క్సు, నిచ్చీ, వైస్‌మాన్, డివ్రిన్, డియోస్తయఫ్స్కి, బెకునిక్, గోర్కి, టాలుస్టాయి, కొరొపాట్కిన్, వాషింగ్టన్, నెపోలియన్, లింకన్, వీ రెల్లరును అన్ని జాతులవారికి పూజ్యులు. వీ రెల్లరి భావప్రపంచమును మన భాష కలంకారముగ కొని తెచ్చుట మన వాఙ్మయము నగణ్య గుణయుతము చేయుట యగును గాని వేఱుకాదు. కవిత్రయము చేసిన పని యేమి? వారు స్వతంత్రగ్రంథరచనకు గడంగ లేదే! సంస్కృతగ్రంథములకు తెనుఁగురూపము నిచ్చిరి. ఏవా రాపని నిరుపయోగకర మని అనఁగలరు? ఆంధ్రమున వ్రాయని మాత్రమున ప్లేటోగాని, అరిస్టాటిలు గాని, మాజనీ గాని, రూసో గాని, టాలుస్టాయి గాని, కొరొపాట్కిన్ గాని, రవీంద్రనాథుఁడు గాని, రాయ్ గాని, చిరంజీవిత్వమున కనర్హు లని ఎవరు అనఁగలరు?

మన దేశభాషల చరిత్రము ననుసరించిన నేమి, పాశ్చాత్య దేశభాషల ననుసరించిన నేమి, ఒక్క విషయము స్పష్టముగా బయల్పడుచున్నది. ఎచ్చటను ఉత్తమభాషాంతరీకరణమే ప్రథమకర్తవ్యముగ నంగీకృత మైనది. ఆంధ్రభూమిలో మున్నున్న సంస్కృత పురాణములు కావ్యములే భాష కలంకారము లైనవి. ఐరోపాఖండమునందును గ్రీకు లాటిను భాషలలోను నుపక్రమిత మైనది ఇట్టి గ్రంథసామగ్రిని జీర్ణించుకొని ఆయా జాతులవారు స్వతంత్రగ్రంథముల రచింప మొదలిడినారు. కాఁబట్టి రాజకీయ, సాంఘిక, ఆర్థిక విషయములను గుఱించి మనము స్వతంత్రగ్రంథముల రచించు యుగము ఇంకను రాలేదు. మొదట ఇతరభాషలలోని గ్రంథసముదాయమును దేశభాషలలోనికి తెచ్చి వానిని జీర్ణించుకొని తక్కుంగల పనికి గడంగవలసి యుండును. అప్పటికిని స్వతంత్రగ్రంథములు వ్రాసినవారు భాషాంతరీకర్తలకంటె ప్రతిభావంతు లని గాని, వారికంటె దేశమున కెక్కువసేవ చేయగలవా రని గాని ఎవ్వ రనఁ

గలరు? ఆంధ్రదేశములో కవిత్రయమును కాదని పై కెగసిన కవిపుంగవుఁ డెవఁడు గలఁడు? ప్లేటో, అరిస్టాటిలు ఇత్యాదుల కాంధ్రరూప మిచ్చు మహానుభావుల పదవి తమకు లభింపదే యేమి చేయవచ్చునని స్వతంత్ర రాజకీయ గ్రంథనిర్మాతలు ఆలోచింపవలసిన యవసరము రు నేర్పడు ననుట నిస్సంశయము.

ఆంగ్ల భాషను హైందవభూమిలోని ప్రతిపురుషుఁడును, స్త్రీయును అభ్యసించుట పొసఁగదు. అవసరము కాదు. పట్టణవాసులకు తప్ప అది లభ్యమును గాదు. ఇంతే కాక దాని యభ్యాసము సులభసాధ్యము కాదు. పది పదునై దేండ్లు నేర్చుకొనినను ఎంతో పాండిత్యము కలుగదు. అందు కొంతభాగము కాలము వ్యయపఱచినయెడల ఎవ్వఁడైనను దేశభాషలలో పండితుఁడు కావచ్చును. ఇంగ్లీషుభాష అందఱకు అక్కఱలేదు. ప్రభుత్వోద్యోగములకు ఆశపెట్టుకొనిన వారికి మాత్రమే అది యత్యవసరము. వారు పడునట్టి వ్యయమునకు మితి లేదు. కుమారున కింగ్లీషు నేర్పు నుద్దేశముతో నాశముచెందిన కుటుంబము లెన్నియో కలవు. నూటికి డెబ్బది, యెనుబది మంది పరీక్షలలో పరాజితు లగుచుండుట దినదినము మన కండ్లయెదుట జరుగుచుండుపని. ఇట్టిస్థితిలో కుటుంబములు కూలక నిలుచు టెట్లు? నిజముగా పాశ్చాత్యవిద్య — ఇంగ్లీషుభాష కాదు — ప్రజలలో వ్యాపింపవలయు ననిన యెడల పాశ్చాత్యభాషలలోని ఉద్గ్రంథములను భాషాంతరీకరించి సులభమైన వెలలకు నయ్యావి ప్రజలకు అబ్బునట్లు చేయుటయే మంచి మార్గము. అప్పుడు ఒక్కవిద్యార్థి ఒక్కసంవత్సరము వెచ్చపెట్టునట్టి మొత్తముతో నెవ్వఁడేని పాశ్చాత్యవిద్యకుం జెందిన యెల్ల యుత్తమగ్రంథములను కొని చదువుకొనవచ్చును.

మఱియొక సంగతి: ఈభారతభూమిలో హిందూ మహమ్మదీయజాతులు రెండును కలవు. ఇందులో మహమ్మదీయులు ఎవ్వరో కొందఱు తప్ప — అందులోను ఉద్దండకవులును ఉన్నారు— సామాన్యముగా ఉరుదు, అరబ్బీలే చదువుదురు. దేశభాష లనిన వారికి గిట్టదు. దానికి కారణము లేకపోలేదు. దేశభాషలలో ఎక్కువగా మూఢాచారములకు సంబంధించిన హిందూమత విషయము లెక్కువగా నుండుట గలదు. హిందువులకివి యెంతయో యెక్కువగా ప్రియము లైనను మహమ్మదీయులు వీనిని ప్రేమింతు రనుట కానిమాట. అయిన రెండుజాతులవారు ఏకదేశనివాసులును సోదరులును. భాష యనునది యైక్యసాధనము. ఈ భాషలో రెండుజాతులకును అభిరుచి పుట్టించుటకు దారి లేదా? లేక యేమి? జాతీయ జీవనాధారమైన చారిత్రి, కార్థిక, రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక, గ్రంథ నిర్మాణమే ఇందునకు సాధనము. కాఁబట్టి పాశ్చాత్యభాషలలోని యుత్తమగ్రంథములను భాషాంతరీకరించితి మేని అట్టి అభిరుచి కల వాఙ్మయమునకు పునాది గట్టిగా వేసిన వార మగుదుము. ఐక్యభావమును అభివృద్ధి చెందించిన వార మగుదుము.

ఎన్ని విధముల నాలోచించినను పాశ్చాత్యభాషలలోని యుద్గ్రంథములను ఆంధ్రరూపమునకు గొని తెచ్చుట అత్యవసరముగా నున్నది. లోకములో పాశ్చాత్యుల సంగతి మనము తెలిసికొని, వారును మనమును కలిసి లోకకల్యాణమునకై పని చేయుటకు లోకశాంతిని సంపాదించుటకు కూడ ఇది సాధనభూతము కాఁగలదు.

దేశభాషల యావశ్యకత్వ మిట్టిదని దక్షిణభారతమున కంతటికిని ప్రబోధమును కల్పించిన యాంధ్రుల మగు మనము ఈ యుపకరణము నెంతవఱకు సమకూర్చుకొనఁగలమో చూడవలసియున్నది.

# తిక్కనస్మృతి

ఒంగోలు వేంకటరంగయ్యపంతులు గారు, బి. ఏ., బి. ఎల్.

తిక్కన సోమయాజి వంశపు పూర్వోత్తరసందర్భమునకును నెల్లూరికి వాయవ్యమున క్రోశత్రయదూరమున నుండు పాటూరునకును అనాదిసంబంధము పారంపర్యముగ కలదు. ఈ పాటూరునకీ ఖ్యాతి నొసఁగఁజాలమిఁ గొందఱు మండలాంతరమునందలి ప్రాటూరితో నా మహామహు నన్వయింపఁజూతురు గాని, ఈ వికల్పము నిరాధార మనఁజెల్లును. పాటూరఁ దిక్కన యన్వవాయలింగము లనేకములు గలవు పుత్రపౌత్రాద్యనుస్యూతవంశావళి గల పాటూరివారి కుటుంబశాఖ యిప్పటికి నొకటి యీ గ్రామమునఁ గలదు. తిక్కన యుండిన యింటిపట్టని యచటివారు విశీర్ణశిష్టకాకుడ్యఖండ మొకటి చూపుదురు. అద్దాని ప్రతిబింబము ప్రక్కనున్న యొకటవ పటమున చూడనగును. అయ్యది ప్రాచీనమై గంభీరసూచనగలదై యున్నది.

పై ప్రదేశపు చేరువనె తిక్కన స్నానపానాదుల కుపయోగించినట్లు కీర్తి గన్న బావి యొకదానిని గ్రామవాసులు గౌరవించుచున్నారు. ఈ బావి నీరు రుచ్యమనియు ఆరోగ్యకర మనియు ప్రశస్తి గలదు. బావిని చూడ ప్రాఁతకాలపు కట్టడ మని స్ఫురించును. ఈ పుణ్యతీర్థపు టాకృతి రెండవ పటమున కన్గొనవగును.

ఉదాహృతకుడ్యకూపములు తిక్కనకు మాత్రమె కాక యతని పూర్వికులకును అర్వాచీనులకును గూడ సంబంధము గలిగియుండును. తిక్కనకు మాత్రమే సంబంధించిన వస్తు వొకటి యీ గ్రామమున తద్వంశజుల యింటఁ గలదు. అదియే యీ కవిబ్రహ్మ వాగనువర్తి యైన దివ్యకశిసికోశము. తిక్కన చేతి నలంకరించిన గంట మేపాటిదియో యూహింప నవకాశము లేదు. ఈ యొఱను చూడ నా గంటము సామాన్యప్రమాణమును మించి యుండు నని తోఁచుచున్నది. ఈ గంటపుటొఱ దాదాపు పండ్రెం డంగుళముల పొడవును తలతట్టు ఒక యంగుళము వ్యాసమును గలిగి యున్నది. ఆకృతి యందమై మెఱుఁగు గల్గి నునుపెక్కి యున్నది. ఈ యొఱ యే కొయ్యతో చేయఁబడినదియు నిర్ణయించుటకు వలనుపడదు గాని దృష్టికి చందనపుకొయ్య యని తోఁచుచున్నది. ఈ యొఱ చూపునకు నలుపు నెఱుపు గలసిన వర్ణము గల చేవకొయ్యవలె నున్నది. దీని నింగ్లీషున చాక్లెటు వన్నె యనఁదగును. నిలువున రెండు తునుకల జంటించి వట్రువగ తీర్చినట్లు కనఁబడుచున్నది. కడు ప్రాఁతది యగుటచే కించిద్విశ్లథస్థితిని చెంది కొలఁదిగ పైభాగమున చీలినటు లున్నది. ఆ చీలికను కొనసాగనీక నిలుపుటకై పై భాగమున రాగికమ్మి చుట్టును మెలిపెట్టియున్నది. ఇయ్యది మూడవ పటమున (క) చిహ్నితమై యున్నది. ఈ పటములో ఈ కట్టునకు $1\frac{1}{2}$ అంగుళము క్రింద మరియొక కట్టు బిగించియున్నది. ఇది (చ) చిహ్నితమై యున్నది.

ఈ యొఱయొక్క శిరోభాగమున వర్ధకి కొంత చిత్రపు పని చేసియున్నాడు. ఆ ప్రదేశమునను యొక సరస్వతీప్రతిమయు మరియొక ప్రక్క గణేశప్రతిమయు సుందరముగ చెక్కఁబడియున్నవి. కాలగతిచే సరస్వతీబింబము నాతిస్పష్టాంగవైభవమై యున్నది. లంబోదరుని వక్రతుండము సువ్యక్తముగ నున్నది. సరస్వతీప్రతిమ మూడవ పటమునను వినాయకుని రూపము నాల్గవ పటమునను చూడనగును.

1917-వ సంవత్సరమున నెల్లూర జరగిన యైదవ యాంధ్రమహాసభ సమావేశసమయమున నీ పవిత్రవస్తువు మంగళవాద్యములతో నూరేగింపఁబడి సభామందిరమున ప్రదర్శింపఁబడెను. ఆ కాలమున నిద్దాని ప్రతిబింబగ్రహణమున కవకాశము లేకపోయెను. ఇప్పటికైన ఆ మహాత్ముని స్మరణమునకీ పాటి సేవ చేయఁగలిగినందునకు సంతసింతము.

“ఆంధ్రావళి మోదముం బొరయ” భారతసంహితం “దెలుఁగు బాస వినిర్మించిన” మహనీయుని సంస్మృతిచిహ్న మా భారతమః గాక వేఱొండు కాఁజాలదు. అయినను, ఆ పుణ్యచరిత్రుని స్పర్శపావనము లగు వస్తుసంచయములఁ జూచుటయు స్మరించుటయు ఆయన సంచరించిన ప్రదేశముల సంచరించుటయు ఆంధ్రలోకమున కొక నూతనోద్దీపనకారణ మగును. భారతసదృశంబు లగు “పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనవిశేషం బగు” నని తిక్కన సోమయాజి చెప్పినట్లు ఆయన స్మరణముచే ఆ మహామహు నొక విధమున నారాధించినట్లు లగును.

Rao Sahib Krishna Rao Bonsala



రావు సాహేబు కృష్ణరావు భాన్సులే గారు

Dewan Bahadur Parankusam Naidu Garu, Dy. Commissioner of Police.



దివాన్ బహదూర్ పరాంకుశంనాయుడు గారు, పోలీస్ డిప్టి కమిషనర్

# తిక్కయజ్వస్మృతిచిహ్నములు

Well in the back-yard



దొడ్డిచుంపలి బావి

Tikkana's residence



తిక్కన గృహప్రదేశము

Tikkana's style's sheath



ఒఱ వెనుకప్రక్క



ఒఱ ముందుప్రక్క

తిక్కన ఘంటపు ఒఱ

# కళింగసామ్రాజ్యము

జయంతి వేంకటకృష్ణారావు గారు

నవీన భారతరంగమున నెచ్చోట నెమకినను కానరానిదియును పౌరాణికాది యుగములఁ బేరు వడసినదియు భారతీయఖ్యాతిని దిగంతముల నాటినదియు నగు కళింగసామ్రాజ్యము నామమాత్రావశిష్ట మై నేఁటి విద్యార్థుల కెట్టి చిహ్నమును కానుపించకయే పోయె. ఉదయాద్రి నొక్కెడ నుండు (In the Eastern Phats) ఉదయగిరి మధ్యసీమలదటి"కళింగఘాటీ"యనబడు కొండదారియు, గంజాంమండలసీమను దక్షిణమునఁ గల"కళింగపట్టణ"మను చిన్న రేవును అచ్చటనే యుండు "ఉద్యాన" మనఁబడు తోటలలోని కాళింగులును, ఇప్పటికిని శ్రీకాకుళప్రాంతముల నుండి బండ్లుతోలియు వర్తకము చేసియు జీవించు "కింతలికాళింగులు"ను, మనదేశపు టుత్తరజిల్లాలోని వైశ్యులలో నొకతెగవా రగు కళింగకోమటులును, ఈకళింగమును స్మరణకు తెచ్చుచుందురు. ఐతిహాసిక గ్రంథములఁ జదువునప్పుడును కళింగ మనియెడు పేరుఁ గాన నగును. ఇట్టి కళింగసామ్రాజ్యపు ప్రాక్చరిత్రముఁ గొంత నిట చర్చింతము.

## కళింగపు పూర్వస్థితి

ఋగ్వేదమునఁ బేర్కొనబడిన దీర్ఘధాముని వరమున బలి సుధేష్ణలకుఁ గలిగిన సంతానమునఁ గళింగుఁడు తృతీయుఁ డనియు, అంగవంగులు వానికన్నఁ బెద్దలనియు మహాభారతమున నాదిపర్వముననను, బ్రహ్మపురాణమునను వ్రాయఁబడి యున్నది. దీనింబట్టి ఋగ్వేదకాలమునననే కళింగ ముండునటుల తోఁచును. పాణిని సూత్రములు గూడ దీనినిఁ బేర్కొనుచున్నవి. విష్ణుపురాణమున రుక్మికి కళింగాధిపుడు సాహాయ్య మొనరించి బలరామునిచేఁ బరాభవ మొందె నని వర్ణింపఁబడి యున్నది. కళింగచిత్రాంగదుని కుమార్తెను దుర్యోధనుఁడు వివాహమైనటుల మహాభారతము శాంతిపర్వమున వ్రాయఁబడియున్నది. వనపర్వమున యుధిష్ఠిరునకు లోమముని వైతరణీనదికి దక్షిణమున నుండి కళింగసామ్రాజ్యము విస్తరిల్లు నని సూచించినటులఁ దెలియుచున్నది. గంగాతీరమునుండి దక్షిణమునఁ గొంతవఱకు తామ్రలిప్తమును, దానికి దిగువ నుత్కళమును, దానికి దిగువ కళింగమును, కల వని పేర్కొనియున్నారు. సందిగ్ధస్థాన మగు నీ నేల కిప్పట్టున నెల్లలు ఉత్తరమున 'చిల్క' సరోవరము, దక్షిణమునఁ గొల్లేరు సరస్సు. హంటరు తన "ఒరిస్సా"యను గ్రంథమున వీటినే కళింగ కెల్లలనియు, నివి కళింగోన్నతి నాడు గొప్ప సింధుశాఖ (Gulfs)లనియును, వ్రాసియున్నాడు. ప్లినియాసీసుల వర్ణించుచు, కళింగము మహేంద్రమాలను దిగువ నున్నదనియు, గంగానదికి దక్షిణమున 474 మైళ్లదూరమున తద్రాజధాని యగు 'కోరంగి' యున్నదనియు వ్రాసియున్నాడు. చీనానుండి తీర్థార్థియై భారతదేశమునకు వచ్చిన "హ్యూనిత్సాంగు"కూడ ఇటులనే పేర్కొనియున్నాడు. ఉత్కళులుగూడ ఉత్తరకళింగమే ఉత్కలమనియు, మధ్యసీమ కళింగ మనియు, తోశె-(ఇదిఉత్కళపదము. దీని కర్థము క్రింద.) కళింగమే తెలుఁగుదేశమని చెప్పెదరు. వీనిని బాగుగా చర్చించియే మనోమోహన గంగులీగారు తమ"ఒరిస్సా దాని చిహ్నములు" (Orissa & her remains) అను గ్రంథమున కాళింగమునకుత్తరమున వైతరణీనదియును, దక్షిణమున గోదావరియును, తూర్పున సముద్రమును, పశ్చిమమున నొరిస్సా సామంతరాజ్యములు నుండెనని సమర్థించిరి. ఇంతియగాక ఉత్కళము కళింగము, రామాయణ భారత కాలముల నాఁడు వేర్వేరు రాజ్యములనియు, బౌద్ధయుగమునాఁడు దత్తధాతువంశమునఁ గాన్పించునటుల ఉత్కలముకూడ

కళింగదేశమున సంకీర్ణ మయ్యె ననియు వ్రాయుచున్నారు. "ఐనీఅక్బరీ"లోఁ గళింగ మొక గణనీయసీమగ వ్రాయఁబడి యున్నదఁట! ఏ దెటుల సమర్థించినను ఇప్పటి కాళింగులుండుతావులను జూచిన కళింగ మెచ్చోట నుండినదో యూహింప నగును.

### ఇప్పటి కాళింగు లెవరు? ఎచ్చటివారు?

ఈ కాళింగుల వేషభాషలఁ గాంచిన వీరు తెలుఁగువా రని స్పష్ట మగును. ఆంధ్రోద్యమారంభమునుండి ఆంధ్రు లనియెడు గంజాం విశాఖపట్టణ మండలవాస్తవ్యులు కళింగసీమవారలే యని చెప్ప నగును. గాని ఇత్సాంగు (Jasing, a traveller ofter Hientsang) వ్రాతలఁ జూచిన, యవద్వీపమే (Java) కళింగ మైనటులుఁ గాన్పించును. భరతఖండాంతర్గత మగు కళింగ మేడ? యవద్వీప మేడ? దాని నెటుల కళింగ మని పిలువ నగు నని యోచించిన, కొంతదనుకఁ గాళింగులచరిత్రము బోధపడగలదు. హంటరు వ్రాసిన వ్రాతలు దాక్షిణాత్యులతోడనో వారికి ముందుగనో నౌకాయానప్రవీణులై పరదేశములతో, అందునను ముఖ్యముగా యవద్వీపముతోను, కళింగులు క్రీస్తు శకమునకు సుమారు ఎనిమిది శతాబ్దములు ముందుగనే వర్తకమును సలుపుచుండి రని కానఁబడును. చిల్కాసరోవర మానాఁడు పరుల నౌకలతోడ నిండియుండినటులను, కళింగరాజుల విద్యాభ్యాసమున నావికశిక్ష కూడ నొక ముఖ్యాంగ మైనట్లును కాన్పించును. ఇది నావికులై విదేశయాత్రికు లగువారికి స్థిరవసతి యగుట యెట్లు? ఆంగ్లేయులు ఇంగ్లాండుననే కానఁబడుదురా! ఆంగ్లేయు లున్నచో నెల్ల ఇంగ్లాం డనఁగలమా? బౌద్ధయుగమున నౌకాయానమున కెట్టి యాటంకములును లేకుండుటంబట్టి కళింగవాణిజ్య మధిక మయ్యెను. ప్రాచీనకట్టడములపైఁ గల చిత్రములును, వ్రాతలును, దీనికి సాక్ష్యములు. సర్ ఏ. పి. ఫైరీగారి 'పేగు' దేశచరిత్రమున నాదేశపు పురాతన నాణెములపై, హైందవులచిహ్నము లున్న వనియును, "మార్సిడన్" గారు కనిపెట్టినటుల హిందూభాషలే మలయభాషకు (Malian Language) మాతృక లనియును, ఈన్యాకిని సింహపురమున (Singpore) కళింగవంశజుఁడు కాళింగు డనియే పిలువబడుచు నివసించుచున్నాఁ డనియును వ్రాయుచున్నారు. ఆ వరువడినే నేటికిని అట కరుగు హిందువులను ఆ సీమవారు కాళింగు లని పిలుతు రఁట.

### కళింగపు టున్నత స్థితి

'సర్ వాల్టర్ యిలియట్'గారు "భారతదేశపు తూర్పునకును, బంగాళాఖాతపు టీవలి నేలలకును గల పురాతన వాణిజ్యము, నేటికంటె వేయి మడుంగులు నెక్కుడుగ నుండె ననుట కెట్టి సందేహమును లేదు. బౌద్ధోన్నతితో నీవాణిజ్యమును హెచ్చెను. బౌద్ధులు బాధితులు అయ్యును విడువక ఈసీమల కరుదెంచి స్థిర నివాసములఁ గావించుకొని" రని వ్రాసియున్నారు. యవద్వీపాక్రమణమును గూర్చి వ్రాయుచు (The colonization of Java – page (48) "ఈ శకారంభమున డెబ్బదియైదవ వత్సరమునఁ గొందఱు కాళింగనావికులు బయలుదేరి సాహసించి యవద్వీపముఁ జేరిరి. అట పట్టణములును, పల్లెలును కట్టుకొని తమ మాతృదేశముతో వాణిజ్యమును సలుపుచు చిరకాల ముండి" రని నుడివిరి. (Elephant Stone) 'ఎలిఫెంటుస్టోన్'గారు ఈ యవద్వీపమునందలి హిందువుల నాగరకతను వర్ణించుచు క్రీ॥ శ॥ 75-వ యేట కళింగమునుండి వచ్చిన కాళింగు లనియెడి హిందువు లచ్చట విడిసి ఆ ద్వీపవాసుల నాగరకులఁగా నొనరించి రని వ్రాసియున్నారు. చీనాదేశ నివాసి 'హ్యూయనిత్సాంగు' చీనాకు బోవునపుడు "యవద్వీపమునుండి కళింగనావలో నెక్కిపోయినట్లును, నావికులు బ్రాహ్మణమతస్థు" లనియును, వ్రాయుచున్నాడు. యవద్వీపపు నైతిహాసకులే గాక పాశ్చాత్యు లగు (Crowford) క్రాఫర్డు, (Fergusson) ఫెర్గూసన్, గార్లును, కళింగాక్రమణముఁ గూర్చి వ్రాయుచు "శ్రీ శంకరాచార్యు"ని యద్వైతవిజృంభణకాలమున నీ కళింగులట కపరిమితముగ వచ్చి తమ బౌద్ధమతమును కాపాడుకొని రని చెప్పుచున్నాడు. ఇటుల రాజ్యవిస్తీర్ణముననేమి, వాణిజ్యముననేమి, నాగరకతనేమి, మతప్రచారముననేమి కాళింగు లింటను రచ్చనుఁ గూడఁ బే రొం

దిరి. 'కెవాయియుయేన్', కేటలాగులో క్రీ॥ శ॥ 720-వ సంవత్సరమున 'వజ్రబోధి' యను బౌద్ధుఁడు మత ప్రచారమునకై చీనారాజధాని కేగి యట మాంత్రిక (Mystical) బౌద్ధమును స్థాపించె నని వర్ణింపబడెను.

కాళింగులు తమ మాతృభూమియందును విశేష ముగాఁ బేరొందిరి. మాగధులు ప్రక్కలోని బల్లె ములై అశోక, పుష్యమిత్ర, సముద్రగుప్తాది చక్రవర్తులను ధిక్కరించి జయించి మనిరి. హర్షవర్ధనుని కాలమున శశాంకుఁ డనువాని యధీనమున నీకళింగ మున్న దఁట! ఖరవేలుని కాలమునుండియు ఆంధ్రులతోడి సంబంధ బాంధవము లీకళింగుల కుండినటుల మగధపై వెడలిన దాడులే రుజువుచేయును. రాజనరేంద్రుని మనుమఁడు కళింగ మేలినటుల స్పష్టపడుచున్నది. కన్నడపు "రాజశేఖర విలాసము"న రాజరాజుని కొడుకు గంగయ్య కొండచోళుఁడు కళింగమును జయించి సముద్రమార్గమున బర్మాదేశమును గూడ జయించినటులఁ దెలియుచున్నది. కులోత్తుంగచోళదేవుఁడు తన సేనాధ్యక్షుఁ డగు 'కరుణాకరతొండమను'ని పంపి కళింగమును సాధించె నఁట. క్రీ॥ శ॥ 1001 న రాజరాజచోళుఁడు తనకుమార్తెను వేంగినృపతి యగు విమలాదిత్యున కిచ్చి కళింగమును తాను జయించిన రాజ్యములతోఁ గలుపుకొనె నఁట. అనాదిగ వచ్చిన ఈ బాంధవమునే మన విజయనగరపు కృష్ణదేవరాయలును కటకమును జయించి తిరుగా కలుపుకొనియెను.

ప్రస్తుత చిహ్నములు

స్వరాజ్య మనియును ప్రజాస్వామిక మనియును నలుగడల మారుమ్రోగు నీదినములలో వీరల చరిత్రమును కొంతవఱకు సహకారిగఁ గాఁగల దనవచ్చును. ఇప్పటికిని ప్రజాస్వామికపాలనచిహ్నము లగు పంచాయతీ సంస్థలు వీరిలోఁ గలవు. సంస్థలే గాక వీరలకు నియమితస్థానములకు వైశ్యరాజులును, గలరు. ఈ సంస్థల వారి విధులను గాని, ఆజ్ఞలను గాని, మన్నించనివ్యక్తి బహిష్కృతుఁ డగును. నేటికిని వీరు నిష్కళంకముగ నీసభల నెరపుచున్నారు. మన మింతదనుక చూచిన కళింగపు సరిహద్దులోనే గాక, ఎన్నియో పురుషాంతరములనుండి వీరు స్థిరవసతులను గావించుకొనిన ఉత్కళసీమలలోఁ గూడ నీసమావేశములు కూడుచుండు నఁట.

సింహావలోకనము

ఒకప్పుడు రాజధానిగ నుండె నని చెప్పఁబడు ముఖలింగప్రాంతపుకట్టడములను చూచిన, మహేంద్రగిరి నెక్కి దృష్టి నలుగడలఁ బ్రసరింపఁజేసినను, కళింగఘాటీప్రకృతిశాఖ నానందించినను, ఉద్యానమున విహరించినను,మనపూర్వులను స్మరింపక పోరు. వారల మనవారనుకొనుట మనకు ఘనతకుఁ గూడ కారణ మగును. మన మెప్పుడు మన పూర్వవిభవమును మఱతుమో మన మనుజులును మనల నప్పుడే మఱతురు. కాన నీసీమచరిత్రము నెఱుఁగుట మనకు విధి. కోణార్క జగన్నాథ, భువనేశ్వరాలయములును తత్సమీప బౌద్ధవిహారములును, ఎవరిని రంజిల్పచేయవు? కళింగమును గూర్చి, అశోకుని శిలాశాసనములు ఎవరిని తర్కింపనీవు? అటికాదేశము పాశ్చాత్యుల కెట్లు మార్గదర్శకమయ్యెనో, కళింగము కూడ మనవారల కంతటి మహోపకారముఁ జేసియున్నది.

వారికిఁగల వసతులు దీనికిని గలవు. దానివలననే ఇదియు నౌన్నత్యము ననుభవించెను. ఏజియను (Aegean Sea) సముద్రమున అది ఎటుల నీదెనో కళింగనౌకలు బంగాళాఖాతమును నటుల పాలించెను. పాశ్చాత్యులా సీమఖ్యాతిని దిగంతముల నాటిరి. భారతీయులో కళింగులమాటయే మఱచిరి. స్వతంత్రశిల్పము, స్వతంత్రఖ్యాతి, స్వతంత్రరాజ్యాంగపద్ధతి, ఇది యది యననేల? అన్నిఁటను స్వాతంత్ర్యముఁ జూపిన వీరలచరిత్ర నెరుగవలసినదే! ఎరుగకున్న నిజముగా స్వాతంత్ర్య మన నెట్టిదో మన మెఱుఁగుటకు చాలకాలము పట్టును. లేనిచోఁ పాశ్చాత్యులు పెట్టినదే భిక్ష యగును.

# కౌటిల్యుని యర్థశాస్త్రము

మండలేముల వెంకటశాస్త్రి గారు బి. ఏ.

సర్వసాధారణముగ నర్థశాస్త్ర మనఁగా విత్తమును
గూర్చిన శాస్త్ర మని యభిప్రాయము కలు
గును. విత్తసముపార్జనాది వ్యవహారములకు సంబం
ధించిన శాస్త్రీయచర్చ యొకటి మనవాఙ్మయమున నిటీ
వల వెలువడినది. కాని కౌటిల్యునిచే రచింపఁబడిన
యర్థశాస్త్ర మీవిధముగఁగాక, ధర్మార్థకామమోక్షము
లను నాలుగింటిలోను రెండవదానిని చర్చించును. ఐహి
కమున ప్రజ లభివృద్ధి నొంది సౌఖ్యము పొందుట కను
వగు మార్గము లిందు నిరూపింపఁబడినవి. క్షత్రియుల
కుచిత మగు స్వరాజ్యరక్షణమును, ప్రజలహితమునకు
సాధనము లగు మార్గముల ననుసరించుటయు, మొద
లగు విషయము లన్నియు నతని గ్రంథమున విపుల
ముగఁ జూపఁబడినవి.

కౌటిల్యుని గ్రంథమును విమర్శకదృష్టితోఁ బరీ
క్షించువారికి వాని యసాధారణప్రతిభయు, పాండి
తియు, క్రమముగఁ దేటపడఁగలవు. ముఖ్యముగ నిది
రాజ్యపరిపాలన విధానములఁ దెలుపును. కావున రాజుల
కత్యంతోపయోగకరము. ఆ విషయమునఁ గడుఁ బరి
శ్రమము చేసి జ్ఞానమును సంపాదించి యభిప్రాయము
నియు సమర్థులగు పండితులకుఁ గూడ దానివిలువ యన
మానము. మనదేశమునఁ బూర్వు లందఱు నాత్మవిజ్ఞాన
పరులై నిరర్థకము లగు విషయములలో బుద్ధిని విక
సింపఁజేసి మానసికానందమును మాత్రము పొంది
రనియు రాజ్యాంగతంత్రములయందును ఆర్థిక ప్రయత్న
ములలోను వెనుకఁబడి హీనస్థితియం దుండి రనియు
నీకాలమునఁ గూడ మనలో నావిధ మగు ప్రయత్నము
కానరా దనియు, అందువలననే మనయందు దేశీయ
భావము బాగుగ నాటుకొనలే దనియు పాశ్చాత్యులు
కొంద అభిప్రాయపడి యున్నారు. నిజముగ మన
మాత్మవిజ్ఞానపరులమై, యసమాన మగు జ్ఞానము నుపా
ర్జించి, తోడిజాతులకంటె నధికుల మని పేరొంది యుం
టిమి. పాశ్చాత్యవిద్యాభ్యాసబలముచే మన కీకాల
మునఁ దొల్లిటివాసన తగ్గుచున్నది. అందుకై మనము
విచారించుట యుక్తము. దాని నభివృద్ధినొందింపఁ బ్రయ
త్నించుచు నార్థికవిషయమునఁ గూడ జాగరూకులమై
యుండినచో జాతీయాభ్యుదయము నొందుదుము.
పాశ్చాత్యపండితులు పొరబడి మనలో లేని లోపముల
నారోపించి రనియు, ప్రపంచమున నెవ్వరును తలయెత్తని
కాలమున మన మసాధారణ మగు నాగరకత కలిగి
యుంటి మనియు నర్థశాస్త్రముఁ జదివిన మనము గ్రహిం
తుము. ఈకాలమున నాగరకశిఖామణు లని పేరొందిన
విదేశీయులలోఁ గూడఁ బరిష్కరింపఁబడని సూత్రములును
పరిపాలనక్రమమును క్రీ॥ పూ॥ నాలుగవ శతాబ్దము
ననే మనదేశీయులు నిశ్చయపరచి గ్రంథస్థ మొనరించిరి.
రాజునకును బ్రజలకును మితిలేని కలహములు కలుగు
టయు, రాజ్యాధిపతు లధికారమునఁ గల యాసచే
మృతు లగుటయు రాజును పదభ్రష్టత్వ మొందింపఁ
జేయుటయును మనదేశమున సర్వసామాన్యములు గావు.
అవి లేకుండినచో నాగరకులము కాకపోయినయెడ,
మన మనాగరకుల మని పిలువఁబడినను శాంతినొంది
జీవించి, యభివృద్ధి నొందఁగల మని ధైర్య ముండిన
నంతియ చాలును. రాజునకునుఁ బ్రజలకును కలహ
ములు లేక యనుకూలముగ వ్యవహారము నడచు మార్గ
మును కౌటిల్యుఁడు చూపియుండెను.

అర్థశాస్త్ర మంతి విలువ గల గ్రంథ మైనచో
నది యెవఁడు రచించెను? కౌటిల్యుఁ డనుపేరు బిరుద
నామముగఁ దోఁచుచున్నది గదా? అతని నిజ మగు
పేరేమి? అతఁ డేకాలమున నెవనికొలువున నుండి దీనిని

వ్రాసెను? అని కొన్ని సందియములు గలుగుట నిజము. మనదేశస్థులలో బుద్ధిమంతులు కొంద ఱీవిషయమునఁ జాలఁ బరిశీలన మొనరించి యతఁడు మౌర్యవంశమునకు మూలపురుషుఁ డగు చంద్రగుప్తుని కాలమువాఁ డనియు నతనికి విష్ణుగుప్తుఁ డనియు చాణక్యుఁ డనియుఁ బెక్కు నామములు కల వని తెలుపుచుఁ దమవాదమును బల పఱచుటకు "విష్ణుగుప్త ఇతి సాంస్కారిక సంజ్ఞా చాణక్యః కౌటిల్య ఇతి" అనువచనమును శంకరార్యుని గ్రంథమునుండి తీసి చూపుదురు. సాంస్కృతిక సారస్వత పరిచితు లగు వా రెల్లరును కౌటిల్యుని యర్థశాస్త్రమును గూర్చి హేమచంద్రుఁడును కామందకుఁడును పెక్కుచోటులఁ బ్రశంస సేసి రని యెఱుఁగుదురు. కామందకుని "నీతిసార" మితని యర్థశాస్త్రము నను సరించియే వ్రాయఁబడినది. కొన్ని పదములును పద సమూహములును కూడ నర్థశాస్త్రమునుండి కైకొనఁ బడినట్లు చూపఁబడినవి. కౌటిల్యునకును చంద్రగుప్తునకును గల సంబంధము కూడ గ్రంథస్థము లగు కొన్ని నిదర్శనములచే నిర్ధారణచేయఁబడినది. విష్ణుపురాణము కౌటిల్యుఁ డను బ్రాహ్మణుని యాలోచనచే నంద రాజ్యము నశించి చంద్రగుప్తుని యధీనము కాఁగల దనియు నతఁడు బ్రాహ్మణపక్షపాతియై వారికి సుఖము గలిగింపఁ గానట్లు చేయించుననియు చెప్పుచున్నది. ముందు జరుగఁగలదానిని పురాణములు ప్రజలహితము నకు తెలియఁబఱచుట మన దేశమున నాచారముగనుండు టచే నిందుఁగూడ భవిష్యత్కాలమున జరుగనున్న దని వ్రాయఁబడినది. ఒకవిమర్శకుఁడు, "నవైవతాన్ నందాన్ కౌటిల్యో బ్రాహ్మణ స్సముద్ధరిష్యతి.. కౌటిల్యఏవ చంద్రగుప్తం రాజ్యేఽభిషేచ్యతి" యనుదాని నీయభిప్రాయమునకు బలముగాఁ జూపించియుండెను. చాణక్యునకును చంద్రగుప్తునకునుగల సంబంధము నాధారముగఁగైకొని ముద్రారాక్షస మను నాటకము వ్రాయఁబడినది. కావున వా రిరువురకును పైన వివరింపఁబడిన సంబంధము కల దనుట నిర్వివాదాంశము కౌటిల్యునికాలము క్రీ॥పూ॥ నాలుగవ శతాబ్దమై యుండవలయును. కాని యంతటి యుద్గ్రంథ మంతపూర్వకాలమున నొకఁడు రచించి యుండుట యసంభవమని తలఁచి, విమర్శకులును కొంద ఱు బుద్ధిమంతు లగు పండితులును అప్పుడప్పుడు దానిని వ్రాయుచు వచ్చుటచే నంతటి మేటి గ్రంథ మాయె నని తలంచుచున్నారు. ఈ యభిప్రాయము కూడ సరికాదు. అర్థశాస్త్రపు శైలిని విమర్శించిన, భాషాస్వభావజ్ఞులది యొక్కనిచే వ్రాయఁబడియుండవలయు ననియు లేనిచోఁ జివరవరకు నొకేరీతిగ నుండుట కష్ట మనియు దమ యభిప్రాయము నిచ్చిరి. కావున నీయర్థశాస్త్రము కౌటిల్యుఁ డనియును, విష్ణుగుప్తుఁ డనియును నామాంతరములు గల చాణక్యునిచేతనే వ్రాయఁబడె ననియు, నతనికిని చంద్రగుప్తునకును మన మూహించిన సంబంధము కల దనియు నతఁ డిరువదినాల్గు శతాబ్దముల వెనుకటివాఁ డనియు నెఱుఁగఁదగును.

అంతటి యుద్గ్రంథ మనఁబడుట, కందుగల విశేష విషయములఁ గొన్నిటినిమాత్రము చూడవలసి యున్నది. విష్ణుగుప్తుఁ డసాధారణరాజనీతిజ్ఞాని యని చూచి యుంటిమి. కావున, దాని నతఁ డెట్లు వ్యక్తపఱచినదియు దిక్ప్రదర్శనముగఁ జూడవలయును. ప్రాచ్యదేశములలో నొకఁడు రాజై పరిపాలించుట సామాన్యముగఁ గలదు. దాని కను వగు మార్గములనే యతఁడు సూచనచేసెను. అందు మొదటిదుద్దేశము రాజత్వమును, దానిలక్షణములను బరిశీలించుటయునై యున్నది. ప్రజలు తమ ప్రభువు నెన్నుకొను నాచారము లేకపోయినను, రాజు తనపరిపాలనమునఁ గల ప్రజల కెల్ల దేవునివంటివాఁడై వారి కష్టసుఖముల నారయుచు నుండవలయు ననియు, ప్రజానుకూల్యము లేని పరిపాలనము నిరర్థక మనియు నర్థశాస్త్రము ఘోషించుచున్నయది. ఉచితప్రవర్తకులై బుద్ధిమంతు లగు సచివుల సాహాయ్యమున రాజు పరిపాలనము చేయవలయును. ఉద్యోగులు ధర్మప్రవర్తన కలిగి యుండునట్లు శాసనములను జేసి, వారి వ్యాపారమును రహస్యముగఁ బరిశీలించుచు, దేశమున నన్యాయ్య మను మాటయైన లేకుండునట్లు చూడవలయును. శాసనములఁ జేయునపుడు మంత్రి సభలో చర్చించి, వారి యభిప్రాయమునకు సరిపడి దేశమునకు క్షేమముఁ గూర్పఁగల వని తెలిసికొనవలయును. లేనిచో శాసనములఁ జేయు

రాదు. రాజునకు విధివిహితము లని మఱికొన్ని ధర్మములఁ దెలిపి, యర్థశాస్త్రము దేశహితమునకై వారాచరింపఁదగు కార్యములను స్పష్టపఱచెను. రాజ్యమునకుఁ బ్రజలు ముఖ్యబలము. గావున వారిహితమునకై పెక్కులుపకారములఁ జేయుట ప్రతిరాజునకును విధి యగు కృత్యము. మన దేశమున పంటలు సరిగా ఫలించినఁగాని యభివృద్ధి కలుగను. కావున వర్షములేమిచే దేశభాగములు నష్టము నొందకుండుటకై గొప్పనదులలో నుండి కాల్వలఁదీసి కృషీవలులకు సాహాయ్యముచేయుట రాజులకు మొదటికర్తవ్యము. అట్లు చేసిన యుపకారమువలన ఫలమును సరి యగుమార్గమునఁ బ్రజలు పొందుటకై యుద్యోగుల నియమించి, ఆ వ్యాపారమున ందేమఱక కడు జాగరూకుఁడై యుండఁదగును. భుక్తికి విశేషముగ దేశమున నుండిన చాలదు. కావున ప్రజల యుపయోగమున కనుకూలము లగు పదార్థములను తయారుచేయించుచు, నుచిత మగు మూల్యమునకు లభించునట్లు చేయుచు, వారివసతికి తోడ్పడవలయును. విరివిగ చెఱువులఁ ద్రవ్వించుటయు, బాటలఁ జక్కఁగ వేయించుటయు వానియిరుదెసల బాటసారులకు నీడను ఫలములను కూడ నిచ్చు వృక్షముల వేయించి, దగ్గఱగా నచ్చటచ్చట నుచితముగా భోజన మొసఁగు సత్రముల స్థాపించుటయు, దొంగలును ఘాతుకమృగములును బాధింపకుండ బాటలను భద్రపఱచుటయు గూడ రాజు విధిగా చేయవలసినపనులే! దేశమున నెందుఁజూచినను వస్తుసమృద్ధిఁ గలుగఁజేసి, ధన మొసఁగి, వృత్తులఁ గాపాడుచు, సమస్తవిధములను తనరాజ్య మౌన్నత్యము నొందునట్లు చేసిన ప్రభువు బుద్ధిమంతుఁ డనియు ధర్మపరుఁ డనియు నర్థశాస్త్రము వేనోళ్లఁ బొగడుచున్నది. బీదసాదల కుచితముగ వైద్యులు లభించునట్లు చేసినచో, నట్టి ప్రభువును ప్రజ లందఱును శిరసావహింతురు.

రాజ్యమునకు ముఖ్య మగు బలము చతురంగబలము కదా ? అందు మనుష్యులు కాల్బల మగుటచే వారియభివృద్ధి యెట్లు కలుగునో మీఁద చూచియుంటిమి. పిదప, దేశమునఁగల పశువులు, నశ్వములును, ఏనుఁగులును, మొదలగువాని నెట్లు జాగరూకుఁడై ప్రభువు పోషింపఁదగినదియు నర్థశాస్త్రమున విపులపఱుపఁబడినది. పశువులు మేయుటకు పచ్చికబయళ్ల నేర్పఱచి, వానివలన వచ్చు క్షీరములు మొదలగునవి యేయేవిధముగా వినియోగము చేయవలసినదియుఁ జూచుటకు ప్రభువొక యుద్యోగవర్గము నేర్పఱచుట యుక్తము. అశ్వములును, కరిబృందములును, రాజ్యమునఁ గడు చక్కఁగా పెంచఁబడవలయును. వానికి నిత్యమును భోజనము నిచ్చుటకును, తర్ఫీదు నిచ్చుటకును, తెవులు తగిలినపుడు వైద్యము సలుపుటకును గూడ నవకాశము లీయబడవలయును. వానియారోగ్యమునకై యప్పుడప్పుడేవో యుత్సవములఁ గూడ సలుపుచుండవలయునఁట ! తనయుద్యోగులలో నీయంశములఁ జూచుట కొఱుభాగములుగా నేర్పఱచి, గోవులు, పచ్చికబయళ్లు, నశ్వములు నేనుఁగులు, నరణ్యభాగము మొదలగువానికి సంబంధించిన పనులు సరిగా జరుపఁబడుచుండునట్లు రాజు తెలిసికొనవలయు నని కౌటిల్యుఁడు నొక్కిపలికెను. రాజ్యము, దేశమునఁ జాలభాగమువఱకు విస్తరించి యుండినచో రాజధానికిని రాజ్యభాగములకును నడుమ మంచిబాటలు వేయించి పై నుదాహరించిన విధమున నవి సురక్షితము లగునట్లు చేయుట రాజులకు విధి. ఒకభాగమున క్షామపీడ గలిగినను, మిగిలిన భాగములనుండి వస్తువులను ధాన్యమును దెచ్చి దానిని నివారణచేయుటకును, ఒకభాగమునఁ దిరుగఁబాటు కలిగినచోఁ దనసైన్యముల నన్నిభాగములనుండియుఁ దెచ్చి యాభాగమును రాజు వశపఱచుకొనుటకును, శత్రువుల యులికిడి కలిగిన తోడనే రాజధానికి సులభముగా నా సంగతి తెలియుటకును, ప్రజల యుపయోగమునకును మంచిబాటలను వేయించుట రాజునకు ముఖ్యధర్మము. అవి వేయునపుడు పెద్దనదులను దాఁటుటకు వంతెనలఁ గట్టుటయు, బాటల వేయ నలవిగానిచోటులలో, పడవలపై ప్రయాణము సలుపుట కవకాశము కలుగఁజేయుటయును ముఖ్యమే. ధర్మముగా వైద్యమును చేయుటకు వైద్యాలయముల స్థాపించుటయు, వనౌషధుల నపరిమితముగ జాగ్రత్తచేయించి ప్రజల యభివృద్ధికిఁ దోడ్పడుటయు, నంతకు పూర్వకాలమున గూడ నుండె ననియు, నట్లుండుట

యుక్తమనియుఁ గౌటిల్యుఁడు వ్రాసెను. పట్టణములను పల్లెటూరులను పరిశుభ్రముగా నుంచుటకును, క్షామము వలన గాని, వఱదలవలన గాని, యగ్నిచే గాని ప్రమాదము కలిగినచో, ప్రజలకు సహాయము చేయుటకును వేఱువేఱుగా నుద్యోగులనుంచవలసినదనియును మనము తెలిసికొనఁగలము. రాజ్యమున ప్రజలసంఖ్య హెచ్చుచున్నది లేనిది కనుఁగొనుటకును, వారి యభివృద్ధిని తెలిసికొనుటకును కూడ నుపయుక్త మని యెంచి, అప్పుడప్పుడు కాక, ఎల్లకాలమును పనిచేయు నుద్యోగుల నియమింపుఁడని కౌటిల్యుఁడు రాజులకు బోధించెను. ఆ విధముగఁ జంద్రగుప్తుని కాలమున జరుగుచుండెనఁట!

రాజ్యపరిపాలనవిధానమున 'న్యాయము' నొసంగుట కేర్పాటులు బహుళముగా జరుపవలె ననియు, న్యాయపరిపాలనము లేని రాజ్య మధోగతిపా లగు ననియు నతఁడు శాసించుచున్నాడు. న్యాయస్థానములసంఖ్యాకములుగ నెలకొల్పి ధర్మశాస్త్రపరిజ్ఞాత లగు వారిని న్యాయమూర్తులఁగా నియమించి, యుక్త మగు విచారణ చేసి న్యాయ మొసంగినచో, ననదలకు సయితము సులభముగా న్యాయము దొరకఁగలదని యతఁడు సూత్రములఁ గొన్నిటిని నిరూపింపసాగెను. ప్రజలయందొకరితో నొకరు చేసికొను నమ్మకపు టేర్పాటులఁ గూర్చియు వాని నెట్లు న్యాయస్థానములు మన్నింపవలసినదియుఁ గూడఁ గౌటిల్యుఁడు తెలిపెను. దిక్ప్రదర్శనముగ నచ్చటచ్చట బరీక్షించినను మన కిన్ని సంగతులు తెలిసినపుడు గ్రంథమునఁగల యంశము లెవ్వియో వానిస్వభావ మెద్దియో చదువరులే యూహింతురు గాక! ఈ సందర్భమున విచారించినచో నతని పాండిత్యమును ప్రతిభయునుఁ దేటపడఁగలవు.

ఇఁక నీ యర్థశాస్త్రమున ముఖ్యముగ మనము గమనింపఁదగిన కొన్ని మాటలను మాత్రము వ్రాసి విరమించెదను. ప్రపంచమున నిట్టి రాజ్యము లభివృద్ధి నొందుట కనువగు సూత్రముల నిరూపించుటయే గాక, వాని ననుభవమున నెట్లు ప్రవర్తింపఁ జేయుటయో గూడ మన మిందుఁ గనుఁగొనఁగలము. ఆ పరిపాలనవిధాన మన్ని విధములను సమగ్రమై, ఇచ్చట లోపము కల దని సూచించుట కైనను మార్గ మీయక, అసమానమై యొప్పుచున్నది. మన దేశమునకు కార్మిక వ్యాపారముకంటె సేద్యమే తగియుండుటచే, నట్టి సేద్యవృత్తికై రా జొనరించు సాహాయ్యమును, విపులముగ నీ గ్రంథకర్త చర్చించినాఁడు. పిదప మన దేశము పురాణయుగమునుండియు నాచరింపదగిన వని యెన్నఁబడు దేశహిత కార్యము లన్నియు నిందు నిరూపింపఁబడినవి. కావున మన దేశీయు లీ విషయమున నజ్ఞానులని దూఱు పాశ్చాత్యవిమర్శకులను మన మెదిరించి, ధైర్యసాహసములతోఁ దొల్లిటి మన యౌన్నత్యమును సిద్ధాంతము చేయుట కియ్యది గొప్ప యాధారము. ఆ కాలముననే గాక ఇప్పుడు సైతము దొరతనము వారు ముఖ్యములని యెంచి ఒసఁగఁజూచుచున్న లాభకరము లగు పను లన్నియు నే విధముగా జరుపవలెనో మన యర్థశాస్త్రము చెప్పుచునే వచ్చుచున్నది. పూర్వయుగమునాఁటి మనదేశచరిత్రమును వ్రాయఁబూనువారికి దీని సాహాయ్య మింతింతనరాదు. దేశాభ్యుదయముఁ గోరి నూతన నిబంధనము లేర్పఱుపఁ బ్రయత్నించు దేశభక్తులు గూడ దీని నత్యుత్సాహముతో జదువుదురు. ఈ యర్థశాస్త్రము నాంగ్లభాషలోనికి తర్జుమా చేయుటచే సంస్కృతజ్ఞానము విశేషముగ లేనివారును గ్రహించుట కవకాశ మైనది. త్వరలో నాంధ్రమునఁ గూడ మహాత్ము లెవ్వరైన పూనుకొని, దానిని చక్కని శైలిలో వ్రాతురు గాక! అంతటి గొప్ప విషయమును గూర్చి ఇంత స్వల్పభాగమున వ్రాయఁబూనుట యనుచితమే యైనను, మన యాంధ్రసోదరులలోఁ గొందఱైన దీనిని జదివి, రసమును గ్రహించినచోఁ, గృతార్థుఁడ నయ్యెదను.

# శ్రీకృష్ణునిశీలము

వేదుల వేంకటరావు గారు

మహాభారతము కావ్యముల నెల్లఁ బ్రసిద్ధమగు కావ్యము. అందు శ్రీకృష్ణుఁడు ప్రధానపాత్రము. అతని శీలమును కొందఱు విమర్శకులు చక్కఁగఁ బరీక్షింపఁజాలక, కావ్యము గొప్పదే యైనను, తదితరపాత్రసంపోషణము ప్రశంసార్హముగ నున్నను, శ్రీకృష్ణపాత్రపోషణము మాత్రము అగ్రాహ్యమై యున్నదని చెప్పిరి. కాని, కావ్యపరిశీలనమును చక్కఁగఁ జేసినచో వారట్లు చెప్పియుండరు. శ్రీకృష్ణపాత్రమువంటి దింకొక్కటి ప్రపంచమున నున్న కావ్యములం దెందును లేదని చెప్పుట యతిశయోక్తి గాదు. శ్రీకృష్ణుఁడు సామాన్యమానవుఁ డెట్లు కాఁజాలఁడో, శ్రీకృష్ణపాత్రముకూడ నట్లే సామాన్యపాత్రము గానేరదు. ఆపాత్రపోషణమును విమర్శింపవలయు నన్న, వానిని కేవలము మనుష్యమాత్రునిగను, పాండవుల మేనమఱఁదిగను మాత్రము చూడరాదు. అతఁడు దేవాంశసంభూతుం డనియు, సాక్షాద్భగవంతుఁ డనియుఁ గావ్యమునందుఁ బెక్కుసార్లు చెప్పఁబడి యున్నది. కనుక, పాత్రపోషణ పరిశీలనమందు శ్రీకృష్ణుని, రెండువిధముల — అనఁగాఁ బాండవబాంధవునిగను, భగవంతునిగను — చూడవలసియున్నది. అట్లొనరించిన మొదల నా పాత్రపోషణక్రమము తెల్లము గాఁగలదు.

భారతమందు ఉద్యోగపర్వము ప్రధానమైనది. ఏలయనఁగా కావ్యమందుఁ గల ప్రధానపాత్రముల గుణవిశేషము లిచ్చటనే బాగుగఁ దెలియుచున్నవి. పాండవుల యుత్కృష్టగుణములును, కౌరవుల హీనగుణములును, శ్రీకృష్ణుని యసాధారణ శేముషియు నిచ్చటనే ప్రజ్వలితము లగుచున్నవి. కనుక శ్రీకృష్ణునిశీలము ఈపర్వమునందుఁ గన్పట్టువఱకును పరీక్షింతము.

శ్రీకృష్ణుఁడు భగవంతుఁ డని చెప్పఁబడినది. అట్లయినచో, మానవలోకమందు భగవంతుఁ డేల యవతరింపవలయు ననియు, అవతరించినను కేవలము పాండవపక్షపాతి యగుటకుఁ గారణ మేమనియు సందేహము కలుగవచ్చును. ఇవ్విషయమున, హిందూమత సిద్ధాంతమునం దొకభాగమును కొలఁదిగ చర్చింపవలయును.

అద్వైతమతము - మానవుఁ డొకఁడు దేవుఁ డొకఁడును లేఁ డనియు, దేవుఁ డన్నిఁటను గలఁ డనియుఁ జెప్పుచున్నది.

"క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే."

అఖిలసృష్టికిని కారణభూతుఁ డెవఁడో వాఁడే దేవుఁడు. అనఁగా, సృష్టినంతటి నేశక్తి నడపించుచున్నదో, అహోరాత్రము లేకారణమువలనఁ గలుగుచున్నవో, ప్రాణవాయువు లెందువలన వీచుచున్నవో, అఖిలజీవకోటికిని జననమరణకారణ మేదో, ఆ శక్తియే, ఆ కారణమే దైవము. మానవునికి జీవ మున్నంతకాలము అతనియం దాశక్తి కలదు. కావున, "అహం బ్రహ్మ" మ్మని చెప్పఁబడినది. అయినచో, జీవులు భగవంతులు మొదలగు ననేకరీతులమానవు లున్నారు. వీ రందఱు దేవాంశసంభూతులే యైనచో నిన్ని భేదము లేటికి? యనవచ్చును. ఇందునకు రెండు కారణములు కలవు. ప్రస్తుతస్థితి పూర్వజన్మఫలము కర్మానుబంధము. తరువాత సృష్టివైచిత్ర్యములును మార్పులును దైవమునకు వినోదము లని చెప్పఁబడినది. అనఁగా వీనితో దైవమునకు సంబంధ మధికముగా లేదు.

"పడఁతుల్ వేడుక బొమ్మరిండ్లిసుకలో
బా గొప్ప నిర్మించి చొ
ప్పడ ముగ్గుల్ పచరించి యాడుకొని యా
పై వాటిఁ గొల్లంచు క
ట్టడముల్ పా డొనరించి పోవుగతి నే
ర్పుల్ నీవు నీ విశ్వమున్
పాడమం జేసి భరించి మాపుటలు నె
ప్డున్ భక్తచింతామణీ"

ఇంక నొక్క యంశము కలదు. "Heroes are demigods" అనునది పాశ్చాత్యప్రజల నమ్మకము. సామాన్యమానవుల కసాధ్యములైన మహాకార్యముల నాచరించి దుష్టసంహార మొనర్చినవారిని వారు "హీరోస్" లేక దేవాంశసంభూతులు గా నెంచుచున్నారు. వారినే యిచ్చోట హిందూమతస్థులు దేవుని యవతారములుగ నెంచుచున్నారు. శ్రీకృష్ణునిఁ గాంచుట కీయంశము లన్నింటిని మనంబునం దిడికొనవలెను.

ఉద్యోగపర్వమునందు మొదట సంజయరాయబారము ముఖ్యమైనది. ధృతరాష్ట్రవచనంబులు పాండవులకు వినయముగా సంజయుఁడు చెప్పుచున్నాఁడు. ధర్మసుతుఁడును దానికిఁ బ్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు. శ్రీకృష్ణుఁ డిచ్చోట సంజయునితోఁ దనభావముఁ గొంత తెల్లడి చేయుచున్నాఁడు. పాండవుల కాతనియెడ గురుభావమును, అపారభక్తియును గలవు. అతనియెడ మహాకర్షణశక్తి యుండెడిది. వాని మందహాసము సమ్మోహనాస్త్రమైనదిఁ గావలయు. లేక నిజరూపవిజృంభణ మైనదిఁ గావలయు. దుర్యోధనాదులకు వానియెడ నీర్ష్యాభయంబులు గలవు. విదురాదిపుణ్యులకు ఘనమైన భక్తి గలదు. తొలుతనుండియు వానికిఁ గౌరవనాశనము నిజభావమై యున్నట్టు కనఁబడుచున్నది. సంజయునితో శ్రీకృష్ణుఁడు యుద్ధవిషయమై చెప్పుచు కౌరవరాజును గూర్చి యిట్లనుచున్నాఁడు.

"అత్తతి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూరకుండిరి, మహీశ్వరు చిత్త మెఱుంగకున్కిఁ దా
నొత్తి కుమారులం గనియు నోపఁడ యక్కట! మానుఁ గన్న, నా
చిత్తము గాదు, లోకముల చిత్తము లెల్లను సంతసింపవే."

కౌరవరాజగు ధృతరాష్ట్రుఁ డూరకుండక కుమారుల దుర్వ్యాపారమును వారించినచో లోకు లందఱును సంతసింపరా? యనెను. "నాచిత్తమే కాదు" నామాట యటుండనిమ్ము; లోకు లందఱును సంతసించినచో నేనును సంతసించినట్లే యనుమాట. తాను సర్వాంతర్యామి యగుటను, ప్రతిమానవుని హృదయమందును తా నివసించు

...గా రందఱిభావ మె ట్లుండినఁ దనభావము నట్లుండును. అది ...పద్యమునం దింక నొక ధ్వని గలదు. 'అప్పు డట్లు చేసినచో ...దును. కాని చేయలేదు. మించినదాని కిప్పు డేమి చేయఁ గల...? ఏది కానున్నదో కానిమ్ము.' ఇచ్చట వాని యర్థ మేమన? సంధి పొసఁగుట దుర్లభము. (ద్రౌపదికి మానభంగము నెంచినవారితో సంధి యెట్లు పొసఁగును?) ధర్మబలమును తన (దైవ)బలమును కలవా రగుటచే పాండవులు విజయు లగుదురు. కౌరవు లంత మొందుదురు. కృష్ణునియం దున్న దేవుఁడు యుద్ధము నిశ్చయింపఁ జేసి ధర్మపరు లగు పాండవుల పక్షమును వహించి యధర్మపరు లగు కౌరవుల రూపుమాప నెంచుచున్నాఁడు.

"సత్యం సర్వత్ర జయతి."

ఒకవేళ పాండవులు యుద్ధమునకు సమ్మతింపక వనవాసము నే చేయుచుండినచోఁ గౌరవులు మడియకుందురు గా? అట్లయినచో నా భగవంతుఁ డేమి చేయును? ఇవ్విషయమై శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:—

"......కేరడము లాడు చుందురేని
కదిసి యల పాండవాగ్ని య కాదు సువ్వె
తమ్ముఁ దమ లోభ మను చిచ్చు దరికొనంగఁ
దెగినవా రయిపోదు రింతియ తలంప.

ఎట్లయినను యుద్ధముననో, ఇతరకారణములవలననో, కౌరవులు తెగుట నిశ్చయము. వారు తెగుట — పాండవు లాలోచింపవలసిన విషయము కాదు — లోకబాంధవుఁ డాలోచించుచున్నది. ఇందువలన మహాభారతయుద్ధకారణము శ్రీకృష్ణుఁడే కావచ్చును. ఇందులకే ఈతఁడు యుద్ధమునకుఁ గొందఱినిఁ బురికొల్పెను. అపరాధులను దండింపవలె నన్న కోర్కె యీతనికి ముమ్మాటికినిఁ గలదు. ఆ కార్యమును పాండవులమూలమున సాధింపవలయును. కనుక నెట్లైనను వారిని యుద్ధమునకు సంసిద్ధులఁ జేయవలయును. వారిని తానే దండింప నశక్తుఁ డెప్పటికినిఁ గాఁడు. ఏల యనఁగా:—

"................ఏను నిక్కము
ల్గిన నచటం గలండె రణకేళికి మార్కొన నొక్కఁ డేనియున్."

ప్రఖ్యాతి నగు "మాంటిక్రిస్టో" యను నవలను రచియించిన అలగ్జాండరు డ్యూమాస్ కూడ నీయంశమునే బోధించుచు, 'తనశత్రువులను దండించుటయందు మాంటిక్రిస్టో ప్రభువు దైవప్రేరితుఁడు' అని చెప్పెను. అట్లే యిచ్చటఁగూడ శ్రీకృష్ణుఁడు పాండవులఁ బ్రేరేపించుచున్నాఁడే కాని తా నేమి కూఁ జేయలేదు. యుద్ధమునకుఁ గొందఱిని పురికొల్పె నని యీక్రింది పద్యభాగములవలనఁ దెలియుచున్నది. భీముఁడు అగ్రజుదుఃఖమున డింసపోయి "యుద్ధ మేల? సంధి నొనరుపు" మని పల్క, శ్రీకృష్ణుఁడు నవ్వి వానిని పరిహసించి యిట్లనెను:—

"......నీ వసం,
బద్ధము లైన వాక్యములు పల్కుట యొప్పునె కీచకాంతకా"

తరువాత సంధివిషయమై అర్జునుఁడు కృష్ణునితోఁ బల్కినప్పు డాతఁ డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను:—

"కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయుఁ గా
దైవముచేఁత యె ట్లగునొ? దాని నెఱుంగ......"

'నాచేత నైనవఱకు సంధి పొసఁగున ట్లొనర్చెద. కాని దైవచిత్త మె ట్లున్నదో. నీవాఁడను. కాన నీవు చెప్పినట్లు నాచేత నైన పనిని గావించెద. కాని దేవునికోర్కె యె ట్లున్నదో.' శ్రీకృష్ణుఁడు భగవంతుఁ డని అర్జునునకుఁ దెలియ దనుకొనుటకు వీలు లేదు. వారిరువురు పూర్వజన్మమున నరనారాయణు లనియు నఖండమైత్రి కలవా రనియుఁ దెలియుచున్నది. పూర్వజన్మవృత్తాంతమును మఱచిరో అజ్ఞానముననో, ఆడినమాటలను విని వానికిఁ దనయుద్దేశము తెలియుటకై కృష్ణుఁ డట్లనె నని తెలియవలయును. అటుపిమ్మట ద్రౌపది దీనవాక్యముల నాలించి యామెతో నాతఁ డిట్లనెను:

"మ్రుచ్చిర నేల నేఁ గలుఁగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్యచ్చుఁడు దోడు గాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు వంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని సేసెదఁ గాక వేల్పులోకం
దచ్చుపడంగ నేర్చునె? దురాత్ములు కౌరవు లుర్వి నిత్తురే?"

ఆమెతోఁ దెల్లముగా సంధి కానేర దనియు, కౌరవు లుర్వి నీయ రనియు, యుద్ధమునం దా దుష్టులు చత్తు రనియుఁ జెప్పియున్నాఁడు. "మ్రుచ్చిర నేల నేఁ గలుఁగ" 'నే నుండ నింక విచార మేల? వారినిఁ బరిమార్తు' నని యున్నాఁడు. ఇచ్చటఁ దాను బాండవుల కంటె నత్యధికబలాఢ్యుఁడని కాదు. (అవను గావచ్చును) కౌరవులు తనకుఁ బాండవుల కన్న నధికవిరోధు లని కాదు. తా నుండ యుద్ధమును, కౌరవనాశనమును తక్క వేఱొకటి కానేర దనుచున్నాఁడు. అనఁగా, కౌరవులు 'దురాత్ము'లగుటచే వారినిఁ బరిమార్చుట తన విధి యను భావముఁ గనఁబఱచుచున్నాఁడు.

శ్రీకృష్ణుని పై వాక్యములవలన నాతఁడు తొలుతనుండియును యుద్ధమునకుఁ గొందఱితో ముచ్చటించి మఱికొందఱిఁ బురికొల్పి, వేఱొక కొందఱి నూరార్చి యెట్లయినను రణమే స్థిర మైనట్లు చేసె నని రూఢి యగును. ఇఁక నాతఁడు రాయబారము నెట్లు నడపి యున్నాఁడో ఇంచుక పరీక్షింపవలయును.

ధర్మరాజు సంధి ప్రయత్నముఁ జేయు మని చెప్పఁగా నట్లు చేయనిచో దోషము. కనుక నాతఁడు సంధి యొడఁగూడు మాటలనే యాడవలెను. పాండవులకడ నిజభావము నెఱింగించెనే గాని యెదిరి కడ నట్లు చేయలేదు. వాచాదోషము నెచ్చట నాతఁడు గావింపలేదు. అయినను, కరిపురంబునకుఁ జని, "ఇచ్చట నీవు మంచివాఁడవు. నీ యింట భోజనము దోషము గా" దని చెప్పి విదురునింటికిఁ బోయెను. అచ్చట నాతఁడే మంచివాఁ డన నితరులు మంచివారు కా రని యర్థము. దుష్టు లనియు దోషాకరు లనియు భావము. దాననే రాజకుటుంబములోనివారికి మనస్పర్థలు పుట్టెను. దుర్యోధనాది యువజనులకు శ్రీకృష్ణునిపైఁ గల ద్వేష మధిక మయ్యెను. దానికి దోడు కృష్ణుఁడు పాండవులు తనకుఁ బ్రాణములుగ నుండుటచేతను, పాండవులకుఁ గౌరవులు శత్రువు లగుటచేతను కౌరవులు తనకును శత్రువులే కనుకను వారియింట భుజించుట రాజనీతివిరుద్ధ మని చెప్పెను. సంధి నొనర్పవాఁ డిట్టిమాటలఁ దొలుతనే యాడుట తగదు. కాన వారికి కోప మధికము కావలయు ననియే యున్నట్లు తోఁచుచున్నది.

పశ్చాత్తప్తమనస్కులు దోషరహితులుగాఁ బరిగణింపఁబడుచున్నారు. దోషులు పశ్చాత్తప్తులైనచో సాధారణమానవులు సైతము వారిని క్షమించి విడుచుచున్నారు. కావున సాక్షాద్భగవంతుఁడే యట్టివారి కట్టిదారిని జూపకుండుట యసంభవము గా నుండును. కనుక కౌరవులు పశ్చాత్తాపము నొందుట కవకాశముఁ గలుగఁ జేయుటకు కృష్ణునికి బుద్ధి పుట్టవచ్చును. అట్టి యవకాశము వారికి గలుగఁ జేసినను తత్ఫలముమాత్ర మాతనికిఁ దెలియక పోలే దని యీక్రిందిపద్యము వలన స్పష్ట మగుచున్నది.

"ఎఱుఁగుదు నేను సుయోధను
గొఱగామియు, నతనితోడఁ గూడిన నృపులం
దఱుఁ బగ మనమున నిడికొని
యఱుమటయును, సంధి పొసఁగ దనియు, మహాత్మా."

ధృతరాష్ట్ర మందిరమున నాతఁ డాడినపలుకులు మాత్రము ప్రపంచచరిత్రమునం దసమానములై యున్నవి. బంధుధర్మము రాజధర్మము అచ్చుపడునట్లు సభలో నాతఁ డుపన్యసించెను. తాను భగవంతుఁ డగుటయుఁ బాండవ పక్షపాతియగుటయుఁ గూడఁ దెల్లముఁ జేసియున్నాఁడు. తుదకు వారి మనోభీష్టముల నెఱింగి సంధికొఱకు రాజుతో నిట్లు చెప్పియున్నాఁడు :

ఉ. "కౌరవపాండవుల్ తెలుఁగు గైకొని శాంతతఁబొందియున్కి మే
లారయ నాకు, నీకు, కుల మంతకు, నీనృపకోటికి, కుర్వికిన్
ఘోరతమైన నింతకును పుట్టు మహాపద, కావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య! గణుతించి యవశ్యము పొం దొనర్పవే."

రాయబారపు నేర్పరితన మంతయు నిందుఁ గన్పడుచున్నది. సంధి సమకూడినచోఁ దొలుతఁ దనకు, తరువాత రాజునకు, పిమ్మట కులమువారికిని మే లని చెప్పెను. తొలుత మేలు వాని కేల గలుగవలయు? పాండవులఁగూర్చి యాతఁ డేల ఇఁదు వచింపఁడాయె? సంధి యైనచోఁ బాండవులకు లభింపని ఘనలాభ మాతని కేది వచ్చును? కానిచో నాతనికి సంభవించు "మహాపద" యేది? పాండవుల చుట్టము గనుక వారికిఁ గలుగు లాభనష్టములఁ గూర్చి యితనికి సంతోషవిచారములు గలుగవచ్చును. గాని వారికి రాని సంపద గాని యాపదగాని యీతని కేది సంభవించును? దీని కర్థ మొక్కటియ గావలయు. తాను లోకనాయకుఁడును, లోకబాంధవుండును గాన యుద్ధమువలన వచ్చు లోకారిష్టము తనదే యని భావించి ఆభావము వారికి తెలియుటకై యాతఁ డట్లని యుండవలయును. నష్టము "ఇంతకును" అనఁగా పైఁ జెప్పినవారి కందఱకును సంభవించును. కాని పాండవులకుఁ గాదని సూచించెను. యుద్ధమే యైనచో నష్టము కౌరవులకేగాని పాండవులకు గాదు. ఇది వారిని భయభ్రాంతులఁ జేయుటకై యుండును.

రాయబారము ముగిసినది. అన్నివిధముల నాతఁడు సంధి యొనర్పుమని బోధించెను. కాని కార్యము లే దయ్యెను. రాయబారమువలన దుర్యోధనాదిదుష్టబుద్ధులకుఁ బుట్టిన దుష్టబుద్ధి తప్ప వేఱొక ఫలము కానరాలేదు. శ్రీకృష్ణునిఁ జెఱఁబట్టవలె నని వారికి ఉద్దేశము గలిగెను. అది వానికిఁ దెలిసెను. పెద్దలుకూడ దాని నెఱింగి భయపడఁజొచ్చిరి. అప్పుడు శ్రీకృష్ణుఁడు దరహాసంబు సేయుచు విశ్వరూపవిజృంభణముఁ గావించెను. దాన నాదుష్టులు భయభ్రాంతులై మనోనిశ్చితము వదలినవారైరి. శ్రీకృష్ణుని విశ్వరూపంబు దర్శించియు, నాతని భగవంతునిఁగా నెఱింగియుఁ, గౌరవులకు యుద్ధముపై నాస వదలలేదు. తన నిజచరిత్రము నెఱింగినచో వారు పశ్చాత్తప్తులై యుద్ధమును మానుదు రేమో యని కాఁబోలు నాతఁడు విశ్వరూపమును జూపించెను. ఇంతకును, సంధి, [illegible] నవకాశము లేమి నాతఁడు తిరిగి ఉపప్లావ్యంబునకుఁ జ[illegible] నిశ్చయముఁ గావించెను.

ఇచ్చట నొక్కమాట చెప్పక తప్పదు. కౌరవసభ[illegible] కృష్ణుఁడు శాంతిదము లగు మాటలనే యాడినను తన చెయిదములవలన వారిని రోషావిష్టులఁ జేసె నని రూఢి యగుచున్నది.

ఇంక నొకవిషయము చర్చింపవలసి యున్నది. శ్రీకృష్ణుఁడు భగవంతుఁడై యున్నాడు. భగవదంశము ప్రతిమానవునియందును గలదు; దుర్యోధనాదులయందును గలదు. అట్లయినచో వారు చచ్చు విధ మాలోచించుట దేవునికి సరియగునా? చంపుట యనఁగా శరీరమును గాని యాత్మను గాదు. ఆత్మ—అనఁగా నిజాంశము—జరామరణరహితము. కావున వారిని చంప నెంచుటలో నాత్మహింస యేమాత్రమును లేదు. అదియుఁగాక అన్నదమ్ములయెడలఁ గ్రూరవృత్తిని సంచరించినవారిని శిక్షించుటకు భగవంతుఁడే పూనకున్న నట్టి కార్యముఁ జేయువాఁ డింకెవ్వఁడు ఉండును?

శ్రీకృష్ణుఁడే కేవలమానవుఁడై ఉండినచోఁ దొలుతనే భీమార్జునులను యుద్ధమునకుఁ బురికొల్పి యుండఁడు. జయాపజయములను ముందుగనే స్థిరముగ నెంచుకొనుట సామాన్యమానవుని కశక్యము. అదియునుఁ గాక పాండవు లప్పటికే దీర్ఘవనవాసక్లేశమునఁ గుందియున్నారు. అట్టివారి కొఱకు ప్రథమున సంధి నొనర్చుమార్గము సంజయరాయబారమునఁ జూపఁబడియున్నది. శ్రీకృష్ణుఁడే మనుష్యమాత్రుఁడైనయెడల, పాండవపక్షము వహించి సంధియైనచోఁ దనవారికి వనక్లేశమును, ఘోరసంగ్రామ మొనర్చు నవసరమునుఁ దొలఁగించుటకు నిజముగ సంధి సమకూడు ప్రయత్నములనే చేసియుండును. కానిసంధి యసంభవమని వక్కాణించి యుద్ధప్రయత్నములను చేసియుండఁడు. పాండవబాంధవుఁడై పాండవులకుఁ జేయు కూర్మి గాక, లోకబాంధవుఁడై లోకమునకుఁ జేయు నుపకార మొకటి గలదు. పాండవులకు అర్ధరాజ్య మావశ్యకము గాని కౌరవరాజకుటుంబవినాశన మావశ్యకము కాదు. కాని, భగవంతుఁడగు శ్రీకృష్ణునికి దుష్టజనసంహారము ఆచరణీయము. అల్పు లగు దుష్టజనులను శిక్షించుటకు భగవంతుఁడు రా నక్కఱ లేదు. కాని, "బలవంతులను బ్రహ్మదేవుఁడుపట్టు" నను పాటతరీతిని బలవంతులును దురాత్ములు నగు కౌరవులఁ బరిమార్చుటకు శ్రీకృష్ణుఁడే రావలసియుండెను. వారిని వధింపఁ బాండవు లశక్తులు కాకపోయినను, కేవలధర్మపరు లగు వారా కార్యమునకుఁ బూనకుందు రేమో? అట్లు వారు పూనకుండినచో నా దుష్టులు భూమియందు మఱికొంతకాల ముండవలసియుండును. దుష్టసంహార మాతని విధి. గనుక సంధి పొసఁగక యుద్ధమే నిశ్చయమగునట్లు చేసి దుష్టాధములను క్షమించి విడిచిపుచ్చుటకంటె దండించుటయే ధర్మ్య మని లోకమునకు శ్రీకృష్ణుఁడు నిరూపించియున్నాఁడు.

# ఆంధ్రోత్కలసమస్య

గాడె జగన్నాథస్వామి గారు

ఈ భాషలఁ బట్టి దేశము విభాగముఁ జేయుటె కాక, బ్రాహ్మణ - ద్వేషముఁ బూనకుండఁదగు స్వేచ్ఛనొసంగుచు భారత ప్రజన్
పోషణఁ జేయుటొప్పు; శమబుద్ధి దొరల్ చరియింతు రేని యే - ఘోషయుఁబుట్టఁబోదు. సమకూడు సుఖస్థితి యెల్లవారికిన్.

సింహావలోకనము:—నర్మదామహానదుల కుత్తరదిగ్భాగమును ఉత్తరహిందూస్థాన మనియు, తద్దేశస్థులు ఔత్తరాహు లనియు, వారిభాషలు ప్రాకృతభాష లనియు, నిట్లే యా నదీద్వయమునకు దక్షిణదిగ్భాగము దక్షిణహిందూస్థానము, లేక దక్కను అనియు, తద్దేశస్థులు దాక్షిణాత్యు లనియు, వారి భాషలు ద్రవిడ భాష లనియు, నిదివఱకే తెలిసికొని యుంటిమి గదా! ఉత్కళులు లేక యోఢ్రులు, ఔత్తరాహు లని వారి భాషయే ధ్రువపఱచుచున్నది. ఇది కాక, ఉత్తర అను పదమే క్రమముగా ఉత్ర, ఉట్ర, తదుపరి ఓఢ్ర పదముగా మాఱిన దని చరిత్రకారుల యభిప్రాయము.

The sanskrit name of Orissa or Odissa was probable used to signify the northern portion of Kalinga, being derived from prakruti form Utra (Northernly) from Utra, Oddra........................

Hunter's Orissa History.

దీని కుపబలముగ, కుమారిలభట్టు జన్మస్థలము జయమంగళగ్రామ మనియు, నాంధ్రోత్కలసంయోగము గల మహానదీతీరమునం దది యున్న దనియు, నొక జైనశ్లోకమువలనఁ దెలియుచున్నది. నే నింతవఱకు సంశయించుచుండిన ఋషికుల్య, ఉపనది యగు మహానది కాక, అయ్యది కటకముకడ నున్న మహానదియే యని యు నిటీవల రూఢిగాఁ దెలిసికొంటిని.

ఓఢ్రదేశములో గజపతు లగు గాంగుల ప్రభుత్వము వెలయకపూర్వమే ఓఢ్రులు దక్షిణమునకు దిగఁబడి ఋషికుల్యానదిదనుక, ఆచ్ఛాదించినట్లు, "ఋషికుల్యాం సమాసాద్య," యను స్కాందపురాణశ్లోకము వలన మనకు స్పష్టపడుచున్నది. కళింగనగరమును రాజధానిగాఁ జేసికొని కళింగాంధ్రమును పాలించిన యాంధ్రగాంగులే చోళచాళుక్యుల ధాటి కాగఁ జాలక 12-వ శతాబ్దారంభమున కటకము రాజధానిగా మార్చుకొని గజపతిబిరుదముతో వెలసి, పదంపడి యుత్కళగాంగులై తమరాజ్యము 13, 14, 15 వ శతాబ్దుల విస్తరింపఁ జేసి రన్న సంగతి, నా లోగడవ్యాసములను గమనించినవారికిఁ దెలిసియే యుండును. కపిలేంద్రగజపతి యనువాఁడు 15-వ శతాబ్దిమధ్యమున రాజమహేంద్రవర, కొండవీటి, రెడ్డిరాజ్యములను కబళించుటయే గాక నెల్లూరికి దాపున నుండిన ఉదయగిరిరాజ్యముఁ గూడ నాక్రమించెను. ఈతని వెనుక నితనిపుత్త్రుఁడు పురుషోత్తమగజపతి ఇంచుమించుగా యావదాంధ్రదేశమును జయించి పాలించెనఁట. కాని తదనంతరమున నచిరకాలములోనే విజయనగరమహారాజులు కృష్ణానదికి దక్షిణభాగమున నున్న కర్ణాటాంధ్రమును, గోల్కొండ సుల్తానులు త్రిలింగాంధ్రమును, ఆక్రమించుటవలన గజపతులు కళింగాంధ్రమున మాత్రము మట్టుపడి కొంతకాలము స్థిరపరిపాలనముఁ గొనసాగించుకొనుట కవకాశము కలిగినది. ఈ కారణములఁ జూపి కొందఱు ఓఢ్రనాయకులు తమ యోఢ్రరాజ్యమునకు గోదావరి నది, దక్షిణపు టెల్లగాఁ దొల్లింటినుండి యుండె ననియు రమారమి గోదావరివఱకు వ్యాపించియున్న జయపుర సంస్థానముతోఁ బాటు ఓఢ్ర సంస్థానము లన్నియు, నుత్కళము (ఓఢ్రదేశము) తోఁ గల్పవలసిన దనియు సర్కారువారిని హెచ్చరించుచున్నారు. వీరి యాశయ మెంతవఱకు యుక్తముగా నున్నదో తెలియవలసి యున్నది.

ఒకకాలమున (15-వ శతాబ్ద్యారంభమున) రాజమహేంద్రపురపు రెడ్డిప్రభువులు 'చీకటియున్ కళింగమును చిల్కసముద్రము సింహశైలమున్' అను శ్రీనాథకవివర్యుని పద్యము ప్రకారము చిలకసముద్రముదనుక జయించి పాలించినట్లు కనఁబడుచున్నది. తరువాత కృష్ణదేవరాయలు (కటకపురిఁ గాల్చి గజపతిగర్వ మడఁచె) కటకమువఱకు దండయాత్రలు సాగించినాఁడు గదా! ఈమాటల నటుండనిండు. నిన్నటి మొన్నటివారగు కళింగ విజయనగరరాజులు 18-వ శతాబ్దిమధ్యమున బందరు మొదలుకొని కటకముదనుకఁ గల ప్రదేశముల జయించి కొంతకాలము పరిపాలించినట్లును, అప్పటిలో నారాజులు ఆంగ్లేయులతోఁ జేసికొన్న సంధిషరతులలోఁ గూడ, తా మీ తూర్పుదేశమునకు ప్రభువుల మనియు, గంజాము విశాఖపట్టణము, మున్నగు కొన్ని రేవుపట్టణములు ఆంగ్లేయులకు వారు విడిచిపెట్టుటకు నొడంబడికను చేసికొన్నట్లును, నావ్యాసములపై నభిప్రాయము దయచేసిన ఆనరబుల్ భూపతిరాజు వేంకటపతిరాజుగారు వ్యక్తీకరించిరి. ఈ కారణములు చూపి ఎవ్వరేని యాంధ్రదేశములో మహానదివఱకుఁ గల ప్రదేశముఁ గల్పివేయవలసిన దని వాదించిన, నోఢ్రనాయకు లేమందురో తెలిసికొన వలయును. కర్ణాటాంధ్రరాజుల పాలనమున ద్రవిడదేశ మెల్ల తెలుఁగునాయకుల యధీన మైనది. ఇప్పటికిని ద్రవిడదేశములో భూస్వాములు పెక్కండ్రు తెలుఁగువారుగా నున్నారు. ఇట్లని చెప్పి యచ్చటి జమీందారు లాంధ్రదేశముతోఁ దమ సంస్థానములను చేర్పవలసిన దని వాదించిన నెవ్వరు హర్షింతురు? కావున లేనిపోని వాదములు పెంచుకొనక గంజాం మండలమునఁ గల ఆంధ్రోత్కళనాయకులు తాము భారతీయుల మనుటను జ్ఞప్తి నుంచుకొని త్వరలో నొక సమాధానమునకు వచ్చుట సమంజసము.

ఏజన్సీ ప్రదేశముల విభజనము: మహానదీగోదావరి నదులకు నడుమ నున్న తూర్పుదేశము కళింగదేశమనియు, దానికిఁబడమట నున్న మహాకాంతారప్రదేశమును కొందఱు కళింగదేశ మనియు వ్యవహరింతురు. ప్రస్తుత మీ దేశము కొంతభాగము మధ్యపరగణాలలోను, కొంత ఒడిస్సాలోను మఱికొంత చెన్నరాష్ట్రమునందలి గంజాంవిశాఖపట్నము జిల్లాలలోను, విడఁబడి యున్నది. ఈ మహాకాంతార ప్రదేశమునందు ఉత్తరభాగమున విశేషించి కోదులును దక్షిణమున విశేషించి సవరలును వసించుచున్నారు. ఇట్లు కొండజాతులకు ఆటపట్టయిన మన్యపుప్రదేశము లెల్ల నొక్క రాష్ట్రము క్రిందఁ జేర్చి ఇదివఱకే బిస్తరు మున్నగు మధ్యపరగణాలలోఁ బ్రచారముగా నున్న హిందీభాషను ఆటవికు లగు కోదులకు సవరలకు నేర్పి వారి ప్రదేశము లాంధ్రోత్కళసీమలనుండి వేర్పఱచుటయే భావ్యము. ఈ యేర్పాటునకుఁ దమ రాష్ట్రము నెల్లైనను పెద్దదిగాఁ జేసికొను తలంపుతో నున్న యోఢ్రసోదరు లిష్టపడరను సంగతి నాకుఁ దెలియును. ఇట్టిపేరాసతో నోఢ్రులుంటవలననే ఆంధ్రోత్కళసమస్యయు నానాఁటికి మఱింత క్లిష్ట మగుచున్నది. తగు హేతువులు చూపించునపుడు వారిలోని బుద్ధిమంతులు నామతమునకు సమ్మతింతురని విశ్వసించుచున్నాను. ఋషికుల్యా సువర్ణరేఖా నదులకు నడిమిభూభాగము నిజ మగు నుత్కళదేశ మని పలుసారు లుగ్గడించియున్నాను. ఇందులకు పురాణశ్లోకములును చరిత్రాంశములును నిదివఱకే చూపి రుజువుచేసి యున్నాను. గజపతిప్రభువుల వర్ధమానకాలమున నోఢ్రులు దక్షిణపశ్చిమభాగములనాక్రమించి యధినివేశనములఁ గల్పించుకొన్నంత మాత్రమున నాప్రదేశము లెల్ల నోఢ్రరాష్ట్రముతోఁ జేర్పవలసిన దని కోరుట యుత్కళనాయకుల కుచితము కాదు. ఏలయన అస్సాముదేశములో అస్సామీలకంటెను ప్రస్తుతము బంగాళీలు విశేషించి యున్నారు. అయినప్పటికి నస్సాము ప్రత్యేకరాష్ట్రముగా నున్నది. దానిని విభజింప నింతవఱ కెట్టిప్రయత్నములు జరిగి యుండలేదు. రాష్ట్రములు విభజించుపట్ల భాషలతోపాటు నైసర్గికపు హద్దు లగు కొండలు నదులను గూడఁ గొంతవఱకు గమనింపవలసి యున్నది. విశాఖపట్టణము జిల్లాలోని జయపుర సంస్థానమును, గంజాం జిల్లాలోని బల్లిగుడా డివిజనును ఏజన్సి ప్రదేశము లై యున్నవి. అవి దక్కను

పీఠభూమితో సంబంధించి యున్నంతగ, తూర్పు పల్లపు మాగాణములతో సంబంధించినట్లు కన్పట్టదు. అక్కడి ప్రజలకు దక్కను ప్రజలకు రాకపోకల కిమ్ముగు మార్గము లుంటయే కాక వా రేకజాతీయులుగా నున్నారు. ఈ కారణములఁ బట్టియే మహాకాంతార ప్రదేశము మధ్య పరగణాలతోఁ జేర్చుట సమంజస మని చెప్పవలసివచ్చి నది. ఆప్రాంతములలో నధినివేశనములను కల్పించుకొని యున్న, ఒడ్డివారిని, కోదులను, సవరలను, ఎట్లు మోసపుచ్చి అణఁగఁద్రొక్కుచున్నారో, ఈక్రింది ఇంగ్లీషు చదివిన, బోధపడఁగలదు.

It had, however, one beneficial effect for the Khonds, which was to draw the attention of Government to the necessity that existed for stationing European officers in the heart of Hill-tracts, and thus, securing the rude inhabitants from the oppression of their alien naighbours, the Oria paiks, and the Sundis or Liquor-sellers who live in their midst.

ఇట్టి విషయములను కనిపెట్టి సర్కారువారు ఉదారులై మాళువాప్రాంతభూములను కోదులనుండి, తదితరులు క్రయమునకు దీసికొనరా దని యొకచట్ట మేర్పాటు చేసినారు. ఇంతటితో వారి యిబ్బందులు తీరునవికావు. వారి ప్రదేశములను ప్రత్యేకించి, వారికి హిందీభాష నేర్పి సక్రమమైన ప్రభుత్వపద్ధతుల నచ్చోట పాదుకొల్పిన గాని, వారు అభివృద్ధికి రాఁజాలరు. ఓఢ్రభాషకు మాఱు ఆ కిరాతులకు హిందీ భాష ఏల నేర్పవలె నని యడుగుదు రేమో! హిందీ భాష మాట్లాడువారే, 30 కోట్ల జనసంఖ్య గల భరత ఖండములో 10 కోట్లజను లున్నారు. ఆభాష ఇంగ్లీషు కంటె హిందూదేశములోనే గాక ఆసియాఖండములో పలుచోట్ల పలువురచే వ్యవహరింపబడుచున్నది. ఇప్పటి ఇంగ్లీషుభాష రాజకీయభాషగా చెల్లుచున్నను, కొలఁది కాలములో తప్పక హిందీభాష తత్స్థానస్థాన మాక్రమింపఁగలదు. ఇందులకై తగినన్ని ప్రయత్నములు జరుగుచున్న వని తెలియఁజేయుట కెంతయు సంతసించుచున్నాను. లిపిసంస్కారాదులు గల్గిన ఆంధ్రద్రవిడాది భాషలవారే హిందీభాష నేర్చుకొనవలసిన యవసరము గలుగుచున్నపుడు, ఆటవికభాషలనే మాటాడువారు, ఒక కోటిజనము మాటలాడు ఓఢ్రభాషను నేర్చుకొనుట లాభమో, 10 కోట్లజనము మాట్లాడు హిందీ భాషను నేర్చుకొనుట యుక్తమో, ప్రాజ్ఞులునిర్ణయింతురు గాక. దక్కనులోఁ జేరిన ఆటవికులకు ఓఢ్రము నేర్పు కంటె దక్కను ద్రవిడభాషలో నధికవ్యాప్తి గాంచిన తెలుఁగుభాషనే వారికి నేర్పుట యుక్త మని కొందఱు తమ అభిప్రాయమును వెల్లడిపఱచి యున్నారు. దీని కనుగుణముగా వారి భాషలకు నొడ్డిలిపిని ముడిఁబెట్టుటకంటె తెలుఁగులిపిని జతపఱచుట యుక్త మని ఇట్లు స్పష్టపరుపబడినది.

Both the Khonda and Savara languges are unwritten and have no character, Captan Trye, who was a very good linguist took great inte:est in the Khonds and wrote a grammar and dialogues adopting for them the Uriya character, but this seems to have been a mistake. The language Turanian or Nomadic and the Telugu character would have been more suitable. [Ganjam Manual]

ఇట్లుండ, సర్కారువారు ఇటీవల ఏ హేతువుననో గాని ఓఢ్రజనాశయముల కనుగుణముగ, కోదులకు సవరలకు ఓఢ్ర పాఠశాలల నేర్పఱచి ఓఢ్రము నేర్ప మొదలుపెట్టినారు. సవరభాషకు తెలుఁగు లిపిఁ గల్పించిన రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులు మున్నగు వారు పైయేర్పాటునకు నెట్లు సహించి యూరకుండిరో, తెలియకున్నది. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు బస్తరు మొదలగు (మధ్యపరగణాలలోని) దక్కను హిందీ పరగణాలను బీహారుతోఁ జేర్పవలసిన దని తమ భాషాప్రయుక్తరాష్ట్రవిభజనవ్యాసమున నిరూపించిరి. ఇదియు నంతసమంజసముగా నున్నట్లు కన్పట్టదు. దీనివలన బీహారు రాష్ట్రపు వైశాల్యము హెచ్చుపెరిగినదై పాలనసౌకర్యమున కిమ్ముగా నుండదు. కాఁబట్టి తొలుత నిరూపింపఁ బడినచందమున దక్కను

హిందీ పరగణాలతో, ఏజన్సీ భాగములు అగు మహా కాంతార ప్రదేశములను కలిపి మధ్యపరగణాల నొక్కింత మార్పుతో దక్కను హిందీరాష్ట్రముగా నేర్పరచుట ఎల్లవిధముల నొప్పిద మని నాయెన్నిక.

ప్రస్తుతము విశాఖపట్టణముజిల్లాలోని జయపుర సంస్థానమును, గంజాము మాళువా ప్రదేశములగు బల్లిగుడ డివిజను, బస్తరు కలహాండిసంస్థానములతోఁబాటు దక్కను హిందీపరగణాలతో కలిపి యొక ప్రత్యేకరాష్ట్రముగా నేర్పఱచినఁ గాని, యాటవికు లగు కోదులు సవరలు మున్నగు వారు తగు నభివృద్ధికి రాఁజాల రని పాలకులు గమనింపవలసి యున్నది. ఈ నడుమ జమీందారీపద్ధులోఁ జేర్పబడిన జయపురసంస్థానమును దానికి లోగడనుండుహక్కుల నొసంగి బస్తరునకువలె స్వదేశ సంస్థానముక్రింద నింకనుండి పరిగణించుట భావ్య మని దొరతనమువారికి విన్నవించుచున్నాను.

గంజాంమండల విభజనము:—ఏజన్సీ ప్రదేశములు నాచెప్పినట్లు ప్రత్యేకింపఁబడె నేని, మిగిలినగంజాం జిల్లాను ఆంధ్రోత్కళదేశములనుండి విడఁదీసి సులువుగా పంచిపెట్టవచ్చును. ఋషికుల్యానదిని సరిహద్దుగాఁ జేసి విభజించుట యుక్త మని ఇదివఱకే నిర్ధారణ చేసి యుంటిని. అయినను దీనిని గూర్చిమఱియొకసారి నాయభిప్రాయమును విశదీకరించుచున్నందులకు నన్ను పాఠకులు మన్నింత్రుగాక.

1911-వ సంవత్సరము. జనాభాలెక్కలను జూచినచో గంజాంమండలములో నించుమించుగా నొడ్డివారు తెలుఁగువారు సమానముగా నున్నట్లు కనఁబడుచున్నది. ఈజనాభా నిజస్థితి విషయమునఁ గొందఱ కంతగా విశ్వాసము లేకున్నను, ఋషికుల్యానదికి దక్షిణదిగ్భాగమునఁగలగంజాంజిల్లాలో, మొత్తముమీఁద ఓఢ్రులకంటె తెలుఁగువారే విశేషించి యున్నా రనుట నిజము. అల్ల ఋషికుల్యకు దక్షిణమున నున్న కొన్ని జమీందారీతాలూకాలలో అస్సాములోని బంగాళీలకువలె, ఒడ్డివారు విశేషించి యున్నారు. ఇందు ముఖ్యముగా ఋషికుల్యాతమహనదీప్రాంతములలో (In the Rushi-kulya basin) నిమిడియున్న సురడా బొడగడ ధారాకోట సేరుగడ తాలూకా లెల్ల నోఢ్రమయములుగా నున్నవి. ఇప్పు డవి గుంసూరుడివిజనులోఁ జేర్పఁబడి యున్నవి. కాఁబట్టి ఋషికుల్య కుత్తర ప్రదేశము తోఁబాటు గుంసూరు డివిజను ఉత్కళదేశమునకు విడిచిపెట్టి, ఛత్రపురము తిరస్తానిపరగణా బరంపురం డివిజను శ్రీకాకులం డివిజను, ఆంధ్రదేశములోఁ జేర్పవలసిన దని సర్కారువారికి మనవిచేసికొనుచున్నాను. పైఁజెప్పిన రీతిగా, నెంత త్వరలో గంజాంజిల్లా విభజింపఁబడిన నంత మంచిది. దాన నాంధ్రోత్కళు లుభయులు పరస్పర వైషమ్యములను విడచి వర్ధిల్లుట కవకాశమేర్పడును. ఇట్టి యేర్పాటునకు ఓఢ్రనాయకుల ప్రోత్సాహమునకు మందసా పర్లాకిమిడి రాజులు అడ్డు తగులకుందురుగాక.

# గోపాలుని రామకవి నన్నయభట్టువంశకవి కాఁడు

## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

గడచిన వత్సరపు టాంధ్రపత్రికా సంవత్సరాది సంచికలో బారిష్టరు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు "నన్నయభట్టువంశకవి - గోపాలుని రామకవి." అను నొక వ్యాసమును ప్రచురించిరి. గోపాలుని రామకవి యను నియోగి చిత్రాంగదా పరిణయ మను ప్రబంధమును వ్రాసి యందు నన్నపాచార్యునిఁ దన వంశస్థునిగా వర్ణించుకొనినట్లు కొన్ని పద్యములను తమవ్యాసములోఁ బ్రచురించి నన్నయభట్టారకుఁడును గోపాలునిరామకవియు నేక వంశస్థు లని తేల్చిరి. ఇది వ్రాయఁ బ్రారంభించినది మొదలు దీనిపై ననేకములగు మండనఖండనములు ప్రచురింపఁబడుచున్నవి. ఆంధ్రపత్రికవా రీయంశము నింకను బాగుగఁ జర్చింపవలసియున్న దని వ్రాసిరి. కాఁబట్టియును, నే నిదివఱకు నన్నయభట్టారకచరిత్రమును వ్రాసియున్నాఁడను కావునను, లక్ష్మీనారాయణ పంతులవారు తమ వ్యాసములో నా పేరెత్తి నావాదమును త్రోసివేయఁ జూచిరి గనుకను, సత్యనిర్ధారణార్థమై నేనుగూడ నీవిషయమై చర్చ కావింపవలసిన వాఁడ నైతిని. ఈసందర్భములో బహువిషయములు విపులముగాఁ జర్చింపవలసియున్నది. అయినను సంవత్సరాదిసంచికలోఁ బెద్దవ్యాసములఁ బ్రకటించుటకు వలనుకాదు. కాన నిందుఁ బ్రధానాంశముల సంగ్రహముముగాఁ జర్చించి విడుచుచున్నాను.

### గోపాలునిరామకవిగ్రంథకాలము

పూర్వుఁడగు నన్నయభట్టోపాధ్యాయసార్వభౌముని సంబంధముఁ దెలుపుకొను రామకవి నన్నపార్యునితరువాత నెంతపూర్వుఁ డయిన నంత ప్రమాణ మగును. కాన ముందుగాఁ జర్చింపవలసిన దతని కాలము. కాననే లక్ష్మీనారాయణగారు ప్రప్రథమముననే రామకవి కాలనిర్ణయమును గావింప నుద్యమించిరి. "మహాపరివర్తన" మను వ్యాసములో నాంధ్రపత్రికాసంపాదకులు "గ్రంథకర్త కేవలము గౌరవముకొఱకు నన్నయభట్టారకునివంశము ననుసంధానముఁ జేసికొనెనో నన్నయభట్టారకునివంశజుఁడో పండితులు గ్రంథకాలమును బట్టి విమర్శించి నిర్ణయించుట సమంజసము." అని వ్రాసిరి. కానఁ గవి కాలనిర్ణయము మొదటిపని.

### కవికాలము

...కాలనిర్ణయమును చేయుటకుఁ దగిన యాధారము లేవియుఁ ...టు లేదని తేలినది. అందుచే లక్ష్మీనారాయణపంతులుగారు ...ను నిర్ణయించుటకు సరియైన యాధారములు కనఁబడవు. ...లోనివిషయములను బట్టి కవి మిక్కిలి ప్రాచీనుఁడు కానట్లు తోఁచుచున్నది." అని వ్రాసిరి. ఇంక గ్రంథమందలి విషయములంబట్టి దీని కెంత యవకాశమున్నదో కనుఁగొందము. రామకవి తన గ్రంథమున శ్రీనాథుని పోతనను స్తుతించె. గాన నితఁడు 15-వ శతాబ్దికిఁ దరువాతివాఁ డని వ్రాసిరి. అది బాగుగనే యున్నది. తరువాత నెప్పటివాఁడో తెలిసికొనుటకై భంగ్యంతర మవలంబించి కవితాధోరణినిబట్టి కాలనిర్ణయమును జేయ నిర్ణయించిరి. ఇతరాధారములు లేనపుడిదియును సరస మగు మార్గమే!

చ. అటఁ జని కాంచె పాండుసుతుఁ డభ్రనటీవరతానమానవి
స్ఫుటకలమజ్జగానభవభూరిభయార్తివిలీనగాఢపా
త్పటలఝుఘ్ముతకేకికలధర్షణహేతుతరంగరంగదా
ర్భటపటునిర్ఝరీవిశదభవ్యవిశాలము శీతశైలమున్॥

అని రామకవి తన గ్రంథములో వ్రాసికొనె నఁట. ఇది పెద్దనార్యుని మనుచరిత్రములోని యీ క్రింది పద్యమును విశేషముగాఁ బోలియున్నది.

చ. "అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్స్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలముఁ
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్.

ఈకవులలో నొకరిని రెండవవా రనుకరించి యుందు రని యూహించి పంతులవారు:-"మనకవి పెద్దన ననుకరించినయెడల పెద్దనకు తరువాతివాఁడు. అనఁగా, 16-వ శతాబ్దిలోనివాఁడో తరువాతివాఁడో అయిన నెంచవలసియున్నది." అని వ్రాసిరి. దీనింబట్టి పెద్దనయే రామకవి ననుకరించె నేమో ? యను నూహ పంతులుగారి కున్నట్లు తేలుచున్నది ! పెద్దన రామకవి ననుకరించె ననుట మహాసాహస మని నాతలంపు. పెద్దనకవిత్వ మెక్కడ! రామకవి కవిత్వ మెక్కడ! ప్రకటితములయిన పద్యములనుబట్టి చూడ రామకవి మంచిపాండిత్యము కలవాఁడుగాఁ గాని, స్వతంత్రముగా నించుకయు నూహించుశక్తి గలవాఁడుగాఁ గాని, ధారాశుద్ధి కలవాఁడుగాఁ గాని, కాన్పింపఁడు. ఇట్టి కవిసామాన్యుని పెద్దన యనుకరించె ననుట యుచితము కాదు. పెద్దనపద్యమును గని రామకవి తనపద్యము నల్లుకొనె ననుట యుచితము. ఇంకను పెద్దన పెద్దసమాసములను తనపద్దెమునఁ బెట్టినను కొంచెము విఱుపులనే పెట్టినాఁడు. రామకవి యాతని మించి పద్యమునం దంతటను దీర్ఘాతిదీర్ఘ మగు సమాసమును పెట్టినాఁడు. "ఒకపద్దెములోనే యిన్ని విఱుపులా?" యనెడు పెద్దన, రామకవి పద్దెమును గని తనపద్దె మల్లుకొని యుండునెడలఁ బద్దెమునం దెచటను విఱుపు లేకుండఁజేసి యొక్కటియే సమాసము కూర్చియుండును.

అదిగాక రామకవిపద్యములోఁ బెద్దనపద్యానుకరణమే కాక మఱి కొంత క్రొత్తవిశేషముకూడఁ జేర్పఁబడినది. అదియైనఁ గవి స్వతంత్రించి చెప్పినదికాదు. రామాభ్యుదయమునందలి "సింహాసనఖాంకుర" అనుపద్యములోని "పృథులమద్జస్వరోద్ధితభిల్లపల్లవాధరాగీతి కాకర్ణనాతిథీతిపరవశాత్మపటీరకోటరకుటీరలీనఫణి" అను భాగానుకరణమును నిందుఁ గలదు. కావున, రామకవి పెద్దనపద్యమును రామభద్రుని పద్దెమును జూచి తనపద్యమును వ్రాసికొనినట్లు కాన్పించుచున్నది. కాఁబట్టి రామభద్రునికిఁ గూడ రామకవి తరువాతివాఁడని తలంచుట ధర్మము. అనుకరణమునుబట్టి కాలనిర్ణయమునకుఁ బూనుకొనిన లక్ష్మీనారాయణపంతులుగారే కారణముననో యావిమర్శనమును నడుమ హఠాత్తుగాఁ ద్రుంచివైచి "కవికాలనిర్ణయము నింతటితో విరమింతము" అని వ్రాసివేసిరి. ఇట్లేల విరమింపవలె? అనుకరణము లింకను గాన్పించుచున్నవే. అవి యేవి యనఁ బ్రచురితపద్యములలో రామకవి తనవంశమును వర్ణించుకొనినది ఇట్లున్నది:-

సీ. "సకలరాజస్థాన జనమనోరంజన
ప్రచురశేఖరులు గోపాల్నివారు
ప్రత్యక్షబాహాట పాంచాలనటసాధ్య
పాఠకచణులు గోపాల్నివారు
హితజనపాలనోచితవాక్యకృతకృపా
పారీణమతులు గోపాల్నివారు
ప్రకటయోగానుభవులు గోపాల్నివారు
అట్టి గోపాల్నివారిలో నలఘువిభవ
దిక్ప్రభుస్థానపాలి శుండీప్తహేళి
రమ్యగుణహేళి నూరపరాజమౌళి."

ఈపద్యము కంకంటివారి యుత్తరరామాయణములోని యీ క్రిందిపద్యమును సర్వవిధములఁ బోలియున్నది.

సీ. "అఖిలరాజాధిరాజాస్థానజనహృద్య
విద్యావిహారు లార్వేలవారు
కల్పకబలికర్ణకలశార్ణవోదీర్ణ
వితరణోదారు లార్వేలవారు
సజ్జనస్తవనీయసతతనిర్వ్యాజవా
రిపరోపకారులార్వేలవారు
ఘనదుర్ఘట స్వామికార్యనిర్వాహప్ర
వీణతాధారు లార్వేలవారు
విమతగర్వాపహారు లార్వేలవారు
లట్టి యార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయ శ్రీవత్సగోత్రారవింద హేళి
మహితగుణశాలి వల్లభామాత్యమౌళి".

దీనిం గవ నొకనిని మఱియొక రనుకరించిన ట్లె కాన్పించుచున్నది. పద్యము మొదలిడుట యెత్తుగీతము నెత్తుకొనుట, 'హేళి', 'మౌళి' యని పద్యమును బూర్తిచేయుట మున్నగునవి యొకవిధముగా నుండుటయే కాక మొదటిపాద మించుమించుగా రెండిట సమముగా నున్నది. దీనింబట్టి చూడ నఖిలాదులకు 'సకలా'దులు పెట్టి రామకవి యుత్తరరామాయణపద్యము ననుకరించినట్లు స్పష్టమగుచున్నది. ప్రౌఢతమమైన కవితావిశేషము గల యుత్తరరామాయణకర్త మిక్కిలి నిస్సారమై పేలవముగా నున్న రామకవికవిత్వము ననుకరించె ననుట తగదు. ఉత్తరరామాయణము 18-వ శతాబ్దినిబుట్టినది. కాన రామకవి యాశతాబ్దమునకుం దరువాతివాఁడుగాఁ గాన్పించుచున్నాఁడు. ఉత్తరరామాయణములోని పద్య మాఱు వేలనియోగులను వర్ణించుచున్నది. కాన దానిని వీరేశలింగముగారు కవుల చరిత్రములోఁ బ్రచురించిరి. శ్రీరామమూర్తిగారు కవిజీవితములలోఁ బ్రకటించిరి. తఱుచుగా నియోగులు దాని నుదాహరించుచున్నారు. ఇట్టి సుప్రసిద్ధపద్యరాజమును సర్వవిధంబులఁ బోలియున్న రామకవి పద్యము నుదాహరించి దానింబట్టి యుత్తరరామాయణకర్తకుఁ దరువాతివాఁ డైనఁ గావచ్చు నని శ్రీలక్ష్మీనారాయణపంతులుగారేల వ్రాయలేదో?

మఱియును రామకవిగ్రంథమునందలి కవిస్తుతి ఫణిభట్టుకవిస్తుతి ననుకరించుచున్నది. చదువరుల యుపయోగార్థమై యాపద్యముల నిట నిచ్చుచున్నాను.

రామకవిపద్యము

సీ. రామాయణార్థపూర్ణవివేకి వాల్మీకి
విశ్రుతాశుకవిప్రవీణు బాణు
విమలసాలంకారవిఖ్యాతి భవభూతి
మానితశబ్దసమాజు భోజు
మూర్ఘవిక్సన్నతమోరవి భారవి
కవితాచణోల్లాసు కాళిదాసు
సహజోపమానని స్తంద్రుఁ జోరకవీంద్రు
నత్రేయశిష్యకవితామయూఖు మాఖు
నామనంబునఁ దలపోసి నన్నపార్య
సోమభాస్కరభీమాదిసుకవిజనులఁ
బ్రణుతిగావించి శ్రీనాథు రంగనాథు
పోతనార్యుల స్మరియించి పూజచేసి.

ఫణిభట్టుపద్యము

సీ. ప్రథమకవిత్వహేవాకిని వాల్మీకి
భారతాదికథావిభాసు వ్యాసుఁ
గావ్యత్రయీప్రవికాసుఁ గాళిదాసు
హారికథాదళితమహోఘు మాఘు
వివిధప్రబంధవాగ్విశ్రాణు బాణుని
సారార్థవిజ్ఞానధీరుఁ జోరు
నఖిలవిద్యామనోహరుని మయూరుని
సన్నుతకవివర్యు నన్నపార్యుఁ

Mr. P. Ayyanna Chettiy's Choultry, Ongole



పుత్తూరు అయ్యన్న సెట్టి గారి సత్రము, ఒంగోలు

The All-India Libraries' Conference, Madras



అఖిల భారత గ్రంథాలయ మహాసభ, మద్రాసు

The Municipal Councillors, Ongole



ఒంగోలు మ్యునిసిపాలిటీ సభ్యులు

The Indian Jail Commission



హైందవ కారాగార విచారణసంఘము

దిక్కయజ్వాదిపూర్వప్రథితకవుల ను
తించి యేతత్కవీంద్రుల నెంచి భావి
కావ్యకరుల బహుక్రియాకలన నుంచి
పూని చేసెద నొకకృతి పుణ్యనియతి.

ఈఫణిభట్టుపద్యమును రామకవిపద్య మనుకరించుచున్నట్లు బాలునికైనను బోధపడకపోదు. మనవారు ఫణిభట్టు నాదికవులలోఁ దిక్కనకుఁ దరువాతివానినిగా నెంచుచున్నారు. అదియే నిజమగుచో రామకవి తప్పక ఫణిభట్టు ననుకరించె నని చెప్పక తప్పదుగదా? మఱియు నన్నయతిక్కనలనుమాత్రమే ఫణిభట్టు స్తుతించెను. రామకవి శ్రీనాథుఁ బోతనను గూడ స్తుతించె. అదియటుండ ఫణిభట్టెప్పటివాఁడైనను నిప్పటివఱకును బయల్పడక ఈ ఇరువదవ శతాబ్దమునఁ బయల్పడినవాఁడు. ఈశతాబ్దమునఁ బైకి వచ్చిన ఫణిభట్టుపద్యమును రామకవి యనుకరించెను. కాన నీతఁడీ యిరువదవ శతాబ్దములోనివాడే యగుచున్నాఁడు. ఫణిభట్టు కవిత్వము రసవంతమై పండితజనశ్లాఘాపాత్రముగా నున్నదని రసజ్ఞులు వ్రాయుచున్నారు.

[రామకవికవిత్వ మన్నదో యప్రౌఢ మని నుడువుచున్నారు. కాఁబట్టి ఫణిభట్టు రామకవి ననుకరించె ననుటకంటె రామకవి ఫణిభట్టు ననుకరించె ననుట లెస్స. 'హేవాకి'కి 'వివేకి' లోనగుపదములు పెట్టుకొని రామకవి ఫణిభట్టు ననుకరించె.]

ఈవిధముగా రామకవి పల్వురకవిత్వము ననుసరించినట్లు కాన్పించుచున్నది. ఈతని నే యితరకవు లనుకరించి రచరాదా యని యందురేని యీతని నాదికాలపుకవి యగు ఫణిభట్టును, మధ్యకాలములోని పెద్దనార్యుఁడును రామభద్రుఁడును, ఆధుని కవులలోని యుత్తరరామాయణకర్త మున్నగువారును, అనుకరించిరేని యీతఁడు చాల సుప్రసిద్ధకవియై యీతనిగ్రంథము విశేషవ్యాప్తి నందినదై యుండవలెను గదా? అట్లు లేదు. నేఁడు * మనవారు పైకిఁ దీయువఱకు నీకవిని గూర్చి గాని, గ్రంథమును గూర్చి కాని, ఎవ్వరును నెఱుంగరు. ఇంకను రామకవి యనుకరించిన రామభద్రుని పద్యపాదము (పృథులషడ్జస్వరేత్యాదిది)చాల వివాదముపాలై ప్రసిద్ధికి వచ్చినది. సంగీతమును విని ఫణులు ఫణములెత్తి యాడుట లోకమునఁ గాన్పించుచుండఁగా నిందు విరుద్ధముగా నవి తలలు వంచుకొనె నను వర్ణనము కాన్పించుచున్న దను పెద్దయాక్షేపణము దీనిపై వచ్చినది. రామభద్రునికల్పనమునకుఁ బూర్వమే రామకవిపద్యము షడ్జస్వరములోఁ బాడెడు సంగీతమును విని ఫణులు భీతిచేఁ దలలు వంచుకొనుచున్న వనునది సుప్రసిద్ధముగా నుండుచోఁ బైయాక్షేపణము తరువాతఁ బుట్టిన రామాభ్యుదయముపై రాకుండునుగదా? ఇంత యేల? ఇప్పటివఱకును నీరామకవిని గాని ఈతని కవిత్వమును గాని యెవ్వరును నెఱుంగరు. తుదకు పేరులైన వినవచ్చినవి కావు. ఏలక్షణకారుఁడును వీరి పద్యముల నెత్తికొనలేదు. కవిత్వము బహునిస్సారమై యున్న దని యిదివఱకే వ్రాసియుంటిని గదా. ఆధునికకవులలోఁ గూచిమంచి తిమ్మకవ్యాదుల కవిత్వమునందున్న పటుత్వమైన నిందు లేదు. అపశబ్దప్రయోగములతో నిండియున్న దని తత్పక్షము వారే చెప్పుచున్నారు. ఇది యీదినములలోని కవిత్వము గాని పూర్వకవిత్వము కాదు. లక్ష్మీనారాయణపంతులుగారు తాము భ్రమపడి లోకమును భ్రమలో ముంచిరి. అనుకరణము లనేకము లుండినను ఒక్క పెద్దన్న పద్యానుకరణమును మాత్రమే గ్రహించి పెద్దన్నయే రామకవి ననుకరించె నేమో యనునూహనుగూడఁ బుట్టింప యత్నించి వాదమును నడుమఁ ద్రుంచివైచిరి. అంతగాఁ బ్రాచీనుఁడు కాఁడని తోఁచుచున్న దని నిపుణముగా వ్రాసి కొంత ప్రాచీనతను గల్పింపఁజూచిరి. వీరివ్రాత లోకమును భ్రమలో ముంచుచున్న దనుమాటకు అవటపల్లి నారాయణరావు గారి వ్రాతయే నిదర్శనము. లక్ష్మీనారాయణపంతులుగారి వ్యాసము సంవత్సరాదిసంచికలోఁ బ్రచురింపఁబడుటకై యాంధ్రపత్రికా కార్యస్థానమునకు రాఁగాఁ దత్పత్రికోపసంపాదకులగు నారాయణరావుగారు ఆవ్యాసముం గని యది ప్రకటిత మగుటకు ముందె దానిపై వ్యాఖ్యానవ్యాసముల వ్రాసి యాంధ్రపత్రికలోఁ బ్రచురింప మొదలిడిరి! వా రిట్లు వ్రాసిరి :—

"ఈ రామకవి 15-వ శతాబ్దమువాఁడో 16-వ శతాబ్దమువాఁడో యని" లక్ష్మీనారాయణగా రూహించుచున్నారు. లక్ష్మీనారాయణగా రట్లూహించిరా? అట్లూహించుట కవకాశ మున్నదా? యన రెండును గూడ సరిపడవు. పంతులు గారు "ఏ కాలమువాఁడో నిశ్చయముగాఁ జెప్ప వీలు లేదు" అనియు "మన కవి పెద్దన ననుకరించినయెడల పెద్దనకుఁ దరువాతివాఁ డనగా 16 వ శతాబ్దిలోని వాఁడో తరువాతివాఁడో అయిన క్లైంచవలసి యున్నది" అనియు వ్రాసిరి. ఈ వ్రాఁతనుబట్టి చూడఁ గవి దేకాలమో చెప్ప నవకాశము కాన్పించుట లే దని లక్ష్మీనారాయణ గారు వ్రాసినట్లు తేలుచున్నది. గాని 15 వ శతాబ్దమువాఁడో 16 వ శతాబ్దమువాఁడో యని యూహించుచున్నటులు తేలుటలేదు. లక్ష్మీనారాయణగారి కట్లు చెప్పుట కవకాశమును లేదు. వీరు మొదట రామకవిచేసిన కవిస్తుతిని బట్టి కాలనిర్ణయముఁ జేయఁ బ్రయత్నించిరి. అది సరియగు ప్రయత్నము కాదు. గ్రంథకర్త యేకవులను స్తుతించెనో, ఆ కవులకుమాత్రమే తరువాతివాఁ డన వలనుపడదు. ఎన్నఁబడని కవులకుఁ బూర్వుఁ డనుటయు నుచితము కాదు. ఫణిభట్టునుగూర్చి వ్రాయుచు వీరేశలింగముగా రిట్లు లిఖించిరి.

కవి నన్నయతిక్కనలను మాత్రమే స్తుతించినందున మిక్కిలి ప్రాచీనుఁ డనియు తిక్కయజ్వాదిపూర్వప్రథితకవు లనుటచేతఁ దిక్కనాదులకుఁ దరువాతఁ గొంతకాలమున నుండె ననియుఁ జెప్పుదురు. కర్తృకాలమును నిర్ణయించుట కిట్టివే యాధారములైన

* [మ॥రా॥శ్రీ, 1. వంగూరి సుబ్బారావుగారు, 2. ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు, 3. అవటపల్లి నారాయణరావుగారు.]

యెడలఁ దమ పుస్తకములలోఁ గవి స్తుతులను జేయనివా రందఱును నన్నయాదులకుఁ బూర్వు లని చెప్పవలసివచ్చును."

వీరేశలింగముగారు పైని వ్రాసినది యుచితముగనె యున్నది. రామకవి చేసిన కవిస్తుతినిబట్టి యాతఁడు శ్రీనాథ పోతనలకుఁ బూర్వుఁడు మాత్రము కాఁ డని తెలిసినది. తరువాత నెప్పటివాఁడో తేలుట లేదు. ఇఁకఁ బెద్దనపద్యానుకరణవిషయముఁ జూతము. పెద్దన కవిత్వమును రామకవి యనుకరించె ననుట యుచితము. కాన పెద్దనకుఁ దరువాతివాఁడు. పంతులుగారు "పెద్దనకుఁ దరువాతివాఁ డనగా 16 వ శతాబ్దిలోనివాఁడో తరువాతివాఁడో" యని కదా వ్రాసిరి. 'తరువాతివాఁ డ'న నెంతవఱకు గ్రహింపవలసియుండును? 16 వ శతాబ్దము మొదలు నేటివఱకుఁ గల కాలమంతయు, దరువాతి కాలమే కదా? 16-వ శతాబ్దాది నున్న కవిని 16 వ శతాబ్దాంతము నందలివాఁడు గాని, 17 నందలివాఁడు గాని, 18 లోనివాఁడు గాని, 19 నందువాఁడు గాని, ఇరువదవ శతాబ్దము వాఁడు గాని యనుకరింపవచ్చును గదా! ఇప్పటి కొప్పరపుకవులు పెద్దన ననుకరించి 'నీల మేఘముడాలు డీలుసేయఁగఁజాలు' నని పద్యము నల్లిరి. ఆ కారణముచేత వారు 16 వ శతాబ్దమువా రగుదురా? కారు. అట్లే రామకవియునుఁ గావచ్చును. కాన, తరువాతివాఁడన నేటివాఁడైనను గావచ్చును. ఆహేతువుచేతనే పంతులుగారు 15, 16 శతాబ్దములమాట నెత్తి యప్పటివాఁడై యుండు నని వ్రాసియును, దానిని సిద్ధాంతీకరింపఁజాలక, తరువాతివాఁడో యనికూడ వ్రాసిరి. వస్తుతత్త్వముచేఁ బంతులుగారికి రామకవి కాలము తెలిసినది కాదు. పూర్వుఁ డనుట కవకాశము చిక్కలేదు. కాన నారాయణరావుగారు వ్రాసినది యసత్యము. చదువరుల హృదయములందు రామకవినిగూర్చి కొంత పూర్వుఁ డను భ్రాంతిని మూల వ్యాసము బయలువెడలుటకు ముందే నాటుటకై వీ రీవ్రాఁతను మూలవ్యాసమునకు ముందే వ్రాసిరి. అట్లు కాదందురేని మూలవ్యాసము ప్రకటిత మగుటకుఁ బూర్వమే తద్వ్యాఖ్యానముఁ బ్రకటింప నేమి తొందర కలిగినది? అట్లు చేయుట యుచిత మెట్లగును? ఇట్లు రామకవిని బూర్వునిఁ జేయుటకై ఒకించుక యసత్యప్రయత్నము జరిగిన దనక తప్పదు. గ్రంథ మిప్పటికిని బయల్పడుట లేదు. ఇదియును, గొంత సందేహమును కలిగించుచున్నది.

అది యటు లుండఁ బూర్వుఁ డనుట కాధారములు లేవు. గాని నవీనుఁ డనుట కవకాశములు చాల గన్పించుచున్నవి. (1) 18-వ శతాబ్దములోని కంకంటివారి యుత్తరరామాయణములోని సుప్రసిద్ధ పద్యముయొక్క యనుకరణము రామకవి కబ్బమునందు గాన్పించుచున్నది. మఱియుఁ బూర్వకవితలం దుండు బిగి యిందు లేదు (3) పూర్వుల కుండురీతి భాషాజ్ఞాన మీ కవి కున్నట్లు కాన్పించుట లేదు. (4) నిస్సార మగు ననుకరణము మెండుగా నున్నది. (5) ఇది యటు లుండ నీతఁడు చేసికొనిన వంశవర్ణనమును పట్టి చూచినను నీతఁడు చాల నవీనుఁడుగాఁ గన్పించుచున్నాఁడు. ఈతఁడు నన్నయను దనవంశకవిగా వర్ణించుకొనె ననునదియే నిజమగునో నాతనిని మిక్కిలి పూర్వునిగ వర్ణించె ననక తప్పదు. మౌద్గల్యఋషిని చెప్పి, ఆగోత్రమున నన్నయ పుట్టె ననియు, నాతని తరువాతఁ గొన్ని పురుషాంతరములు గతించిపోయిన పిమ్మట, ఆవంశమునఁ దనమూల పురుషుఁ డగు గోపాలుఁడు పుట్టె ననియు, నటుతరువాత నెప్పుడో యోగానందుఁడు పుట్టె ననియును, నాతని నందనుఁడు తా ననియును చెప్పుకొనినట్లు కాన్పించుచున్నది. పెద్దపెద్ద గర్తము లనేకములు నడుమనడుమ గలవు. గోపాలుఁడు నన్నయకు మనుమఁడు గాని మునిమనుమఁడు గాని యారీతి దగ్గఱ బాంధవము గలవాఁడు గాని యగుచో, నాబంధుత్వమును రామకవి తెల్పియే యుండును. అట్లు తెల్పక ఆ నన్నపాఖ్యవంశాంభోధిని గోపాలుఁడు పుట్టె ననుటచేత నుభయులకును నెడము విశేషముగాఁ గల దని తేలుచున్నది. మఱియును మఱల గోపాలునివంశములో ననేకులు జన్మించి గోపాలుని వారై కీర్తిఁ జెంది గతించిరి. వారిసంఖ్య లెక్కింపఁ దరము గాదు. ఇట్లనేకులు చనినతరువాత సూరపరాజు పుట్టె. సూరపరాజు తరువాత నెందఱు గతించిరో తెలియదు. పిమ్మట నావంశమున యోగానందుఁడు పుట్టె. ఆతనికొడుకు రామకవి. దీనినంతను బట్టి చూచిన విశేష మగు నెడము రామకవికిని నన్నయకును ఉన్నట్లు తేలుచున్నది. అది నాలుగైదువందలతోఁ బోవునదిగా లేదు. గోపాలుని వా రగుటకుఁ బూర్వ మింటిపే రేమో చెప్పలేకపోయినాఁడు. నడుమనడుమ నెందఱెందఱు పురుషులు కలరో యెఱుఁగఁడు. కాన నీతఁడు పెద్దనాదులకంటెఁ బూర్వుఁ డనుట భావ్యముగాఁ గాన్పించుట లేదు. సూరపరాజునకును యోగానందునకును గల సంబంధము తేటపడుట లేదు. అన్వయక్రమవర్ణనము సమన్వయశూన్యముగ నున్నది. లోకములో నున్న వాడుకలకంటె నన్నయను గూర్చి యితఁడు చెప్పఁగలిగినది లేదు. (6) ఆంధ్రశబ్దచింతామణి నొనరించె నని చెప్పలేదా యందు రేని నది యిప్పటివాఁడైనను జెప్పవచ్చును. ఇంక నొక విశేషము. ఆంధ్రశబ్దచింతామణి నన్నయ విరచించినది కా దనువాదము ప్రబలముగాఁ గలదు. కొంద ఱతఁడు చేసినదే యనుచున్నారు. ఎవ రెట్లు వాదించినను, అయ్యది 17-వ శతాబ్దమునందలి ఎలకూచి బాలసరస్వతివఱకును నెవ్వరికిని దెలియదనియును, ఆతఁడే దైవచోదితుండై ప్రాప్తంబైన యా వ్యాకరణమును లోకమునఁ బ్రకటించె ననియు, నంద ఱంగీకరించుచున్నారు. కాన నాంధ్రశబ్దచింతామణిం గూర్చి ప్రశంసించిన రామకవి బాలసరస్వతికిఁ దరువాతఁ డనుట ధర్మము.

ఈరీతిగా నిన్న మొన్నటివాఁ డగు రామకవి నన్నపాఖ్యని తనవంశమువానినిగ నెన్నుకొనినమాత్రమున దానిని బ్రమాణముగా నెంచుకొన నవసర ముండదు. నన్నపాఖ్యని పూర్వోత్తరము లెఱింగి యుండి కవి యిట్లు వ్రాసికొని యుండలేదు. నన్నయ తాత తండ్రులఁ గాని, పుత్రపౌత్రాదులఁ గాని తెలుపలేదు. తనగోత్రకర్త యగు మౌద్గల్యునికడనుండి నన్నయకడకుఁ దుమికి యక్కడనుండి తమ గోపాలునివారికి మూలపురుషుఁ డగు గోపాలునికడ కొక దాఁటు దాటినాఁడు.

## నన్నయగోత్రము, రామకవిగోత్రము నొక్కటియా?

రామకవి తాను నన్నయవంశస్థుఁడ నని తలంచుటకుఁ గారణ మేమన, తనది మౌద్గల్యగోత్ర మగుటచే నన్నయ భారతపీఠికలో ముద్గలగోత్రజాతుఁడ నని వ్రాసికొనినదానిం గని భ్రమపడి తమ యుభయులదియు నొక్కటియే గోత్ర మనుకొని నన్నయను తనవంశస్థునిగా వ్రాసికొనినాఁడు. అవకాశము లభించిన గొప్పవారలఁ దమ వంశస్థులనుగాఁ జెప్పుకొన లోకులు పాటుపడుచుండుట క్రొత్తది కాదు. కాని ముద్గలగోత్రము వేఱు, మౌద్గల్యగోత్రము వేఱు నై యున్నవి. ముద్గలాపత్యమే మౌద్గల్యుఁ డయి యుండినను నీఋషు లిద్దరును గూడ గోత్రకర్తలే యై యున్నారు. ఈవిషయమై శబ్దకల్పద్రుమముఁ జూచిన సంశయము విడిపోవును. అం దిట్లున్నది—

"ముద్గలః = గోత్రకారకమునివిశేషః" "మౌద్గల్యః = ముద్గలమునిపుత్రః ఏష గోత్రకారః"

దీనింబట్టి చూడ ముద్గలగోత్రము వేఱు మౌద్గల్యగోత్రము వేఱు నని తేలుచున్నది. ధర్మప్రవృత్తి లోనగు ధర్మశాస్త్రములందుఁ గూడ ముద్గలగోత్రములు వేఱుగఁ దెల్పఁబడియున్నవి. ఇట్లే వసిష్ఠగోత్రము వేఱుగను, వాసిష్ఠగోత్రము వేఱుగను, గాన్పించుచున్నది. నన్నపాచార్యుఁడు తాను ముద్గలగోత్రజాతుఁడ నని వ్రాసికొనియున్నాఁడు. రామకవియన్నచో తనగోత్రకారకుఁడు మౌద్గల్యుఁ డని వ్రాసికొనియెను. చూడుఁడు.

"వ. మద్వంశక్రమం బభివర్ణించెద."

"మ॥ వివిధామ్నాయపురాణశాస్త్రపటిమావిర్భూతుఁ డధ్యాత్మమా
ర్గవిశేషప్రతిపాదమానసుఁడు సాంఖ్యస్థైర్యనిష్ఠానురో
గవినోదానుభవప్రమోదుఁడు తపోగ్రజ్వాలి మౌద్గల్యమౌ
నివరేణ్యుండు ప్రకాశమందె ధరణిన్ విజ్ఞానపారీణుఁడై"

కిరాతార్జునీయమును తెనిఁగించిన గోపాలునిసింగయకవియుఁ దనది మౌద్గల్యగోత్ర మని వ్రాసె. ఇట్టి మౌద్గల్యగోత్రోద్భవుండు ముద్గలగోత్రజాతునివంశమువాఁ డెట్లు కాఁగలఁడు? ముద్గలగోత్ర మౌద్గల్యగోత్రములకుఁ గల భేదమును కవి తెలిసికొనకపోయినాఁడు. నన్నయోపాధ్యాయునిగోత్రము వేఱు. రామకవిగోత్రము వేఱు. ఇంటిపే రొకటిగా దనుట స్పష్టమే. నన్నయయింటిపేరు గోపాలునివారు కారు కదా. కాన నిద్దఱును నేకవంశస్థులు కారు.

## గోపాలునివారు నన్నయవంశస్థుల మని చెప్పుకొనుచున్నారా?

"గోపాలునివారు ఇప్పటికిని నన్నయసంతతివార మని చెప్పుకొందురు." అని పంతులువారు వ్రాసిరి. ఇప్పుడు చెప్పుకొనఁ బ్రారంభించి రేమో కాని, ఇంతకుఁ బూర్వము చెప్పుకొనుట యున్నట్లు కాన్పింపదు. గోపాలునిసింగయకవి తనకిరాతార్జునీయములోఁ దాను నన్నయవంశమువాఁడ నని చెప్పుకొని యుండలేదు. ఈసింగయకవి చరిత్రమును వీరేశలింగముగారు తమకవులచరిత్రములో వ్రాసిరి. అందులకై గోపాలునివారిఁ గూర్చి యారవి యామైఁ జరిత్ర వ్రాసిరి. వారు వ్రాయునప్పటికి గోపాలునివారు నన్నయసంతతివార మని చెప్పుకొనుటయే యుండినచో వారాసంగతి వ్రాసియే యుందురు. ఆంధ్రదేశపు పూర్వచరిత్రలోఁ జక్కనియభినివేశముగలవా రని పంతులవారిచే నూహింపఁబడిన చిలకాకృష్ణయ్యపంతులుగారును నన్నయభట్టు మహారాష్ట్రుఁ డనేవాదమును గా దనిరే కాని, వైదికుఁ డను వాదమును కొట్టివేసి, వారియింటిపేరు గోపాలునివా రని చెప్పియుండలేదు. సుప్రసిద్ధకవివరు లగు తిరుపతివేంకటేశ్వరకవులు మనయాంధ్రదేశమును చాలవఱకుఁ జూచిరి. కొందఱు గోపాలునివారికిని దమకును జాల పరిచయము కల దనియు, వారితో ననేకపర్యాయములు కవులంగూర్చినప్రసంగములు వచ్చుచునే యుండె ననియు, వా రెప్పుడును నన్నయసంతతివార మని చెప్పుకొనలే దనియు, తిరుపతికవిగారు నాతోఁ జెప్పిరి. మఱియును ముప్పాళలో నొక గోపాలునివారియింట బసచేసి యాగ్రామమున నవధాన మొనర్చితి మనియు, ఆ గోపాలునివారితో బహువిద్యావిషయములంగూర్చి ముచ్చటించితి మనియు, వా రెన్నఁడును తాము నన్నయసంతతివార మని చెప్పుకొనలే దనియు, కవిరాజబిరుదాంకితు లగు వత్సవాయి వెంకటనీలాద్రిరాజుగారు నాతో ముచ్చటించిరి. మఱియును నన్నయ వైదికుఁ డను వాదము బహుకాలమునుండి వచ్చుచున్నది. ఆంధ్రదేశమునం దంతటను వ్యాపించిన కవులచరిత్రములోఁ జిరకాలముక్రిందటనే వీరేశలింగము గారు నన్నయ వైదికశాఖవాఁ డని వ్రాసిరి. అంతకుఁ బూర్వమందే కోవెల గోపరాజు తన విక్రమార్కచరిత్రములో నన్నయను తాను నియోగికవు లని యిచ్చినవారిలో నీయన వేఱుగా నిచ్చియున్నాఁడు. ఈతఁడు నన్నయను వైదికునిగా నిచ్చియున్నాఁ డని వంగూరి సుబ్బారావుగారు వ్రాసియుండిరి. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు నన్నయను వైదికుఁ డనుటయే కాక, ఆ కవి వైదికుఁ డగుట వైదికశాఖ కొక గొప్పఖ్యాతి యని వ్రాసిరి. ఇట్లే పల్వురు చరిత్రాభిజ్ఞులు బహుకాలమునుండి వ్రాయుచున్నారు. గురజాడ శ్రీరామమూర్తి గా రొక్కరుమాత్ర మిటీవల నన్నయ నియోగి యనువాదమును తెచ్చిరి. వారయినను గోపాలునివారు నన్నయవంశమువా రని వ్రాయలేదు. నేను నన్నయభట్టారకచరిత్రములో శ్రీరామమూర్తిగారివాదమును ఖండించి, ఆతఁడు వైదికుఁ డని వ్రాసియుంటిని. బహుకాలమునుండి యారీతి వాదము జరుగుచుండినను, గోపాలునివారు గాని, వారిమిత్రబాంధవులు గాని, నేఁటివఱకును నన్నయ వైదికుఁడు కాఁ డనియుఁ దమవంశకవి యనియు వ్రాసియుండలేదు. కాన గోపాలునివా రిదివఱకు తాము నన్నయసంతతివార మని చెప్పుకొనుచున్నా రను వార్త నమ్ముటకు వలనుకాకున్నది. ఒకవేళఁ గొందఱు గోపాలునివా రెవరైన నిటీవల అట్లు చెప్పుకొందురుగాక! అంతమాత్రముచేతఁ బంతులవారివాదమున కేమాత్రమును బలము కలుగదు. రామకవికలెనే వారును భ్రమపడి చెప్పుకొనియుండిరి. వైష్ణవభక్తు లగు నెల్లుట్లవారు తాము స్మార్తుఁ డగు పోతనసంతతివార మనుచున్నా రనియు నది సత్యము కా దనియు వీరేశలింగముగారు

వ్రాసిరి. భారద్వాజగోత్రోద్భవుఁ డగు పెనుమళ్లసోమకవి కాశ్యపగోత్రోద్భవుఁ డగు పిల్లలమఱ్ఱిపినవీరనను తనవంశస్థునిగా వ్రాసికొనియె. అది భ్రమయని చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్టిభ్రమలనేకములు గలవు. వానిలో నిదియు నొకటి కావచ్చును.

## నన్నయభట్టుశాఖయు గోపాలునివారిశాఖయు నొకటియా?

ఇంటిపే రొక్కటి కాకున్నను, గోత్ర మొక్కటి కాకున్నను శాఖయైన నొక్కటియా? యన నదియునుఁ గాదు. గోపాలునివారు నియోగులు. రామకవిగ్రంథములోని :—

శా. నానాయుక్తిబలప్రవీణతల విన్నాణంబుగా రాజసం
స్థానామాత్యవిదుల్ రచించి బుధహృద్యస్థాప్యసంపాదనా
హీనస్థాపన నేర్పరించి వికటించేవారి నుగ్గాడె యో
గానందుండు. నియోగినైపుణత లాహా చెప్ప నాశ్చర్యముల్.

అనుదానింబట్టి రామకవి నియోగి యని తేలుచున్నది. నన్నయభట్టారకుఁ డన్ననో వైదికబ్రాహ్మణుఁడు. రాజనరేంద్రునిపురోహితుఁడు. భారతపీఠికలో "తనకులబ్రాహ్మణు" నని కల దని లక్ష్మీనారాయణపంతులువారే యంగీకరించిరి. కులబ్రాహ్మణుఁ డనఁ బురోహితుఁ డని యర్థము. కొందఱు శబ్దరత్నాకరాదులలో నీయర్థము లే దనిరి. వానియం దీపదమే లేదు. కాని, ఆనై నిఘంటువు శబ్దకల్పద్రుమము మున్నగు సద్గ్రంథములం దీయర్థము కలదు. స్వామికృతామరటీక మున్నగువానియందును కల దని వానిమూలముగాఁ దెలియవచ్చుచున్నది. ఈరీతిగా నిఘంటువులు మున్నగువానియందుఁ గులబ్రాహ్మణుఁ డనఁ బురోహితుఁ డనునర్థము కలదు. కావుననే వీరేశలింగముగారు నన్నయ్య నియోగి యనువాదమును ఖండించివైచి వైదికుఁ డని యీక్రిందిరీతిగా వ్రాసియుండిరి.

"ఇతఁడు ముద్గలగోత్రజాతుఁ డగు వైదికబ్రాహ్మణుఁడు ......నన్నయభట్టు తాను రాజునొక్క కులబ్రాహ్మణుఁ డయినట్టు "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు...... నన్నపార్యుఁ జూచి పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ" నని యాదిపర్వములోఁ జెప్పుకొనియుండుటచేత నన్నయ వైదికశిఖామణి యనియే నిశ్చయింపవలసియున్నది. కులబ్రాహ్మణులై వంశపరంపరగా రాజపురోహితత్వము నిర్వర్తించుచుండుట వైదికులలోనే కాని నియోగులలో లేదు."

ఇట్లు వ్రాసిన వీరేశలింగంపంతులుగారు స్వశాఖాభిమానము లేనివారు కారు. అది యతిమాత్రముగాఁ గలవారని వంగూరి సుబ్బారావుగారుకూడ ఎత్తిపొడిచిరి. ఇట్లు స్వశాఖాభిమాని యగు చరిత్రకారుని ప్రక్కనుండి వంగూరి సుబ్బారావుగారు గోపాలునిరామకవి దగు నపూర్వగ్రంథముఁ గూర్చి చెప్పుచుండినను దానిం ద్రోసిరాజని, నన్నయ వైదికుఁ డని సిద్ధాంతీకరించిరి. ఏల? సత్య మది గావునను నంతకు మించి వ్రాయ నవకాశము చిక్కలేదు గావునను. ఒకడు, తను కులబ్రాహ్మణు ననుపాతముఁ జూచితి వనియు కాన తనున్ గులబ్రాహ్మణున్ " అని యర్థము చెప్పుకొనవలయు నని యు వ్రాసిరి. కాని యది యన్వయశూన్యము. నన్నపార్యునిపద్యము 'నన్నపార్యుఁ జూచి చళుక్యాన్వయాభరణుఁ డిట్టు లనియె, నని చెప్పుచున్నది. కాన తనున్ అని విడఁదీసినఁ దనున్, గులబ్రాహ్మణున్ నన్నపార్యున్ జూచి చళుక్యాన్వయాభరణుఁ డిట్టు లనియె, నని చెప్పవలెను. అప్పుడు 'తనున్' అను నది చళుక్యాన్వయాభరణునితో నన్వయించును గాని, కులబ్రాహ్మణునితో నన్వయింపక చళుక్యాన్వయాభరణుఁడు తనున్ నన్నపార్యున్ జూచి యిట్టు లనియె ననఁ దన్నుఁ దాను జూచుకొని నన్నపార్యునిఁ జూచి యీరీతిగాఁ బలికినాఁ డని యర్థమగును. కాన రామకవిపక్షమువారలకు దాన లాభ మేమియును లేదు. పురోహితుఁ డను రూఢ్యర్థము గల కులబ్రాహ్మణశబ్దముయొక్క యవయవార్థమును దీసి కులక్రమాగతుఁ డగు బ్రాహ్మణు డని యర్థము చెప్పఁబోవుటలో సారస్యము లేదు. కులక్రమాగతుఁ డని అర్థము చెప్పుటచేఁ బురోహితుఁ డను నర్థమునకు భంగము లేకపోఁగాఁ బైఁగా నాయర్థమే మంచి దను భావము కూడఁ దేలుచున్నది. కానఁ దనకులబ్రాహ్మణున్ నన్నపార్యున్ అనినప్పుడు తనపురోహితుఁడగు నన్నపార్యుని అని యర్థము చెప్పుకొనుట సర్వవిధముల నుచితముగను సహజముగను నున్నది.

## వైదికనియోగిభేద మప్పటికిఁ గలదా?

ఈభేద మప్పటికిఁ గలదా యని కొందఱు శంకించుచున్నారు. ఆంధ్రపత్రికవారును ఈ భేద మప్పటికిఁ గలదో లేదో నిర్ధారణము చేయవలసి యున్న దనిరి. విషయపరిశోధన మొనరించి యావఱకే కల దని వీరేశలింగముగా రిట్లు వ్రాసియున్నారు. "నన్నయభట్టారకుని కాలము నాఁటికే యాంధ్రస్మార్తబ్రాహ్మణులలో వైదికనియోగిభేద మేర్పడియుండినను" దీనింబట్టి యప్పటికే యీభేద మున్నట్లు తేలుచున్నది. మఱియును కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు విమలాదిత్యుని శాసనములలోనే నియోగు లుగ్గడింపఁబడుటఁ గనిపెట్టితి మనియు, నప్పటికే యీభేదము కల దనియు లిఖించిరి. ఇట్లు కాస సాధారము లుండఁగా మనము మఱియొకలాగున నెంచ నేల? అది గాక యీభేదము చాలకాలమునుండి కల దనుట కనేకనిదర్శనములు కలవు. వాని నన్నిటి నీచిన్నవ్యాసమునఁ జర్చింపఁ దావు చాలదు. ఈభేదము నన్నయనాఁటికే కలదు.

## ఆచార్య భట్టాద్యుపపదములు.

మఱియును నన్నపాచార్యుఁ డను పదమే యాతఁడు వైదికుఁ డని తెలుపుచున్నది. ఆచార్యపదమును నామాంతమునఁ జేర్చుకొనుట వైదికులందుఁ గలదు. కాని నియోగులందు లేదు. శ్రీనాథుఁ డాచార్యపదమును వాడుకొనె నని లక్ష్మీనారాయణపంతులుగారు వ్రాసిరి కాని యది తప్పు. శ్రీనాథుఁ డెచ్చటను నామాంతమున నాచార్యపదమును వాడుకొని యుండలేదు. ఇంకను నన్నయభట్టనునదియే

యాతఁడు వైదికుఁ డని తెలుపుచున్నది. భట్టబిరుదమును వైదికులు మాత్రమే వాడుకొనుచున్నారు గాని నియోగులు వాడుకొనుటలేదు. శ్రీనాథుఁ డొక్కఁడు యతికై భట్టశబ్దమును వాడుకొనినాఁడు. అంతమాత్రముచేత భట్టబిరుదము వైదికులకును నియోగులకును సమముగా వర్తించుననుట ధర్మము కాదు. కావుననే వీరేశలింగముగారు హులక్కి భాస్కరునిగూర్చి వ్రాయుచు "మల్లికార్జునభట్టు భట్టునామమును కలవాఁ డగుటను బట్టి వైదికబ్రాహ్మణుఁ డని యూహింపఁ దగియున్నది." అని వ్రాసిరి. నేఁటికిని కాశీభట్టవారు,రుద్రాభట్టవారు, పుల్లంభట్టవారు, పీరుభట్టవారు పెద్దిభట్టవారు మున్నగురీతిగా భట్టపదకలితత్వము వైదికులందుమాత్రమే కాన్పించుచున్నది. భట్టపదకలితమైన గృహనామములు నియోగులం దేల కాన్పించుటలేదు? నియోగు లాబిరుదమును తొల్లి వాడుకొనుట లేదు. కావుననే యట్టి యింటి పేరు కాన్పించుటలేదు. భట్టనామము గల యింటిపేళ్లు వైదికులం దనేకములు కలవు. వందలకొలఁది ననవచ్చును. గోపాలునియింటివారలు గోపాలునివా రయినట్లే భట్టనామములయింటివారలు భట్లవారైరి. భట్టనామ మెల్లరును శ్రోత్రియు లని దీనివల్లనే తేలుచున్నది. ఇంటిపేరునందు భట్టశబ్ద ముండుటయేకాక ఇప్పటికిని పేరులందు వైదికులలో భట్టనామములు పల్వురకుఁ గలవు. ఫణిభట్టు, మణిమంచిభట్టు, హరిభట్టు, వెల్లంకి తాతంభట్టు, రామావఝ్ఝల కొండుభట్టు మున్నగు నాంధ్రకవులందు శ్రోత్రియత్వమే కాన్పించుచున్నది. వారలు వైదికులుగానే యెన్నఁబడుచున్నారు. మనదేశమునందలి వారణాశిధర్మభట్టు, లింగాభట్టు, గరిగిపాటియన్నంభట్టు లోనగు సంస్కృతకవులు వైదికులు. వైదికులు వాడుకొను నుపపదములే నన్నయయం దున్నవి. కాని నియోగులు వాడుకొను నుపపదములు లేవు. పురోహితత్వము కలదు. అది యటు లుండ భట్టశబ్దమును వాడుకొనిన శ్రీనాథుఁడు రూఢిగా నియోగి యని తలంచుటకుఁ గతమేమి? అతఁడు తాను నియోగి నని వ్రాసికొనెనా? లేదు. అమాత్యపదకలితుం డగుటనా? ఆపదముచే నొప్పువార లితరులు లేరా? కలరు. శ్రీనాథుఁడు నియోగియా? వైదికుఁడా? యను శంకనుకూడ శ్రీరామమూర్తిగారు చేసికొనిరి. రామకవివలె నియోగి యని యతఁడు వ్రాసికొనలేదు. ఇఁక నియోగియే యని యెట్లు రూఢి చేయఁగలము? అట్లు కాదనియు శ్రీనాథుఁడు నియోగియే యనియుఁ దలంపవలె నందురా? అయినను నొకరిద్దఱు నియోగులు యతికొఱకో నెందులకో భట్టశబ్దమును సకృత్తుగా వాడుకొనునంతమాత్రమున నాబిరుద ముభయులకును సమముగాఁ జెల్లు ననవచ్చునా? కూడదు. అల్లమరాజువారు, ఆదిరాజువారు, మున్నగు వైదికులందు గృహనామాంతమున రాజపద మున్నను నయ్యది వైదికులం దరు దనియు నా కారణమున నాదిరాజువారిని నియోగు లనవలె ననియు వంగూరి సుబ్బారావుగారు శాసించిరి. ఆరీతినె యొకానొకచో నెచ్చటనైన నెప్పుడైన నెందులకైన నొకనియోగిచే భట్టశబ్దము వాడుకొనఁబడినను నంతమాత్రముచే నయ్యది యుభయులకును సమానముగాఁ జెల్లు ననరాదు. భట్టశబ్దకలితత్వముంబట్టి వైదికుఁ డనుటయే యుచితము. కాన నన్నయను వైదికుఁ డనియే చెప్పనొప్పును. 27 నియోగములలోఁ బురోహితత్వమును గలదు. గాన రాజనరేంద్రునిపురోహితుఁ డగు నన్నయయును నియోగియే యని వంగూరి సుబ్బారావుగారు వ్రాసిరి. ఈ 27 నియోగములలోనివారు నియోగులే యగుచో చాకలి మంగలిమున్నగువాండ్రుకూడ నియోగులే యగుదురు. అది యనుచితము. ఈనియోగములకును నియోగిశాఖాబ్రాహ్మణులందు రూఢమగు నియోగిపదమునకును సంబంధములేదు. నన్నయ వైదికుఁ డను వాడుక చిరకాలమునుండి కలదు. ఆనటపల్లి నారాయణరావుగారు తలఁచినట్లు వైదికులుమాత్రమే యట్లు తలఁచుట లేదు. నియోగులును నట్లే తలంచుచుండిరి. దానిని గొట్టివేయఁ దగిన దేదియును నేఁడు కలుగలేదు.

కాన రాజనరేంద్రుని కులబ్రాహ్మణుఁడును, నాచార్యపదకలితుండును, ముద్గలగోత్రజాతుఁడును నగు నన్నయభట్టారకునకును, నియోగియు మౌద్గల్యగోత్రుండును, యోగానందామాత్యనందనుఁడును నగు గోపాలునిరామకవికిని శాఖాసంబంధముగాని, గోత్రసంబంధముగాని, గృహనామసంబంధముగాని యెంతమాత్రమును లేవు. పాపము! రామకవి గోత్రైక్య మున్న దనుకొని తనగ్రంథమున నన్నయను మౌద్గల్యగోత్రలలామునిగా వర్ణించుకొనినాఁడు. మౌద్గల్యగోత్రలలామత్వమును జెప్పి, ఆవంశమున గోపాలుఁడు పుట్టె ననుటచే నిచట వంశశబ్దమునకు గోత్ర మర్థము చెప్పుకొనవలె నని గొల్లపూడి వెంకటప్పయ్యశర్మగారు వ్రాసినది సరసముగనే యున్నది. కాని గోత్రైక్యముకూడ నిచ్చట లేదు. ఏవిధమునం జూచినను నన్నయభట్టు వంశమునకును రామకవివంశమునకును సంబంధము కాన్పించుటలేదు. నన్నయభట్టువంశకవి కాఁడు గోపాలునిరామకవి. రామకవిగ్రంథ మపూర్వము. దీనింగూర్చి యనేకచమత్కారములు కలవు. అవన్నియు వేఱొకగ్రంథమునఁ జర్చింపఁబడును.

# పురాతనాంధ్రవార్తాపత్రికలు

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

నాగరకత నభివృద్ధి చేయు సాధనములలో వార్తాపత్రికలు మొదటివి. కాన వాని యుత్పత్తి వ్యాప్తి మున్నగు నంశములు తెలిసికొనుట దేశాభిమానుల మొదటిపని. కాని మన దేశమును ప్రప్రథమమున నలంకరించిన పురాతనాంధ్రవార్తాపత్రికలం గూర్చి యిటీవల మనవా రనేకులు చాల తప్పుటూహలపా లగుచున్నారు. కొందఱు మొదటి పత్రిక యాంధ్రభాషాసంజీవని యని తలంచుచున్నారు. మఱికొందఱు పురుషార్థప్రదాయినిఁ బ్రథమపత్రికగా భావించుచున్నారు. ఇంకఁ గొందఱు వివేకవర్ధనియే తొలి పత్రిక యని యూహించుచున్నారు. మొత్తముమీఁద వివేకవర్ధని పత్రికాధిపతియే మార్గదర్శి యని యాంధ్రపత్రికాసంపాదకులు కూడ 1910 లోఁ దమ సంవత్సరాదిసంచికలో వ్రాసిరి. ఇట్టి వ్రాతలం గని పూర్వపు సంగతుల నన్నింటిని మఱచిపోయి వివేకవర్ధనీపత్రికాధిపతిగారును తాము సంస్కరణ మారంభించుటకుఁ బూర్వ మున్న యాంధ్రపత్రికలం గూర్చి తమ కడపటి విజ్ఞాపనములో నిట్లు వ్రాసికొనిరి:—

"అప్పు డాంధ్రవార్తాపత్రిక లంతగా లేకయు ఉండిన నొకటి రెండును చదువువారు లేకయు దివానశుత్రములవలె తేజరిల్లుచుండెను."

ఈ రీతిగా ననేకులు పలుసారులు పురాతనాంధ్రవార్తాపత్రికలం గూర్చి వ్రాయుచు వివేకవర్ధనిని మొదటికి లాగఁ బ్రయత్నించుచువచ్చిరి. తదభిమానము కలవా రెట్లు వ్రాసికొనినను వ్రాసికొనవచ్చును గాని యది సత్యము మాత్రము కాదు. సత్యరతుల యుపయోగార్థమై నేను పురాతనాంధ్రవార్తాపత్రికల చరిత్రము నిందు నాకుఁ దెలిసినంతవఱకు వ్రాయుచున్నాను. తెలిసియో తెలియకయో మనవారు కొందఱు వివేకవర్ధనిని మార్గదర్శక మగు పత్రికగాఁ బెట్టుకొనిరి. కావున దాని పూర్వపు పత్రికలను దాని సమకాలపు పత్రికలను నా యెఱింగినంతవఱకుఁ బ్రచురించుచున్నాను. ఇం దేమైనఁ బ్రమాదము లుండిన విజ్ఞులు సవరింతురు గాక!

మన దేశమున నాంధ్రవార్తాపత్రికల ప్రచారము వివేకవర్ధనీపత్రికాధిపతి జన్మించుట కొకింత పూర్వమునుండియుఁ గల దని తలంపవచ్చును. ముద్రాక్షరశాలలు లేకుండిన వార్తాపత్రికల ప్రచారమే యుండ నేరదు కదా. ముద్రాక్షరశాలలు ద్రవిడదేశమున ముందుగా స్థాపింపఁబడినట్లును తరువాత మన యాంధ్రదేశమున 1806 లోనే స్థాపింపఁబడినను 1830 వఱకును మంచి స్థితిలోనికి రానట్లును 1835 మొద లభివృద్ధి నందినట్లును దెలియవచ్చుచున్నది. మన దేశమునందలి మొదటి యచ్చుకూటములం ర్చియు మొదటి యాంధ్రవార్తాపత్రికలం ర్చియు సి. పి. బ్రౌనుదొర గారు తమ నిఘంటువులో నిట్లు వ్రాసిరి:

"Printing has been used among the Tarmsil of more than a century. Among the Telugus it commenced about the year 1806 but made little progress until 1830. About 1835 some of the Telugu and Sanskrit poems were printed at Madras At present many volumes continually issue from Telugu presses managed by Hindus alone. There are at least eight such presses at work besides those which are under the management of Englishmen. Native newspapers both Telugu and Tamil exist : but are ill supported unless they deal in vituperation regayding points of religion or caste."

1852 లో నచ్చుపడిన బ్రౌణ్యనిఘంటువులోఁ బై వాక్యములు కాన్పించుచున్నవి. కాన నా సంవత్స

రమునాఁటికే యాంధ్ర దేశమున నాంధ్రులచే నడుపఁబడు నాంధ్ర వార్తాపత్త్రికలు కల వని రూఢిపడుచున్నది. 1806 లోనే తెలుఁగున నచ్చుకూటములు స్థాపింపఁబడి నను 1830 వఱకును నయ్యవి మంచి స్థితిలోనికి రాలే దన్నియు 1835 లో మంచి వ్యాప్తి కలిగె ననియు దొరవారు వ్రాసిరి. కావున 1830 నుండియో 1835 నుండియో మన యాంధ్రవార్తాపత్త్రికలు ప్రారంభ మై యుండును. వివేకవర్ధనీపత్త్రికాధిపతి 1848 లో జన్మించెనఁట. కాన నాతని జన్మమునకుఁ బూర్వమునుండి యుఁ దెలుఁగు వార్తాపత్త్రికలు కల వని నమ్ముట యుచితము కాకపోలేదు.

ఇఁక నా పత్త్రికల నామము లేమి యందు రేని వానిని సరిగాఁ దెలిసికొనుటకు నొక్కచో నున్న నా వంటివాని కంతగా నవకాశము లేదుగాని చెన్నపురివంటి రాజధానియం దున్నవారి కది సులభసాధ్య మగును. అయినను, నా శక్తి కొలఁది వాని నామములఁ గూడఁ దెలిపెదను. పురుషార్థప్రదాయినియొక్క జన్మమును వివేకవర్ధని పుట్టుకయును శ్రీమదాంధ్రభాషాసంజీవనిలోఁ బ్రకటింపఁబడియె. కాన సంజీవని వాని రెంటిటి కంటెను మొదటిది. సంజీవనికంటె ముందు పుట్టిన పత్త్రికలఁ గొన్నింటిని వివేకవర్ధనీపత్త్రికాధిపతియే యీ క్రింది సందర్భమునఁ బేర్కొనియుండె. సంజీవని మొదటి పత్త్రిక యని యొకప్పుడు శివశంకరపాండ్యాజీ గారు వ్రాసిరఁట. అందుల కీసు పూని యంతకుఁ బూర్వ మున్న పత్త్రికల పాతరను వివేకవర్ధనీపత్త్రికాధిపతి గారే త్రవ్విరి. వారి వాక్యముల నీ క్రింద నిచ్చుచున్నాను:—

"సంజీవని తలయెత్తుటకు ముం దెన్ని సంవత్సరముల క్రిందనో బళ్లారిలో "శ్రీయక్షిణి" యను పక్షపత్త్రిక తెలుఁగునఁ బ్రకటింపఁబడుచుండ లేదా? అద్దాని శైలి యెంత మనోహర మైనదిగా నుండెనో పెక్కండ్రెఱింగియుందురు. ఏమీ! నా మాటయం గినుక పూని పుట్టఁబోవు తమ పత్త్రికఁ జూచియే శ్రీయక్షిణీవిశేషకులు తమ శైలి ని ట్లలవరించుకొని రందు రేమో! అననీ ఆ మాట నా కేటికి? మఱియుఁ బంతులవారి పత్త్రిక తలచూపక ముందే చెన్నపురిలోఁ బ్రకటింపఁబడుచు వచ్చిన తత్త్వబోధిని యను తెనుఁగు పత్త్రిక యెంత చక్కఁగా వ్రాయఁబడుచువచ్చినది! దానిలో రుచిరఫణితిని వ్రాయఁబడిన యుపన్యాసములఁ జూచి పంతులవారు తమ శైలి నెంత బాగుచేసికొనియుందురు? ఇదియుఁ బంతులవారి పత్త్రికను జూచి వ్రాసినదే! ఒక కాలమునం దాంధ్రదేశమున మిక్కిలిగా వ్యాపించిన వర్తమానతరంగిణియు, చెన్నపురిలోనే ప్రచురింపఁబడుచు వచ్చిన సుజనరంజనియు, రాజమహేంద్రవరమునఁ బ్రసిద్ధిపడుచు వచ్చిన గోదావరీవిద్యాప్రబోధినియు పాండ్యా గారి యభిప్రాయానుసారముగా సంజీవనికిం దరువాతఁ బుట్టినవే కాఁబోలు."

దీనిం బట్టి చూడ నీ క్రింది పత్త్రికలు సంజీవని కంటెను బురాతనము లని తెలియవచ్చుచున్నది:

| పత్త్రిక పేరు | ప్రచురింపఁబడుతావు |
|---|---|
| 1. శ్రీయక్షిణి | బళ్లారి |
| 2. తత్త్వబోధిని | చెన్నపురి |
| 3. వర్తమానతరంగిణి | చెన్నపురి |
| 4. సుజనరంజని | చెన్నపురి |
| 5. గోదావరీవిద్యాప్రబోధిని | రాజమహేంద్రవరము |

ఈ యైదు పత్త్రికలును చాల పురాతన మైనవి. వీనికంటెను బూర్వపత్త్రిక లేవో తెలియవచ్చినది కాదు.

యక్షిణి శైలి "మనోహర" మైన దనియు తత్త్వబోధిని "రుచిరఫణితి" నున్న దనియు వివేకవర్ధనీపత్త్రికాధిపతి గారే పైవ్రాఁతలో నంగీకరించిరి.

వీనియందు లోకోపకారకము లగు విషయము లనేకములు చర్చింపఁబడుచువచ్చినవి. మొదటి పత్త్రికలు నీతిజాతిమతాచారములం గూర్చి ముచ్చటించినం గాని వ్యాప్తి లేకుండెడి దని బ్రౌనుదొరగారు వ్రాసిరి. క్రైస్తవపత్త్రికల వ్యాప్తి లేకపోవుటచేతఁ గాఁబోలు వీ రిట్లు వ్రాసిరి. హిందువులు మతప్రధానులు కాన నీతి జాతిమతాచారములం గూర్చి ముచ్చటించు పత్త్రికల నాదరముతోఁ జూచెడివా రనుట సమంజసముగానే యున్నది. గాని పూర్వపత్త్రికలు సంఘసంస్కారాదివిషయములఁ గూడఁ జర్చించుచువచ్చినవి. ఇంతయేల వితంతూద్వాహవిషయమునఁ గూడ వివేకవర్ధనీపత్త్రికాధిపతి గారి కీ పత్త్రికలు చాల సాయ మొనరించినవి. ఈ విషయమై వారే యిట్లు వ్రాసికొనిరి:—

"అప్పుడు నాకు స్త్రీపునర్వివాహవిషయమై యేయేమి గ్రంథము లున్నవో తెలియదు. ......ఈ విషయమై తత్త్వబోధినిలోఁ బ్రకటింపఁబడిన యుపన్యాస మొకటియు, పురుషార్థప్రదాయినిలోఁ

ప్రకటింపఁబడిన యుపన్యాస మొకటియు నాకు లభ్యము లయినవి. ఈ గ్రంథసాహాయ్యముతో నా బుద్ధికిఁ దోఁచిన యుక్తులను శాస్త్ర ప్రమాణములను గూర్చి యుపన్యాసము నిమిత్త మేర్పఱుపఁబడిన దినమునాఁటికి నా శక్తి కొలఁది నొక యుపన్యాసము వ్రాసి 1879 సంవత్సరము ఆగస్టు నెల 9 తేదీని మొట్టమొదటఁ జదివితిని."

యక్షిణి శైలి పెక్కం డ్రెఱుఁగుదు రనుటచే నయ్యది మంచి వ్యాప్తి కలది యని తేలుచున్నది. వర్తమానతరంగిణి యాంధ్ర దేశమున మిక్కిలిగా వ్యాపించిన దని వివేకవర్ధనీపత్త్రికాధిపతి గారే యంగీకరించిరి.

ఇఁక సంజీవనిం బట్టి చూడ సంజీవనికిని వివేకవర్ధనికిని నడుమ పది పత్త్రిక లున్నట్లు తెలియవచ్చుచున్నది. చదువరుల యుపయోగార్థమై సంజీవనికిఁ బూర్వపువానివి గలిపి యీ క్రింద నిచ్చుచున్నాను:

1. శ్రీయక్షిణి
2. తత్త్వబోధిని
3. వర్తమానతరంగిణి
4. సుజనరంజని
5. గోదావరీవిద్యాప్రబోధిని
6. ఆంధ్రభాషాసంజీవని
7. పురుషార్థప్రదాయిని
8. దినవర్తమాని
9. వ్యవహారతరంగిణి
10. హితవాది
11. సుధీరంజని
12. స్వధర్మప్రకాశిని
13. సకలవిద్యాప్రబోధిని
14. బ్రహ్మాండరంజని
15. విద్వన్మనోహారిణి
16. లోకరంజని

ఈ పదునాఱు పత్త్రికలును గూడ వివేకవర్ధనికి పూర్వమునందుఁ బుట్టినవే. ఈ పత్త్రిక లన్నియు బహు విషయములఁ జక్కఁగా మృదుమధుర శైలిలోఁ జర్చించి యాంధ్ర దేశమునకు మహోపకార మొనరించినవి. వీనిం జదివి చదివి వివేకవర్ధనీపత్త్రికాధిపతి శైలిని కుదుర్చుకొనుటయే కాక బహువిషయపరిజ్ఞానమును గూడ సంపాదించుకొనిరి. విశాఖపట్టణమునఁ బ్రచురింపఁబడుచు వచ్చిన సకలవిద్యాప్రబోధిని ప్రకృతిశాస్త్ర విషయాదికముల ననేకములఁ బ్రకటింపఁ జొచ్చినది. సంస్కృతనాటకాదుల నాంధ్రీకరింపఁ బ్రారంభించిన పత్త్రికయు నిదియే. పారిభాషికపదాదుల గ్రహించుటలో నాంధ్రభాషాసంజీవని సాయమును బొందితి మని వివేకవర్ధనీపత్త్రికాధిపతిగారే వ్రాసియుండిరి. లోకరంజని చేసిన ప్రతిజ్ఞ నీ క్రింద నిచ్చుచున్నాను. దానిం బట్టి వివేకవర్ధనికిఁ బూర్వమునం దుండు పత్త్రిక లెట్లుండెడివో చదువరులు గ్రహించుకొనవచ్చును.

లోకరంజని — "ఈ పత్త్రికయందు రాజనీతిశము, భూగోళ శాస్త్రములు, ఆంధ్రకవుల చరిత్రములు, నవరసపోషకము లగు కథలు మఱియుఁ బుణ్యకథలు, దోహదక్రమము, క్రమశిక్షాపద్ధతి, పరీక్షకుఁ గావలసిన టిప్పణములు ......... ముద్రింపఁబడును."

ఇంత యేల పూర్వపు పత్రికలు చర్చింపక విడిచిన సాంఘిక రాజకీయనీతిమతాచారవిషయములు లేవు. అప్పటి పత్త్రికలు చదువువారు లేక దివానక్షత్రముల వలె నుండెడి వను మాట కల్ల. విశేషవ్యాప్తి కలిగి యుండెడి వని వివేకవర్ధనీపత్త్రికాధిపతియే యంగీకరించి యుండెఁ గదా!

ఇఁక వివేకవర్ధనికి సమకాలమునఁ బ్రచురింపఁబడుచు లోకోపకార మొనరించిన పత్త్రికారాజముల నా యెఱింగినంతవఱకు నీ క్రింద నిచ్చుచున్నాను:

1. వివేకవర్ధని
2. జనవినోదిని
3. స్వదేశిని
4. మందారమంజరి
5. ప్రబంధకల్పవల్లి
6. ఆంధ్రప్రకాశిక
7. రాజయోగి
8. చింతామణి
9. అముద్రితగ్రంథచింతామణి
10. కళానిధి
11. హిందూజనసంస్కారిణి
12. హాస్యవర్ధని
13. హాస్యసంజీవని
14. సతీహితబోధిని
15. సత్యసంవర్ధని
16. చింతామణి
17. ధీరంజని
18. ప్రబంధకల్పవల్లరి
19. కల్పలత

ఇట్టి పత్త్రికారాజము లనేకములు కలవు. సత్యమగు దేశాభిమానము కలవారెల్లరును వీనిం బ్రచురించినవారియెడలఁ గృతజ్ఞులై యుండవలెను. దైవకృపచే పత్రికాప్రచారము మన యాంధ్రదేశమున సర్వవిధములఁ దృప్తికర మగు స్థితికి వచ్చుంగాక. ఇతరదేశములీ విషయములోఁ జాల ముందుకు వచ్చియున్నవి. మన దేశమునందే వార్తాపత్త్రికాప్రచార మింకను దృప్తికర మగు నభివృద్ధి నందియుండలేదు. పరమేశ్వరుఁడు పూర్ణాభివృద్ధిఁ గలిగించుఁగాక!

Andhra Students of the Calcutta University Regiment :
C. Hanumantha Rao Garu. M. Bapineedu Garu. K. Ramayya Garu



కలకత్తా విశ్వవిద్యాలయ పటాలము ఆంధ్రవిద్యార్థులు

M. Kesava Rao Garu, S. Pranavamoorthi Garu
Interned Andhras, Rangoon



ఎం. కేశవరావు గారు, ఎస్. ప్రణవమూర్తి గారు, నిర్బంధ ప్రవాసులు



Ch. Pattabhiramayya Chowd ari Garu

చెలికాని పట్టాభిరామయ్యచౌదరి గారు

Mr. A. Seerboji Row, Journalists



ఏ. ఎస్. రావు గారు

Grandhalaya Sabha, Anantapur



అనంతపురము గ్రంథాలయసభ



P. Subba Rao Garu

పి. సుబ్బారావు గారు

Kamma Students Maha Sabha, Guntur



కమ్మవిద్యార్థిమహాసభ, గుంటూరు

# భావముల ప్రభావము

పారనంది జగన్నాథస్వామి గారు బి. ఏ., ఎల్. టీ.

భావములకును భావలింగములకును గల సంబంధము అన్యోన్యానుక్రమమే కాక కార్యకారణత్వ మని కూడ శాస్త్రజ్ఞులు చెప్పుచుందురు. భావజనకవస్తువు శారీరకవికారములను మొదట నుద్రేకించును; ఆవికారములు నాడీనిర్మాణములపై ప్రభవించి భావములను ప్రేరేచును. ఆభావములు తిరిగి శరీరముపై ప్రభవించి శరీరవికారములను పుట్టించును. ఇవి తిరిగి ఆభావోద్రేకమునకు కారణము లగుచుండును. ఇట్టి వలయాకార ప్రవాహసంబంధము, భావములకును తత్సంబంధి శారీరక వికారములకును గల దని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఎట్లన-ఒక పులినో యొక పామునో చూడఁగ నాచూపువలన కొన్ని యాంతరవికారము లుద్భవించును. పారిపోవుట యనెడు శరీరవ్యాపారము ప్రవర్తించును. ఆ వ్యాపారముతోడనే కలుగు నాడీనిర్మాణవికారములకు సరియైన మనోవృత్తియే భీతి యనెడుభావము. సంతోషమునకు ముఖోల్లాసము, భీతికి శరీరకంపము, ఖేదమునకు రోదనము మున్నగునవి మఱికొన్ని ఉదాహరణములు.

ఈ వృత్తాంతమువలన నొక సంగతిని గమనింపఁ గలము. ఈ భావశరీర వ్యాపారముల ప్రవాహములో మొదటిపాతమునే నిరోధించినచో, భావోద్రేకమునే నిరోధింప సాధ్య మగును. పులిని జూడగాఁ గలిగిన పారిపోవుట యనెడు శరీరవ్యాపారమును నిరోధించినచో భీతి యనెడు భావము నిరుద్ధ మగును. ఆలాగుననే విలపించుటను ఆపగలిగినవానిలో ఖేదము మాసిపోవును. కోపమును అరికట్టుటకు ముఖ్యసాధనము శరీరవికారములను నిరోధించుటయే! ఇట్టి సంబంధమును నిశ్చయించినపుడు ఈక్రింది వాక్యములు విపరీతములుగ తోఁచకూడదు. రోదనము చేయుచుండుటచేతనే ఖేదించుటయు పరుగెత్తుటచేతనే భీతిల్లుటయు ఉల్లాసముగ నుండుటచేతనేసంతోషించుటయు సంభవించుచుండును. ఈసంబంధములు పామరాభిప్రాయమున కెంత విపరీతములుగ తోఁచినను, శాస్త్రవేత్తలచే నంగీకరింపబడినవే. సాధారణముగ నైనను ఇందలి తథ్యము అనుభవమునకు వచ్చుచుండును. ఈసంబంధమును శాస్త్రచర్చలకే కాక సాధారణ ప్రవృత్తికిఁ గూడ నుపయోగించినచో గొప్పలాభము లబ్బు నని తోఁచుచున్నది. అట్టి లాభములలోఁ గొన్నిఁటిని సంక్షేపముగఁ జర్చించెదను.

మన వ్యాపారములలో, ననేకములు—అన్నియు అని చెప్పినను తప్పు కాదు—భావప్రేరితములైనవే! ఆ వ్యాపారముల ఫలములు మంచివి యగునప్పటికంటె చెడ్డవియగునపుడే ఆవ్యాపారములను గురించి తీవ్రముగ నాలోచించుట తటస్థించుచుండును. అట్టి యాలోచన సాధారణముగ పశ్చాత్తాపరూపమున మనుజుని వ్యాపారముల నన్నిఁటిని వ్యపదేశించును. "అయ్యో! ఆలాగున జరిగినది కదా! ఆలాగున చేసితిని కదా! కొంచెమైనను ధైర్యమును చూపలేకుంటిని గదా! కొంచమైనను ఆగ్రహమును పట్టలేకపోతిని! ఆయొక్క-మాట నాడకపోయినచో ఇగ యంతయు జరిగి యుండదు కదా!" అని మనుజుఁడు పరితపించుటయును తనను తాను పరీక్షించుకొనుటయును జరుగుచుండును. ఇట్టి పరితాపము స్వపరీక్ష, మనుజుని ఇంకను క్రుఁగదీసి దాని ప్రభావమున్నంతవఱకైనను సతనిని తేజోహీనునిగ జేయును. ఈవ్యథను, ఈనష్టమును, తొలగించుటకు తగిన సాధనమును మీఁద చర్చించిన సంబంధసూత్రము వలన కనుగొనఁగలము. ఈ భావోద్రేకము లన్నిఁటిలోను భావోత్తేజకకారణ మనఁదగు మొదటి శరీరవ్యాపారమును నిరోధించుట యట్టి సాధన మగును.

భావ ముదయించిన తరువాత భావనిరోధముఁ జేయుట కంటె, భావోద్రేకసమయమందు జేయు వ్యాపారమును నిరోధించుట సంభావ్యము. మనోవృత్తి యైన భావమును అణచుటకంటె బాహ్యమైన శరీరవ్యాపారమును అణచుట సులభము. ఒకక్షణమందు గలుగు పిరికితనపు టుత్తేజనమును అణచినయెడల గాని, ఒకక్షణమందు పుట్టెడి ఆగ్రహజనకమైన కొట్టుటయనెడు శరీరవ్యాపారమును ఆపగలిగిన యెడల గాని, ఒకక్షణమందు పెదవుల చివఱకు వచ్చిన మాటను చేరనీయక మ్రింగివేసినయెడల గాని, అనేకసహస్రక్షణములు పరితపించుట తప్పిపోవును. మనభావము లుద్రేకించి, మన సర్వవ్యాపారములను ముంచివేయుట తప్పిపోవును. మనస్థైర్యము కలిగి ఉత్కృష్టమనోవృత్తుల వ్యాపారమునకు సహాయము కలుగును.

భావవ్యాపారముల సంబంధసూత్రజ్ఞానమువలన దుష్టభావముల నిరోధనమునకే కాక సద్భావముల సంపాదనకుఁ గూడ సాధనములను తెలిసికొనవచ్చును. స్వాభావికమైన యుల్లాసము మనలను వీడనాడినపుడు ఉల్లాసమును సృజించుకొన నుద్దేశించుకొని ఉల్లాస మున్నటులఁ గూర్చొని మాటలలోను పనులలోను ఉల్లాస మున్నటుల నటించినచో తిరిగి ఉల్లాసవంతు లగుట సిద్ధించును. ఆలాగుననే ధైర్యావలంబనకు ధైర్యనటనమే సాధన మగును. శత్రువు లని భావించుచుండినవారియెడల దయ జూపుట సాధ్యము. చిరునవ్వు నవ్వుచు, యోగక్షేమములను కనుగొనుచు మంచి మాటలను జెప్ప నారంభించినచో శత్రుభావము పోయి మిత్రభావ మంకురించును. నిష్కపట మైన యొక నవ్వే యెట్టి శత్రువుల నైనను కలపగలదు; కాని వారు దీర్ఘముగ వారి శత్రుభావమును గురించి తర్కించిన కొలదిని అది స్థిరపడుచుండును. ఏభావమును మాప నుద్దేశించి విచారింతుమో, అది యావిచారణ దోహదమునఁ బెరుగుచుండును. దానికి బదులుగ నొక్కమారు మంచిపనిని చేసినయెడల పూర్వముండిన చెడుభావము చల్లగ నంతరించి పోవును.

అందుచేతనే వ్యాపారమునకు గల ప్రాముఖ్యము "తినని కుడువనిది బాంధవ మెక్కడ?" అనెడు లోకోక్తికి నిట్టి దానిని సార్థకముగ జెప్పనోపును. ఇట్టి వ్యాపారముల నుండి లేక వ్యాపారముల విన్యాసముల నుండి యుద్భవించు అంతర్మనోవృత్తితరంగములు మన భావప్రపంచస్థితికి హేతువు లగుచుండుటచేతనే బాహ్యవ్యాపారముల ముఖ్యతను గమనింపవలసియున్నది.

బాహ్యచేష్టలలోఁ గలుగు మార్పులు ఆంతరవృత్తులపై బ్రభవించి నూతన మనఃప్రపంచసృష్టికి కర్త లగుచుండు ననునది మనము గ్రహింపవలసిన మూఁడవ సంగతి. శరీరవ్యాపారములు శరీరారోగ్యమునకే ఆవశ్యకము లని భావింపగూడదు. శరీరారోగ్యమును శాస్త్రములుసంపాదించు సాధనముల సాహాయ్యమున సంపాదింపగలము. దంతములు చేయవలసిన భక్షణాది వ్యాపారమునకు బదులుగా పెప్సిన్ మొదలైన కొన్ని కరణముల ప్రభావమున ఆహారమును బాహ్యముననే సగము జీర్ణింపఁజేసి అన్నకోశములలోనికి పంపవచ్చును. దంతములదార్ఢ్యము శరీరస్థితి కంతచేత నావశ్యకము కాదుగదా! ఆలాగుననే శాస్త్రములు కనిపెట్టిన యంత్రములు శరీరాంగముల దార్ఢ్యముయొక్క విలువను తగ్గించుచున్న వని చెప్పవచ్చును. ఒక్క యుదాహరణము:—స్వరక్షణకై పూర్వ ముపయోగించవలసిన శారీరబలము తుపాకులు వచ్చినతరువాత నిరర్థక మాయెను గదా! ఇట్టి వెన్నియో వివరింప సాధ్యములు. శరీర సంపదకొఱకెంత యవసరమో అంతకు పదిరెట్లుగ మానసికారోగ్యమునకు శరీరవ్యాపారములు ఆవశ్యకములు ముఖ్యముగ భావములపై వ్యాపారములకు గల భావమును మరువకూడదు. చేష్టల ప్రారంభకాలమున వాటి ఫలితములను సూటిగ లెక్కింప లేక పోవచ్చును. అందులో నూతనచేష్టల యారంభకాలమందు వాటి ప్రభావము లెటు లుండునో ఇదమిత్థ మని చెప్పలేకున్నను చేష్టల మంచిచెడ్డలను బట్టి వాటి ఫలితములను చాలవఱకు నూహింప సాధ్యము. శరీరారోగ్యమునకుపయుక్తము లగు చేష్టలు కార్యక్షమతాసామర్థ్య

ముల జ్ఞానమును సృజించు నని చెప్పుటలో పొరపా టుండదు. ఇందు కుదాహరణములు మెండుగనే కనఁబడును. నార్వేస్త్రీ లెట్లు శరీరచేష్టల ప్రభావమున మారినారో తెలుసుకొనవచ్చును. సుమారు ఇరువది సంవత్సరములకు పూర్వము ఈ నార్వేదేశపు స్త్రీలు స్త్రీసామాన్యమును బోలి 'గృహలక్ష్మికుటుంబమునకు వన్నెఁ దెచ్చునది. చల్లనిభావములకు నిలయము' అని వర్ణితలై యుండిరి. కాని యిటీవల వారి కబ్బిన స్కి- యనెడు ఆటలవలన ఈవంటఇంటికుందేళ్లు చాకచక్యముగల నారీమణులుగ మారినారు. స్త్రీసంప్రదాయ మనఁదగు అబలతాదిగుణముల పీడనాడి దేశ సంఘసంబంధ సంస్కరణములలో జోక్యముఁ గలుగఁజేసికొనుచు మానువ సాధారణ ధర్మములను జూప నారంభించినారు. అలాగుననే అమెరికాదేశపు స్త్రీలకబ్బుచున్న బైసికిల్ త్రొక్కుట, బండియాట మున్నగు శరీరచేష్టలు, వారి మనఃప్రపంచముం దొక నూతన కల్పనను నిర్మించి వారిని దేశసేవాతత్పరులుగ మార్చుచున్నవి. శరీరచేష్టలకు మనఃప్రపంచముపైఁ గల యీ ప్రభావమును దేశోద్ధారకులు మరువకూడదు. పాఠశాలలో గఱపబడు విద్యావిధానములో నిర్మితము లగు మార్పుల గురించియే కాక, పాఠశాలలను విడచియున్న అనేకవేల యువకుల యౌన్నత్యమునకు సహకారములగు శరీరచేష్టల నిర్మితిఁ గురించికూడ దేశోద్ధారకులు ఆలోచింపవలయును. వ్యాయామ క్రీడలవలన శరీర సంపద సమకూరు ననియే సంతుష్టిఁ జెందెడు సంకుచితదృష్టి నటుంచి, వాటిఫలములు మనస్సుపైని, నీతి ప్రవర్తనముపైని సద్భావసృష్టిపైని గల వని విశాల దృక్పథమున జూడ సాధ్య మగుచున్నది. అప్పుడు ప్రతి పట్టణ మందును ఒక నగరవ్యాయామస్థలము ఆవశ్యకము. ఇట్టి యేర్పాటులు పురుషుల కొఱకే కాక స్త్రీలకొఱకును ముఖ్యముగ నావశ్యకములు. స్త్రీలు ముందుకు వచ్చి పురుషులతోఁ బోరాడి తమ కావశ్యకములైన యేర్పాటులను గల్పించుకొన లేనప్పుడు దేశాభ్యుదయమును కోరువా రందఱు సమకట్టి వెనుక నుండు స్త్రీబృందమును అన్ని విషయములలోను ముందుకు దేఁ బ్రయత్నింపవలసినదే కదా! నూతన మనఃప్రపంచమును గల్పింప సాధ్యము కా కున్నను సాక్షాత్తుగఁ బ్రవేశ పెట్టఁగలుగు శరీరచేష్టలద్వారా ఆకార్యమును సాధింప వీ లగును.

ఇంక నొక సంగతిని ఈభావ వ్యాపారసంబంధము వలన మనము నేర్వఁగలము. చాలమంది భావములను వారి ముఖములలో నెల్లప్పుడును వ్యక్తపరచుచుందురు వారు అల్పవిషయములను కూడ పెద్దవిగ భావించుచుందురు. నిలువలోనుంచవలసిన సైనికులను గూడరణ భూమియందలి సైనికునివలె ప్రవర్తింపఁ జేతురు. వీరికంటె బుద్ధిమంతులు వారి నాడీశక్తిని నిలువలో నుంచి, తమ ముఖములో చురుకుదనము లేమిని కనఁబరచుచుందురు. తమ భావశక్తిని గర్భీకృతముగ నణచి వేయుదురు. సాధారణముగ నందఱము శ్లాఘించు చురుకుదనము ఉత్కర్ష, త్వర, ఉత్సాహము మున్నగు గుణములు సంతాపకస్వభావమును చిత్తోద్వేగమును తెలియబరచును. అట్టి ముఖవిలాసముల ఇంద్రియానుభవములు మెదడుపై ప్రభవించి ఎల్లప్పుడును, బిగిసి యుండు ఉద్వేగచిత్తవృత్తిని సిద్ధపరచుచుండును. కుర్చీలో కూర్చున్నది మొదలు లేచిపోవ సిద్ధముగ నున్న వానిరీతిని కాళ్లను చేతులను ఉంచినచో, నిమేషమునకు పదునెనిమిదిసారులకంటె నధికముగ శ్వాసవిడుచుచుండినచో, మనస్సు చీదర నొందక నిశ్చలముగ నె ట్లుండగలదు? కనుబొమ్మలు చీదరించుకొనక శ్వాస తుళుక్కు-పడకుండ మాంసకండలు బిగిసి యుండక ప్రవర్తించు వానికి మనోవికలత యెట్లు రాఁగలదు? ఒకస్థితి బలహైన్య మనియు మఱియొకటి బల మనియు రుజువు చేయవలెనా? అందుచేతనే చీదరించుకొనకయు, తొందరపడకయు నుండువాఁడు యెక్కువ పనిని చేయఁగలడు; వాఁడు చేయు పనిని వాఁడు తిరిగి విమర్శించుకొన నవసర ముండదు. క్షోభపడి పని చేసిన త్వరలో విచ్ఛిన్నుఁడగును. వాని కప్పుడప్పుడు ఉద్విగ్నావస్థలు సంభవించును. పనిచేసివిచ్ఛిన్నులైవిశ్రాంతికొఱకు దుఃఖించు

వారి ఖేదమునకు గారణము పనియొక్క తప్పు గాదు. ఊపిరిదీయుట కైనను వేళ చాల దని తొందరపడు చుండు స్వభావము, ఆతురతతోఁ గూడుకొనిన స్థితి, చేయఁబోవు కార్యముల ఫలము లెవ్వి యగునో యనెడు ఔత్సుక్యము, అంతరస్థైర్యము లేమి, అందుకు గారణములు. ఉద్వేగ, క్షోభ, దీర్ఘాలోచనాదు లగు మనోదశలు నిశ్చితకార్యసిద్ధికి భంగకరములు. అందు చేత శాంతమును తమ ఆదర్శముగ నుంచుకొని సంచరించుచుండు వారికి మనశ్శాంతి యుండును. వారి మనోవ్యాపారములు పుష్కలముగను అమోఘములుగను, ఉండవలె నన్న నాటినిగురించి విచారించు అలవాటును తొలగించుకొనవలయును. ఒక యభిప్రాయము ఒకకార్యము నిశ్చితము కాఁగానే, దానిని గురించి పునరాలోచనమును దాని లాభాలాభములను గురించి విమర్శనము నుండరాదు. మనోవృత్తుల ప్రభావము నిరాటంకముగ ప్రవహింపనీయవలెను. ఎవరు విశేషముగ నాలోచింతురో వారే యెక్కువగ తొట్రుపడుదురు. జరుగఁబోవు పోటీపరీక్షలో తా నెట్లు ప్రవర్తించెదనో యని యధికముగ నాలోచించువాఁడు తప్పక ప్రదర్శనమును చెడగొట్టును; దానికొఱకై యాలోచించక తటస్థునివలె నుండిన వానికి గెలుపు సాధ్య మగును. రాబోవు పరీక్షాదినమును గురించి ఆతురత నెక్కువగఁ జూపు విద్యార్థియొక్క బుద్ధి, పరీక్షా కాలమునకు ముకుళించుకొని పోయి విషయములను జ్ఞప్తికి తేలేకపోవును. ఇట్టివి యందఱకు ననుభవవేద్యములే! అతిజాగ్రత్త అతిశ్రద్ధ భావసమ్మేళనములను తీవ్రపఱచి మనోబుద్ధులను అరికట్టి సరలముగఁ బ్రవహింపనీయవు. కార్యసిద్ధికి ప్రయత్న మెంత యావశ్యకమో, మనోనిశ్చలత యంతకంటెఁ బదిరెట్లు ఆవశ్యకము. ఈ మనోనిశ్చలత నైజముగ లేనివారు తమవశమందున్న శరీరచేష్టలను నియమించి శాసించియైనను పొంద సాధ్య మగును.

శరీరచేష్టలకును, భావములకును గల సంబంధమును చర్చించు మనశ్శాస్త్రసూత్రమును లెస్సగ గ్రహించినచో నింక ననేకవిషయములను అనుభవమునకు ఉపయుక్త మగు తీరున నేర్వఁగలము.

# మాతృసంబోధనము

కవికొండల వేంకటరావు గారు

పంటలో నే ముంది మాయమ్మ కాన!
రతనాలరాసులు రారా కుమార!
సంద్రాన నే ముంది మాతల్లి కాన!
ముత్యాల మల్లెలు ముద్దుల సుతుఁడ!
నదులలో నే ముంది మాయమ్మ కాన!
మధురాంబులహారి రా నా కన్నసుతుఁడ!
నీసుతు నెమ్మది, నెయ్యది కలదు?
నూత్నవికాసంబు నాతండ్రి కాన!
అన్నలారా! రండు అమ్మ చెప్పెనుగ
రతనాలరాశికై గసి త్రవ్వవలెను

గడ్డపారలతోఁడ గడు వడి రండు
ముత్తియాల ముల్లెకై మునుగంగవలెను
వలల తట్టలతోడ వడివడి రండు
మంచినీళ్లను మోయ మగువలు వలయు.
మీతోడివారల వేఁ గొని రండు
నూత్నవికాస ప్రయత్నంబు లెల్ల
సఫలంబు లౌ నట్లు సాధింపవలయు.
మన మందఱం బైకమత్యంబు గలిగి
మాతకు మనికి సమర్పణ మిడుచు
పాటున కోరిచి ఫలము లందుదము.

# గుంటుపల్లి గోపాలకృష్ణ కవి

కొణిదెన బాలకృష్ణయ్య గారు

గోపాలకృష్ణకవి వర్తమానశతాబ్దపు ప్రబంధకవులలో నొకఁడు. ఈయన నందవరీకబ్రాహ్మణుఁడు. ఇంటిపేరు గుంటుపల్లివారు. నివాసస్థలము గుంటూరు మండలమునందలి నర్సారావుపేట తాలూకాలోని చెన్నుపల్లిగ్రామము. వసిష్ఠగోత్రము. తండ్రి కోటిలింగము. తల్లి అనంతలక్ష్మమ్మ. సోమమంత్రికిని వేంకమాంబకును పౌత్రుఁడు. సుప్రసిద్ధుఁడును, విద్యలభాస్కరుని తండ్రియు, నగు గుంటుపల్లి ముత్తనామాత్యుని వంశమునకుఁ జేరినవాఁడు. ఈముత్తనామాత్యుని శౌర్యాదుల నీ క్రిందిపద్యములు తెలుపుచున్నవి.

క. నాలుగు దుర్గంబులు పటుసా
లుగు దేశముల ప్రజల నయమార్గమునన్
లాలింపుచుఁ జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాత్రుండే!

సీ. దుమ్ము ధూళిగఁ జేసి తూర్పారఁ బట్టఁడే
కోపాగ్నిచే బొమ్మలాపురంబు
నగ్గునూచంబుగా నఱ్ఱిడిఁ జేయఁడే
ఘాటి మీరఁగ నెల్లపాటికోట
ఖండతుండములుగాఁ జెండి చెక్కాడఁడే
దండిబోయలపేట చుండికోట
కుటిలవైరులద్రుంచి కొల్లఁ బెట్టించఁడే
శ్రీలు మీరఁగఁ దోరణాలకోట

గీ. పాదుపాదత్త భువనరాజ్య పదవిరూఢిఁ
జెంది శ్రీగుంటుపల్లికులశేఖరుం డ
టంచు నిర్వైరిమంత్రులిట్లండ్రు భువిని
మంత్రికులహేళి ముత్తనామాత్యమౌళి.

మఱియు నీముత్తనామాత్యుని వంశజులు,

"ఉ. రాజితకీర్తిశాలి యగు రాయనిబాచ! భవద్యశంబు ది
క్పూజిత మౌను మించె సురభూధరభూధరభూధరేంద్రకాం
తాజనుగోత్రసుగ్విధురధాంగరధాంగరధాంగశేషభా
షాజలజాహితాఽహితతుషారతుషారతుషారధాములన్."

అని నుతింపఁబడిన రాయనమంత్రిభాస్కరుని వంశమువారికి సమీపబంధువులును, భాస్కరసముపార్జిత భూమ్యాది వసతులందు సంశముఁ గొన్నవారును నై యున్నారు. (కీ॥ శే॥ గుంటుపల్లి సోమయరచితం బగు భాస్కరచరిత్రము చూడుము.) అహోబలపతి కడపన్న యనంతరము వినికొండసీమయందు గోపాలకృష్ణకవి తప్ప ఉభయభాషాభూషణుఁ డగు పండితకవి యొక్కఁడును జనించియుండలేదు. ఈతఁడు దాదాపుగ నలువదేండ్లకాలము జీవించి క్రీ॥ శ॥ 1917 సంవత్సరప్రారంభమునఁ బరలోకమున కరిగెను. ఈకవి నిరతాన్నప్రదాత యని పేరెన్నికఁ గన్నవాఁడు. అసాధారణ లౌకికవ్యవహారదక్షుఁడు. సంస్కృతాంధ్రసాహితీ ధురంధరుఁడు.

రంగావఝ్ఝల రామకృష్ణయ్య కడ నితఁడు కావ్యపాఠ మొనర్చినట్లు తన బుధజనహృదయాహ్లాదమున నిట్లు వ్రాసియున్నాఁడు.

క. "శృంగారకావ్యపాఠం
బంగీకృతిఁ బరచినట్టి యనఘు మహాత్మున్
రంగావఝ్ఝలకులజుఁ బొ
సంగ శ్రీరామకృష్ణసభ్యు నుతింతున్."

గురుభక్తిపరాయణుండగు నీయన తనకుఁ దత్త్వోపదేశ మొసఁగిన గురుల నిట్లు పొగడియున్నాఁడు.

సీ. "ఏసామి తారకాహిత వర్ధనక్రియా
శక్తిలీలాశయవ్యక్తిఁ దనరె
ఏమేటి షణ్ముఖశ్రీమహిమాధార
పరశివాకృతి సమాదరతఁ బొనరె
ఏకృతి స్వకుమారతాకేళికాకృత
బ్రహ్మబద్ధప్రభావమున నెసఁగె
ఏగుణి నిజధర్మ యోగకదంబవి
దారితరిపుధరాధరతఁ బొసఁగె
నట్టి పిళుపాటి వంశదుగ్ధాంబురాశి
చంద్రుఁడై మజ్జనఃపుణ్య సఫల దివ్య
తత్త్వమిడి ముక్తిపథకారణత్వ గరిమ
బరఁగుచుండు సుబ్రహ్మణ్యగురునిఁ దలఁతు."

బుధజనహృదయాహ్లాదము.

క. "మాకున్ శిష్యుఁడ నజ్ఞుఁడ
వ్యాకరణాదుల నెఱుంగ వరకృపశతమున్
జేకొను సుమమాలికఁ గా
శ్రీకృతిజననిమతికాను శ్రీశివరామ." శివరామశతకము.

చ. "సిరియును బిడ్డలుం గలిగి శ్రేయము నొందుటె కాక, సత్యులం
దఱుఁ గొనియాడ న్యాయసభఁ దాను వకీలుగ నుండి సత్యమే
శరణ మటంచు నీతులను చాటుచు లోకుల బోధసేయు మ
ద్గురు (వీరి గురువు వెలగపూడి దక్షిణామూర్తి గారు) నిధనంబు
నేటివఱకు దైలుప స్వలనెన్గ శా! కటా!"

గోపాలకృష్ణకవికి శ్రీగిరిమల్లికార్జునుఁ డిష్టదైవము. ఈతఁడు సకల వేదాంతార్థ రహస్యము లెఱింగిన ప్రౌఢ. తన గ్రంథములలో శివరామశతకము, చమత్కారనిదానము తప్ప తక్కినవాటి నన్నిఁటిని భగవత్పరముగ నంకిత మిచ్చియున్నాఁడు. పూర్వకవులు కొందఱవలె నీయనయుఁ దనకు భగవత్సాన్నిధ్య మొందిన నట్లును తదనుజ్ఞచేఁ గావ్యరచనా క్రమంబునకు నుపక్రమించినట్లును జెప్పియున్నాఁడు. వీరింటఁ బురాతనమునుండి ప్రతితరమువారిచేతను పూజింపఁబడుచున్న "శ్రీమన్మరకతేశ్వర దివ్య జ్యోతిర్లింగము" కలదు. గోపాలకృష్ణకవి "మరకతలింగా" యను మకుటముతో నీ లింగమున కొక శతకము నంకిత మిచ్చి యున్నాఁడు.

గోపాలకృష్ణకవికి పూర్వకవుల కవిత్వముపై నభిమానము మెండు. ఈయన చతుర్విధ కవిత్వ రచనా విచక్షణుఁడు. తన గ్రంథములయం దందందు బంధ, గర్భ, కవిత్వము నుపయోగించి యున్నాఁడు. ఆధునికులలోఁ గూచిమంచి తిమ్మన - ఏనుఁగు లక్ష్మణకవి - వీరి కవిత్వముపై నీతనికిఁ బక్షపాత మతిశయము.

పూర్వకవికృతాంధ్ర కావ్యంబులఁ గొన్నిఁటిఁ బ్రకటించుటకును, నేఁటికిని భాషాంతరీకరింపఁబడ కున్న సంస్కృతమునందలి కొన్ని యుత్తమ గ్రంథములఁ దెలిగించుటకును, నీతఁడు సంకల్పించె. కాని యనిలంఘ్య మగు విధివిధాన మట్లు సాగనిచ్చినది కాదు.

ఈకవి రచించిన గ్రంథములు: (1) బుధజనహృదయాహ్లాదము. (ప్రబంధము). (2) చమత్కారనిదానము. (ఏకాశ్వాసము). (3) పార్వతీపరిణయము. (నాటకము) (4) వైశాఖమాహాత్మ్యము. (భాషాంతరీకరణము) (5) శివరామశతకము. (6) మరకతలింగశతకము. శైలిని పరిశీలించుటకు ఈతని గ్రంథములలోని కొన్ని పద్యముల నిచ్చుచున్నాను.

మ. కరిణీరాజము పద్మరేణుపటలీ గంధాఢ్య గండూష పు
ష్కర మాత్మాధిప దంతినాథునకు వేడ్కం బ్రావఁగా నిచ్చె, నం
తరథాంగంబు సమార్థ జగ్ధబిసఖండ శ్రీ స్వజాయ స్వమా
. దరత న్మన్ననఁ జేసె నప్పుడు మధూద్యత్త్రాపథం బెట్టిదో!

ఉ. "ఓసఖి! వింటె, వర్ష సమయోదిత నీరద దర్శనాసమో
ల్లాస విలాస లాలస కలాప నటత్పటు కేకిలోక కే
కాసమవాయమిశ్రమ్ముదు కాకలి కాకుల కోకిలారవ
శ్రీసుఖకృత్సుధామధుర శీతల గాననినాదమై ఖరుల్."

బుధజనహృదయాహ్లాదము

ఉ. "దీప్ర చతుశ్శిఖాగ్ర సమధిష్ఠిత వీరభటాగ్రగణ్య హ
స్తప్రకటాంగుళీనఖవిదారిత నందనకల్పసూనదా
మప్రియ ధారణాగతసమంచితయోషిదుపేత తత్పురీ
వప్రము, రాజహంసబహులవారగమాగమమై రహిం దగుక్"

చమత్కారనిదానము.

మ. "నముచి న్వృత్రు, బలు న్హరించి యవల న్నాసాకులక్ష్మాధరో
త్తమపక్షంబులఁ ద్రుంచి ధర్మనిరతిన్ త్రైలోక్యరక్షాసము
ద్యమదక్షుం డగు నాకు తారకునియుం దజ్ఞాతసూతిప్రసా
దమువిఘ్నుంబని యొంచెదో కొ! కనుమింతస్నా భుజాటోపముల్"

పార్వతీపరిణయము.

ఉ. "పోకయు మంచిగంధమును పొందుగ నారికెడంబు నెవ్వఁడే
వీఁక ద్వితీయమాసమున విప్రున కిచ్చిన, వాఁడు సప్తజ
న్మాకలితద్విజుండును ధనాఢ్యుఁడు నై శ్రుతిపారగుండు నై
యాకడ సప్తగోత్రముల నందఱతోఁ గనుఁ దా వికుంఠముక్"

వైశాఖమాహాత్మ్యము.

ఈకవివంశమువారు, దాతలు మాత్రమే గాక, కవులును కవిగణపోషకులును నై గణుతికెక్కి యున్నారు. వీరిపూర్వుఁడు కాటేపల్లి తిప్పమంత్రికి కొటికెలపూడి సోమనాథుని విష్ణుమిత్రోపాఖ్యాన మంకితము చేయఁబడినది. గుంటుపల్లి ముత్తమంత్రి సౌగంధికాపహరణ మను పద్యకావ్యమును కృతిగఁ గైకొనెను. గుంటుపల్లి ఎల్లప్ప నిగమార్థమననము, అద్వైతమకరందము నను గ్రంథములను, పెదరామన్న దాశార్హచరిత్రమును, గుంటుపల్లి సోమయ్య రాయన భాస్కరచరిత్రము ముత్తనామాత్యచరిత్రము విశ్వకర్మాన్వయప్రదీపికా విమర్శనము కథాసారము నను వాక్యగ్రంథములను, గోపాలకృష్ణకవి రెండవకుమారుఁడు శివానందము శశికళాసుదర్శనీయ మను గ్రంథమును రచించిరి.

# విగ్రహారాధన

రాయవరపు మహాలక్ష్మమ్మ గారు

విగ్రహ మనఁగా మనస్సుచేతఁ గల్పింపఁబడినది. మనస్సు అనగా పంచేంద్రియముల సముదాయము. పంచేంద్రియములకుఁ శబ్ద స్పర్శ రూప రస గంధములు విషయములు. శబ్దస్పర్శరూపరస గంధములు లేనిచో మనకు కనఁబడినట్టియు దూరమం దున్నట్టియు గోడనుగాని తలుపునుగాని ఆలోచింపలేము. బాహ్యప్రపంచమంతయు మనోవికారమే. అనఁగా మనస్సుచేతనే కల్పింపఁబడినది. విశేషించి కలలోని క్రొత్త ప్రపంచము మనస్సుచేతఁ గల్పింపఁబడుచున్నది. మృచ్ఛిలాతామ్రకాష్ఠనిర్మితము లైన విగ్రహములును, మనుజుని రూపముతో నున్నట్టియు సత్వగుణ ప్రధానమై తేజోరూపముతో నున్న విగ్రహములును, నిరాకార నిరంజన పదార్థము లైన విగ్రహములును, మనస్సుచేతఁ గల్పింపఁబడిన విగ్రములే గాని వేరు గావు. అనగా బాహ్య ప్రపంచమం దున్న విగ్రహములును, కన్నులు మూసికొని భావింపఁబడెడు తేజోవిగ్రహములును, నిరాకార నిరంజన విగ్రహమును మనస్సుచేతఁ గల్పింపబడినవే! మనస్సునుండి ఉద్భూతములైనట్టియు మనస్సుచేతఁ గల్పింపఁబడినట్టియు విగ్రహములను పూజించుటే విగ్రహారాధన మనఁబడును. మతశాస్త్ర సంబంధ మైన యీ స్వల్పవిషయమును మఱచినవారై కొందఱు "మేము విగ్రహారాధకులము కాము. మీరు విగ్రహారాధకులు" అని అనుచున్నారు. కన్నులను మూసికొని మనస్సుచేతఁ గల్పింపఁబడిన విగ్రహమును పూజించుచు విగ్రహారాధకులము కా మనుకొనుచున్నారు. అట్టివారు, బాహ్యవిగ్రములను పూజించువారిని స్వల్పులని భావించుచున్నారు. గాఢనిద్రలో మనస్సు లీన మైనప్పుడు మనః ప్రకల్పిత తేజోమయ విగ్రహారాధనఁ జేయు వారు నిరాకార నిరంజన వస్తువును ఆరాధించువారు ఏలాగున పూజఁ జేయఁగలరో చెప్పఁజాలము. కాఁబట్టి ఈ ప్రపంచములో నున్న అందఱును రమారమి విగ్రహారాధకులే! ఏమనస్సుచేత విగ్రహములు కల్పింపఁబడినవో ఆమనస్సును దాని మాతృకలోఁ జేర్చి అనఁగా, ఆత్మయందుఁ జేర్చి బాహ్యేంద్రియ ప్రపంచమును మఱచు వారు మాత్రము విగ్రహారాధకులు గారు. ఇట్టివారు మిగుల కొలది మందియే యుందురు. క్రైస్తవమతస్థులు, మహమ్మదీయులు, బ్రహ్మసమాజమతస్థులును విగ్రహారాధకులే. హిందువులును విగ్రహారాధకులే. విగ్రహారాధకులకు ఆత్మసంధానపరులకు ముక్తి ఏలాగున లభించుననఁగా— ఈ రెండు శాఖలవారు అహంకారమును విడువవలెను. అనఁగా, తమ దేహము మనస్సు ఆత్మ స్వామివే అని తలంపవలెను. ఇట్టి గొప్ప భావననే ప్రపత్తి యని వైష్ణవులును అపరోక్షానుభూతి యని అద్వైతులును అనుచున్నారు. ప్రపత్తి అనఁగా స్వప్రవృత్తినివృత్తి అని పిళ్లై లోకాచార్యులు వారు ముముక్షుప్పడి అనెడు వైష్ణవగ్రంథములో వ్రాసియున్నారు. ప్రపత్తిభావన భక్తికంటెను కర్మకంటెను గొప్పది. సదానందయోగిగారు ఇటుల వ్రాయుచున్నారు. "గీ॥ చేయు క్రియ లెల్ల శివుఁడవై చేయవలయు, తనకుఁ గర్తృత్వ మెన్నఁడుఁ దలపరాదు। మనుజుఁ డపరోక్షమును బొందు మార్గ మిదియె। నశ్వరేతరభోగి శ్రీ సదానందయోగి॥" నలుగురు మోసినఁ గాని మన మృతకళేబరము స్మశానవాటికి వెళ్లజాలదు. అట్టి కళేబరమును చైతన్యమును గలుగఁజేసి భగవంతుం డంతర్యామియై మోయుచున్నాడు. కాఁబట్టి అహంకారమును వదలి కోరిక లేకుండ ధ్యానతంత్రు లైన విగ్రహారాధకులకు ఆత్మోపాసకులకు మోక్షము దొరుకును. విశేషించి పైని చెప్పఁబడిన రెండు లక్షణములు గలవారు ఏ యే దేవత నుపాసించువారు ఆ యా లోకమునకుఁ బోవుదురు. ఆలోకమునకు ప్రళయము సంభవించినప్పుడు జ్ఞానోపదేశమును పొంది ముక్తినిఁ బొందుచున్నారు. ఆత్మజ్ఞానోపదేశమును పొందిన వారు ఈ లోకమందే ముక్తిని చెందుచున్నారు. కాఁబట్టి ఇరువురకును మోక్షము కలదు.

శ్రీభగవద్గీతలో విగ్రహారాధన మధమ మనియును ఋషులు హృదయమం దున్న పురుషుని ఉపాసించుచున్నా రనియును అంతటను నిండియున్న పురుషుని జ్ఞానులు ఉపాసించుచున్నా రనియును వ్రాయఁబడి యున్నది. ఈ శ్లోకము కేవలమును తర్కవిరుద్ధము లైన సంగతులను చెప్పుచున్నది. ఎందుచేత ననఁగా— జ్ఞానులు అంతటను నిండి యున్నవానిని ఉపాసించుచుండగా విగ్రహములలోను హృదయములోను ఉన్న జ్యోతిలో నంతటను నిండియున్న వాఁడు లేడా? పంచదారచక్కెయొక్క అడుగుభాగమును గిల్లి నోటిలో వేసికొనినను శిరోభాగమును గిల్లి నోటిలో వేసికొనినను తీపి యొక్కటే. ఈ తీపి చక్కెలో అంతటను వ్యాపించినట్లుగ సమస్తబ్రహ్మాండమును వ్యాపించిన పరాత్పరుఁడు ఒక్కఁడే! కాఁబట్టి హృదయస్థుఁడైనవాఁడు, విగ్రహములం దుండువాఁడు, బ్రహ్మాండ మంతట నిండియున్నవాఁడు, ఒక్కఁడే! అనంతకోటి బ్రహ్మాండములను నిండి వానిని మించి హద్దు లే కుండ వ్యాపించిన పురుషుని మన తాలూకు ఖండ మైన మనస్సు ఊహింపఁజాలదు. ఖండ మైన మనస్సు ఖండ మైన పదార్థము నే యూహింపఁగల్గును. అఖండమును ఊహింపఁ జాలదు. కాఁబట్టి అంతటను నిండియున్న వాఁడు ఖండము లైన విగ్రహములలోను ఖండ మైన జ్యోతిలోను ఉన్నాడు. వానిని యుపాసించుటచేతఁ బ్రమాదము లేదు. వానియొక్క ఏ భాగమును ఉపాసించినను అధమ మధ్యమోత్తమము లగు నుపాసన లని అనిపించు

కొనవు. (1) "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" (2) "వాసుదేవ స్సర్వ మితి" అనెడు రెండు వాక్యములకు భంగము సిద్ధించును. విశేషించి హృదయమం దున్న జ్యోతియొక్క కిరణమే మనస్సు అయియున్నది. అట్టి మనస్సుచేతనే బాహ్యమం దున్న విగ్రహములను నిరాకార నిరంజన వస్తువును కల్పింపఁబడుచున్నవి. మన తెలివి అనే సున్నకు మనము మధ్యస్థబిందువు అయి యున్నాము. అట్టి తెలివి యనెడు వలలో సూర్యచంద్రాది గ్రహములు తారలు గోడా మున్నగునవి పడుచున్నవి. మన తెలివి యనెడు వస్తువు ఒక్కటియే. అదియే వేదము. కాఁబట్టి సమస్తము మననే ఆశ్రయించి యున్నది. కాఁబట్టి హృదయమం దున్న జ్యోతిని ఆశ్రయించిన ఋషులను రెండవతరగతివారినిగా శ్రీకృష్ణుఁడు నిర్ణయించుట అనుచితము. ఇట్టి తర్కదోషములతో నిండియున్న శ్లోకము ఇతరులచేత శ్రీభగవద్గీతలో చొనుపఁబడినది. విశేషించి మంటిలోను కఱ్ఱలోను ఘటాదులలోను లోహములలోను ఉన్న పరమాణువులు అనేకకోట్ల స్వల్పపరమాణువులు. అనఁగా ఎలక్ట్రన్సుతోఁ గలిసియున్నవనియు ఆ యెలక్ట్రన్సు వెలుఁగుచుండును అనియు రేడియము అను వెలిఁగెడు పదార్థము ప్రజలకు దొరికినతరువాత తెలిసికొనిరి. ఈ యెలక్ట్రన్సు గల దని శ్రీకృష్ణమూర్తివారు శ్రీభగవద్గీతలోఁ జెప్పి యున్నారు. ఈసంగతిని శంకర రామానుజ మధ్వాచార్యులవారు తెలిసికొనరైరి. తాము ఊహించిన పదార్థమును నమ్ముకొని జ్ఞానుల మని వేషములు వేసికొనినవారిచేతనే ఎలక్ట్రన్సు తెలియఁబడకుండ నుండఁగా వాటికి అంతర్యామిని వారు ఎట్లు తెలిసికొని ఉపాసించుచున్నారో తోఁచదు. కాఁబట్టి అంతటను నిండియున్న వానిని యుపాసించుచున్న వారికి యీ ని చెప్పఁబడిన చిక్కులు గలవు. "సూత్రే మణిగణా ఇవ" అని భగవద్గీతలో వెలుగుచున్న అనేకకోట్ల యెలక్ట్రన్సుతోఁ గూడిన ప్రతి పరమాణువులోను మణులలోను ఉన్న దారములాగున నున్నాను అని వ్రాయఁబడినది.

భూమిమీఁద నున్న వాయువులో నీరు ధూమాకారముగా నున్నది. అందుచేత కాగితము మెత్తగా నున్నది. మేఘమండలమును దాటి నీరు లేని ప్రదేశములో కాగితముమీఁద వ్రాయుటకుఁ బూనినచో కాగితము పిండి యగుచున్నది. మనకు దప్పి కలిగినప్పుడు వాయువులో నున్న నీటిని త్రాగలేము. చెరువులు, నూతులు, నదులు, కాలువలు వీటిలోని నీటిని మాత్రమే త్రాగఁగలము. అలాగుననే నిరాకార నిరంజనుఁడై నిష్క్రియుఁడై సర్వవ్యాపకుఁడైన భగవంతుని ఆశ్రయించి కార్యసిద్ధినిఁ గాంచలేము. విగ్రహములను పెద్దలును, చెరువులు నూతులు నదులు కాలువలు వంటివారు. అనేకకోట్ల ప్రజలచేత అనేకయుగములనుంచి వాఙ్మనోదృష్టులచేత విగ్రహములలో పూజింపఁబడిన సాత్వికశక్తి విగ్రహములందు లేదనుట ప్రకృతిసూత్రములకు కేవలమును విరుద్ధము. దొంగసాక్ష్యములు చెప్పువాఁడు దొంగదస్తావేజులు వ్రాయువాఁడు నరహత్యఁ జేయువాఁడు తన పాతకముల మూటను వీపునకు కట్టుకొని తనలోని సాత్వికశక్తిని విగ్రహములో ప్రార్థనరూపముగాఁ బూరించుచున్నాడు. వర్షములు కురియనప్పుడు సహస్రఘటాభిషేకముఁ జేసి ఆసాత్వికశక్తిని విగ్రహములనుంచి తీసి వాడుకొనుచున్నాము. కాఁబట్టి విగ్రహారాధనమును ఎంతమాత్రమును నిరసింపఁదగదు.

## జానకి యౌవనము

అధికారుల సూర్యనారాయణరావు గారు బి. ఏ. బి. ఎల్.

బాలసూర్యని పైడి - బాణాల బోదలు
చదలేటి బంగారు - సుదతిజవ్వనము
పూసపూసను రాగ - ముల నోలలాడు
సెలయేటి నురగలే - చెలియజవ్వనము
నింగిపైఁ గుంకుమము - నెరపిన ట్లుండు
సందెకాంతుల శోభ - సతిజవ్వనంబు
చివురుచివురున లేఁత - చెల్వంబు లొలయ
పూతపూచిన తీవ - పొలతిజవ్వనము
వెండినీరము జల్లి - పిండారఁబోయు
చల్లని వెన్నెలలె - సఖియజవ్వనము
రేకురేకునఁ బ్రణయ - రేఖ లీరాడు
నిత్యమల్లెసుమంబు - నెలతజవ్వనము

కిసలయంబుల మేసి - గీతికలఁ బాడు
కోయిలల గానమే - కొమ్మజవ్వనము
పాలదారులజాడఁ - బర్వఁగాఁ జేయు
లేతపిట్టలరెక్క - లేమజవ్వనము
వలపుఁదేనెల రుచుల్ - మరపింపఁ జాలు
అపుడు పిదికిన పాలె - అబలజవ్వనము
సహజమౌ భావాల - సరసమై మదిని
ముద్దాడుపద్యమే - ముదితజవ్వనము
మాయవలె జనియించి - మది వెల్లివిరియు
క్రొత్తవలపులహాయి - కొమిరెజవ్వనము
చల్లఁగా నా మన - స్సరసినీఁదాడు
రాయంచ జానకీ - రమణిజవ్వనము.

All-India Library Exhibition, Andhra Grandhalaya Branch




అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనము, ఆంధ్ర గ్రంథాలయ శాఖ

All-India Library Exhibition



అఖిలభారత గ్రంథాలయ ప్రదర్శనము

Srimati Subbalakshmamma, B.A., L.T.



శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ, బి. ఏ., ఎల్. టి.,

Srimati Thiruvengadacharamma Garu



శ్రీమతి తిరువేంగడాచారమ్మ గారు

Thoorupati Sanyasamma Caru, Golaja



తూరుపాటి సన్యాసమ్మ గారు, గొలజా

H



Sree Saradamba Samajam, Anantapur శ్రీశారదాంబాసమాజము, అనంతపురము



Ladies who passed in the Madras University Examinations, 1919 1919 సం॥లో పట్టపరీక్షలందు నెగ్గిన స్త్రీలు



Ladies Athletic Association యువతీవ్యాయామసంఘము

# గర్భిణీ స్త్రీలు

పూండి పెద్ది భాస్కరరావు గారు, ఎల్. ఎమ్. పి.

ఈవిషయమును గూర్చి, తెలియవలసిన అంశములు అనేకములు గలవు. సాధారణముగ అబలలు ఎప్పుడును దయకు పాత్రలు. అందును గర్భవతు లగునప్పుడు విశేషించి, సంతోషప్రదము లగు జీవనమునకు అర్హలు. గర్భము ధరించినది మొదలు, తల్లియుఁ బిల్లయును వేరుపడువఱకును, గర్భవతి జీవితము అసాధుభూయిష్ఠముగ నుండును. చాలవఱకును, ఆ అపాయములు దైవకల్పితము లైయుండును. దైవకల్పితములు మాత్రమే గాక, అతి బాల్యవివాహములు అత్తల అజ్ఞానము మున్నగు ననర్థము లధికముగఁ గలవు. అతిబాల్యవివాహమువలన (ప్రకృతి మెచ్చుట, వివాహ మనఁగా భర్తతో కాపురము చేయుట.) అత్యల్పవయస్కు లగు స్త్రీలు గర్భిణు లగుచున్నారు. దీనఁ దల్లికిని పిల్లకును కూడ సంభవించు హానికి మేరలేదు. కావున ఈ విషయమున తెలియఁదగినవానిలో ముఖ్యమగునవి ఇవి:-(1) క్లిష్టతర మగు ప్రసవము. (2) గర్భిణీస్త్రీ ప్రవర్తనము (3) మలమూత్ర రక్షణము. (4) దుస్తులు, వ్యాయామములు, విహారములు (5) శస్త్రచికిత్స మున్నగునవి.

## క్లిష్టతరమగు ప్రసవము

ఆరోగ్యవతియును, పూర్ణయౌవనవతియు నగు స్త్రీకి, ప్రసవవేదన మిక్కిలి తక్కువ. ఏలయన, అవయవములు అన్నియు, సరిగా ఎదిగియుండుటచేత, సుఖప్రసవము కలుగును. అటుగాక, మిక్కిలి చిన్న వయస్సునందే గర్భవతియగు స్త్రీకి, ప్రసవమునకు సంబంధించిన అవయవములు, సరిగా ఎదిగియుండక పోవుటచేత, ప్రసవసమయమున శిశువునకో తల్లికో కొన్నివేళల ప్రాణహానియును సంభవించును, ఇంతియేకాక, దైవకృపవలననో, పురాకృతమువలననో ప్రసవించినను తనమంచి నే తాను ఎఱుఁగని స్త్రీ తనశిశువు నెట్లు సంరక్షింపఁ గలుగును? కావున బాల్యవివాహ పరిత్యాగ మను సంస్కారము సంఘమునకు కలుగునంతవఱకు గాని, అథవా బహిష్కారభీతిచేత బాల్యవివాహముల నొనర్చినను, శరీరావయవములు (అస్థిపంజరము లోనగునవి) గట్టిపడువఱకు గాని, ప్రతీక్షింపకయే గర్భాదానము చేయుట, స్త్రీలవిషయమునను, శిశువులవిషయమునను, మహాపరాధము నొనర్చుటయే యగునని విన్నవించెదను.

## గర్భిణీస్త్రీ ప్రవర్తనము

గర్భిణులకుఁ గల ఆహారవిహారముల నియమములను విచారింతము. ఆహారము:—గర్భవతి పుచ్చుకొనెడి ఆహారము, పరిశుద్ధమై, బలవర్ధకమై సులువుగా జీర్ణించునదై యుండవలెను. ఆహారబలము వలన కేవలము తా నేగాక, లోని శిశువునుకూడ పోషింపవలెను. గనుక, కొంచెము అధికముగనే భుజింపవలెను. ఇట్లనుటచేత, అజీర్ణము చేయువఱకును తినుమని కాదు. కాని, నీరసము లేకుండునట్లు భుజింపవలెనని భావము. ఈ విషయములో, మన దేశములోని ఆచారములు—(అనాచారము లనిన బాగుండును) మిక్కిలి చెడ్డవి. గర్భిణికి నెల నుసలుట నట్లుండ నిచ్చిన నింటిలో ఈగలు ముసురుట మాత్రము నిశ్చయము. సదుద్దేశముతో నైనను, గర్భవతికి "సూడిద" గా తెచ్చు వస్తువులకు మితిలేదు. మాంచిపోవచ్చిన అమ్మలక్కలు, ఏదో ఒక పిండివంట తీసికొనిరాక మానరు. తెచ్చినవారి మనసు చిన్నబోవు నని యైనను, గర్భవతి తినకమానదు. వెంటనే, అజీర్ణము, వాంతులు మున్నగునవియును, రాకమానవు. కావున, మోమోటపడి ఆహారవిషయమున అశ్రద్ధఁ గైకొనినచో ఆపదలకు బద్ధులు కావలసి వచ్చును.

ఆహారము వేళకు, మితముగ భుజింపవలెను. అందునను, "కంది గుండ, మినపసున్ని" ఇత్యాదు లగు గురుపదార్థములకంటె, పాలబిళ్లలు, క్షీరాన్నము, పాలు మొదలగు ద్రవపదార్థములనే ఎక్కువగ భుజింపవలెను. కాఫీ, టీ, మొదలగు నిషావస్తువులు సాధ్య మగువఱకు వదలిపెట్టవలెను. కాని, ఇప్పటి మన నాగరకస్త్రీలు, ఇవి లేనిచో బొత్తుగ, శయ్యనుండి లేవజాలరుగదా! కావున, తగుమాత్రముగ సేవించినను హానిలేదు. విస్కి (Wisky) బ్రాంది (Brandy) మొదలగు మద్యముల అలవాటులు మన స్త్రీలకు లేకున్నను, రాను రాను సహవాసదోషమువలన పట్టుబడుచున్నవి. వీనిని, ప్రసవించువఱకైనను బొత్తుగా విడిచిపెట్టవలెను. పోర్టువైను (Portw ne) మొదలగునవి ఎట్లున్నను మన కనావశ్యకములే! ఇది శరీరములోనికి ప్రవేశించు ఆహారమును గూర్చిన విషయము. ఇఁకను శరీరమునుండి బయలుకు పోవువానిఁ గూర్చి చర్చింతము. శరీరమునుంచి పోవు వ్యర్థపదార్థములలో, మలమూత్రస్వేదములు ముఖ్యములు. కావున, ఇవి ప్రవహించు మార్గములను జాగ్రత్తగా కాపాడవలెను.

మలవిసర్జనము:—మనము భుజించు పదార్థములలో చాలభాగము వ్యర్థమై, మలరూపమున దేహమునుండి వెలువడుచున్నది. ఆ యాహారము ఆమిషము అనామిషము అని ద్వివిధము. శాకాహారము (అనామిషము) దేహమునకు బలము కలిగించు సారము తక్కువగలిగి, ఎక్కువభాగము, విశేషమార్పు చెందకయే, మలరూపమున వెలువడుచున్నది. కాని, మాంసాహారము (ఆమిషము) "మాంసం మాంసేన వర్ధతి" అన్నట్లు చాలభాగము జీర్ణమై, కొంచెముమాత్రమే మైకిపోవును. అనఁగా, శాకభుక్కులకంటెను మాంసభుక్కులకు, మలము తక్కువ. మలబద్ధకము ఎక్కువ. అందునను పురుషులకంటె స్త్రీలకు

మెండు. దీనికి కారణములు వారి దేహ అవయవ నిర్మాణములే! గర్భవతికి విశేషించి మలబద్ధము కలుగుటకు ఒక కారణము కలదు. గర్భము దినదినప్రవర్ధమానమై పిల్లతిత్తిని నొక్కి, ప్రవాహము సాపీ కదలికను ఆటంకపఱచి, మలబద్ధముఁ గలిగించును. పాశ్చాత్యసంఘ సంస్కర్తలును, స్త్రీ స్వాతంత్ర్యవాదులును, ఎట్లు వాదించినను స్త్రీ పురుషుల దేహతత్త్వములలో విశేషభేద మున్నదనుట నిస్సందేహము. మఱియును, గర్భధారణమువలన స్త్రీతత్త్వము, అనేకములగు మార్పులను పొందుచుండును. ఇట్టిస్థితిలో గర్భిణీస్త్రీల మలబద్ధమును వారించుటకై ఔషధములను ఈయఁగూడదు. కాని భోజనమునందే కొలదిపాటి మార్పులను చేసినఁ జాలును. మాంసాహార లగు స్త్రీలు, ఆకుకూరలు మొదలగువానిని తినిన సుఖముగ సకాలమునకు విరోచనము అగును. ప్రతిదినము, పఱుండఁబోవునపుడు, ఒక పెద్ద గళాసు (సుమారు ¼ శేరు) — నీళ్లు త్రాగినను మంచిదే. ఈ సాధనములు ఉపయోగింపనిచో సుమారు చిన్న ఉగ్గుగిన్నెడు చిట్టాముదమును పఱుండునపుడు సేవించుట యుక్తము. ఆముదము ఇష్టములేనివారు పారలీన్ అను ఇంగ్లీషు ఔషధమును ఒక ఔన్సు తీసుకొనవచ్చును "కాస్కరా సాగ్రడ" "కసాగ్రా" "ఆక్వాపీరియా" మొదలగునవి కూడ తగిన మోతాదులుగా పుచ్చుకొనవచ్చును. కాని ఎప్పుడైనను సరియే నేపాళం లాంటివానిని సేవింపరాదు.

మూత్ర విసర్జనము:— గర్భవతికి మూత్ర విసర్జనము సరిగా ఉన్నదియును లేనిదియును, జాగ్రత్తగ గమనింపవలెను. గర్భస్థ శిశూదరమునందలి మల పదార్థములు కూడ, తల్లి మూత్రము ద్వారముననే పోవలెను. కాబట్టి, ఒక్కొక్కప్పుడు, శక్తి లేని కతన, మూత్రావయవములకు జబ్బుచేయును. మూత్రము తగ్గుచున్నదని తోచినయెడల, వెంటనే మూత్రమును వృద్ధిచేయఁ బ్రయత్నింపవలెను. మూత్రవృద్ధికై 2 లేక, 3 శేర్ల నీళ్లు త్రాగింపవలయును. లేక సోడానుగాని, బార్లీ నీళ్లనుగాని, ఇవ్వవచ్చును, ఈ చికిత్సవలన ప్రయోజనములేనిచో ఆలస్యము చేయక, వైద్యునికి చూపవలెను. నీరు పరీక్ష చేయించవలెను. మూత్రములో "అల్బ్యుమినుు" అను పదార్థము ఉన్నట్టు పరీక్షకులు చెప్పినచో తగిన చికిత్స చేయించవలెను. ఇట్టి స్థితిలో ఔషధముకన్న పథ్యము ముఖ్యము. గనుక అన్నము పెట్టుట మాని, పాలు బార్లీ నీళ్లను మాత్రమే ఈయవలయును. లేనిచో గర్భిణీస్త్రీలకు సంభవించు మహోపద్రవములలో నొకటియగు "Eclampsia" వ్యాధి రావచ్చును. ఈ జబ్బువచ్చిన యెడల తల్లికిని పిల్లకును కూడ, విశేష హాని. నూటికి, 30 మంది స్త్రీలును, 70 పిల్లలును చనిపోవుట వాడుక. ఇంతటి భయంకర వ్యాధిని సృష్టించినను, దయామయుడగు సర్వేశ్వరుడు, "గుడ్డిలో మెల్ల" అన్నట్లు, ముందుగ జాగ్రత్త వహించుటకు మనకు కొన్ని ఆధారములను కల్పించి యున్నాడు. ముఖ్యముగ మూత్ర పరీక్ష జేసి, అందు అల్బ్యుమిన్, గుర్తించిన తోడనే, తగిన చికిత్సను చేయించిన ఈ జబ్బురాదు. కావున, 7 వ మాసము దాటిన వెనుక, అనుమాన మున్నను, లేకపోయినను, 15 దినముల కొకసారి, గర్భిణీస్త్రీలమూత్రమును పరీక్షచేయుట వైద్యునికి విధి. అట్లుచేయని యెడల ఆ వైద్యుడును, ఆమె బంధువులును, అపరాధులనుటకు సందియములేదు. ఈ పరీక్షవలన నష్టములేదు. పరీక్షయున్ననో మిక్కిలి సులభమైనది. వలయు సామగ్రియును బహుతక్కువ. రెండునిమిషములకంటె ఎక్కువ కాలమవసరములేదు. పరీక్షవలన వైద్యునికిని, స్త్రీకిని గలుగు మనోవిశ్రాంతికి మేఱలేదు. ఇంతపాటి ప్రయత్నము చేసి, వందలకొలది స్త్రీలను, వేలకొలది శిశువులను, మృత్యువువారినుండి తొలగింపవచ్చును. స్వేదమును గూర్చి ఒక్కింతవ్రాసి ఈ భాగమును ముగించెదను. రక్తము శుద్ధపోవుటకు ఇది యొక ముఖ్యమార్గము. కావున దినమును స్నానమును అవశ్యము చేయవలయును. ఉష్ణోదకము ప్రధానము. శీతోదకమైనను సరియే. దుస్తులు:— ఈవిషయమునందు ప్రాచీనమునుండి వచ్చుచున్న మన స్త్రీల వస్త్రధారణ పద్ధతి చాల యుక్తముగానున్నది. గర్భముఁదాల్చిన స్త్రీకి వక్షముచుట్టును ఏదియు బిగువుగా నుండకూడదు. వడ్డాణములు, బెల్టులు (Belto) బిగించి కట్టుగాగరాలు, గొంతుక నడుము మొదలగువానిని నొక్కివేయు జాకెట్టులును శ్రేయస్కరములు కావు.

## వ్యాయామములు

గర్భవతికి భుజించినది జీర్ణమై దేహమునకు దార్ఢ్యము నిచ్చుటకు తగుమాత్రము వ్యాయామము ఉండవలెను. వ్యాయామములలో, గృహకృత్యములలో, ఆయాసము లేనిపనులఁజేయుట, సాయంకాలము 1 గంట చల్లగాలిలో మెల్లగానడచుట మొదలగునవి మంచివియగును. కాని గర్భవతిని, "కుంది"వలె నొకమూల కూర్చుండబెట్టుట మంచిదికాదు. జన సమ్మర్దముకలిగి, బొగ్గుపులుసు వాయువుతో నిండియుండెడు నాటకములకు, సినీమాలకు, స్వామి కల్యాణమహోత్సవము మొదలగువానికి, పోరాదు. ఏలయనఁగా సాధారణముగా— కోవెల గర్భ గుడిలోనుండు గాలి భక్తులకు తక్షణమే ముక్తి నొసంగ జాలియుండును ఈ సందర్భమునందు గర్భవతికి సంయోగము గర్హ్యమనుట ముఖ్యముగా జ్ఞప్తినుంచుకొనవలయును. శస్త్రచికిత్స గర్భవతికి కూడునా కూడదా? యనిన, వీలైన యెడల ప్రసవమగు తరువాతి వఱకును, నిలుపుట శ్రేయస్కరము. చికిత్స తప్పనిచో, మత్తుమందును (Anes thesia) ఇచ్చియే చేయవలెను. మత్తుమందు యొక్క చెడుగుణములు శిశువునకు సోకినను, జాగ్రత్తగా చికిత్సను నడపినచో హాని వాటిల్లగు.

తల్లియొక్క మనోవికారములు, పిల్లలయందు పరిణమించుచునుటకు కొన్ని ఆధారములు గలవు. కాని నిశ్చయముగా జెప్పుట కష్టము. సంతోషము, దుఃఖము, కోపము, మోహము, మొదలగు నవస్థలకును మనుజుని, ఆకలి, నిద్ర, మొదలగు నవస్థలకును కొంతవఱకు సంబంధము కలిగియుండుట యెల్లరకును తెల్లమే! నిశ్చయము తెలియని యంశమును గూర్చి యోచించినపుడు, లేదనుకొనుటకంటె, ఉన్నదనుకొని, ప్రవర్తించుట మేలు. కావున గర్భవతి యగు స్త్రీకి, విషాదము లేకుండజేసి, మనస్సునకు ఆనందము కలుగునట్లు నడచి, దేహారోగ్యముఁ గాపాడిన, ఆ తల్లియొక్కయు, ఆవెనుక నవతరించు అర్భకుని యొక్కయు కృతజ్ఞతకు, అమ్మలును, అత్తలును, అర్హులని ఆలోచించుచున్నాను. ఇప్పుడిప్పుడు దొరతనమువారి ప్రోత్సాహము వలన, మన దేశమందంతటను, గర్భవతులకును, శిశువులకును సంరక్షక సంఘములు ఏర్పడుచున్నవి. సర్వేశ్వరుడు ఆ సంఘములకును, ప్రోత్సాహకులకును, అభ్యుదయము నొసంగుగాత"

# నియోజకగణగుణనిర్ణయము

గోవిందరాజు వేంకటకృష్ణరావు గారు

నూతన భారత రాజ్యాంగ సంస్కరణముల అక్టు ననుసరించి శాసనసభలకు ఎన్నిక లీ సంవత్సరము నవంబరు నెలలో జరుపుటకు ప్రభుత్వమువారు నిశ్చయించినట్లు ప్రకటింపఁబడెను. శాసనసభలందు సభ్యు లెంతమంది యుండవలయునో, ఏవిధముగ ప్రాతినిధ్యములను విభజింపవలయునో యున్నగు ముఖ్యవిషయములు సౌతుబరో సంఘమువారి చర్చతో ముగియలేదు. సంయుక్త సంఘమువారు కొన్ని మార్పులను సూచించి రని తెలియుచున్నది. ప్రాతినిధ్యనిర్ణయము ఇండియా ప్రభుత్వమువారికే విడిచిపెట్టితి మనియు, దానిని వారు విస్తరింపవలయునే గాని సంకోచింపఁగూడ దనియు సంయుక్తసంఘమువారు సూచించిరి. ఇట్టి తరుణమున ప్రజలు తమ వాంఛితములను బహిరంగముగఁ దెల్పవలయును.

మాంటాగూ నివేదికయందు రెండు ముఖ్యసూత్రములు ప్రతిపాదింపఁబడెను. ఆ సూత్రముల గురించి ప్రజలలో నెక్కువ భిన్నాభిప్రాయములు లే వని చెప్పవచ్చును. ఆ సూత్రము లెవ్వియనః—

(1) ప్రత్యక్షపు టెన్నికలపద్ధతి నెలకొల్పుట.

(2) నియోజక గణ నిర్మాణమును సాధ్యమైనంతవఱకు విశాలముఁ జేయుట.

ఈ సూత్రములను ఏదేశమునకు గాని, ఏదేశపు భాగములకైనను గాని వర్తింపఁ జేయునపుడు, ఆయా దేశములయొక్కయు, ఆయా దేశపు భాగములయొక్కయు వివిధపరిస్థితులఁ గూడ నాలోచింపవలయును. నియోజకగణనిర్మాణము ఎక్కువ విశాలముగ నుండవలయు ననియు, వివిధజాతులవారికి ప్రత్యేకప్రాతినిధ్యము నొసంగవలయు ననియు, ఇట్టి స్థితిలో ఇప్పుడు హైందవులకు బాధ్యతాయుతప్రభుత్వము నొసంగుట అసంభవ మనియు కొందఱు విమర్శకులు వాక్రుచ్చిరి. ప్రథమమున నియోజకగణ నిర్మాణ మంత విశాలముగ నుండకున్నను కొంతకాల మయినతరువాత నెంతయో విపుల మగు నని చరిత్ర స్పష్టపఱచినది. యాక్సన్ గారు చెప్పినట్లు మొట్టమొదట బాధ్యతాయుతప్రభుత్వ మాంగ్లదేశమున 1880వ సంవత్సరమున నెలకొల్పఁబడినది. కాని విశాల మగు నియోజకగణ నిర్మాణమునకు 1832 వ సంవత్సరమున ఆంగ్లదేశమునఁ బునాది వేయఁబడెను. మధ్యతరగతులవారి అధికారసంపత్తి 1832 వ సంవత్సరపు అక్టువలన నెక్కువగఁ బెరిఁగెను. అప్పుడు భూస్వాములే ప్రజల సభానియోజనములను తమ యధీనమం దుంచుకొనిరి. 1867 1883, 1884 సంవత్సరముల సంస్కరణపు అక్టులవలన కార్మికుల కందఱకును నియోజకబాధ్యత లియ్యఁబడెను. కాని 1918 వ సంవత్సరపు ప్రజాప్రాతినిధ్యపు అక్టు ప్రకారము 80 లక్షలమంది ప్రజలకు (స్త్రీలతో సహా) ఎన్నికహక్కు లొసగఁబడెను. 1887 వ సంవత్సరమునకు ముందు యునైటెడ్ కింగ్డమ్‌లోని నియోజకుల సంఖ్య 1,370,793 కన్న నెక్కువ లేదు. 1910 వ సంవత్సరమున 80 లక్షలమంది నియోజకు లుండిరి. కడచిన సంవత్సరము జరిగిన ప్రజల సభానియోజనలకు స్త్రీలతో సహా 180 లక్షల మంది గలరు. 1831 వ సంవత్సరమున నాంగ్లదేశమున జనసంఖ్య 380. లక్షలు, ఇప్పుడు 450 లక్షలు. పైవిషయములను బాగుగ పరిశీలించిన, వృద్ధి నెమ్మదిగ జరిగిన దని తేలుచున్నది. ఆ విధముగనే భారతదేశమందు కూడ ప్రథమమున విశాలమయిన నియోజకగణము నేర్పఱచుట దుర్లభము. కాని నియోజకగణము తక్కువగను విశాలముగను నుండకుండుటచే బాధ్యతాయుతప్రభుత్వమును త్వరలో నెలకొల్పుట యసంభవ మని కొంద ఱనవచ్చును. అట్లనుట తెలివితేమిచేఁ గాని వేఱు కాదు. దేశస్థితుల ననుసరించి నియోజకగణనిర్ణయము విశాలముగ నేర్పఱుపవలయును.

కాంగ్రెసులీగు విధానము చెన్నరాజధాని శాసనసభాసభ్యుల సంఖ్య 125 అని యేర్పఱచినది. సౌతుబరో సంఘమువారు 120 అని సూచించిరి. చెన్నరాజధాని శాసనసభాసభ్యుల సంఖ్య నిర్ణయింపకమునుపు ఈ క్రింది పట్టీలో నుదాహరించిన అన్యదేశముల ప్రాతినిధ్యసభలలో సభ్యులసంఖ్య యె ట్లున్నదియుఁ దెలిసికొనుట యుక్తము. ఇది చాలవఱకు మనకుఁ దోడ్పడును.

---

క్రింద నుదాహరించిన శాసనసభ లన్నియు సాధారణముగ మన రాష్ట్రీయసభలను పోలియుండును. బ్రిటిషు సామ్రాజ్యములోని స్వపరిపాలనముగల దేశములలో ప్రతి 4000 మంది ప్రజ లొక ప్రతినిధిని ఎన్నుకొనుట మొదలు ప్రతి 28,000 మంది ప్రజ లొక ప్రతినిధి నెన్నుకొను ప్రజాప్రాతినిధ్యపు పద్ధతులు గలవు. చెన్నరాజధానిలోనంత ప్రజాసంఖ్య గల యునైటెడ్ కింగ్డములో ప్రజలసభకు ప్రతి 67,000 మంది ప్రజలు ఒక ప్రతినిధి నెన్నుకొనెదరు. కావున నా పద్ధతి ననుసరించిన చెన్నరాజధానికి 600 మంది సభ్యులు గల శాసనసభ ఉండవలె నని కోరుట అనుచితము కాదు. కాని, ప్రస్తుతపు మార్పునందు చెన్నరాజధాని నూతనశాసనసభాసభ్యుల మొత్తము 200 మందికన్న తక్కువయుండగూడదు. ప్రత్యేకప్రయోజనములకును మహమ్మదీయసోదరులకును ప్రత్యేకప్రాతినిధ్య మిచ్చునపుడు, శాసనసభయందు 200 కన్న తక్కువ యున్న

యెడల విశాల మగు నియోజకగణ ముండకపోవుటయే గాక నియోజకసమస్య యంతయు క్లిష్టమై సంకుచిత మగును. ప్రజలలో నశాంతి యుద్భవించును.

| దేశము | జనసంఖ్య | సభ్యులసంఖ్య | ప్రతి సభ్యునకు జనసంఖ్య |
|---|---|---|---|
| యునైటెడ్ కింగ్డమ్ | 45,370,580 (1911 సంllలో) | 670 | 67,000 |
| క్విబెకు | 2,316,417(1915-16 సంllలో) | 83 | 28,000 |
| విక్టోరియా | 1,399,779 (1916 సంllలో) | 65 | 21,500 |
| నేటాలు | 98,144 (1911 సంllలో తెల్లవారు) | 25 | 4,000 |
| ట్రాన్సువాలు | 420,562 (1911 సంllలో తెల్లవారు) | 36 | 11,000 |
| ప్రష్యా | 40,165,219 (1910 సంllలో) | 443 | 93,000 |
| బవేరియా | 6,887,291 (1910 సంllలో) | 163 | 38,000 |
| జపాను | 55,965,292 (1916 సంllలో) | 381 | 135,000 |
| వాషింగ్టన్ | 15,341 (1916 సంllలో) | 96 (1915 సంllలో) | 137 |
| అయోవా | 2,220,321 (1916 సంllలో) | 108 | 20,558 |
| ఓహియో | 5,008,627 (1916 సంllలో) | 128 | 39,997 |
| న్యూయార్కు | 10,273,875 (1916 సంllలో) | 150 | 68,489 |

శాసనసభయందు కాంగ్రెసులీగు విధానము ననుసరించి 4/5 వంతులు ప్రజాప్రతినిధు లుండవలయును. కావున 200 మంది శాసనసభ్యులలో 160 మంది ప్రజాప్రతినిధులై యుండవలెను. మిగిలిన 40 మందియు నుద్యోగులును దొరతనపు నియామకసభ్యులు నైయుండవలెను.

దొరతనమువారికి విడువబడిన 40 ప్రాతినిధ్యస్థానములలో 10 అధికారులకు చెందియుండును. ఆ స్థానములకు దొరతనమువారు అధికారులను నియమింపగలరు. ఈ సంఖ్య సరిపోవును. ఏలయన నాలవఅకు శాఖ లన్నియు మంత్రుల యధీనము చేయఁబడును. మిగిలిన స్థానములకు ప్రభుత్వమువారు అనధికారసభ్యులఁ జేర్పవలయును. ఈ విషయమునఁ బ్రస్తుత మవలంబించు పద్ధతి అసంతృప్తికరముగ నున్నది. వెనుకబడిన జాతులవారికి సరియగు ప్రాతినిధ్యము లేకున్న నట్టి సమయములందు దొరతనమువారు సభ్యులను ఆయాజాతులనుండి నియామకముఁ జేయవలయును. అంతియగాని నిరంకుశత్వముతో తమ యిష్టము వచ్చినట్లు గావించుట అవ్యక్తము.

ప్రజాప్రాతినిధ్యస్థానముల నీక్రింద సూచించిన పద్ధతిని విభజింపవలయును.

(1) పురపాలక సంఘపు టావరణములలో నున్న ప్రజలచే నెన్నుకొనబడిన ప్రతినిధుల మొత్తము 26 (2) పురపాలక సంఘపు టావరణములలో లేని ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యుల మొll 68 (3) మహమ్మదీయ ప్రతినిధులు 27. (4) స్వల్పసంఖ్యాకులచేతను వెనుకఁబడిన జాతులవారిచేత నెన్నుకొనబడినసభ్యులు9. (5) యూరోపియను వర్తకవ్యాపారపరిశ్రమలవారి ప్రతినిధులు 8. (6) హైందవ వర్తక వ్యాపారపరిశ్రమలవారి ప్రతినిధులు 3. (7) జమీందారీ ప్రతినిధులు 2. (8) చెన్నపట్టణ విశ్వవిద్యాలయ ప్రతినిధులు 2. మొత్తము 160.

సామాన్యప్రజలచేఁ బంపఁబడు ప్రతినిధుల మొత్తము 1:4 కన్న తక్కువ యుండఁగూడదు. చెన్నరాజధాని ఆఱు దేశభాగములుగను న్యాచురల్ డివిజన్సు 25 జిల్లాలుగను (అర్ కెంగో యను చిన్న జిల్లాను మలబారుతోఁ గలుపవచ్చును), 3 మన్యములుగను భాగింపఁబడి యున్నది. రాజధానిలోని ప్రజల నందఱిని రెండు భాగములుగ విడఁదీయవచ్చును. ఒక భాగమువారు పురపాలకసంఘపు టావరణములలో నున్నవారు. రెండవభాగమువారు గ్రామములలోను పురపాలకసంఘములు లేని చిన్నచిన్న పట్టణములందును నివసించుచుండిరి. విద్యావంతులును, ఉద్యోగులును పురపాలకసంఘములు గల స్థలములందు నివసించుచుండుటచేత వారి ప్రాతినిధ్యము ప్రత్యేకముగ నుండుట సమంజసము. అట్లొనర్చుట ప్రస్తుతపద్ధతి ననుసరించి యుండుటయే గాక ఆంగ్లదేశపు ప్రాతినిధ్యపద్ధతి ననుసరించియు నుండును.

చెన్నరాజధానిలో పురపాలక సంఘపు టావరణములలో నున్న ప్రజలసంఖ్య 2,661,073. వీరికి ప్రాతినిధ్య మిచ్చు పద్ధతి యెట్లుండవలయు ననిన ప్రతి లక్షమంది ప్రజలును నొక సభ్యుని నెన్నుకొనునట్లును, (60,000 సంఖ్యకు తక్కువగా నున్న ప్రజల లెక్కలోనికి తీసికొన నవసరము లేదు) ప్రతి దేశభాగములోని పురపాలక సంఘపు టావరణము లన్నియుఁ గలిసి యొక నియోజనస్థానముగను (Constituency); అందు చెన్ననగరము ప్రత్యేకనియోజనప్రదేశముగను నిర్ణయించుట సమంజసము. అట్లు గావించినచో నీవిధమున నుండును.

(1) తూర్పుకోన (ఉత్తరము) 5; (2) దక్కను 1; (3) చెన్నపట్టణము 5; (4) తూర్పుకోన (మధ్యము) 5; (5) తూర్పుకోన (దక్షిణము) 7; (6) పడమటికోన 3; మొత్తము 26.

కావున పురపాలకసంఘపు టావరణములలో నున్న ప్రజలు 26 గురిని పంపెదరు. సభ్యుల సంఖ్య యెక్కువ యని కొంద ఱనవచ్చును. గాని రాజధానిలోని ప్రజాహిత జీవనముఁ జేయువారను విద్యావంతులును ఉద్యోగులును మున్నగువారి ప్రతినిధు లగుటచే అంత యెక్కువ యని తలపోయుట మంచిదికాదు.

ఇంకను పారిశుద్ధ్యసంఘపు టావరణములలో లేని ప్రజల ప్రాతినిధ్యమును గురించి వాదించెదము. చెన్నరాజధాని 3 మన్యములుగను (ఏజెన్సీస్) 24 జిల్లాలుగను (చిన్న జిల్లా యగు అంజెంగోను మలబారుతోను కలుపవచ్చును), భాగింపఁబడినది. చెన్నపట్టణము ఈనిర్ణయములోనికి రాదు. ప్రతినిధుల విషయములో ప్రతి జిల్లాయును ప్రత్యేకప్రాతినిధ్యము నొందుట శ్రేయస్కరము. సౌతుబరో సంఘమువా రెందువల్లనో మన్యములకు ప్రాతినిధ్య మీయ లేరు. అట్లు గావించుట అన్యాయ్యము. వానికికూడ ప్రాతినిధ్యస్థానముల నొసంగవలయును. ఈ తరగతి ప్రజలకు ప్రాతినిధ్యపద్ధతి, ప్రతి 5 లక్షలమంది కొక ప్రతినిధి యుండునట్లేర్పరుపవలయును. (60,000 మంది ప్రజలకు తక్కువగల సంఖ్య లెక్కగొనుట అనవసరము). ఈ విధముగ ప్రాతినిధ్య మొసంగినయెడల ప్రతి జిల్లాకును నీ క్రిందఁ జూపుబడిన ప్రాతినిధ్యస్థానములు లభించును.

| జిల్లా పేరు | జనసంఖ్య | ప్రతినిధులసంఖ్య |
|---|---|---|
| గంజాముమన్యం | 580,465 | 1 |
| విశాఖపట్టణంమన్యం | 1,020,151 | 2 |
| గోదావరిమన్యం | 206,903 | 1 |
| గంజాము | 1,803,148 | 4 |
| విశాఖపట్టణము | 2,058,768 | 4 |
| గోదావరి | 1,348,430 | 3 |
| కృష్ణా | 1,884,725 | 4 |
| గుంటూరు | 1,625,541 | 4 |
| నెల్లూరు | 1,294,906 | 3 |
| కడప | 876,191 | 2 |
| కర్నూలు | 892,919 | 2 |
| బళ్లారి | 902,825 | 2 |
| అనంతపురము | 954,766 | 2 |
| చిత్తూరు | 1,222,041 | 3 |
| చెంగల్పట్టు | 1,340,5 8 | 3 |
| దక్షిణ ఆర్కాటు | 2,284,665 | 5 |
| ఉత్తర ఆర్కాటు | 1,766,589 | 4 |
| సేలం | 1,707,537 | 4 |
| కోయంబత్తూరు | 2,052,856 | 4 |
| తంజావూరు | 2,129,014 | 5 |
| తిరుచనాపల్లి | 1,940 194 | 4 |
| మధుర | 1,738,818 | 4 |
| రామ్నాడు | 1,629,357 | 4 |
| తిరునల్వేలి | 1,660,725 | 4 |
| నీలగిరి | 89,856 | 1 |
| మలబారు | 2,814,145 | 6 |
| దక్షిణ కనరా | 1,146,8'5 | 3 |

కాంగ్రెసు-లీగు విధానము ననుసరించి మన మహమ్మదీయ సోదరులకు ప్రత్యేక ప్రాతినిధ్యము నొసంగవలయును. సంయోగ సంఘమువారును సౌతుబరో సంఘమువారును కాంగ్రెసు-లీగు విధానము నీ విషయమం దామోదించిరి. మహమ్మదీయసోదరులకు 27 ప్రాతినిధ్య స్థానముల నొసంగవలయును. వారి ప్రాతినిధ్య పద్ధతి యెట్లుండవలయు ననిన ప్రతి లక్షమంది ప్రజల కొక ప్రతినిధియు (60,000 లకు తక్కువయగు జనసంఖ్య లెక్కలోనికిఁ దీసికొనుట అనవసరము) ప్రతి దేశభాగమును నొక నియోజనప్రదేశముగను ఏర్పరుపవలయును, అట్లు చేసిన ఈ క్రిందివిధముగ నుండును.

తూర్పుకోన (ఉత్తరము) 3; దక్కను 4; తూర్పుకోన (మధ్యము) 4; (దక్షిణము) 5; పడమటికోన 11; మొత్తము 27.

మన్యములలో మహమ్మదీయులు చాల తక్కువగ నుండుటచే వారిని తూర్పుకోన (ఉత్తరము) భాగమువారితోఁ గలిపి సభ్యుల నెన్నుకొను స్వాతంత్ర్య మొసంగవలయును.

యూరోపియను వర్తకపరిశ్రమలవారికి మూఁడు ప్రాతినిధ్య స్థానముల నీయవలయును. కాని ప్రస్తుతపద్ధతి ననుసరించి ఎన్నిక స్వాతంత్ర్యము నొసంగఁగూడదు. దీనివలన నెన్నియో నష్టములు సంభవించుచున్నవి. ఎన్నికహక్కు సంఘముల కొసంగఁగూడదు. కొంత ఆదాయపుపన్ను నిచ్చుచు, ఏపరిశ్రమకైనను, వ్యాపారమునకైనను జెందిన యూరోపియను లందఱు ఎన్నికహక్కు కల్గియుండవలయును. ఎంత ఆదాయపుపన్ను నిచ్చువారికి ఎన్నికహక్కును ఈయవలయునో వారే నిశ్చయించుకొనవలయును. యూరోపియను వర్తకపరిశ్రమలవా రెవ్విధమున ప్రతినిధుల నెన్నుకొనెదరో అట్లే హైందవవర్తకపరిశ్రమలవారు కూడఁ జేయవలయును.

భూస్వాములకు ప్రత్యేకప్రాతినిధ్య మొసఁగ నక్కఱ లేదు. ఏలయన, వారు సామాన్యప్రజలతో కలిసి సభ్యుల నెన్నుకొనవచ్చును. జమీందారులకు రెండు ప్రాతినిధ్యస్థానముల నొసంగవలయును. చెన్నరాజధాని ఉత్తరభాగములోని జమీందారు లందఱు నొకనిని, దక్షిణభాగమువా రొకనిని ఎన్నుకొనవలయును.

చెన్నపట్టణము విశ్వవిద్యాలయమువా రిద్దఱుసభ్యుల నెన్నుకొనెదరు. అనధికార యూరోపియనుజాతివా రందఱు (Non-official European Community) ముఖ్యముగ వర్తకమందును పరిశ్రమలందును కృషిని సల్పువారై యున్నారు. వీరికి ప్రత్యేకప్రాతినిధ్య మొసంగఁబడినది. కాని వీరిలో నింక నితరవృత్తులందు కృషిసల్పువారు సామాన్యప్రజలతోఁ బాటు ఎన్నికలలో పాల్గొనవచ్చును. ప్రత్యేకప్రాతినిధ్య మిమ్మని వీరును కోరవచ్చును. కాని ఒకజాతివారికి రెండు పర్యాయములు ప్రత్యేకప్రాతినిధ్య మిచ్చుట అసమంజసము, అన్యాయ్యము.

వందలకొలఁది బ్రాహ్మణబ్రాహ్మణేతర సంఘములు గలవు. ఈ సంఘము లన్నిటికిని ప్రత్యేకప్రాతినిధ్యముఁ గల్పించుట దుస్తరమగు పని యని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. ఈవ్యాసమం దింకొక స్థలమునఁ జెప్పబడిన యెన్నికస్వాతంత్ర్యలక్షణములఁ బరిశీలించిన నియోజకగణ మంతయు బ్రాహ్మణేతరమయమై యుండు నని స్పష్టపడును. కనుక అధికసంఖ్యాకులు వారి హక్కులను సులభముగఁ గాపాడుకొనవచ్చును. కాని వివాదపరిష్కారమునకు సంయుక్తసంఘ

మువారు బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మొసంగ నిశ్చయించిరి. ఇందుకొఱకు కొన్ని స్థానములు ప్రత్యేకించి యుంచఁబడును. స్థానముల సంఖ్యను గుఱించియు, ప్రత్యేకింపవలసిన పద్ధతిని గుఱించియు బ్రాహ్మణబ్రాహ్మణేతరులు తమలోఁ దాము సంప్రతించుకొని నిర్ణయించుకొనవలసిన దనియు, నట్లు వారిలోవారికి సమాధానము కుదురనియెడల హైందవకేంద్రప్రభుత్వమువారిచే నియమింపఁబడెడి మధ్యవర్తిమూలమునఁ బరిష్కృతము గావింపఁబడు ననియు సంయుక్త సంఘమువారు సూచించిరి. మూఁడవవారెవ్వరు లేకుండ బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును గలిసి స్నేహభావముతో సమాధానమును గుదుర్చుకొనుట శ్రేయస్కరము. అందులకుగాను శాసనసభకు ప్రతిజిల్లా నుండియు ఒక్క బ్రాహ్మణుని ప్రతినిధిగ నెన్నుకొనుపద్ధతి నేర్పఱచిన యుక్తమని నామదికిఁ దోఁచెడిని. అప్పుడు శాసనసభలో 25 గురు బ్రాహ్మణప్రతినిధు లుందురు. మిగిలినవారు బ్రాహ్మణేతరులై యుందురు. ఈపద్ధతిని బ్రాహ్మణేతరసోదరు లామోదింతు రని తలంచెద.

అల్పసంఖ్యాకులకును, వెనుకఁబడిన జాతులవారికిని తొమ్మిది ప్రాతినిధ్యస్థానము లీయఁబడును. అందు నాల్గుస్థానములు హిందూదేశ క్రైస్తవులకును, ఒకస్థానము ఆంగ్లోహైందవులకును నీయఁబడును. వెనుకఁబడినజాతులనుండి ప్రతినిధులను దొరతనమువారు నియమింపవలయు నని మాంటాగూనివేదికము సూచించెను. అట్లే చేయుట యుక్త మని సౌతుబరో సంఘమువారును, సంయుక్తసంఘమువారును సూచించిరి. అట్లొనర్చుట బాధ్యతాయుత ప్రభుత్వమూలబీజమును నిర్మూలమొనర్చుట యనియే చెప్పవలయును. దొరతనమువారిచే నియమింపఁబడుసభ్యులందు ప్రజలకు నమ్మక ముండకపోవుటయేగాక, కొన్ని సంవత్సరములకు ఆజాతులవారు క్షీణదశలోనికివచ్చెదరని చరిత్ర అనంతముఖముల నుద్ఘోషించుచున్నది. కావున శాసననిర్మాణసభ్యుల నెన్నుకొను స్వాతంత్ర్యము నీయవలయును. అందు ముఖ్యముగా నిమ్నజాతులవారికి 4 ప్రత్యేకప్రాతినిధ్యస్థానము లొసంగవలయును. వారికి ఆస్తియు, చదువును లేకుండుటచే నెట్లు ఎన్నికహక్కును గల్గఁజేయుట అని కొందఱు వితర్కింపవచ్చును. ఈ సందిగ్ధస్థితినుండి తప్పించుకొనుటకు, నిమ్నజాతుల ప్రతినిధులను ఆయాజాతులనుండి నియుక్తసభ్యులు నియమింపవలయునని నిర్ణయించినచో సమంజసముగ నుండును. సరియైన ప్రాతినిధ్యము ప్రస్తుతము లేకున్నను, అట్లొనర్చినచో, మార్గాంతరము లెవ్వియుఁ గనుఁగొన వని తోఁచెడిని.

ప్రతినిధుల నెన్నుకొనుట కెవ్వరికి హక్కు నొసంగవలయునో యాలోచించెదము. అందఱికిని ఎన్నికహక్కు నొసంగుట (Universal Suffrage) భావ్యమని తలంచెదను. కాని కొందఱది అసంభవమని తలంపవచ్చును. అది అసంభవము కాదని నొక్కి చెప్పఁగలను. డెన్మార్కు, రష్యాదేశములందు అందఱికిని వోటిచ్చు అధికారము గలదు. అందఱును వోటు గల్గియున్నపుడే ప్రజాస్వామ్యపు నామము సార్థకమగును. కాని ప్రస్తుతపరిస్థితులందు దానిని మన మొక ఆదర్శముగ నుంచుకొని కృషి సల్పుట పురోభివృద్ధిసూచకము. అక్షరజ్ఞు లందఱికిని ఎన్నికస్వాతంత్ర్య మిచ్చిన మంచి దని కొందఱు విమర్శకులు వాకొనిరి. అట్లొనర్చిన 20 లక్షలమందికి నియోజకస్వాతంత్ర్యము ఇయ్యఁబడును. అట్లుచేయుట చాల అన్యాయ్యమని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కావున, ఆస్తిని పన్నును ఎన్నికస్వాతంత్ర్యలక్షణములుగఁ బరిగణింపవలయును.

21 సంవత్సరములవయస్సుగల్గిన ప్రతివ్యక్తియు (పురపాలసంఘపు టావరణములలో నివసించుచుండి గాని, లేక, పురపాలసంఘపు టావరణములో నొక వసతిగృహము గల్గియుండి గాని)

(1) సంవత్సరమునకు 5 రూప్యములకు తక్కువ కాకుండ గృహయజమానిగఁ గాని, లేక అద్దెయింటి నుండి పురపాలకసంఘపుపన్ను నిచ్చుచుండినను గాని లేక, (2) 10 రూప్యములకు తక్కువగాని లైసెన్సుపన్ను చెల్లించుచుండినను లేక, (3 సంవత్సరమునకు 500 రూప్యములకు తక్కువగాని ఆదాయముగల్గియున్నను, లేక, (4) శాసననియుక్తము లగుభారతదేశములోని లేక, యునైటెడ్‌కింగ్డమ్ లోని విశ్వవిద్యాలయములందు పట్టపరీక్షలో నుత్తీర్ణులయినను లేక (5) లా, వైద్యము, ఇంజనీరింగు మున్నగు పరీక్షలలో నుత్తీర్ణులయినను లేక, (6) వార్తాపత్రికల, మాసపత్రికల సంపాదకు లయినను లేక, (7) రిజిష్టరు కాఁబడిన కంపెనీల మేనేజరు లయినను, లేక, (8) బారిష్టర్లు అయినను లేక, (9) అటర్నీ లయినను, వోటిచ్చుటకు హక్కు గలవారై యుండవలయును. పైని జెప్పిన లక్షణములలో నొకటికంటె నెక్కువ నియోజకుఁడున్నను అట్టి నియోజకవ్యక్తి ఒకవోటుకంటె నెక్కువ నీయఁగూడదు. కాని పైని చేర్కొనిన ఆవశ్యకలక్షణముల నొకటికంటె నెక్కువ గల్గియున్న వ్యక్తి యితర నియోజకప్రదేశముల నియోజకహక్కును పొందవచ్చును. చెన్నపట్టణ పురపాలకసంఘపు టావరణములో నివసించువారికి పైఁ జెప్పిన మొదటి మూఁడు లక్షణములును వర్తింపదగవు. వానికి బదులుగ నీ క్రింది లక్షణములను వర్తింపజేయవలయును:—

(1) సంవత్సరమునకు 40 రూప్యములు పురపాలకసంఘపు పన్ను నిచ్చుచుండినను లేక, (2) 25 రూప్యములు లైసెన్సు పన్ను చెల్లించుచుండినను లేక, (3) ఆదాయపు పన్ను చెల్లించుచుండినను, వోటిచ్చుటకు అధికారము గల్గి యుండవలయును.

పురపాలకసంఘపు టావరణలో లేని ప్రజలకు నియోజకహక్కు నిచ్చు విషయమున ఆంధ్రరాష్ట్రీయసంఘమువారి తీర్మానము ననుసరించుట సమంజసము. ఆతీర్మాన మెద్ది యనఁ:—

10 రూప్యములకు పైగా శిస్తు చెల్లించు ఈనాందారులును, 10 రూప్యములకు పైగా శిస్తు చెల్లించు రైతువారిపట్టాదారులును, జమీందారురైతులును, వృత్తిపన్ను చెల్లించువా రందఱును, 5 రూప్యములకు పైగా ఇంటిఅద్దె నిచ్చువా రందఱును, శాసననియుక్తము లగు విశ్వవిద్యాలయములందు పట్టపరీక్షయం దుత్తీర్ణు లయినవారును వోటిచ్చుటకు అధికారము గలవారై యుండవలయును.

ఆంధ్రరాష్ట్రీయసంఘమువారు వాక్రుచ్చిన 10 రూప్యముల శిస్తుమొత్తమును 5 రూప్యములకు తగ్గించిన బాగుండును. న్యాయ

ఫైనలులో గాని మెట్రిక్యులేషన్ పరీక్షలో గాని జయము పొందిన వారు కూడ వోటును గల్గియుండునట్లుచేయుట యుక్తము. ప్రతి నియోజకుఁడు ఒక్కొక్క నియోజకప్రదేశమున నొక్కొక్కవో టిచ్చుటకే యధికారము కలదు. పెన్షను పుచ్చుకొనినగాని ఉద్యోగమును చాలించుకొనినగాని (Retired) కమిషన్డు లేక నాన్‌కమిషన్డు భారతసేనోద్యోగులుకూడ వోటును గల్గియుండవలెను. ప్రత్యేక ప్రాతినిధ్యపు ఎన్నికహక్కు గలవారు సామాన్య ప్రజలతో, పైనుదాహరించిన లక్షణము లున్నయెడల, సామాన్యపు ఎన్నికలలో పాల్గొనవచ్చును. కాని అట్లు రెండువిధముల యెన్నికహక్కు గల వ్యక్తి శాసనసభలో సభ్యత్వము నొందవలయునన్న తన జాతియొక్క ప్రత్యేకప్రాతినిధ్యస్థానమునకే నియుక్తసభ్యత్వము నొందవలయును. ఇట్లొనర్చిన జాతివైషమ్యములు తొలగి సమస్తజాతులును, కులములును, సఖ్యముతో నుండుటయే గాక యెన్నికసమయములం దేజాతియు నితరజాతులకంటె నెక్కువ లాభమును పొందనేరదు. ప్రత్యేక ప్రాతినిధ్యస్థానములు జాతీయతాభావమును పెంపొందఁజేయవు. ప్రత్యేకప్రాతినిధ్యము తప్పించుకొనుటకు వీలులేని శత్రువగుటచే ఇప్పుడొప్పుకొనవలసివచ్చెను. దీనిని శాసనసభయెన్నికలు రెండుసార్లు అయినతోడనే నిర్మూల మొనర్చుట యుక్తమును, శ్రేయోదాయకమును అయియున్నది

స్త్రీలకు నియోజకహక్కు నిచ్చువిషయమున సౌతుబరో సంఘమువారు ప్రతికూలాభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని సంయుక్తసంఘమువారీవిషయము నూతన శాసనసభాసభ్యులే తీర్మానింపవలయు నని సూచించిరి. కావున నూతన శాసనసభలు సమావేశమయినతోడనే స్త్రీలకు నియోజకహక్కు నిచ్చు తీర్మానములు తీర్మానింపవలయును. జాతీయమహాసభవారు స్త్రీలకు నియోజకహక్కు నొసంగవలయు నని తీర్మానించిరి. స్త్రీలు ఎన్నికలలో పాల్గొనుటకు ఘోషాపద్ధతి ఆటంకదాయక మని కొందఱు చెప్పవచ్చును. స్త్రీలకును పురుషులకును సమానము లగు హక్కులు పరిగణింపవలయును. వోటుగల ప్రతివ్యక్తియు వోటియ్యవలయు నని నిర్బంధము చేయు శాసనముల విధింపబోవుట లేదు. కావున ఘోషా స్త్రీలు తమపద్ధతి నతిక్రమింప నవసరము లేదు. వారి కిష్టమున్నచో వచ్చి యెన్నికలలో పాల్గొనవచ్చును. ఘోషా లేని స్త్రీలు వచ్చి వోటిచ్చుటకు అవకాశమును గల్పింపవలయును. అంతియ గాని స్వల్పసంఖ్యాక లగు ఘోషాస్త్రీలకొఱకు మిగిలిన స్త్రీజనమునకు నియోజకహక్కు నొసంగకుండుట అన్యాయ్యమును, అక్రమము హ్రస్వదృష్టి మున్నగువానిని వ్యక్తపఱచుటయే.

## సామ్రాజ్యశాసనసభ

మాంటాగూ సంస్కరణవిధానమున సామ్రాజ్యశాసనసభా సభ్యుల మొత్తపు సంఖ్య 100 కన్న నెక్కువ యుండ నక్కఱ లేదనియు, అందు 2/3భాగములు ప్రజా ప్రతినిధులే యుండవలయు ననియు సూచింపబడెను. సౌతుబరోసంఘమువారు 120 మంది సభ్యులుగల శాసనసభ చాలు నని సెల విచ్చిరి. కాంగ్రెసులీగు ప్రణాళిక 150 మంది సభ్యులు గల శాసనసభ నెలకొల్పవలయు నని కోరెను. భూలోకములోని దేశము లన్నిటికంటె చిన్నదై, స్వతంత్రరాజ్య మగుదేశము లన్నిటికంటె చిన్నదగు, స్వతంత్రరాజ్య మగు స్విట్జర్లాండు ప్రజాసంఖ్య 3,877,210. అట్టిదేశపు "నేషనల్ కౌన్సిలు"లో 187 గురు ప్రజాప్రతినిధులు గలరు 4. 875, 325 మంది ప్రజలుగల ఆస్ట్రేలియాదేశపు ప్రాతినిధ్యపుసభలో 75మంది ప్రజాప్రతినిధులు గలరు 46, 518, 481, మంది ప్రజలు గల యునైటెడ్ కింగ్డమ్‌లోని ప్రజలసభలో 707 మంది ప్రజాప్రతినిధు లున్నారు. ఇట్టిపరిస్థితులలో భారతదేశమునకు 100 మంది గాని, 150మంది గాని సభ్యులున్న శాసనసభ చాలునని నుడువుట వెఱ్ఱితనము కాదా!

సామ్రాజ్యశాసన సభాసభ్యుల మొత్తపుసంఖ్య అధమము 350 యైన నుండవలయును. ఇదియొక గొప్పసంఖ్య యని తలంప నవసరము లేదు. అందు 6,7 భాగములు (అనఁగా 300 మంది) ప్రజాప్రతినిధులై యుండవలయును. అప్పుడు ప్రజాప్రతినిధియు సుమారు 800,000 మంది ప్రజలపక్షమున సభ్యత్వము నొందును. ఇట్టి నియోజకగణము వైశాల్యము గాకపోయి నను సంకుచితము గాదు.

300 మంది ప్రజాప్రతినిధుల స్థానములు పోఁగా మిగిలిన 50 ప్రాతినిధ్యస్థానములు దొరతనమువారికి వదలివేయవలయును. అందు 9మంది దొరతనపుసభ్యులును (Exofficio members), 28 మంది దొరతనమువారినియామకాధికారసభ్యులును(Nominate dofficial members), 18 మంది దొరతనమువారి నియామకానధికారసభ్యులును అయి యుండవలెను.

ప్రజాప్రాతినిధ్యస్థానముల భారతదేశములోని వివిధరాష్ట్రములవారి కెవ్విధమున విభజింపవలయునో ఇప్పుడు యోజింతము. మాంటాగూ-చెమ్సుఫర్డు నివేదికమున 274 వ పేరాలో నీక్రిందివిధముగ ప్రజాప్రాతినిధ్యస్థానములు విభజింపఁబడెను:—

వంగదేశము 11, బొంబాయి 11, చెన్నరాజధాని 11, సంయుక్తరాష్ట్రములు 10, పాంచాలదేశము 7, బీహారు - ఒరిస్సా దేశములు 7, మధ్యరాష్ట్రములు 5, బర్మా 3, అస్సాము 2, ఢిల్లీ 1. మొత్తము 68.

ఈనిర్ణయ మేసూత్రము ననుసరించి చేయఁబడెనో తెలియకున్నది. రాష్ట్రముల ప్రాముఖ్యమును గాని లేక, వాని జనసంఖ్య గాని ఈవిషయము ననుసరించినటులు చెప్పఁబడలేదు, ఎట్లు ఆలోచించినను ఈనిర్ణయ మవ్యక్త మని చెప్పక తప్పదు. కేంద్రప్రభుత్వమున నిరంకుశాధికారమును స్థిరపఱుపవలయు నను దృఢాభిప్రాయముతో నెంతయో బహుజాగ్రత్తతో ఇట్టి అక్రమపు నిర్ణయ మొనరించినటులు కన్పట్టుచున్నది. తగినలెక్కలు సమయమునకు దొరకలేదనియు, అందుచే రాష్ట్రీయశాసనసభల విషయమును గురించి ఆలోచించుటకు వీలు లేకపోయె ననియు నుడివిన హైందవకార్యదర్శిగారికి క్లిష్ట మగు సామ్రాజ్యశాసనసభావిషయమును గుఱించి చర్చించుట కెట్లు అలవి యయ్యెనో యగ్రాహ్యము. ఈవిషయముపైఁ దమయభిప్రాయ మేల దెల్పవలసి వచ్చెనో?

సౌతుబరో సంఘమువారు ప్రజాప్రాతినిధ్యస్థానముల నీక్రింది విధమున భాగింపవలయు నని సూచించిరి:— వంగదేశము 13, బొంబాయి 12, చెన్నరాజధాని 12, సంయుక్తరాష్ట్రములు 12, పాంచాలదేశము 9, బీహారు ఒరిస్సా 9, మధ్యరాష్ట్రములు 5, అస్సాము 3, బర్మా 4, ఢిల్లీ 1. మొత్తము 80. సౌతుబరో సంఘమువారు మాంటాగూవిధానము సూచించినపద్ధతి ననుసరించుచు శాసనసభ్యుల సంఖ్యను కొద్దిగ నెక్కువఁ జేసిరే గాని ఈసమస్యను విశాలభావములతో గుర్తింపలేకపోయిరి.

ప్రజాప్రాతినిధ్యస్థానముల రాష్ట్రముల కెట్లు భాగింపవలయును? రాష్ట్రములు హైందవకేంద్రప్రభుత్వమువారికి తమ సంవత్సరపురాబడి (ఆదాయము)లో కొంతభాగ మిచ్చున ట్లేర్పఱుపవలయు నని మాంటాగూగారు తమవిధానమున నుడివిరి. అట్లు చేయుటవలన చెన్నరాజధానియు, సంయుక్తరాష్ట్రములు నెక్కువగ నష్టమును పొందును. అట్టి అసంబద్ధపు నిర్ణయము అన్యాయ్య మని వార్తాపత్రికలలో నిదివఱకే ప్రకటించి ప్రజల యసమ్మతి తెల్పబడెను. ఆవిషయమును గుఱించి నేను చర్చింపఁ దలచలేదు. కాని అట్టి నిర్ణయమే విధింపఁబడినచో సామ్రాజ్యశాసనసభలోని ప్రజాప్రాతినిధ్యస్థానమున నిండియా దొరతనమునకు రాష్ట్రము లిచ్చు చందా ననుసరించి విభజించుట శ్రేయోదాయకము. అట్లుచేసినచో ఈక్రింది విధముగ నుండును:—వంగదేశము 50, బొంబాయి 43, చెన్నరాజధాని 61, సంయుక్తరాష్ట్రములు 53, పాంచాలదేశము 29, మధ్యరాష్ట్రములు 13 బీహారు-ఒరిస్సాదేశములు 22, బర్మా 22, అస్సాము 6, ఢిల్లీ 1-మొత్తము 300.

నేను సూచించిన విభజనము న్యాయ్యము గా దని కొందఱు విమర్శకులు చెప్పవచ్చును. కాని మాంటాగూవిధానములోని నిరంకుశవిభజనముకన్నను, సౌతుబరోసంఘమువారి సూచనకన్నను వేయిరెట్లు బాగుగ నున్న దని చదువరులకుఁ దోఁపక మానదు.

చెన్నరాజధానివారి కిచ్చు 61 ప్రాతినిధ్యస్థానము లీక్రిందఁ బొందుపఱచిన విధముగ విభజించుట సమంజసము:—1. మహమ్మదీయులు 8, 2. జమీందారులు 1, 3. యూరోపియనువర్తకపరిశ్రమలవారు 2, 4. హైందవవర్తక పరిశ్రమలవారు 2, 5. హైందవక్రైస్తవులు 2, 6. చెన్ననగరము 1. 7. గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాటు, సేలం, కోయంబత్తూరు, తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, రామ్నాడు, తిరునెల్వేలి, మలబారు, దక్షిణకనరా—పైఁజెప్పఁబడిన ప్రతిజిల్లాకును ఇద్దరు ప్రతినిధుల చొప్పున పంపవలయును. 38. 8. కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము, నీలగిరి-ఈజిల్లాలు ఒక్కొక్క ప్రతినిధిని పంపవలయును. 5 9. గంజాము, విశాఖపట్టణము, గోదావరి మన్యములు కలిసి పంపు ప్రతినిధులు 2. మొత్తము. 61. (అంజెంగోను మలబారుతో కలుపవలయును.)

మాంటాగూ నివేదికయును, సౌతుబరో సంఘ నివేదికయును సామ్రాజ్యశాసనసభానియోజకులు ప్రస్తుతము అప్రత్యక్ష (indi, rect) పద్ధతి ననుసరించి యుండుట మంచి దనియు, ప్రత్యక్ష పద్ధతి నెలకొల్పుట చాల కష్ట మనియు వ్యక్తపఱచెను. కానిదూరదృష్టితో నీసమస్యను చర్చించినట్లు గన్పట్టదు. నవీనప్రజాస్వామ్యప్ర ఆదర్శమునకు అప్రత్యక్షపద్ధతి ఆటంకమై యున్నది. లంచము మున్నగు దౌర్జన్యపద్ధతుల నెక్కువచేసి ప్రజాహితజీవనము దుర్భరము గావించును. నిజమగు బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పవలయు ననిన ప్రజలకు ఎన్నికలు చేసికొనుపద్ధతిని నేర్పవలయును ప్రజ లప్పుడు రాజ్యాంగవిషయములందు శ్రద్ధను దీసికొనుట కుత్సాహముఁ జూపెదరు. కాన సామ్రాజ్యశాసనసభానియోజనములు ప్రత్యక్షపద్ధతి ననుసరించియే యుండవలయును. లేకున్న కీడును, నష్టమును వాటిల్లు నని వేఱుగ నుడువ నక్కఱలేదు.

మహమ్మదీయసోదరులకును, హైందవక్రైస్తవులకును తప్ప నితరుల కెవ్వరికిని ప్రత్యేకప్రాతినిధ్య మొసంగఁగూడదు. ఉత్తరభాగపు జమీందారులును దక్షిణభాగమువారును గలిసి యొక ప్రతినిధిని ఎన్నుకొనవలయును. పైని సూచించిన నియోజకలక్షణములనే ఈవిషయమునఁ గూడ వర్తింపజేయవలయును. క్లిష్టమగు నీవిషయముపై రాజ్యాంగనిర్మాణ మంతయు నాధారపడి యున్నది. కావున చెన్నరాష్ట్రీయు లెల్లరు నీసమస్యను సమదృష్టితో నవలోకించి నిర్ణయించెదరుగాక.

Infant's Nursing Association, Madras



శిశుపోషణసంఘము, చెన్నపురి



Ram Mohan Grandhalayam, Anantapur రామమోహన గ్రంథాలయము, అనంతపురము



The Telugu Medical Students, Royapuram ఆంధ్ర వైద్యవిద్యార్థులు, రాయపురము

Grandhalaya Sabha, Baruva



గ్రంథాలయసభ, బారువ

Vaisya Students' Association, Triplicane



వైశ్యవిద్యార్థుల సంఘము, తిరువల్లిక్కేణి

# ఛందోవిమర్శనము

పారనంది రామశాస్త్రి గారు

ఛందస్సులు వర్ణసంఖ్యానియమము గలవానికై చెప్పఁబడినవి. ఉక్తాఽత్యుక్తాదులు ఛందస్సు లిరువదాఱు. వీనిలో అనుష్టుప్ గాయత్రీ, జగతీ, మొదలగునవి వేదమంత్రములకును గలవు. అట్లే సంస్కృతరచనలందును పద్యములకుఁ గలవు. ఇవి పద్యరచనలకు మాత్రమే లోకమందు లక్షణములు. వ్యాకరణాలంకారశాస్త్రములు గద్యపద్యోభయరచనలకును లక్షణములు. కావున వ్యాకరణాలంకారములు వ్యాపకములు. ఛందస్సు వ్యాప్యము. వ్యాప్యమునకు సంకోచముండును. కాని వ్యాపకమునకు వ్యాప్యముకొఱకై సంకోచముండదు. వ్యాకరణాలంకారములలోను, అలంకార మైచ్ఛికము గావున నది లేనిచోట నైనను, వ్యాకరణము తప్పక యుండును. కావున వ్యాకరణమునకు విరోధించి యలంకారము గాని, ఆ రెంటికిని విరోధించి ఛందస్సు గాని ప్రమాణము కాఁజాలదు. ఇఁక సామాన్యవిశేషభావము, లేక ఉత్సర్గాపవాదభావము, అనునవి ఏకశాస్త్రమందే కాని భిన్నశాస్త్రములందు కావు. న్యాయ వ్యాకరణ మీమాంసాది శాస్త్రము లొకదానిచే మఱియొకటి పరాహతము కావు. వీనిలో నొకదానిలో మఱియొకశాస్త్రపు విషయమును గ్రహించునపుడా శాస్త్రసమయమును దప్పకయే గ్రహించును. కాని యాసమయమునకు విరోధించి గ్రహింపవు. ఒక్కశాస్త్రమే తనచేతనే సామాన్యముగా నిషేధింపఁబడినదానిని గ్రహింపవలసి వచ్చినప్పుడు వ్యవస్థాపూర్వకముగఁ దానే యంగీకరించును. చూడుఁడు. ప్రకృతమున ఛందశ్శాస్త్రమందే ఇంద్రవజ్రావృత్తలక్షణము "స్యాదింద్రవజ్రా యది తౌజగౌగ ఉపేంద్రవజ్రా జతజాస్తతో గౌ" అనుదానిలో నింద్రవజ్రకు మొదల రెండు తగణములు, పిమ్మట నొక జగణము, ఆపైని రెండు గురువులు నుండవలయు నని చెప్పఁబడినది. కాని యాలక్షణలక్ష్యవాక్యమందే తుదిగకారము గురువు కాలేదు. కావున నట్టిచోట "వా పాదాన్తే గురుస్స్యాత్" అనియాశాస్త్రమే పాదాన్తవర్ణమునకు గురుత్వము కావలసినచోఁ జేసికొనవచ్చు. అనఁగా భావింపవచ్చు నని చెప్పుచున్నది. శాస్త్రాంతరము కాదు. ఇట్లే సూక్ష్మదృష్టి నెల్లకార్యములను దెలిసికొనవలయును.

ప్రకృతము తెనుఁగురచనలకు సంస్కృతతుల్యవిషయములలో ఛందోఽలంకారవ్యాకరణములు సంస్కృతమునందలివే కాని వేఱు లేవు. ఛందస్సు లుక్తాఽత్యుక్తాదులే. అలంకారము లుపమోత్ప్రేక్షాదులే. గుణవృద్ధిహ్రస్వదీర్ఘాదులు సంస్కృతమునందుఁ జెప్పఁబడినవే. గురులఘుత్వాదులు భాదిగణములు ఛందఃప్రస్తారము గీత్యుపగీతి చంపకమాలాదివృత్తములు వానిలక్షణములును సంస్కృతమునందుఁ జెప్పఁబడినవే. యతిప్రాసములు నట్టివే. వీనివిషయమై "యతిప్రాసతత్త్వవిచార"మనుదానిలో విస్తరించి చర్చింపఁబడి యుండుటచేత నిచట నుపేక్షింపఁబడినది. యతి యనునది విరతి విరామాదిపర్యాయము. అది వృత్తములలో దానిగతికినిఁ జదువరులకును, విశ్రాంతి నిచ్చునట్టిదిగా నున్నది. ప్రాస మనునది యనుప్రాసపర్యాయమే కాని వేఱు కాదు. ఈ రెండును సంస్కృతరచనలనుండి గ్రహింపఁబడినవే. ఈ తెనుఁగు భాషలో గ్రంథరచన మారంభించినప్పుడు ప్రథమాచార్యుఁ డగు నన్నయభట్టారకుఁడు తనభారతారంభముతోడనే యీరచనకుఁ గావలసిన వ్యాకరణచ్ఛందోఽలంకారములను మూఁటిని సంగ్రహించి వానిలో వ్యాకరణవిషయము లధికము లగుటను వానింగూర్చి కొంత యధికముగను ఛందోఽలంకారములు సంస్కృత సంకేతసిద్ధములే యగుటను వానిని విస్తరింపక కావలసిన విశేషసంజ్ఞలను మాత్రమే, "ఇంద్రాద్యా అపిచ గణా వళిరాద్య మనన్తరాక్షరం ప్రాసః" అని మాత్రమే అతిగభీరాశయముతో నతిసంక్షిప్తముగఁ జెప్పి విడిచినాఁడు. అతనియభిప్రాయ మతనిభారతప్రయోగములను బట్టియు, ఆంధ్రశబ్దచిన్తామణి యను వ్యాకరణ శిరోమణిని బట్టియు స్పష్టమగును. గణముల కింద్రాదిసంజ్ఞలఫలము మాత్రము పిమ్మటి లాక్షణికులచే వివరింపఁబడియే యున్నది. వళిప్రాససంజ్ఞలకు ఫలము చెప్పఁబడలేదు. వాని నాలోచింప వళు లంగనల యుదరమందుండు చర్మపు ముడతలు. అవి వారికి శోభావహములు గా సహృదయు లగు సంస్కృత మహాకవులచే నంగీకరింపఁబడినవి. అవి భంగులని కాని, విచ్ఛేదము లని కాని చెప్పఁదగి యున్నవి. అవి యనేకములు గాని యొక్కటి కావు. అనేకములే శోభావహములు. అట్టి సమయము నెఱిఁగినవాఁడే కావున నీ మహాకవి యాద్యక్షరమందు "వళిత్వారోపణముఁ జేసి దాని కాసంజ్ఞను బెట్టినాఁడు. ఆ సంజ్ఞచేతనే వళికి బహుత్వము సిద్ధించుచున్నది. 'వళి' యనునది యత్యాదుల పర్యాయమే. కావున యతు లనేకములు గాని యొక్కటి కావు. ఇవి సంస్కృతవృత్తములందునుఁ గలవు. ఈ యతినియమము గలచోట్ల నెల్ల సంఖ్యానియమ మున్నది. వానిలో పద్యచరణాన్తవర్ణముచేత నొక విరామము తప్పక యుండును. చరణమధ్యమం దక్షరసంఖ్యయును దాని కనురూపముగనే నిర్ణయింపఁబడి యున్నది.

యతినిర్ణయము లేనిచోట్ల వృత్తగతిలో విరామములను మనము యథోచితముగఁ గల్పించుకొనవచ్చును. ఇఁకఁ ప్రాస మనునది అనుప్రాసపర్యాయమే కాని ఇతరము కాదు. కావున, అనుప్రాసమందు వ్యంజనమున కసకృదావృత్తి యలంకారశాస్త్రముచే సిద్ధ

పూర్వమే. కావున, దానికిని బహుత్వము సిద్ధించున ట్లా రెంటికిని 'వళి' 'ప్రాస' సంజ్ఞలచే నతిసంక్షిప్తముగ నలంకారవిషయమును గూడ సంగ్రహించి తన నిబంధన మగు నాంధ్రశబ్దచింతామణిలోఁ జెప్పిన "వళిరాద్య మనన్తరాక్షరం ప్రాసః" అనుదానిలో నాద్యాక్షర మనఁగా వర్ణసమామ్నాయములో నాద్యము లచ్చులు కావున విరామాది పర్యాయ మగు 'వళి' యచ్చుచేతనే యగు ననియు, ప్రాసము హల్లుచేతనే యగు ననియు నివి శబ్దాలంకారములే కాని వేఱు కా వనియు, నామహాకవి యభిప్రాయ మైనట్లు కానవచ్చుచున్నది. ఈ 'వళి'విషయమున నక్షరసంఖ్యానియమము సంస్కృతవృత్తములందువలెనే యీ తెనుఁగువృత్తములందును చెప్పఁబడినది. ఇది విరామమును జెప్పునదే కాని యొక యక్షరమును చెప్పునది కాదు. యతివిరామాదులు ధర్మములు. అక్షరములు ధర్ములు. కావున 'విశ్రమ' 'యతి'; అనునవి యక్షరము లెట్లగును? ఈ తెనుఁగు లక్షణములు పూర్వపు మహాకవుల యభిప్రాయమునకుఁ గొంత వేఱుపడుచు, ఆ లక్షణముల యభిప్రాయములకు, పిమ్మటి లాక్షణికులు గొంత వేఱుపడుచును, గ్రమమున నన్నయభట్టారకుని యభిప్రాయమునకుఁ బిమ్మటికవులును, లాక్షణికులు, నతిదూర మయినట్లు గాన్పించుచున్నారు. నన్నయభట్టునకుఁ దరువాత ద్వితీయాచార్యుఁడగు నథర్వణాచార్యుఁడు 'వళి రాద్య మనన్తరాక్షరం ప్రాసః' అను లక్షణవాక్యాభిప్రాయమును వివరించునట్లు దన వికృతివివేకమందు స్వస్వచరణేషు పూర్వః ప్రాస స్సర్వత్ర చైకవిధ స్యాత్ అనుదానిలోఁ దాను గొంత వేఱుపఱుచుఁ దనయభిప్రాయమును దెలిపిన ట్లున్నది. దీనిలోఁ స్వపూర్వపదగ్రాహ్యము లెవ్వియో? 'ఏక' 'ఏవ' అనఁగా నేమో? స్పష్టము కాదు. కాని సందర్భమును బట్టి పూర్వ మనఁగా వళిప్రాసములలోఁ బూర్వ మగు 'వళి' పద్యచరణములలో వేర్వేఱ నొక్కొక్కదానిలోనే, అనేకముగా నుండవలయు ననియును, ప్రాసము మాత్రము చరణములో నొక్కటియే కాని, యనేకములుగా వనియును, ప్రథమాచార్యుని వాక్యమందు స్త్రీలింగముచే గ్రహింపఁబడిన 'వళి' యనునది, విరామపదమే కాని వేఱు కాదు. కావున దానిని తెలుపుటకే తాను 'పూర్వః' అని పుంలింగముచే గ్రహించి చెప్పినట్లును దెలియఁబడును. పూర్వులు సంక్షిప్తముగాఁ జెప్పినవానికి వివరణములలోఁ బిమ్మటివారు కొంత తమయభిప్రాయమును చేర్చుచు వేఱుపడుటయును కలదు. అది యీవికృతివివేకమందే స్థలాన్తరములలో స్పష్టము. కాని ప్రకృతము కాదు. కావున దాని వివరణ మనవసరము. ఈ తెనుఁగుపద్యములలోఁ జెప్పఁబడిన యతిప్రాసములు వీనిలోని కాకస్మికముగా వచ్చినవి కావు. వీనికి ముందే సంస్కృతపద్యములందును, అంతకుముందే, వేదమంత్రములందును నిట్టివి కానవచ్చుచునే యున్నవి. చూడుఁడు కొన్ని మంత్రములు:—

అగ్న ఆయూగ్ంషి పవసు, ఆసువోర్జ మిషం చ నః, ఆరే బాధస్వ దుచ్ఛునాం: అగ్నే పవస్వస్వపా, అస్మే వర్చస్సు వీర్యం॥ (2) గణానాం త్వా గణపతిగ్ం హవామహే, కవిం కవీనా ముపమశ్రవస్తమం (3) ఇమ మగ్న ఆయుషే వర్చసే, కృధి ప్రియగ్ం రేతో వరుణసోమ (4) ఇమం మే వరుణ, శ్రుధీహవ మద్యాచ మృడయ (5) ఉద్యన్త మస్తంయన్త, మాదిత్య మభిధ్యాయన్. ఇంతయేల? ఛందస్సన నేమో యెఱుఁగని పసులకాపుల పాటలందును ఆఁడువారి మాటలందును, ఇట్టి సంఘటనమున్నది. చూడుఁడు పాటలు (1) ఎర్రన్న ఎర్రన్న, ఏపూరియెర్రన్న, జేగూరు ఎర్రన్న, గులివిందయెర్రన్న గుడ్డు యెర్రన్న (2) చలిచలి చామక్క, కుంపటి పెట్టె కూర్మక్క (3) తెగ మండె తెగ వేమి నిగమాని తినమా (4) దిగుదిగు నాగన్న, దివ్యసుందరనాగ— ఇట్టి వనేకములు గలవు. ఇకను ఆఁడువారిమాటలు చూడుఁడు. అకు, అలము; అల్లము, బెల్లము; ఇల్లు, పొల్లు; ఈత కోల; ఊసు గూసు; ఎంతో కొంత; ఓరు, పారు; కర్ర కంప, గొడ్డు గోద 'గాదె, గంప' నల్ల, పుల్ల' 'చాప, చట్ర' చీకటి చిట్ట, చెట్టు, చేమ' 'జాలి, నీతి' 'తీతము, నాతేము, డబ్బు, డవాలు' 'తట్ట, బుట్ట, 'తిండి, తిప్పలు' 'దాత, దైవము 'బట్ట, పాత, బీద సాద బుగ్గి బూడిద 'మన్ను, మిన్ను 'మందు, మాకు' 'మేడలు మిద్దెలు' ఈ మొదలగునవి అనేకములు లోకమందును నాటకలోఁ గాన్పించుచున్నవి. అనాది యగు శబ్దబ్రహ్మమునకు రెండు విధముల నాహ్లాదకత్వ ముండును. అందు మొదటిది శ్రోతలకు వినినపోడనే శ్రవణరంజన మొనర్చును. దీనినే శబ్దరంజన మందురు. శబ్దాలంకార మని యాలంకారికు లిట్టిదానినే చెప్పినారు. రెండవది యర్థముయొక్క పర్యాలోచనవలన సహృదయులకు హృదయరంజన మొనర్చునది. ఇది యర్థాలంకారము. ఇట్టి యాహ్లాదకత్వము వాఙ్మయమునకు స్వాభావికమగు ధర్మము. కావుననే వేదములనుండియు నవి సహజములై వచ్చుచున్నవి. అట్టిదానినిఁ జూచియే రచనలకు సొంపుగాఁ గవులును బెట్టికొనినారు. లాక్షణికులు యతిప్రాసము లని చెప్పినారు. ఇట్టి వర్ణావృత్తి, నిర్ణీతస్థలమందే కాదు. ఎచ్చటవచ్చినను రంజకమే! ఇట్లుండ వీనిని గుఱించిన లక్షణములను కొంత విచారింపవలసినదిగా నున్నది.

కవిజనాశ్రయము. సంజ్ఞాధికారము:— క. అనవద్యకావ్యలక్షణ, మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియ రే, చన సుకవి కవిజనాశ్రయ, మనుఛందముఁ దెనుఁగుబాస నరుదుగ జెప్పెన్. అని మల్లియ రేచనకవి, ఈ ఛందస్సును జెప్పిన ట్లున్నది. ఇంక ననేక పద్యములలో మల్లియరేచనను సంబోధించి చెప్పఁబడియున్నది. దీనివలన నీకృతికర్త తన్నుఁ దానే కృతిపతిఁ గాఁ జేసికొని తన గుణోత్కర్షమును తానే పొగడికొనుచుఁ దనపేరనే యీకృతిని రచియించి యుండునా? లేక ఇంక నొక మల్లియ రేచన కలఁడా? అని సందేహము. బీజాక్షరప్రసంగము:— దీనిలో అకారాదులు హ్రస్వము లైదు, దీర్ఘము లైదు, ఏకారాదు లైదును, నొక్కొకవర్గముగాఁ జేసి వ్రాయుము మని చెప్పెను గదా! ఇది సంస్కృతమునందలి వర్ణసమామ్నాయములోనా? తెనుఁగునందా? సంస్కృతమున దీర్ఘ ఏకారము లేదు. తెనుఁగున ఏకారాదు లాఱు గాని యైదు గావు. దానిలో దేనిని విడువవలయునో చెప్పలేదు. వళ్లు క. 'విశ్రాన్తి' 'విరతి' 'విశ్రమ' 'విశ్రామ' 'విరామ' విరమ, విరమణ, యతి, అని మాత్రము చెపి

క. చరణాద్యక్షర మే వడి, అని చెప్పెనుగదా! మీఁది పర్యాయములలో, వడిని చెప్పకయే, దానికి లక్షణమును జెప్పుట సంగత, మెట్లగును? మఱియును 'చరణాద్యక్షర మే' అనుదానిలో ఏవకారాద్యర్థక మగు ఏకారముచే వ్యవచ్ఛేద్య మెద్ది? ముందుఁ దానే చెప్పఁబోవు పద్మ, చంద్రశ్రీ, మదనదర్పాది వృత్తచరణములలో పదవ, పదునొకండవ, తొమ్మిదవ యక్షరము మొదలగునవి యతులుగాఁ జెప్పుచు దానినే, నిషేధించినాఁడా? అయినచో వక్తవ్యనిషేధము, నిషిద్ధవిధానము సంగత మగునా? వ్యవచ్ఛేద్యము లేదన్న పక్షమున నేకారము నిరర్థకము కాదా? ఛందస్సిద్ధియే ప్రయోజన మన్నచో ఛందశ్శాస్త్ర కర్తకే ఛందస్సు కుదురక నిరర్థకపదములు పెట్టుకొనవలసినచో నట్టి లక్షణము, లక్ష్యముల కెంతవఱకు ప్రమాణ మగును?

## యతిభేదములు

౭౨-వ పద్యములో స్వర, వర్గ, అఖండ, ప్రాది, బిందు, ప్లుత, ప్రయుక్తాక్షర, ఎక్కటి, పోలిక, సరస, అని యతులు పది చెప్పఁబడినవి కదా. వీనిలో అఖండ, ప్లుతములు స్వరములే కావా? వానిని వేఱుగఁ జెప్ప నేల? వర్గయతి స్వరప్రాధాన్యమే కావలసినప్పుడు అది స్వరయతి యేల కాదు? వర్గాక్షరముల కన్నిటికిని పరస్పరము ప్రాప్తించుచుండ నంతిమాక్షరముల నిషేధింప నేల? పూర్వపు మహాకవులు వానికి విశ్రమము చేయలేదా? ఇతఁడు వానిఁ జూడనిచో నవి లేకపోవునా? తానే గీ. ఙాపు వడి చెల్లు రత్నకంకణ మనంగ, ఞాపు వడి చెల్లు బర్హిపింఛం బనంగ, ణాపు వడి చెల్లుఁ గనక మంటప మనంగ, నాపు వడి చెల్లు దివ్యగంధం బనంగ, మాపు వడి చెల్లు విజితశంబరుఁ డనంగ. అని చెప్పియున్న దానిలో ఙ, ఞ, ణ, న, మ, లకు క, చ, ట, త, ప, లతో విశ్రమము లేదా? సంయుక్తాఽసంయుక్తముల విశ్రమముచేతనే ఇది యును సిద్ధించుచుండ దానిని నిషేధింప నేల? మఱల దీని కొక లక్షణము చెప్పికొన నేల? అచ్చటి యనుస్వారమునకు, అనుస్వారస్య యయి పరసవర్ణః ("పా. సూ. ౮-౪-౫౮") అఙ్కితః, అఞ్చితః, కుణ్ఠితః, శాన్తః, గుమ్ఫితః అని యున్నట్టి పాణిని శాస్త్రవిధానముచేత ఙ, ఞ, ణ, న, మ, లే సంధికాలమున నిత్యముగఁ బ్రాప్తింపఁగా నవి సంయుక్తాక్షరములే యగుచున్నవి. అప్పుడు 'ఙ్క'లోని కేవల 'ఙ' కారమునకు, 'ఙ్క' సంయుక్తముతోను, 'ఞ' కారమునకు 'ఞ్చ' సంయుక్తముతోను, అట్లే కేవల ణకారమునకు 'ణ్ట' సంయుక్తముతోను, 'నకారమునకు' 'న్థ' సంయుక్తముతోను, మకారమునకు 'మ్ప' తోను, విశ్రమము సిద్ధించును. అట్లు సిద్ధించుచుండఁగ, పాణినీయమర్యాద నెఱిఁగియో యెఱుఁగకయో దాని నతిక్రమించి లక్షణాన్తరమును కల్పించుట శాస్త్రమునకు శరీరకృతగౌరవదోషావహమే కాని లాభకరముగాదు. ఈ 'ఙ్కా' వడిని గూర్చి లక్షణకర్తలందఱు నిట్లే భ్రమించినట్లున్నది.

అఖండయతి—

ఉ. మానుగ విశ్రమాక్షర సమన్వితమై స్వర మాఁదివన్ దడీ, యానుగుణాక్షరంబె కొనిరైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్, భాను సహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై, భూనినచో నఖండయతి పొల్పగు సాదికవిప్రసిద్ధమై — అని యున్న దిక దా? ఇచట విశ్రమాక్షర మనఁగా విశ్రమమం దైన యక్షరమా? విశ్రమమైన యక్షరమా? ఎట్లు చెప్పినను చరణాద్యక్షరము సిద్ధించునా? దానియందు స్వర మాఁదినదా? లేదు కదా? ఇఁక నాద్యక్షరము కాక 'వృషభాధిపుఁడు' అనుదానిలో 'భా' అయినచో నుత్పలమాలకుఁ దొమ్మిదింటను గదా విశ్రమము? అప్పుడు తొమ్మిదవది 'ష' కాని 'భా' యెట్లగును? విశ్రమము తొమ్మిదింటనే చెప్పి యక్షరావృత్తి పదింట నన్నచో నాయర్థము దేనివలన సిద్ధించును? విశ్రమపద మొక్కటియే రెంటినిఁ జెప్పునా? అది యెట్లయినను పదవయక్షరము చరణాద్య మెట్లగును? దానికి చరణాద్యత్వము లేక విశ్రమత్వ మెట్లు సిద్ధించును? అట్లుకాక చరణాద్యక్షరత్వ మనఁగా, చరణాదిస్థితాక్షర సదృశాక్షరత్వ మని చెప్పి విశ్రమత్వము సంపాదించినచో 'భాసి' అనుచోట నాలవ 'భా' కును విశ్రమత్వ మెట్లు తప్పించుకొన నగును? తదీయానుగుణాక్షరంబె— అనుచోట తదీయ మనఁగా విశ్రమాక్షరీయమా? స్వరీయమా? ఎట్లయినను మఱల 'ననుగుణ' అను విశేషణ మేల? తదీయము తదనుగుణము కాదా? తదీయానుగుణాక్షరంబె కొనిరైనను జెప్పఁగ నొప్పు, అనుటచేత, అనుగుణము కాని యక్షరము నైనను కొని చెప్పవచ్చు ననియే కదా! అప్పుడు రెండు ప్రకారములు సిద్ధించుచుండ నొకదానికే యుదాహరణ మిచ్చి రెండవదానికి ఊరకుండవచ్చునా? 'ఇటు లర్థయుక్తమై' అనుచోట నీ యఖండయతిలో మాత్రమే పద మర్థయుక్తము కావలయును గాని తక్కినచోట్ల నక్కఱలేదా?

మఱియు, ౭౧ క. చరణంబు ద్వితీయవర్ణ సమితియె ప్రాసం। బరయఁగఁ బ్రాసం బొక్కటి అని చెప్పెను గదా! దీనిలో చరణముల ద్వితీయవర్ణము లన్నియు నొక్కటై యుండవలయు ననిక దా యభిప్రాయము. ౭౩ క. అ ఆ ఐ ఔ లకు మఱి, ఇ ఈ లు ఋకార సహితము ఏలకు నా, ఉ ఊ లుత్వములో నొడఁబడి, ఒ ఓ లకు వళ్లగు। స్నా రోన్నతచరితా. అను దీనిలో చరణములలోని ద్వితీయాక్షరములు 'అ, ఈ, ఊ, ఓ, ఇవియే కదా! అవి యొక్కటి యెట్లగును? కాక ప్రాసము లెట్లగును? వాని కొకప్పుడు స్వరత్వముచే నైక్యమైన పక్షమున వ్యంజనములకు నట్లే వ్యంజనత్వముచేత నన్నిటికి నైక్యసిద్ధిచేత ప్రాసత్వము సిద్ధింపరాదా? మఱియు నిచటి 'అ, ఈ, ఊ, ఓ'లకు ప్రాసముకొఱకు నైక్యము సిద్ధింపఁగ నట్లు విశ్రమముకొఱకు నైక్య మేల సిద్ధింపదు? ఈ పద్యమందు ప్రాసము వివక్షింపఁబడ దన్నచోఁ దక్కిన మఱికొన్నిచోట్ల నట్లే యేల యంగీకరింపరాదు? లక్షణకర్తలకు లక్షణము తప్పుట దోషము కాదా? లేక వారికి స్వవిరోధమే లక్షణమా? ఇఁకఁ బ్రాసములు:—

౭౦ క. స్వఃకాన్తా సమయోషిదు। రఃకృతరతిచిహ్న దుష్కర ప్రాసం బౌ, నిఃకృతమగు నిట్లు సుపుత్రః కులదీపక యనంగఁ దగుచు మహాత్మా అని చెప్పెను. దీనిలో కకారము ప్రాసాక్షరము. దీని రెండవ చరణములో దుష్కర, అనుచోట వచ్చిన షత్వము మూఁడవ చరణములో 'అనిఃకృత' అనుచోట నేల రాలేదు? దీని

ఈ లక్షణకర్త తెలిసి యుండునా? తెలియఁడా? తెలిసియుఁ జేయనిచో వంచన మగును. తెలియక చేయనిచో నది మన కెట్లు ప్రమాణ మగును? ఈతనికిఁ దెలిసినను, దెలియకున్నను నది యేల రాకుండును? ఈతనికి సంయుక్తాఽసంయుక్త ప్రాసాంగీకారభీతి కలిగి నట్లే యీ మకారమునకును గలిగి రాలేదా? ఇట్లే మఱికొందఱు లక్షణకర్తలు తమ మనస్సులలో నుండు భీతిచే కొన్ని వర్ణములకు మైత్రివిరోధములను గల్పించియున్నారు. ఈ రెండును తప్పులలోఁ దక్క, తప్పులలో నొక్కత్రోవనే త్రొక్కియున్నారు. ఇది మిగుల నాశ్చర్యము. ఈ కవి మీఁది 'స్వఃకాన్తా' అను పద్యములో దుష్కర ప్రాస మని చెప్పియున్నారు. అతఁ డెట్టి యభిప్రాయముతోఁ జెప్పెనో కాని, అవిఃకృప అను రూపమును దుష్కరమైన దానినిఁ దాను చేసిన వాఁడు కావున నది దుష్కరప్రాసము కావచ్చును.

౧౪౦ క. ఇప్పాటఁ దొల్లి పింగళు। చెప్పిన క్రియఁ దప్పకుండఁ జెలు వలరంగాఁ। జెప్పఁబడె వర్ణ ప్రాసలు। తప్పక యర్థసమవృత్తతతి విదితము గాన్ అని యున్నది. పింగళుఁ డనఁగాఁ బింగళ నాగాచార్యుఁడేనా? కాఁడా? అయినచో నాతఁడు తెనుఁగున ఛందస్సును జెప్పెనా? కానిచో నెవ్వఁడు? ఆతని ఛంద స్సెద్ది? (అన్యోన్య విరుద్ధభాషణము లాడెనః" (భా. ఉ. ౧ ఆ.) అనుచోట) న్యోలాఁల లోని ఓకారాఽకారములకు విశ్రమము చేయఁబడియున్నది కదా! అది యీతనికిఁ దెలియునా? తెలియదా? తెలిసినచో దానికి లక్షణ మెవ్వటఁ జెప్పినాఁడు? తెలియక చెప్పినచో నంతమాత్రమున, ఆ విశ్రమము తప్పగునా?

౭౬ క. దీనిలో 'సుకరప్రాస, అనుప్రాస, దుష్కరప్రాస, అంత్యప్రాస, ద్విప్రాస, త్రిప్రాస' లని యాఱువిధములను జెప్పినాఁడు. చతుఃప్రాస మనునది యింకొకటి కానవచ్చుచున్నది కదా! అది యితనికి సమ్మతమా? కాదా? అయినచో నేల చెప్పలేదు? కానిచో నది తప్పగునా? మఱియుఁ దక్కిన భేదముల, కుదాహరణ మిచ్చుచు, రెండవదే యగు ననుప్రాసమున కుదాహరణ మేల యియ్యలేదు? ఇట్లు మొదటివా రొకదానిని చెప్పక విడువఁగాఁ బిమ్మటివారు చెప్పినప్పు డది మొదటివారికి విరుద్ధ మగునా? కవిజనాశ్రయ మిట్లున్నది.

తాతంభట్టు సులక్షణసారము:— క. లక్షణ శాస్త్రము లెల్లఁ బరీక్షించుటఁ గొంతకొంత యెఱిఁగినవాఁడన్। లాక్షణికానుగ్రహత ను। లక్షణసారము రచింతు లక్ష్యము లమరన్ దీని మూఁడవ చరణములో ధర్మార్థక మగు 'అనుగ్రహ' పదముపైని మఱల నొక ధర్మార్థకము 'త' చెప్పినాడు గదా! అది ప్రమాద మనవలయునా? ఎట్లయిన సమర్థింపవలయునా? టీక—అనుగ్రహతన్=దయచేత, అని. ఇతని యభిప్రాయ మెట్లు? ౪౨ పుట.

సీ. ఖాకును కఖగఘల్ చఛజఝల్ శమసలు,' విశ్రమస్థానాక్షరమైత్రి, అని చెప్పెను. కవిజనాశ్రయుఁ డీమైత్రిని చెప్పలేదు. ఆతని తప్పిదమా? ఇతని తప్పిదమా? మైత్రి సావర్ణ్యమేనా? కాదా? అయినచో సవర్ణముల కెల్ల విశ్రమము చెల్లు నని లఘుతరలక్షణముఁ జెప్పక గురుతర మగు ప్రత్యేకలక్షణ మేల చెప్పవలయును? సావర్ణ్యము కానిచో వానికి మైత్రి దేనినిబట్టి? మఱియు దీనిలో యతుల కివి లక్షణము లగునా? ఇతనికి లక్షణస్వరూపములకు భేదము లేదా? ఇది సంయుక్తాక్షరవిశ్రమమే అయ్యుండ వేఱుగఁ జెప్ప నేల? చెప్పవలసినచో 'క్ష, క్ర' మొదలగువాని కెల్ల నేల చెప్పలేదు? యతిభేదములు. ౪౪ పుట. సీసపద్యము రెండవ చరణములోఁ 'జక్కటియతి, అనుస్వరయతి' అని చెప్పెను. అనుస్వరమా? అనుస్వారమా? అది సంజ్ఞ కాదా? హ్రస్వములను దీర్ఘములుగను, దీర్ఘములను హ్రస్వములుగను జేయుట ఛందోలక్షణమా? కాక పద్యమునకు ఛందస్సు కుదురక చెప్పుటా? కవిజనాశ్రయుఁడు యతులు పది యనియే చెప్పెను. ఇతఁడు ముప్పదియొక్కటి చెప్పెను. ఇంక నప్పకవి 3 ఆశ్వా. లో ౬౭, ౬౮, పద్యములలో 'భీమన పది, అనంతుఁ డిరువదినాలుగు, మఱికొంద ఱిరువదియేడును జెప్పియుండఁ దాను నలువదియొకటిఁ జెప్పుచున్నా' నని చెప్పెను గదా! అట్లే పూర్వకవుల లక్ష్యములను బట్టి మఱికొన్నిఁ జెప్పువారికిఁ దప్పిద మెట్లగును? అట్లే అ, ఆలకు, ఏ, ఔలతో వలెనె, మఱికొన్ని యచ్చులతో విశ్రమమును, ప్రాచీనమహాకవులు చేసియుండ వానినిఁ జూచియో, చూడకయో ఈ లక్షణకర్తలు చెప్పకుండుట యది లక్షణముల లోప మగునే కాని విద్వన్మహాకవుల ప్రయోగముల తప్పిదము గాదు. (౯౦ పుట) క. పొలుచ్ పుఫుబుభులకు మఱి। పోలిక యతి శిల ముల్లమున కెన యనఁగా। శిలం బుల్లం బనఁగా। భూలోకం బమరలోకమున కెన యనఁగన్ అని చెప్పెను. పుఫుబుభులకు 'ము'తో పోలిక అయినట్లు పఫబభలకు 'మ'తో పోలిక యేల కాదు? ౯౨ పుట. తే. స్వరము తుదనుండి లుప్తవిసర్గకోత్వ మైన స్వరవిరామంబు దాసోఽహ మనఁగ నచ్యుతాశ్రితు లర్థి వన్యోన్యమిత్రులన ముకుందుఁడు విమలయశోర్థి యనఁగ. దీనిలో 'దా, సోఽహం. అ, న్యోన్య య, శోర్థి, అను వానిలో 'ఓకారముతో ఐ అకారముల కయినది లుప్తవిసర్గకోత్వవిరామ' మని చెప్పెను గదా? అచ్చట విసర్గలోప మెట్లు? దానికే లోప మయినచో, దానింబట్టియే విసర్జనీయస్య సః, అను పాణినివిధానముచే రావలసిన 'స' కారము దేనికి వచ్చును? నిమిత్తమే లోపింప నైమిత్తిక కార్యము లెట్లగును? ఇది పాణిని సమ్మత మేనా? సకారమునకే ప్రాప్తి లేక దానికి 'రు' ఎట్లు? 'రు' లేక దానికి, 'ఉ' ఎట్లు? ఆద్గుణః అను పాణిని సూత్రముచేనైన గుణ మెట్లు? గుణములేక ఓత్వ మెట్లు? అట్లే వచ్చినచో "హేరామ అత్రాఽగచ్ఛ" అనుచోట 'రామ' అను సంబుద్ధికి 'సు'లోపము వచ్చినను, బిమ్మటికార్యము లన్నియును కాఁగా 'హేరామో అత్రాఽగచ్ఛ' అని కావలయును. అట్లగునా? కాదు. కావున నిది 'లుప్త విసర్గకోత్వము' కాదు. లుప్తవిసర్గకోత్వ మనఁదగును. అది గుణయతి యని చెప్పక యిట్లేల శ్రమపడవలయునో తెలియదు. పడినను ఫలము లేదు. ఇట్టివి అ ఆలకు ఏఏలతోను, ఒఓలతోను జేయఁబడినవి గుణయతులు. ఇ, ఈలతోను, ఉఊలతోను జేయఁబడినవి గుణావయవయతులు. అట్టివి భారతాది ప్రాచీనగ్రంథములలో ననేకములు గలవు. అట్టిచోట్ల

ఏమ్మటి కేవలకవు లవి తప్పులని భ్రమసి యాచోట్ల నశాస్త్రీయములు నసర్థకములు నప్రసిద్ధములు నగు పదములను బెట్టి ప్రాచీన విద్వన్మహాకవుల సమయమును భ్రంశము నొందించుచు వారి గ్రంథముల కప్రామాణ్యము నాపాదించుచున్నారు. ప్రాచీనకవుల ప్రయోగములు వానికిఁ జేసిన దిద్దుపాట్లు వాని కీ సంస్కర్తల వారిఁ బడక యెట్లో తప్పి యున్న మహాకవి ప్రయోగముల సాక్ష్యమును ముందుఁ జూపఁబడును. అ, ఆ,లకు కంఠ్యతాలవ్యములగు ఏ, ఐ,లలో మొదటిదానిని విడిచి రెండవ దగు 'ఐ'తోను, కంఠ్యోష్ఠ్యములగు ఓ ఔ,లలో మొదటిదానిని విడిచి పై ఔతోను విశ్రమము కావచ్చునఁట! మొదటి వానితోఁ గారాదఁట!

— అప్పకవీయము. 3 ఆశ్వా. ౧౨౩ పుట. యతిభేదములు. క. స్వరయతులు వ్యంజనాక్షర, విరతు లుభయవళులు ప్రాసవిశ్రాంతులు నాఁ, బరికింప నాల్గుదెఱఁగుల, విరమణములు వఱలుచుండు విహగతురంగా. అని యతిసామాన్యము నాల్గువిధము లని చెప్పినాఁడు. కాని యతిసామాన్యవిభాజకములు స్వరములు, వ్యంజనములు రెండే కావున స్వరయతులు, వ్యంజనయతులు, అని రెండు విధములే యగును. అవాన్తరభేదములు విశేషములలోఁ గాని సామాన్యములలో గణనీయములు కావు. అట్లు చెప్పుట ప్రమాదము. [3 ఆశ్వా. ౫౪.] సీ. విజ్ఞానమునకు భావింప విన్నాణంబు విజ్ఞాపనమునకు విన్నపంబు, సంజ్ఞకు సన్న యజ్ఞమునకు జన్నంబు నాజ్ఞప్తి కానతి యాజ్ఞ కాన, అని యిటు సంస్కృత వ్యవహార మధ్యావసానంబుల ద్వితీయ సరళమునకు, నడుగునఁ గల తాలుజానునాసికములు తద్భవంబున ద్రుతత్వంబుఁ గాంచి తే. వెలయుటను తద్భవవ్యాజ విశ్రమమున, జరిగి నణలకు రెంటికి జ్ఞా తనర్చు, జ్ఞాని చేతోంబుజాత త్రో, ణకర యనఁగ, జ్ఞాతి విద్వేషినృపనాశ, నకర యనఁగ. ఇచట నొక పెద్ద ప్రమాదము గాన్పించుచున్నది. మీఁది పద్యములోని విన్నాణ, విన్నప, సన్న, జన్న, ఆనతి, ఆన, అను నీపదములు తద్భవములగును. గాన వానిలో నకారమును తద్భవమే. అట్టిదానితో 'జ్ఞ'కుఁ జేసినది తద్భవవ్యాజవిశ్రమ మన్నచో నగు నేమో? కాని యప్పుడైనను నవి తద్భవములే యయ్యుండ వ్యాజమేల? ఉదాహరణములో జ్ఞాని, జ్ఞాతి, పదములలోని, 'జ్ఞ'యు, త్రోణ, నాశన, పదములలోని 'ణ నలును, సంస్కృతీయములే కాని, తద్భవీయములు కావుకదా! కాక వాని కావే రెట్లు సంగత మగును? దీనిని 'తద్భవ' అనక కేవలము వ్యాజవిశ్రమ మన్న బాగేమో? ఏదో యొక వ్యాజముచేఁ జేయఁబడిన దని. మఱియు "జ్ఞ" ఇది కచ, వర్గముల యనునాసికల సంయోగము. దీనిలో మొదటిదగు 'జ' లేఖకుల ప్రమాదముచే వ్రాఁతలలో దాని కంఠస్థానమం దుండు అడ్డుగీత క్రమక్రమమునఁ గొంచెము వంకరగాఁ గ్రిందికిని మీఁదికిని వ్రాయుచు రాఁగా తుద కప్పుకవినాఁటికే యది 'జ'గా మాఱి యుండును. దానియాకారముఁ జూచి 'జ' కారముగాఁ దలఁచి లక్షణ మట్లు చెప్పినట్లున్నది. లాక్షణికు లందఱు నట్లే 'జ్ఞా' వడి యనియే చెప్పుచున్నారు. కాని 'దీనిని వేఱుగఁ జెప్పనేల? సంయుక్తాక్షర యతియే యగు,' నని ఎవ్వరును తలంపరు. ఇది ఘంటాకర్ణుని ప్రథమ బోలి యున్నది. ఈకల్పనకుఁ గారణ మాలోచింప వర్గాన్త్యానునాసికములు తమలోఁ దామే కాని తమవర్గపు పూర్వాక్షరములతో విశ్రమము కారాదని యొకచోట లక్షణముఁ జెప్పుకొనుటచే మఱల దీనిని వేఱుగా విశేషవిధిగాఁ జెప్పుకొనవలసినట్లున్నది. 'జ్ఞ'కు, కవర్గీయములతోడను, చవర్గీయములతోడను గూడ విశ్రమములను పూర్వకవులు చేసియున్నారుగదా. భారతము శాంతి. 3-వ ఆశ్వా. ౨౬౮. ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రుల నోర్చి- "తవర్ణముతో" క. నానాత్వైకత్వమ్ముల జ్ఞానాజ్ఞానజముల నపజయమంద్రు బుధుల్ [౪ ఆశ్వా. ౨౭౭.] దీనిలోఁ జకారముతోను, క. జ్ఞానము గేవలకృప నజ్ఞానికి నుపదేశ విధి ప్రకారము. [౭౫౫.] దీనిలో కాతోను. క. జ్ఞానంబు వడయుటకు వా జ్ఞానపములు నునియతములు గా వింతురు. విజ్ఞానంబున నాత్మనియతి నల్పుదురు బుధుల్. "దీనిలో 'గా'తోను, 'ప'తోను జేయఁబడినదిగదా ? అవి బిందుపూర్వములును గావు. 'జ్ఞ'లోని మొదటిది కవర్గీయముఁ 'జ'కాని 'జ, కాదు. అయినచో రెండును చవర్గీయములే. కావునఁ కవర్గీయముతో విశ్రమ మంగీకరించినట్లు చెప్పక తప్పదు. వర్గాన్తరీయముతోనే యంగీకరించినప్పుడు స్వవర్గపూర్వాక్షరములతోఁ గూడ దనుట యసంగతము. అనుస్వారపూర్వకమైనది యనునాసికమునకు విశ్రమ మగు ననునది, స్వరూపముగాని లక్షణము గాదు. అనుస్వారపూర్వకములు గానివియు, అయ్యన్నివియు భారతమందుఁ జూపఁబడియే యున్నవి. అయిన నిట్లు చెప్పుట కభిప్రాయ మాలోచింతము. వాని కనునాసికత్వము సంపాదింపవలయు నన్నట్లు గానవచ్చుచున్నది. అనుస్వారవిసర్గములు పూర్వాక్షరముల కన్త్యావయవములు గాని పరాక్షరమునకు పూర్వావయవములు గావు. అనుస్వారవిసర్గల పూర్వవర్ణములు గురువులుగాని పరవర్ణములు కావు. కావున ననుస్వారము దేని కవయవమో దానికే యనునాసికత్వమును సంపాదింపఁగలదు గాని పైదానికిఁ గాదు. ఇదియును 'విశ్రమస్థాన మొకటి, విశ్రమాక్షరము మఱి యొకటి' యని చెప్పినట్లే యున్నది. ఒకప్పు డనుస్వారము ద్రుత మగు నన్నచో నది పరవర్ణముతో సంశ్లేషము నొందును. అప్పుడు సంయుక్తమే యగును. సంయుక్త యతి చెప్పఁబడియే యున్నది. దీనిని వేఱుగఁ జెప్ప నవసరము గానరాదు. అనునాసికాఽనను నాసికములకు విశ్రమము లేదన్నచో [అరణ్య ౫ ఆశ్వా. ౨౨౩.] అని కలదు. ఉ. పుట్టినయాలు నాళులకు పొంపారిపోయి-ఈ తెనుఁగు ఛందోగ్రంథములు ప్రాచీన విద్వత్కవుల యభిప్రాయములను బూర్తిగాఁ గనిపెట్టి చెప్పఁబడినట్లు గానరాదు. చెప్పినవానిలో నైనను, వాని యభిప్రాయములను కేవల కవులు గుర్తెఱింగినట్లు గానరాదు. విద్వత్కవు లగు భారతాదికర్తలు రసపోషణము, గాంభీర్యము, సంగతి, యౌచిత్యము, శాస్త్రసమయముఁ దప్పక ప్రసిద్ధపదములలోనే యతిప్రాసముల నంగీకరించినవారు కేవలకవులకు మీఁది వానితో సాంకర్యము పనికిరాదు. కేవలము యతిప్రాసములే వీరికి సర్వస్వ మైనట్లు గానవచ్చుచున్నది. వీరే గ్రంథములకు సంస్కర్తలై చేసిన పాఠవ్యత్యాసములను జూడుఁడు. భారత

ము ఆది. ౧ ఆ ౭౭. ఉ. ఇంబుగ—ఇమ్ముగ, ప్రాచీనపాఠము.

౧౨౫. ఉ. బోదన, బోధన ౨ ఆశ్వా. ౧౭౭ ఉ. మాంధాత్ర ధాత్రి, ప్రా. పా. ఇది సంయుతాఽసంయుక్త ప్రాసము. 3-వ ఆశ్వా. ౧౧౨. ఉ. వాఁడిమయూఖముల్ - సూర్యుఁడు వేఁడి మయూఖములు గలవాఁడు గాని వాఁడివి గలవాఁడు కాఁడు ఆశ్వా. చ. అగ్నిసాక్షికంబున 'సాక్షికంబుగ' - అని కాని 'బున' కాదు. 'అగ్నిసాక్షిక' విశేషణరూపము గాని నామవాచకము కాదు. నామవాచకము కాక యీరూపము సాధువు కాదు. ప్రాస మనుప్రాసము. శబ్దాలంకారము. కావున నే విద్వత్కవు లది యొకచోటఁ దప్పినను తప్పిదము గా దనియు, నశాస్త్రీయములను బెట్టుటయే తప్పిద మనియు, సెంచి కవితలఁ జేసిరి. కాని యతిప్రాసములకొఱకు తప్పు రూపములను జేసినవారు కారు. ౨౪౮. మధ్యాక్కఱ—తవినయన్నవతగిన, అని కాని 'తవిన' కాదు. అది ధాతుజవిశేషణము. ధాతువు 'తగు, గాని 'తవు' లేదు. తగు, అహోర్హార్థకము. ౨౭౩. క. ప్రియంబున, ప్రియంబుగ, అని. అదియు విశేషణమే. నామముకాదు. ౫ ఆశ్వా. నందోలు,-,నందలు, కాని 'దోలు' కాదు. అప్రసిద్ధము. ౨౭౯ అభ్యసించు నిట్టియెడ — 'అభ్యసించునట్టియెడ' అని కాని 'ఇట్టి, కాదు అది సమస్తపదము. ౬ ఆ ౮౩. క. తుపలు పడన్-'తుప లని కాని 'తుపలు, కాదు. తుప లనఁగా తుప్పు లని. 'తూలునట్లు' యర్థముఁ జెప్పుదురు. అట్లయినవో తుపలఁ బడన్, అని కావలెను. ఆశ్వా ౫౯. ఉ. శక్తి యుడివింపఁగ - ఉడిగింప, అని" క్వచిద్గకారో వా, యతిప్రాసస్థలములందుఁ గొన్నిచోట్ల గకారమే వకారముగా భావింపఁబడు నని తన యభిప్రాయము దన యాంధ్రశబ్దచింతామణియందుఁ జెప్పుచు భారతమం దట్టిప్రయోగములను జేసినట్లు స్పష్టము ౧౨౯ చ. బ్రాహ్మణుల కవజ్ఞ సేయక శమత్వము సేకొనుము - శమిత్వము, కాని శమత్వముగాదు. అకార, ఇకారములకు విశ్రమాంగీకారభీతిచేత నైన దిద్దుబాటు. 'శమ' ధర్మము, దానిపైని మఱలఁ ధర్మార్థ 'త్వ' ప్రత్యయ మశాస్త్రీయము. ఈ సంస్కర్తలకు కేవల యతిప్రాసవిరోధ భ్రాంతిభీతియే కాని శాస్త్రవిరోధభీతి లేన ట్లున్నది. [ఆది ౭ ఆశ్వా. ౨౩౨] క. ఇ ద్వైహాయనులత్యం బివ్విలు మోపెట్టి నెట్టనేసిన వీరుం। డివ్వనితకు వరుఁడగునని। సెవ్వగ మీరాజులక నియమము సేసెన్. నవ్వగ. అని ధర్మరాజు పరిహాసవచన మది అట్టివరునిఁ గోరిన ద్రుపదునకు సంతోషమే కాని వగ లేదు. పలికిన ధర్మరాజునకు లేదు. ఆ పద్యముఁ జెప్పిన నన్నయభట్టున కందురా? అది మంత్రసానిగండ మట్టి దగును. ఇఁక నాలోచింపఁగ అకార, ఇకారములకు విశ్రమ మొప్పుకొనవలసివచ్చు నని యీలాక్షణికులకే కాని యీ నెవ్వగ మఱి యెవ్వరికిని గానరాదు. [సభాపర్వము ౧. ఆశ్వా. ౨౩౫.] క. యతుల స్వర్గిరిబహిర్గిరోపగిరుల భూపతుల గిర, రూప మసిద్ధము. తక్కిన రెండుచోట్ల వలె నే యచ్చటను 'గిరి' అనియే కావలయును. విశ్రమభీతిచేఁ జేయఁబడిన వ్యత్యాసముగును. అరణ్య 3 ఆశ్వా. 'నానాశ్రమమునకు, — నానాశ్రమము' సంస్కృతభారతమును జూడవలయును. సంయుక్తా ఽసంయుక్తములకు ప్రాస మెప్పవలయు నని చేసిన వ్యత్యాసము. ౨౪౬. క. అ స్థత. 'అస్థ'యే, ధర్మము. దానిపైని ధర్మార్థ'త' అశాస్త్రీయము. తకారప్రాసము కొఱకు వ్యత్యాసము చేయఁబడినది.

ఎఱ్ఱాప్రెగడ అరణ్య ౫ ఆశ్వా. ౨౨౩ ఉ. దట్టుడు" అనర్థకము. ఉకారప్రాసమే యర్థ మైయుండును. దక్షుఁడు, అని కానోపును. అచ్చట ష, ట,లకు స్థానసామ్యమును బట్టి కృతికర్త చెప్పియుండును. ౬ ఆశ్వా ౯౨. ఉ. సమ్యగ్యశశాలి, యశశాలి, కానేరదు యశశ్శాలి, అని కావలయును. అట్లు చేయుట కవకాశము లేదు 'శ' గురువు కారాదు. ఛందస్సు చెడును. కావున 'సమ్యగ్గుణశాలి, అని కవిపాఠము కానోపును. సంయోగములో వచ్చుటఁ గకారము మాత్రమే స్వీకరింపఁబడినది.

విరాట ౧ ఆశ్వా ౧౯౬ క. కొండొక, నేతున్, నేర్తున్; అని సంయుతా ఽసంయుతప్రాస మది. కేవల 'త' కారముకొఱకు 'రేఫఃక్వగః' అనఁగాఁ 'త్వయాఽపహృతః' అనిపూర్వము సప్పః, అన్నవారినిఁ గూర్చి యొకరు పలికిరఁట. ఇది యట్టిదే! [ఉద్యోగ. ౧ ఆశ్వా ౧౪౨.] క. శ్రీవాలింప - పాలింప కాని వాలింపకాదు. వ్యాకరణనిషిద్ధము. అచ్చట వాదేశము రాదు. ౨౮౬ చ. ఎం। తగుమతులు, 'తుమతులని' గాదేశము నిషద్ధము. ౩౧౫, క. న। మ్మిగ. నమ్మిక. ఇకాన్తపదము. 'గ' కాదు. క,గలకు వర్గత్వమును బట్టి స్వామయాజి ప్రాసమును జేసియుండును గాని యప్రసిద్ధరూపముఁ బెట్టఁడు. ౨ ఆశ్వా, ౧౧. చ. చక్కఁగ-" చిక్కఁగ, అని కాని 'చక్క' గాదు ౪ ఆశ్వా ౧౪౦. చ. పసునోకొంటికి-' నొకంటికి, అని విశ్రమభయముచేత కంటిరూపమును బోఁగొట్టు కొంటిరూపముఁ బెట్టికొనవలసివచ్చినది. ఇది కొంటివిశ్రమమే. భీష్మ. ౧ ఆశ్వా. ౨౫౯. సీ. తే. కైకయాధీశుఁడు-" కేకయు, కాని 'కైకయు' కాదు. ఏ, ఐ, ల విశ్రమాంగీకారభీతిచేతనయిన 'కైకయు' కాని వేఱు కాదు.] శల్య. ౨ ఆశ్వా. ౧౯౯ ఆ.] జ్యోతిషాధిపత్య. 'జ్యోతిష కాని, జ్యోతిష'కాదు. ఔ, ఓ,లకు విశ్రమమును లక్షణమును చెప్పలే దని చేసిన ఓకారముకాని వేఱు కాదు. ఔకారము, తన యోష్ఠ్యత్వభాగమును విడుచుకొని యొక్కకంఠ్యత్వముచేతనే, అ, ఆ, లతో నెట్లు విశ్రమ మగునో యచ్చటను నట్లే తెలియవలయు. ౩౩౩. క. ఏన పిదప, ఏను విదప" అని యీరెండును గావు. ఏను పిదప" అని. శాంతి. ౨ ఆశ్వా. ౩౦౮. క. 'నవళులలో' కాదు 'నగళులలో'అని ఇతఁడును నన్నయభట్టునవలె యెఱిఁగినవాఁడే కావున వకారప్రాసస్థలములో నొకచోట వలసినప్పుడు గకారముఁ బెట్టుకొన నగు నని పెట్టినాఁడు. కాని నిరర్థక పదమును బెట్టఁడు ౫ ఆశ్వా. ౧౬౨. క. నివిసించు నిగించు, అని, ౬ ఆశ్వా. ౮౨. క. ఏవనికిన్, 'ఏపనికిన్'అని కాని వనికి కాదు.

[అనుశాసనిక. ౧ ఆశ్వా. ౨౩౨] క. ఒకొక్కట. ఒక్కట, కాని కొట కాదు [౩ ఆశ్వా. ౨౨౧. క.] లోకము సేయుటయు నమ్మెలుత' 'మెలత' కాని 'మెలుత' కాదు. మౌసల. ౨౧౫. క. తానేచిన, 'నేర్చిన' కాని 'నేచిన' కాదు. సంయుతా ఽసంయుత ప్రాసాంగీకారభీతిచేఁ జేయఁబడిన యపలాపము గాని వేఱు కాదు.

ఇఁక నీ సంస్కర్తలబారిఁబడక యెట్లో తప్పియున్న ప్రాచీన మహాకవుల సాక్ష్యమును జూడుఁడు.

భాగవతము, ౧ స్కంధము, పూర్వముద్రితపుస్తకము.

మ త్త. ఆర్యసన్నుతసాహసుండు మురారి యొత్తె యదూత్తముల్ ।
ధన్యులై వినఁ బాండవజన్యము దారితాఖిలజన్యమై ।
తన్యము న్భరసైకమాన్యము దారుణస్వనభీతరా ।
జన్యము న్బరిమార్చి తాఖిలశత్రుదానవసైన్యమున్ ॥

దీనిలో సంయుక్తములోని యొక్క యకారమే ప్రాసముగా గ్రహింపఁబడినది. [3 స్కం. ౧౬౬] చ. అని సజ్జనభో । యన గోవర్ధనశైలమున్ దటచరద్రుమవ్యాపరిజాలమున్. దీనిలో ఉ, అ,లవు విక్రమము. ౨ స్కం. ౧౭౬. శా. పుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి మిగులన్ బాధింప నెట్లోర్చెనో. [ఉ. ఆలయుఁ ౭ స్కం. ౧౪౬] శా. కంటె న్నేటికి—మింటం బోయెద నీచరిత్ర మవరు ల్మర్త్యు ల్వ్యాఖ్యానీనులై, మింట న్నేఁడిని సన్నుతింపఁగల రీమీఁద న్నరేంద్రాగ్రణీ. దీనిలో, ఇ, అ,లవు ఇచట మంటం బోయెద, అని క్రొత్తపుస్తకము. దీని యర్థౌచిత్య మాలోచింపవలయు. "ఇంతదాఁక నీచరిత్రము భూలోకమున మర్త్యులుమాత్రము సన్నుతించుచున్నారు. నేనిప్పుడు మింటికిఁ బోయి చెప్పఁగా నచ్చట దేవతలు నిచ్చట మర్త్యులు నీకఁ నుతింపఁ గలరు" అని.

పిమ్మట, క. అని చెప్పి దుర్వాసుఁ డంబరీషుని దీవించి కీర్తించి మింటితెరువున బ్రహ్మలోకంబునకుం జని అని కలదు. [౧౦ స్కం. ఉత్తరభాగము ౨౨౨.] శా. ఎన్నే భంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్ । ము న్నే దేవునిఁ జూడఁ గానక తుది న్మోహింతు రామేటికే । విన్నాణంబున నో సకుల్గ్రహీణులై విఖ్యాతి సేవించిర । చ్ఛిన్నాఽలోకన హాస్యభావణ రతిశ్లాఘానురాగంబులన్. ఇ, ఆ, లవు. ౨౧౭. చ. నిను—భోఁ । యనఁ బశుకోటిఁ దోలు మృగరాజు. ౭ స్కం. క. అనవుడు హలధరుఁ డచ్చటి । జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం । డని యడిగిన వారలు రు । క్మికి హితులై పలుక రైరి మొగమాటమునన్. క్మని, అని క్రొత్త, రుక్మిణియన్న 'రుక్మి' కాని 'రుక్మ' కాదు. అది సంజ్ఞ ౩౧౭. మ. వికచాంభోరుహ-నందక వక్త్రాబ్జగదాదిచిహ్నములఁ జేత న్వ్యాసుదేవాఖ్య ను । త్సుకుడై యొప్పును సచ్చరించుచు మదిన్ గృష్ణుండన న్నెటిపాం । డ్రకుఁ గాశీశపఖుం గనుంగొనుము చేడ్కం జంద్రబింబాననా. ఉ, బులవు. ఇట్టి వింక ననేకములు పూర్వప్రయోగము లున్నవి. పూర్వులు విద్వత్కవులు. వారు రసాదివిశేషములను గ్రహించి కవితలను జేసినవారే కాని కేవలకవులవలె యతిప్రాసములకొఱకు నిర్బంధపడినవారు కారు. ఏయక్షరమున కాయక్షరమే యుండవలయు నని ఛందస్సుల యభిప్రాయము గాదు. అట్లే యయినచో సావర్ణ్యమునే యంగీకరింపవు. మఱియు స్వయముగా సావర్ణ్యము లేని మఱికొన్ని వర్ణములకును సావర్ణ్యకల్పనము నిరర్థక, నిషిద్ధ, అసంగతార్థాదు లగు పదములను బెట్టుకొనకుండుట కనియే శాస్త్రాభిప్రాయము. దాని నాలోచింపక యథాశ్రుతగ్రాహులచేఁ జేయఁబడిన వ్యత్యాసములను భాషాకోవిదు లుపేక్షించుట ప్రాచీనభాషాగౌరవము నుపేక్షించుటయే యని తలంచెదను.

## శకుంతల నంపు వేళ

అధికారుల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. ఎల్.

వనమాలికలు లేత - పల్లవము లిచ్చె,
హరిచందనావళుల్ - విరుల నం దిచ్చె,
వనతరు లెల్ల చ-ల్లని నీడ లిచ్చె,
చెలువు నరనకు శకుం-తల నంపు వేళ.

కమ్మతెమ్మెరలు సు-గంధముల్ దెచ్చె,
ఆకసము బంగారు-రేకలం దాల్చె,
వృక్షశాఖలనుండి - పికము సెల విచ్చె,
చెలువు నరనకు శకుం-తల నంపు వేళ.

హరిణకువమారి నై-న్నాడఁ గాఁ జొచ్చె,
కాంతాసమూహంబు - కన్నీరు రాల్చె,
హాయి యూ యని జనకుఁ - డాశీర్వదించె,
చెలువు నరనకు శకుం-తల నంపు వేళ.

# విభక్తావిభక్త కుటుంబ స్థితులు

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదూర్ గారు

హైందవులము సార్వభౌమప్రదత్తస్వారాజ్యానుభవోన్ముఖులమై యుండుటచే నిఁక మన సాంఘిక నైతికార్థికవిషయముల మనమే చక్కఁబెట్టుకొనవలసినవార మై యుంటిమి. ఆర్థిక విషయముల విచారించునప్పుడు పూర్వపరిస్థితుల కానుగుణ్యముగ నప్పటి మహర్షులచేఁ గూర్పఁబడిన ధర్మశాస్త్రముల కాలానుగతికముగ నీ కాలమున కవసరము లగు పరిణామములఁ గావింపక యథాస్థితంబుగ ననువర్తింప నెంచుటచే వైపరీత్యములు తటస్థించుచున్నవి. కావున నట్టివానినే ప్రకృతధర్మశాస్త్రవేత్తలు దూరదృష్టితో నావసి వలయు మార్పులఁ గావింపవలయును. అట్టివానిలో సమష్టివ్యష్టికుటుంబ బాదాయముల నీ వ్యాసమున విమర్శించెదను.

ప్రస్తుతకాలమునఁ బ్రపంచమునందలి సమస్తపదార్థములకు నెవరో యొకరు ప్రభువు లేర్పడియున్నారు. ఆస్తి నెట్లనుభవింపవలసినదియు, పరు లా యాస్తి విషయమున నెట్లు ప్రవర్తింపవలసినదియు, చరస్థిరాస్తుల యాజమాన్యమును గూర్చి విమర్శింపవలసివచ్చినప్పుడు న్యాయమూర్తు లేయే విధానముల నవలంబింపవలసినదియు మున్నగు విషయము లన్నియు శాసనములుగ నిర్మింపఁబడినవి. ఆస్తి ననుభవించు విషయమును మన హిందూధర్మశాస్త్రంబులు ద్వివిధంబుల వక్కాణించినవి. విభక్తావిభక్త కుటుంబస్వాస్థ్యము లీ యంశద్వయమున నెట్లు న్యాయస్థానముల విచారింపఁబడుచున్నదియు మీ రెల్ల రెఱిఁగిన విషయమే.

అవిభక్తకుటుంబమునకుఁ జెందిన పురుషు లందఱు జాతము చేతనే కుటుంబాస్తియందు హక్కు గలిగియుందు రనియు వీ రందఱా యాస్తివలనఁ బోషింపఁబడవలయు ననియు నీ సొత్తు నంతను కుటుంబయజమానుఁడు తన స్వాధీనమునం దుంచుకొని కాపాడుచుండవలె ననియు లోనుగాఁ గల విధులు ధర్మశాస్త్రముల నియమించియుండిరి. అవిభక్తవిధానముచే నా కుటుంబములోనివా రందఱు సౌఖ్యము నందుచుండిరా లేదా యని మనము విచారింపవలసియున్నది.

ఈ విషయమును చర్చించుటకు మున్ను ఆస్తివిభజన యేరీతిని జేయఁబడి ప్రస్తుతావస్థను జెందినదో విమర్శింపవలసియున్నది. ఈ విమర్శవలనఁ బ్రస్తుతస్థితియందు మార్పు లెట్లు గావింపవలనుపడునో కూడ తేలఁగలదు.

భగవంతుఁ డీ ప్రపంచమును సృజించినప్పుడు ప్రత్యేకవృత్తులు ప్రత్యేకాస్తులు భిన్నభిన్నముగ ననుభవింపవలయు నని నియమింపలే దనియు సృష్ట్యనంతరము కాలక్రమమున మానవులకుఁ దటస్థించు నవస్థాంతరములచేఁ బ్రత్యేకాస్తుల నేర్పాటు చేసికొని రనియు ఆదిని సమస్తపదార్థములు సకలజనానుభవములై యేర్పడిన వనియు నట్లగుటచే నందఱి కనుభవనీయము లనియుఁ బాశ్చాత్యధర్మశాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఇటులు ప్రత్యేకనాథవంతములు గాని పదార్థము లెట్లు సనాథము లయినదియు వారు ] విశేషముగ వివరించియుండిరి.

సృష్ట్యాదిని మానవు లందఱు స్వభావజన్యము లైన గుణములు గలిగియుండిరి. అట్లగుటచే వా రా కాలమున నాచరించిన కార్యము లన్నియు నైసర్గికములై యుండెను. కాలానుగతికముగ నూహాపోహలు మెండై యత్యంతపరిణామమును జెంది వారి చేష్టలవక్రగతిని స్వాభావికములు గాఁజొచ్చెను. మన దేశమున నిప్పటికి నిట్టి విపరీతరీతులఁ బట్టక ప్రప్రథమావస్థలనే యవలంబించియుండు కొన్ని తెగలవారు కల రనుట వైవాహ్యములకు నిదర్శనము. అట్టివారికిని నాగరకదశను సంపాదించిన మనకును గల తారతమ్యము తెల్లరకును విశదమే. మనము నాగరకులము. వా రనాగరకులు. కావుననే వారి వ్యావహారికాదర్శములు మనకు మొరటుగఁ గాన్పించును. మనవి వారికి రుచింపవు. వారు ప్రపంచోత్పత్తికాలమున నేర్పడిన పద్ధతులనే యవలంబించుచుండిరి. వారిలో మార్పేమియుఁ గలుగలేదు. మనము గూడ నొకప్పు డట్టి స్థితియం దున్నవారమే. మన పూర్వులు బుద్ధికుశలతచే నప్పటి స్థితిగతులయందు పెక్కు మార్పులను గలిగించి ప్రస్తుతావస్థను గల్పించిరి. అనేక విషయములలో మనము మార్పును జెందితిమి. అందు నాస్తివిషయ మొకటి. మతవిషయము రెండవది. కావున నాదిపురుషులు స్వభావసిద్ధముగ స్ఫురించిన యూహాల తోడనే స్వాస్థ్యముల సంపాదించిరి. ఈ కాలమునఁ బ్రబలుచుండిన యూహాలు వారి కుదయించియుండవు. కావున వారి విధానములు స్వభావజన్యములు. అందాక్రమణ మనునది ప్రధానవిధానము.

## ఆక్రమణము

ఆక్రమణమువలననే ప్రప్రథమమున నాస్తులు ప్రాదుర్భవించిన వని కొందఱి మతము. భూమియందలి పదార్థము లన్నియు నొకప్పుడు సకలమానవకోటికి ననుభవనీయములై యుండెను. అటుల సమస్తజనోపయోగార్హమైనవానిలో నే మానవుఁ డైనఁ బ్రథమమున దేని నాక్రమించునో యది వాని సొత్తుగఁ బరిణమించెను. అతఁడు చేయి విడువక యనుభవించునంత కాల మది యతని సొత్తు. వాఁడు విడిచినప్పుడు వస్తుసముదాయమునఁ జేరి మఱియొకరి యాక్రమణమున కర్హమైన దగును. ఒకని స్వాధీనమునం దుండునంతదనుకఁ దదితరులు దాని నాకర్షించుట కర్హత లేదు.

ఇట్లు కొంత కాలము గతించిన వెనుక నొకఁ డట్లాక్రమించిన స్థిరాస్థిరపదార్థములు వాని కుపయోగించినను లేకున్నను, వాని

సొత్తుగనే నిలిచియుండు ననియు వాని యనుమతి ననుసరించినఁ గాని పరు లాక్రమింప వీలు లే దనియు నొకరీతి యేర్పడినది. ఈ మతము సరియైనది కాదు. పూర్వము ప్రత్యేకమానవవ్యక్తులకు స్వాతంత్ర్యపు హక్కుభుక్తములే లేవు. ఏకవిధాభ్యాసములు గల కొందఱు మానవు లొక్కొక్క తెగగ నేర్పడి కొంత దేశము నాక్రమించి వస్తుసముదాయమును సేకరించెడివారు. వా రార్జించిన ధనకనకవస్తువాహనాదికములు వారిలోని ప్రత్యేకవ్యక్తులకుఁ జెందక సాంఘికాస్తిగాఁ బరిగణింపఁబడుచు వచ్చినది. ఒక్కొరి స్వాధీనమునం దుండినదాని నింకొక రాకర్షింపఁగూడ దను నిబంధనము గూడఁ బూర్వ మున్నట్టు దోఁపదు. ఈ విషయము లిప్పటి మన యూహాలకు సరిపోవుచున్నవి. ఈ పరిణామమునకు రోమను తత్త్వవేత్తలే కారకులు. ఈ యూహాల నుండియే ధర్మశాస్త్రబాహుళ్య ముత్పన్న మైనది.

జనసంఖ్య విస్తరించిన కొలఁది తెగలు తెగలుగఁ జేరి భూప్రదేశమున నచ్చటచ్చటఁ దత్తత్స్వేచ్ఛానివాసోచితభాగముల నాక్రమించి వ్యాపించి రని మున్నె వక్కాణించియుంటిమి. హిందూదేశమునందలి గ్రామపద్ధతులే తార్కాణము. అట్టి గ్రామపద్ధతు లింకను పంజాబు (పాంచాల) దేశమునందు కలవు. ఆ గ్రామములోని యాస్తి యంతయు గ్రామస్థుల కందఱికిని సమష్టిని జెందియుండును. తత్తద్గ్రామవాస్తవ్యు లందఱు రక్తసంబంధులై యుందురు. కొన్నికొన్ని గ్రామములలోఁ దమ సౌకర్యముకొఱకు ఇతరులను గూడఁ దమలోఁ జేర్చుకొనుటయుఁ గలదు. వీనిని కులపతిసంఘము లందురు. ఒక మూలపురుషుఁ డుండును. తక్కుంగలవా రందఱు వాని యాధిపత్యము క్రింద నుందురు. అట్టు లయ్యును, ప్రతివ్యక్తికి నా యాస్తిలో హక్కు గలిగియుండును. ఇది పురాతనసంఘాచారము. అధునాతను లెంత ప్రయత్నించిన నది యంతరించుట లేదు.

మన దేశమునఁ బుత్రోత్పత్తి యైనతోడనే శిశువునకుఁ గూడ పిత్రార్జితమునఁ గొంత భాగమునకు హక్కు సంక్రమించును. వయస్సునం దా బాలుఁడు పెరిఁగినకొలంది కుటుంబాస్తియెడ వాని కధికారము పెరుఁగుచుండును. ఇచ్చగించినఁ దండ్రి యాస్తిని బంచుకొనుటకు శక్తి కలవాఁ డగును. ఇట్టి యధికారము యావనాంకురమునందే ప్రతిపురుషునకుఁ గలుగుచున్నను గారణాంతరములచేఁ గొన్ని తరముల దనుకఁ గూడ సమష్టికుటుంబముగనే గడపుకొనుచుందురు. అవిభక్తకుటుంబస్వాస్థ్యమునఁ బాల్గొనుటతోడనే తృప్తి నంది కాలక్షేపము గావింతురు.

పంజాబు దేశమునం దీ గ్రామపద్ధతు లింకను బూర్వోక్త విధానంబున నిలిచియుండుటచే వానిం బరికించిన వ్యక్త మగును. కుటుంబమునఁ గలుగఁదగిన త్రివిధము లగు మార్పుల కనుగుణమగు విధానత్రయము నచ్చటఁ గాంచనగును. సంపూర్ణైకమత్యమును బొంది యుండు విధానము సంఘీభూతమై జమీందారీ గ్రామమున నెల కొనియున్నది. గ్రామములోని భాగస్వాము లందఱును దమతమ భాగముల కనుగుణములగు హక్కులఁ గలిగియుందురు. కాని యాస్తి యంతయు సమష్టిగనే యుండును. ప్రత్యేకభాగములుగ విభజింపఁబడదు. సేద్యగాండ్రు చెల్లించు సిస్తు లన్నియుఁ గలిపి వారి యాస్తుల వలనఁ గలుగు లాభము లన్నియు నేకము చేసి దానినుండి తత్తత్కార్యోచితవ్యయములఁ దీసివైచి మిగిలిన సొమ్మును గ్రామస్థు లందఱుఁ దమతమ వంతుల వరుసను బంచుకొనియెదరు. మన దేశములోని యవిభక్తకుటుంబముల స్థితియు నిట్టిదే.

పట్టాదారీ గ్రామవిధానమే రెండవది. ఇందు గ్రామస్థు లందఱును దమతమ భాగములను ప్రత్యేకముగ ననుభవింతురు. ప్రతి భాగస్వామియుఁ దనవంతు భూమిని తన చిత్తవృత్తి నమరకపఱచు కొనుచు వాని భాగము పిత్ర్యము లగు హక్కులనుబట్టి యేర్పడును. ఇయ్యదియే బంగాళా దేశమునందలి సమష్టికుటుంబ విధానమును బోలియుండును. సమష్టివ్యష్టి విధానమునకు నడుమ సంధికాలమున నుండు రీతిఁ గొంతకాలమున కొక్కొకపరి గ్రామవసతి నంతను తిరిగి పంచుకొనుటయై యున్నది. పెషావరునందలి పఠానులను శాఖవారిలో నిది యిప్పటికిని బొడగట్టును. ఒకప్పు డా భూముల నన్ని కుటుంబములవారును సమభాగములుగాఁ బంచుకొనిరి. కాలానుగతికముగ నీ వసతులు న్యూనాధిక్యములఁ జెందుటచే నట్టి తరుణముల నప్పుడప్పుడు తిరిగి పంచుకొనెదరు. ప్రతి మనుజవ్యక్తియుఁ దన సొత్తును ప్రత్యేకముగ నుంచుకొను జ్ఞానమును పొందిన కొలఁది నీ విధానము మాఱిపోవును.

భైచారీ గ్రామ విధాన మనునదియే తృతీయము. ప్రతి యజమానుఁడును దన భాగమును ప్రత్యేకముగ ననుభవించుటచేఁ బట్టాదారును బోలియుండును. కాని యతని వశమునం దుండిన భూమి యొక్క నికర మగు పరిమితమే వాని పేర నుండును. పూర్వుల హక్కు లన్నియు నశించును. తనలోని భాగస్వాముల సంఖ్య పెరుఁగుటచేతఁ గాని తఱుఁగుటచేతఁ గాని తన భూమికిఁ బెరుఁగుతఱుఁగులు కల్గనేరవు. వాని హక్కులు మార్పునకర్హములు గాక స్థిరము లయ్యెను. గ్రామము మొత్తమునకుఁ గల పట్టాదారుల సంఖ్యను బట్టి గాని గ్రామపు గుడికట్టును బట్టి గాని నిర్ధరింపఁబడదు. సమష్టికుటుంబమువారు పంచుకొనిన వెనుక వారి స్థితి నిది పోలియుండును.

రష్యా మున్నగు నితరస్థలములయం దిట్టి రీతులు పొడగట్టఁ గలవు. దక్షిణహిందూస్థానము నందలి మిరాసిదారులు మున్నగు వారిలోఁ గూడ నీ రీతులు గాన్పించును.

ఆక్రమణవిధానమున భూవసతుల నార్జించు పద్ధతులను స్వభావజన్యము లగు ధర్మశాస్త్రములను రోమీయతత్త్వవేత్తలే కల్పించిరి. ఆదిని మూఁడు విధములఁ బూర్వులు భూవసతుల నార్జించి యుండు రని రోమకప్రాడ్వివాకులు వాదించెదరు.

1. పూర్వోక్తవిధానంబున నాక్రమించుట.
2. స్వభావాభివృద్ధి. ఇది ద్వివిధము.

(క) పశుగణము సంతానాదికముల నభివృద్ధిం జెందుట, నదులు మొదలగువానిచేఁ బొలముల ప్రాంతమున లంకలు పెట్టుట.

(చ) ఇరువురి గేస్తుల సరసులు చేరి వాని ఫలితము శాస్త్రోక్తముగ నెరిక్కైన సంక్రమించుట.

3. వర్తకవ్యాపారాదులచేతఁగాని పొలముల బలపఱచుకొనుటచేతఁగాని విశేషధనార్జనము గావించుట.

ఆస్తి మానవవ్యక్తులకుఁ బ్రత్యేకముగ సంక్రమించు నను దురభిప్రాయము కలుగుటచే నీ శాస్త్రకారు లిట్లు నుడివిరి. ఇట్టి విషయముల పూర్వవిధానముల నారయఁ గోరువారు తమ మనంబుల నావరించియుండు నభిప్రాయముల నవలఁ ద్రోచి నిష్పక్షికముగ విమర్శింపవలయును. అట్లు గావింపనిచోఁ దమ మనోగతాభిప్రాయములు సత్యగ్రాహ్యత కడ్డు దగులును. పాశ్చాత్యదేశములయందు ఆదును నింగ్లాండునందు యాజమాన్య మొక పురుషుని యందే సంక్రమించి నిరంతరముగ స్వేచ్ఛ నొసంగును. ఒకప్పుడందు సమష్టి కలుగవచ్చును గాని, అట్లు రుజువు గావింప దనుక వ్యష్టిగనే భావింపఁబడును. హిందూదేశమున నందునకు భిన్నముగ సమష్టియాజమాన్యమే విధి. అట్లు కాదని నిదర్శనములచే నిర్ధరించు దనుకఁ బ్రతి విషయమున సమష్టిగనే భావింపఁబడును! ఒక పురుషుఁడు సర్వస్వాతంత్ర్యములు గల స్వార్జితమున సముపార్జించినను వాని యనంతరము రెండవ తరమువారి కది సమష్టికుటుంబాస్తియే యగును. ఒకని కిష్టము వచ్చినట్లు వినియోగించు సకలస్వాతంత్ర్యములతో వసతిని గలిగియుండుట మన దేశమున సహజము కాదు. ఉపాయాంతరములచే నట్టి వసతిని బ్రత్యేకముగ నార్జించుకొనవలయును. ఇంగ్లాండునం దిది సర్వసామాన్యము. పలువురికి సంబంధము గల స్వాస్థ్యము లుండుటయే మన దేశమున సర్వసామాన్యము. ప్రాక్పాశ్చాత్యవిధానంబు లిట్లు విరుద్ధధర్మములఁ బ్రవర్తించుచున్నను రెంటికిని మూలసూత్ర మొక్కటియే. మన దేశమునఁ బూర్వవిధానము ననుసరించియే ప్రకృతి మనువర్తింపఁబడుచున్నది. ఇంగ్లాండునందుఁ బూర్వాపరములకు సంబంధ మేమియు లేదు.

## మూలకారణము

భూవలయంబున నే ప్రదేశమున నైన సమావేశమైన యొక తెగవారు, ఆ ప్రదేశము తమ సొత్తని భావింతురు. ఆ ప్రదేశమునఁ దామే నివసించి దాని ననుభవింప నగు ననియు, మఱి యే యితర తెగవారికైన నం దడుగిడుట కర్హత లే దనియు భావింతురు. కాని తమ తెగలలో నే ప్రత్యేకవ్యక్తి యైన మఱియొక వ్యక్తిని నా ప్రదేశమునందలి యే భూభాగమునందుండియైనఁ దొలఁగించి తన దనుట కవకాశము కలదా యని యైన విచారింపరు. తత్ప్రాంతారణ్యముల వేఁటాడి జీవింతురు. తమ పశువుల నందలి పచ్చికబయళ్ల మేపుకొందురు. వ్యవసాయము చేయు తరుణమునఁ బ్రతివాఁడు తన శక్త్యనుసారము కొంత భూమిని దున్నుకొనును. కర్షకాదాయమున నతఁడు తన కుటుంబరక్షణమునే గావించుకొనినను దాను దున్నుకొనిన భూమి మాత్ర మా తెగకుఁ జేరియుండును. ఆ తెగలోని జనులకును వారి స్వాధీనమునం దుండిన భూవసతికిని గల పరస్పర సంబంధమా తెగలోనివా రందఱును సేద్య మొనరింపఁదగినంత కలిగియున్నంత కాలము ప్రతివాఁడును నిరంతరకర్షణముచే నిస్సారమైన పొలమును వదలి మఱియొక సారవంత మగు పొలమును దున్నుకొనఁ గలిగినంత కాలము నొకరి నొక రడ్డుదగులవలసిన యవసర ముండదు. ఒకని నాతంకపఱుపవలసిన కారణ మేరికిని లేనంతదనుకఁ బ్రతివానికి నన్నిటిపై నిరంకుశాధికారము గలిగియున్నట్లే తోఁపఁజేయును. కుటుంబములలోఁ గూడ నిట్లే కొంత కాలము సమష్టిగ నుండుట కాతంకములు గాన్పింపవు. ప్రప్రథమమునఁ బరస్పరసహాయార్థమై యొకని నొకఁడు హత్తుకొనియుండినను, అందొక్కొక్కరు స్వసంరక్షణ సామర్థ్యమును బడసిన కొలఁదిని తమ పశుగణంబున కింకను నెక్కుడుగ శాద్వలప్రదేశముల నార్జింపవలయు ననియు నిందనుక నెవ్వరు దున్నని సుక్షేత్రంబు సేద్య మొనరింపవలయు ననియు నూహించి యుంచించుక దూరప్రదేశములఁ బ్రవేశింతురు. మన హిందూదేశమునఁ బర్వతప్రాంతముల నివసించు కోయలు చెంచులు యానాదులు మున్నగువారీ గతినే యిప్పటికి నవలంబించుచున్నారు.

చుట్టు నున్న తెగల యొరపిడి గలిగినప్పుడును స్వశాఖాబాహుళ్యము కలిగినప్పుడును, స్థితిగతులు మాఱఁగలవు అప్పు డొకని నిరాఘాటప్రచార మింకొకని సంకుచితప్రచారహేతు వగును. ఒక పురుషుఁడు గాని కుటుంబము గాని తా ననుభవించుచున్న ప్రదేశము నితరుఁ డాక్రమింపకుండ కాపు చేయవచ్చును గాని ప్రతివాఁడును తన పొరుగువాని పొలము నాక్రమింప నేరఁడు. అప్పు డా తెగలోని ప్రతివాని పొలమునకును హద్దు లేర్పఱుపఁబడును. అట్టి తరుణముల నా తెగలోని ప్రతి కుటుంబముయొక్క యావశ్యకత ననుసరించి సమముగ భూభాగముల నియమింతురు. పంట నంత నేక ప్రదేశమునఁ జేర్చి దానిని పూర్వోక్తవిధానంబునఁ బంచుకొనుట గాని లేక ప్రతి కుటుంబమున నున్న జనసంఖ్య ననుసరించి తత్తదుచితభూభాగంబుల విభజించి యిచ్చుట గాని జరుగఁగలదు. కడపటి పద్ధతి నవలంబించినప్పుడు కొంత కాలమున కొక్కొకసారి యప్పటి కుటుంబపరిస్థితుల ననుసరించి వారివారి భూభాగముల న్యూనాధిక్యములను సవరించుచుందురు. ఇంకను కొంత కాలము గడచిన వెనుక నీ పరిణామావస్థ గూడఁ దొలఁగింపఁబడును. ప్రతి కుటుంబమును తమతమ స్వాస్థ్యముల నభివృద్ధిపఱచుకొనఁగలిగినప్పు డిట్టి మార్పుల కంగీకరింపరు. కాలక్రమమున నీ భూభాగ మంతయుఁ దమ తెగకుఁ జేరిన దను మాట విస్మరింపఁబడి, యెవని స్వాధీనమునం దుండిన భూమి వాని కుటుంబాస్తిగాఁ బరిగణింపఁబడును. అప్పు డా తెగవారి కందఱకును సమానము లగు హక్కులు కలవి గ్రామకంఠములు పుంతలు మందబయళ్లు మున్నగు ప్రదేశములు మాత్రమే యగును.

మన హిందూదేశమున నిది త్రివిధంబున నెలకొనెను: (1) అవిభాజ్యకుటుంబము (2) అవిభక్తకుటుంబము, (3) గ్రామసంవిధానము.

ఇందు గ్రామసంవిధానమును గూర్చి యిదివఱకే వివరించియుంటిమి. ఇప్పుడు మన హిందూదేశమున మొదటి రెండు తరగతులే విశేషముగ నెల్లెడ వ్యాప్తములై యున్నవి.

(1) అవిభాజ్యకుటుంబస్థితి: స్వభావజన్యముగఁ గాని పాలకవిధానమునఁ గాని యేకవంశజు లెల్లరుఁ దమలోఁ బెద్దవానికి లోఁబడియుందురు. అతఁడు పితృవర్గమునఁ గాని పితామహవర్గమునఁ గాని చేరియుండవచ్చును. అట్టి కుటుంబయజమానుఁడు నిరంకుశాధికారము కలవాఁడై యుండును. అతఁడు వారి ప్రేమ కాస్పదుఁడు కాకున్నను గౌరవప్రపత్తుల కాస్పదుఁడై యుండును.

(2) అవిభక్తకుటుంబస్థితి: ఒక కుటుంబమునఁ జేరిన జ్ఞాతివర్గ మంతయు నేకభాండాశనులై యింట నిమిడియుందురు. దైవారాధనమునఁ బితృకార్యముల యందు నేకీభావమున నాచరింతురు. వారి యాస్తి యంతయు సమష్టిగ నుండును. కొన్ని తరములనుండియు నా వంశమువా రందఱు గాని కొందఱు గాని యత్యంతైకమత్యమున మెలఁగుచుండుటచే నీ స్థితి ప్రాప్తించును. అవిభాజ్యకుటుంబయజమానునివలె నిరంకుశాధికారము కలిగియుండకపోయినను కుటుంబశ్రేష్ఠానుక్రమశాఖాప్రధానుఁడే యగును. యజమానుఁడుగా నుండును. మాఱుమాటలలో నవిభాజ్యయజమానుని స్థానమునే యాక్రమించును.

ఇంకను మఱికొన్ని పద్ధతులు కలవు. వానిని గూడ వివరించెదను:

(3) గృహసమ్మేళనము: ఇది వెనుకటిదానిపై నించుక మార్పు గలిగియుండును. అవిభక్తకుటుంబస్థితి కొన్నితరముల దనుకఁ బ్రవర్తించిన గృహసమ్మేళనముగఁ బరిగణింపఁబడును. ఇందు స్థిరవసతి వారి కందఱికిని సమానపు హక్కు కలదిగానే నిలిచియుండును గాని చరాస్తిని మాత్ర మెవరిది వారు ప్రత్యేకముగ జాగ్రత్తపెట్టుకొనెదరు. పశుధనము నట్లే విడివిడిగ నేర్పఱచుకొనెదరు.

(4) గ్రామసమ్మేళనము: ఇందు కలిసి నివసించుట కలిసి పని చేయుట పశ్వాదికములఁ గలిసి యుంచుకొనుట మున్నగున వన్నియు నంతరించును. ప్రత్యేకవసతుల నేర్పఱచుకొనుట కిది యొక మార్గము. ప్రపంచమునం దెల్లెడల నీ పరిణామము నేకవిధమునఁ బ్రబలెను. భూమి పశువులు చరము అంతయుఁ బ్రతికుటుంబమును బ్రత్యేకముగా నార్జించి యుంచుకొనెదరు. బంజరు ప్రదేశము మాత్ర మెల్లరకును సంక్రమించియుండును. ఇదియే పూర్వావస్థను స్మరణకుఁ దెచ్చు చిహ్నముగ నిలిచియుండును. అందఱును దీనిపై హక్కు కలిగియుందురు.

(5) ప్రత్యేకస్వాస్థ్యములు: రోమీయుల పూర్వదశను విచారించినఁ జిరకాలము క్రిందటనే ప్రత్యేకస్వాస్థ్యములు గల యొక తెగవా రున్నట్లు పొడకట్టును. ఈ తెగలోఁ బ్రతికుటుంబయజమానుఁడును బ్రత్యేకవసతులు కలవారే. కాని ప్రాయికముగా రోమీయుల ధర్మశాస్త్రముల ప్రాతిపదికమునఁ బ్రత్యేకవసతు లెచ్చట నుదాహరింపఁబడలేదు. రోమీయుల బారింపబడక నిలిచిన సంఘములలోఁ గలదు.

సంఘాభివృద్ధి క్రమక్రమముగ జరుగుట సహజము. అట్టి సమయముల పరిస్థితులు క్రమక్రమముగా మాఱుచుండును. అవిభాజ్యకుటుంబస్థితి, తదంతర్జనితజనబాహుళ్యముచే నసంభావ్య మైనప్పుడు జ్ఞాతివర్గము మాత్రమే కుటుంబముగ నెన్నఁబడెను. జ్ఞాతిసముదాయము బహుళ మైనప్పు డందలి శాఖలే విడివిడిగ నెంచఁబడెను. రాను రాను అవిభక్తకుటుంబములుగఁ బరిణమించెను. అవిభక్తకుటుంబములు తుదకుఁ బ్రత్యేకవ్యక్తులు ధనాదికములకు యజమానులుగ నెంచఁబడిరి. తుదకుఁ గుటుంబములు గూడఁ బ్రత్యేకవ్యక్తులుగ విడిపోయినవి.

హిందూదేశమునఁ గులము పెద్దలచే నిరంకుశాధికారము వహింపఁబడుచుండు పరిస్థితు లవిభక్తకుటుంబములుగ మాఱినవి. వంశమువారి నందఱి నాకర్షించి తన చెప్పుచేతల నడిపించుకొను సామర్థ్యము గల మూలపురుషుఁడు గతించినకొడనే యందు సమావేశమై యుండిన కుటుంబము లన్నియు విడిపోవును. వారల్లె యుండఁదలంచిన శ్రేష్ఠుఁడే కులము పెద్ద కాఁగలఁడు. క్రమక్రమముగ వాని నిరంకుశాధికారము తఱఁగిపోవును. వంశమున సంతర్భాగముగ నున్నవా రందఱు నతనిని కార్యనిర్వహణమున కేర్పడిన పెద్దగ మాత్రమే యెంతురు. ఇట్టి రీతులు పూర్వులలోఁ బ్రబలియుండుటచేతనే మన ధర్మశాస్త్రకారులలో ననేకు లనేకమార్గములను ద్రొక్కిరి. కులము పెద్దనే యందఱికిని తండ్రిగ నెంచువా రీతనికి సర్వాధికారము నారోపించిరి. కేవలము కార్యములఁ జక్కఁబెట్ట నంగీకరించిన పురుషునిఁగ మాత్రమే యెంచినవా రతని యధికారముల కంత యాధిక్యము కల్పింపరు.

కొన్ని సంఘములలో నవిభాజ్యస్థితినుండి యవిభక్తస్థితికి మాఱు విధానములే లభింపవు. అవిభక్తకుటుంబము లన్నియు నవిభాజ్యవంశమునుండి విడివడినవే కావలసిన యావశ్యకత లేదు. దక్షిణదేశమునఁ గల నాయరుల విధానమును విమర్శించినఁ గులము పెద్దల రీతి సుబోధ మగును. వీరిలోఁ బురుషులకు బదులు స్త్రీలే యాజమాన్యమును వహింతురు. ఇదియే వారికిని వీరికిని కల భేదము. వంశయాజమాన్యవిధానమునకు నాయరుల పద్ధతి మార్గదర్శిగ నుండునని పెద్ద లనిరి. ఈ యూహను బట్టి చూడ స్త్రీపురుషులకుఁ గల వైవాహికబంధము అవిచ్ఛిన్నము గాక యైచ్ఛికమై యుండును. కావున బహుపురుషసాంగత్యము వారిలో ననువర్తనీయము. ఆజన్మము నొక భర్త నాశ్రయించుకొనక చిత్తవృత్తిని సంచరించు నధికారము స్త్రీకిఁ గలిగియున్నపుడు గృహయాజమాన్యము పురుషునిది గాక స్త్రీదే యై తీరవలయును. అట్టి స్థితిలో వారి సర్వమును స్త్రీసంతతికే సంక్రమించును. ఇద్దియే నాయరుల విధానము. ఆ దేశమునం దిప్పటికి నీ విధానమే యాచరణమం దున్నది.

మన సంస్కృతధర్మకర్తలు గ్రంథరచనకు దొరఁకొనునాఁటికి గ్రామవంశయాజమాన్యముల నతిక్రమించి ప్రతికుటుంబమును బ్రత్యేకవ్యక్తిగాఁ బరిగణింపఁబడుచుండెను. కుటుంబములోని ప్రత్యేకపురుషుల స్వాతంత్ర్యము వేఱుగఁ బరిగణింపఁబడలేదు. అవిభక్తకుటుంబపరిస్థితులనే వా రందఱును విశేషముగ వర్ణించిరి. అవిభక్తకుటుంబముల వ్యష్టి నందు నను భావసాధనలు వారికి దృగ్గోచరములు కాఁజొచ్చెను. ఇందులకు వారు తలంచిన మార్గములు

(1) స్వార్జితము (2) పంచుకొనుట (3) శాసనముల మూలమునఁ బరులకు సంక్రమింపఁజేయుటలై యున్నవి.

(1) స్వార్జితము: హిందువుల ప్రాథమికావస్థయం దిది యుచ్చటను బొడసూపదు. నిరంకుశావిభాజ్యయాజమాన్యము క్రింద నున్న వారి స్వామ్యముల కా యజమానుఁడే స్వతంత్రాధికారి కావున నందెవ్వరే యాస్తిని సంపాదించిన నది యజమానునికే చెల్లును. పిదప నవిభక్తకుటుంబవిధాన మలవడినప్పుడు స్వార్జితమున కించుకయవకాశ మలవడినది గాని యదియుఁ గుటుంబాస్తిగనే పరిగణింపఁబడుచుండెను. కుటుంబమునం దందఱును కలిసియుండి సమూహద్రవ్యముచేఁ బోషింపఁబడుచున్నంత కాలము నా కుటుంబములోని యెవఁడును దనకై ప్రత్యేకముగ నాస్తిని సంపాదింప వలనుపడదు. అం దెవ్వరు శ్రమపడి సంపాదించినను కుటుంబాస్తిలోఁ గలిసిపోవును. ఆ కుటుంబము వారిలో బట్టలనేత వడ్రంగము మున్నగు పనులఁ జేయు సామర్థ్యము గలవా రుండిన వారి శక్తియుఁ గుటుంబసంరక్షణకే వినియోగింపఁబడవలయును. నాగరకతయు లోకజ్ఞానము నతిశయించిన కొలఁది దూరదేశములతో వర్తకవ్యాపారము లతిశయించిన కొలఁదిఁ బారిశ్రామికవిధానము లనేకమార్గములఁబట్టి యభివృద్ధి నందిన కొలఁది నవిభక్తకుటుంబవిధానమున కంతరాయమును గలిగించినవి.

కుటుంబములోనివారికిఁ దమకుఁ గల పొలమును సేద్యము సేయుటకును గృహకృత్యనిర్వహణమునకును మాత్రమే బాధ్యత కలదు. కాని తదితరవిధంబుల ధనార్జనము గావించు బాధ్యత లేదు. ఆట్లొనర్చువారికిఁ బ్రత్యేకప్రతిఫలము నొసంగవలసియుండును. కుటుంబాస్తియందుఁ దనకుఁ గల హక్కును వదలుకొనఁ దలంచిన యెడల నట్లు గావింపవచ్చును. అట్లు గావించిన వెనుకఁ దన యిచ్చ వచ్చిన వృత్తి నవలంబించి యథాశక్తిని ద్రవ్య మార్జించుకొనవచ్చును. అప్పు డట్టి స్వార్జితముపై కుటుంబములోనివారి కేవిధమైన యధికారము నుండదు. కాని యిట్టి స్వాతంత్ర్యశక్తి గల పురుషుని స్వార్జితము నతనికే విడిచి యైన నవిభక్తకుటుంబములోని వానిగ నుండుకొనుట కుటుంబికులకుఁ గర్తవ్యము కుటుంబాస్తివలన జీవించుచు స్వార్జితము నందుఁ జేర్పనిచోఁ గుటుంబమునకు నష్టము కలుగును. అట్టివాని ప్రత్యేకవ్యాపారోపాధికై కూడఁ గుటుంబద్రవ్యము వెచ్చించిన మఱియు నన్యాయముగ నుండఁగలదు. ఈ విధమగు చిక్కుల నివారించుకొనుటకొఱకే స్వార్జితము నిర్ధరించు ధర్మశాస్త్రము లేర్పడినవి.

శాస్త్రజ్ఞానమువలనను బాహువిక్రమమువలనను గావింపఁబడు ధనార్జనము స్వార్జితముగఁ జిరకాలము క్రిందటనే పరిగణింపఁబడినది. భార్యామూలమున సంక్రమించెడి ధనమును బంధుమిత్రాదులొసంగు బహుమతులును చిరకాలము క్రిందటనే కారణాంతరముచే నవిభక్తకుటుంబము పోఁగొట్టుకొనిన వసతి నాకుటుంబములో నొకఁడు తన ప్రత్యేకశక్తియుక్తులచేఁ దిరిగి సంపాదించిన నదియు స్వార్జితముగనే లెక్కించిరి.

(2) విభక్తము: గ్రామమునకుఁ గాని సంఘమునకుఁ గాని యే విధమైన సంబంధమును లేక కుటుంబమునకు సంపూర్ణస్వాతంత్ర్యము గల భూవసతియే విభక్తార్హమైనది. అవిభక్తకుటుంబమునకుఁ గల యాస్తి భూరూపముననే విశేషముగ నుండినపుడు విభాగమున కంత యవసరము కలుగదు. దానిని పెక్కు భాగములుగ విభజించినప్పటికంటె సమష్టి నేకముగ నున్నపుడే విశేషలాభకారిగ నుండును. విశేషానురక్తి కవకాశము లేని గ్రామసమష్టివిధాన మంతరించినది గాని గృహయజమానుఁడు పలుకుబడి గలవాఁడుగఁ బరిణమించుచుండుట వలనను మన దేశమునకు స్వభావసిద్ధ మగు కుటుంబైకమత్యము ప్రబలముగ నుండుటవలనను సమష్టికుటుంబవిధాన మంతగ నంతరించుట కవకాశము చిక్కదు. మలబారు (మలయాళము) కనారా (కన్నడము) మున్నగు దేశములలో నిప్పటికిని పంచుకొనుట కధికారమే లేదు. కుటుంబము మిక్కిలి విశేషముగఁ బెరిగినప్పుడు వారి వసతులొక్కచోఁ గాక విడివిడిగ వేఱువేఱు జిల్లాలలో నున్నప్పుడును ఏ జిల్లాలోఁ గాపురము సేయుచున్నవారి కా జిల్లాలోని భూములు ప్రత్యేకాస్తులుగఁ బరిణమించును. ఇట్టి పరిణామమైన నందతి యిష్టమువిూఁదఁ గాని జరుగదు. కుటుంబమున నొక్కఁ డడ్డుపెట్టిన నట్టి విభజనమునకు నవకాశము లేదు.

స్వార్జితము సర్వసామాన్యమును నిశ్చితము నైనపుడే పంచుకొను తలంపులు కలుగును. ఒక పురుషుఁడు తన సమష్టికుటుంబములోని యితరులకంటె నెక్కుడు ధనము నార్జించుచున్నపుడు తా నార్జించు ధనమును వారికి సంక్రమింపఁ జేయుట కిచ్చగింపక విభక్తమై వారి పీడ వదల్చుకొని తన కష్టార్జితమును దన సంతతికి మాత్రమే చెందింప సంకల్పించును. ఈ కాలమున: దెక్కుండ్రు పంచుకొనుట కిదియే ప్రబలకారణము. కాని యిట్టి విభజనములు కుటుంబాహ్లాదకరములు కావు.

బహుమందగమనంబునఁ గాని యిప్పు డేర్పడిన విభాగాధికారము కలుగలేదు. ప్రప్రథమమునఁ గుటుంబమునుండి విభాగము నందఁదలఁచినవానికి మిగిలినవా రందఱు నేకీభవించి వారికిఁ దోఁచిన స్వల్పభాగము నొసంగుటయు వాఁ డందులకే సంతసింపవలసియుండుటయుఁ దటస్థించెను. వంశప్రధానియే నిరంకుశాధికారము గలవాఁడై యుండునప్పుడు వాని పుత్రుఁ డైనను దండ్రిని బంచిపెట్టుమని నిర్బంధింపఁ జాలఁడు. అంతకంటె నిది మెఱుఁగు గదా!

ప్రతికుమారుఁడును దండ్రికి సముఁ డగుటచే నతని ధనమును సమముగఁ బంచుకొనవలసినవా రను సూత్ర మప్పటికి లేదు. అప్పటికి బుత్రుఁడు తండ్రి ననుసరింపఁ దగినవాఁడుగఁ బరిగణింపఁబడుటచే నతని యనుగ్రహమునఁ దప్ప వాని సొత్తు ననుభవించుట కర్హుఁడు కాఁడు. మలబారునందలి (తారువార్డు) ఇప్పు డెట్లుండెనో యప్పటి కుటుంబము లట్లుండెడివి. కుటుంబాస్తిని గాపాడువాఁడుగఁ గాని భాగస్వాములలో నొకఁడుగఁ గాని కాక దానవిక్రయార్హత గల స్వతంత్రాధికారిగాఁ గులము పెద్ద పరిగణింపఁబడెను. పోషింపఁదగిన స్వాస్థ్యము కలిగినంత కాలము పోషింపఁబడుటయే మిగిలిన కుటుం

బములోనివారికిఁ గల యధికారము. అంతకు మించిన దేమియు లేదు. పితరులు జీవించియున్నంత కాలము పుత్త్రులకు విభాగార్హత లేదనియుఁ దండ్రి గతించిన వెనుకఁ గొడుకులు పంచుకొనవచ్చుననియు మానవధర్మశాస్త్రము చెప్పుచున్నది.

మనువు తన సొత్తును పుత్త్రులకుఁ దానే పంచిపెట్టెను. ఇదియే యట్టి విభాగముల కధికారముగా గ్రహింతురు. ఇంకను కొంత కాలము గడచినవెనుకఁ దండ్రి కిష్టమున్నను లేకున్నను బంచుకొను హక్కేర్పడినది. పిత్రార్జితమునఁ దండ్రికినిఁ బుత్త్రులకును సమమైన హక్కులు కలవని నిర్ధారణ చేయుటతో సంపూర్ణమైనది. అంతటితో సమష్టికుటుంబము తరతరములదనుక నిర్వహింపఁబడఁదగినది గాఁ గాక పెక్కండ్రు భాగస్వాములు గలిగి సంకల్పమాత్రమున నంతరింపఁ గల సమావేశము క్రిందఁ బరిణమించినది.

కొన్ని తావులఁ దండ్రియే గాక తల్లి కూడ నంతరించుదనుక భాగార్హత లేకుండు వాడుక గలదు. అదియుఁ గాలక్రమమున నంతరించినది.

పైని వ్రాసిన చరిత్ర నంతటిని సావధానముగఁ బరికించిన నెన్నియెన్ని విధముల మారి తుద కీ కుటుంబావస్థ చిత్తవృత్తిని విడఁగొట్టుకొనఁగల భాగస్వాముల గల వ్యాపారసమ్మేళనముగ నెంచఁబడినదో విశదము కాఁగలదు. బంగాళా ధర్మశాస్త్రము మాత్రము దండ్రియుఁ బుత్త్రులును సమభాగస్వాములని యొప్పుకొనుట లేదు. తక్కుంగల వన్నియు నట్లంగీకరించినవి.

(3) సంక్రమణము: ఆస్తి సంఘమునకు సంక్రమించుట మాని ప్రత్యేకవ్యక్తుల కలవడినతోడనే దాని నైచ్ఛికముగ నేరికైన సంక్రమింపఁజేయు నధికారము కూడ కావలసివచ్చినది. వ్యష్టభోగ్యము నందిన బంధుజనుల భూములు వారికి సంపూర్ణమైన హక్కులతో సంక్రమింపని కాలమును గాంచియుంటిమి. నారదుని కాలమునుండియు నీ వ్యవస్థ లన్నియు నంతరించినవి. ఒకప్పుడు పుత్త్రులు తమ స్వార్జితమును దానము చేయుటకుఁ గాని విక్రయించుటకు గాని హక్కు లేనివారై యుండిరి. మితాక్షరధర్మశాస్త్రానుగుణముగఁ దండ్రి తన స్వార్జితముపై సంపూర్ణస్వాతంత్ర్యము కలిగియుండునా లేదా యని మొన్న మొన్నటివఱకు సంశయాకులమై యుండెను. తండ్రియొక్క పురాతన నిరంకుశాధికారపు సూచనగఁ బిత్రార్జితమైన చరాస్తియం దతనికిఁ బూర్ణమైన హక్కిప్పటికిని గలదు. తండ్రి చేసిన ఋణములను బుత్త్రులు తీర్పవలయు ననువిధియు నందులకుఁ దార్కాణమే.

సమష్టికుటుంబాస్తికిఁ దత్కుటుంబస్థు లందఱును హక్కుగలవారనుటచేతనే యంతను గాని కొంతను గాని యందఱి యనుమతి లేక వారిలో నొక్కఁడు గాని పెక్కండ్రు గాని విక్రయింపఁజాలరని సూచించుచున్నది. ఒక యాస్తికి సమష్టి హక్కుదారు లెవ్వరనియు నందుఁ బ్రతిమనుజుఁడును దన దన భాగముపై నెట్టి యధికారము గలిగియుండు ననియు విశేషముగ వితర్కింపఁబడినది.

ఈ సమష్టికుటుంబము నిరంకుశజ్యేష్ఠాధికారమునుండి విపులమైన దగుచో నొక విధముగను, కుటుంబములోని పెద్దవాఁడు భాగస్వామియై యుండి చక్కఁబెట్టువాఁడైనచో నింకొక విధముగను బరిణమించును. మొదటి పద్ధతి నంగీకరించిన స్మృతికర్తలు కుటుంబయజమానునికిఁ బెక్కు హక్కుల నాపాదించిరి. తద్వ్యతిరిక్తాభిప్రాయము కలవారు సంకుచితపఱచిరి. ఎట్టి కాలమునఁ గల గ్రంథకర్తలైనను తమ సమకాలికధర్మములఁ బొందుపఱచునప్పుడు నిస్సంశయముగను విస్పష్టముగను వ్రాసిరి. మఱికొంత కాలమున కిట్లు వివిధ ధర్మములఁ బొందుపఱచిన పెక్కు ధర్మశాస్త్రముల సమన్వయింపఁ గోరఁగొనినప్పుడు పూర్వు లందఱుఁ బ్రామాణికు లను గౌరవస్థానము నాక్రమించినవా రగుటచేఁ గర్తవ్యనిర్ధారణమున వాదప్రతివాదములు విశేషముగ జరుగుచువచ్చెను.

పుత్త్రునకుఁ దండ్రితోఁ బంచుకొనుటవలన సొత్తు సంక్రమించునో లేక తండ్రి యనంతరము సంక్రమించునా లేక పుట్టుకతోనే సంక్రమించునా యను విషయము మితాక్షరధర్మశాస్త్రమున నెక్కుడుగ విమర్శింపఁబడినది. వాని యభిప్రాయముల నిట్లు వివరించెను.

కుటుంబసంరక్షణార్థమై సమయాసమయముల ననుసరించి చరాస్తిని వ్యయ మొనర్చుటకుఁ దండ్రి సంపూర్ణస్వాతంత్ర్య మలవడియున్నను జన్మమునందనే ప్రతిపురుషవ్యక్తికిని బిత్రార్జితమున నధికార మలవడు నని నిశ్చయింపఁబడినది. స్థిరాస్తిని తండ్రి తన పుత్త్రులయొక్కయు నితర భాగస్వాములయొక్కయు ననుమతికి లోఁబడి గాని వినిమయ మొనర్ప నధికారము లేదు. స్వార్జితమునందుఁ గూడ తండ్రికి స్వాతంత్ర్యము లేదు. ఒక పురుషుఁడు స్థిరవసతిని పశ్వాదిగణంబును దాను స్వయముగ సంపాదించినను సమష్టికుటుంబమున నున్నంత కాలము పుత్త్రులు మున్నగువారి యభిమతమును బడయక దాని వ్యయ మొనర్ప నధికారము లేదు. ఇట్లేల విధింపఁబడిన దనఁ జనించినవారును, ముందు జనింపఁబోవువారును గర్భస్థులై యున్నవారును గూడ స్వపోషణార్థమై స్వాస్థ్యమును గలిగి యుండవలెను. కావునఁ గలదానిని విక్రయింపరాదు. దాన మొసంగఁగూడదు. పితృదేవకార్యాచరణమునను మహదాపద తటస్థించినపుడును గుటుంబపోషణము కొఱకును ద్రవ్యము వలయునప్పుడు తక్కుంగలవారి యనుజ్ఞను బడయకున్నను స్థిరాస్తిని గూడ విక్రయింపనగును.

ఇట్లు స్థిరచరరూపక పదార్థముల వస్త్వాక్రాంత మొనర్చుట కవకాశములు గల్పించుటలో బ్రాహ్మణులే ముఖ్యకారకు లని చెప్పనగును. మనునిర్మితనైతిక ధర్మశాస్త్రమంతయు బ్రాహ్మణులకు దానధర్మములఁ జేయుట కవకాశములఁ గల్పించుటయే యని చెప్పనగును. ఆజన్మాంతము నడుగడుగున బ్రాహ్మణులకు దానము లొనర్చుచుండవలయును. చేసిన ప్రతిపాపమును బ్రాహ్మణులకు దాన మొనర్చుటచే నశింపఁగలదు. హిందూదేశమున నే మూలఁ జూచిన విపరీతముగఁ గాన్పించు మతవిషయిక ధర్మకార్యము వల్ల నీ ధర్మశాస్త్రములఁ బ్రజ లామోదించి రనుటకు నిదర్శనములుగ నుండును. ఉదయమున లేచినది మొదలు రాత్రి శయనించుదనుక భారతీయు లాచరించు కార్యముల విమర్శించిన నిట్టి దానధర్మములు మోక్షదాయకము లను నమ్మక వారి హృత్ఫలకముల నెట్లాకర్షించియుండెనో గ్రహింపనగును.

ధనవిషయమున మన హిందూధర్మశాస్త్రము లెట్టులెట్టుల నాది నుండియు మార్పుఁ జెంది తుద కిప్పటి కెట్టి స్థితిలోనికి వచ్చినవియు వివరించియుంటిమి. ఉపసంఘములలో సంపూర్ణైకమత్యము గూడ భారతవర్షమున నత్యంతము ప్రబలియున్న దని కూడఁ దెలిసికొనఁ గలము. అట్టి భావములు రానురాను వినిమయము నంది తుదకుఁ బ్రత్యేక వ్యక్తులుగఁ దమతమ స్వలాభమునే యపేక్షించు స్థితికి వచ్చినవి. ఇంక నీ ధర్మశాస్త్రమునఁ గొన్ని మార్పులు కలుఁగవలసియున్నవి. ఇప్పటికిని సమిష్టికుటుంబాచారము విశేషముగఁ బ్రబలియున్నవి. ఈ విషయమున మన హిందూధర్మశాస్త్రము కాలము ననుసరింపక వెనుబడియున్నది. హిందూధర్మశాస్త్రమున నేమార్పులైనను న్యాయస్థానాధికారులే కావింపవలసియున్నది. మన పండితులను బూర్తిగ నెఱింగిన కారణములచేతనే మన శాసననిర్మాణ సభల మూలమున నిట్టి మార్పులు లభింపవు. ఈ కష్టమునే న్యాయమూర్తు లగు సదాశివయ్యరు గారొక తీర్పునం దుదాహరించిరి.

“సంఘసంస్కరణాభిలాషచే న్యాయమూర్తులు ప్రచారమునం దున్న ధర్మశాస్త్రముల నెట్టి మార్పుల గలిగింపఁగూడదని గణపతయ్యరు గారొక పురాతన మగు తీర్పునుండి చదివి చూపిరి. నేను వారి వాదముతో నేకీభవించితిని. కాని యొక పురాతన ధర్మసూత్ర మీ కాలమున నెంత మాత్రమును బ్రచారమునందు లేక వ్యర్థవాక్యప్రాయ మైనప్పుడు న్యాయాధిపతి దానిని గమనింపక ప్రకృతము ననుసరించి నూతన ధర్మ ప్రతిష్ఠాపనమును గావింపఁగూడదని నే ననుకొనను. ప్రజానువర్తనీయము గాక చిరకాలము క్రిందటనే మూలఁబట్టిన యొక ధర్మసూత్రమునకు విరుద్ధముగ నున్నంత మాత్రమున, న్యాయ ప్రతిష్ఠాపనాదక్షమును, సాంఘిక దురాచార నివారకము నగు నవీనసూత్ర మనువర్తనీయము కాకపోదు. న్యాయాధికారులును, మనుష్యమాత్రులే యగుటచే వారి యభిప్రాయములలోఁ బొరపాటులు కలుగవచ్చును. సాంఘిక రాజకీయ విషయముల నట్టి ధర్మాధికారులు పూర్వాచార పరాయణులు గాని, సంస్కర్తలు గాని యగుటచేఁ గూడ నించించుక భిన్నాభిప్రాయములు కలుఁగఁగలవు. కావున మతాంతరు లగు న్యాయమూర్తుల కే యభిప్రాయములుండవు. వాది ప్రతివాదుల జాతిమత కులాచారముల తత్వము నెఱింగిన స్వదేశధర్మాధికారుల కొక విధమగు సౌకర్యమును, నింకొక విధమగు ప్రతిబంధమును గూడ కలుగుచుండును. ఆంగ్లేయ దేశమునఁ గల ధర్మశాస్త్రము లిట్లే పురాతనమై కాలానుగుణముగ నుండక పోయినప్పుడు సహజజ్ఞానమును గూడ వినియోగించి యోజించి తదనుగుణము లగు మార్పులఁ గావింపవచ్చు నని ధర్మాధికారులు నిర్ధరించిరి. వా రేర్పరచిన యా మార్పు లసమంజసము లని చెప్పవచ్చునా? సహజజ్ఞానమును ధర్మశాస్త్రమును సమావేశపరచవలసి వచ్చుటచే నెప్పటి కప్పుడు తటస్థించు ధర్మాధికారుల చిత్తవృత్తుల యందలి భేదములచేఁ గాలక్రమమున ధర్మవిధానంబులు మారుచున్నవి. కావున హిందూధర్మశాస్త్రముల విషయమునఁ గూడ నట్లే యొనర్పనగును.” అని తీర్పులో వ్రాసిరి.

కావున నిప్పటికిని జేయవలసిన మార్పులను న్యాయమూర్తులు యోజించి కావించుటయే సమంజసము.

## మార్పు జెందఁదగిన విషయము

సమిష్టికుటుంబములోనివారందఱును బెద్దవారైనను మంచిచెడ్డలను విచారించుకొని విభాగమును బూర్తిగఁ గావించుకొనునంతదనుక నా యాస్తి కుటుంబాస్తిగనే పరిగణింపఁబడుచున్నది. కాలవశంబున నొక కుటుంబమునఁ దండ్రి చనిపోవునరికి నలుగురు పుత్రులుండిరనుకొందము. వారిలో జ్యేష్ఠుఁడు యుక్తవయస్సు వచ్చియుండిన కుటుంబ యజమాని యగును. అతనికి భార్యయుఁ బిల్లలును గలిగియుండవచ్చును. మిగిలిన మువ్వురు సోదరులును చిన్న వయస్సువారై యుండవచ్చును. అట్టి తరుణమునఁ గుటుంబ ద్రవ్యమునవిశేష భాగము జ్యేష్ఠుని దారపుత్రాదుల సంరక్షణకే వినియోగపడుచుండును. అన్నగారికిఁ దమ్ములపైఁ బ్రేమ గలిగినఁ గలుగవచ్చును గాని వదినెగారికి మఱఁదులపై నంతగ దయ యుండ నవసరము కాన్పింపదు. వీలగునంతవఱకు నామె తన సంతానమునకే విశేష ధనమును నేకరించఁ గోరుచుండును. అన్నగారికిఁ గూడ నిట్టి దుర్బుద్ధియే కలుగునెడలఁ దక్కుంగల సోదరుల యవస్థ వేఱుగఁ జెప్పవలయునా?

పిత్రార్జిత మంతయును నేదో మిషమీఁదఁ గుటుంబ వ్యయము క్రింద లెక్క వ్రాయును. తన సహోదరులు పెద్దవారై పాలుపంచుకొనఁ బ్రయత్నించు నరికి జమాఖర్చులే మిగిలియుండును. మిగిలినను స్వల్పభాగము లభించును. జ్యేష్ఠుని స్వోపయోగమున కెక్కుడు ధనము వ్యయ మగుచుండునంత కాల మాతఁడు పంచుకొనుట కంగీకరింపఁడు. తనకును దన సంతానమునకును వలయు ఖర్చు లన్నియు దీరి తన సోదరుల కుటుంబములు పెరుగు తరుణమున నాతఁడే విభాగమునకుఁ బ్రయత్నించును.

మఱియొక కష్టమును జూడుఁడు. అవిభక్త కుటుంబములోని యే పురుషుఁడైన మరణించిన వానికెక్కువ యాస్తిగలవారే యైనను చచ్చినవాని భార్య మనోవర్తికే వీరిని యాచించవలసినదే. తన భర్త భాగము ననుభవించుట కా విధవ కర్హత లేదు. వానికై యావజ్జీవము వైధవ్యక్లేశము నామె యనుభవింపవలయును గాని ద్రవ్యమును గాదఁట. ఇదియెంత ఘోరము! భర్త జీవించిన నంతయు నామెదే. వానితోపాటు వాని ధనము నెగిరిపోవును.

పంచుకొనుట యనినఁ గడు ముఖ్యకర్తవ్యము మీఁదఁ గాని జరుగు పని గాదు. ఈ చిక్కుల నాలోచించియే యిటీవల 'నేఁటి నుండి పంచికొనినట్లు భావింపవలయును.' అని లిఖితరూపమునఁ దెలియఁబఱచినఁ జాలు ననియు, నంతటితో విభక్తుఁడుగనే పరిగణింపఁబడు ననియు న్యాయమూర్తులు నిర్ణయించిరి. ఇదియును జాలదు.

జాతమువలననే ప్రతిపురుషునకును బిత్రార్జితము విషయమునఁ బంచుకొనినవానికిఁ గలుగు హక్కులే వాని భాగముపైఁ గలిగియుండు నని తీర్మానించిన నీ చిక్కు లన్నియుఁ దీఱును. కుటుంబమున జనించిన పురుషు లందఱును పలువురు కలిసి పెట్టిన వ్యాపారమున భాగస్వాము లందఱికిఁ గలుగు హక్కులనే కలిగియుందు రని తీర్మానింపనగును. అప్పుడు పెద్దవాఁడు తక్కుంగలవారికి సంరక్షణకర్తగా నుండినను వానికిఁ గల స్వాతంత్ర్యములు సంకుచితములై సమష్టివ్యాపారనాయకుని స్థితియందే యుండును. అప్పుడు బాలురకన్యాయము జరుగ నవకాశ ముండదు. పెద్ద పూర్తిగ లెక్క చెప్పుటకు బద్ధుఁడై యుండును. మరణించినవారి భాగములు వారి భార్యలకు సంక్రమించుట రూపముల విశ్వస్థుల యవస్థఁ దొలంపఁబడును.

నాకుఁ దోఁచిన యీ కొద్ది మార్పును సూచించితిని. ఇంతకంటె సుకరమైన విధాన మున్న దానినే యవలంబింపవచ్చును. ఎటులైన నీ లోపమును గూడదీయుట కర్తవ్యము.

స్వరాజ్యోన్ముఖులమై యుండుటచే సంఘసంస్కరణములతోపాటు ధర్మశాస్త్రసంస్కరణములు గూడ జరిగిన, దేశ మచిరకాలమున బాగుపడఁగల దని విన్నవించుచున్నాఁడను.

# ఆంధ్రదేశపు ద్రవిడులు

అద్దంకి సీతారామయ్య గారు

ప్రస్తుతము భాషాభివృద్ధి దేశాభివృద్ధి జాత్యభివృద్ధి సంఘసంస్కరణము అనుమాటలు తఱచుగా వినవచ్చుటయే గాక కొందఱు హితైషులు చారిత్రకులు పండితులు నగు పెద్దలు పలువిధములఁ దత్ప్రచారమునకు నుపన్యాసముల నెఱపుచున్నారు. నేను ఈపేర్కొనినవారిలో చేర నర్హుఁడను గాకున్నను ఆంధ్రదేశ ద్రవిడకుటుంబములలో నొకదానిలో జన్మించినవాఁడ నగుటచేతను దేశము సర్వతోముఖముగ నభివృద్ధ్యున్ముఖమైన యీకాలమందుఁ గూడ ఆంధ్రదేశైకదేశవాసు లగు మాశాఖవారు అవనతియం దుండుటచేతను ఈసంఘమును గుఱించి కొన్ని విషయములను ఇచ్చట తెలుపఁదలఁచితిని. సహృదయులు అగు నాయకులి దలి లోపములను మన్నించి యింతకన్నను విశేషము లున్న యెడలఁ దెలియఁబఱుపఁ బ్రార్థితులు.

ద్రవిడులు గూడ నార్యకుటుంబములోఁ జేరినవారలే! పూర్వము ఆర్యులు హిమవద్వింధ్య మధ్యప్రదేశములను నివాసస్థానముగాఁ జేసికొని కొంతకాలము వసించుటచేత దానికి నార్యావర్తమని పేరు వచ్చినది గదా! కుటుంబములు వృద్ధి నైనకొలఁదిని పూర్వనివాసస్థానము చాలకుండుటయు దాన నన్యస్థానములకు వలసపోయి వసింపవలసి వచ్చుటయును జరుగుచుండును. పైనిఁ బేర్కొనిన యార్యులలో కొందఱు క్రమముగా నార్యావర్తము వదలి దక్షిణహిందూస్థానమును నివాసభూమిగా నేర్పఱచుకొనిరి. వారు అప్పటినుండియు నార్యు లను మూలనామముఁ దొలఁగి గౌడద్రావిడశబ్దములచే వ్యవహృతులైరి. దేశకాలపరిస్థితులును, ఆచారవ్యవహారములును వేషభాషలును క్రమముగా మార్పుఁ జెందుటనుబట్టి కాఁబోలుఁ బైని బేర్కొనిన యిరుతెగలవారికిని భేదము కనుపట్టుచుండుటయే గాక కొంతకాలమునకుఁ దరువాత వీ రార్యసంతతివారలేనా ? యని యనుమానించునంతటి స్థితి వచ్చినది. ప్రబలమగు నిట్టి మార్పు నొందిన యార్యులలో నుత్తరదేశమువారిని గౌడు లనియు దక్షిణదేశమువారిని ద్రావిడు లనియును బిలువఁ దొడఁగిరి. కొందఱు ఆర్యజనగర్హితము లగు కళింగోత్కళాది జనపదములకు స్మృత్యాది నిషేధములను త్యజించి జీవితార్థులై పోవుటవలన ద్రవిడులైరనియు, శత్రురాజుల ధాటికి తాఁగఁజాలక పరుగెత్తుటచేత ద్రవిడులైరని మఱికొందఱును చెప్పెదరు. కాని యిందేదియు దృఢముగ నిర్ణయింపఁదగియుండలేదు. ఈ గౌడద్రావిడులలోఁ గూడఁ గ్రమముగా నైదేసి తెగలుగ చీలి పంచగౌడులుగను పంచద్రావిడులుగను అయిరి. అంగ వంగ కళింగ పారసీకాది స్థానముల నుండువారు పంచగౌడులు అని కర్ణాటాంధ్ర ద్రావిడ ఘూర్జర మహారాష్ట్రులు పంచద్రావిడులు అనిస్మృత్యాదులవలన తెలియుచున్నది. పరదేశజులగు మూసల్మానులు మున్నగువారి ఎడతెగని దండయాత్రలవలనను, పురాణకాలము నుండియును బరంపరగా వచ్చిన మతముల మార్పులవలనను అనివార్యము లగు నితరకారణముల వలనను ఉత్తరదేశమునందలి గౌడులలో ననేక భేదములు కలుగుటవింత కాదు. కాని, యెచ్చటనో మాఱుమూలకుఁ జేరి ఏవిధమైన శత్రువుల బాధ గాని లేక, చోళపాండ్యమహీపతుల పాలనమునఁ బరమసౌఖ్యముల నంద గలిగిన ద్రవిడకుటుంబ మి ట్లనేకవిధములఁ జీలిపోవుటకు కారణ మేమో నిర్ణయింపవలసియున్నది.

**ఆంధ్రద్రవిడులపూర్వస్థితి:—** ఆంధ్రదేశమునకు వేఁగినాఁడని రాజనరేంద్రుని నాఁటినుండియు పేరున్నట్లు శాసనోదాహరణములవలనను భారతమువలనను తెలియుచున్నది. ఈ వేఁగిదేశమునకే దగ్ధరాష్ట్రము అని మఱియొక పేరు. దీనిఁ బట్టి అంతకు ముందు శత్రురాజులవలన నాంధ్రరాష్ట్రము ఏవిధమో కొన్ని కారణములవలన తగులఁబెట్టఁబడఁగా నప్పటినుండి ఈపేరు వచ్చుటయును తరువాత చోళరాజుల పాలనమునందును ఆపేరే వ్యవహృతమగుటయును మన మెఱిఁగినదే. ఈ వేఁగిదేశమునకు రాజగు విష్ణువర్ధనుని కాలమునందాతనితోఁ గలసి ద్రవిడదేశమునుండి వచ్చిన చోళమండ

లములోని కొన్ని బ్రాహ్మణకుటుంబములు ఆంధ్ర దేశమునందు నివసించుటవలన నీకుటుంబములకు ఆంధ్ర ద్రవిడ కుటుంబము లని పేరు వచ్చియుండును. ఆంధ్ర దేశమునందు ప్రస్తుతము కనిపించుచున్న ద్రవిడకుటుంబముల వారు అందఱును బ్రాహ్మణులే యై యుండుటచేతను ఆబ్రాహ్మణులలోఁగూడ తఱచుగా నాంధ్రబ్రాహ్మణులకు వలె నింటిపేరులవిషయమున గ్రామముపేర్లే యింటిపేర్లుగా కలిగియుండక పప్పువారు కత్తావారు మున్నగు విలక్షణము లగు నింటిపేర్లు కలిగియుండుటచేతను రాజే ఆ కాలమునఁ దాను పండితప్రియుఁడును బ్రాహ్మణభక్తుఁడు నగుటచేత తనతోఁగూడ తనరాజధానికి కొందఱిఁ గొనివచ్చి వారి కగ్రహారాదికముల నిచ్చి వసతులఁ గల్పించి పోషించుటచేత నీ రాంధ్రదేశముననే యుండి యుండవచ్చును. ఇట్లు కాదేని ఆ కాలమున నాంధ్రదేశమునందు వేలేశ్వరోపాధ్యాయులు మున్నగు పెక్కండ్రు సుప్రసిద్ధపండితులు లాంధ్రదేశోత్పన్ను లున్నను వారి కేరికి నీయక కేవల మొకనారాయణభట్టునకు మాత్రమే సప్తగోదావరమున నగ్రహారముగ "నందంపూడి" నొసఁగుట సంభవింపదు. నాయూహా సత్య మేని ప్రస్తుతము మనవారు అనుకొనునట్లు నన్నయభట్టు నియోగివైదికులలో నెవ్వఁడును గాక దక్షిణదేశమునుండి రాజనరేంద్రునితో వచ్చి యాంధ్రదేశమునందు నివసించి యాంధ్రమును ఆంధ్రాచారవ్యవహారములను కొంతవఱకు గారవించి యవలంబించిన యాంధ్రద్రవిడుఁడై యుండవచ్చును. నన్నయ్యవంటి పేరులు ఆంధ్రదేశమునందు నివసించు ఆంధ్రులలో నెవ్వరికిని లేకపోవుట యట్లుండ చోళదేశీయులలో నన్నూల్ నన్ని మొదలగు సజాతీయనామము లుండుటను బట్టి కూడ చూచినచో పై యంశముకొంత వఱకు స్పష్టమగును. అయినను చారిత్రికులు ఈవిషయమును గుఱించి యాలోచింపవలెను. ప్రసక్తానుప్రసక్తముగా వచ్చిన ఈ నన్నయ్యచర్చను ఇంతతో చాలించి ప్రకృతమునకు వచ్చెదను.

ఆంధ్రద్రవిడుల యాచారాదులు:— ద్రవిడదేశపు ద్రావిడులకును ఆంధ్రదేశపు ద్రావిడులకును చాల భేదములు కన్పించును. ఆంధ్రద్రావిడులు అఱవదేశపువారి వగు తెల్లబొట్టు, గుండారుపోయుట పర్యుషితాన్న భక్షణము (చల్దియన్నము దినుట) పర్యుషిత వస్త్రధారణము మొదలగువానిని వదలి ఆంధ్ర సాంప్రదాయముల ననుసరించి అక్షతలు, పింజబోసి ధోవతి కట్టుట చల్దిదినకుండుట గతదినమున నాఱవైచిన వస్త్రములను ధరింపక అప్పటికప్పుడెండవైచిన గుడ్డలను కట్టుకొనుట మొదలగు ఆచారములను స్వీకరించిరి. మఱియును స్మృతివిరుద్ధ మని ధర్మశాస్త్రజ్ఞులచే చాలకాలమునుండియు నిషేధింపఁబడిన మాతులకన్యాపరిణయము గూడ వీరిలో కొన్నిచోట్ల నున్నది. ఇంతకంటెను ప్రబలమైన మార్పు వీరిలో మఱియొకటి కలదు. అది ఏదనఁగ వీరు ఆంధ్రదేశపువాసమును స్వీకరించినది మొదలు స్వదేశభాష యగు ద్రవిడమును గ్రమముగా మఱచి పేరునకు మాత్రము ద్రావిడుల మనుకొందురు. పరదేశములో నున్నప్పుడు వ్యవహారార్థమై ఆదేశభాషను నేర్చుకొని వాడుకకు దెచ్చుకొనుట యుక్తమే గాని ఎన్నితరములు గతించినను స్వస్వపూర్వికుల జన్మభాషను వీడనాడుట మిక్కిలి యనుచితము. నిజమును పరికించినచో ఈ యభిమానగౌరవము ఆంధ్రదేశీయులలో పరిస్ఫుటమైన ట్లేదేశపు వారిలోను నగుట లేదు. ఆంధ్రరాజులు చోళదేశము పాలింపఁ బోయినప్పుడు వారివెంటఁ జనిన ఆంధ్రకుటుంబములవా రిప్పటికిని అనఁగా ఇన్నితరములు గడచుచున్నను చోళమండలములలో గృహకృత్యసంభాషణములలో నాంధ్రమునే యుపయోగించి మాతృభాషాభిమానమును చూపుచున్నారు. పీష్వాల కాలమున మహారాష్ట్రదేశమునను, మహమ్మదీయుల కాలమున పాంచాలదేశమునను, స్థిరవాసులైన యాంధ్రులు మాతృభాష నింతకాలముగడచున్నను, ఇప్పటికిని మఱవక స్మరించుచున్నారు. కాని ఆంధ్రద్రవిడులు మాత్రము ట్లేలొకో చేయ రైరి. ఆంధ్రదేశపు ద్రవిడులలో చాలవఱకు పెక్కురు వైదికవృత్తి నవలంబించి వేదశాస్త్రాదులనుచదువుట దానప్రతిగ్రహములను జేయుట మున్నగు పనులవలన జీవితమును నిర్వహించుచున్నారు. కొందఱు గ్రామాధిపతులుగను మఱికొందఱు కరణములుగను ఇంకను గొందఱు కర్షకవృత్తి గలవారుగను ఉన్నారు. కానియీరకమునఁ జేరినవారుచాల తక్కువ. ఆంధ్రదేశమునందలివైదికకుటుంబములవారు చేయుచున్న వివిధవృత్తులును ఆంధ్రద్రవిడులలోఁ గూడ గలవు. ఇది పూర్వకాలపు వృత్తాంతము. ప్రస్తుతము సర్వత్ర బ్రాహ్మణులలో నున్నట్లే వీరిలోను న్యాయవాదులు ఉద్యోగులు కరణములు లేఖకులు మున్నగు

Training College, Rajahmundry



ట్రెయినింగు కాలేజి, రాజమహేంద్రవరము

Representatives of Villege Officers in Deputation to H. E. the Governor



శ్రీ గవర్నరు గారిని సందర్శించిన గ్రామోద్యోగుల ప్రతినిధులు

The All-India Libraries Conference, Madras



అఖిలభారతగ్రంథాలయమహాసభ, మదరాసు

Bukkapatnam Ramanujiah Garu



బుక్కపట్టణము రామానుజయ్య గారు

Rangoon Andhra Mahajana Sangham, Andhra Institute,



ఆంధ్రపాఠశాల : ఆంధ్రమహాజనసంఘము, రంగూను

వివిధవృత్తులవారు నున్నారు. తమంతట దామే పేరుచెప్పి 'ద్రవిడుల'మనినంగాని వీరి నిప్పుడు మనము ద్రవిడులనుగా పోల్పలేము.

ఆంధ్ర ద్రవిడులలోని కొన్ని భేదములు:—ఇప్పుడు ఈయాంధ్ర ద్రవిడులను ఉత్తరజిల్లాలలో నున్నవారిని ఉత్తరాది ఆంధ్ర ద్రావిడు లని దక్షిణమున నున్నవారిని దక్షిణాది ఆంధ్ర ద్రావిడు లని మనము విభజించి పరిశీలింతము. కృష్ణానదికి ఉత్తరపుగట్టు అనంగా బెజవాడకు ఉత్తరమున నున్నవా రుత్తరాదివారు, కృష్ణకు దక్షిణమున పెన్నవఱకు నిటునటు వ్యాపించి యున్నవారు దక్షిణాదివారు. దక్షిణాదివారు నెల్లూరను, దానిచుట్టు ప్రక్కల నున్న తుమ్మగుంట పుదూరు అల్లూరు కొడవలూరు, గూడూరు మున్నగు గ్రామములలోను నివసించుచున్నారు. వీరిలో కొలందిపాటి [అనంగా వచ్చియును రాని] మిశ్రమ ద్రవిడభాషయును ఒప్పిదమయ్యును గాని గుండారుపోసికొనుటయును ఉండియును లేని తెల్లని గంధపుబొట్టును అనువారిలో కంచుకవిసర్జన విభూతిధారణములును తప్పవు. వేదము, అల్లాడి, వావిళ్ల, దండిగుంట, సరస్వతుల, కాళిదాసుని మున్నగు సుప్రసిద్ధకుటుంబములవా రందఱును ఈశాఖలోం జేరిన వారలే! వీరు ద్రవిడదేశమునకు కేవలమును సన్నిహితులుగా నుండుటచేతం గాంబోలు పూర్తిగ ద్రావిడ సంస్కారమును వదలిపెట్టం జాలకయును, తెలుంగు తెలుంగుదేశము, తెలుంగుజాతుల సంబంధము లధికముగా నుండుటంచేత తెలుంగువారిలోం బూర్ణముగ కలియక తప్పకయును ఉన్నారు. ఇంక నుత్తరాది ఆంధ్రద్రవిడులలో చాలవఱకు పూర్ణముగ మార్పు కలిగి యాంధ్రులను పోలి యున్నను, స్త్రీలలో మాత్రము పైట ఆవిక మున్నగువానిలో నేమియు మార్పు లేదు. కాని భాష (తమిళము) బొత్తుగా మఱచిపోయిరి.

అనంగా ఉత్తరాది ఆంధ్రద్రవిడులలో నీ క్రింది "చిలకమర్తి, అద్దంకి చెళ్లపిళ్ల, అక్కాపంతుల, ఆకొండి, పూరారు, బొమ్మిడి, కంచి, పంతులు, కారలగంటి, చామర్తి, పొన్నపల్లి, పొదిలె, నశీరావు, బుడంబి, చింతలచెరువు, మదనపంతులు, రాఘవభట్లు, చెర్ల, కూచిభట్లు, ఓలేటి, పెరుమాళ్ల, వేదులు, కాకరపర్తి, నృసింహదేవర, తాతపూడి, దుడ్డు, పప్పు, గంటి, కట్టా, పేరి, తాతా, కూచిమంచి, వఝులు, ద్వివేదులు, కట్టి, ఆదిభట్ల, బండ్లమూడి, అయ్యలసోమయాజులు, ఆర్యసోమయాజులు, కామవరపు, సరస్వతులు, రాజు, మగరాజు, అప్పావఝులు, వీరావఝులు, అనంతపిళ్ల, ఉపాధ్యాయుల, పరిమల" మున్నగు నింటిపేర్లు గలవారున్నారు.

ఇందులోని కొన్ని కుటుంబములు అనంగా అద్దంకి, అక్కాపంతుల, రావూరు, బొమ్మిడి, చామర్తి, పొదిలె, చింతలచెఱువు, పంతుల, కూచిమంచి, యింటిపేరులవారు ఆంధ్ర నియోగిబ్రాహ్మణులలోను, కంచివారు పొన్నపల్లివారు ఆంధ్రమధ్యకుటుంబములలోను నుండుటచేతను, కరణీకము మొదలగు వృత్తులు సమముగా నుండుటచేతను, వీరిని ఆంధ్ర ద్రావిడు లని పోల్చుకొనలేకున్నాము. మఱియును కొందఱు తరముల మార్పువలన రెండేసి మూండేసి యింటిపేర్లు కలిగినవారు కూడ కలరు. అక్కాపంతులవారు పెరుమాళ్లవారు మొదలగువా రిట్టివారే. ఉత్తరాదిద్రవిడకుటుంబములవారు చాలవఱకు కోనసీమయందలి యూళ్లలోను (అనంగా నిప్పటి అమలాపురము తాలూకాలోను) కాకరపఱ్ఱు మున్నగు చోట్లను అనేకులు వసించుచున్నారు. చిలకమర్తి, చెర్ల, ఆకొండి, చెళ్లపిళ్ల వారలలో చక్కని సంస్కృతాంధ్రపాండిత్యమును; వేదులు, పప్పు, కట్టా, తాతా, కూచిభట్లవారలలో శ్రౌతస్మార్తకర్మతత్పరత్వమును వేదాధ్యయనశాస్త్ర సంస్కారములును; పురాణపండా, రావూరు, చిలకమర్తి, అద్దంకి, పంతులవారలలో నుద్యోగగౌరవమును ప్రాయికముగానింతవఱకు నున్నవి. కాని ఇప్పు డివి తక్కినవారిలోవలెనే వీరిలోను అదృశ్యమగుచున్నవి.

ఆంధ్రద్రవిడుల మతము :—భరతఖండమందలి తక్కిన భాగములలో కంటె ఆంధ్రద్రవిడదేశములలో అత్యధికముగ శైవ వైష్ణవములు తాండవ మాడినవి. ఈకారణమువల్ల నాంధ్రదేశమునందును ద్రవిడదేశమునందును మతవిషయికములగు మార్పులు అనేకములు సంఘమునకు సంభవించి తాఱుమాఱులు కలిగినవి. ఆంధ్రదేశమందలి పూర్వపు ఆంధ్రులు చిరకాలమునుండి తాము స్మార్తులై స్మార్తాచారపరాయణులు నద్వైతులును శివభక్తులు నై యున్నను, మధ్యకాలములో పరిపాలకుల పట్టుదలవలననో లేక మఱి యెందువలననో చెప్పలేము గాని, లౌక్యవృత్తియం దున్న కొందఱు డెబ్బదిపాళ్లు వైష్ణవమతాంగీకారమును తన్మత చిహ్నాధారణము నొనర్చుచున్నారు. ఇట్టి స్థితిలో ఆంధ్రద్రావి

డుల మతము శైవ వైష్ణవములలో దేనికి సంబంధించి యున్నదని స్థితిగతుల నరసినచో, కేవల సాత్త్వికగుణ ప్రధాన మగు నద్వైత మనియే స్పష్ట మగును.

ఆంధ్ర ద్రవిడుల సంబంధములు:—ఆంధ్ర దేశములో నున్న ద్రవిడులు పరిమితసంఖ్యాకు లగుటచేత వీరిలో సంబంధ బాంధవములు ఎట్లు జరుగుచున్నవి యని విచారింతము. వీరిపిల్లలను అఱవదేశమువారి కిచ్చుటగాని అఱవదేశమువారి పిల్లలను వీరు చేసికొనుట గాని జరిగిన ట్లింతవఱకు నే నెంత విచారించినను కనుఁగొనఁజాల కున్నాను. దేశము, భాష, ఆచారము మొదలగునవి మాఱుటచేత దూరభారమున కోర్వఁజాలక తమిళదేశపు ద్రావిడులును వీరును సంబంధములను చేసికొనలే దని అనవచ్చును. కాని తెలుఁగుదేశములో నున్న దాక్షిణాత్యోత్తరాహ ద్రవిడులు పరస్పర సంబంధములను చేసికొనఁగూడదా? ఆంధ్రదేశములోని తక్కినవారిలోవలెనే వీరిలోఁగూడ సంఘోన్నతికి వలసిన విశాలదృష్టి సంకోచము నొందవలసియుండుట తప్పదా?

ఆంధ్ర ద్రవిడులలోని కొన్ని లోపములు:—ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి ఈసంఘము ఆంధ్రదేశమునందలి ప్రాచీనజాతులలో నొకటి యనియును తొలుత నుండియు రాజాశ్రయాదులు కలది యనియును నూత్న సంస్కారము లనిన నుత్సాహముతో నాదరించునది యనియును దెలియుచున్నది. ఇట్టిసంఘము ప్రస్తుతము మిగుల నవనతియం దుండుట ప్రత్యక్షమే! ఏల యవనతి నొందెను? తగిన నాయకులు లేరా? యనిన నన్ని విధము లగువారు నున్నారు. ఈ సంఘమువారిలో నెచ్చటనో తప్ప తఱుచు విద్యావిభవము లున్నను సాధారణముగా జీవికను నిర్వహించుకొను స్వతంత్ర విద్య గాని విభవము గాని నూటికి తొంబదిమందికి లే దనవచ్చును. కొందఱు చదువఁగలిగినను చదువునకు దగునట్లు సంపాదించుకొనఁ గల్గుట గాని సంబంధ బాంధవములను నెఱపుకొనుట గాని సంభవింప లేదు. కనుక ఏదో యొకపనిని జేసి కుక్షింభరత్వమున దిన ములు గడపవలసి వచ్చుచున్నది. అధోమయావస్థలో నున్న యీసంఘములో కన్యావిక్రయములు దాంభికాచారములు మున్నగు దుర్గుణము లెన్నెన్నియో మూర్తీభవించుచున్నవి. చిలకమర్తివారి సాంఘిక గ్రంథములలోని కథలు ఈ సంఘపు ప్రతిబింబములే యనినను అతిశయోక్తి కాదు.

ప్రస్తుతము వలయు సంస్కరణములు:—అభ్యున్నత్యవనతులలో, అవనతులను బుద్ధిబలము కొలఁదిని తప్పించుకొనుటయును ఉన్నతుల నార్జించుకొనుటయును నావశ్యకము. కావున ప్రస్తుతము మనము మూఁడు విధము లగు సంస్కరణముల నవలంబింపవలయును.

(1) ఆర్థికసంస్కరణము :— ప్రస్తుత మియ్యది మనలో కృషివైద్యములపై నెక్కువగ నాధారపడి యున్నది. కావున మన మీవిషయములందుఁ గృతార్థుల మగునట్లు కృషి చేయవలయును.

(2) సాంఘికసంస్కరణములు:— ఈశాఖవారు మిగుల కొలఁదిమంది మాత్రమే కలరు. మనము శాఖాంతరవివాహములను అనఁగా దక్షిణాది ద్రవిడులతోఁగాని, ఆంధ్రదేశపుస్మార్త బ్రాహ్మణులతోఁ గాని యిచ్చిపుచ్చుకొనుటలను చేసికొనవలయును. ఇట్లు చేయఁగలిగినచో వేదశాస్త్రములకుఁ గాని ఆచారవ్యవహారములకుఁ గాని భంగము లేకుండుటయే గాక మనకు యుక్తసంబంధములు కుదిరి ఉన్నతి చేకూరును.

3 నైతిక సంస్కరణములు:— నీతిబాహ్యము లయిన యాచారములను తొలఁగించు సాధనముల గ్రహించి ఆచరించుటయే ఇందలి ముఖ్యకార్యము. మనవారిలో నున్న కన్యావిక్రయాదిదురాచారములు తప్పక సంస్కరింపఁబడవలయును. విద్యానిధులు పారిశ్రామికములు మనలో వ్యాప్తి గాంచునట్లు చేయవలయును. కావున బుద్ధిమంతు లగు పెద్దలు ఈ విషయములను గుర్తించి సంఘమును వృద్ధిలోనికివచ్చునట్లు ప్రయత్నింపఁ బ్రార్థించుచున్నాను.

# జాతీయవిద్యాస్వరూపము

**కొండవర్తి వీరభద్రాచార్యులు గారు**

నరునం దనేకశక్తులు గలవు. కొన్ని ప్రస్ఫుటములుగ నున్నవి. మఱికొన్ని యవ్యక్తరూపమున లో నడఁగి యున్నవి. ఈ శక్తుల నన్నిటిని ప్రకాశమునకుం దెచ్చునదే విద్య. అన్ని శక్తులను బలపఱచి యేది కావలసి యున్నదో దానిని ప్రవృత్తియందుం బెట్టుట కనువగు రీతి వానిం ద్రిప్పఁజాలుటే విద్యయొక్క ఫలము.

మానవునందు త్రివిధశక్తులు గలవు: శారీరకశక్తి, మనశ్శక్తి, రసజ్ఞశక్తి. ఈ శక్తులకు వాహనములుగ స్థూలశరీరము మెదడు హృదయము నొప్పు నని చెప్పఁదగును. అయినను, ఈ శక్తులు గాని వాని వాహనములు గాని పూర్ణముగ విడిపోయి వేఱువేఱుగ నుండునవి గావు. ఆ శక్తులు మిశ్రములై పరస్పరబంధములతో నొప్పును; అటులే వాని వాహనములును నొండొంటితోఁ గలిసియుండును. దేనిని గాని పూర్తిగ విడఁదీసిచూపుటకు వలనుపడదు. కావున దేనిని ప్రత్యేకము ప్రత్యేకముగ వృద్ధికి తెచ్చుటయు పొసఁగదు. అన్నింటిని బలపఱచుచు నం దొక్కొక్కదానిని విశేషప్రత్యేకనిర్దేశముగ నొనర్పవచ్చును. అటు గాక మానవునందలి యీ శక్తులను భిన్నములుగ నెంచి, యొక్కొక దానిని మాత్రమె ప్రబోధింప నెంచి, దాని వాహనమును మాత్రమె బలపఱచు యత్నముల చేయుటచేతనే ప్రస్తుతము మన దేశమునం దాచరణములో నున్న విద్యావిధానము నిష్ఫల మైనది; మఱియు ననర్థదాయకము నైనది.

ఇంగ్లండునందును మన పాఠశాలలందు నేర్పుచున్న విద్య మనశ్శక్తులను మాత్రమే బలపఱచునదై మెదడునకు తగిన యాకారమును సమకూర్చుచుండెను. ఈ విద్యావిధానము శారీరకదార్ఢ్యమును గాని రసజ్ఞతా నైపుణిని గాని పోషింప యత్నించియుండ లేదు. రథమునకు రెండు గుఱ్ఱములను బూన్చి యం దొకదానిని మాత్రము నదలింపఁజూచిన ట్లయినది. శరీరము మనస్సు ననుసరించి నడువవలయును. ఇవి రెండును హృదయముయొక్క పరిపాలనమున నుండవలయును. మనస్సు విలువిద్యను గఱచ నభిలషించుచుండ, శరీరము మొల్లయుద్ధమున గాయశ్రమము చేయుట నిష్ఫలము. హృదయము నవరసశోభిత మగు గ్రంథరాజమును రచింపఁగోరుచుండ, మనస్సును యుద్ధమున శత్రుమథనమునకై సిద్ధపఱచుట యసంభవము. ఈ మూటికిని పొసఁగ సఖ్యము చేకూర్చు విద్యావిధానమే పూర్ణఫలము నొసఁగఁగలదు. హృదయమున నెట్టి యాశయముల ప్రబోధింపవలయునో ముందుగ నిర్ణయింపవలయును. వాని కనువగు భావములను మనస్సున ప్రవేశపెట్టవలయును. వాని కనువగు రీతి శరీరమునకు వ్యాయామమును గల్పింపవలయును. ఇట్లనుటచే నరుఁ డొక్కవాంఛను గ్రహించి, దాని కనువగు తలఁపులను మాత్రమే పురికొల్పుచు, వానికి మాత్రమే యవశ్య మగు నవయవములను దృఢపఱచుట పొసఁగు నని యర్థము గాదు. అన్నిటిని సామాన్యవ్యాయామమును జేకూర్చి వాని నారోగ్యదశకుఁ దెచ్చి యనంతరము ప్రత్యేకప్రయత్నములను సాగించి ప్రత్యేకఫలములు పడయవచ్చును. చిత్రపటముల రచించు నభిలాష గలవాఁ డొకఁ డుండె ననుకొనుఁడు. వాని కీ వాహనములు మూఁడును నారోగ్యస్థితియం దుండవలెను. హృదయప్రవృత్తి యందత్యధికముగ నుండవలెను. తాను రచింప నెంచు పటమున నే రసమును ప్రదర్శింప నెంచునో, దాని చిత్రకారుఁడు హృదయమున ముందుగ ప్రసరింపఁ జేయును. తరువాత మెదడునకు వ్యాయామము నిచ్చి యా రసప్రచారమున కనువగు నూహలను సమావేశపఱచును. వాని హృదయము రసపూరిత మగుటకు వాని మనస్సు గూడ నిర్మలముగ నుండవలెను. అందుచే నతఁ డారోగ్యస్థితియం దుండితీరవలెను. ఈ రెండును సమకూడి శరీరము రోగపీడిత మయ్యె ననుకొనుఁడు. అప్పుడును కార్యసిద్ధి కలుగదు. మల్లుని శరీరమువలె మహాబలసమన్వితముగ నుండనక్కఱ లేదు గాని, యారోగ్య మత్యావశ్యకమే.

వ్యక్తి మానవునకట్లె జాతియు వర్తించును. జాతి

యన మానవసంఘము. జాతికిని శరీరము మెదడు హృదయము గలవని చెప్పవచ్చును. జాతిహృదయము జాతీయరాగమును పాడవలయు నన్న వ్యష్టిమానవుల హృదయము లందున కనుగుణ మగు స్వరముల ప్రచరించుచు, తమతమ వ్యష్టికర్తవ్యముల నెఱవేర్చుచుండవలయును. మెదడు కావలయు తంతుజాలముల సమకూర్చు నుపాయముల నాలోచించుచుండవలయును. శరీరము తక్కిన రెండింటి ననుసరించి వాని పనుపును చెల్లించుచుండవలయును. అప్పుడే జాతీయగీతము కుస్వరములు లేకుండ చక్కఁగ సాగఁగలదు. వీనిలో వీనికి సామరస్యము కుదుటఁబడనిమెడల, దేనివలన వక్రగతి యేర్పడుచుండునో లేక యేది యసమర్థమై కలిసి రాదో, అది తాను చెడుటే గాక తక్కినవానిని కూడ చెఱచును. అపమార్గమున కఱచిన విద్య నిష్ఫలమగుటే గాక మఱియు విద్యార్థుల వ్యర్థులుగ నొనర్చుటే గాక జాతికి ననర్థమును కలిగించును. మఱియు నక్రమము గాని విద్యయు సాగిరాదు.

జాతీయహృదయముతో సామరస్యమున పరఁగని విద్య నిర్జీవమగును. ఉదాహరణమునకు భూగోళశాస్త్రమును విచారింపుఁడు. హృదయమును ప్రచలింపని భూగోళశాస్త్రపఠనము భూమి యొక నిర్జీవ మృత్పిండమని తెలుపును. దానిని గూర్చి కొన్ని మంచి సంగతులనే నేర్పవచ్చును. అ వన్నియు మన జ్ఞాపకశక్తిని పీడించునే కాని మన హృద్గతరసములను ప్రకాశమునకు తేఁజాలవు. ఆ స్థలముల పేర్లు నదుల నామములు జాతుల పేర్లు మనయందు దేశాభిమానమును గాని సాటి దేశీయులతోడి భ్రాతృభావమును గాని యితర దేశీయులతోడి సానుభూతిని గాని పురికొలుపవు. మన దేశీయులకును నితర దేశీయులకును మాతృదేశస్వరూపస్థితిగతు లెంతవఱకు సమానధర్మముల కుదిర్చినవో, ఎంతవఱకు భిన్నలక్షణములను వైరము లేకుండ సామరస్యమున వఱలునట్లు గావించు మార్గముల సంభవముగ నొనర్చుచున్నవో కేవలపుస్తకపఠనము నేర్పఁజాలదు. ఒక దేశమునుగూర్చి యభిమానముచే నిండిన హృదయముతో భూగోళశాస్త్రమును చదివినఁ గాని యా జ్ఞానమువలన ప్రయోజన ముండదు. కావున భూగోళశాస్త్రపఠనము పాఠశాలలందు నెలకొలిపిన మెడల, దానివలన దేశాభిమానము మాతృదేశారాధనాభిలాష పరదేశీయసానుభూతి వొడమునట్లు బోధింపవలయును.

చరిత్రపఠన మనఁగా కొన్ని నరసంఘముల పోరులు జయములు అపజయములు వాని కాలములు మాత్రముగ నుండఁదగదు. బజారునందు జరుగు పుక్కిటి పురాణముగ నుండఁదగదు. మనస్సునకు పీడాకరముగఁ గాని వ్యర్థప్రసంగముగఁ గాని యుండఁదగదు. చరిత్రయందు మనము పఠించు చరితలు జ్ఞానదాయకములుగను స్వీయవర్తనమును సంస్కరించునవిగను దేశసేవ కుపకరించునవిగను నుండవలయును. చరిత్రయందు కాన్పించు రాజకీయపరివర్తనములు మన బాలుర జీవితములకు సంబంధము లేనివిగను ప్రస్తుతరాజకీయపరిస్థితులతో పోల్పఁదగనివిగను వాని జ్ఞానమువలన దేశసమస్యలు పరిష్కృతములు చేయఁగూడనివిగను నున్నచో వాని నెవఁడును మనస్సున ధారణచేయనొల్లఁడు. తన చరితల సంస్కరించుట కనువు గాని యుదంతములను బుద్ధిమంతుఁ డెవఁడును పాటింపడు. ఒక బానిసవాఁడుండె ననుకొనుఁడు. వానికి స్వీయజీవితముమీఁదఁ గాని సాంఘికజీవితముమీఁద గాని చివరకుఁ దన ప్రాణముమీఁదఁ గాని యధికారము లేదు. వానికి జీవితచరిత్రలను దేశచరిత్రలను పఠింపవలయు నను నిచ్ఛ యుండునా? విద్యార్థులు రాజకీయపరివర్తనములందు నిమగ్నులగుట తగదు గాని వారి భావిజీవితమున చరిత్రజ్ఞాన ముపకరించు నను ధైర్య ముండితీరవలయును. సాంఘికజీవితమున తాము ప్రముఖుల మగుదు మను జ్ఞానము వారి కుండవలెను. తాము పఠించు చరితలను విమర్శించి వానివలన కలిగిన లాభాలాభముల గ్రహింపవలయును. జాతి పరిణామమున తనకు పా లుండు నని తెలిసికొనవలయును. అప్పుడు దేశసేవం గూర్చిన వాని యాప్సితములకు తగిన మనోభావములు చరిత్రపఠనమువలన వానికి లభించును. వాని కనుగుణ్యముగ నతఁడు శరీరపోషణమును చేసికొనును.

విద్యార్థుల భావిజీవితసరణి కనుకూలము లగు నభిమానవిద్యలను గఱపవలయునే కాని మాననీయములను భావముతో సకలవిషయముల నందఱకుఁ గఱపఁదగదు. సేద్యమునం దభిలాష గల విద్యార్థికి వృక్షశాస్త్రమును సస్యశాస్త్రమును బాగుగ బోధింపవలయును. వాని మాతృదేశభూజములకును అన్యదేశవృక్షములకును పంటలకును గల భేద మేమో, అందులకు కారణము లగు శీతోష్ణాదిపరిస్థితు లెవ్వియో, ఏ మా

ర్పులు వాని మాతృదేశసస్యసంపదను వృద్ధి చేయునో వానికి తెలుపవలయును. అట్టి బాలుఁడు చరిత్రపఠనమున నరుచి చూపినయెడల వానికి విద్యయే లేకుండఁ జేయఁదగదు. వానికి బహుభాషాభ్యసనమున ననిష్టము పొడమినయెడల వానిని నిరంతరాజ్ఞానాంధకారమున పడఁద్రోయరాదు. వాని యభిమానవిద్యను పెంపొందించి యతని సేవ దేశాభ్యుదయమున కెట్లుపకరించునో వ్యక్తపఱచి వాని జన్మమును సార్థకము చేయవలయును. జాతీయాభ్యుదయమునకు కర్షకు లెట్లు మహోపకారము చేయువారో, వా రెంత పూజనీయులో వానికి బోధింపవలయును. వానికి తగిన దేశారాధన కుతూహలమును తదనుగుణ మగు బుద్ధివికాసమును వాని జీవితవిధానమునకు వలయు దేహపాటవమును వానికి సులభములు చేయవలయును.

జాతియం దొక బాలుఁడు గాని బాలిక గాని వ్యర్థజీవి కాఁగూడదు. ప్రతి వ్యష్టియు తన జాతి కుపకృతి యొనర్పవలయును. అప్పుడే యా వ్యష్టియొక్క జీవితము సఫల మగును. అందుకొఱకే తా నీ ప్రపంచమున జననము గాంచుట. ఈ గమ్యార్థము నెఱింగి తత్సాధనమునకు వలయు శిక్షణము నందుటె విద్య యనంబడును. కావున ప్రతివిద్యార్థియు తాను స్వజాతికి సేవ సేయవలసియున్నట్టు గ్రహింపవలయును. ఆ సేవయం దత్యంతము నానందము గాంచవలయును. ఆ సేవ యనుల్లంఘనీయముగ నొప్పుకొనవలయును. ఆ సేవాధర్మనిర్వహణమును గూర్చి గర్వ మందవలయును. ఈ విషయమును జపానుదేశీయులు పసిబిడ్డలకు కూడ చక్కఁగ నేర్పుదురు. మొదటి తరగతులందే విద్యార్థులు "జపాను దేశము నాది" యనుటను నేర్చుకొందురు. అచ్చటి బాల బాలికలు "ఈ దేశము మాది" యని చెప్పరు; "నాది" యందురు. 'మాది' యనునప్పటికంటె 'నాది' యనుటచేత దేశసేవానురక్తికి దృఢతరమైన పునాది యేర్పడుచున్నది. 'మాది' యని యందఱితోపాటు దేశసేవ చేయఁబూనునప్పుడు "చాలమంది యున్నారు గదా, నే నొక్కఁడ నుపేక్షించిన నేమి" యని యేమఱవచ్చును. "నాది" యనునప్పుడు స్వధర్మమై దేశసేవ యనుల్లంఘనీయ మగుచున్నది. నిండు మనసుతో పూనుకొనిన స్వధర్మమునం దానందము గలదు. అది మహాపావనతరమును ప్రియతరము నగుచున్నది. అందుకొఱకగు శిక్షను సంతోషపూర్వకముగ పడయుచు స్వవిమర్శనమును పూని తనయం దున్న శక్తులను ప్రకాశమునకుఁ దెచ్చి వాని సహాయమున నుత్తమదేశసేవ సతఁడు చేయగలఁడు. అప్పుడు విద్య సుసంకల్పయుతమై మహనీయఫలముల నొసంగఁగలదు. ప్రతివాఁడును జీవితమున తన స్థితిగతులఁ గూర్చి పరితపింపక దైవమును దూఱక తనకు తగిన కర్తవ్యములనే పూనుకొని వానిని నిరసింపక సమస్తవిధజీవితధర్మములును పావనతరము లను జ్ఞానముతో మెలంగఁగలఁడు. అప్పుడు సింహాసనాసీనుఁడగు రాజు స్వధర్మమును యుద్ధములో శత్రుసంహారము చేయు యోధుని స్వధర్మమును పొలములలో కూలిపని చేయు సేవకుని స్వధర్మమును రోడ్డుమీఁద పెంట నూడ్చువాని స్వధర్మమును గౌరవమున సమాన మగును. అప్పు డొకని దేశసేవ హెచ్చును మఱొకనిది తక్కువయు నను భ్రమ వీడును. వృత్తుల కన్నిటికిని గౌరవము లభించును. కులద్వేషములు వృత్తివైషమ్యములు స్వదేశసేవావ్రతపావనాగ్నిచే భస్మీపటలము గావింపఁబడును. అప్పుడు ప్రతివాఁడును మహానందముతో తా నే పనిని నిర్వహింపఁగలఁడో యందుల కను వగు శిక్షణమును పొంది, యాత్మగౌరవము కొఱవడునేమో యను శంక లేక జనసామాన్యము పూర్ణముగ కృతకృత్యు లగుట చేకూఱును.

ప్రతివానికిని మున్ముందు సామాన్యవిద్యను, అనఁగా స్వభాషలో వ్రాయుట చదువుట చిన్నచిన్న లెక్కలను వేయుట సాధారణచిత్రలేఖనము నేర్పుచు, వానికే విషయమునం దుత్సాహము గలుగునో కనిపెట్టవలయును. వాని యుత్సాహమును పురికొల్పు విషయము ననుసరించి వాని మనోబలమును దృఢపఱుపవలయును. దీనినే యభిమానవిద్యగా పరిణమింపఁజేయవలయును. ప్రత్యేకమానవులకు ప్రత్యేకాభిమానవిషయము లలవడునటులే ప్రత్యేకజాతులకు ప్రత్యేకాభిమానవిషయములు వఱలుచున్నవి. పాశ్చాత్యజాతులును ప్రాచ్యజాతులును గుణకర్మములందును జీవితపరమావధులందును భేదము గలవారుగ నున్నారు. ఆంగ్లేయులును హైందవులును సర్వత్ర యేకగమ్యార్థము గలవా రెన్నఁడును కాఁజాలరు. ఆంగ్లేయులు జగమునఁ గల ప్రకృతి పదార్థములను శక్తులను వశము చేసికొని వాని నన్నింటిని నరుని యైహికసౌఖ్యమును పెంపొందించు లీల నుపయోగించుకొనఁ జూతురు. జగమున సర్వమును నరుని సౌఖ్యముకొఱ కీశ్వరునిచే సృజింపఁబడె నని వారి యభి

ప్రాయము. పంచభూతములచేతను సేవలు చేయించుకొనుట వారి గమ్యార్థము. ఇట్టి గమ్యార్థముతో వారు ప్రకృతిపదార్థములను ప్రకృతిశక్తులను స్వాధీనము చేసికొని, వానితో నవ్యతరవస్తుజాలమును నిర్మించి యా వస్తుజాలము నంతటిని సామాన్యనరునికి నుపయోగపడునట్లు గావింపఁజూచుచున్నారు. నేఁడు విశేష మగు కష్టముతోడను వ్యయముతోడను చాకచక్యముతోడను నిర్మితమగు మహాయంత్రము రేపు సులభముగను చవుకగను నితరయాంత్రికసాహాయ్యమునను తయారగుచున్నది. రైలుబండ్లు ద్విచక్రులు విమానములు నేతయంత్రములు మున్నగున వెన్నెన్నియో జనసామాన్యమునకు ననుదినావశ్యకములై స్వల్పపు వ్యయముతో ననుభవనీయము లగుచున్నవి. దీని ఫలిత మేమి? నేఁడు జయశీలుఁ డగువాఁడు రేపు బానిస యగుచున్నాఁడు. నేఁడు తన ధీశక్తివలన నిర్జించి వశపఱచుకొనిన ప్రకృతిపదార్థములు జీవితావశ్యకములై వానిని లోఁబఱచుకొనుచున్నవి. అవి లేకుండ నిమిషము జీవింపఁజాలఁడు. వాని కతఁడు దాసుఁడై పోయినాఁడు.

ఎంతయో కష్టపడి యెంత బుద్ధిబలమునో వ్యయము చేసి మిగుల చేఁదును నోటి కసహ్యము నగు తేయాకు నెన్నెన్నియో యుపాయములచే మార్చి నీటిలో గాచి పాలను పంచదారను చేర్చి పానయోగ్య పదార్థమును తయారు చేయుచున్నాము. ఈ పానీయము దేహదార్ఢ్యమున కనువగునదా? కాదు. ఆధ్యాత్మికసాధనమా? కాదు. బుద్ధిబలమును పెంపొందించునదా? కాదు. దానికి దాసులైనవారు దానిని విడువఁగలరా? లేరు. పట్టణవాసులై తీవ్రప్రవృత్తి కలవడి మోటారుబండ్లు ట్రాంబండ్లు వైద్యుతదీపములు జీవితావశ్యకపదార్థజాలములోనికిఁ జొన్పినవారు వానిని విడిచి నిమిషము బ్రతుకఁగలరా? లేరు. అటులైన, వీరి సౌఖ్యమవి లేక పల్లెలలో నివసించువారి సౌఖ్యమును మించి యున్నదా? లేదు. నిష్పక్షపాతబుద్ధితో చూచిన ప్రకృతిని వశముచేసికొని దానికి దాసులైన నగరవాసులకంటె నితరులె యెక్కువ సుఖముల ననుభవించుచున్నారు. నగరవాసి కేది యొకింత కొఱవడినను తీరని దుఃఖమే.

ప్రాచ్యుల స్థితి యెట్లున్నది? వారి పరమావధి యేమి? వీరును ప్రకృతిశక్తులను పంచభూతములను మాలిమి చేయఁజూతురు. వాని సహాయమున నూతనవస్తువులను సృజించెదరు. కాని, యా వస్తుజాలమును జీవితావశ్యకములలోనికి రానీయరు. జనసామాన్యమునకు వీనితో పని లేదు. ముతకయన్నము ముతకబట్ట పర్ణశాల మృణ్మయపాత్రలు వీరికి చాలును. కడుపు నిండ నన్నము ఒడలు నిండ వలువలు నున్న చాలును. ఏదేని తనకు రాఁదగినది రాలే దనుకొనినఁ గాని దుఃఖము కలుగదు. సామాన్యనరుఁ డెవఁడును రాజుగారి కొమార్తె తనకు భార్య గావలె నని కోరఁడు. ఆ వియ్యము కుదురలే దని దుఃఖింపఁడు. పేద యెన్నఁడును మోటారుబండిపై స్వారి చేయ నభిలషింపఁడు. తన కది లేదని యేడ్వఁడు. ఇతఁడు తనకుఁ గావలయు కూడు గుడ్డ యున్న భూతలస్వర్గము ననుభవించును.

అటులైన, ప్రాచ్యులు నాగరికము నెఱుంగక మోటువారలై మనుచుండిరా? తాజమహాలు పూర్వపు డక్కా-మజిలీనులు కాశ్మీరశాలువులు అత్తరులు అజంతాగుహాంతరచిత్రశిల్పములు వారి నాగరికమును చెప్పకయే చెప్పుచున్నవి. అట్లయిన భేద మెక్కడ? తాజమహాలును నిర్మించిన శిల్పాచార్యులు దానిని చక్రవర్తుల కర్పించిరే కాని తాము నట్టిదానిని నిర్మించుకొన యత్నించి యభావముచే దుఃఖితులు గాలేదు. మజిలీనుల నేసిన సాలీలు వానిని శ్రీమంతుల కిడి తాము సామాన్యవసనములనే ధరించిరి. మన జమీందారులయొద్దను మహారాజులయొద్దను నుండు శిల్పులు చిత్రకరులు సేవకులు ఎట్లుందురో చూడుఁడు. తమ నిపుణతను రాజులకొఱకె వినియోగించి తాము స్వాధీనముచేసికొనిన ప్రకృతిశక్తికి దాసులు గాక వారు స్వతంత్రజీవులై సుఖింతురు. పాశ్చాత్యప్రాచ్యజీవితాదర్శములం దుండు భేద మిదియే. ఒకరు ప్రకృతిని జయించి నిర్జితప్రకృతికి తామే దాసు లగుదురు; మఱొకరు ప్రకృతిని జయించి దానికి దాసులు గాక దాని నెల్లెడల దాసిగానె యుపయోగింతురు. రాజులు శ్రీమంతులు సైతము వర్ణాశ్రమనియమములఁ బాటించుచు నాడంబరరహితజీవితము లందు చాల కాలము గడపుచుందురు. భోగములను త్యజించి వైచుట ధర్మరక్షణమున కవశ్య మగునేని కన్నీరు విడువక యానందముతో వాని నావలఁ ద్రోయ సంసిద్ధులై యుందురు.

పాశ్చాత్యభూములందు ప్రతివాఁడును నాగరికతాగ్రము నధిష్ఠించి భోగముల నందగోరుచుండును. నేఁడు రాజసేవకుఁడుగా నున్నవాఁడు రేపు రాజుగానో లేక గొప్ప యుద్యోగిగానో కాఁజూచుచుండును. నేఁడు

కూలిపని చేయువాఁడు రేపు శ్రీమంతుఁడై యంత్రాలయాధికారిగాఁ గాఁజూచుచుండును. అందఱికిని ధనార్జనము భోగపరాయణత సామాన్యధర్మము లైపోయినవి. హిందూదేశమును గూర్చి ముఖ్యముగ విచారింతము. మన కట్టి సమస్తజనులకు నుపకరించునట్టి గమ్యార్థ మొక్కటిగ లేదు. నరులు భిన్నశక్తులతో వఱలుటను గ్రహించితిమి. వారివారి స్థితులలోని భేదములను సహజము లని గ్రహించితిమి. మనము భోగములను పరమావధిగ నెన్నఁడును గ్రహింపలేదు. స్వధర్మపరిపాలనమే గమ్యార్థ మని గ్రహించియుంటిమి. ప్రతివానికిని స్వధర్మమేమియో తెలుపుట వాని కా ధర్మమునం దభిమానమును కల్గించుట దాని నిర్వహణమున కనువగు సమర్థతను చేకూర్చుట స్వధర్మనిర్వహణము నానందముగ నొనర్చుట హిందూవిద్యావిధానమై యున్నది. ధనముచే కొనఁగల సమస్తవస్తువులవలనను లభించు నానందము, భావమును మార్చి మనస్సును సుశిక్షితముగ నొనర్చితిమేని, స్వధర్మనిర్వహణమువలన లభింపఁగలదు. మఱియు సుఖతరముగ లభింపఁగలదు. స్వశక్తులను తన యిచ్ఛానుసార ముపయోగించుట చేతనే లభింపఁగలదు. దానిని సమకూర్చునదే స్వాభావిక మగు విద్యావిధానము.

ఐహికసుఖవాంఛలు లేనివానికి స్పర్థ యుండదు. మత్సర ముండదు. అసూయ యుండదు. ఇతరులతోడి వైరము పొసఁగదు. నిరంకుశవాంఛాతత్పరులు గాక, స్వశక్తుల ననుసరించి స్వధర్మమును నిర్ణయించుకొని తదనుగుణ్య మగు జీవితాదర్శముల నెలకొలుపుకొని వర్తించుట ప్రాచ్యుల సాంప్రదాయము. ప్రజాసామాన్యము స్వధర్మనిర్వహణమున లభించు సౌఖ్యము ననుభవింపవచ్చును. కాని, కేవలము సౌఖ్యముకొఱకై స్వధర్మమును నిర్ణయించుకొనరాదు. స్వధర్మము మానసిక శారీరక శక్తులను నాధ్యాత్మికాదర్శములను ననుసరించియుండును. కావున స్వధర్మనిర్వహణమున కాయత్తపఱచు విద్య వారివారి యాదర్శముల కనుకూలముగ నుండవలయును. ఒక జాతివారి విద్యావిధానము వేఱొకజాతి కనుకూలింపదు. స్వసౌఖ్యమో స్వజాతిసౌఖ్యమో గరిష్ఠసంఖ్యాకుల సౌఖ్యమో నరుని ధర్మమునకు పరమావధిగ నంగీకరించు పాశ్చాత్య సాంప్రదాయములును వాని ననుసరించు విద్యావిధానమును మనకు సరిపడవు.

కావున భారత జాతీయవిద్య భారత సాంప్రదాయానుగుణ్యముగ నుండవలయును. ఆధ్యాత్మికాదర్శములకు ప్రాముఖ్యము నిచ్చునదిగ నుండవలయును. జాతిని పారమార్థికచింతనుండి తొలఁగించునదిగ నుండఁదగదు. స్వధర్మానుసరణిని వచ్చు సౌఖ్యము నంగీకరించినను సుఖమే జీవితపరమావధిగ నెంచునదిగ నుండఁదగదు. ఇతరులు తమతమ స్వధర్మములచే నెక్కుడు సుఖవంతులుగ చూపట్టినను, అందఱికి నా యాదర్శమును గ్రాహ్యముగ బోధింపరాదు. మఱియు నైహికసంపదలందు మన జాతిలో జనసామాన్యము పేదలుగ నుందురు. వారికి ధనార్జనమె పరమావధిగ చూపరాదు. పేదఱికమునం దానందము నందఁగల శక్తి నొసఁగవలయును. విద్యాభ్యాసకాలమున శ్రీమంతులు నయితము సామాన్యజనుల జీవితముల కలవడవలయును. శ్రీరామచంద్రాదులు పర్ణశాలలందు పేదలగు గురువుల పాదారవిందములయొద్ద విద్య గఱచి రను మాట మఱువఁదగదు. విద్యాలయములను ఘనతరభవనములుగను ధనవ్యయమునకు మూలములుగను నొనర్చుట తప్పు. విద్యాలయములందును భోగవాంఛలు పెంపొందుట కవకాశముల కల్పించుట గొప్ప లోపము. పేదలగు జనసామాన్యమునకు విద్య సులభముగ నుండవలయును. చవుకగ నుత్తమవిద్యను లభింపఁజేయుట విద్యయం దలసభావమును కల్పించుట యను సిద్ధాంతమును నిరసింపవలయును. స్వధర్మము మొదటను పిమ్మట సుఖమును గ్రాహ్యము లని తెలియవలయును. ఇట్టి లక్షణముల వెలయు విధానమే భారతీయులకు శరణ్యము.

# సారస్వతము

**కవికొండల వేంకటరావు గారు, బి. ఏ., బి. ఎల్.**

## i సారస్వత విభేదము

సారస్వత మొక మహాసముద్రమువంటిది. వలలతోఁ దట్టలతో నట్టడుగునకు మునిఁగి నెమకి నెమకి మంచి ముత్తెములఁ గొనువట్టొకఁడు మేలైన తెలఁపులను గ్రహించుకొనుచున్నాఁడు. భంగఫేనసంకులచిత్తుఁ డగుచుఁ బైపై నీఁదులాడువాని భంగి మఱియొక్కఁడు కించిదవగాహనాపాంభావమున విఫలమనోరథుఁ డగుచున్నాఁడు. ఉప్పును దిగవిడిచి తీయని మంచినీటి నావిరి రూపముగ గ్రహించి చల్లని మొయిళ్ల మూలమున లోకమంతటను వాన చినుకుల వెదఁజల్లు సూర్యకిరణప్రసారంబువోలె వేఱొక్కఁడు విశేషార్థముల నాకలించుచుఁ బ్రపంచమునకుఁ బ్రచుర పఱచుచున్నాఁడు. సారస్వతమహాసముద్ర మనాదిప్రసిద్ధమైనది. అనంతశోభను విలసిల్లుచున్నది. దిఙ్మండలాక్రాంతము నోలలాడుచున్నది. నదీనదసంచయంబువోలె వేవేల విధంబులఁ గవిగణంబులు విచ్చలవిడి దానికిఁ బోషణ మొసంగుచున్నారు. తత్సాంగత్య సన్నిధానంబునఁ బవిత్రు లగుచున్నారు. మహాసముద్రమునకుఁ బ్రత్యేకనామముల వహించి ఉపసముద్రములు అఖాతములు శాఖలు చొప్పడు చొప్పున సారస్వతమునకు నాంధ్రసారస్వతము సంస్కృతసారస్వతము ఆంగ్లసారస్వతము మున్నగు విభేదములు కన్పట్టుచున్నవి.

మానవున కితరజంతుసంతానములపైఁ గల యాధిక్య మతనికిఁ గల విపులమైన యనుభవమునుబట్టి, అతనికిఁ గల విచిత్రమైన రసజ్ఞతను బట్టి, అతనికిఁ గల విమలభావనాశక్తినిబట్టి, అతనికిఁ గల విశేషమైన యాశయోన్నతిని బట్టి అతనికిఁ గల పలుకుబడినిబట్టి అతనికిఁ గల రహస్యస్ఫురణను బట్టి గదా కలిగినది! అమ్మానవుని యనుభవోద్రేకమునకుఁ గాని, అమ్మానవుని రసోద్దీపనమునకుఁ గాని, అమ్మానవుని భావోదయమునకుఁ గాని, అమ్మానవుఁ డుచితంపుఁ బలుకుబడి నమర్చి తత్సమ్మేళనము నొక్క యవ్యక్తస్థాయి నునిచి ఆనందస్ఫురణము గొల్పించినప్పుడె కాని, వేఱుపఱచి వ్యక్తిస్థాయి నునిచి విజ్ఞానస్ఫురణఁ బ్రసాదించినప్పుడె కాని, సారస్వత ముప్పతిల్లుచున్నది. అదియే సరస్వతీప్రత్యక్షము. అదియే ధార. అదియే దివ్యప్రసన్నత. అదియే ప్రజ్ఞ.

అనుభవోద్రేకము పంచేంద్రియసంబంధమైనది. మన చుట్టును గల జడాజడరూపాత్మకమైన ప్రపంచమునందా యనుభవము వలన మనము అన్యోన్య సుప్రతిష్ఠ నందుచున్నాము. ఈయది సంకల్పమువల్లఁ బ్రబలుచున్నది. అనుభవము నిసర్గానుభవ మని విరుద్ధానుభవ మని రెండు తెఱంగులు. నిసర్గానుభవము లోకాతీతమైనది కాదు. విరుద్ధానుభవము లోకాతీతమైనది. ఉదాహరణము: మన చరిత్రమందు ప్రవరాఖ్యుఁడు హిమాలయసందర్శన మొనర్చుట, అచ్చో నొక రమ్యకాంతారవీథి నొక్క నారీరత్నమును గాంచుట, దాని నిల్లు సేరి సుపాయ మడుగుట, అది వానిపై మనసు గొనుట మున్నగు ననుభవ మెల్ల నిసర్గానుభవము. అకలంకామధుసత్త్వము, నారికేళవిటపీ కాంతారవీథి, మరున్నారీరత్నము, స్వాహావధూవల్లభుని సన్నిహితత్వము మున్నగు ననుభవ మెల్ల విరుద్ధానుభవము. రసోద్దీపనము హృదయసంబంధమైనది. మన చుట్టును గల జడాజడరూపాత్మకమైన ప్రపంచమునందా రసోద్దీపనమువలన మనము సామరస్యము నొందుచున్నాము. ఈయది యుత్కంఠవల్ల ప్రబలుచున్నది. రసము సభ్యరసము అసభ్యరసము అని రెండు తెఱంగులు. సభ్యరస మన ముచ్చటించుకొనఁదగిన రసము, అసభ్యరస మన ననుకొనఁదగనిది. ఉదాహరణము: పింగళిసూరనామాత్యుని ప్రభావతీప్రద్యుమ్నమందలి యీ పద్యమును గమనింపుఁడు.

చ. కలకల నవ్వినట్లు తెలిగన్నుల నిక్కుచు చూచినట్లు తోఁ
బలుకఁగడంగినట్లు కడు భావగభీరత లబ్బినట్లు నెం
పొలయ రచించి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోటియున్.

దీనియందు కమ్మని రస ముట్టిపడుచున్నది. మానుషౌచిత్యము ముప్పిరిగొనుచున్నది.—ఇదియే సభ్యరసము.

ఆ కవియొక్క కళాపూర్ణోదయమందలి యీ పద్యమును జూడుఁడు.

సీ. బెరు తెఱంగని గాఢపరిరంభమున వల్లి
బిల్లి గొంచుఁ బెనంగు పెనఁకువలను
బెరిఁగడి పేరాసపేర్మి ననర్గళ
లీలఁ బర్వెడు కుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయ ట్లెల్ల
నమరించు నఖరరేఖాంకములను
గొదగొన్న తమిఁ గొంకు కొసరు లే కొనరించు
వివిధదంతక్షతవిభ్రమములు
మన్మథావేశవిలసనమహిమ నెఱపు
తపసిఁ గని సాదు లేగిన దల పొలాన
నిలువ దను మాట నిజమయ్యె నేఁ డటంచు
మగువ నవ్వుచుఁ జేతను మాఱు సేసె.

ఇందు రతివర్ణనము పచ్చిగఁ జేయబడినది. తేటతెనుఁగున చెప్పఁబో నవాచ్యము గదా! ఈదృశంపు రసము అసభ్యరసము.

P. Veerabhadrudu Garu, ప్రా. వీరభద్రుడు గారు



K. Thammiah Garu, కం. తమ్మయ్యగారు



Duvvuri Rami Reddi Garu, దువ్వూరి రామిరెడ్డిగారు



Kotthamasu Venkatarungam Chetti Garu

కొత్తమాసు వెంకటరంగంశెట్టి గారు



Sivalenka Amrithalingam Garu, శివలెంక అమృతలింగం గారు



Durvasula Sankaraiah Garu, దూర్వాసుల శంకరయ్య గారు



Vuppula Venkateswara Rao Garu, ఉప్పుల వేంకటేశ్వరరావుగారు



M. Subba Rao Garu, ఎం. సుబ్బారావు గారు, చోడవరం



Suryanarayana Pakayaji



సూర్యనారాయణ పాకయాజి

Sri Nitalambakam Sivananda Saraswathi Swami



శ్రీ నిటలాంబకం శివానంద సరస్వతీస్వామి

Mahanandiah Garu



మహానందయ్యగారు

Rayavarapu Kondala Rao Garu



రాయవరపు కొండలరావు గారు

Yajna Narayana Sastri Garu



యజ్ఞనారాయణ శాస్త్రిగారు

Parvatham Nrisimha Dikshithulavaru



పర్వతం నృసింహ దీక్షితులవారు

Sri Vijnana Pracharini Sangham, Rajamundry



శ్రీ విజ్ఞానప్రచారిణీసంఘము, రాజమండ్రి

కస్తూరిమాత్రలను, నే నుపయోగించి యున్నాను. ఈ మాత్రలు చాల గుణకరముగ నున్నవి.

3. మ. కే. కే. బిస్వాసు కవిరాజ్, విష్ణుచక్ర డిస్పెన్సరి, 9-41 వీధి, బొక్లేబజారు, రంగూన్, బర్మా వీరు వ్రాసినది. తమ లోకామయహార కస్తూరిమాత్రలు నాకును నాయందు రాగల రోగులకును సంపూర్ణమైన తృప్తి కలిగించినది.

4. ఎస్. అనంతపద్మనాభాచార్లు, తిరువనంతపురం కొచ్చిజిల్లా వీరు. ఎన్నియో ఔషధములవలన గుణముకాక 12 సం॥నుండి పీడించుచుండిన నా సహోదరియొక్క శ్వాసకాసము (గూరలు) తమ లోకామయహార కస్తూరిమాత్రలను 3 నెలలు విడువక ఉపయోగించుటవలన సంపూర్ణముగ గుణమాయెను. నాయొక్క స్నేహితు లనేకులకు ఈ మాత్రలు నానా రోగములను గుణపరచినవి. సులభక్రయము, మహత్తరమగు గుణముగల తమరు ఈ మాత్రలను మావంక ఉపయోగించినవా రెందరో స్తోత్రము చేయుచున్నారు.

5. మ. ఎ. సి. మిత్తరు, హెడుమాస్టరు, దిగ్రామిక్ పర ఎం. ఇ. స్కూలు, మాండు, హజారా: జిల్లా వీరు వ్రాసియుండినది. బహుదినములుగ మలబద్ధము నన్ను బాధించుచుండెను. అలోప్యాతిక్, హోమియోప్యాతిక్ కవిరాజ్ సంబంధములగు అనేక ఔషధములను బహుకాలము ఉపయోగించినను ఫలకారి కాలేదు. నాయొక్క స్నేహితులయిన అసిస్టెంటుసర్జను, లోకామయహార కస్తూరిమాత్రల నుపయోగించుమని నాతో చెప్పినారు. తెప్పించి నిత్యము ఉపయోగించుచు వచ్చినదానిలో నాయొక్క జబ్బులంతయు సంపూర్ణముగ గుణమాయెనని సంతోషముతో మీకు తెలుపుచున్నాను. అగ్నిమాంద్యము మలబద్ధము ఈ మాత్రలవలన గుణమైనవి.

6. మ. ఎస్. జి. బాలసుబ్రహ్మణ్య అయ్యర్, సన్నిధివీధి, తిరువయ్యారు తంజావూరుజిల్లా వీరువ్రాసినది. తమరు లోకామయహార కస్తూరిమాత్రల విషయముగ ప్రకటించియుండు గుణములన్నియును ఈ మాత్రలు గలిగించినవని సంతోషముతో తమకు తెలియజేసెదను. పునః 12 సీసాలను వి. పి. చేయవలెను.

7. మ. బసవలింగస్వామి, రావుసాహెబు అస్‌గోష్ఫెక్టర్, పింజమోలిజిల్లా, ఘుర్యాల్, హిమాలయము, వీరువ్రాయునది. తమ వైద్యశాలనుండి అనేకపర్యాయములు లోకామయహార కస్తూరిమాత్రలను రప్పించి సేవించియు ఇతరులకు యిచ్చియు ఉన్నాను. అన్ని రోగములకు రామబాణము గావున తోడనే పండ్రెండు సీసాలను బంప కోరుచున్నాను.

8. మ. గోపాల్‌సింగు, మిలిటరీ సబు అసిస్టెంటు సర్జను, సిరోహి, రాజపుటానా వీరువ్రాసినది. లోకామయహార కస్తూరిమాత్రలను నేను ఉపయోగించుచున్నాను. చాలగుణకరముగ నున్నవి. మరి 12 సీసాలను పంపవేడెద.

9. మ. పరశురామ మహాదేవ జోషి, ప్లీడరు, అమరావతి, బీరార్, వీరువ్రాసినది. లోకామయహార కస్తూరిమాత్రలు బాలింతలకు చాల మేలుచేసియున్నవి. తోడనే 25 సీసాలను పంపవలయును.

10. మ. సి. ఎస్. మాధవరావు అసిస్టెంటు సూపరింటెండెంటు సలవ సేరుపోస్టు, చిత్తూరుజిల్లా లోకామయహార కస్తూరిమాత్రలచే సంపూర్ణమైన గుణములన్నియున్నవని తమకు సంతోషముతో తెలియజేసెదను.

11. మ. లక్ష్మణదేవు సిందువార, సెంట్రలు ప్రావిన్సు వీరు వ్రాసినది. తమ కస్తూరిమాత్రలు రోగములపైన తృప్తికరముగ పనిచేయుచున్నది. కావున సంతోషించవలెను. ఇంక 12 సీసాలను పంపవలయును.

12. మ. ఎం. నజురుద్దీను బార్క్ మర్చంటు గిద్దలూరుపోస్టు, కర్నూలుజిల్లా వీరువ్రాసినది. తమ లోకామయహార కస్తూరిమాత్రల అద్భుత గుణమును చూచి జనులు ఆశ్చర్యపడుచున్నారు. ఇంకను 12 సీసాలను బంపుడు.

13. మ. ఎం. కొర్నేలియస్, హోంపాదర్. ఎం. ఇ. మిషన్, కోలారుజిల్లా వీరు వ్రాసినది. తమవద్దనుండి రప్పించిన లోకామయహార కస్తూరిమాత్రలనుంచి చలిజ్వరములు దగ్గు మున్నగు అనేక రోగములు గుణమైయున్నవి. పునః 6 సీసాలను బంపుడు.

14. మ. పి. అచ్యుతన్ నాయరు, మర్చంటు, సీరమంగలం, మేలర్కాడు పోస్టు, వీరువ్రాసినది: పత్రికలలో ప్రకటించియుండు అన్ని గుణములు తమ లోకామయహార కస్తూరిమాత్రలలో నిండియున్నవి. ఇంకను 25 సీసాలను బంపుడు.

15. మ. ఎస్. పార్థసారధి అయ్యంగారు, ఏజంటు, బెస్టు అండు కో, పైడాపురము, నెల్లూరుజిల్లా వీరు వ్రాసినది. తమలోకామయహార కస్తూరిమాత్రలు ప్రతి వ్యక్తికి చాలమంచివని చెప్పుచున్నాను. తమమాత్రలు సేవించినయెడల బహుకాలమునుండి గల మలబద్ధరోగము గుణమగును. ఇక 6 సీసాలను పంపకోరుతాను.

N. B. వాగడమముకాదు. వేలకొలది యోగ్యతాపత్రములున్నవి. లోకామయహార కస్తూరిమాత్రలు అన్ని దుకాణములందును దొరకును. ట్రేడుమార్కు చూచికొనవలెను.

పాళ్యపు వెంకటాచలపండితులు,

శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

**Palyam Venkatachala Pandit,**

**Sree Seetharaghava Vaidyasala, Mysore.**

తంతివిలాసము :—

“ పండిట్ ” మైసూరు.

*Telegraph Address:—*

**“PANDIT” Mysore**

# Bank of Madras.

Capital (fully paid-up) ... Rs. 75,00,000.

Reserved Fund ... ,, 45,00,000.

HEAD OFFICE MADRAS.

BRANCH OFFICE—MOUNT ROAD, MADRAS.

BRANCHES.

| | |
|---|---|
| Alleppey | Colombo |
| Bangalore | Guntur |
| Bellary | Outstation— |
| Vizianagaram | Bezwada |
| Out Station— | Madura |
| Bimlipatam | Outstation—Kodai- |
| Calicut | Mangalore [kanal |
| Cocoanada | Masulipatam |
| Outstation— | Negapatam |
| Narasapur and | Ootacamund |
| Rajahmundry | Salem |
| Cochin Outstation | Trichinopoly |
| Coimbatore (Trichur | Trivandrum |
| Outstation— | Tellicherry |
| Erode | Tuticorin |

CURRENT ACCOUNTS opened on terms which may be ascertained on application.

FIXED DEPOSITS:—The Bank allows interest at the rate of 5 per cent. per annum on Fixed Deposits for 12 months. Interest for shorter terms may be ascertained on application.

SAVING BANK:—Small deposits received and interest allowed. Rules on application.

LETTERS OF CREDIT AND DRAFTS:—Issued on the principal towns in India, Burma, and Ceylon.

STERLING DRAFTS Procured for constituents and remitted free of charge to any given address.

GOVERNMENT and other Securities received for safe custody, purchases and sales effected and interest and dividends collected and credited to account, or remitted according to instructions.

LOANS AND CASH CREDITS GRANTED on Government Securities, Municipal and Port Trust Debentures, Shares in Guaranteed Railway, and Goods, and Bullion.

APPROVED MERCANTILE BILLS—discounted and Bills of Exchange negotiated.

COPIES OF RULES, POWERS OF ATTORNEY, & etc., may be had on application at Head Office and at any of the Branches.

(By Order of the Directors)

W. B. HUNTER,

Secy. and Treasurer.

# మద్రాసు బ్యాంకు (5)

మూలధనము (పూర్తిగ చెల్లింపబడినది) రు. 75,00,000

నిలువధనము ... ... ,, 45,00,000

హెడ్డాఫీసు, మద్రాసు.

బ్రాంచిఆఫీసు, మౌంటురోడ్డు, మద్రాసు.

బ్రాంచీలు.

| | |
|---|---|
| ఆలెప్పీ | కొళంబు |
| బెంగుళూరు | గుంటూరు |
| బళ్లారి | చిన్నబ్రాంచి |
| విజయనగరము | బెజవాడ |
| చిన్నబ్రాంచి— | మధుర |
| భీమునిపట్టణము | చిన్నబ్రాంచి—కోడై కెనాలు |
| కల్లికోట | మంగుళూరు |
| కాకినాడ | మచిలీబందరు |
| చిన్నబ్రాంచీలు | నాగపట్టణము |
| నరసాపురము | ఉదకమండలము |
| రాజమండ్రి | సేలం |
| కొచ్చి, చిన్నబ్రాంచి,త్రిచూరు | తిరుచునాపల్లి |
| కోయంబత్తూరు | తిరువాన్కూరు |
| చిన్నబ్రాంచి.— | తెలిచ్చేరి |
| ఈరోడ్డు | తూత్తుకుడి |

దరఖాస్తు పెట్టుకొని షరతులు నిర్ధారణ చేసికొనిన తరువాత కరెంటు అక్కౌంట్లు పెట్టబడును.

ఫిక్సెడ్ డిపాజిట్లు:—బాంకువారు 12 మాసములవరకు స్థిరముగనుండెడు మొత్తములపైన సాలుకు నూటికి 5 చొ॥ వడ్డీ యిత్తురు. ఇంతకు తక్కువ కాలమునకు నిలువయుండెడి సొమ్ముపై నిచ్చెడి వడ్డీ దరఖాస్తు పెట్టి తెలిసికొనవలెను.

సేవింగ్సుబ్యాంకు:— కొద్దిమొత్తములు తీసికొనబడి వడ్డీ యివ్వబడును. రూల్సు దరఖాస్తుపైని పంపబడును.

ఇండియా బర్మా సిలోనులలోని ముఖ్యమైన పట్టణములకు హుండీలు, డ్రాఫ్టులు యివ్వబడును.

ఖాతాదార్లకు, వారిచ్చిన అడ్రసులకైనను సరే, చార్జి లేకుండా సీమహుండీలు సమకూర్పబడి పంపబడును.

గవర్నమెంటు సెక్యూరిటీలు, ఇతర సెక్యూరిటీలు భద్రపరచబడును, కొనబడును, అమ్మబడును. వడ్డీ డివిడెంట్లు వసూలుచేసి, ఖాతాలో జమకట్టబడును. లేక చెప్పిన ప్రకారం పంపివేయబడును.

గవర్నమెంటు సెక్యూరిటీలపైనను, మ్యునిసిపల్, పోర్టు ట్రస్టు డిబెంచర్లపైనను, గారంటీడ్ రైల్వేలలోని షేర్లపైనను, సరకులపైనను, భాండాగారముపైనను, అప్పులుగాని, క్యాష్‌క్రెడిట్లుగాని యివ్వబడును.

పాత ఖాతాదార్ల బిల్లులు డిస్కౌంటు చేయబడును బిల్సు ఆఫ్ ఎక్స్ఛేంజి మార్చబడును.

రూల్సుయొక్క కాపీలు పవర్ ఆఫ్ అటర్నీ మున్నగునవి హెడ్ ఆఫీసునకుగాని ఏ బ్రాంచి ఆఫీసునకుగాని దరఖాస్తుపైని దొరకగలవు.

భావోదయము మనస్సంబంధ మైనది. మన చుట్టునుం గల జడాజడరూపాత్మక మైన ప్రపంచమందు భావోదయమువల్ల మనము వికమత్యము నందుచున్నాము. ఈయది యుద్బోధవల్ల ప్రబలుచున్నది. భావము పాఠ్యము అని స్మర్యము అని రెండు తెఱంగులు. పాఠ్యమగు భావము చదువునప్పుడు మాత్రము మేల్కొనియుండును. స్మర్యమగు భావము మనసును విడిచిపెట్టక సారెకు స్ఫూర్తి గొల్పుచుండును. ఉదాహరణముగ ఈ రెండు పద్యములను జదివి చూడుఁడు:

క. మాయమ్మ నను నీవే
రాయలనై కావ రావరాజే జేజే
మాయాతుమ లానినయది
పాయక సంతోష మున్న ఫల మిల సామీ.

ఉ. కొండల మండె డెందము శకుంతల తా నిపు డేగు నం చయో!
క్రిందుగ బాష్పరోధమునఁ గంఠమునుం జెడె బుద్ధిమాంద్యమున్
బొందె; నొకింత పెంచిన తపోనిధుకే యిటు గుంద, నెంతగాఁ
గుందుదురో తమంత గను కూఁతులఁ బాయు గృహస్థు లక్కటా!

ఇందు మొదటిదానియందలి భావము ఊరక పఠనీయ మగుచున్నది. రెండవదానియందలి భావము ప్రపంచహృదయసంస్తవనీయమై స్ఫూర్తి గొల్పుచున్నది. కావున మొదటిదానియందలి భావము పాఠనీయభావము. రెండవ దానియందలి భావము స్మరణీయభావము. మొదటిది కళాపూర్ణోదయమునుండియు రెండవది శాకుంతలమునుండియు ఎత్తి చూపఁబడినవి. ఆశయోద్ధరణము సంకల్పాత్మసంబంధ మైనది. మన చుట్టునుం గల జడాజడాత్మక మైన ప్రపంచమం దాయాశయోద్ధరణమువలన మనము సాఫల్యము గనుచున్నాము. ఈయది పరమాత్మసాంప్రదాయమువల్ల ప్రబలుచున్నది. ఆశయములు లౌకికము లని ప్రాకృతము లని పారమార్థికము లని మూఁడు తెఱఁగులు. లౌకికము లన లోకవ్యవహారసంబంధము లైనవి. ప్రాకృతము లన సృష్టిసంబంధము లైనవి. పారమార్థికము లన పరమాత్మపరమపద, భగవత్సంబంధము లైనవి.

ఉదాహరణములు: పోతనామాత్యుని భాగవతమందు రుక్మిణీకల్యాణమున—

మ. ఘనుఁ డా భూసురుఁ డేగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డది తప్పుగాఁ దలఁచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపడో యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నా భాగ్య మె ట్లున్నదో!

అను పద్యమందలి యాశయము కల్యాణాత్మక మైన లౌకికాశయము. కృష్ణావతారసందర్భమున

శా. ఎండన్ మ్రగ్గితి రాఁకటం బడితి రీ రేలా విలంబింపఁ గా
రం డో బాలకులార! చల్దిఁ గుడుచన్ రమ్యస్థలం బిక్క డీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిరుపొంతన్ బచ్చిక ల్మేయుచున్
దండంబై విహరించుచుండఁగ నమందప్రీతి భోనేఁత మే.

అను పద్యమందలి యాశయము ప్రాకృతము. గజేంద్రమోక్షము నందు

క. కలఁ డందురు దీనుల యెడఁ
గలఁ డందురు పరమయోగిగణముల పాలన్
గలఁ డందు రన్ని దిశలను
గలఁడు కలం డనెడువాఁడు కలఁడో లేఁడో?

అను పద్యమందలి యాశయము పారమార్థికము.

పలుకుబడి భాషాసంబంధ మైనది. మనచుట్టునుం గల జడాజడాత్మక మైన ప్రపంచమునందు పలుకుబడివలన మనము అర్థజ్ఞుల మగుచున్నాము. ఈయది కృషివలనఁ బ్రబలుచున్నది. పలుకుబడి రెండు విధములు. స్వతస్సిద్ధమైన పలుకుబడి, అనుశ్రుత మైన పలుకుబడి అని. స్వతస్సిద్ధ మనఁగా, చిన్నెలు వన్నెలు రెం డర్థములు నాలుగర్థములు లేని దగు మాట. అనుశ్రుత మైన దన, చిన్నెలు వన్నెలు మున్నగునవి కలిగియున్న దన్నమాట. చాలభాగము ముక్కు తిమ్మనార్యుని పారిజాతాపహరణమందలి ప్రథమాశ్వాసము స్వతస్సిద్ధ మైన పలుకుబడి గలదియు. ఒక్క తార్కాణము:

సీ. కనకపంజరకీరకలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు?
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు?
క్రొవ్వాఁడిగోళ్లఁ దంత్రులు మీటి వీణియ
ల్పలికింప రేలొకో భామ లిపుడు?
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు?
ఇన్ని దినములవలె నుండ దేమి నేఁడు
చిన్నవోయిన దీ మేడ చెన్ను దఱఁగి
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పువ్వువృత్తాంత మెఱిఁగింపఁ బోలునొక్కొ?

ఇఁక ననుశ్రుత మైన దాని కుదాహరణము: శృంగారనైషధమునఁ గల యీ పద్య మొండు చదువుఁడు.

సీ. జగము లాక్కొమ్మడి సాధింప నెత్తిన
రతిమన్మథుల విండ్లు రమణి బొమలు
కాంతినిర్ఝర మీఁదు కామయౌవనముల
కుంభప్లవము లింతి కుచయుగంబు
నడు మింత యని కేలఁ దొడికి పట్టిన ధాత
యంగుళిరేఖ లబ్జాస్య వళులు
యువమనోమృగరాజిఁ దగిలింపఁ దీర్చిన
మదనవాగుర లిందువదన కురులు
బాల్యతారుణ్యసీమావిభాగమునకు
వజుఁడు వ్రాసిన రేఖ తన్వంగియారు
భానువరమునఁ బడసిన పంకజముల
యపరజన్మంబు భూఁబోఁడి యడుగు లధిప.

స్థాయిస్ఫురణ తన్మాత్రసంబంధ మైనది. మన చుట్టునుం గల జడాజడరూపాత్మక మైన ప్రపంచమందు స్థాయిస్ఫురణ కతన

మనము తన్మయత్వము నందుచున్నాము. ఈయది తనంతన ప్రబలుచున్నది. అవ్యక్తస్థాయి నియ్యది యానంద మొసఁగుచున్నది. వ్యక్తిస్థాయిని విజ్ఞాన మొసంగుచున్నది. అవ్యక్తస్థాయిసంబంధ మైన యానందస్ఫురణ నాలుగు తెఱంగులు: (1) సౌందర్యవికారములు, (2) సంయోగవియోగములు, (3) విచారసంతోషములు, (4) విషాదవినోదములు. వ్యక్తిస్థాయిసంబంధ మైన విజ్ఞానస్ఫురణము నాలుగు తెఱంగులు: (1) నిర్దేశము, (2) నియుక్తము, (3) నిరూఢము, (4) నిబద్ధము. ఉదాహరణములు: జగన్మోహినీవేష మవ్యక్తస్థాయి నానందస్ఫురణ గొల్పు సౌందర్యము. బాహుకరూప మవ్యక్తస్థాయి నానందస్ఫురణ గొల్పు వికారము. అశోకవృక్షము క్రింద శోకించు సీతావియోగము అవ్యక్తస్థాయి నానందస్ఫురణ గొల్పు వియోగము. మాయ రంభ మాఱు నలకూబరుఁడు, వీరల సంయోగ మవ్యక్తస్థాయి నానందస్ఫురణఁ గొల్పు సంయోగము. అజ్ఞాతవాసమందు పాండవు లొందిన విచారము అవ్యక్తస్థాయి నాందస్ఫురణఁ గొల్పు విచారము. ద్రౌపదీస్వయంవరంబున పాండవులు ద్రౌపదిని బడసిన సంతోష మవ్యక్తస్థాయి నానందస్ఫురణఁ గొల్పు సంతోషము. ఉత్తరరామాయణమున లక్ష్మణునిచే సీతాపరిత్యాగసమయమున నైన సీతావిషాదము అవ్యక్తస్థాయి నానందస్ఫురణఁ గొల్పు విషాదము. వ్రేపల్లెయందు శ్రీకృష్ణుఁడు గోపబాలుఁడై చరించినది అవ్యక్తస్థాయి నానందస్ఫురణఁ గొలుపు వినోదము. వ్యక్తిస్థాయిని నిర్దేశించునవి ప్రకృతిశాస్త్రములు రసాయనశాస్త్రములు మున్నగునవి. నియుక్తములు సంగీతశాస్త్రములు మున్నగునవి. నిరూఢములు వేమన పద్యములు మొదలగు నైతిక గ్రంథములు. నిబద్ధములు వేదాంతములు మొదలగు మతవిషయక గ్రంథములు.

వరుసగఁ జూచిన సారస్వతమున కనుభవము రూపమువంటిది. రసము కళవంటిది. భావము జీవాత్మవంటిది. ఆశయము పరమాత్మవంటిది. పలుకుబడి జీవమువంటిది. స్థాయీస్ఫురణము జీవనాధారము వంటిది.

సారస్వత విభేదం బెట్టి దనిన: సారస్వతము సాధ్యసారస్వతము సిద్ధసారస్వతము నని రెండు తెఱంగులు. సాధ్యసారస్వతమందు అనుభవరసభావాశయములు ఒకటి రెండు మూఁడు కొఱఁత వడి, పలుకుబడిని గొని వ్యక్తిస్థాయిని విజ్ఞానస్ఫురణ గల్గించుచున్నవి. సిద్ధసారస్వతమందు అనుభవరసభావాశయములు సమ్మిళితము లై పలుకుబడి గొని అవ్యక్తస్థాయిని నిలిచి ఆనందస్ఫురణము గొలుపుచున్నవి. మనము సర్వసాధారణముగ సారస్వత మన వర్తించునది సిద్ధసారస్వతమే.

ఉదాహరణములు: కేవలానుభవమును బోధించు ప్రకృతిశాస్త్రాదులు, కేవల రసమును బోధించు సంగీతశాస్త్రములు, కేవల భావమును బోధించు నైతిక గ్రంథములు, కేవలాశయమును బోధించు మతవిషయకములు, రసమును విడిచి భావమును అనుభవమును బోధించు వేమనపద్యములు, భావమును విడిచి రసమును ఆశయమును బోధించు భజనకీర్తనాదులు — ఈ మున్నగునవి యెల్లను సాధ్యసారస్వతములు.

అట్లు గాక అనుభవరసభావాశయముల నాల్గింట సమ్మిళితము లగుచు వానివాని ప్రాముఖ్యమును బట్టి ఔచిత్యానౌచిత్యముల వహించు ఆంధ్రప్రబంధములు కొన్ని శతకములు నాటకములు నవలలు మున్నగునవి సిద్ధసారస్వతము.

[(గమనిక) ముందు వ్రాయు నభిరుచి ప్రమాణాదులు సిద్ధసారస్వతవిషయమునఁ జెప్పఁబడు ఉపమానసందర్భమున సాధ్యసారస్వతమునకు వలసినచో పాఠకు లనువర్తించుకొనఁ జెల్లు]

## ii సారస్వతాభిరుచి

వైవిధంబుగ నుప్పతిల్లిన సిద్ధసారస్వతము నానాఁటికి పెంపొందుటకు, నొకానొక పోకడం జనుటకు ననుప్రసంగున దెద్ది? అభిరుచి. అంతటి వివిధగుణాలవాల మైన సారస్వతమును పెంపొందించు నభిరుచి యిట్టి దని చెప్పుట కష్టము. అందువలనఁ గొందఱు కేవల భావప్రియులుగ కన్పట్టుచున్నారు. కొందఱు కేవల భాషాప్రియులుగ కన్పట్టుచున్నారు. కొంద ఱలంకారవికారు లగుచున్నారు. కొందఱు యతిప్రాసయమకములకై తమకపడుచున్నారు. కొంద ఱున్న దున్నట్లు చెప్పవలె నా ననుచున్నారు. కొంద ఱుత్ప్రేక్షలఁ దల లెత్తుచున్నారు. కొందఱు భగవన్నామశతకకృతులఁ దన్మయయుతు లగుచున్నారు. కొందఱు శృంగారప్రబంధబంధబంధురరతిబంధనముల నంధు లగుచున్నారు. కొందఱు వేమన నీతిపద్యముల వేనోళ్లఁ బొగడుచున్నారు. కొందఱు కోలాటకీర్తనములను లంకాయాగములను కుచ్చెలకతలను (కుశలవకథ) చదివి యానందమున మేను మఱచుచున్నారు. కొందఱే యభిరుచియు లేక చేతికి వచ్చిన ప్రతి పొత్తమును చదువుచున్నారు. ఇట్లే వ్రాయుచున్నారు. "లోకో భిన్నరుచిః" అను సామెత సర్వవిధముల సారస్వతసందర్భమున సార్థక మగుచున్నది. ఇట్టి యభిరుచి నా కేల యని యొకళ్లొకళ్లఁ బ్రశ్నించుసంత ప్రతివారును నా యిష్టమనుట కవకాశము కనఁబడుచున్నది. ఎంత యవకాశ మున్నను ఇష్టమునకు హద్దుపద్దు లున్నవి.

అభిరుచి నైజమై అభ్యాసప్రాంత మగుచున్నది. మంచిది కా దని తోఁచినప్పు డయ్యది మఱలింపఁబడుచున్నది. మంచి దని తెలిసినప్పు డయ్యది యవలంబింపఁబడుచున్నది. సంపర్కమున మార్పులు గొనుచున్నది. అభిరుచులు వేర్వేఱు. ఎంత వేర్వే ఱైనను ప్రతియభిరుచికిని అనుభవము రసము భావము ఆశయము ఉండును. ఎట్లన, భోజనసమయమందు సర్వసామాన్యము. మధురముల నే రుచి కలవారైనను పదార్థమును భుజించి దాని రసమున నాటు లూరి అది జీర్ణపఱచుకొని దానివల్ల శరీరమునకు పుష్టి ఆనందము ఆరోగ్యము కలుగవలెనను ఆశయము కలిగియుందురు గదా! భుజించుటకు పదార్థము లేకపోయినను, పదార్థము నవసరము లేకున్నను, పదార్థము జీర్ణము కాకపోయినను, జీర్ణమయ్యు నొడలి కుపకరింపకపోయినను, ఆ భోజనము నిష్ప్రయోజనము. అట్లే వస్త్రధారణాదులందును. జీవితమందు అభిరుచి గలవారికిని ననుభవము రసజ్ఞత భావము ఆశయము ఉండితీరును. అభిరుచి లేనివాని కనుభవము రసజ్ఞత భావము ఆశ

యము నుండవా యని యడుగవచ్చును. వానికిని నుండును. కాని సామాన్యుని యనుభవరసభావాశయములందు మితి లేదు. అభిరుచి గలవాని యనుభవరసభావాశయములందు వరుసగా వస్తుమితి కార్యమితి విరామమితి సాఫల్యమితి కానవచ్చుచున్నవి. అభిరుచి గలవా రొకదక్షిణాదంపు కండువాను వల్లెవాటుగ పింఛె వేసికొని మీఁద వైచుకొని కులుకుచున్నారు. అభిరుచి లేనివాఁ డే ముదుకగుడ్డనో అవతకవతకగ నలిపి నేల నీడ్చుకొనుచు అవసరమును గడపుకొనుచున్నాఁడు. సారస్వతమున మనము గాంచు వస్తుమితి కార్యమితి, విరామమితి సాఫల్యమితు లెల్ల అభిరుచుల కతంబుననే. ఈ యభిరుచుల కతంబుననే సారస్వతము పెంపొందుచున్నది. ఆయభిరుచియే సారస్వతాభిరుచి. విశాలవిభజన మొనర్చునెడ సారస్వతాభిరుచులు రెండు తెఱంగులు, చిన్మయములు మృగమయములు. చిన్మయాభిరుచిని మానుషైక దైవికసరళానుభవరసభావాశయములు వెల్లడి పఱుపఁబడుచున్నవి. మృగమయాభిరుచిని మానుషైకపశుపరుషానుభవరసభావాశయములు వెల్లడిపఱుపఁబడుచున్నవి. ఉదాహరణము:

మాయాప్రవరుని వర్ణనసందర్భమున వరూధినిని వర్ణించిన యీ పద్యమునందు చిన్మయాభిరుచి వెల్లడియగుచున్నది.

సీ. తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ
            పల్లవాధర గుండె జల్లుమనియె
   నట రెండు మూఁ డంజ లరుగునప్పుడ కాళ్లఁ
            బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె
   డాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ
            గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ
   గదిసి నిల్చినయప్డ కనుదోయి కెప్పుల
            లలనకు మిగులఁ జంచలత బెరసెఁ
   గటకటా యనునపుడ గద్గదిక పొడమెఁ
   జెఱఁగు పట్టినయపుడ లేఁజెమట గ్రమ్మె
   సొలసి మాటాడ నంకింపఁ దలఁచి మోము
   దెరకొనఁ జూచునపుడ కన్నీరు పొడమె.

ఆ సందర్భముననే మఱికొంత ముందునకుఁ బోవ నీ క్రింది పద్యమున మృగమయాభిరుచి కనఁబడుచున్నది.

సీ. సహసానఖంపచ స్తనదత్తపరిరంభ
            మామూలపరిచుంబితాధరోష్ఠ
   మతిశయప్రేమకల్పితదంతసంబాధ
            మగణితగ్లానిశయ్యానిపాత
   మతివేలకుణితయాచ్నార్థగల్లచపేట
            మతిదీనవాక్సూచితాత్మవిరహ
   మంకురత్పులకజాలావిద్ధసర్వాంగ
            మానందకృతహారవానవాబ్జ
   మాక్రమక్షీణనుతివర్ణ మానివాలి
   తాతు మాస్విన్నగండ మాయుత్తచేష్ట
   మాస్తిమితభూషణారవ మా వధూటి
   ప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె.

## iii సారస్వతప్రమాణము

అభిరుచిమర్యాదను తెంపు గన్న యీ సారస్వతమునకుఁ బ్రమాణ మెయ్యది? మన జీవనప్రమాణమే సారస్వతప్రమాణము. జీవనప్రమాణమేమి? మనచుట్టునుంగల అణువులు మొదలు బ్రహ్మాండము పర్యంతము గల వస్తువులయందు జంతువులయందు మానవులయందు అన్నిటియందును గల నిజసౌందర్య మెఱుంగుట, ప్రతి యాకారము నందలి సురూపమును తీసికొని దానికిని మనకును నన్యోన్యసు ప్రతిష్ఠ కలిగించుకొనుట — తద్ద్వారా లోక మున్న దనుకొనుట — ఆపైని వానితో నన్యోన్యచేతనముఁ గల్పించుకొని సామరస్యము నొందుట, ప్రతియాకారముతోడను కార్యదక్షత్వ మూనుట — తద్ద్వారా లోక ముండుటయే గాక జీవనప్రపూర్ణమై యున్న దనుకొనుట — ఆపైని వానియందు బుద్ధిని లయ మొనర్చుచు నైక్యభావ మందుట, ప్రతి యాకారమందును మనము విరామస్ఫూర్తిఁ గనుట — తద్ద్వారా లోక ముండుటయే గాక, జీవనప్రపూర్ణమై యుండుటయే కాక, కాంతిదాయకముగ నున్న దనుకొనుట — ఆపైని వానియం దాశయము నెలకొల్పి సఫలీకృతుల మగుట, ప్రతియాకారమందును మనము విముక్తిమార్గముఁ గనుట—తద్ద్వారా లోక ముండుటయే గాక, జీవనప్రపూర్ణమై యుండుటయే కాక, కాంతిదాయకముగ నుండుటయే గాక అనంతప్రసిద్ధ మని యనుకొనుట—తొలుతనుండి తుదవఱకు నవ్యక్తానందస్థాయి నోలలాడుట — ఈ నడవడి యుత్తమజీవనప్రమాణము. అట్లు కాక చూచువస్తువునెడ నసహ్యపడుచు మాంద్యము వహించి క్షోభఁగొనుచు వినాశమును పురికొల్పుకొనుచు దుఃఖ మూను జీవన మొక జీవనమే? కావున ఉత్తమజీవనప్రమాణసూత్రము సుప్రతిష్ఠ, కార్యదక్షత్వము, విరామప్రకాంతి, అనంతసాఫల్యవిముక్తి, అవ్యక్తానందస్థాయితో కూడియున్నది. అందు కొన్ని కొఱఁతవడిన జీవనము మధ్యమజీవనము. బొత్తిగా లేనిది అధమజీవనము.

ఈ రేనింటి నేసారస్వత మేయభిరుచి వహించి, ఏయనుభవరసభావాశయముల నెంతవఱకు నుప్పతిల్లుచున్నదో, ఆసారస్వతము త్తమసారస్వతము. ఆసారస్వతాభిరుచి యుత్తమసారస్వతాభిరుచి. ఆ యనుభవరసభావాశయము లుత్తమానుభవరసభావాశయములు. ఉత్తమసారస్వత మెందును ఉత్తమవస్తుప్రదర్శనముఁ గూర్చి ఉత్తమానుభవజ్ఞులఁ జేయుచున్నది. ఉత్తమకార్యసంఘటన మమర్చి యుత్తమరసజ్ఞులఁ జేయుచున్నది. ఉత్తమవిరామప్రకాంతి సమకూర్చి ఉత్తమభావజ్ఞులఁ జేయుచున్నది. ఉత్తమసాఫల్యవిముక్తి నొసంగి ఉత్తమాశయులఁ జేయుచున్నది. కొట్టకొసకంట నవ్యక్తానందచిరంజీవులఁ జేయుచున్నది. ఎంతవఱకు నెయ్యవి పైని వివరించినవానికి తోడ్పడునో పాఠకులే యూహింపఁ జెల్లు. లోకమందు సుప్రతిష్ఠ వహించుటకు నిసర్గానుభవము కావలెను గాని విరుద్ధానుభవము పనికిరాదు. అనుకూల కార్యసంఘటనమునకు సభ్యరసములు మేలు గాని అసభ్యరసములు గానేరవు. విరామప్రకాంతికి స్మరణీయభావము లవసరములు గాని పాఠనీయములు గావు. సాఫల్యవిముక్తికి ఆశయములు అనంతములై యుండవలయును. అవ్యక్తానందస్థాయికి

అవ్యక్తతన్మయత్వ ముండవలయును. అందుచేతనే రవీంద్రనాథ్, వర్డ్సువర్త్, కాళిదాసు, షేక్స్పియర్ మున్నగువారు ప్రపంచప్రఖ్యాతిని బడసియున్నారు. రవీంద్రనాథ్ తన గీతాంజలియందలి అఱువది రెండవ పద్యమున నేమి చేసినాఁడు? రంగులు గల యాటవస్తువులను పాటను తీయనివస్తువులను ముద్దు ముచ్చటలఁ గూర్చు పిల్లవాని మోమును సుప్రతిష్ఠఁ జేసి, తాన కార్యదక్షత్వ మూని తెచ్చియిచ్చి పాటపాడి తినిపించి ముద్దాడి విరామప్రశాంతిని బాలు నూహించి ఆశయమున మేఘములను నీళ్లను పువ్వులను ఆకుల కలరవమును పువ్వుఁదేనెను ప్రొద్దుపొడుపును నెలకొల్పి అవ్యక్తానందస్థాయి నందఁ జేయుచున్నాఁడు. ఆ గీతిక ఎంతటి యమాయక మైన మనోహర సుగీతిక! ప్రేమపూరితపరబ్రహ్మము గాదే! ఇం దాటవస్తువులు మున్నగువానియందు అనుభవ మున్నది. తనయంద రస మున్నది. బాలునియంద భావ మున్నది. మేఘములు మొదలగువానియందు ఆశయ మున్నది. అవ్యక్తస్థాయీస్ఫురితానందతన్మయత్వము పిల్లవానికి ఆటవస్తువులు మొదలగునవి సూచించు వాక్యములు మఱలమఱల పల్లవిగ చేర్చుటయం దున్నది. ఈ చిన్నిగీతికవల్ల ప్రపంచమం దెల్లెడ మన మొక పిల్లవానిపోలిక నొప్పుదు నానందపడుచుంటిమి. వర్డ్సువర్త్ యొక్క 'చేనుకోఁతపడుచు' అను గీతికయందు చేను కోయుచున్న మన్నెపుఁ బడుచువకు సుప్రతిష్ఠ నిచ్చి కార్యదక్షత్వ మా బిడ్డ పాటయందుఁ జూపి, విరామప్రశాంతి నేమిపాటో యని యూహించి ఆశయమున ఆపాటను తన హృదయమును బూరించుకొనియెను. అవ్యక్తస్థాయీస్ఫురితానందతన్మయత్వము "కోయుచున్నది పాడుచున్నది తనయంతనే" ఒంటరిగ కోయుచున్నది. మోపులు కట్టుచున్నది. ఆలాపము చేయుచున్నది. ఏమి పాడుచున్నది? ఆమె పాట కంత్యము లేదు. పనిచేయుచు పాడుచున్నది, కొడవలిపై వంగియున్నది. చిరకాల మామె పాట నాయంద యున్నది. అను శైలి నైపుణ్యమం దున్నది. కాళిదాసు శాకుంతలమందు గనుఁడు: అనుభవము దుష్యంతునియందు, రసము శకుంతలయందు, భావము కణ్వునియందు, ఆశయము అభిజ్ఞానమందు నిలిపి, దుష్యంతుని సుప్రతిష్ఠఁ జేసినాఁడు; శకుంతలయందు కార్యదక్షత్వ మగపఱచినాఁడు. కణ్వునియందు విరామప్రశాంతిని నెలకొల్పినాఁడు. అభిజ్ఞానమందు అనంతసాఫల్యముఁ జూపినాఁడు. అవ్యక్తస్థాయీస్ఫురితానందతన్మయత్వము నాయాకడల వెల్లిగొలిపినాఁడు. దుష్యంతుఁడు కణ్వాశ్రమముం జేరి శకుంతలను వరించుటలో తన పౌరుషప్రతిష్ఠ యొక మునికన్యపైఁ బోనేరదను నవ్యక్తస్థాయీస్ఫురణము, మఱి శకుంతలయొక్క మధురముగ్ధావ్యక్త గాంధర్వవివాహసంగమాంగీకారము, మఱి విజ్ఞాని యయ్యు శకుంతల నత్తింటి కనుపుటలోఁ గణ్వుఁడు పొందిన గేస్తుని విచారము, తుదను కశ్యపాశ్రమమున సింగపుఁబిల్లతో నాడుకొను భరతబాలకునిపట్ల విరాగి యైన దుష్యంతుఁ డగపఱచిన అవ్యక్తపుపితృవాత్సల్యము ఆనాటకకృతి నవ్యక్తానందము మొదటినుండి తుదవఱకు నిచ్చెడిని కదా! ఇఁక షేక్స్పియరు హేమ్లెట్టు కథ ననుసరించి చూడుఁడు. అనుభవమునందు హేమ్లెట్టు తండ్రియొక్క పరమాత్మకు సుప్రతిష్ఠఁ గూర్చినాఁడు. రసమునందు హేమ్లెట్టు తల్లిని పినతండ్రిని నిలిపి కార్యదక్షత్వ మగపఱచినాఁడు. భావము ఒఫీలియా యందు నిలిపి విరామ మిచ్చినాఁడు. ఆశయము హేమ్లెట్టునం దుంచి కార్యసాఫల్యముఁ జూపినాఁడు. అవ్యక్తానందస్థాయీస్ఫురితానందతన్మయత్వము పరమాత్మవికారగద్గదికవాక్యములందు, హేమ్లెట్టు తల్లి పినతండ్రుల గొంకుజంకులయందు, ఒఫీలియా పాడిన 'విల్లో' పాటయందు, అన్నిటికంటెను కర్తృత్వమునందు హేమ్లెట్టు వితర్కించిన "ఉండుటా, పోవుటా" యను వాక్యరత్నములందును వెల్లడియగుచు షేక్స్పియరు కీర్తిని నిరంతరముగ ప్రతిష్ఠించుచున్నది.

ఆహా! ఉత్తమసారస్వత ముత్తమేంద్రియానుభవప్రేరేపితము. ఉత్తమహృదయరసప్రదీపితము. ఉత్తమమనోభావప్రబోధితము, ఉత్తమాత్మాశయసమున్నతము. అట్లే ప్రేరేపణము ప్రదీపనము ప్రబోధనము ఔన్నత్యము నొసంగుచున్నది. ఏమన, సారస్వతము దాతను ప్రతిగ్రహీతను సమానముగ సంతోషపెట్టుచున్నది. ఎంతవఱకొకానొకని యనుభవము రసగ్రహణము భావవికాసము ఆత్మోద్ధరణము పెంపొందుచున్నవో, అంతవఱకాతని మహానుభావుఁడని రసుఁడని సంబుద్ధుఁడని మహాత్ముఁడని కొనియాడుచున్నాము. అట్టిచో ఉత్తమోత్తముఁ డెవ్వఁడు? ఉత్తమసారస్వతము నొసంగు సుకవి యొండె; దానిని గ్రహించు పాఠకసత్తముఁ డొండె.

ఆ సుకవియెదుట శబ్దజాలములు దొరలిపడుచు ఉత్తమవస్తుప్రదర్శనము గావించుచుండును. అతనియెదుట అమితవృత్తములు నృత్యము సేయుచు ఉత్తమరసము లాలికించుచున్నవి. అతని ముందు మనోవికాసము అమల మగుచు ఉత్తమభావముల వెల్లిగొలుపుచున్నది. అతనిముందు ఆత్మకేళీవిభవము తాండవమాడుచు ఉత్తమాశయములఁ జేటుపఱచుచున్నది. అతఁడు సర్వస్వాతంత్ర్యముల ననుభవించుచున్నాడు. అతనివలననే భూతవర్తమానభవిష్యత్కాలములు కాలమానమెఱుంగక వెలయుచున్నవి. అతనివలననే భూమ్యాకాశపాతాళములవకాశభేదము లేక చరించుచున్నవి. అతనివలననే నరకిన్నరఖేచరగరుడోరగులు జాతిమతవిభేదము లేక ఒక్కటగుచున్నారు, విరోధులై యుద్ధ మొనర్చుచున్నారు. అతఁడే ప్రతిపదార్థమునందలి సౌందర్యవిభూతిని వెల్లివిరియఁజేసి దాన తాత్కాలికరసమును బోషించి అందుపై సద్భావముల నాటి అంతర్భాగమున నాశయముల నిమిడ్చి లోకము నుద్ధరించుచున్నాఁడు; త న్నుద్ధరించుకొనుచున్నాఁడు. చదువువాని నుద్ధరించుచున్నాఁడు.

## iv సారస్వతప్రదర్శనము

ఇది యెల్ల నెందుఁ బ్రదర్శింపఁబడుచున్నది? కవియందును పాఠకునియందును. ఈ కవి శాశ్వతమా? పాఠకుఁడు శాశ్వతమా? కారు. శాశ్వత మెయ్యది? ఆ యిరువురకు సమానరంగస్థలం బగు కావ్యము శాశ్వతము ఈ కావ్యమే చిరకాలము క్రిందట చనిపోయిన యొకానొక పురాతనకవిపుంగవునకు ఆధునికపాఠకునకు నన్యోన్యాకర్షణసానుభూతులఁ గల్పించుచున్నది. ఈ కావ్యమే భవిష్యదర్థముల నూ

చించుచున్నది. ఈ కావ్యమే లేని దాని నున్నట్టు ఉన్నది లేనట్టు చెప్పుచున్నది. మనల నానందాబ్ధిని దేల్చుచున్నది. (ప్రపంచమును) మఱపించుచున్నది. ప్రపంచమును నిలిపించుచున్నది. అది యెల్ల నెట్లు? వస్తుప్రదర్శన మెట్లు నిర్మింపఁబడెనో అట్లె నిలిచెనా? తాత్కాలిక రస మెట్లింతవట్టు పోషింపఁబడుచున్నది? భావము కలఁక గనదా? ఆశయ మడుగంటు కన్నే? యనెడు సందియములు తోపఁకమానవు. అవ్యక్తానంద మేమి యని యనకపోరు. కాని కావ్యమున వస్తుప్రదర్శనము వర్ణనములవల్లను పదములవల్లను రసములు వృత్తాంతిశీర్షి కలవల్లను, భావములు విరామములవల్లను, ఆశయములు పద్యములయందలి మాధుగానలహరివలనను, అవ్యక్తానందము అవ్యక్తరహస్యమువలనను చిరంజీవులుగ నొనర్పఁబడి కవితోఁబోక పాఠకునితో రాక స్వయం నిర్ణయసూత్రమున నగ్రస్థాన మధిష్ఠించుచున్నవి.

ఆ ప్రదర్శన సమున్నత సందర్శనమున చూపఱు వెలుఁగం దుచు వివిధదృక్పథముల వీక్షించుచున్నారు. అనుభవాదిదృక్పథమునఁ జూచి చూచి, ఉత్తమానుభవరసభావాశయములఁ గనుచున్నారు. అభిరుచిదృక్పథమునఁ జూచి ఉత్తమాభిరుచిని గ్రహించుచున్నారు. ప్రమాణదృక్పథమునఁ జూచి ఉత్తమజీవనము గడపుచున్నారు. ప్రదర్శనదృక్పథమునఁ జూచి ఉత్తమభావను బడయుచున్నారు. ఎల్లెడలను అవ్యక్తరహస్యతన్మయు లగుచు నవ్యక్తానందచిరంజీవు లగుచున్నారు.

సామాన్యులే యిట్లగుచుండ సారస్వతాభిమాని మాట వేఱ చెప్పనేల? అతఁడు దాని పుట్టుకను తన పుట్టువును చూచుకొనుచున్నాఁడు. దాని గుణాగుణములఁ దన గుణాగుణములు పరిగణించుకొనుచున్నాఁడు. దాని జీవకళలఁ దనజీవకళలు వహించుచున్నాఁడు. దాని జీవనమున తన జీవనమును సాగించుచున్నాఁడు. వే యేల? అతనికి సారస్వతము జాతీయనిసర్గనిధినిక్షేపము గాదే? అతనికి సారస్వతము ఆకాశగంగాతరంగశీకరప్రశీతలము గాదే? అతనికి సారస్వతము మలయపవనమోహనసుకుమారము గాదే? దాని విలువ దానినిరంతరఝరి దాని మనోహరభావము అమూల్యము అఖాతము అనంతము.

# మాలలు

బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మ గారు

కట్టను గుడ్డ లేక కలకాలము నుండుట కిల్లులేక చే
పట్టెడుదాత లేక పలుపాటులనందిన గూడులేక యే
పట్టు తిరంబులేక నడిబాటల నేగుట కాజ్ఞ లేక యి
ట్టట్టుజరించు మాలలకు నక్కట యెయ్యది దిక్కు-
[దైవమా.

ఉ. మాలలు మాలలా! భరత
మాతృగళస్థ చిరత్నరత్న సం
లాలితమాల లాంధ్రమహి
శాకచకల్పిత నవ్య మల్లికా
మాల లనార్య సంతతి వి
మాన శిరోగ్ర లసత్పతాకినీ
మాలలు గాని, పట్టి కను
మాలపు మాలలు గారు కారిలన్. 2

చ. పొలములు దున్ను టాలగుమిఁ
బోషణజేయుట మంచి దుక్కిటె
డ్డుల సమకూర్చుటల్, తరిని
తోరపువిత్తులు జల్లి పైరుపం
టల నెగి పెంపుసేయుట హు
టాహుటి నూరిచి ధాన్యమెల్లగా
సులగ నొనర్చి జీవనము
సూపెడి మాలల నోలి నూరికిన్
వెలుపల నుండఁజేయుట వి
వేకమె? హైందవలోకధర్మమే? 3

సీ. కడుపులోఁ బసిబిడ్డ గదల కున్నను మఱచి
చప్పిడి మాలఁడే సంతరించు
చూపుదోషము పాల పాప లందిన తోలు
జందెంబు మాలఁడే సంగ్రహించు
బాలగ్రహము పసి పాపలఁ బీడింప
దిగదుడ్పు మాలఁడే తెలిపి మాన్పు
ప్రాణమూడిన ప్రతి మానవునకును సం
స్కారము మాలఁడే సంఘటించు.

గీ. పుట్టుటాదిగ ప్రాణికి గిట్టువఱకు
మాలఁడే తోడునీడౌచు మేలుజూప
నూరిచివఱకు నెంటుట నుచితమొక్కో-
పుణ్యతములార హైందవ పురుషులార! 4

# పంచముల ప్రాచీనత

మల్యాల సాంబశివరావు గారు, బి. ఏ.

ప్రపంచమునందలి యన్ని జాతులును కాలవశమున మార్పుఁ జెందుచుండుట సహజము. కాలప్రభావమున కతీత మగు పదార్థ మేదియు నీ సృష్టియందుఁ గానరాదు. అందుచే నొకకాలమున సర్వవిషయములందును అత్యున్నతస్థితి నంది నాగరకాగ్రగణ్యతను గాంచిన జాతులును సంఘములును ఈకాలమున నామమాత్రావశిష్టములై యుండుట తటస్థించుచున్నది. పూర్వము మిగుల దుర్దశయందుండి వన్యమృగములవలె సంచరించుచుండిన జాతు లిప్పుడు తల లెత్తి నాగరకసంపన్నములై విలసిల్లుచున్నవి. ఇట్టి విపరీత మగు మార్పు కలుగుటకు కాలమే కారణ మనుటకంటె వేఱుమార్గము గాన్పింపదు. ఏజాతికైనను మంచిదశ వచ్చుసరికి దానియందలి యంతశ్శక్తు లన్నియు సంపూర్ణవికాసము నొంది నిరోధముల నలక్ష్యము చేసి విజృంభింపఁగలవు. కాని యిట్టి శక్తి సంపూర్ణముగ నుద్భవించినప్పుడే యట్టి సుసమయ మాసన్న మగు నని కొంద ఱాక్షేపింపవచ్చును. ఈ వాదము సారహీనము. మానవునియందుఁ గాని సంఘమునందుఁ గాని యిట్టిశక్తు లొక్కపర్యాయము ఆకసమునుండి పడినట్లు జనింపఁజాలవు. సర్వశక్తులును వానియందే యెల్లప్పుడును నిబిడీకృతములై యున్నవి. జాతి యుత్కృష్టదశ నందఁబోవునప్పటి కవి యన్నియు పూర్తిగ వికసించును. కాని ఆసమయమునకు లేని శక్తు లేవియు బయలుదేరవు. ఇది ప్రకృతివిరుద్ధము. ఇంతియ గాక కేవలము సర్వతోముఖ మగు నభివృద్ధియే జాత్యున్నతికి మూలకారణ మనియు, అదృష్ట మనునది లే దనియు వాదించు నెడల సర్వవిషయములయందును రాజకీయ, ఆర్థిక, సాంగ్రామిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మికాదివిషయములయందు ప్రపంచమునఁ బేరెన్నికఁ గన్న జర్మనీదేశ మేల యధోగతికిఁ బోవలయు నను సందియ మెల్లరకు స్ఫురింపకమానదు. కాలము లేక దైవము—ఇంతకంటె వేఱుకారణము చెప్పుటకు వలనుపడదు మానవచారిత్ర మంతయు నిందులకు నిదర్శనము. మన భారతదేశము — ప్రాచీనకాలమున సమస్తసంపదలతోఁ దులతూఁగుచు ప్రపంచమున కంతకును నాయకమణియైన మన మాతృభూమి—ఈసూత్రమందలి సత్యమును మఱింత ప్రస్ఫుటము గావించుచున్నది. ఈ దేశమున నివసించు జాతులచరిత్రము నించుక విమర్శకదృష్టితో తిలకించినయెడల నీయభిప్రాయము బలపడుచున్నది. మనదేశమున ననేకజాతులు నివసించి తుదకు భారతదేశమునే మాతృదేశముగ భావించి భారతీయు లగుచున్నారు. ఆర్యులు మహమ్మదీయులు పారసీకులు తుదకు యిరోపీయనులు వీరందఱును భారతీయు లైరి. చారిత్రకదృక్పథముతో నీక్షించినయెడల వీరిలో నొకరినొకరు విదేశీయు లని పిలుచుట కెట్టిసందర్భమును లేదు. వీరు వరుసవెంబడిని దేశము నాక్రమించి కొంతకాలము పాలకులుగ నుండి కాలవశమున పాలితు లగుచువచ్చిరి. కాని వీరందఱకును పూర్వ మీదేశమున నివసించుచు నిజమగు "స్వదేశజు" లను నామమున కర్హులగువారి సంగతి యేమి? పెక్కు-వేల శతాబ్దులకుఁ బూర్వము వారును నాగరకత గలిగియుండి, దురదృష్టవశమున నేఁడు ఎల్లరచే నేహ్యులని పరిగణింపబడుచు పంచము లను హీనజాతికిఁ జెందియున్నారు.

## ఆధారములు

వీరి ప్రాచీనచరిత్రముఁ గూర్చి తెలుపు ఆధారము లేవియు నంతగా లేవు. అందునను చరిత్రమువలన సత్యములని నిరూపింపఁబడిన ఆధారములు బొత్తుగా లేవు. ఇందులకు రెండు కారణములు గలవు. (1) ప్రస్తుతము పంచము లని పిలువఁబడు ఆదిద్రావిడులు ఉన్నతస్థితి నందియుండిన కాలమున తమ జీవితాదివిషయములను గ్రంథరూపమున తెలియజఱఁచు పద్ధతి లేకపోవచ్చును. ఇది వారి ప్రాచీనత కొక ప్రబలనిదర్శనము. (2) తరువాత వారిని జయించిన ఆర్యులు ఆజాతి చరిత్రమును లిఖింపవలసియుండెను. కాని ప్రస్తుతాభిప్రాయానుగుణ్యముగ దేశచరిత్రల వ్రాయుపద్ధతి వారికాలమునఁగూడ లేదు. పురాణయుగమువఱకును ఆ విషయములు గ్రంథస్థములు కాలే దని చెప్పవచ్చును. పురాణములలోని విషయములఁబట్టి ద్రావిడులు మిగుల ననాగరకు లని అజ్ఞాను లని పశుతుల్యు లని నీచు లని తేలుచున్నది. ఈరీతిగ ఆర్యులు వారికి ప్రతికక్షులై వారి చారిత్రమును మిగుల పాక్షికబుద్ధితో వ్రాయుటచే దక్షిణదేశపు ఆదిమనివాసుల ప్రతిభయు ఔన్నత్యమును వెల్లడికాక యున్నవి. తనశత్రువుయొక్క సుగుణములను ఆధిక్యమును కీర్తించుట మానవస్వభావము కాదు. ఇది వ్యక్తులందువలెనే జాతులందుఁగూడఁ గానఁబడుచున్నది. ప్రపంచచరిత్రమును చూచినయెడల క్రొత్తజాతులు ప్రాఁతజాతులను జయించుటకీ మార్గమునే అనాదినుండియు నవలంబించుచుండె నని వ్యక్తము కాఁగలదు. ఏజాతినైనను జయించి సంపూర్ణముగ స్వాధీనపఱచుటకు రెండుమార్గములు కలవు (1) సంగ్రామమున జయించి లోఁబఱచుకొనవలయును. ఇంకను, పశుబలప్రయోగమువలన మారణోపాయముల ననుసరించి జాతిక్షయముఁ గావింపవలెను. కాని యిందు మూలమున సంపూర్ణవిజయము చేకూఱఁజాలదు. (2) నాగరకవ్యాప్తివలన నేజాతినైనను లోఁబఱచుకొనవచ్చును. స్వీయనాగరకమును గోల్పోయిన జాతి యుండియు లేనట్లే! ఏలయన, జాతీయాత్మప్రతిబింబ మగు నాగరకముతోపాటు ఆత్మ కూడ నశించును. దానితో

వ్యక్తిత్వము పోయి జాతి నశించును. లేదా ఉత్కృష్ట నాగరకము గల జాతులతో సమ్మిళితమై పేరులేకుండ నశించును. ఈవిధమగు ఉద్యమమునకు స్వీయనాగరకకీర్తనమును పరనాగరకనిరసనమును అత్యవసరములు. ఆర్యు లవలంబించిన పద్ధతు లివియే! ఆదిమనివాసుల నాగరకమును వారు తృణీకరించిరి. తమ నాగరకమును విజృంభింపఁజేసిరి. ఈ ప్రయత్నములమూలమున నార్యలిఖితగ్రంథములయందు ఆదిమనివాసులయెడలఁ గల అసహ్యత యంతయు వెడల గ్రక్కబడినది. అందుచే నాగ్రంథములు సత్యనిరూపణమునకు మన కంతఁ సహాకారములు కాఁజాలవు. ఇంతియగాక యీవిషయమున పరిశోధకులగు పండితులు ఎట్టికృషిని సలిపియుండలేదు. ఇఁక మనకు మిగిలిన యాధారములు సాంప్రదాయములును ఐతిహాసికకథలును కలవు. సాంప్రదాయములు చాలవఱకు జాతియొక్క ప్రాచీనచారిత్రమును తెలుపఁగలవు. మానవజాతి స్వీయాన్నత్యము నీవిధముగనే మఱపుఁజెందక పతితస్థితియందును జ్ఞప్తి నుంచుకొనుచున్నది. మఱియు కథలు వంశపరంపరగ చిరకాలచరిత్రములను మఱపుఁజెందకుండుటకు మంచిసాధనములు. కాని వీనియందు కాలక్రమమునఁ గ్రొత్తవిషయము లనేకములు చేర్పఁబడి సత్యము మఱుఁగుపడు నను భయముమాత్రము కలుగుచున్నది. కాని సాధనాంతరము లేనప్పుడు వీనినే ఆధారముగ గైకొనుట ఆవశ్యకము. విన్సెంటు స్మిత్తుగా రీ విషయమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు:—“ఏ జాతియొక్క ప్రాచీనతర చారిత్రము నైనను వ్రాయఁబూనిన చరిత్రకారుఁడు సారస్వతమునను, సాంప్రదాయములమీదను ఆధారపడక తప్పదు. కాని యిట్టిసాధనసామగ్రినిబట్టి చేయఁబడిన యూతని పరిశోధన ఫలితములు ఆసమకాలికుల వ్రాఁతలంతటి విలువ గలిగి యుండఁజాలవు. మఱియు ప్రాచీన భారతదేశచరిత్రమున చాలభాగము ఇంకను రూఢికాని ఊహాజనితభావములపైనే యాధారపడి యున్నది. ఈయూహలను విమర్శకదృష్టిచే సంస్కరింపవలెను; చరిత్రాంశములను రూఢిపఱుపవలెను. పరిశోధనలను సమర్థింపవలెను. కావున నే నిటఁ దెలుపఁబోవు విషయములను పండితులు సాదరభావముతో తిలకించి, సత్యాన్వేషణమునకు యత్నించినయెడల కృతకృత్యుఁడ నయ్యెదను.

## దక్షిణదేశము : ఆదిమనివాసులు

దక్షిణదేశపు ఆదిమనివాసులను గూర్చి వ్రాయునప్పుడు ప్రస్తుత మున్న వారిసంతతివారి శరీరలక్షణములను, ఆచారములను, భావములను తెలిసికొనుట అవసరము. కాని యీ యత్నము కూడ సంపూర్ణముగ నెఱవేఱుట కాటంకములు కలుగుచున్నవి. వీరిజీవితాచారాదివిషయములందు ఆధునిక నాగరకతవలన ననేకములగు మార్పులు కలుగుచున్నవి. అతిప్రాచీను లగు ఇట్టిజాతివారియందు కాల మెన్ని మార్పులఁ గావించెనో ఎవరి కెఱుక? అయినను వీరియందలి ప్రధాన లక్షణములు మాత్రము మాఱకుండుటవలన మనపని కొంత సుకరమైనది. క్రీ. శ. 900-వ సంవత్సరమునకు పూర్వపు రాజకీయచారిత్రము దెలుపు విషయము లేవియు లే వని విన్సెంటు స్మిత్తుగారు నుడువుచున్నారు. ఇందులకు కారణమును వా రీవిధముగ సూచించియుండిరి “దక్షిణదేశమందలి ప్రాచీనరాజ్యములు జనాకీర్ణములుగను, ఐశ్వర్యసుశోభితములుగను ఉండినవి. వానియందు నివసించు ద్రావిడజాతులు తమ ఆర్యప్రతికక్షులకు నాగరకవిషయమున నెంతమాత్రమును తీసిపోవు. కాని వారు నాగరకప్రపంచమునుండి మఱుఁగుపడి యుండుటచే ఇతరజాతులు వారిఘనతను గుర్తెరుంగుటకవకాశము లేకపోయినది. ఆ కాలమున వీరియందు చరిత్రకారులు లేకపోవుటచే క్రీ. శ. 900-వ సంవత్సరమునకు బూర్వమున్న వీరి చరిత్రాంశములు నశించినవి. ఎప్పుడో ఉత్తరదిశనుండి యేరాజో వచ్చినప్పుడు గాని ఈ దక్షిణదేశము ప్రపంచపుదృష్టికి గోచరింపలే దనియే చెప్పవచ్చును.” ఇది యొక కారణము. క్రీ. శ. 900-వ సంవత్సరము నాఁటికి ద్రావిడజాతి మిగుల మార్పుఁజెందినది. వారిలో నార్యసంసర్గ మెక్కుడైనది. వీరే ఈ దక్షిణఖండపు ఆదిమనివాసు లనుటకు ఆధారములను ముందు చూపెదను. మన మింకను అనేక శతాబ్దులకు పూర్వపుచరిత్రము నరయవలయును. ప్రజలయందు ఆర్యులకుఁ బూర్వమును లక్షణములను భావను సాంఘికప్రతిష్ఠాపనములను ఇప్పటికిని గాంచుచున్నాము. వీనిని గూర్చి ముందు చర్చింతము. ప్రస్తుతము వారి ఆదిమనివాసముఁ గూర్చి యించుక యోచింపవలయును.

## భూగోళస్థితి

ఆర్యద్రావిడసమ్మిళిత మగు పాలనవిధానము ననుసరించు హిందూరాజ్యములకుఁ బూర్వ మా దేశచారిత్రమును మూఁడుభాగములుగ విభజింపనగును. (1) ప్రథమాంతరమున ద్రావిడులకుఁ బూర్వమున్న జాతులస్థితి. (2) ఆర్యులు తమమతాచారములను వీరియందుఁ జొనుపుకాలము. (3) మొదటిరాజ్యములకాలము. చాలకాలము క్రిందట దక్షిణదేశము ఆసియాఖండమునందుఁ జేరలే దని ఖగోళశాస్త్రజ్ఞు లంగీకరించిరి. సంస్కృతపురాణములు సింహళపుబౌద్ధులు పశ్చిమతీరమందు ప్రచారమున నున్న కథలు, వీనిని పరికించిన నీ స్థితి యటివలనే మాఱినట్లు తోఁచును. ఈదేశద్వారముననే మధ్యధరాసముద్రప్రాంతములయందును, ఉత్తరదేశములయందును నివసించు జనులు ఇప్పుడు కాఁపురమున్న దేశములకు పోయియుండి రని పాశ్చాత్యుల యభిప్రాయము. ఈ విషయమై హెకేలుగా రిట్లు వ్రాసియుండిరి:—“హిందూమహాసముద్రము పూర్వ మొక మహాఖండము. ఇది సుంద్రాదీవులనుండి ఆశియాఖండపు దక్షిణభాగము ననుసరించి ఆఫ్రికాఖండపు తూర్పుదిశవఱకును వ్యాపించియుండెను. దీనికి ‘లిమూరియా’ యని పేరు. కోఁతులఁ బోలిన జంతువు లచ్చట నివసించుచుండుటచే దీని కీ పేరు వచ్చినది. ప్రస్తుత మున్న మలెయాదీవులు ఆకాలమున రెండుభాగములుగ విభజింపఁబడి యుండెడివి. అందు పశ్చిమభాగమున బోర్నియో, జావా, సుమిత్రాదీవులు ఆసియాఖండముతోడను లిమూరియాతోడను కలసియుండెడివి. తూర్పుభాగమున సెలిబిసు, మొలక్కాసు, న్యూగినియా, సోలమనుదీవులు ఆస్ట్రేలియాతోఁ జేరియుండెడివి” ఇందుచే ప్రస్తుత మా పేరులం బరఁగు

జాతులయందును దేశములందును సమానాంశము లనేకములు గన్పట్టుచున్నవి. భూగోళ మీస్థితియం దున్నప్పుడే ద్రావిడులు ప్రస్తుతము దక్షిణదేశ మను ప్రదేశమునకు వచ్చియున్నటులు తెలియుచున్నది. వీరికిఁ బూర్వము మానవు లెవరును ఇచ్చట నివసించియుండుట దుర్లభము. డాక్టరు మెక్లీనుగారు కూడ ఈ యభిప్రాయమునే వ్యక్తీకరించియుండిరి. ఏల యన, ఆకాలమున నిచ్చట కోఁతులవంటిజంతువు లుండెడి వని హెకెలుగారు తెలిపియుండిరి. వానిని బట్టియే యీ ప్రదేశమున కంతకును లిమూలియా యను నామ మన్వర్థ మైనది. కావున డార్విను సిద్ధాంత ప్రకారము కోఁతులలోనుండి మానవు డుద్భవించు కాలమునకు తరువాతనే ద్రావిడులు ఈదేశమునకుఁ వచ్చియుండి రని యూహింపవలసియున్నది. అప్పటినుండియు వీరిని ద్రావిడులనియే యెల్లవారును పిలుచుచుండిరి. పాశ్చాత్యచారిత్రకులును పరిశోధకులును ఈనామమునే వాడియుండిరి. ఈ విషయములను విశ్వసించునెడల ద్రావిడులు ఆఫ్రికాఖండమునుండి వచ్చి రని డబ్ల్యు. క్రాకుగారు చెప్పిన వాక్యములు సత్యములుగ తోఁపక పోవు. ఆకాలమున నీ మహాఖండమం దంతటను జనులు విచ్చలవిడిగ వచ్చుచు పోవుచుండిరి. ఆస్ట్రేలియా దేశవాసులకును దక్షిణఇండియా ద్రావిడులకును గల సంబంధమును ప్రొఫెసరు ఆర్. సీవానుగా రిట్లు తెలుపుచున్నారు:—"ఆస్ట్రేలియనులకు పోలికగల జాతి ఆఖండపు సమీపమున నెచ్చటను లేదు. కాని న్యూగినీలోని పాపూయనులును సుండాదీవులలోని మలయాలును, న్యూజీలాండులోని మావ్రీలును వారికి సన్నిహితసంబంధులుగ తోఁచుచున్నది. మఱియు, భారతదేశపు ఆద్యనివాసు లగు ద్రావిడులకును ఆస్ట్రేలియనులకును చాల సంబంధము కల దనియు వా రిరువురకును అనేకవిషయములలో సామ్యము కల దనియు నిశ్చయముగ చెప్పనగును." వీ రిరువురి పుఱ్ఱెలును, ఆకారములును ఉంగరములవంటిజుట్లును బిరుసుగడ్డములును ఈ సిద్ధాంతమును బలపఱచుచున్నవి. మఱియు నోరిసు, బ్లీకు, కాల్డువెల్ మున్నగువారు చేసిన పరిశోధనల బట్టి ఆస్ట్రేలియను ద్రావిడభాషలకు చాల పోలికయు సంబంధమును కల వని తేటపడఁగలదు. వీ రిరువురును నివసించు ప్రదేశములును అతిదూరమున నున్నను, ఇంతటి సంబంధము గలిగియుండుటచే వీ రిరువురు నేకజాతివా రని యూహింపవలసియున్నది. ప్రస్తుతము నామమాత్ర మైన టాస్మేనియనులు దక్షిణ భారతదేశమునుండి వచ్చిన జాతివలననే స్థానభ్రష్టు లైరి. "ఆస్ట్రేలియను లింకను అనాగరకస్థితిలోనే యున్నను, భారతదేశపు ద్రావిడులు అనేకశతాబ్దుల క్రిందటనే నాగరకసంపన్ను లై మహాసారస్వతముఁ గలిగియుండిరి. ఈ రెండుజాతులకును సాంఘికాది విషయములలో చాల నైక్యము కలదు. ఆస్ట్రేలియను లుపయోగించు భూమిరంగులు (దక్షిణ) భారతదేశమునుండి వచ్చినవే?' యని డాక్టరు కీనుగారు వ్రాసియున్నారు. దక్షిణఇండియా వ్యాకరణము ద్రావిడముగనే యున్నది. కొండజాతులును అడవిజాతులును పరయాలును ఈ వ్యాకరణ శబ్దములను రూపభేదములను ఉపయోగించుచున్నారు. ఇఁక నాఫ్రికాఖండపశ్చిమున మనగాస్కారు సమీపములోను ఏడెను వద్దను ద్రావిడజాతులవంటి నల్లజాతు లుండెడి వని టోపినార్డుగారు తెలుపుచున్నారు. వీరికిని ద్రవిడజాతివారికిని చాలవిషయములలో సామ్యము కలదు. వీరు నీగ్రోసంతతికిఁ జెందినవా రని కూడ బ్రోకాగారు వ్రాయుచున్నారు. ఆకాలమున నీప్రదేశము లన్నియు నేకమై యుండుటచే వీరందఱకును పరస్పరము సంబంధ ముండియుండవలయును. పైని చెప్పఁబడిన విషయములనుబట్టి ద్రావిడజాతివారు పెక్కువేల యేండ్లకుఁ బూర్వమే దక్షిణదేశమునకు వచ్చియుండిరనియు వారికిఁ బూర్వ మిచట జనసంచారము లేకుండెననియు వారే ఆద్యనివాసు లనియు ప్రస్తుతపు ద్రావిడులు వారి సంతతివారే యనియు స్పష్టము కాఁగలదు.

## చరిత్రాంశములు

ద్రావిడసంతతికి 'టాములికు' అని మొదటిపేరు. దీనినిబట్టి వారిభాష మనకు తెలియుచున్నది. ఈపేరును భాషకు ప్రత్యేకించిన బాగుండు నని బిషప్ కాల్డువెల్ గారు వీరిని ద్రావిడు లని పిలువఁజొచ్చిరి. ద్రావిడు లనఁగా దక్షిణదేశమున నివసించువా రని యర్థము. క్రైస్తవశకారంభమునాఁటికే వీ రత్యున్నతస్థితి నందియుండి రని చరిత్రాంశములవలన స్పష్ట మగుచున్నది. గ్రీకుచరిత్రకారుఁ డగు టాలమీ క్రీ. శ. 140 వ సంవత్సరమున తన గ్రంథమును వ్రాయుచు దక్షిణ హిందూదేశమును 'డమిరికే' యని చెప్పెను. దీనికిని 'తమిళకము'నకును భేదము లేదు. ఈప్రదేశమం దంతటను తమిళభాషయే వాడుకయం దుండెను. మళయాళభాష యప్పటికింకను ఉద్భవింప లేదు. ప్రజలలో భిల్లులు పల్లెలు మున్నగువారు కలరని ఆతఁడు వ్రాయుచున్నాఁడు. ఆకాలపు తమిళసారస్వతమును బట్టి ద్రవిడులు అత్యున్నత నాగరకమును పెంపొందించిరని తేలుచున్నది. వారియం దాకాలమున బానిసతనము పేరునకైనను లేకపోవుటచే నాజాతి యెంతటి ఉత్కృష్టదశ నందియుండెనో స్వాతంత్ర్య మెంతవఱకు ప్రబలియుండెనో తేటఁపడఁగలదు. వారియందు జాతిభేదములు లేవు. ఉత్తరదేశమునుండి వచ్చి మధురయొద్ద నివాసమేర్పరచుకొనినవారు తమ హిందూమతమును జాతివిభేదములను వారియందు వ్యాపింపఁజేయవలె నని ప్రయత్నించినప్పుడు వారు ప్రబల నిరోధమును జూపి వారిప్రయత్నములను విఘ్నము గావించిరి. మెగాస్థనీసు వీరిని గూర్చి వ్రాయుచు వీరియందు వేదాంతులు వ్యవసాయదారులు పసులకాపరులు వర్తకులు సైనికులు పరీక్షకులు సలహానిచ్చువారు అని విభజించి తెలిపిరి. దీనినిబట్టి హిందూమతానుగుణ్యమగు జాతిభేదము లెంతమాత్రమును లే వనియు, ఇవి ఆ ప్రజలవలంబించు వృత్తులే యనియు తేటపడఁగలదు. ఆర్యసంతతివారు పెక్కువేలయేండ్లు వీరిని లోఁబఱచుకొని తమమతమును వ్యాపింపఁజేయవలె నని ప్రయత్నించినను అవి క్రీ. శ. 7 వ శతాబ్దమువఱకును జయావహములు కా లే దని విన్సెంటు స్మిత్తు గారు వ్రాయుచున్నారు. వారి వాక్యముల నిటఁ బొందుపఱచుచున్నాను. 'క్రీస్తుశకము 7 వ శతాబ్దములో అది (బౌద్ధమతము) క్షీణించుచుండెను.

జైనమతమును హిందూమతమును అన్యోన్యాధిక్యమునకై పరస్పరము ద్వేషభావములతో కృషి సలిపినవి. ప్రథమమున దక్షిణహిందూస్థానమున బౌద్ధమతము జాతిభేదములను విసర్జించినది. కాని బ్రాహ్మణుల కృత్రిమమతాధిక్యము తుదకు హెచ్చినది. ఇప్పు డితరప్రదేశములందుకంటె దక్షిణహిందూదేశముననే జాతిభేదము లెక్కుడుగ నున్నవి.

## పంచము లన నెవ్వరు?

పంచము లనఁగా నెవరు? వారిలోనిజాతు లేవి? ఈవిషయమై సంపూర్ణముగ తృప్తికర మగు సమాధానము నిచ్చుట కష్టము. కాని వారియందలి మూఁడు ప్రధానజాతులను మాత్రము మనము తీసికొని పరిశీలింతము. ఆంధ్ర దేశమున నున్న మాదిగలు మాలవారును అరవ దేశమున నున్న పరయాలును పంచములయందు ముఖ్యజాతులవారు. వీరు పంచము లను పేరుతో నెల్లెడల వ్యవహరింపఁబడుచున్నారు. వీరు ద్రావిడు లని నిర్ధారణచేయుటకు మంచి ఆధారములు గన్పట్టుచున్నవి. కాని దొరకినంతలో ఈ నిదర్శనములు ప్రయోజనకారకము లన వచ్చును. వీరు ద్రావిడసంతతివారే యని పరిశోధకశాస్త్రజ్ఞుల యభిప్రాయము. నల్లని శరీరచ్ఛాయ ఉంగరములవంటి వెండ్రుకలు నల్లని కండ్లు పొడవైనతల మిగుల వెడల్పు గల ముక్కు అను నీ లక్షణములు మాల, మాదిగ పరయులయందు ప్రస్ఫుటముగ నిప్పటికిని గానవచ్చుచున్నవి. రిస్లీ దొరగారు వ్రాసినదానిఁబట్టి ఆంధ్రపంచములును అరవపరయాలును ఏకజాతికి సంబంధించినవారే యని స్పష్టమగుచున్నది. ఈ సంబంధమును మఱింత బలవత్తరము చేయు నిదర్శనములు కొన్ని కానవచ్చుచున్నవి. ప్రాచీనము నుండియును శక్తిపూజ వీరిరువురియందును నిప్పటికిని చెక్కుచెదరక నడచుచున్నది. ఇతరు లీపూజను చేయుచున్నను, పంచములవలె చేయువారు లేరు. గ్రామదేవతలకు పంచములే పూజారులు. ఎల్లమ్మ యను దేవతను పరయాలును, మాలమాదిగలును పూజింతురు. పరపాతమ్మ మొదలగు దేవతలు పశురోగముల నివారించు నను భావము ఈ యిరువురకును కలదు. కలరా, మశూచిరోగముల కిరువురియందును ప్రత్యేక దేవతలు కలరు. భూతములను పాఱఁద్రోలుటకు అరవదేశమందున్న పరయాలు తమ పిల్లలకు రాగితో చేయఁబడిన యొకరక్షరేకును గట్టెదరు. దానియందు తెలుఁగు అంకెలును తెలుఁగు అక్షరములును గానఁబడుచున్నవి. దీనిని బట్టి దక్షిణదేశపు ద్రావిడులే ఆంధ్ర దేశమున పంచములైనట్లును, ఎన్ని శతాబ్దములు గడచినను నీ రిరువురకును గల సంబంధము నశింపకుండ నిలిచియుండినట్లును యూహింపవలసి యున్నది. భాషలు భిన్నములైనను వీరి హృదయముమాత్ర మొక్కటే యనియు, వీరిజాతీయాత్మ నామావశిష్టము కాలేదనియు నంగీకరింపక తప్పదు.

## నిమ్నస్థితి

చరిత్రయుగమునందును జాతిభేదములు లేని ద్రవిడజాతియం దిప్పుడు తీవ్రముగ జాతిభేదము లుద్భవించుటకు కతం బేమి? ఏకజాతివా రయ్యును ద్రావిడసంతతియందు కొందఱు బ్రాహ్మణులుగను మఱికొందఱు పంచములుగను ఏల యుండవలయును? ఈ సాంఘికజాతివిభేదములకు ఆర్యులు కారణభూతు లని చరిత్రకారు లెల్లరు నేకగ్రీవముగ నంగీకరించిరి. ఆర్యులు నిరంతర ప్రయత్నములచే ద్రావిడులను తమ నాగరకమునకు లోఁబఱచుకొనిరి. తమ ఆధిక్యమును వర్ణభేదములను శాశ్వతముగ నిలిచియుండుటకు ద్రావిడులలో కొందఱ నగ్రవర్ణములలో జేర్చికొనిరి. ద్రావిడులలో నతివాద పక్షపాతులతో రాజీ చేసికొనుటకు వారియందలి రాక్షసపూజ, అమ్మవారియర్చన మొదలగు మతవిషయములను, కట్టుబాట్లను తాము స్వీకరించి, కొన్నివిషయములలో వారి కాధిక్యము నొసంగి వారిని సంతృప్తిపఱచిరి. ఈరీతిగ నార్యులు ద్రావిడులను జయించినను, తామును కొంతవఱకు ద్రావిడులకును, వారినాగరకమునకును లోఁబడిరి. దానివలన ద్రావిడనాగరకమునందలి సౌష్ఠవము తేటపడఁ గలదు. బ్రాహ్మణేతరులు లక్షలకొలఁది ఒకానొకకాలమున బ్రాహ్మణవర్ణమున చేర్చుకొనఁబడినట్లు ప్రబలనిదర్శనము లనేకములు కలవు. ప్రజలయందు వ్యాప్తిగాంచిన కథలను బట్టి రాజులు తమ పాపపరిహారార్థము లక్షబ్రాహ్మణుల కన్నదానము చేయుచుండు టాచారము. కాని వర్ణవివక్షత లేని ఆకాలమున దక్షిణదేశమందు లక్షబ్రాహ్మణు లొక్కపర్యాయ మెచ్చట లభింతురు? కావున రాజుల యనుమతిపై బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులుగ మాఱుచుండిరి. ఇప్పటికిని ఉత్తమబ్రాహ్మణులు కొన్ని బ్రాహ్మణశాఖలను హీనదృష్టిఁ జూచుట గలదు. మారకులును మళయాళదేశపునంబూద్రీలును ఇందులకు నిదర్శనములు. వీరు నేఁటికిని నాయరుకన్యకల నుంచుకొనుట సాంఘికాచారములఁ బట్టి అత్యవసరము. కాఁబట్టి యీవిధమగు మార్పులను ఆర్యులు తప్పనిసరియగుటచేఁ గావించిరి. గాని ద్రావిడులయందలి ప్రేమాతిరేకముచేఁ గా దని స్పష్టము కాగలదు. ఈ విషయముఁగూర్చి 1891 సంవత్సరమున హెచ్. ఎ. స్టూఅర్టుగారును సర్ ఆల్ ఫ్రెడు లయాలుగారును వ్రాసియున్నారు.

ఆర్య లోకపర్యాయము ద్రావిడులయందు వర్ణవిభేదముల నెలకొల్పి రని తలంచుటకు వీలు లేదు. అది దుర్లభము. ఈ వ్యవస్థలు క్రమక్రమముగ వృద్ధి నొందింపబడినవి. ఆర్యుల నైపుణ్య మంతయు నీ సాంఘికవిజయమును సాధించుటయందే వినియోగింపఁబడినది. ప్రథమమున నీ విభేదములను గాఢముగ నుంచినయెడల ప్రజలయందు విశ్వాసము పోయి వీరిప్రయత్నములు విఫలత నొందును. అందుచే వారు వర్ణసంకరమున కాకాలమున నంగీకరించిరి. కావుననే బ్రాహ్మణుఁడగు వసిష్ఠుడు చండాలస్త్రీ యగు అరుంధతిని పరిణయ మయ్యెను. జమదగ్ని కూడ మాతంగిని భార్యగ స్వీకరించె నని యొక పురాణగాథ కలదు. మాల, మాదిగ, పరయాల ప్రాచీనచరిత్రములఁ దెలుపు కథలను చూచినయెడల, వా రెల్లరును బ్రాహ్మణవంశసంజాతుల మని చెప్పుకొనుచుండి రనియు బ్రాహ్మణులకును వీరికిని అన్యోన్యసంబంధబాంధవ్యము లుండెడివనియు తెల్లము కాఁగలదు. ఈ సంబంధములవలని ఫలితములు నేఁటికిని కనఁబడుచున్నవి. ఈ విషయమై థర్ స్టను గారు తెలిపినవాక్యము లెంతయు ఆదరణీయములు.

## మాదిగలు

వీ రాంధ్రదేశమున చెప్పులు కుట్టు వృత్తియం దున్నవారు. అరవదేశమున వీరిని చక్కిలియను లని పిలుతురు. వీరిని పూర్వకాలమున మాతంగు లని వ్యవహరించుచుండిరి. గాథను బట్టి వీరు రాజవంశసంజాతు లని యూహింపవలసి యున్నది. ఒకానొక రాజు చిరకాలము సంతానము లేక పుత్త్రికకొఱకు దేవతల నారాధించెను. దేవత లాతని కొక బంగరుచిలుక నిచ్చిరి. ఆచిలుక వెంటనే యొక పర్వతాగ్రముపై కెగసి మాయ మయ్యెను. భగ్నమనోరథుఁ డగు నా రాజాపర్వతమునంతను ద్రవ్వింపఁగా అప్సరసలను తలదన్ను సౌందర్యముఁ గల ఒక పిల్లను గాంచెను. ఈమెయే ప్రజలచే మాతంగి యను పేర నారాధింపఁబడుచుండె నఁట! థర్‌స్టను గారీవిషయము గురించి వ్రాయుచు మాతంగులుః ప్రాచీనకాలమున దక్షిణదేశములో నొక ప్రదేశము నేలు రాచవంశమువారు. మాదిగలు తాము మాతంగ నుక్కుల మని చెప్పుకొనుచుందురు. ఈమాతంగికి కర్నూలు జిల్లాలోని తూడిమళ్ల గ్రామమున ఒక ఆలయము కూడ కలదు. ఈమె నీరీతిగ పూజించుటకు ఒక కథను చెప్పెదరు. జమదగ్నికి రేణుకవలన నైదుగురు పుత్త్రులు గలిగిరఁట. కడపటివాఁడే పరశురాముఁడు. జమదగ్ని ఒకనాఁడు ఆమెశీలమును శంకించి చంప నాజ్ఞ నొసంగఁగా పరశురాముఁడు మాతృశిరమును ఖండింపఁబోయెను. ఆమెతో నొక మతంగస్త్రీ సేవకురా లుండెను. పరశురాముడు వదలిన తీవ్రబాణము రేణుకశిరమును ఖండించి యామె వెంటనున్న సేవకురాలిని గూడ గతజీవినిగ నొనరించెను. జమదగ్ని కుమారునికిం గల పితృభక్తికి ఆనందించి వరమును కోరుకొ మ్మనెను. పరశురాముఁడు ఆమె మరల జీవించునట్లు ప్రసాదింపు మనియెను. జమదగ్ని పవిత్రము నొక పాత్రమం దుంచి కుమారున కిచ్చి ఖండితశిరమును ఎప్పటియట్లు శరీరమునకు చేర్చి, ఆనీటిని జల్లుమని యాజ్ఞాపించెను. ఆతడు సంతోషాతిరేకమున మాతంగస్త్రీశిరమును తన తల్లి దేహమునకును తనతల్లిశిరమును మాతంగస్త్రీదేహమునకును జేర్చెను. తరువాత జమదగ్నియును శిరము ప్రధాన మని యెంచి మాతంగస్త్రీదేహము గలయామెను తనభార్యగ స్వీకరించెను. తనభార్యదేహమును మతంగస్త్రీశిరమును గలయామెను చిన్న దేవతగ నుండున ట్లనుగ్రహించెను అని వ్రాసెను. ఈకథనునిజమని భావించినయెడల పరశురాముని కాలమునాఁటికే ఆర్యకృతవర్ణవిభేదము లున్నవనియు కాని ఇప్పుడున్న మాదిగలు పంచమవర్ణమువారుగ పరిగణింపబడుట లే దనియు రామాయణకాలమునాటికే మిగుల సౌన్నత్యము నందిన జాతివా రనియు, బ్రాహ్మణులతో సమానముగ తిలకింపఁబడెడివారనియును తేటపడుచున్నది.

రామరావణుల యుద్ధకాలమునాఁటికే పెద్దవాఁడై యున్న జాంబవంతుని వంశస్థుల మని వీరు తలంచుటచే మాదిగల అతిప్రాచీనతయు నాకాలమున వీరికిఁగల ఉత్కృష్టదశయు వ్యక్తమగుచున్నది. వీరు జాంబవఋషి సంతతివా రని 1891 సంవత్సరపు మైసూరు జనాభా నివేదికమునఁ దెలుపఁబడి యున్నది. ఏవ్యక్తి నైనను, ఏ సంఘము నైనను ఒకఋషి సంతతికిఁ జెందినట్లు పరిగణించుట హిందూ మతాచారము. దీనిని బట్టి నీ రాకాలపు హిందూసంఘమున బ్రాహ్మణులతో తుల్యులుగ నుండి రనుటకు సందియము లేదు. ఈశ్వరుని శాపమువలన మాదిగలు చెప్పులు కుట్టు వృత్తి నవలంబించి రని కూడ కొంద ఱనుచున్నారు. దీనినిబట్టి, వీరు కాలవశమున పతితులై రని యూహింపవలసి యున్నది. స్టూఅర్టు ఫ్లీటుగారల వాక్యములవలన ఏడవ శతాబ్దమువఱకు వారి యాధిక్యము తగ్గలేదని తేలుచున్నది.

## మాలలు

మాలలు ద్రావిడు లనుట కెట్టి సందేహమును లేదు. వీరియందు పెక్కుతెగ లున్నవి. వీనిని గూర్చి ప్రచారములో నున్న యొక కథ నిటఁ దెలుపుట అవసరము. ఒక మాలవాఁడు ఒక్కొక్కకులమునుండి యొక్కొక్క స్త్రీవంతున 18 గురిని వివాహ మాడెను. పోలేరమ్మ గొఱ్ఱెలను మేఁకలను తనకు బలి యియ్యవల దనియు వానికి బదు లొకస్త్రీని శిశువును తన కర్పింపవలసిన దనియు తెలిపినదఁట. ఈ సంగతి వీని భార్యలకు తెలిసినది. వారిలో నొకతె ఒక రెడ్డియువకునితో పాఱిపోయెను. వారిసంతతివా రందుచే రెడ్డిభూము లని పిలువంబడుచున్నారు. ఇక నొక తెగ దేశాంతరమునకుఁ బోయెను. ఆమె సంతతివారు పాకనాటు లని పిలువఁబడుచున్నారు. ఇఁక నొకతె యొకరికిని తెలియకుండఁగ నొకచోట దాఁగుకొని యుండెను. ఈమె సంతతివారిని దైండ్లులు అని పిలుచుచుందురు. ఈరీతిగ వీరిలో ననేకము లంతశ్శాఖ లేర్పడినవి. మాలలు అరవదేశజు లనుటకు థర్‌స్టనుగారు వ్రాసిన యీవాక్యములు నిదర్శనములు:

"The Daindlas are said to be one Tamil Paraiyans who settled down in the Telugu Country and adopted the custerns and iamanners of the Malas some call themselves Arava Mas,"

మాలలు మాదిగలంత ప్రాచీనులుగఁ దోఁచుట లేదు. నే నిదివఱకు వ్రాసినటులు ప్రథమమున వర్ణవిభేదమే లేదు. తరువాత ఇప్పుడు పంచము లనఁబడువారు నాల్గవజాతియందే యుండిరి. కాలక్రమమున నిది యేర్పడి వారియందు శాఖోపశాఖలు పెరిఁగినవి. మాలలు దేవవంశసంభూతుల మని చెప్పుకొనుచున్నారు. పార్వతి మాసిన (మైల) తన వస్త్రమును పాఱవేయఁగా, అందుండి ఒక మగశిశువు జనించి పెరిఁగి పెద్దవాఁడైనప్పుడు పరమేశ్వరుఁడు వీనిని పసుల కాపరిగ నియోగించెను. ఒకనాఁడు వీఁడు వెన్నను రుచిచూచి ఇంకను తినవలె నని తలంచి పాఁడియావును చంపి వెన్న నంతను ఒక్కపర్యాయమే చేకొనఁ బ్రయత్నించెను. పరమేశ్వరుఁడు కోపించి వీనిని వీనిసంతతివారిని మాలలుగ నుండునట్లు శపించెను. మాలలును, మాదిగలును ఒకకాలముననే ఒకకారణముచేతనే నిమ్నస్థితికి వచ్చినట్లు ఈకథనుబట్టి యూహింపవచ్చును. ఈస్థితికిఁ బూర్వము వీరు క్షత్త్రియకార్యములను నిర్వహించుచుండి రనియు తమకు జీతముల నిచ్చి పోషించువారికి వీరు సైనికులై యుండి రని తెలియుచున్నది. వీరి గృహనామము లనేకములు యుద్ధపరికరముల పేళ్లై యుండుటవలన ఈయూహ స్థిరపడుచున్నది. మాదిగలలో వలె గాక వీరియందు

మతాధిక్యము కూడ కలదు. మాదిగలలో కూడ తమ తమ దేవతలకు పూజారులుగ నున్నవారు కలరు. కాని కేవలము మతప్రచారమే వృత్తిగా గొనిన మాలదాసరులవంటివారు మాత్రము లేరు. అనంతపురముజిల్లాలో వనవోలుగ్రామముననున్న రంగస్వామి దేవాలయమునకు పూజారి మాలవాడు. బ్రాహ్మణులుకూడ ఆదేవాలయమునకు బోయి దేవు నారాధించుచుందురు. గౌరీ విగ్రహమును నగలను మాలలే సంరక్షించుచుందురు. కాపులును బలిజలును ఆవిగ్రహములు గావలసినప్పుడు వారివద్దనుండి తెచ్చుకొనుచుందురు. ఇందులకు కారణముగ మహమ్మదీయులకును బలిజలకును జరిగిన యొక కథ కూడ కలదు.

## పరయనులు

వీరిని గురించి సత్యము తెలిసికొనుటకు మన కనేకాధారములు కనఁబడుచున్నది. వీరు చాల ప్రాచీనమగు జాతివా రనియు మిగుల గౌరవముగ చూడఁబడుచుండెడివా రనియు మనము నిశ్చయముగ చెప్పవచ్చును. దక్షిణదేశమున నిప్పటికిని కేవలము పరయనులే నివసించు గ్రామములు గానబడుచున్నది. వండలూరు అను గ్రామములో పరయనులే గాని యెవరును లేరు. దక్షిణార్కాటు జిల్లాలోని గోవింద నల్లూరు అంకుపేట అను గ్రామములలో పరయనులుమాత్రమే నివసించుచున్నారు. దీనియందు మునసబును గ్రామనాయకుడును కూడ పరయనులే! అనేకభూములు వీరివశమున నుండుటచే వీ రీ ప్రదేశపు ఆదిమనివాసు లనియు వారు చాలకాలము స్వాతంత్ర్యము నంది యుండి రనియు స్పష్టమగుచున్నది. మాలమాదిగలవలె వీరును సుమారు 7 వ శతాబ్దాంతమున పతితులై రనుటకు థర్‌స్టను గారి వాక్యములే తార్కాణములు:

మఱియు క్రీ. శె. 11 వ శతాబ్దియందలి తమిళ నిఘంటువు (దివాకరము) నందు పరయను అనుమాట లేదు. క్రీస్తు శతాబ్దారంభమున నున్న తమిళపద్యములయందు పరయనునామము లేదని డబ్ల్యు ఫ్రాన్సిను గారు 18 వ శతాబ్దమున తామువ్రాసిన గ్రంథము నందు తెలిపిరి.

తిరువళ్లువరు అను తమిళమహాకవి పరయనుజాతివాఁడు ఆకాలమున (క్రీ. శె. 10 శతాబ్దము) పరయనులు మిగుల గౌరవస్థానమునం దుండనిచో అతని కింతటి గౌరవ మబ్బియుండెడిది కాదు. ఈతఁ డొక వెల్లాలస్త్రీని వివాహ మాడె ననుట మనయూహను మరింత దృఢపరచుచున్నది. హేమంగ్వే గారును పరయనుల ఆదిక్యముఁ గూర్చి చక్కఁగా వ్రాసియున్నారు.

ఈతని వ్రాతనుబట్టి పరయనులును బ్రాహ్మణులు సోదరు లని తెలియుచున్నది గ్రామములో కొందఱాచార్యులచే బ్రాహ్మణులుగ జేయబడి రను యూహ స్థిరపడుచున్నది. ఇప్పుడు తాము పంచములకంటె నధికుల మని మురియుచు, వారు తమదరికి వచ్చినయెడల శరీర మపరిశుద్ధ మను భ్రమతో స్నానము చేయువలకు దృష్టిఁ జెందని బ్రాహ్మణసామధారులు తమ నిరసనముబొందువారు తమకు రక్తసంబంధము గల యేకోదరులే యని గుర్తించుట ధర్మము. పవిత్రవంత మగు జందెమును కొన్ని సమయములయం దైనను ధరించుటకు పరయనుల కధికార ముండుటయే వారి బ్రాహ్మణజననమునకు ప్రబలతార్కాణము. స్వీయదేశమం దుండుటచే పరయనులకు గలిగిన గౌరవాధిక్యము పరప్రదేశములకు బోయి నివసించు మాల, మాదిగలకుండఁజాలదు. అందుచే పరయనులకు జూపబడు గౌరవాదికములు ఆంధ్రదేశమున నివసించు మాల మాదిగలయం దంతగా గానరాకున్నవి. మఱియు తంజావూరిలో నుత్సవము జరుగునప్పుడు పరయనుల నాయకుని దేవునితోఁబాటు తెల్లఏనుఁగుపై యూరేగింతురు అని ఎమ్. జె. వాల్షేకు గారు వ్రాయుచున్నారు. మదరాసు జార్జిటవును దేవతయగు ఎగట్టీయొక్క యుత్సవమున విగ్రహమునకు తాళిని కట్టునప్పుడు పరయనుఁడే పెండ్లికుమారుడై వర్తించును. రామానుజాచార్యుని మతస్థుల ప్రధానస్థాన మగు మేల్కోట మైసూరులో నున్నది. లోను, బేయరులో నున్న బ్రాహ్మణ దేవళములోను పరయనులును మాదిగలును సంవత్సరమునకు మూడుదినములు యథేచ్ఛగా రావచ్చును పోవచ్చును. కంజీవరము కుంభకోణము శ్రీవిల్లిపుత్తూరు పట్టణములయందు దేవునిరథమును పరయనులు కూడ లాగుదురు. ఇంతేగాక పంచముల దేవత లగు అమ్మవార్లయందు బ్రాహ్మణులు మొదలగువారి కున్నభక్తికల దనియు ఆ దేవతలు హిందూదేవతలతోడి సమానగౌరవము నందుచున్నా రనియు ఇదివఱకే తెలిపియుంటిని. పంచము లెంతటి శోచనీయస్థితి ననుభవించుచున్నను పారంపర్యముగ వచ్చు నీయాచారమువలన వారి పురాతనగౌరవాధిక్యతలు వెల్లడి యగుటచే యున్నవను యుద్దేశములో నీ ఉదాహరణముల నిట బొందుపరచితిని. హిందువుఁడు తన మతముతో సంబంధించిన విషయములతో ఎవరికిని సంపర్కముండుట కిష్టపడడు. అట్టి హిందూమతమునసే వీరికి గౌరవ మొసంగబడుటవలన వారును ఆర్యులచే సమానులుగ ఎట్లు గణింపఁబడుచుండిరో సువ్యక్తము కాఁగలదు.

# స్వాభావిక జీవనము

## పుచ్చా వెంకట్రామయ్య గారు

ప్రకృతిస్వేచ్ఛా ప్రియమైనది. స్వేచ్ఛఁగోరని జాతులు మృగములు విహంగములు తుదకు క్రిమికీటకాదు లైనను లేవు. స్వాతంత్ర్యముఁగోరని జాతు లధోగతిపా లగుచున్నవి. కనుకనే స్వాతంత్ర్యమునం దున్న జాతులు ప్రచండ వేగముతో స్వతంత్రతకై ప్రయత్నించుచున్నవి. పరిమితమైన స్వేచ్ఛ గలవారు అపరిమిత స్వేచ్ఛకై పెనఁగులాడి, దురాశాపాశబద్ధులు పొందదగిన ఫలితము నందుచున్నారు. అపరిమిత స్వేచ్ఛాపాశబద్ధుఁ డగు కార్మణ్య చక్రవర్తి దేశాంతరగతుఁడు కావలసివచ్చెను. జారు వినాశనము నందెను. నహుషాదు లధోగతికి పాల్పడిరి. కనుకనే వెనుక నొక మహాపురుషుఁడు "ప్రకృతిసిద్ధములైన నియమబంధములచే కట్టబడినను పరిమితమైన స్వేచ్ఛఁ గోరుడు" అని వచించెను.

ఈ వ్యాసమున ప్రకృతిసూత్రములపై ఆధారపడు జీవన స్వాతంత్ర్యమునందు మార్గములు సాధ్యమైనంతవరకు సహేతుకముగ వర్ణింపఁబూని 'స్వాభావికజీవన' మను పేరు పెట్టితిని. మనుజుఁ డట్టి జీవనమార్గ మవలంబించినను కోరఁదగినది అసాధ్యమగు మరణ రాహిత్యము కాదు. మనమనిన సుఖజీవనమును, అనాయాసమరణమును కోరఁదగినదియును పొందనగునదియును.

ఇహమునకు సంబంధించినంతవరకు మానవుఁడు జీవితమునందు త్రివిధములైన స్థితులను పొందుచున్నాఁడు. ఆకలిని శాంతింపఁజేయుటకై వాయువు ఆహారము పానీయము గోరుచున్నాఁడు. ఇందు ఒక్కొక్కటి సహజము అసహజము అని రెండు తెఱఁగులు. సహజములు ప్రకృతి సిద్ధములును దేహపరిపోషకములును ఆరోగ్యదములునై యున్నవి. అసహజములు ప్రకృతినిషిద్ధములు దేహవినాశకరములు ఆమయప్రదములు. ఇందు వాయువునుగూర్చి చర్చింతము.

ఘ్రాణేంద్రియము పటువుగా నుండినచో తన కావశ్యక మగు వాయువులోని అసహజమును బహిష్కార్యమును గ్రహింపఁగలఁడు. కాని యింద్రియము లన్నియును అభ్యాసమున లొంగునవి. పరతంత్రము లగు జాతులు స్వరాజ్యమును నిషేధించినట్లు, ఘ్రాణేంద్రియము అపరిశుద్ధవాయువును గమనింపఁజాలక ఎట్టి గాలి నైనను పరిజ్ఞానశూన్యముగ స్వీకరించు చున్నది. ఘ్రాణేంద్రియము దేహమును దుష్టవాయువు బారినుండి కాపాడుటకు కోట.కావలివంటిది. కావలియును తొలుత యజమానునకు వాయువులోని మంచిచెడ్డలను ప్రదర్శింపఁ బ్రయత్నించును. నిరోధించును. కాని యా నిరోధములను అనుసరింపకున్నఁ గ్రమముగ నా యింద్రియము మొద్దువారి సహజశక్తిని సంయితము గోలుపోయి యపరిశుద్ధవాయువు నైనను ఆనందముతో స్వీకరించును. అప్పుడు దేహమునకుఁ గిట్టిన దండుము. కాని విష.వాయు ప్రభావముమాత్రము మానక దేహమునందు కాలికముగఁ పనిఁ జేయుచు నే యుండును. కనుకనే పొగఁ ద్రాగ నారంభించువారు వంశపరంపరగ నలవాటు పడియుండరేని ప్రథమమున వాంతులను చేసికొందురు. క్రమముగా పొగ కలవాటు పడినకొలఁది అది లేనిచో ఆహారము జీర్ణింపదనునంతటి దుస్థితికి వచ్చెదరు.

పరిశుద్ధవాయు వనునదేయది? బహిరంగప్రదేశములందును, సముద్రతీరములను, పర్వతాగ్రములందును, ఆరామములందును నుండెడి వాయువే పరిశుద్ధవాయు వని మన కవిరాజులును, పాశ్చాత్య వైద్యులును, ప్రకృతిపరిశీలకులును వివరించిరి. కాని మనలో అనుకొనునట్లు ఘుమఘుమ లాడునది పరిశుద్ధము కాదు. పరిమళవాయువులు, ఘ్రాణేంద్రియముయొక్క వాయుపరిజ్ఞానమును నశింపఁ జేయును. ఆ కాలమున నసహజము అగు సంగమేచ్ఛను గలిగించును. ఈ విషయమును నమ్మనివారలు ప్రకృతిని పరిశీలించుట యొప్పు. సామాన్యముగ మృగాదులు కూడ నిర్మలవాయువు నాఘ్రాణించి పరమప్రీతిఁ గాంచుట మన మెఱిఁగినదియే. కాన సుఖజీవనముఁ గోరువారందఱు నిర్మలవాయువును సేవింపజనును.

అన్నపానములు:—వీనినిగూర్చి చర్చించునప్పుడు మనుష్యకోటికి సమజాతు లగు జరాయుజవర్గమును పరిశీలించిన తృణభక్షకజంతువులు ఫలభక్షకజంతువులు మాంసభక్షకజంతువులు సర్వభక్షకజంతువులు నని నాలుగు తెఱఁగులు కన్పట్టును, వీటిని ఏర్పఱచుటకు పండ్లు ఆంత్రనిర్మాణము జీర్ణాశయము జ్ఞానేంద్రియములు అను నీ నాల్గింటిని పరిశీలించినఁ జాలును.

1 పండ్లు.—మాంసభక్షక జంతువులకు పై వరుసయుఁ గ్రింది వరుసయును అనుకొని యుండక మెలుకలబోనువలె ఇమిడియుండును. అవి మొనలు తేలి చీల్చుటకు ఉపయోగించును. ఉదా.—కుక్క-పండ్లు. తృణభక్షక జంతువులకు మొద్దువారి గడ్డిని కత్తిరించి తినుటకే ఉపయోగించును. ఉ॥ గోవులు మొ॥ సర్వభక్షక జంతువులకు నుభయ కార్యములకును వనరుగా నుండును. ఉ. ఎలుఁగు. ఫలభక్షక జంతువులకు మునిపండ్లు కొఱుకుటకు నములుటకును వీలుగ నుండును. ఉ॥ కోతి. ఫలభక్షకజంతువులవంటి దంతములు ఉన్నందున మానవుఁడు ఫలభక్షకజాతివాఁడు.

2 ఆంత్రనిర్మాణము.—ఈ మూఁడు జాతుల జంతువులకు పేగులు క్రమముగ నాల్గైదురెట్లును 20-28 రెట్లును, 10-18. రెట్లు నుండును. మానవుఁడు ఆంత్రమునుబట్టి ఫలభక్షకకోటిలోనివాఁడు.

3 జీర్ణాశయము.— మాంసభక్షక జంతువులకు చిన్నదిగను గుండ్రముగను, తృణభక్షక జంతువులకు జీర్ణాశయము కోశ

రూపమునను నుండును. అం దొకటి యపక్వ పదార్థమునకును రెండవది పక్వ పదార్థమునకును స్థానమై, విశాలమైన ప్రధాన జీర్ణాశయమును గలిగియుండును. ఫలభక్షక జంతువుల జీర్ణాశయము మధ్యమపరిమాణమున నుండును. అంత్రమూలము జీర్ణాశయమునకు ఉపకోశముగా నుండును. ఇందువలన మానవుఁడు ఫలభక్షకజాతి వాఁడు.

4 జ్ఞానేంద్రియములు.—ఇందు నేత్ర నాసికారసనేంద్రియములు ముఖ్యములు. మాంసభక్షక జంతువులు ఆహారమును పసిపట్ట గలవు. శాకాహారు లన్నమో యాహారమును వాసనచూచి సంతోషింతురు. మాంసభక్షణ సేయు మానవుఁడును పోపు వేయని పచ్చి మాంసమును వాసనచూచిన కంటగించుకొనును గదా! పచ్చిమాంసము నొకవంక పండిన ఫలము నొకవంక నుంచిన, సువాసనయే గదా మన జిహ్వ నుద్రేకింపఁ జేయునది. కాన మానవుఁడు ప్రకృతిసిద్ధమైన యాహారము ననఁగా శాకాహారమునే భుజింపవలయు ననియు నందువలన సుఖజీవన మవలంబింపవచ్చుననియు ప్రాకృతవాదుల వాదన. అస్వాభావిక పదార్థముల కలవాటుపడిన సర్కసులోని వానరములు మొ. కొద్ది రోజులలోనే తేజోవిహీనములై క్షయాదులచే బాధితము లగుచుండెను. మఱియు శాకాహారము విషయమున మాంసాహారులు చెప్పెడి మాటలు పాటింప రాదని ప్రకృతిశాస్త్రవేత్త ప్రచురించెను.

ఉద్రేకము తాపము గలిగించు ఆవ, నూనె, మొదలగు పదార్థములను మన వైద్యు లనేకులు నిషేధించియే యున్నారు. అవి అసహజముగ సంగమేచ్ఛను అతిమాత్రముగ రగుల్కొలుపు నని కొందఱ యభిప్రాయము. శ్రీకృష్ణభగవానులు చెప్పినట్లు తాపజనకము లగు చేఁదు, పులుసు, ఉప్పు, ఉష్ణము, కారము, నిస్స్నేహము అగు పదార్థమును రాజసాహారము. ఇది శోకామయప్రదము.

అంబలి త్రాగెడి కూలివానికిమాత్రమైనను, రాజసాహారములగు పక్వాన్నము మొ॥ పదార్థములను భుజించినను సంతృప్తి గలుగదు.

రుచి యనఁగా వాసనవలన జిహ్వకు గలుగు నుద్దీపనమే. సాత్త్వికాహారులకు ఈ యుద్దీపనము పరిమితముగను అంతకంటెను ఎక్కువగ రాజసాహారులకునుఁ గలుగును. ఉద్దీపనముబట్టియే రుచిగా నున్నదందుము. ఇట్టి పదార్థములు అలవాటైన కొలఁది నుద్దీపనతరపదార్థములను కోరుచు పోనుపోనుఁ 'మనోరథా నామ తటాః ప్రవాహః' అన్నట్లగును. కనుక రసనేంద్రియమును సాత్త్వికాహారములవైపు మరల్చి స్వాభావికజీవనమును తద్ద్వారా సత్యమై, పరిమితమై సహజమైన ప్రపంచసుఖములను అనుభవింపఁ బ్రయత్నింపవలెను. వానవిశేషములలో ప్రవాహోదకమును, ఫలరసములునుఁ దక్క తక్కిన వన్నియు దేహమునకు గిట్టని పదార్థము లని అమెరికను వెజ్జు లిదివఱకే విశదీకరించిరి. ఈ విషయమై నాగరికతలో మిన్నలగు హైందవులు శక్తికొలది మాదకపదార్థసేవనము నిషేధించిరి.

నిద్ర:—పగటిపూట నిద్దురయు రేల జాగరణంబును, సర్వదా నిద్రించుటయును బొత్తుగ నిద్దుర లేమియు వ్యాధికి మూలములు. ఆరోగ్యవంతునికి నిద్దుర నూతనోజ్జీవమును గలిగించుటకు తాత్కాలికమైన విశ్రాంతి. కలలను గాంచక ఆతఁడు యోగ్యమగు విశ్రాంతి నందును. కాని దురదృష్టవంతులు పలువరించుచుందురు. ఇది వ్యాధిఫలితము. రాత్రి ౧౧ గంటలకు నిద్దురయు వేకువను మేల్కాంచుటయును కొందఱిమతమునందును, రాత్రి ౭½ గంటల నిద్దురయు వేకువను మేల్కాంచి మధ్యందినమందు విశ్రాంతి నందుట కొందఱిమతము నందును, నిద్దురకు పరిమితి అని తేలినది. నస్యమును పీల్చి నిద్దుర మాన్పుకొనుటయు, టీ, త్రాగి వేకువలఁ జూడఁబోవుటయు ప్రాకృతమార్గావలంబకులకు హేయ మగు నలవాటు.

సంగమము:—ప్రస్తుతము మనవారిలో ప్రబలియున్న హేయము లగు నభ్యాసములును, భావములును దేహమును కంపింపఁజేయును. సంగమ మనునది ప్రకృతిసిద్ధమైన నియమము. ఈ విషయమై క్లుప్తముగా నివేదించెదను. (1) సంతానముకొఱకే సంగమము కోరవలెను. (2) ప్రసన్నహృదయులకును, నీరోగులకును మాత్రమే సంగమము కలుగవలెను. (3) అకాలమును, అతిమాత్రమును నగు సంగమేచ్ఛ కలుగరాదు. (4) గర్భధారణమైన తరువాత సంగమము విధిగా మానవలెను. ఈ నియమములు ప్రకృతిసూత్రానుసారము లగు మృగములయందు కలవు. కాని దురదృష్టవంతమగు మానవజాతిలో లేవు. మానవజాతికి ఇదియే వ్యాధికారణములు. ఇట్లే డాక్టరు ట్రాలు ఎం. డి. గారును చెప్పిరి. చూడుఁడు. "ఉద్దీపకపదార్థములఁ దినుటయు, ఉద్దీపకము లగు పానీయములఁ గ్రోలుటయు వ్యభిచారమునకును, అకాలమును నతిమాత్రమును నగు సంగమేచ్ఛకును ప్రధానకారణములు. మద్యసారమును మద్యమును త్రాగుటయు, పొగ త్రాగుటయు కామజ్వరమును పుట్టించు ననుట నిస్సందిగ్ధము. మద్యమును మద్యసారమును త్రాగకున్నను తీవ్రము లగు నుద్దీపకపదార్థములు మద్యసారము చేయు నంతపనిని జేయును. ఈ తప్పిదమున కంతకును తల్లిదండ్రు లుత్తరవాదులు. పిల్లవాండ్రకు దృఢ మగు శరీర మేర్పడుటకు సమృద్ధియగు నాహార మవసరమే గాని పరిమళద్రవ్యములతోఁ గూడిన ఆహారమును, తేయాకు, కాఫీ మొదలగు నుద్దీపకపదార్థములను స్త్రీపురుషుల యొక్కయు బాలురయొక్కయు గుహ్యాంగములకు నకాలపరిపాకమును, అకాలవికాసమును గలుగజేయును. వయసువారికైనను ఈ పదార్థము లనవసరములు. పిల్లవాండ్రకు శారీరకశాస్త్రానుసారముగా విద్యాభ్యాసమునకు తగిన యేర్పాటు లున్నచో వ్యభిచారాదులు వారిమనములనుండి తొలఁగిపోవుననుటకు సందియము లేదు. కాన సర్వేశ్వరుఁడు ప్రకృతిమార్గావలంబులను గాఁ జేయఁ బ్రార్థించెదను.

## ఆంధ్రవాఙ్మయమున

# నాచన సోమనాథుని స్థానము

నడకుదుటి వీరరాజుపంతులు గారు

### ఉపోద్ఘాతము

కతిపయదివసంబుల క్రిందట (29-11-19) నేను, నాబంధువులగు బాలాంత్రపు వేంకటరావుపంతులు గారి యింట "ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికాసంచిక" నొకదానిని గాంచితిని. 'పరిషత్పత్త్రిక, యనుపేరు వినుటయే కాని దాని నెన్నఁడును జూచియుండలేదు. అప్పుడు నేను జూచిన సంచిక స్వరూపముచేఁ (ముఖపత్త్రాదులులేమిఁ) బ్రాఁతదే యైనను విషయములచే నాకుఁ గ్రొత్తదే యగుటచే దానిని బ్రీతిమెయిఁ జదువఁ దొడంగితిని. క్రమముగాఁ జదువను 351 వ పుటయందు, "ఆంధ్రవాఙ్మయమున నాచనసోమనాథున కీయఁదగినస్థానము" అను శీర్షిక గానవచ్చెను. ఇట్టి మహత్తరవిషయములతో నిండియుండు పరిషత్పత్త్రికకు సభ్యుఁడుగా నుండకపోయితిఁగదా యని అప్పుడు పశ్చాత్తప్తుఁడ నైతిని. పిమ్మట నా శీర్షిక గల వ్యాసమును జదివితిని. దానిని జదువఁగా నే 'ఆంధ్రభాషాదేవి' దుర్గతింగూర్చి నాకుఁ జింత వొడమెను. ఏమన,

ఆ వ్యాసమునందు నాచనసోమనాథుని దుర్గుణములు, దోషములు ననేకములు పేర్కొనఁబడినవి. అదుష్కృతులచే నాతఁడు 'ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యమునఁ దనకుఁ గల యున్నతస్థానము' నుండి యమాత్యపదమునకుఁ ద్రోయఁబడెను. దోషి యగు వాఁడు మంత్రిపదమునకు మాత్ర మర్హుఁ డెట్లగును? మంత్రి సమర్థుఁ డగు నేని సార్వభౌముఁ డెట్టివాఁ డైనను బాధ లేదుగాని, అమాత్యుఁడే దోషభూయిష్ఠుఁ డైనచోఁ బ్రభువు సమర్థుఁ డైననేమి, అతని సామ్రాజ్యము చేటొందదా? వ్యాసమున గణింపఁబడిన దోషశతంబులు గల సోమునికి నమాత్యపద మిచ్చుట 'ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యమును' నాశముపాలు చేయుట గాదా?—అని చింతించితిని.

మఱియు, ఆ వ్యాసమును 'ఆంధ్రభాషాభివర్ధనీసమాజము' మెచ్చుకొనినట్లు దానిభూమిక తెలుపుచుండెను. 1895 వ సంవత్సరమున శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసిన 'ఆంధ్రభాషను గూర్చిన యుపన్యాసమును' మెచ్చుకొనిన యాసమాజము వారే యందలి—"నాచనసోమనాథుఁడు కొన్ని విషయములలోఁ దిక్కనసోమయాజిని మించుచున్నాఁడు...ఇతనికవిత్వమునందే మహాకవికి వలయు గుణము లన్నియుఁ జొసఁగియున్నవి..." ఇత్యాది వాక్యములను మఱచి యాతనిఁ గ్రిందికిఁ ద్రొక్కు వ్రాఁతలు గల యీ వ్యాసము నెట్లు మెచ్చుకోఁగలిగి రనియు నేను విచారించితిని.

పై వ్యాసముపై విమర్శనమును వ్రాయు మని నా మిత్త్రులు పలువురు నన్నుఁ బ్రేరేమటంజేసి నా శక్తికొలఁది నే నొక విమర్శనమును వ్రాసితిని. ఆవిమర్శనము గొప్పదిగ నుండుటచే 'నాంధ్రసంవత్సరాదిసంచిక' కనువుపడునట్లు, అందలి ముఖ్యవిషయముల విమర్శనమమాత్రము సంగ్రహపఱిచి వ్రాసితిని. భాషాభిమానులు తమ యమూల్యమైన కాలమునందలి యల్పాంశమును దీనిం బరిశీలించుటకై వ్యయపఱుపవేఁడు నన్ను మన్నింతురు గాక!

### "భూమిక"

"ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయఁదగిన స్థానము" అను పేరుగల వ్యాసమును వ్రాసిన 'రా. అనంతకృష్ణశర్మ' గారు దానికి 'భూమిక' ను వ్రాసి యున్నారు. అందలి వాక్యముల నెల్ల విమర్శించుట ప్రస్తుతకార్యము గాదు. దానిలోని యొండు రెండు వాక్యములీ విమర్శనమునకు సంబంధించునవి యగుటచే వాని వైచిత్రిని పాఠకులకు విన్నవించెద.

I "నే నీవ్యాసమును వ్రాసి మూఁడేండ్లు గడచినవి...ప్రకృతము నాచనసోముఁ డెఱ్ఱనకన్నఁ బ్రాచీనుఁ డను సిద్ధాంత మొకటి బయలు వెడలుచు నీవ్యాసమును దలక్రిందుగాఁ జేయుచున్నది."

కాలము విపరీత మైనప్పుడు మూఁడేండ్లవఱకు నూరకున్న వారల్లే యుండవలసినది. ప్రకటించు కోర్కి గలిగినప్పుడు కాలముచే బాధింపఁబడు భాగముల నైనఁ దీసివేయవలసినది.

II "ఈ సిద్ధాంతముప్రకారము నాచనసోముఁ డెఱ్ఱనకన్నఁ బ్రాచీనుఁ డైనను సోముఁ డెఱ్ఱనకన్న నుత్తమకవి యను సిద్ధాంతమున కేమియు బాధ లేదు."

లేకుండుఁగాక! 'కా దనువాఁడు ఘనుఁ డనిపించుకొనును' అను దానింబట్టి లోక మంతయు 'ఔ' నను విషయమును దాము 'కా' దనిరే కాని నిశ్చయముగా వీరి యాంతరంగికదృష్టి సోముని మీఁద నే యున్నది. కావుననే సత్యవాణి సరస్వతి 'న్యాయము పాదునఁ బడు' నన్న లోకోక్తి వ్యర్థము గాకుండ నెఱ్ఱనకన్న సోముఁడే యుత్తమకవి యని వీరిచే వ్రాయించినది.

### వ్యాసనామము

ఆంధ్రభాషాభివర్ధనీసమాజము వారు "ఆంధ్రవాఙ్మయమున నాచనసోమనాథుని స్థానము" అనియే కాని "...... సోమనాథున కీయఁదగిన స్థానము" అని ప్రకటించి యుండరే దని నా మిత్త్రు

లొకరు నాకుఁ జెప్పి తత్సమాజప్రకటనపత్త్రిక నొకదానిని నాకుఁ జూపిరి. "ఈ రెంటికిని భేద మేమి?" యని నామిత్త్రుఁ డొకఁ డడిగెను. నే నిట్లంటిని. "మిత్త్రమా! 'రాముని యిల్లు'—'రామున కీయఁదగిన యిల్లు'—ఈ రెంటిభేదము నారయుము!"—నా చెలికాఁ డూరకుండెను. అప్పుడు నాకీ శ్లోకము జ్ఞప్తికి వచ్చెను:-
"హైహ సఖి! చతురో మే భర్తా పరలిఖితం వాచయితు మసమర్థః
సఖి చతురతరో మే భర్తా। స్వలిఖిత మపి వాచయితు మసమర్థః."

## వ్యాసములోనివాక్యములు

"మన యాంధ్రభాషావధూటికి లేఁబ్రాయంబుఁ దప్పించి సరివారిలోఁ దలయెత్తఁజేసిన మహనీయులు కవిత్రయమువా రనుట యెవ రెఱుంగరు?"

ఈ వాక్యము నవతృణలతాపరివృత మగు గర్తము. ఇది పాఠక కుంజరులను భ్రమపెట్టి లోఁబఱుచుకొను స్వభావము గలది. దీనిని విమర్శించి చూతము. 'కవిత్రయమువారు తలయెత్తఁజేసి' రనుట యందలి యాశయ మేమి? మొదట నన్నయ్య, పిమ్మట నిన్నూఱేండ్లకుఁ దిక్కన్న, తరువాతఁ గొంతకాలమునకు నెఱ్ఱన్న— ఇట్లొక్కరొక్కరుగా నెత్తఁజేసి రనియే కదా? నన్నయతిక్కనలకు నెఱ్ఱనకు నడుమ నుండు కవు లేమి చేసిరి? మొదటి యిద్దఱు దయచేత నెత్తుచు నెత్తుచు నున్న యవ్వధూటి శిరమును వారు మఱల వంచిరా? పిమ్మట నెఱ్ఱన్న తిరిగి యెత్తించినాఁడా? ఏమి యీవాక్యము నర్థము? నన్నయతిక్కనలు గాక యెఱ్ఱన్నకుఁ బూర్వ మెందఱు కవిసింహు లుండెడివారో యూరయుఁడు! నన్నెచోడమహాకవి, అథర్వణాచార్యుఁడు, కేతన, బయ్యన, మారన, మంచన, పాల్కురికి సోమనాథుఁడు, నాచన సోమనాథుఁడు, రంగనాథుఁడు, కాచవిభుఁడు—విట్ఠలరాజు, విన్నకోట పెద్దన, భాస్కరుఁడు, భీమన—(ఇ ట్లెందఱను వ్రాయఁగలము?) మొదలగు మహాకవు లాంధ్రభాషావధూటి నెట్టి సమర్థతతోఁ బోషించినారు? ఎట్టి వరవర్ణినిగా నామెను దిద్దినారు? ఎన్నెన్ని విహారస్థానముల నామెకుఁ జూపినారు? ఇందఱుమహనీయుల ముందునకు దూఁకి యెఱ్ఱన యామెచేఁ దలయెత్తించినాఁ డనుట యేటి న్యాయము? పైపై వన్నెలు గల యీవాక్యరత్న మెట్లు వెలుఁగుచున్నదో పరికింపుఁడు!

II "వారికిఁ దరువాతఁ గూడ వారి త్రోవయే త్రొక్కి యట్టిపనికిఁ బ్రయత్నించిన కవు లనేకులు గల రనుట సర్వవిదితము."

"అట్టిపని" యనఁగా నేమి? ఇంకను తలయెత్తించుటయే? అప్పుడు సంపూర్ణముగ నెత్తలేదా యేమి?—ఎఱ్ఱన్న కన్న ముందున్న వారిమాట యటుండ నిత్తము. తరువాతి వారు మాత్రము కవిత్రయమువారి త్రోవనే త్రొక్కిరా? పలుత్రోవలఁ ద్రొక్కిరి. స్వతంత్రమార్గముల నెట్టిరి. నూతనపథములఁ గనుఁగొనిరి. చూ. శ్రీనాథుఁడు, అనంతామాత్యుఁడు, పెద్దన, రామరాజభూషణుఁడు, సూరన—మొ.

III "యోగ్యతానిర్ణయమునకుఁ గాలనిర్ణయ మత్యావశ్యకము గాదు."

ఏల కాదు? సోముని యయోగ్యతలను బయటఁ బెట్టినది కాలమే కాదా? చూడుఁడు. "సోముఁ డెఱ్ఱన మాటలనే మార్చి తన గ్రంథమున వ్రాసికొనెను—వీరుల యస్త్రశస్త్రములను సయితము మార్పఁ డయ్యెను—ఎఱ్ఱన విపులముగ వర్ణించినఁ దాను జల్లఁగ దాఁటును.—ఎఱ్ఱన యెందైన మిగుల మనోహరముగ వర్ణించి యుండెనేని దానును నాచోటనే యాతనిమాటలకే రంగు మార్చి వ్రాయఁ బ్రయత్నించును.—ఎఱ్ఱన మత్తేభమే సోముని యుత్పలమాలయై వెడలినది—"

ఇత్యాది వాక్యరాజముల కాదరువు కాలమే కాదా? సోముఁ డెఱ్ఱన్నకన్నఁ బూర్వుఁ డగుటచేఁ దై యెఱ్ఱన సోముఁడు కాఁగా, సోముఁ డెఱ్ఱన యయ్యెనుగదా! కాలవైపరీత్యము!

(ఎఱ్ఱాప్రెగ్గడపుస్తకమును జూచి సోమనాథుఁడు గ్రంథమును వ్రాసికొనె ననుట చిఱుతపులి తెగువను జూచి సింగము పరాక్రమము నేర్చుకొనె ననుటయే!)

ఇప్పటికి మూఁడువాక్యముల విమర్శన మయ్యెను. వీరివ్యాసమునందలి వాక్యము లన్నియు నిట్టి పటుత్వముతోనే యున్నవి. వాని నెల్ల విమర్శించుచో నెఱ్ఱన రామాయణమువంటి గ్రంథ మగును. కావున నట్టివాక్యముల విమర్శనమును గట్టిపెట్టి యెఱ్ఱనసోమనల తారతమ్యమును నిర్ణయించిన భాగములను విమర్శించెదను. ఇవ్విమర్శనమునకు ముందు, "ఎఱ్ఱనకన్నఁ బూర్వ మనేకులు కవిచంద్రు లున్నను నాతఁడు కవిత్రయమున నేల చేర్పఁబడెను?" అను విషయము విమర్శింపఁబడవలసి యున్నది. (ఇది వ్యాసలేఖకు లగు శర్మగారికిఁ గల ముఖ్యసంశయములలో నొకటి యై యున్నది.)

ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్రయములో నొక్కఁడుగాఁ బరిగణింపఁబడుటకుఁ గల కారణము, నాంధ్రవిద్యార్థులలో 'నాలవఫారముఁ' జదువు బాలుఁడు సయితము చెప్పఁగలఁడు. ఎఱ్ఱనకంటెఁ బూర్వ మున్న యే కవియైనను, అరణ్యపర్వశేషమును బూరించి యుండెనేని, కవిత్రయపదపీఠమున నా కవివర్యునకే కాని యెఱ్ఱనకుఁ జోటు లేకపోయియే యుండును.

సంస్కృతవాఙ్మయమున వేదమున కెంత గౌరవము గలదో యాంధ్రమున భారతమున కంత గౌరవము గలదు. అది పంచమవేదమునఁ దెలుఁగు. కావుననే దాని కంత యౌత్కృష్ట్యము గలిగె. అట్టి మహాగ్రంథమును సలక్షణముగఁ దెలుఁగునకుఁ దెచ్చిన యమ్మహాత్ములను గవిత్రయమువా రనుట కేమి సందియము?

నిష్పక్షపాతబుద్ధితో నారయువారు, అరణ్యపర్వశేషమును బూరించుటచేతనే యెఱ్ఱాప్రెగ్గడ కవిత్రయములో నొక్కఁ డయ్యెననియు, నాతని హరివంశాది గ్రంథమును భాస్కర రంగనాథరామాయణాదులకంటె నెక్కుడుకవిత్వము గలవి కా వనియుఁ, వానిం బట్టి యతని కాకీర్తి రాలే దనియుఁ దలంపక మానరు. భాస్కరాదుల కవిత్వముకంటె నెఱ్ఱన కవితయే రసవంత మైనదై యుండునేని వారి రామాయణములయెదుట నాతని రామాయణ మణఁగిపోయి యుండునా?

కవిద్వయతారతమ్యనిర్ణయవిమర్శనమునకు మున్నొక విజ్ఞాపనము చేసెదను:—శర్మగారు పలుచోట్ల సోమునిపై—ఎగతాళి, ఎత్తిపొడుపు, కట్టెవిఱుపు, అశాంతి, అసూయ, అమర్షము మొదలగు భావములను సూచించు వాక్యములఁ బ్రయోగించి యున్నారు. అతనిపైఁ గల కోపముచే వానిం బ్రయోగించి రని తలఁపరాదు. ఏల యన,

పవిత్రమైన తన జన్మమెల్ల, విద్యావ్యవసాయమునందును, హరిహరనాథనిత్యసమారాధనమునందును గడపి, యనంతయశశ్శ్రేయముల నుపార్జించి, నిరుపమానమును నమూల్యమును నగు తన నిసర్గకవితానిధిని స్వదేశస్థుల చేతులయందుఁ బెట్టి యిప్పటి కాఱువందలయేండ్ల క్రిందటనే యుభయకవిమిత్రునితో ముచ్చటలాడ శాశ్వతపదంబున కేఁగి యున్నవానిని—తాము కవిత్రయేతరకవుల కెల్ల నుత్తముఁ డని మంత్రిబిరుదము నిచ్చినవానిని—(తమయీవిని గణించుకొనక)—వీ రింత నీచముగా నెంతు రని నేఁ దలంపఁజాలను. అట్టి దూఱుల నాతఁడు వినఁ డను జ్ఞానము నుండదా? ఇఁక నెవ్వరిపైఁ బ్రయోగించి రన, 'ఇంచుక కన్నువిచ్చి చూడక' యాతని మెచ్చుకొనిన పండితమండలిమీఁద నే వీరు ప్రయోగించి రని తలంప నగును.

కవిద్వయతారతమ్యనిరూపణమునకు ముందు తలమానికముగా వీ రొక వాక్యమును వ్రాసియున్నారు. అదెద్ది యన, "ప్రకృతము సోముని విలువను దూఁచుట కట్టినయే తూనికఱాయి."

లోకములోఁ దూనికఱాతివిలువ, తూఁచఁబడు పదార్థము వెలకుఁ దగ్గియేయుండు నని వీరెఱింగియుండిరేని దీని నా శంభుదాసుని మెడ కంటఁగట్టి యుండక పోవుదురు.

ఇఁక సోమునియెడ వీరి యాక్షేపములను వినుఁడు:—

ఆక్షే. శ్రీకృష్ణుని సభకు నెట్టిన 'సుధర్మ' యని పేరిడఁగా సోముఁడు 'దాశార్హి' యని పేరిడెను. ప్రత్యుత్తరము. 'సుధర్మ' ఇంద్రునిది. 'స్యాత్సుధర్మా దేవసభా' అని యమరము. సోముఁడు 'దాశార్హి' యని వ్రాయుటకుఁ గారణమును బరికింపుఁడు:—

యాదవులు దాశార్హులు. దాశార్హసంబంధిని యైన సభ దాశార్హి. దీనిని సంప్రదాయజ్ఞులు, పురాణవేత్తలు నెఱుంగుదురు.

శ్లో. తస్యాం దేవపురాభాయాం, సభా కాఞ్చనతోరణా ।
సా దాశార్హీతి విఖ్యాతా, యోజనాయామవిస్తృతా॥

హరి. విష్ణు. 63 అ. 23.

ఇట్టివే చిల్లరశంకలు. ప్రత్యుత్తర మనవసరము. (సోమనాథుఁ డష్టాదశపురాణజ్ఞుఁడు. పురాణముల పేరులను మాత్రము మన మెఱుఁగుదుమేమో!) పండితు లంద ఱొక్కటిగ సోమనాథున కున్నతస్థానము నీఁదలంచినను, నది యేమి గ్రహచారమో, నా యభిప్రాయము మాత్రము దీనికి విరోధించుచున్నది." అని శర్మగారు వ్రాసిరి.

నిక్కముగ నిది గ్రహచారమే! అనేక పండిత విమర్శక కవిశిఖామణులు 'సర్వజ్ఞకవి' యని పొగడియుండఁగా, వీరు విరోధించుట గ్రహచారము గాక మఱియేమి?

శ్రీ వీరేశలింగము గారు 'ఒక్క యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వమే కాదు, కవిత్రయమువారిలో నితరుల కవిత్వమును గొన్ని విషయములలో సోముని కవనముతో సరిరా దని నా యభిప్రాయము' అని వ్రాసినదానియందు అనంతకృష్ణశర్మగారికిఁ గొంత సందేహ మఁట! ఎట్లన,

"ఎత్తిన మొదలే నిగ్రహింపఁబడియెనే! ఇఁకఁ గవిత్రయములో నితరు లెవరు? నన్నయ తిక్కనలే కదా! నన్నయను—విశేషించి తిక్కనను, సోముఁడు కవనపాటవమున మించినాఁ డనుట కన్న వైపరీత్యము వేఱొకటి యుండఁబోదు." అని శర్మగారు వ్రాసిరి.

ఏమి! సోముని కవన మంతవిపరీతముగాఁ దోఁచుచున్నదా వీరికి? వీరికిఁ దోఁచినఁ దోఁచుఁగాక! వీరికి బహుమాన మిచ్చిన 'ఆం. భా. వ' సమాజమువారికిఁ దొల్లి యిట్టివ్రాఁత విపరీతమై యుండలేదే! చూడుఁడు! ఈసమాజమువారు, తాము మెచ్చుకొనిన (బహుభాషాగ్రంథపరిశోధకులును విమర్శకాగ్రగణ్యులును నగు శ్రీ మానవిల్లి రామకృష్ణకవిగారి) యాంధ్రభాషను గూర్చిన యుపన్యాసమునందలి వాక్యములను మఱచిరోటు!

(1) "అథర్వణభారతము తిక్కనభారతముతోఁ బోల్పఁదగినది కాకున్నను నన్నయకవిత్వముకంటె రసవంతము గానుండును.

(2) "శబ్దశాసనుని లాక్షణికుఁ డనియు, నాదికవి యనియు గౌరవింపవలయును. ఆతనికవిత్వము మిక్కిలి రసవంతమైనది కాదు.

(3) "నన్నయభట్టారకుని భాషాంతరీకరణ మెంతమాత్రము తృప్తికరముగా లేదు. కొన్నియెడల సంస్కృతభారతమునకుఁ దీసిపోవుచున్న దని నా యభిప్రాయము.

(4) "సర్వజ్ఞుఁడైన నాచన సోమన్న తిక్కనసమకాలికుఁ డని చెప్పియుంటినిగదా! (ఈవ్యాస మిప్పటిది గాదు! 1895 వ సంవత్సరమునాఁటిది!) ఆతని బుద్ధివైశద్యమును, కల్పనాకౌశలమును, ప్రతిభావిశేషమును నద్భుతమైనవి. ఇతఁడు కొన్నివిషయములలోఁ దిక్కనసోమయాజికిఁ దీసిపోవుచున్నను, గొన్నివిషయములలో మించుచున్నాఁడు. ఇతనిశైలి తిక్కనశైలికి మించుచున్నది.

(5) "తిక్కనసోమనలను గొన్నిచోటులను బోల్చి చూడఁగా నిద్దఱును సమానశక్తి గలవా రని తోఁచుచున్నది. సోమయాజివలెనే సోమనయును మూలగ్రంథమును దెలిఁగించునప్పుడు వన్నె వెట్టు భావములను గలుపును.

(6) "సోమనగారి కద్భుతమైన కల్పనాశక్తి గలదు. ఆతఁడు గద్యమందుఁ బ్రయోగించుకొనిన 'నవీనగుణసనాథ' యన్న పలుకు సమన్వయ మగుచున్నది.

(7) "కథాసరణియందే కాక వర్ణనాంశములయందును, వాక్యరచనయందును చమత్కృతిని జూపియున్నాఁడు.

(8) "సోమునివర్ణనలు కాళిదాసుని సంగ్రహనైపుణి గలవిగా నుండును.

(9) "వే యేల? ఇతనికవిత్వమునందే మహాకవికి వలయు గుణము లన్నియుఁ బొసఁగి యున్నవి. ఆంధ్రకవులలో నెల్ల కీర్తిఁ

డొక్కుఁడే భావనాశక్తికి దర్శకసత్వరముగాఁ దోఁచునట్లు పదములఁ బ్రయోగింప నేర్చినవాఁడు.

(10) "సోమనాథునకు వెనుక సోమయాజికిఁ గాని, సోమన్నకుఁ గాని సమానముగాఁ గవిత్వము చెప్పువారు లేకున్నను, వారికవిత్వముల నపారగౌరవ ముంచి తచ్ఛైలి ననుకరించుచుఁ గావ్యముల వ్రాసినవా రనేకులు గలరు. అందులో ముఖ్యు లగువారు— ఎఱ్ఱాప్రెగ్గడ, శ్రీనాథుఁడు మొ॥

(పదివిషయములు చాలును. ఉపన్యాస మంతయు నెక్కుడ వ్రాయఁగలము?)

నైవాక్యములఁ జిత్తగింపుఁడు. ఈ వర్ధనీసమాజమువారు నైవాక్యరత్నములతో నిండియున్న యుపన్యాసమును దొల్లి మెచ్చుకొనియుండియు మఱల నేల యావ్యాసమును బహూకరించిరో!

శ్రీవీరేశలింగము గారు 'కవిత్రయములో నసేకు' లనుట తిక్కనవైఁ గల గౌరవముచే నాతనిఁ జేర్పకలేమి. ('కొన్ని విషయములలో' అను దానిని మఱవకుఁడు!)

ఆక్షే. "ఇఁక దీర్ఘ సమాసము లన్ననో తెలుఁగుకవితకు వికారములే యని నామతము. కోమలములై మనోహరములై యలఁతి తెలుఁగుపలుకు లుండ...దీర్ఘ సమాసమును బ్రయోగించినఁ దెనుఁగున కేమి గౌరవము? ఈసోముని పద్యముం దిలకింపుఁడు.

"గాండీవా రావఘోషాఘటితభయా.........." ఉత్తరహ. ద్వితీ. 37 ప

అయ్యలారా! దీర్ఘసమాసయుక్తమైన యీపద్యము నుదాహరించి సోముని వీ రతిమాత్రము దూషించినారు. అచ్చటనే యెఱ్ఱనను వీ రిట్లు పొగడినారు. "నన్నయతిక్కనలకంబోలె నెఱ్ఱనకును బ్రాయికముగఁ బిచ్చిపిచ్చి యలంకారముల యందును దీర్ఘ సమాసముల యందును వాంఛ లేదు. అతనిపద్యము లన్నియు స్వభావోక్తిమధురములై 'యలఁతియలఁతిపలుకులఁ' గూర్పఁబడి సుకుమారములై చదువరులచెవుల కమృతంపుఁదుంపురులఁ జిలుకు చుండును.—" ఔరా! నిష్పక్షపాతబుద్ధి! ఎఱ్ఱన 'యలఁతి యలఁతి పలుకులఁ' గూర్చిన యీపద్యముం గనుఁడు!

" మహాస్ర. కని రుగ్రగ్రాహనక్రగ్రహణఘుమఘుమా
కారకల్లోలడోలా
స్వవన ప్రద్యోతకేళీసరభసఫణభృ
చ్చారు జూటాగ్ర జాగ్ర
ద్ఘనరత్నోద్యంచితోద్యత్కట కుటిల మయూ
ఖచ్ఛటాటోపమిధ్యా
జనితోర్వ్యారంభశుంభత్పల్లవిలనివహాని
స్తుం ద్రు రత్నాకరేంద్రున్." నృసిం. త్ర్య. 3 ప.

మఱియు నీ సుకుమారపద్యముం గనుఁడు.—

" మ. స్ర. కని రాపాతాళమూలక్షితిశిఖరిశిఖాకల్పితోత్తుంగ..." హరి. ఉ. 1. ఆ.

అమృతంపుఁదుంపురులఁ దప్పక చిలుకు నీ

స్వభావోక్తిమధురపద్యముం గనుఁడు!

" స్రగ్ధర. క్షేపిష్ఠప్రేష్ఠగార్త్యోక్తిక్షితి తరుచిరిసరక్షిత్తసప్తాశ్వదీప్తి..." హా. ఉ. 8. ఆ.

ఇట్టి అలఁతియలఁతి పలుకులు! ప్రబంధపరమేశ్వరుని కవనములో ననేకములు!

మిశ్రకావ్యములయందు మహాకవులు తత్తద్రసోద్బోధకములై యుచితములై యొప్పు పలుకోకలఁ బోవుచుందురు. వారివ్రాఁతలను దెలియనేరని 'ఇంగ్లిష్ తెలుంగు' పండితులు వారిని దూఱుదురు. మఱియు నిరక్షరకుక్షులు నిందింతురు. పూర్వ లేఖకులమల నెట్టిపదములఁ బ్రయోగింపవలయునో యా నిబంధనలను నిండుగ నెఱింగినవారు. అట్టివారి వ్రాఁతలను దెలిసికొనఁ బ్రయత్నించుటనే నేర్వవలసిన మనము వారిని దూఱుటకుఁ దగుదుమా? అవసరము వచ్చినప్పుడేకవి దీర్ఘ సమాసమును మానును? చూడుఁడు! తిక్కనసోమయాజి దుర్యోధను నెట్లు వర్ణించియున్నాఁడో! అలఁతిపలుకుల!

స్రగ్ధర. మౌళి స్రక్సంగరంగ న్మధుకరపటలీ మానసాకృష్టివిద్యా
శాలిన్యారాబ్జరేఖాంజలిపుటఘటనావాచాలఫాలస్థలోష్మ
పాలశ్రేణీ విశాలాంబక కుముదవనీ బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాధకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతున్." విరాట. త్ర్య. 78

మఱియు, ఆఁడుదియగు ద్రౌపది, కీచకునిఁ దా నదలించుటను భీమునితో,

"శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతిపక్ష నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్."

ఇత్యాదిగఁ జెప్పినట్లు కవిబ్రహ్మ వ్రాసియుండ, ద్రౌపదికిని, మగలకును మగఁడగు నర్జునుఁడు, తాను యుద్ధభటుల నడ్డగించుటను భీష్మాదియోధవీరులతో 'గాండీవారా' వేత్యాదిగఁ బలికినట్లు సర్వజ్ఞకవి వ్రాసియుండుట ప్రకరణోచితము కాదా?

ఈపద్యమునకును, ముందున్న 'అనుమ ననుచారిస్మై...' అను పద్యమునకును గల భావసందర్భమును గూర్చియుఁ బ్రకరణౌచిత్యముంగూర్చియు మఱియొకప్పుడు ప్రస్తావించెదను. (సావధానముగ జదువువా రవి ప్రకరణోచితములై సోమునిసర్వజ్ఞతను దెలుపుచున్నవని తలంపకమానరు.)

ఆక్షే. "ప్రాసముపైన నే దృష్టియుంచి పాండిత్యమును జూపఁ గెంచినవానికి రసముపైఁ గన్నుండదు."

(ఇందలి 'పైన' శబ్దజ్ఞానము నటుండనిండు! ఈక్రింది యాక్షేపములయందలి యర్థజ్ఞానము, రసజ్ఞానము, ఔచిత్యజ్ఞానమును గనుఁగొనుఁడు!)

ఆక్షే. "తాను వ్రాయుమాట లనర్థకము లని తలంపఁడు. సోమునియందీదుర్గుణము ప్రబలిన దనుటకుఁ బై నిదర్శనములే చాలియున్నను మఱి యొండు రెండు చూపెదను.

(1) "క. ఫాల్గున మాసము మొదలుగ
ఫల్గునసఖుఁ డతులితరతపశ్చరణమునన్

వల్గదరివర్గ హయఖుర
ఫల్గువు గానీక మనసు పదిలము చేసెన్." (ఉ. హ. ద్వితీ.)

"ఎట్లయిన నుపక్రమించిన 'ల్గ' ప్రాసమును బూర్తిసేయవలయును. కావుననే నిష్ప్రయోజనముగ మూఁడవపాదమున నంత 'పాడవు' సమాసము వేయవలసి వచ్చినది. లేకున్న 'ఫల్గువు' అను పదమే చాంచల్యమును దెలుపుచుండ 'వల్గదరివర్గ హయఖుర' యను వాక్య న్యాసమున కేమిఫలము?"

మిత్రులారా! 'ఫల్గు' వనఁగాఁ జాంచల్యమఁట! 'మనసు పదిలముచేసెన్' అన్నాఁడు గావున 'ఫల్గు' వనఁ జాంచల్యమై యుండు నని మీరర్థము చేసికొనిరో? లేకఁ ఏ నిఘంటువునం దైన మీరు చూచి యున్నారో, వర్ధనీసమాజపండితులును 'కాఁబోలు' ననుకొనిరి. కాఁబోలు!

'ఫల్గు' శబ్దమున కసార మని యర్థము. 'అసారం ఫల్గు' అని యమరము. అమరమునైనఁ జూడని మీరు సకలభాషా భూషణుఁడగు మహాకవి నాక్షేపింపఁ దొడంగుట యక్రమము.

(పరుగెత్తుచున్న కామక్రోధాద్యరిషడ్వర్గము లనియెడు గుఱ్ఱముల డెక్కలత్రొక్కుడుచే నసారము గానీక మనసును గుదురు పఱచుకొనె నని భావము.)

'ల్గ' కారప్రాసముకొఱకు సర్వజ్ఞకవి నిరర్థకపదన్యాస మొనర్చునా? ఇక్కవిసింహునకు 'ల్గ' కార ప్రాసమును బూర్తిసేయుట యొక దొడ్డకార్యమా? చూడుఁడు!

శా. నాల్గుం జెల్లెడి......" ఉత్తరహరి, చతు. 63. ప.

'ల్గ' ప్రాసముపై మీరికిఁ గల కోపమును దీర్చుకొన సోముని యెడ మీరు తప్పు నారోపించియున్నారు. గాని యది తప్పు గాక యొప్పే యైనది! కాని మీరు మెచ్చుకొన్న యొజ్జన్నపద్యమును గనుఁడు—

"ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్త భుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభరత్ననూత్నరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవ గగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ములహాస్తసమస్తకల్మషుల్."
నృసిం. ద్వితీ. 87 ప.

"నాలవపాదముదనుక నొకటియే సమాసము. సోముఁడు 'ల్గ' కొఱకు 'వల్గదరివర్గహయఖుర' అనునంత 'పాడవు' సమాసము నే వేసినాఁడు గాని, 'స్త' కొఱకెఱ్ఱన యెంతపాడువు సమాసమును వ్రాసినాఁడో కనుఁగొనుఁడు! సమాసమున కేమి? పఱపును బోధించు 'తల్ప' శబ్దముండఁగా నాయర్థము నే తెలుపు 'ఆస్తరణము' వలన నేమి ప్రయోజనము? ప్రాసలుబ్ధులగువారి బ్రదుకింతే!" అని మీ వలె నే నాక్షేపింపఁగలనా? మిత్రమా! మహాకవుల నాక్షేపింప మన మెంతవారము '(పాడవు? 'వ' కారము 'గ' కారముకాఁగా, పాడగు= దీర్ఘము?)

"క. ప్రాగ్జ్యోతిషంబు గదిసిన
దృగ్జ్యాటంకృతులు లేక దితిజాలమీఁదన్
దృగ్జ్యోత్స్న జేవురింపఁగ
దిగ్జ్యాగగనాంతరంబు దివురఁగ నార్చెన్."

ఆక్షే. 'ప్రాగ్జ్యోతిషంబు' అని యుపక్రమించినాఁడు. కావున నిఁక మూఁడు 'గ్జ్య'లు సంపాదించి వ్రాయకున్న సర్వజ్ఞత్వమునకు లోపము గలుగు నని సోముఁడు తలంచినాఁడు...

కలము నడచినట్లెల్ల వ్రాయువారికిని, ఇట్టి వ్రాఁతలకుఁ దల యూఁచువారికిని బ్రత్యుత్తరము వ్రాయుట వ్యర్థమే. అయినను విద్యార్థు లెవ్వరైనఁ బొరపడుదు రనియు, శ్రీవర్ధనీసమాజమువారికి నైన మేలుకొందు రనియు నెంచి సదుత్తరము వ్రాసెదను.

ఇప్పు డాంధ్రదేశముయొక్క దౌర్భాగ్యము మితిమీఱి కవిత్వతత్త్వము క్షీణించియుండుటచేఁ గయితఁ జెప్పఁబూనునిప్పటివారిలో ననేకులు ప్రాసాక్షరములకొఱకుఁ దపస్సు చేయవలసిన దుర్యోగమునకుఁ బాల్పడుచున్నారు గాని,

"చ. వడియును బ్రాసము న్వెదకువాఁడు కవిత్వముఁ బూని యేమి చెప్పెడి నగుఁబాటగున్..."

అని శంకరకవి చెప్పినట్లు పూర్వకవులకు యతిప్రాసములఁ దడవుకొనవలసిన కర్మ ముండెడిదా? భారతీదేవి వారి జిహ్వాగ్రముల నిలిచి వలసిన పదముల నందించుచుండఁగాఁ బ్రాసాక్షరములను సంపాదించుననంతటిక్లేశము వారి కేల? (అ. గ్ర. చింతామణియందుఁ గాని, చాటుపద్యరత్నాకరమునందుఁ గాని మోచర్ల వెంకనామాత్యుని చరితముం గనుఁడు; పూర్వుల కవిత్వమహిమ దెలియును.)

ఆక్షే. "పద్యము ముగిసినఁ జాలునని వ్రాసినాఁడు. కావుననే యౌచిత్య విమర్శనము వెనుకఁ బడినది చూడుఁడు. నరకాసురుని జంప వచ్చి సింహనాద మొనర్చి యుద్ధసన్నద్ధుఁడగు శ్రీకృష్ణుని మహోగ్ర మగుచూపును జ్యోత్స్నతోఁ బోల్చుటకన్న వేఱ యనుచితము గలదా?"

ఆహాహా! విమర్శన మన్న నిట్లే యుండవలయును! పాఠకమహాశయులారా! పూర్వ మింద్రజాల ముండెడి దని వినుటయే కాని మన మెన్నఁడును జూచి యెఱుంగము. ఇప్పుడు మీరు మహేంద్రజాలమును గనఁబఱచుచున్నారు. ఈజాలమున సమాజపండితులు పడినారు చూడుఁడు? కృష్ణుఁ డంతకుమున్ను సింహనాద మొనర్చినట్లెచ్చట నున్నది? అట్లున్నచో 'దిగ్జ్యాగగనాంతరంబు దివురఁగ నార్చెన్! అను నాలవపాద మేగంగలోఁ గలియును? ఏల యిట్టి వ్రాఁతలు! ఇదే కాదా సోముని దుర్గుణము! పరమపదమున నున్న ఋషివంటి మహానుభావుని నిట్టి యనృతకల్పనములతో నిందింప మన కెట్లొప్పునో! పద్యమునకే యర్థము దెలిసికొననేరని మీరు తదౌచిత్య విమర్శనమునకుఁ బూనుట దేశదౌర్భాగ్యము.

మురాదిరాక్షసులను చంపిన పిమ్మట శ్రీకృష్ణుఁడు 'ప్రాగ్జ్యోతిషము'ను గదిసి, యచ్చట 'సదృగ్జ్యాటంకృతులు' లేక, తాను సమరమునకు వచ్చినట్లు దెలియ, దితిజాలమీఁద, భక్తత్రాణపరాయణమై యెప్పుడును వెన్నెలవలెఁ జల్లనై యుండుచూపు (ఆ సమయమున) జేవురింప దిగ్జ్యాగగనాంతరంబు దివురఁగ సింహనాదము చేసె నని

పద్యభాగము.

వీరి విమర్శన మనుచితమో, పద్య మనుచితమో యారయుఁడు' వీరు పొగడిన యెఱ్ఱనగారి యీ క్రింది ప్రయోగముం గనుఁడు—

"వ. అయ్యుగ్రపశువుల...నర్వీరుండు ఘోరంబుగా నదల్చి,

"క. నాపిడికిటి కడిఁది పిడుగు
నాపగిదియ దీనఁ దగిలి యంతకుఁ డైనన్
రూపు చెడకుండఁ బోవునె
యీ పాపాత్మకుల మిమ్ము నేల సహింతున్?

"వ, అని యావిష్కృతతీవ్రముష్టి యగుచున్
హాసోజ్జ్వలాస్యంబునన్
కన లుప్పొంగఁగ......" హరి. పూ. 6 ఆశ్వా.

"మాడుఁడు! ఘోరంబుగా నదల్చి 'ఆవిష్కృతతీవ్రముష్టి యైన శ్రీకృష్ణునకు' యతికొఱకుఁ గాక 'హాసోజ్జ్వలాస్య' మెచ్చట నుండి వచ్చినది?" అని యెఱ్ఱనను నేననఁగలనా?

పిమ్మట సోముని వచనములనుగూర్చి కొంత వ్రాఁతను వెడలించినారు. పద్యముల విమర్శనము వైరీతిని జేసినదిగదా! వచనముల విమర్శనము నట్టిదే! సోముని వచనములు గతిభేదము గలవై తత్తదుచితస్థలములలో చెక్కఁబడి యున్నవి. తద్వివరణ మిచట నిరుపయోగము. మఱియు సోముని వచనము లంతనేసి—ఇంకను నంత కంటెఁ బెద్దవియు నగువచనము లెఱ్ఱన హరివంశ నృసింహపురాణము లలోను నున్నవి. ఆయాచోటుల వానిం జూచికొనునది.

"సోముఁడు సమానార్థకము లగుమాటల ననేకములఁ గూర్చి' నని వీ రాక్షేపించుచు, కృష్ణనరకాసురయుద్ధవర్ణనవచనములోని "చలంబుకొని పోరిపోఁ దునక లయ్యును, దుమురయ్యును...రూపు చెడినం, దిరుగుడువడి వాహిని చిక్కువడి, చిందఱవందరై వడిసి మల్లాడుట్టియై...ఇత్యాదిగాఁ గల కొన్ని వాక్యముల నుదాహరించి, సమానార్థకము లని మొదట వ్రాసినదానిని మఱచి, 'ఇంచుమించుగ నేకార్థకము' లని వ్రాసినారు. 'ఏకార్థకములు' అనుచు మఱల 'ఇంచుమించు' ఏల? మొదటి 'సమానార్థకములు' అనునది యే మయ్యెను! ఈ వ్రాఁత కర్థ మేమి?

ఈవచనముఁ జదివినవారు సర్వజ్ఞకవి రచనాసామర్థ్య మనన్య సాధ్య మని తలఁపక మానరు. వీరి కసహ్యముగా నుండిన నుండుఁ గాక! తిక్కనయు నిట్టి వ్రాఁతల వ్రాసియుండెను. ఎఱ్ఱన సోమన ననుకరించెను. శ్రీనాథుఁడు సోముని వచనమునుబట్టి పద్యము నే వ్రాసి కొనెను. ఇట్లే పలువురుకవులు సోముని యీరచన ననుకరించిరి. చూడుఁడు—శంభుదాసుఁడు,

"పోటువడియును, వ్రేటువడియును, ద్రొక్కువడియును, జిక్కువడియును, నలిగులియై లావుచెడి, చేవ దఱిఁగి, కడంకలు గుదుసువడి, కడిమి పెంపు వోనాడి..." హరి. పూ. 6 ఆ.

శ్రీనాథుఁడు—సీ. పా, అనువుదప్పిరి నొచ్చిరలసి రాపద నొంది రదవద లైరి... హరవి. 3 ఆ. 10 ప.

సారంగు తమ్మయ్య వైజయంతీవిలాసములోని 'శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభం బై..." అను పద్యమున నెంత సారస్యము గలదో దానికంటె నెక్కుడు సరసత దీనియందుఁ గలదు.

ఆక్షే. 'ఇట్టివానిం గూర్చిన నేమి వ్రాఁత? కోఁత కాక.'

అనుప్రాసముల నేవగించుకొను వీరి కి 'వ్రాఁతకోఁత' ల నేల వ్రాసికొన్నారో! అనుటయే కాని యేవఁడు మానఁగలఁడయ్యా!

సోమునియెడ ననేకము లనౌచిత్యములు గల వని వీరు కొన్నిటిఁ జూపినారు. కనుఁడు!

ఆక్షే. (1)—'నరకాసురుఁడు స్వర్గమునఁ బ్రవేశింపఁగా నందు 'కాశ్మీరనికరంబు కహ్లారపుష్పోపహారంబు లేని గృహాంగణములు' గానవచ్చిన వఁట! సరియే కాని స్వర్గమునకుఁ గాశ్మీరమునకు నాకాలమున నేమి వ్యాపారము నడచుచుండెనో! ఈలోకపుఁజందన మాలోకమునఁ గానవచ్చుటకు!'

విమర్శకునకు దూరదృష్టి, గ్రంథపఠనానుభవము, (వీనికిఁ దగిన) శేముషీవిశేషము ముఖ్యముగా నుండవలయును. ఇవి లేకయే చూచినదానిని దోఁచినట్లెల్ల వ్రాయుచువచ్చుట నవ్వులపా లగుటకే! పైపాదముగల పద్యమును లేకరులు (నష్టభాగములఁ బూరించి) పాడొనరించినారు. దీనిం గూర్చిన విశేషవాదమున కిందుఁ దోటు లేదు. కావున నిప్పు డున్న దానినిబట్టి యైన వీరి యాక్షేప మెంతవఱకు నిలుచునో చూతము:— ('కాశ్మీరనికరంబు' అనుదానిలోని 'నికరము' మాట యటుండనిండు.) 'కాశ్మీర' మనఁగా 'చందన' మఁట! ఈ యర్థ మేలోకమున నున్నదో! (వెనుక నొక 'మేజస్ట్రేటు' గారు 'ఉలాయము'నకు 'స్పెల్లింగ్' ఏలాగు? 'జాన్సన్సు డిక్షనెరీ' ఏది? అనఁగా, 'గుమాస్తా'గారు 'అయ్యా! అది మనుష్యుని పేరువలె నున్నది?' అన్నాఁ డఁట!) సరియే, వాదముకొఱ కాయర్థము నే యంగీకరింతము. ఇఁక స్వర్గకాశ్మీరముల కక్కాలమున వ్యాపారము నడచెనేమో కనుఁగొందము.

స్వర్గమున నుండు దేవతావధూటులు, పసుపు, కుంకుమము (చందనము) మొదలగుమంగళద్రవ్యముల నలంకరించుకొందు రనియా? లేక పూర్వసువాసినులవలె నద్దపుబిళ్లలవంటి మోములతో నుండెడివా రనియా వీరియాశయము? 'ఇంద్రకులవధూటీలలాటికాకుంకుమంబు' ఇత్యాదులను వీ రాక్షేపింపలేదు. కావున స్వర్గమున నవ్వానియునికిని వీ రొప్పినట్లే కదా! పసుపు మొదలగు వానిని నిర్జరులు స్వర్గమునఁ బైరుపెట్టి, నీరు గట్టి, పిమ్మట నెత్తిపెట్టి, యెండుకఁబెట్టి, ఱోళ్లను బెట్టి, ఱోకళ్లనుగొట్టి, సిద్ధపెట్టుకొను చుందు రందురా? అట్లందు రేని కుంకుమము (చందనము) మొదలగు వానిని వా రేల సిద్ధపఱుచుకొనరు? ఒండుచోనుండి తెప్పించుకొందు రందు రేని వీనినిమాత్ర మట్లేల తెప్పించుకొని యుండరాదు? ఇంతకును వీరిని బాధించినది 'కాశ్మీర' పదము. (కశ్మీరదేశభవము.) దీనింగూర్చి యాలోచింతము.

ఆంగ్లేయప్రభువుల చల్లని పరిపాలనమున నిప్పుడు నానాదేశములనుండి చిత్రవిచిత్రపదార్థంబులతోఁబాటు నానావిధము లగు ఫలవృక్షములు, పువ్వులమొక్కలు, లతలు మొదలగునవి మనదేశమునకు వచ్చుచున్నవి కదా! అట్లే మనదేశమునుండియు నితరదేశము

లకు నానావిధవస్తువులు పోవుచున్నవి. ఒక్కలోకములోని కొంత భూమిమాత్రమే యేలు ఇట్టిప్రభువుల రాష్ట్రములలోనికే పరరాజులదేశములనుండి యభీష్టపదార్థములు వచ్చుచుండఁగా 'ముల్లోకంబుల నేలురాజు' తాను నివసించు స్వర్గమునకు 'కాశ్మీరము' నుండి వలసినవానిని తెప్పించుకొని యుండఁగూడదా? స్వర్గము లోకము గావున దానియందును ననేకదేశము లుండవచ్చును. అందొకదానికి 'కాశ్మీర' మను పేరును నుండవచ్చును. భూలోకమున నున్న దేశముపేరు ఆలోకమున నున్న దేశమున నుండఁగూడదా? ఉండఁగూడదనియే తలంచెదము.

భూలోకమున నున్నవారి కాలోకమువారితో 'యుద్ధవ్యాపారము' జరిగిన ట్లంగీకరించిన మనము, తక్కినవ్యాపారముల నేల యంగీకరింపరాదు? ఏల కొఱమాలిన యిట్టి యాక్షేపములు? శ. స. పండితులును 'కాశ్మీర' మనఁ జందన మని తెలిసికొనిరి కాఁబోలు!

ఆక్షే. (2)—"విజయు మైన పిదప స్వర్గలోకసింహాసనాసీనుఁడై నరకాసురుఁడు...ఊర్వశిని బిలిపించి తన్నుఁ బొందు మని కోరుచున్నాఁడు. ఈకథ సంస్కృత హరివంశమున లేదు"

ఈవాక్యమున కించుకముందు "ఇరువురును రచించు మూల మొక్కటే' అను వాక్యమును మీరు వ్రాసియున్నారు. ఇప్పుడు సంస్కృతమున లే దనుచున్నారు. ఏటి స్వవచనవ్యాఘాత మిది? (వెనుక నీ కథాసందర్భమును విమర్శించునప్పుడే 'ఇరువురును సంస్కృత మూలానుసారులు గావున...' అని వ్రాసియున్నారు.) ఓహోహో! సోముఁడు ముందేమి వ్రాసితినని చూచుకొనఁడు' అని యాక్షేపించు మీరు తమవ్యాసమును మూఁడేండ్లు దగ్గఱనుంచుకొనియు నేమి చూచుకొన్నారో! దీనికేమి? ఇంకొక చిత్రమును గనుఁడు! నరకాసురుఁ డూర్వశిని బిలిపించి సంభాషించుట సంస్కృతమున లేదఁట! వీ రేమూల చూచినారో!

"శ్లో....నరకో దానవోత్తమః।
అమరావతీం...ప్రవిశ్యచ మహాసురః,
ఊర్వశీఞ్చ సమాహూయ, వచన ఞ్చేద మబ్రవీత్
భజ మా మిహ వామోరు! నిర్జిత శ్శక్ర ఆహవే..."

ఊర్వశీ—"బుహవో యది తే రాజన్ యజన్తి క్రతుభి స్సదా,
తదా భజామి దైత్యేన్ద్ర! నాత్ర కార్యవిచారణా."

సంస్కృ. హరి. 127. అ.

ఆక్షే. (8)—"ఊర్వశిని జూచి నరకాసురుఁడు తటాలునఁ గాళిదాసుని రఘువంశములోని వర్ణనలం దలంచుకొని గేదఁగిఱేకు నఖంబునఁ జీఱుట మొదలగు శృంగారచేష్టలు చేయుచున్నాఁడు. సమయమునకు సరిగ స్వర్గలోకమున గేదంగిరేకు దొరకుట చిత్రము."

ఇది కన్నుగిలుపు నాక్షేపము. ఏమన, నరకుఁడు పూర్వుఁడా? కాళిదాసు పూర్వుఁడా? నరకుఁడు రఘువంశమును జదివినాఁడా? కావున సోముఁడే యిప్పుడు నరకాసురుఁడు.

'సోముని కవిత్వము కాళిదాసు సంగ్రహానైపుణి గలది' యని శ్రీ రామకృష్ణ కవిగారు వ్రాసియే యున్నారు. సంస్కృతకవులలో మేటి యగు కాళిదాసునిఁ, దెలుఁగుకవులలో సాటిలేని తిక్కనసోమనలు దలపెట్టుట యందు వింత యేమి గలదు? సింహానులు ఘనుని ధ్వనినిగదా తలపెట్టును! కవిబ్రహ్మ కాళిదాసుని వ్రాఁతను దలఁచిన విధమును గనుఁడు—

"తే. ఎట్టికవికైనఁ దనకృతి యింపుఁ దెంప..."నిర్వ. ప్రథ. 9 ప.
"శ్లో. ఆపరితోషా ద్విదుషాం..." అభిజ్ఞానశాకుం. ప్రస్తా.

ఇందుమతిం గాంచి గేదఁగిరేకును జీఱిన రాజు పొందిన ఫలమునే నరకుఁడును బొందె నని సూచించుటకు సర్వజ్ఞుఁడు కాళిదాసు ప్రయోగమునే చూపెను. గేదఁగి స్వర్గమున నుండదా?

స్వర్గలోకమున కంకటికిని మందారాదులు దేవతరువు లైదే కాఁబోలు! స్వర్గ మన నట్టి నల్లతాటి దిబ్బయా? అచ్చట మల్లెలు, మొల్లలు జాజులు, గేదఁగులు మొదలగు పువ్వుల నిచ్చు తీఁగలు, మొక్కలు మొలచు నాధారములు లేవా? అట్లు శాస్త్రము గలదా? కల దనుకొందము. దిగ్విజయమును గాంచి సుధర్మయందు సింహాసనాసీనుండై యున్న (నరక) రాజును సందర్శింప భూలోకమునుండి వచ్చిన రాజుసుఁ డెవఁడైన గేదఁగిరేకును కానుకగాఁ దెచ్చి యిచ్చి యుండ రాదా? ఇ దేమి శంక?

ఉత్తరహరివంశములోని యూర్వశీనరకాసురుల సంభాషణ మనుచితముగా నున్న దనియు, ఆ యుత్తమపాత్రములను సోముఁడు నీచపాత్రములుగాఁ జేసినాఁ డనియును వీ రేమేమో వ్రాసియున్నారు. వా రెట్టి పాత్రములో మీరు బాగుగా గ్రహించినారు! దాని కేమి? ఆ ఘట్టమును జదివిన యనేకు లది రసవత్తరమైన నాటకములోని యొక యంకమువలె హృదయరంజకముగా నున్న దని మెచ్చుకొని యున్నారు. మీరు దానిని నిందించుచున్నారు. ఎవరి యభిప్రాయము వారిది. కొందఱకు మామిడిపండు రోఁతగ నుండును. బొప్పాయిపండును జూచి కొందఱు కసరుకుందురు. 'లోకో భిన్నరుచిః' అన్నాఁడు!

సోముని యాఘట్టమునందలి 'ఖిండతికము, లంకెతనము' మీరికి రోఁత జనింపఁ జేసిన వఁట! ఎఱ్ఱనవ్రాఁత గంభీరమై, మధురమై యున్న దఁట! అతని పద్యమును గనుఁడు!

"మ. వరుణుం దోలితి, నర్థపుం జదిపితిన్ వైవస్వతున్......న
న్నరవిందాసన! సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్.

హరి. ఉ. 4 ఆ.

[ఇందలి 'మనోజానీక' మున కర్థము దెమఁగున వ్రాసిన నీదినములందు సంకెలలే!]

సోముని నరకుఁడు, ఊర్వశియును సిగ్గుమాలినవారు! నీచపాత్రములు ఎఱ్ఱనవారు సిగ్గరులు! ఉత్తమపాత్రములు. వారికి సౌమనస్యము లేదు! మీరికిఁ గలదు! చూడుఁడు!

"ఇంద్రాదిదిక్పతులతో యుద్ధ మొనర్చి వచ్చితిని. నీతోఁ గూడ యుద్ధము చేయఁగోరెదను." అని యెఱ్ఱన నరకుని యభిప్రాయము. నిండుసభలో నొకయాఁడుదానిని గ్రామ్యధర్మమును బోధించు యుద్ధమునకు రమ్మనుట సౌమనస్యము గల పురుషుని పనియే

కదా! ఇప్పట్టున సోముని పద్యమును జూడుఁడు!

“ఉ. నాకపురంబులో మెలఁగి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాలవృంతసముదాయసమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైన నాసభన్
నీ కనుదోయి వెన్నెలలు నిండక కొయ్యలు నాకు నిండునే!”

ఉ. హా. ప్ర. 62.

(ఈ పద్యము పారిజాతకుసుమసౌరభములం గొని తెచ్చి చదువరులకు హాయిఁ గూర్చుచుండలేదా?)

యుద్ధముచే నలసి వచ్చినాఁడు. గావున నరకుఁడు దివ్యకాంతాకరతాలవృంతసమవాయసమీరపుఁజల్లఁదనము చాలక యూర్వశి కనుదోయి వెన్నెలల శైత్యమును గూడ నపేక్షించుచున్నాఁడు. ‘ఈ వెన్నెలల సౌఖ్యము నెదుట స్వర్గరాజ్యసుఖ మేపాటిది?’ యని యభిప్రాయము! “ఎఱ్ఱనహరివంశ మంతయు నీపద్యముతోఁ దూఁగునా?” అను నన్ను నిందింపఁగలరా?

“నిండుసభలో నూర్వశీనరకాసురుల కట్టి సంభాషణము నడచి యుండదు. ఒకవేళ నడచియున్నను కవి దానిని వ్రాయుట ప్రమాదము.” అని శర్మ గారు తమ నవీననాగరకతను వెల్లడించినారు.

ఇట్టి జ్ఞానమును బోధించువారు పూర్వము లేకపోయిరి. ఉండి లేని వ్యాసమహర్షి మహాభారతమున ద్రౌపదీవస్త్రాపహరణకథను వ్రాయఁగలఁడా? మాయఁడు! నరకాసురుఁడు రాక్షసుఁడు; ఊర్వశి వేశ్య—వారి సంభాషణము సరసముగను, పాత్రోచితముగను నుండునట్లు సోముఁడు వ్రాసియే యున్నాఁడు. సోమునిదే ప్రమాద మైన వ్యాసుని గతియేమి?

ద్రౌపది యుత్తమక్షత్త్రియకాంత; అగ్నియందుఁ బుట్టినది; జగదేకవీరుల భార్య; పాండుమహారాజు కోడలు. సభయందున్నవారో! రాజులు - రాజబంధువులు - క్షత్త్రగురువులు—ఇంకను పలువురు. ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు గాని తక్కినవారికిఁ గన్నులున్నవి. అట్టి నిండు సభలో భర్తలు చూచుచుండఁగనే మహాసాధ్వియు, ఏకవస్త్రయు నగు ద్రౌపదిబట్టను విప్పించిన కథను వ్రాసినాఁడు వ్యాసుఁడు. ఇది జరిగియుండునా? ఒకవేళ జరిగియున్నను దానిని వ్రాయుట వ్యాసుని తప్పు! దానిని దెలిఁగించినాఁడు భట్టారకుఁడు! తిక్కనయుఁ దనభాగమున నీవిషయమును తడవినాఁడు! ఏమిగతి!

“ఏనుఁగుల కేనుఁగులే కొట్టుకొని పోవుచుండఁగా నక్కనామాట యేమి? అన్న” దన్నట్లు, మహాకవులకే గతి లేదన్నప్పుడు కదరీపతినాయుఁడా నిలువఁబడువాఁడు!

సీ. పా. “ముందటి దిక్కాడి మొలత్రాటఁ దవిలిన
తోఁకగోఁచుల వెంటఁ దూలువాడు”

సోముఁడు దీనిని హాస్యరసమును దెలయించుటకై వ్రాసినాఁడనుకొని యాతని నత్యంతము వీరు దూషించినారు. దూషణముల కేమి? ఆతఁడు వినరాఁడు గదా!

బదరికాశ్రమవాసులకు దుష్టదానవులవలన సంభవించిన దురవస్థలలో నిది యొకటిగాఁ గవి వర్ణించినాఁడు. దీనిని జదువఁగానే వీరికి నవ్వు వచ్చినది గాఁబోలు! నవ్వు వచ్చిన వెల్ల హాస్యరసములోఁ జేరవు. ఇది పెద్ద తెలిసిన విషయమే. ఎవ్వరైనఁ గాలు జాఱి పడి లేని కొందఱు నవ్వుదురు—ఇట్టి వింకను గలవు—ఇట్టివి హాస్యములోఁ జేరునా?

సన్మార్గులగు మునీంద్రులకు నయితము పూర్వము రాక్షసుల వలన నింతలేని యవస్థలు గలుగుచుండెడి వని విచారమునకై చెప్పిన యీ ఘట్టమును జూచి సౌజన్యము లేనివారు నవ్వుదురు. వారి యవస్థలం గాంచి యప్పటి రాక్షసులు నవ్వియుందు రేమో! మన వారిని బాధలఁ బెట్టి గజనీమహమ్మదు సైన్యము నవ్వినట్లు.

“ఎఱ్ఱనహాస్యము గంభీర మైన” దని “పోరాని చుట్టము...” అను పద్యము వ్రాసి, దాని కపూర్వవ్యాఖ్యానముఁ జేసి, శంభుదాసునిచే, నింద్రుని ధూర్తునిఁగను, కల్లికుండలములు పోయినను జింత లేనివానిఁగను, రాజ్యమునే కోరు డిల్లీసుల్తానునిఁగను జేయించి, యాతని నవ్వులపాలొనరించినారు. విబుధాగ్రేసరుఁ డగునింద్రుఁడు ‘జనని స్వర్గమునకన్నను గరిష్ఠ రా’ లని యెఱుఁగఁడా? శంభుదాసుఁ డింద్రుని నంత నీచునిఁ జేయునా? సంస్కృతమున “అదితిదేవ్యాః కుణ్డలాహరణార్థమ్ నరకాసురవధమ్” అనియే యున్నది గాని యింద్రుని రాజ్యముకొఱకు నరకాసురవధ జరిగినట్లు లేదు.

శ్రీకృష్ణుని కైలాసయాత్రాఘట్టమున సోముఁడు పూర్వోత్తర విరోధములఁ బాటింపలేదని శర్మగారు ఆక్షేపించియున్నారు. దీని పై నేను వ్రాసిన విమర్శనము 18 పుటలైనది. దానిని మఱి యొకప్పుడు ప్రకటించెదను.

* * * * * * *

పిమ్మట సోముని హరివంశములోని యుషాపరిణయమును గొంత విమర్శించిరి. దీనిపై సంపూర్ణవిమర్శనము ముప్పదిపుట లయినది. అది వేఱొకప్పుడు ప్రకటింపఁబడును. గ్రంథవిస్తరము లేనిదియు, సర్వజనులు పఠింపఁదగినదియు, లోకోపకారకములును నగువిషయములను బ్రకటింపఁ గంకణముఁ గట్టుకొనియున్న ‘ఆంధ్రసంవత్సరాది సంచిక’ వంటి గ్రంథమునందు 50 పుటలను మించు విమర్శనమును బ్రకటించుట కష్టము. కావునఁ బైవిషయములనుగూర్చిన చర్చ నిచ్చటఁ బ్రకటింపఁజాలని నన్నుఁ బాఠకమహాశయులు మన్నింతురు గాక!

మచ్చునకై వీరి యుషాపరిణయ విమర్శనములోని యాద్యంత విషయముల నిచ్చటఁ జర్చించుచున్నాఁడ.

“శోణపురోద్యానంబునఁ బార్వతీపరమేశ్వరులును, ప్రమథదంపతులును యథేచ్ఛముగ విహరించుచుండిరి. వారి విలాసవైభవములం గాంచి బాణకన్య యగు యుషాదేవి,

సీ. సల్లాపనవసుధాసారంబు చెవిఁ గ్రోల్వఁ
జెలికత్తెఁ బుచ్చి మెచ్చించువారు
నానందమకరంద మందంద పైఁ జిందఁ

కడకంటి చూపులఁ గప్పువారు...,

... చతురతర విహారంబును జలుపువారుఁ,

బ్రథమజన్మంబునం దెంతభాగ్యవతులో,

మగలు మన్నింపఁ బెంపారు మానవతులు."

ఉత్తరహరి. 6 ఆశ్వా.

అని తియ్యనియాలోచనముఁ జేసి తన తలంపును జెలికత్తెలతో వెడల నాడిన దఁట! ఎట్లో పార్వతి యీమాటలను విన్న దఁట! ఎట్లు విన్నదో ఎఱుఁగము!" అని శర్మగారి యాక్షేపము.

ప్రత్యు. ఉషాకన్య పార్వతిచెంత నే యున్న ది. పైపద్యమునకు వెనుక నున్న వచనముం గనుఁడు! పార్వతికిఁ జెవు డనుకొంటిరా? ఆక్షేపించుతలం పున్నప్పుడు సమీపమున నున్న వ్రాఁత లగపడవు! ఉషాకన్య యాలోచనమును, ప్రాణసఖులతో నామె తన తలంపుఁ జెప్పుటయు, పార్వతి వినుటయు వీరికిఁ దప్పు లయ్యెనుగదా! ఇప్పు ట్టున నెఱ్ఱన్న వ్రాఁతను, వీరి మెచ్చును పరికింపుడు!

"ఉద్యానవనవిహారానంతరము పార్వతీపరమేశ్వరు లేకాంత విహారముఁ గోరి స్థలాంతరమున కేఁగిరి. అచ్చట,

ఎత్తుగీ. కడఁకఁ బరమేశ్వరుఁడు తన్నుఁ గౌఁగిలింప,

నతని దోర్మధ్యసరసి నోలాడుచున్న

ఘనతర స్తనచక్రవాకముల నలరు

నంబ నసురేంద్రుకూఁతు రింపారఁ గనియె.

ఉషాదేవి కింకను 'కన్నియతనము.' అందును ముగ్ధమానసము. కావుననే దొంగిచూడ సాహసించినది." అని శర్మగారివ్రాఁత.

సోమునికంటె నెఱ్ఱన నున్నతపీఠమున నెక్కిఁపఁ దలంపుఁ గొన్న వీరు, ఆరాత్రుపకన్యచే నాతఁడు చేయించిన యాపాడుపనిని (తొంగిచూచుటను) ఎట్లు కప్పిపెట్టినారో చూడుఁడు! 'కన్నియతన' మఁట! వయసు వచ్చినతరువాత 'కన్నియ' యైన నేమి?—'పార్వతీపరమేశ్వరులు తలిదండ్రు' లఁట! తలిదండ్రులనుమాత్రము రహస్యక్రీడాసమయమున బిడ్డలు దొంగిచూడవచ్చునా? ఏల వీరి కింత పక్షపాతము? చల్లఁగ నూరకుండక వ్యాఖ్యాన మొనర్ప బయలుదేఱి సమర్థింపఁ బూనినారు! పిమ్మట నెఱ్ఱనయుషకుఁ గలిగిన తనకసంభ్రమమె! 'ఎంత బిగఁబట్టినను గోర్కు లంకురించిన' వఁట! 'పాగరొయ్యన నెక్కిన' దఁట!... యౌవనమా? మతియొకటియా? ఇట్టినాయకురాలిచ్చట నైన నుండునా? ఏమి యౌచిత్యము! ఏమి ప్రదర్శనము!

"ఎఱ్ఱన, చిత్రరేఖ లిఖించి తెచ్చినవారి నెల్ల నుషాదేవితో విరివిగా వర్ణించి చెప్పుచున్నాఁడు. ఈ యప్రస్తుతప్రశంస మన కేల యని భరతఖండములో నున్నవియు, లేనివియుఁ బెక్కుదేశముల పేళ్లను సంగ్రహించి యొక సీసమునిండఁ గూర్చి తన సర్వజ్ఞబిరుదమును సార్థకపఱిచినాఁడు." అని శర్మగారివ్రాఁత.

(ఉపయోగము లేనిచోట నైన నెఱ్ఱన్న వర్ణించెనేని యది వివిగ వర్ణించి చెప్పుట యగును! చూచితిరా?) ఇప్పు డుషాకన్యకుఁ గావలసినది యనిరుద్ధునిపటము. ఇతరరాజుల పటములను వర్ణించుచుఁ గూర్చున్నచోఁ జాతకులకు విసువు జనించును. అప్రస్తుతవర్ణనము. తొలుదొల్తనే యనిరుద్ధుని పటము నెదుటఁ బెట్టినచో నౌచిత్య ముండదు. ఈ విషయములఁ దలంచి, యాజిముత్త్యముల తోవవలె దేశముల పేళ్ల నన్నిటిని సక్లిష్టముగఁ గూర్చి తదధిపతులపటములఁ జూపె నని సోముఁడు వ్రాసినది వీరి కెంత వెగటయ్యెనో చిత్తగింపుడు! సోముని సీసములోని దేశముల పేళ్లు సంస్కృతాంధ్రగ్రంథములఁ జూపట్టునవియే. వివరణ మేల? "చిత్రపటప్రదర్శనము ప్రబంధపరమేశ్వరుఁ డెంత స్వాభావికముగా వర్ణించెనో కనుండు!" అని శర్మగారెఱ్ఱన్నను బొగడినారు. కనుండు! అస్వాభావవర్ణనము గల పద్యములోని మొదటిపాద మిది!

సీ. పా. "దేవతలను బూర్వదేవతలను జూచి

దేవయోనుల నెల్లఁ దెలియఁజూచి."

ఎఱ్ఱన సత్యబుషి. ఇరువదవ శతాబ్దిని బయలుదేఱెడు విమర్శకులు తనకు నప్రతిష్ఠ దెత్తు రని యెఱుంగఁడు. ఎఱిఁగెనేని పైపాదమునందలి యుత్తరదళము నట్లు వ్రాసియుండునా? "భూతోవిూదేవయోనయః, కృపీటయోనిర్జ్వలనః" ఇత్యాదులు లేవా యని యాతఁడు తలంచెనే కాని, ఈ 'చూచి-తెలియఁజూచుల' నడుమనే చేర్చినచో నది వికారముగ నుండునేమో యని యాతఁడు తలంపఁ డయ్యెను. పాపము! ఈ సత్యకాలపుఁగవి, ఇప్పటి నాగరకాగ్రేసరుల సంగతుల నూహింపఁజాలకపోయెను. చూడుఁడు! బలరామకృష్ణులు నిండుజవ్వనముతో విలసిల్లుచున్న కాలమున నక్రూరుఁడు దేవకీదుఃఖమును దెల్పుచో,

సీ. పా. ... అక్కట! పుత్త్రు లెలమితోఁ గుడిచిన,

చన్నులే యాతల్లి చన్ను లనఘ" హరి. పూ. 8 ఆ.

అని పల్కినట్లు వ్రాసినాఁడు. పైవ్రాఁతలు సోమునివే యైయుండెనేని పట్టఁ బగ్గము లుండునా?

వీరి యుపహరిణతవిమర్శన మంతయు నిట్లే నిష్పక్షపాతబుద్ధితో వెలుంగుచున్నది. ఈ ఘట్టమున, 'ఆం. భా. వ. స.' వారి పండితుల యఖండపాండిత్యమును దెలుపు విషయము నొకదానిని విన్నవించి యేతద్భాగవిమర్శనమును ప్రస్తుతము కట్టిపెట్టెదను. అనిరుద్ధునియవస్థ నెఱ్ఱన యిట్లు వర్ణించెను:—

సీ. "బలిమికోలన నవ్వ దలకొత్తినను మెఱుఁగు

జెల్లఁ దాసై యున్న వెల్లఁదనము,

ధీరత దెచ్చికోల్ పొందినఁ బలుకుల

యందు గద్గదిక వాయంగ లేదు,

గరువంపుఁజూపులఁ బరికొని యున్నను

రాగ మేతెఱవున రాదు చేరఁ

జేతులు వేడుక చేఁతలకై చక్కఁ

బచరించినను నచ్చుపడదు చేష్ట..." హ. ఉ. 7 ఆ.

శర్మగారు వ్రాసినదానిని 'భళా, శ్రీ!' యనుటయే వ. స. పండితుల పని.

ఎఱ్ఱన యీ పద్యములోని మొదటిపాదము నిట్లే వ్రాసియున్నచో దాని కన్వయము దేనితో? పొగడుబుద్ధియే కాని యర్థా

న్వయములబుద్ధి యేది? ఇందు మొదటిపాద మెట్లున్నది? తక్కిన వె ట్లున్నవి? ఎత్తిన మొదటిపాదము నన్వయము లేకుండ నట్లే వ్రాసెనా? శర్మగారి పాండితి కేమి? మున్నే తెలిసినది! వర్ధనీ సమాజ మహాపండితుల ప్రాజ్ఞత మాత్ర మాచంద్రార్కము నిల్చునదియే! ఏమన, మొదటిపాదమున కన్వయముఁ దెలిసికొనిన శర్మగారు, "రెండవపాదమున యతిభంగము మాత్రమే కాక స్పష్టముగ నర్థమును అగుట లేదు." అని యధోభాగమున మూదికను వ్రాయుఁగాఁ బై పండితులును 'కాలేదు' అనుకొన్నారు. వీరి కేల యర్థము కాలేదో! చిత్తగింపుఁడు!

ధీరత = ధైర్యము, తెచ్చికోల్ = తెచ్చికొనుటను, పొంది నక......అని యర్థము. ధైర్యముఁ దెచ్చికొనినను బలుదులయందు గాద్గద్యము తొలంగలే దని భావము.

(ఎత్తినహరివంశమును బరిష్కరించి ముద్రింపించిన పండితులు, తమకు లభించిన వ్రాఁతప్రతులలో 'ధీరత పొందినఁ దెచ్చికోల్' అనియో, 'తెచ్చికోల్ పొందిన ధీరత' యనియో యుండఁగా, "ఈ 'తికమక' యన్వయ మేల? యతి దప్పినఁ దప్పుఁగాక!" యని స్పష్టార్థమునకై, 'ధీరతదెచ్చికోల్ పొందిన' అని పదములను మార్చిరి గాఁబోలు! పాపము! వా రట్లు మార్చినను మీ రర్థముఁ జేసికొనలేకపోయినారు! ఇట్టి మీరు సర్వజ్ఞుని గ్రంథము విమర్శించుట యనర్థకమే!

ఇఁకఁ గవనంపు సొంపు గనుఁడు! వెల్లఁదనము, పాయంగ లేదు, రాగు చేర, పడుచు చేష్ట—ఇవి పాదాంతపదాదులు. "ఇట్టి పద్యమును దిక్కన దప్ప నితరు లెవ్వరును వ్రాయఁజాల రని చెప్ప సాహసించెద" రఁట మీరు! దీనితోఁ బోల్చుకొనుటకై మీ రిచ్చిన తిక్కన పద్య మిది!

సీ. ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ
దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నల్లనిల్లుచు లలితలోచన దీప్తు
లడర నుంకించిన నాఁగి యాఁగి
యంతసంబున బాలికము లగుచేష్టల
దొడరఁ బూనినఁ జేయు విడిగి యుడిగి
మనమున నుబ్బుపై మాట నాలుకకు రాఁ
గడఁగిన నాడకతనపి కడపి..."

పై యెత్తినతిక్కనల పద్యములఁ గనుఁగొన్న వారికి నాయాకవుల రచనాక్రమము విశద మగును. శర్మగారి కంత సాహసక్రమమేల? ఎత్తినపద్యమువంటి దానిని దిక్కనయు వ్రాయలేఁడు!

మీరు సకలభాషాభూషణుని గ్రంథమున 'ఇతరవిషయకము లగు ప్రమాదము' లని మూఁడు దోషములఁ జూపిరి. వానిని సంగ్రహముగ విమర్శించెదను.

ఆక్షే. (1)—"శివజ్వరము వచ్చి బలరామునితోఁ బోరు నప్పుడు మాత్ర మితఁడు బలరాముని గదుఁ డను పేర వ్యవహరించుచున్నాఁడు...ఇది ప్రమాద మని చెప్ప నోరు రాదు. గాని సదుత్తరము విచార్యమే."

ప్రత్యు—(a) గదా అ స్యా స్తీతి గదః = గదుఁడు = గదాయుధమును ధరించినవాఁడు. (b) గదః అస్య అ స్తీతి గదః = రోగము గలవాఁడు (జ్వరము సోఁకినవాఁడు.) ("అర్శ ఆది భ్యోఽచ్" అను సూత్రమును గ్రహించునది.) పై వాని నాయాచోటుల ననుసంధించుకొనునది. భాషాభూషణుఁడు గావున శబ్దచమత్కృతిని రుచిమాపెను.

ఆక్షే. (2) "పరంధామపతి" (ప్రథ. 88 పద్య.) "సంస్కృతమున 'పరం, ధామ' యని వ్యస్తముగాఁ బ్రయుక్తమైన పదమును సమస్తముగా భ్రమించి యిట్లు వ్రాసె" నఁట! (వచ్చి కొన్నాళ్లు ఉత్క్రావ చేసిన ధన్యుఁ డగు నేమో!)

పరం ధామ యస్మిన్ సః పరంధామా—పరం = కేవలము, ధామ = సుఖము, యస్మిన్ సః = దేనియందుఁ గలదో యది, పరంధామా = వైకుంఠలోకము; పరంధామ్నః పతిః.....

పర మనునది కేవలార్థవాచక మగు నవ్యయము. కావున సమాసమందు మకారము లోపింపదు. "పర కృత్త్రావలిఙ్గం కేవలే" అని అమరశేషము; 'కేవలే పర మవ్యయమ్' అని నానార్థరత్న "ధామ జన్మ...సుఖ సద్మసు" నానా. మఱియు స్వరాదు లవ్యయములు. వానియందు దీనికి గణనము గలదు. 'పరం' అవ్యయ మనుటకుఁ బ్రయోగములు.

"రసప్రసరనిర్భరాః కవిగిరాం ప్రసారాః పరం ముదం విదధతే వ్యాది ప్రదిమభాజికావ్యామృతైః"

పర మితి కేవలార్థవాచిః వ్యాదీత్యనే నాన్వయః (సాహిత్యర. గ్రంథకర్త వ్యా.)

"పుష్పం పరం ఘూర్ణ్వహామ్..." 'పరం కేవల' మని వ్యాఖ్యాత. (కువల. అతిశ.)

(పరంజ్యోతి, పరంధామశబ్దములు సంస్కృతమునందును, తెలుఁగునందును బ్రయోగింపఁబడి యున్నవి. ఉదా. గ్రంథపై పుల్య హేతువు.)

దీనిని 'ఆంధ్రభాషాభివర్ధనీసమాజము' త ప్పని నమ్ముట న్యాయ్యమే!—'వర్ధనీ' ఏలింగము? 'సమాజః' ఏలింగము? రెంటికి సమాసమునుటన మెట్లు?

ఆక్షే. (3) "కంటిం గంటి దయానిధిం గుణనిధిం గారుణ్య పాథోనిధిన్, (ఉ. హ. 4 ఆ. 179 ప. 3 పా.)

అనుపద్యమునఁ బునరుక్తిదోష మొండు గన్పట్టుచున్నది. ఇది కవిత్వవేగమునఁ గలిగిన ప్రమాద మనియే చెప్పవలయునుగదా!"

ప్రత్యు. శబ్దరత్నాకరాది సామాన్యనిఘంటువులం జూచి దయాకారుణ్యశబ్దము లేకార్థకము లని మీరు భ్రమపడినారు. ఫల్గుకాశ్మీర శబ్దముల యర్థమునందే పొరపడిన మీరు సూక్ష్మజ్ఞానమును గోరు నిట్టి వానియందు భ్రమఁ జెందుట యన్యాయ్యము గాదు. దయాకారుణ్యశబ్దములకుఁ గల భేదము వాచస్పత్యాది నిఘంటువులయందును, రసతరంగిణ్యాది గ్రంథములయందును వివరింపఁబడి యున్నది. వానిం జూచికొనునది. రెంటిభేదము సంగ్రహముగ వ్రాసెద.

(ఎ) దయ = (1) దుఃఖము నొందిన ప్రాణులవలని జాలి, (2) పరులదుఃఖమునకు సైఁపలేమి,......

(బి) కారుణ్యము = [కరుణస్య ( = కరుణాయుక్తస్య, కరుణావిషయస్య వా ) భావః] (1) పరదుఃఖప్రహారణేచ్ఛ = పరుల దుఃఖమును బోఁగొట్టవలయు ననుకోరిక,......(2)......

సర్వజ్ఞుఁడు వీని నెఱింగియే ప్రయోగించెను. కవిత్వవేగపుఁ బ్రమాద మిదియా? మా.

క. "విషయేంద్రియ ప్రపంచము
హృషీకమనఁబరఁగు నీ వధిపుఁడవై యు
న్మిషితముగ నది ధరించుట
హృషీకేశనామశోభి నైతివి కృష్ణా." వి. హ. ఉ. 6 ఆ.

శ్లో. హృషీకాణీన్ద్రియాణ్యాహు, స్తేషా మీశో యతో భవాన్।
హృషీకేశ స్తతో విష్ణో!, ఖ్యాతో దేవేషు కేశవ!"
సం. హ. విష్ణు. 88 అ.

అనుదానింబట్టి 'హృషీకేశ' శబ్దమును నిర్వచింప 'ష' కార ప్రాసముతోఁ బద్యము నారంభించెనే కాని కవిత్వవేగమున గణయతుల నెఱ్ఱన ప్రమాదపడె నను నన్ను నిప్పుడు మీరు నిందింపఁగలరా? పై శ్లోకమును సర్వజ్ఞుఁ డెట్లు తెలిఁగించెనో కనుఁడు;

"తే......ఇంద్రి, యము లగు హృషీకములు పడికాఖ్య గలిగి, నది హృషీకేశపదము." ద్వి. 201 ప.

సోముఁడు సంగ్రహానై పుణియందుఁ గాళిదాసు!; తెలుఁగు రచనయందుఁ దిక్కనమనీషి!

సంస్కృతమున వ్యస్తముగా నున్న పదము సమస్త మని సర్వజ్ఞుఁడు భ్రమించునా? అతనికి మన కున్నంత సంస్కృతపాండిత్యమైన లేదా? ఏమి వ్రాఁత యిది? ఇట్టివారు మహాకవుల కవిత్వతత్త్వమును విచారించుట భాషాదేవిదౌర్భాగ్యము గాక మఱియేమి"

"ప్రత్యేకవర్ణనములందును సోముఁ డెఱ్ఱనను మించినాఁ డని చెప్ప వలనుపడదు." అని శర్మగారు రెండు పద్యముల నిచ్చిరి. ఆపద్యముల సంపూర్ణచర్చను మాని ప్రస్తుత మొక్కొక్క పాదము మాత్రము విమర్శించెదను. —

ఎఱ్ఱ. సీ. పా. "వోఁడలఁ జదలేటి లేఁదరఁగలు వాలుఁ
దగుచందమామ నుయ్యాలలూప.?

సోమ. సీ. పా. "తొలుకాఱు మెఱుఁగులతోఁటలో నాడెను,
రాయంచకొదమతో రాఁజాలి."

(ఇది, పుత్త్రార్థియై తప మొనరించు చున్న శ్రీకృష్ణునకుఁ బ్రత్యక్షుఁ డగు శివునివర్ణనము)

ఎఱ్ఱనపద్యపాదము ముద్దులు గులుకు చున్నది. సోమునిదో! ఊహాతీతమై, ప్రకరణోచితమై, యత్యంతప్రౌఢి గల మహాకవికిఁ దక్క నితరులకు రచింప నలవి కానిదై యలరారు చున్నది. నిపుణముగాఁ బరీక్షింపుఁడు.

ఎవరైన క్షీరఘటమునో, జలకుంభమునో శిరమున నిడికొని యుండ, నందుఁ బ్రతిబింబించు చంద్రబింబమును జూడఁ దటస్థించు నేకవిదైనను శంభుదాసునిపద్యపాదమును గల్పించి వ్రాయఁగలఁడు; ఎఱ్ఱనగారి యుట్టిరచన నొకదానిని జూడుఁడు.

"చ. మధువిరహానపాత్రమున సుందరి యొక్కతె కేల నించుచుం
డుఁడు ప్రకంపితాంగములతోఁ బిలకించె......" నృసింహ.
తృ 97 ప.

ఈపద్యము వ్రాసిన కవివర్యుఁడు వైపద్యము నూహింపఁగలఁడు. ఇఁక సోమనాథుని పద్యపాదముం గనుఁడు.

ఛాయాచిత్రప్రదర్శినీ (బయోస్కోప్) యంత్రప్రదర్శనము జూచినవారు, దాని యొక్కొకరంగమున బ్రదర్శింపఁబడు నప్పు డందలి విద్యుచ్ఛకలప్రవాహమును బరీక్షించియుందురు. అట్టివారు తచ్ఛకలప్రవాహద్యుతులకు వేయిమడుంగు లెక్కుడు కాంతులు గల సోముని తొలుకాఱు మెఱుఁగులతోఁట యెట్లుండునో యూహింపఁగలరు. అట్టి తోఁటలో 'నాడెడు రాయంచ' యఁట! చూడ శక్యము గాక, మనస్సుచేతనే యెఱుంగఁదగిన యా మెఱుఁగులతోఁటలోఁ దనయాట సముచితము దోఁచునట్లు ప్రకాశించు 'రాయంచ' యెట్లుండునో యూహించుట కెట్టిమనోనిశ్చలత యుండవలయునో కదా! ఆరాయంచ నెరా! 'కొదమ' యఁట! అహా! సర్వజ్ఞకవీంద్రా! అట్టి 'రాయంచకొదముతో రాయఁజాలిన' వేల్పును పరంజ్యోతిని హరిహరనాథభక్తుఁడ వగు నీవును, అప్పటి శ్రీకృష్ణభగవానుఁడును, అతనితో నున్న యనిమిషులును, దివ్యదృష్టి గల సంయమీంద్రులును తెలిసికొనఁగలరు గాని తక్కినమాబోంట్లూహించుటకైన శక్తులముదుమా?

శ్రీకృష్ణసంతతికాఁడు తప మొనర్చుచుండ వర మీయ నేఁగుదెంచు పరమేశ్వరుఁడు, 'నిబిడోదయదశాధ్యక్షము' లగు 'విద్యుల్లేఖా' పరంపరల కాంతిపుంజములం దలసించుచు, "ఎవ్వని కాంతియం దీసూర్యచంద్రులు మెఱుఁగుఁబురువుల ట్లెఱుఁగఁబడుదురు"

ఇత్యాదివాఙ్మనసాతీతము లగు మహిమలను వర్ణించుపద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ బ్రత్యక్షుఁ డయ్యె నని తర్కించుట ప్రకరణోచిత మగును గాని, వీధులలోఁ బందిరుల క్రింద నాడఁబడు పార్వతీపరిణయనాటకములోని

"గంగాధరుఁడు వచ్చెన— తలపై నెలవంక యొప్ప, గంగాధ—"

అని పాడుచు వచ్చు పాత్రము నెదుటఁ దోఁపించు వర్ణనము సముచితమా? అందు విశేష మేమి యున్నది? ఎట్టిచోట్ల నెట్టి వర్ణన మొనర్పవలయునో యెఱిఁగినవా రాంధ్రకవులలోఁ దిక్కనసోమన లిరువురే! నన్నయయు వారికి దీటుగాఁడు! మాదృశుఁడు! కశ్యపునిభార్య లగు కద్రువయు, వినతయు సముద్రతీరమున కేఁగి నప్పు డచ్చటఁ గానవచ్చిన దేవతాశ్వమును నన్నయతిక్కన లిట్లు వర్ణించిరి:—

నన్నయ—

మ. "వివిధోత్తుంగతరంగఘట్టనచలద్వేలావనైలావలీ
లవలీలుంగలవంగసంగతలతాలాస్యంబు వీక్షించుచున్
ధవలాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీరదేశంబులం

దవదాతాంబుజఫేనపుంజనిభు సత్యశ్లోకోత్తముం దవ్వులన్.
ఆదిప. ద్వి. 31 ప.

తిక్కన—

“చ. కరువునఁ బోసిరో విమలకాంతి, సుధాబ్ధితరంగఁ దెచ్చి గం
డరు వ్రసరించిరో, హరుజటాస్థలికిం దొడ వైనయేటి వె
న్నరువునఁ జేసిరో యన మనోజ్ఞ సితచ్ఛవి నల్లసిల్లు సుం
దరతరగోత్తముంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్”
అను. ప్ర. 183 ప.

పై రెండుపద్యములం గనుఁడు! తిక్కనది యూహాతీత మగు వర్ణన యని తెలియవచ్చును!

బదరికాశ్రమవర్ణనము గల పద్యములు కైలాసయాత్రాఘట్ట విమర్శనమునఁ జేర్పఁబడినవి.

పిమ్మట వీరు సోమునికవిత్వమును గొంత పొగడినారు. ఆపొగడునందును దొల్లిటిప్రేమను విడువలేదు. అందలి యొకవిషయమును మాత్రము మీకు విన్నవించెదను.

“శ్రీకృష్ణునితో భూదేవి చెప్పుకొనువాక్యము లెంతయు మనసు కరఁగునట్లు వ్రాసినాఁడు. చూడుఁడు.

‘అకట! యిచ్చినవాఁడు దయ్యంబ, కొన్న
వాఁడు దయ్యంబ దీనికి వగవ నేల?
కాలపాశంబుఁ దప్పింపఁ గమలనాభ!,
నా భయార్తప్రలాపంబునకుఁ దరంబె?’”

అత్తే. “ఇట్టి రసపూర్ణఘట్టములఁగూడ నితఁడు సహజమగు ప్రాసలోభమును విడనాడు పుణ్యమునఁ బోఁడయ్యె.” అని యధోభాగమున సూచించినారు. (ఇది పొగడులోఁ దెగడు.)

చూచితిరా? ఒకశబ్దములోని యక్షరముల జతచెంత దాని వంటిది మఱి చేరరాదు. చేరెనేని యది ప్రాసమే! ఆహా! ఏమి! నాగరకతాభివృద్ధి మిన్నంటుచున్నది!

“జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి”
భర్తృ. మూర్ఖప. 2 శ్లో.

ఇందలి యనుప్రాసము నీతి కేమి భంగమును దెచ్చినది!

ఘంటాకర్ణుఁ డెట్టివెఱ్ఱివాఁడో దానియన్వయమేమో కైలాసయాత్రాఘట్టవిమర్శనమునఁ జూడవచ్చును.

(ఈ రీతిని వీరివ్యాస మంతయు మొక్కవోనిమక్కువతో వెలుంగుచున్నది!)

ఎఱ్ఱనసోమనల హరివంశములయందలి నరకాసురకథ, సత్యభామా యుద్ధము, విప్రుఁడు పుత్రరక్షణమునకై కృష్ణునిఁ బ్రార్థించుట, రుక్మిణీపుత్రప్రార్థనాఘట్టము, ఘంటాకర్ణోపాఖ్యానము, హరిహరాభేదతత్త్వవర్ణనము మొదలగువానిం జదివి రసగ్రహణపారీణు లుభయకవికవితాతారతమ్యమును నిర్ణయించుకొందురుగాక!

ఎఱ్ఱనహరివంశములోని “వలవంతసంతాపము......” అను పద్యము నుదాహరించి శ్రీశర్మగారు “సోముని గ్రంథ మంతయు వెదకి చూచినను నిట్టిసహజభావపోషణమును బ్రతిపాదించుపద్యరత్నము దొరకదు” అని వ్రాసియున్నారు.

ఎఱ్ఱనగ్రంథము రత్నఖని. దానిని ద్రవ్వి వెదక నందు రత్నము లుండు టబ్బురమా? సోముని గ్రంథము రత్ననిధి. అందు రత్నములే కాని గులకరాలును, మంటిపెల్లలును గానరావు.

ఎఱ్ఱనపద్యరత్నము సోముని గ్రంథములో వెదకినను దొరకదు గాని సోమునిపద్యరత్నము లెఱ్ఱన గ్రంథములో వెదకకయే దొరకుచున్నవి! చూడుఁడు! బాణాసురుఁ డీశ్వరుని యుద్ధభిక్షమును వేఁడు సందర్భమున సోముని గ్రంథములో నున్న

“సీ. నిండారఁ దెగఁగొని నిగిడించుతూపుల వైరిమర్మంబులు
వ్రచ్చివ్రచ్చి.........” అను సీసమును,

“క. చేతులకసి వోఁ గయ్యము.........” అనుకందమును ఎఱ్ఱన గ్రంథములో నున్నవి! సోమునియందలి గౌరవముచేతనో, ఆపద్యములమీఁది ప్రీతిచేతనో యెఱ్ఱన వానిని దనపాత్రమునఁ జేర్చుకొనెను. అట్లు కాదంటి రేని, చిత్రకళాకౌశలము చాలని యెఱ్ఱనపై జాలిఁగొని యే లేఖకమహాశయుఁడో సోముని గ్రంథమునుండి యెత్తి యాతని పాత్రమున ననుగ్రహించియుండును. దీనింగూర్చిన విశేషచర్చ మఱియొకప్పుడు చేసెదను. (శ్రీవీరేశలింగముగారి ప్రాఁత వ్రాఁతప్రతిని తంజావూరుప్రతిని కనఁగలిగినవారు పై విషయమును గూర్చి సంశయింపరు.)

ఈరీతిగాఁ దమవ్యాసమును సాఁగించి శర్మగారు “ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యమున నాచనసోమనాథునకు నమాత్యపద మీఁదగు నని నా యాశయము.” అని వ్రాసి, యంతతో నేమి తలంచిరో ‘అనఁగా ద్వితీయస్థాన మనుట’ అని వ్యాఖ్యానము నొనర్చుకొన్నారు. సోమనాథున కేస్థానము నిచ్చుట కైనను మన మెంతవారము? ఆతని కంటె నధికుఁడుగదా ఈయఁదగినవాఁడు! ఆతనికి నందుఁ గలస్థానమును దెలిసికొనఁగలుగుదుమేని యదియే పదివేలు! ఆతని కిచ్చుటమన కమాత్యస్థానము నిచ్చినను, ‘బంట్రోతుపని’ నిచ్చినను, ఆతనిహరిహరనాథస్థాన మాతని కెట్లును దప్పదు! ఆతఁ డీతుచ్ఛపదమును గైకొన మఱలిరాఁడు! అచ్చట నాతఁడు నిరతిశయసుఖము ననుభవించుచుండ, మన మిచ్చట నాతనింగూర్చి యేమేమో వ్రాసికొనుచున్నాము!

నాచన సోమనాథునిపైఁ జేయఁబడిన దోషారోపణము భ్రమప్రమాదకల్పిత మని మనము దెలిసికొంటిమి. ఇప్పుడు ‘ఆంధ్రవాఙ్మయమున నాతనిస్థానము’ను దెలిసికొనఁ బ్రయత్నింతము. అట్లు ప్రయత్నించుటకు మున్నుగ నాతనిగుణములఁ గొన్నిటిఁ దెలిసికొనుట న్యాయ్యము. కావునఁ బైవిమర్శనము నంతయుఁ జిత్తగించిన పాఠకవర్యులను, సంగ్రహ మగు నీక్రింది విజ్ఞాపనము సయితము పరీక్షింప వేఁడుచున్నాను.

నాచనసోమనాథమహాకవి, ‘ఆంధ్రవ్యాసమహర్షి’ యగు తిక్కనసోమయాజికిఁ బ్రియశిష్యుఁ డనియు, ‘ఆంధ్రకాళిదా’సని యుఁ జెప్పఁదగినవాఁడు. సకలవిద్యాపారంగతుఁడు. ఇతని గ్రంథము నందు భారతములోని కొన్నిభాగములను మించునవీనగుణము లనే

కము లున్నవి. "ఈతఁడు తిక్కనయం దపారగౌరవము నుంచి, యాతనివలెఁ గవిత్వము చెప్పనెంచి తత్ప్రయత్నమును బరిపూర్ణముగ నెఱవేర్చుకొనెను." అని శ్రీరామకృష్ణకవిగారు వ్రాసినది నిక్కము. మఱియుఁ గొన్ని విషయములలో నీతని 'గురువును మించినశిష్యుఁ' డనియుఁ జెప్పనొప్పును. అవి మృదుమధురపదప్రయోగములతోఁ గూడినశైలి లోనగునవి. ఈతనిపద్యములు, వినువారికి, భాషాదేవి విపంచీనినాదముంబోలె, మహదానందముఁ గూర్చుచుండును. ఏయే స్థానముల నేయేపదముల నేయేలోకోక్తులఁ బ్రయోగించిన, నాయా కథాభాగములలోని విషయములు చదువరులహృదయముల నచ్చొత్తింపఁబడినట్లుండి హాయిం గూర్చునో, ఆప్రయోగములను జక్కఁగ నెఱింగినవాఁడు. వేసవి తెరువరికి సెలయేఱుంబోలెఁ జదువరికి నీతని కవిత యెనలేనిసుఖము నొడఁగూర్చును. శంభుదాసుఁడును, శ్రీనాథుఁడును ననేకస్థలంబుల నీతనికల్పనలను, పదపద్యంబులను, భావంబులను ననుకరించి రన నీతనియౌత్కృష్ట్యము వేఱ నుడువ నేల? అందు "సీసమునకు శ్రీనాథుఁడు" అను శ్రీనాథునిప్రఖ్యాతిలతకు సోముని గ్రంథమే యాలవాలము. (దీనింగూర్చి వేఱొక గ్రంథమునఁ బ్రస్తావించెదను.) ఈతనింగూర్చి యెక్కుడుగ వ్రాయక, శ్రీమాన్ మన ప్పాకము అనంతాచార్యులవారిచేఁ బ్రకటింపఁబడుచువచ్చిన వైజయంతీపత్త్రికయందు 'ఉత్తరహరివంశము'నుగూర్చి వ్రాయఁబడిన విమర్శనములోని కొంతభాగము నిచ్చట నుదాహరించెదను.

"ఇట్టి యుద్గ్రంథమును...ముద్రించి లోకవ్యాపకముఁ జేసిన వీరేశలింగముపంతులుగారిదివఱకు శతాధికగ్రంథములు వ్రాసి పొందిన గౌరవముకంటె దీని ముద్రించుటచే సంపాదింపఁగల కీర్తియు వేయిమడుంగు లెక్కువ యని మాయభిప్రాయము... ఈకవి సర్వజ్ఞుఁడైనను ఇతనికి వేదాంతమందుఁ గలప్రజ్ఞ యపార మనియుఁ దోఁచుచున్నది. ఇతఁడు కేవలపుస్తకవిద్యలయందె కాక వాత్స్యాయనోక్తంబులగు చతుష్షష్టికళలయందును గుశలుఁ డని యితనిగ్రంథము వేయివిధంబులఁ జాటుచున్నది. ఇతఁడు పుట్టుకవి. లోకస్వభావము చక్కఁగా నెఱిఁగినవాఁడు. అపారమైన భావనాశక్తి గలవాఁడు. ఆంధ్రభాషయం దెల్ల నితఁ డొక్కఁడే పదవాక్యప్రమాణజ్ఞుఁడు. ఏకవియు నూహింపని యనేకవిషయముల నీతఁడు పాటించియున్నాఁడు......"

(ఈపత్త్రిక నిన్న మొన్న పుట్టినది గాదు! ఇరువదేండ్ల క్రిందటిది!)

అజ్ఞుఁడ నగు నాకుఁ దోఁచిన 'ఉత్తరహరివంశములోని రచనావిశేషముల'లో నొక్కపద్యమునందలి పదప్రయోగౌచిత్యమును గూర్చి యొండు రెండుదాహరణములు మాత్ర మిచ్చట నిచ్చి ప్రస్తుతవిషయమునకు వచ్చెదను.

1. (ఎ) "మ. ధనదాంతఃపుర తారహారములు, యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము, ధర్మరాట్కులవధూసంవ్యానకౌశేయమున్
దనుజేంద్రారివరావరోధదయితాధమ్మిల్లమాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మీనిత్యనైపథ్యమున్"
ప్రథ. 16 ప.

నరకాసురుఁడు దిక్పతులపతులయలంకారములఁ దెచ్చి, వానితోఁ దనజయలక్ష్మిని సైసేయఁ జూచుచున్నాఁడు. కవి, వాని దృష్టి నప్పుడు దిక్పాలపతులకడకు నుత్తరమునుండి (ధనాధిపుని దిక్కునుండి) తూర్పునకుఁ (అప్రదక్షిణముగాఁ) బోనిచ్చినాఁడు. ఏల? వాని దిగ్విజయము శాశ్వతము కాదు!—అనఁగా జయలక్ష్మి వానికడఁ దడవుండదు! ఈపద్యము మొదలుకొని, యాగభాగములకై మునీంద్రులను నరకుఁడు బాధించుపద్యమువఱకుఁ గలఘట్టమంతయు సోమనాథకవీంద్రుని రచనాసామర్థ్య మనన్యసాధ్య మని చాటుచున్నది.

(బి) నరకునితో దేవేంద్రుఁడు సమర మొనర్చుచుండ నాతనికిఁ దోడుగా వచ్చినలోకపాలుర రాక నప్రదక్షిణముగాఁ గవి దెలుపుచున్నాఁడు.

తే. "వచ్చె యక్షగుహ్యకులతో వైశ్రవణుఁడు.
దోఁచె దారుణభుజగయాదోబలముల
తోడ వరుణుండు, కాలమృత్యువులతోడ,
నడచె దండధరుండు దానవులమీఁద." 24 ప.

ఇందు దేవతలయపజయము సూచింపఁబడినది.

(సి) మఱియు నరకుని నోటనుండి వచ్చిన యాక్రిందిపద్యముల యందలి విశేషముల నరయుఁడు:

(ప్రదక్షిణ)

ఉ. "ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను శాకశాసనుం
డాలములోన ననుం గదిసి యంతకపాశికుబేరయుక్తుఁడై
తోలుపులం బడెన్..................." ప్రథ. 61 ప.

(అప్ర)

మ. "అవె సుత్రామురథంబు లల్లవె కుబేరానేకపశ్రేణు ల
ల్లవె వార్ధీంద్రతురంగమంబు లవె ప్రేతాధీశవీరావళుల్..."
ప్ర. 68 ప.

(ప్రద.)

చ. "అవు నిది పోలు వాసవుఁడు, నంతకుఁడుం, వ్వరుణుండు, పార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దప్పద మేలుడుగ......" 80 ప.

(అప్ర.)

మ. "పాశిం బాఱఁగఁ దోలి, యంతకు దిశాపట్టంబుఁ గారించి, పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని ధనాధ్యక్షు న్విభాళించి..."
ప్ర 91 ప.

ఈఘట్టమున నెత్తినపద్యము లిట్లున్నవి.

మ. "వరుణుం దోలితి నర్థపుం జదిపితి న్వైవస్వతుం గెల్చితిన్
హరిఁ బోఁజోపితి నేన యీశ్వరుఁడ..."ఎ. హ. ఉ. 4. ఆ.

చ. "యముఁడు, కుబేరుఁ, డర్థపతి యాదిగఁ గల్గిన దేవకోటితో
సమరవరేణ్యు నూర్జితభుజాతికయంబున భగ్నుఁ జేసి..."
ఎ. హ. ఉ. 4 ఆ.

ఇందు దిక్పాలురు గణయతిప్రాససంబద్ధు లయినట్లు మీరు గ్రహింపఁగలరు. మఱియు, కుబేరుఁడు—అర్థపతి—వీ రెవ రెవరు? అగ్నినిప్పులవలె నున్నారు? (ఇది యెత్తిన వ్రాఁత గాదు. శర్మగారి మెచ్చులోఁ బడిపోయినది. 'అబ్ధిపతి'అనియే యెత్తిన వ్రాసెను.)

II (ఎ) మఱలఁ బై 'ధనదాంతఃపురతారహారములు......" అను (I. ఎ.) పద్యమునే చిత్తగింపుఁడు.

ఇందు దిగధీశ్వరమహిషీమణుల యలంకారముల హరించి, వారికి వైధవ్యము నాపాదింప నరకాసురుఁడు తలంచుచున్నాఁడు. అమరులభార్యలకు వైధవ్య మెక్కడ? కావుననే మనసర్వజ్ఞుఁడు, (1) పెరిగినను, (2) కరఁగినను, (3) మాసినను, (4) నలఁగినను—

మఱలమఱల ధరించుకొనునవియు, సౌమాంగల్యమునకు భంగము లేనివియు నగు—

(1) తారహారములు, (2) కాశ్మీరము, (3) సంవ్యానకౌశేయము, (4) మాల్యంబులు— నను తాత్కాలికాలంకారములమీఁదికే నరకునిదృష్టి పోవునట్లు చేసినాఁడు!

(బి) ఈసంవిధానము రాక్షసకాంతలమీఁద నెట్లుపయోగింపఁబడినదో కనుఁగొనుఁడు.

సీ. "వైతేయమదవతీ ధమ్మిల్లములతోడ,
విరులసెత్తావికి వీడుకోలు
దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ
గలికికాటుకలకుఁ గానివావి
దానవమానినీస్తనకుంభములతోడఁ
బసుపుఁబయ్యెదలకుఁ బాయుతెరువు
దైత్యవరారోహదయితాధరములతో
సొబగుపీడెములకుఁ జుక్కయెదురు
చేసి సురసుందరీకరాశ్రితతాల
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబు,
పదిలపఱుపఁ జక్రంబ నీభరమ కాదె. కృతీ. 147 ప.

(ఈపద్యమునందలి పదవిశేషములను పరీక్షింపుఁడు! గద్యమునందలియాతనిబిరుదములన్నియు సార్థకములే యని తలంపఁగలరు!)

(సి.సీ. "తొడవు లూడ్చిననైనఁ దొయ్యలివేనిలోఁ
జిన్నవోయినపట్లు చెన్ను మెఱయ
విరులు పుచ్చిననైన వెలఁదివేనలితావిఁ
బాయనిజవ్వాది బయలు నెఱయఁ
బూఁత రాల్చిననైనఁ బొలఁతుక మైచాయ
గవుసెనలో నున్న క్రమముఁ దెలుప
మడుఁగు మాసిననైన మగువపెఱుందుసో
యగము చూపఱచిత్త మాఁకఁగొలుప
మురిపముల నుజ్జగించిన ముదురునడపు
చిఱునగవు నోసరించిన చిగురుమోవి
కలికిమాపుల పీడ్కొన్న కన్నుఁగవయు
నింతిమదిభీతి వెలుపలి కెఱుకసేయ." ప్ర. 57 ప.

నరకాసురుఁడు దన్నుఁ బిలువ రాక్షసుల నంపఁగానే యూర్వశి విధవావేషమును దాల్చినది. 'విగతభర్తృక' యని తలంచి నరకుఁడు తన్నుఁ గోరక విడిచిపుచ్చు నని దాని యప్పటితలంపు. వేశ్యకు వైధవ్య మన నేమి? ఊర్వశి యట్టివేసము వేసినను, ఆమె విశ్వస్తవలెఁ గనఁబడుటకు మనసర్వజ్ఞకవి యంగీకరింపలేదు!

దేవసతులకు, రాక్షసవనితలకు, దేవవేశ్యకుఁ గలభేదముల నెట్లు వివరించినాఁడో పైపద్యములను చిత్తగింపుఁడు. ఒక్క "ధనదాంతఃపుర..." అను పద్యములోనివే. పై I, II, విశేషములు! ఇట్టి సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి కవనసౌందర్యమహిమను గని—

"శా. ఔరా! హరివహోరసస్థితి! యహాహా! శబ్దదాంపత్య! మ
య్యారె! పాకబుజుక్రంబు! భళి! శయ్యారీతు! లోహహో! చమ
త్కారం! బద్దిర! జాతివార్తలు! పురే! ధారాసమారూఢి! మ
మ్మారా! రాజదలంకృతుల్! కవులలో మాన్యుండవీవన్నిటన్!"

అను ప్రబంధరాజములోని పద్యము నెవ్వరు జ్ఞప్తికిఁ దెచ్చుకొనకుందురు?

పైవ్రాఁతలంబట్టి 'ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యమున నాచనసోమనాథుని స్థాన' మెయ్యదియో పాఠకమహాశయు లూహించియే యుందురు. అయినను, జడమతి నగు నేను జేయు నీక్రిందివిన్నపమును గూడఁ జిత్తగింపుఁడు.

"ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యమున నాచనసోమనాథుని స్థానము"ను దెలిసికొనుటకు మున్న తత్సామ్రాజ్యచరిత్ర మల్పముగఁ దెలిసికొనవలసియుండును.

ఆంధ్రవాఙ్మయరాష్ట్రము తొల్లి యరాజక మై, సకంటకమై, దుర్గమ మై యుండెను. కొంతకాలమునకు భగవదవతారముం బోలె నన్నయభట్టారకుఁ డవతరించి, (నారాయణభట్టుసాహాయ్యమున) దానికి దయితుఁడై, మహితాత్ముఁడై, దక్షతతో దానిని నిష్కంటకముగను, సుగమముగను జక్కఁబఱిచి, జనులకు హాయింగూర్చు పరిపాలన మొనర్చి పరబ్రహ్మమును జేరెను.

పిమ్మట మఱికొంతకాలమునకుఁ దిక్కనసోమయాజి బయలువెడలి, తద్రాజ్యమును (విస్తరింపఁజేసి) సామ్రాజ్యముగ నొనర్చి, యందు విశాలసత్త్రంబులఁ గట్టించి, యందందు సమృతంపుఁజలిపందిళులఁ బెట్టించి, జనుల కలిమియానందమును గూర్చి, చతురాననుఁ డనఁ బొప్పి, ఉభయకవిమిత్ర బిరుదముతోఁ దత్సింహాసనము నధిష్ఠించి, ప్రథమచక్రవర్తి యై, నిరంకుశప్రభుత్వమును నెఱపి, హరిహరనాథునిఁ జేరెను.

కవిబ్రహ్మకుఁ దరువాత, సర్వజ్ఞుఁ డగు నాచనసోమనాథుఁడు, శంకరాచార్యపీఠమును విద్యారణ్యుఁడుంబోలెఁ దత్సింహాసనము నధిరోహించి, "శ్రీమత్సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణసనాథ, అష్టాదశపురాణజ్ఞ, సకలాగమవేది, ..." ఇత్యాది బిరుదములతో ద్వితీయచక్రవర్తి యై, యత్యంతసమర్థతతోఁ దత్సామ్రాజ్యమును బరిపాలించి, యందుఁ గ్రొత్తక్రొత్తబాటలు వేయించి, జనుల నానందపాథోరాశి నోలలాడించి, అనంతరము శాశ్వతపదమున కరిగెను.

పిమ్మట మహనీయుఁ డగు నెఱ్ఱాప్రెగ్గడ 'శంభుదాస, ప్రబంధపరమేశ్వర, ..." ఇత్యాది బిరుదములతోఁ దత్సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించి, తృతీయచక్రవర్తి యై పాలించి, శంకరస్వామిని జేరుకొనియెను.

[ఎఱ్ఱాప్రెగ్గడకుఁ దరువాత శ్రీనాథుఁడు, కవిసార్వభౌమబిరుదముతోఁ దత్సామ్రాజ్యసింహాసనము నెక్క ననేకప్రయత్నము లొనర్చెను. కాని, విక్రమార్కసింహాసనము భోజరాజునకుఁబోలెఁ జక్రవర్తిపీఠముమాత్ర మాతనికి లభింపదయ్యెను.]

నాచనసోమనాథమహాకవి "ఆంధ్రవాఙ్మయసామ్రాజ్యము"ను ద్వితీయ చక్రవర్తియై పాలించెను. కావున నం దాతనిస్థానము,

"చక్రవర్తిస్థానము".

అని విన్నవించుచున్నాఁడను.

# హిందీభాష

కో. శఠకోపాచార్యులు గారు

ప్రస్తుతము మన హిందూదేశములో ననేకభాషలు వాడుకలో నున్నవి. వీనిలో నింగ్లీషు మొదలగు నొకటి రెండు తప్ప తక్కిన భాష లన్నియు దేశీయములే. అనఁగా నివి యీదేశపు భాషల నుండియే జనించి హిందూదేశపు జనుల గృహములందు తరతరములుగా వాడఁబడుచున్నవి. వీనిలో ముఖ్యమైనది హిందీభాష. హిందీని మాతృభాషగా నుపయోగించు జనులు మన దేశమందలి యితరభాషను మాటాడువారికన్న నధిక సంఖ్యాకులుగా నున్నారు. కొంతకాలమునుండి హిందీభాషను మన దేశమున సామాన్యభాషగాఁ జేయుటకుఁ బ్రయత్నములు సలుపఁబడుచున్నవి. మహాత్మాగాంధిగారీ యాందోళనమునకు నాయకత్వము వహించినది మొదలీయుద్యమమునకు నూతనశక్తియు ప్రాముఖ్యమును కల్గినవి. కాన హిందీభాషయొక్క యుత్పత్తిస్వరూపములను కొంత వరకు తెలిసికొనుట యుపయోగకరముగా నుండును.

ప్రతిభాషయందును కాలక్రమమున శబ్దజాలమునందును ప్రకృతి ప్రత్యయనిర్మాణమునందును మార్పులు కలుగుచుండుట స్వాభావికముగా నున్నది. ప్రస్తుతపు ఇంగ్లీషుభాష జర్మనీదేశమందలి ట్యూటానికు భాషనుండి ప్రాచీనాంగ్లభాషగా మాఱి తరువాత కొంతకాలమునకు మధ్యకాలపు ఆంగ్లరూపమును వహించి యిప్పు డాధునికాంగ్లమను పేరఁ బ్రసిద్ధమై యున్నది. పూర్వము యూరపుఖండమంతటను వ్యాప్తమై యుండిన లాటినుభాష క్రమముగా చాలమార్పును జెంది చివరకు ఇటాలియను ఫ్రెంచి మొదలగు భాషల రూపమున నిప్పుడు నిలిచియున్నది. ఇట్లే మనదేశమందలి యాద్యార్యభాష కొన్ని వందల సంవత్సరములకు తన ప్రథమస్థితిని మాని నూతనాకారమును వహించినది. ఈ భాష క్రమముగా భరతఖండ మంతటను వ్యాపించి వృద్ధినొందిన కొలంది నొక్కొక ప్రాంతమందలి భాషకు కొన్ని ప్రత్యేక లక్షణములు కలిగినందున నార్యభాషయందు కాలభేదమును బట్టియే కాక ప్రాంతభేదమును బట్టి కూడ వ్యత్యాసము కలిగెను. ఆర్యభాషకు మనదేశమున ప్రథమమున నుండిన స్థితి ఋగ్వేదమునందలి సంహితాభాగముయొక్క భాషాశైలిని బట్టి తెలియుచున్నది. ఈభాష కొన్ని శతాబ్దములకు కొంతవఱకు మాఱిపోయెను. ఈద్వితీయస్థితి ఋగ్వేద బ్రాహ్మణములందును యజుస్సామసంహితలందును గానఁగును. తరువాత కొంతకాలమునకు రచింపఁబడిన యజుస్సామ బ్రాహ్మణముల యొక్కయు నథర్వవేదముయొక్కయు వాఙ్మయనిర్మాణము ఋక్సంహితయందలి భాషాశైలికన్న నింకను మాఱిపోయెను. అందువలన వేదభాషాచరిత్రమునందే మూఁడు ప్రత్యేకపరిస్థితులు కానవచ్చుచున్నవి. వీనిలో నింతమార్పు కలుగుటకు కొన్ని శతాబ్దముల కాలము పట్టియుండవలెను. వేదముల కనంతరము ఋషులచే రచింపఁబడిన సూత్రముల శైలి వేదశైలికిని నాధునికసంస్కృతశైలికిని మధ్యస్థముగా నుండు నని చెప్పవచ్చును. సూత్రవాఙ్మయమున నాధునికసంస్కృత వ్యాకరణ విరుద్ధప్రయోగము లార్షము లను పేరఁ బరగుచున్నవి. ఆర్షప్రయోగములు శ్రీమద్రామాయణమహాభారతములందుఁ గూడ నచ్చటచ్చట కానిపించుచుండును. వేదకాలపు ఆర్యభాష క్రమముగా మార్పుఁ జెంది ప్రస్తుతకాలపు సంస్కృతముగా పరిణమించెను. ఈ మార్పు కలిగిన సమయమున సంస్కృతభాషకు వాఙ్మయమున నుండవలసిననిబంధనలు పాణినిమహర్షిచే నిరూపింపఁబడెను. వీరు రచించిన యష్టాధ్యాయి యను సూత్రగ్రంథమందు వేదభాషకును కావ్యాదులభాషకును గల భేదము కూడ స్పష్టము కావింపబడెను. గ్రంథసముదాయమందలియార్యభాష శతాబ్దములు గతించినకొలఁది నూతన రూపమును వహించుచుండ నీభాషయే సామాన్యజనుల ముఖములందు మఱియొకరూపముఁ దాల్చెను. గ్రాంథికభాషయందు క్లిష్టములును సామాన్యజనులకు దురవగాహములు నగు నిబంధన లధిక మయ్యెను. సామాన్యజనులు వ్యాకరణనియమములను కొంతవఱకు విడిచియు కఠినము లగు నక్షరముల నుచ్చారణమందు సులభములుగఁ జేసికొనియు వాడుచుండిరి. ఇట్లు గ్రాంథికభాషకును గ్రామ్యభాషకును జనించిన భేదము రానురాను మిక్కిలి యధికమై తుదకు రెండును వేఱువేఱు భాష లయ్యెను. ఈ గ్రామ్యభాషయే ప్రాకృతము. ఒకమహాదేశమందు వివిధప్రాంతములందలి సామాన్యజనులు తమ భాషను ఏకరీతిగ నుచ్చరించుట సంభవింపదు. హైదరాబాద్ గంజాం గుంటూరు చెన్నపురి మొదలగు స్థలములందలి తెలుగుజనులు మాటలాడు స్వభాషయందు మాండలికభేదములు కలిగియున్న సంగతి మనకు తెలిసియే యున్నది. ఇట్లే ఆర్యావర్తమున నసంఖ్యాకు లగు జనుల స్వభాషగా నున్న ప్రాకృతమందును ఆ యా ప్రాంతములందలి శీతోష్ణపరిస్థితులను బట్టియు నచ్చటి యనాగరకజనులయొక్కయు ద్రావిడులయొక్కయు భాషల సంపర్కమును బట్టియు నార్యద్రావిడాదిజాతిమిశ్రణము వలన జనుల ముఖనిర్మాణమునందు మార్పులు కలుగుటవలనను ప్రాకృతభాషయందుఁ గూడ భేద మేర్పడెను. ఈభేదము కాలము గతించిన కొలఁది నధిక మగుచుండెను. ఈప్రాకృతభాష లన్నియు నార్యభాషయొక్క పుత్రిక లని చెప్పవచ్చును. వీనిలో జ్యేష్ఠపుత్రిక యగు పాళీభాష క్రీస్తుకు పూర్వము ఆఱేడుశతాబ్దములనుండియు కాశీ ప్రయాగప్రాంతములందును మగధదేశమందును దేశభాషగా నుండెను. ప్రసిద్ధధార్మికసంస్కర్త యగు బుద్ధుఁడు పాళీయందు మతబోధఁ జేసినందునను తరువాత నశోకుఁడు మొదలగు బౌద్ధులు పాళీభాషను స్వధర్మవ్యాపనమున నుపయోగించుచుండినందునను ఇతరప్రాకృతముల కన్న నార్యభాష నధికముగఁ బోలియున్నందునను ప్రాకృతభాష

లన్నిటిలోను పాలీ ప్రాముఖ్యము వహించెను. శౌరసేని మాగధి మొదలగునవి ప్రాకృతముయొక్క యితరము లగు ప్రాంతిక భేదములు ఈభాషలందు క్రమముగా నెక్కువమార్పు కలుగుచు వచ్చెను. సంస్కృత నాటకములందలి పాత్రలలో సామాన్యజనులకు ప్రాకృతభాష లుపయోగింపఁబడుచువచ్చెను. కర్పూరమంజరి మొదలగు ప్రత్యేక ప్రాకృత గ్రంథములుకూడ నప్పుడప్పుడు లిఖింపఁబడుచువచ్చెను. వీనియర్థమును గ్రహించుటకును శౌరసేని మహారాష్ట్రి మొదలగువాని పరస్పర భేదమును గమనించుటకును ప్రాకృతవ్యాకరణములు రచింపఁబడెను. సుమారు క్రీ॥ శ॥ పదవశతాబ్దమునకీ ప్రాకృతభాషలయందు కలిగిన వ్యత్యాసము చాల నధికమై యవి నూతనభాషలుగా నెంచుకొనవలసివచ్చెను. ఇవియే హిందూదేశమందు ప్రస్తుత ముపయోగింపఁబడు నార్యభాషలు. ఇవి ఋగ్వేదకాలపు టార్యభాషకు మనుమరాండ్రని చెప్పవచ్చును. వీనిలోఁ గొన్ని మాండలిక భేదములు కలిగియున్నను ఏడు ముఖ్యభాషలుగ లెక్కవేయవచ్చును. పంజాబీ సింధీ మరాటీ గుజరాతీ హిందీ ఉరియా బెంగాలీ అస్సామీ భాష లాయా ప్రాంతములందు వాడుకలో నున్నవి. హిందూస్థానీ కూడ నార్యభాషలలో చేరిన దనుటకు సందేహము లేదు. దీనినే మహమ్మదీయులు ఉర్దు అను పేర నుడువుచున్నారు. ఈ భాషలో అరబ్బీ పారసీక పదములు వందలకొలఁది చేరియున్నందున, కొందఱది యార్యభాష కాదని పొరపడుచున్నారు. అయిన నిది హిందీయొక్క శాఖామాత్రమే కాని ప్రత్యేక భాష కానందున నిందు వేఱుగా చేర్పఁబడలేదు. దీని ప్రకృతిప్రత్యయ నిర్మాణాది వ్యాకరణ పద్ధతులను క్రియాసమూహమును సంఖ్యానామములును సర్వనామములును హిందీభాషలోనివే కాని వేఱు కావు. భాషాస్వభావమును కనుఁగొనుట కివియే ముఖ్యగమకములు. ఇట్లే ఆంగ్లభాషయం దధిక భాగము లాటినుపదములతో నిండి యున్నను అది జర్మనుభాష (Tutonic) తో సంబంధించినదిగా నంగీకరింపఁబడినది. తెలుఁగు మళయాళము మొదలగు వాఙ్మయములలో సంస్కృతశబ్దము లనేకము లున్నంతమాత్రమున నవి యార్యభాషలు కాక వాని ప్రత్యయ నిర్మాణసర్వనామసంఖ్యాపదములను ద్రావిడభాషలుగనే శబ్దశాస్త్రజ్ఞులచేత నిశ్చయింపఁబడినవి. తెలుఁగునకు సంస్కృత మాద్యప్రకృతి యనియుఁ బ్రాకృతము ద్వితీయప్రకృతి యనియుఁ గొందఱు వైయాకరణులు పడిన యభిప్రాయము ప్రమాదజనిత మనుటకు సందేహము లేదు. మనదేశపు పశ్చిమప్రాంతమునుండి వానివరుసను బట్టియు పరస్పరసాదృశ్యమును బట్టియు వాని క్రమము వైవిధముగా నేర్పఱుపఁబడినది.

ఈభాషలకు ప్రత్యేకలిపి కూడ నేర్పడియున్నది. అందువలన నీభాషలకు పరస్పరభేద మెక్కువ యగుచున్నది. ఇం దొక భాష వారు మరియొక భాష నేర్చుకొనుట కెక్కువ కష్ట మగుచున్నది. వీనిలో హిందీకి మరాటికిని నాగరలిపి వాడఁబడుచున్నది. ఈభాషలన్నిటికి నన్యోన్యసంబంధము చాల కల దని వేఱుగ చెప్ప నక్కఱలేదు. వీని కన్నిటికి మూలభాష యొక్కటియే. అదియుఁగాక వీనియందు సంస్కృతపదములు విరివిగా నుపయోగింపబడును. వీనిలో హిందీభాష ప్రధానమైన దనుటకు సందేహము లేదు. దీనికిఁ గల స్వాభావికసదుపాయములను బట్టి భరతఖండ మంతటను దీని సామాన్యభాషగాఁ జేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. దీని పరిస్థితులును అవి యెట్లు హిందీ సామాన్యభాష యగుటకు సహకారులగునదియు నందుల కేమైన బాధకము లున్నవా యనువిషయమును వాని నెంతవఱకు తొలఁగించుటకు వీలు కలుగునదియు పరిశీలింతము.

మధ్యస్థితి హిందీభాష ముఖ్యముగ నార్యావర్తమునందలి సంయుక్తప్రదేశమునందును విహారప్రాంతమున కొంతవఱకును మధ్యరాష్ట్రముయొక్క యుత్తరభాగమునను ఢిల్లీప్రాంతమునను గల జనులకు స్వభాషగా నున్నది. ఈభాగ ముత్తరహిందూదేశమునకు మధ్య నున్నది. అందువలన పంజాబీ గుజరాతీ మరాటీ ఉరియా బెంగాలీ భాషలు ఏదో యొక దిక్కున హిందీప్రాంతపు సరిహద్దునంటియున్నవి. ప్రాంతమందున్న భాషలకు పరస్పరసంబంధమును సాదృశ్యము నుండుట స్వాభావికము. అందువలన గుజరాతీపంజాబీలతోను ఉరియా బంగాళీలతోను హిందీభాష సమాన మగు సమీపసంబంధము కలిగియున్నది. అందువలన నార్యభాషీకు లందఱును హిందీభాషను సమాన సౌలభ్యముతో నేర్చుకొనవచ్చును.

(2) జనసంఖ్య:—దీనిని గూర్చి మాట్లాడువారి సంఖ్యను బట్టి చూచిన హిందీభాష నిస్సందేహముగా నగ్రస్థానము నలంకరించును. 1911 సం॥ హిందూదేశపు జనసంఖ్య 31½ కోట్లు. అందు తెలుఁగు మొదలగు ద్రావిడభాషలను బర్మాభాష మొదలగువానిని మాటలాడు జనులు పోను సుమారు 21 కోట్లమంది ఆర్యభాషలను మాటాడువారు. వీరిలో 8 కోట్లకు పైఁబడిన జనులకు హిందీ మాతృభాషగా నున్నది. బంగాళీ రెండవదిగా నున్నది. జనసంఖ్యనుబట్టి తెలుఁగు మూఁడవదిగా నున్నది (సంఖ్య. 2. కోట్ల 30 లక్షలు) హిందీభాషతో చాలవఱకు పోలియుండి స్వల్పభేదమువలన వేఱుగా లెక్కవేయబడినను దాని శాఖాభాషలుగా నెంచదగినవి కొన్ని కలవు. వానిని మాట్లాడుజనులు 5 కోట్లవఱకు కలరు. హిందీభాషను ప్రయత్నపూర్వకముగ నేర్చుకొనకయే తెలిసికొనగలజనులు 13 కోట్లమంది కలరని తేలుచున్నది. మహమ్మదీయులలో చాలమంది ఉర్దును స్వభాషగా వాడుచున్నారు. ఇదియు హిందీభాషకు శాఖగా నెంచదగియున్నను జనాభా లెక్కలలో వీ రాయాప్రాంతపుభాషల మాటాడువారుగా నెంచబడినందున వారిసంఖ్య యీ 13 కోట్లలో చేరలేదు.

వ్యాప్తి:—హిందీభాషను మాటలాడు జనులు ముఖ్యముగా నార్యావర్తమధ్యభాగమందే యున్నను ఇంచుమించుగా హిందూదేశమంతటను కలరు. వారు కొన్ని శతాబ్దముల క్రిందట కఱవువలననో వ్యాపారము మొదలగు వానివలననో యుత్తరహిందుస్థానమందలి స్వస్థలములను వదలి కుటుంబములతో నితరరాష్ట్రములందు నివాస మేర్పరచుకొనియున్నారు. వారు కాక మహమ్మదీయులు చాలమంది హిందీ యుపభాష యగు హిందుస్థానీని మాటలాడుదురు. వీరును దేశమంతట వ్యాపించియున్నారు. వీరిభాష తెలుగు మొదలగువానితో మిశ్రమముగ నున్నను వీరుత్తరహిందూస్థానజను లాడుమాటలను చాల

వారలకు గ్రహింపగలుగుదురు. (అరబ దేశమందును మలయాళమునందును ప్రాచ్యవంగ దేశమందును గల మహమ్మదీయులకు హిందుస్థానీ తెలియును.

చారిత్రిక సంబంధము:— హిందూదేశ చరిత్రమును చదివిన వారికి హిందీభాషకు స్వస్థానమగు రాష్ట్రములు సుమారు మూడు వేల సంవత్సరములనుండియుఁ బ్రసిద్ధిగా నుండినట్లు తెలియగలదు. భారతీయుల నాగరకతకు పుట్టినిల్లుగా నుండిన పూర్వకాలపు మహానగరము లీభాగమున నున్నవి. కోసల, మగధ కురు పాంచాలాది రాజ్యము లీ ప్రాంతమున నుండినవి. అయోధ్య కాశీ ప్రయాగ మున్నగు పుణ్యక్షేత్రము లీరాష్ట్రమునందే యుండినందున వేలకొలఁది హిందువు లితరప్రాంతములనుండి యిచటకు తీర్థయాత్ర చేయుదురు. డిల్లీ ఆగ్రా కాశీ పాట్నా లక్నో మొదలగు మహానగరములు హిందూ మహమ్మదీయ రాజ్యకాలములలో చిరకాలము రాజధానులుగా నుండినందున నివి చరిత్రప్రసిద్ధములై పవిత్రములుగా నెంచఁబడి జగత్ప్రసిద్ధము లగు సుందరభవనములతో విలసిల్లుచు ప్రపంచమునందలి యన్నిభాగముల నుండియు యాత్రికుల నాకర్షించుచున్నవి. బుద్ధుఁడును ఆయన ముఖ్యశిష్యులు నీప్రాంతమున జన్మించి తమ ధార్మిక జీవితమును గడపినందున బౌద్ధప్రపంచమున కంతకు కాశీ గయ మున్నగుస్థానములు పుణ్యక్షేత్రములుగా నుండుచున్నవి. డిల్లీ ఆగ్రా నగరములు మహమ్మదీయ రాజులకును ముఖ్యముగ మొగలాయి చక్రవర్తులకును చిరకాలము రాజధానులుగా నుండినందున నీప్రాంతము మిక్కిలి ప్రసిద్ధ మగుటయే కాక నిచట వాడుకలో నుండిన ప్రజభాష నాగరక దేశభాషలలో ముఖ్యముగ నెంచఁబడి రాజకీయసంబంధము గల యన్నిప్రాంతములజనులచేత నేర్చుకొనఁబడుచు వచ్చెను. మొగలుల కాలమునఁ బ్రభువులు పారసీకభాషను మాటాడుచుండినందున హిందువులు చాలమంది పారసీకమును నేర్చుకొనుచు వచ్చిరి. ప్రభువులకు తమభాషను సులభముగఁ దెలియఁజేయు తలంపుననో రాజకీయభాషాపదములకును వాడుటవలన దేశభాషకు గౌరవము హెచ్చునను తలఁపుననో హిందువులుకూడ నీభాషయందు అరబ్బీ, పారసీక పదములను విశేషముగ వాడఁజొచ్చిరి. ఈభాషకే హిందూస్థానీ లేక ఉర్దూ అని పేరు. చిరకాలమువఱకు ఉత్తరహిందూదేశపు దేశభాషా లౌకికగ్రంథములు హిందువులచే నీ హిందుస్థానీభాషయందు వ్రాయఁబడుచు వచ్చెను. అసలు హిందీభాషయందు ముఖ్యముగా ధార్మికగ్రంథములు మాత్రము లిఖింపఁబడుచు వచ్చెను. ఉర్దూభాషకు పారసీకలిపియే వాడఁబడుచున్నందున ఉర్దూనందు అరబ్బీ పారసీకముపదము లధిక మగుటయు హిందీభాషనుండి వ్యత్యాస మధిక మగుటయు సంభవించెను. ఇట్లు 16-వ శతాబ్దమున హిందూస్థానీ 19-వ శతాబ్దమువఱకును హిందూదేశభాషలలో ముఖ్యముగ నెంచబడి యన్నిప్రాంతములందును రాజకీయసాంఘిక సాహిత్య కార్యములందు వాడఁబడుచుండెను. డిల్లీరాజ్యమునుండి స్వతంత్రులైన ఇతర ప్రాంతపు మహమ్మదీయపాలకులు ఉర్దూను స్వభాషగా జేసికొనిరి. ఈ రాజ్యస్థానములనుండి యా ప్రాంతమంతటను మహమ్మదీయులలోను రాజకీయపరిచారకులలోను ఉర్దూభాషయే వాడుకొనఁబడుచుండెను. మహమ్మదీయ రాజ్యము పూర్తిగా నశించినస్థలములందు ఉర్దూభాషావ్యాప్తి చాలవఱకు తగ్గిపోయి మతసంబంధమువలన అచ్చట మహమ్మదీయులలో మాత్రము వాడుకలో నున్నది. నిజాము రాజ్య మింకను మహమ్మదీయసంస్థానమే యైనందున రాజావలంబనమువలన నచ్చట ఉర్దూభాషావ్యాప్తి యధిక మగుచున్నది. అరబమలయాళ దేశముల లోను ప్రాచ్యవంగదేశములోని ముఖ్యభాగమునను మహమ్మదీయపాలనము కొంతకాలమైన నుండనందున నచ్చటి మహమ్మదీయులు కూడ ప్రాంతీయభాషలనే వాడుచున్నారు. ప్రస్తుతము నిజాంరాజ్యమున తప్ప తక్కినస్థలములందు ఉర్దూభాషావ్యాప్తి తగ్గి యితర దేశభాష లున్న తస్థితిలోనికి వచ్చుచున్నవి. ఉర్దూభాషావ్యాప్తి హిందీ సామాన్యభాష యగుటకు కొంత సహకారి యైనను ఉర్దూవాఙ్మయము అరబ్బీపారసీకపదములతో నిండియుండుటయుఁ బారసీకలిపి ప్రచారమున నుండుటయును హిందీభాషావ్యాప్తికి హానికరము లగుచున్నవి.

వాఙ్మయము:—ప్రాచీనహిందీభాషయందు, అనఁగా 10-వ శతాబ్దము మొదలు 15 వ శతాబ్దమువఱకు నితరార్యభాషలలో కన్న హిందీభాషయందు సారస్వతవృద్ధి యధికమై యుండెను. ఆ కాలమున రచింపఁబడిన ధార్మిక నైతిక గ్రంథములు హిందీభాషకు దేశభాషలలో నగ్రస్థానమును ఇచ్చినవి. తరువాత హిందీసాహిత్యము కొంచె మభివృద్ధి నొందినను దేశమందశాంతి యధిక మగుటవలననో బుద్ధిమంతులు చాలమంది ఉర్దూనందు గ్రంథములను వ్రాయుటవలననో దాని యభివృద్ధి క్రమముగా తగ్గిపోయెను. ఈశతాబ్దములో మొదట హిందీ వాఙ్మయము బెంగాలీ గుజరాతీ మరాటీ మొదలగు తక్కిన యార్యభాషావాఙ్మయములకు వెనుకఁబడియుండెను. కొన్ని సంవత్సరముల నుండి హిందీలేఖకులయందు నూతనసంచలనము జనించి గ్రంథములు ప్రచురించుట ప్రతిసంవత్సర మధిక మగుచున్నది. ఒక్క బెంగాలీభాష తప్ప తక్కినభాష లన్నింటిలోను ప్రస్తుతము హిందీభాషయందే ఎక్కువగ్రంథములు ప్రచురింపఁబడుచున్నవి. హిందీని సామాన్యభాషగాఁ జేయుటకు జరుపబడు నుద్యమము కూడ దీనికి కొంతవఱకు కారణమై యున్నది. చాలభాగము బెంగాలీనుండి భాషాంతరీకరింపబడుచున్నవి. కొన్ని ఆంగ్లము నుండియును గుజరాతీ మరాటీ ఉర్దూల నుండియు పరివర్తితము లగుచున్నవి. గుజరాతీ మొదలగు వానితో హిందీకి సన్నిహితసంబంధ మున్నందునను, అన్నింటిలోను సాంకేతిక వైజ్ఞానికపదములు ఒకేరూపమున నుండుటచేతను వీనినుండి భాషాంతరీకరించుట సులభమగుచున్నది. స్వతంత్రగ్రంథములుకూడ నచ్చటచ్చట బయలువెడలుచున్నవి. కాని యవి ప్రతిభాసూచకములై హిందీవాఙ్మయమునకు గౌరవము హెచ్చునవిగా నుండుట లేదు. ప్రస్తుత మీవిషయమున బంగాళీయె కాక గుజరాతీ మరాటీ భాషలు కూడ హిందీకన్న నున్నతస్థితిలోనున్నట్లు కనఁబడుచున్నవి.

భాషాస్వభావము: భాషాశాస్త్రజ్ఞులు భాషలను వాని నిర్మాణమును బట్టి నాలుగైదు తరగతులుగ విభజించియున్నారు. చీనా, బర్మా మొదలగు దేశభాషలు ఏకాక్షరశబ్దభాషలు. ఇందు

ప్రతియక్షరమును ప్రత్యేకశబ్దమై ప్రతిశబ్దమును దానిస్థానమును బట్టి నామముగను విశేషణముగను క్రియగను సందర్భానుసారముగ నర్థము చేసికొనఁ దగియుండును. ఈ భాషలందు వ్యాకరణ నిర్మాణమున కవకాశము చాల తక్కువ. ఇవి నాగరకభాషలుగా నుండుట కనుకూలములు కా వని పండితుల యభిప్రాయము. తెలుఁగుభాష మఱియొకజాతిలోనిది. ఈ జాతిభాషలలో ప్రకృతి ప్రత్యయములును వ్యాకరణమును గలిగినను ప్రత్యయములు ప్రాతిపదికలతో మిశ్రములు కాక వేఱుగాఁ గనఁబడుచుండును. ప్రత్యయము లొకప్పుడు ప్రత్యేకపదములుగా నుపయోగింపఁబడును. ఇవి సంసృష్టభాషలు.

ఇందలిశబ్దములలోని వేఱువేఱు భాగములకు సంసృష్టియే కాని సంకర ముండదు. సంస్కృతము మఱియొక జాతిభాష. ఇందు వ్యాకరణక్లిష్టతయుఁ బ్రత్యయసమాగమమువలన మూలశబ్దములఁ గల్గు విచిత్రము లగు మార్పులును స్పష్టముగఁ గానవచ్చుచుండును. వీనిని సంయుక్తభాషలని పిలువవచ్చును. జర్మనుభాషయు మరాటీభాషయు నీజాతిలోనివే. ఇవి యన్నియు నాగరకజాతుల భాషలే యైనను వీనిలో మంచివాఙ్మయ మున్నను నాగరకతకు నత్యంతానుకూలము కా దని విద్వాంసు లభిప్రాయపడి యున్నారు. వ్యాకరణక్లిష్టతవలనను సమాసముల జటిలతవలనను అందలి సాహిత్యము కష్టసాధ్యము. నాలుగవ జాతి వగు వియుక్తభాషలు అన్నివిధములను నాగరకవ్యవహారమునకు తగియుండు నని శబ్దశాస్త్రజ్ఞులు తలఁచుచున్నారు. సాధారణముగా వియుక్తభాష లన్నియు సంయుక్తభాషలనుండి కాలక్రమమున కలుగు మార్పువలన నేర్పడినవే. హిందీ, బెంగాలీ ఈ రెండును సంస్కృతమునుండి ప్రాకృతముద్వారా యేర్పడినవి. ఇంగ్లీషు ఫ్రెంచి భాషలు వియుక్తభాషలే! ఇవి జర్మనీదేశపు ట్యూటానికు ఇటలీదేశపు లాటిను భాషలనుండి యేర్పడినవి. వియుక్తభాషలందలి ప్రత్యయములు ప్రాతిపదికలతో మిశ్రములై యుండక భిన్నములై యుండును. తెలుగులోఁ గొన్నిచోట్లవలె వానికి వాచకత్వశక్తి లేదు. వియుక్తభాష యగు హిందీని నేర్చుకొనుటయు నందలి వాక్యశైలిని గ్రహించుటయు మిక్కిలి సులభము. ఇట్టిభాష శీఘ్రముగ వ్యాపించును. ఉర్దూ కూడ హిందీభాషాశాఖ యైనందున నదియు వియుక్తమే. కాని పారసీకమువలె సంయుక్తముగాని టర్కిష్‌వలె సంసృష్టముగాని కానేరదు.

లిపి:—హిందీభాష వ్రాఁతయందును అచ్చునందును నాగరలిపి యుపయోగింపఁబడుచున్నది. దీనికే దేవనాగరి యని పేరు. ఈ లిపియును బెంగాలీ గుజరాతీ ఓఢ్రము తెలుగు మొదలగు లిపులును పూర్వపు అశోకలిపినుండి జన్మించినట్లు కాన్పించుచున్నది. వీనిలో నాగరకలిపి ప్రాచీన మని చెప్పుటకు వీలు లేదు. కాని సంస్కృత గ్రంథములు సాధారణముగా నాగరిలో వ్రాయఁబడి ముద్రింపఁబడుచుండుటచేత నీలిపి తక్కినవానికన్న పవిత్రతరముగ భావింపఁబడుచున్నది. సంస్కృతవిద్యాభ్యాసము చేసిన పండితులు చాలమంది ఈ లిపిని నేర్చుకొనుటవలనను సంస్కృతపుస్తకముల యచ్చునకై దేవనాగరీముద్రాలయములు దేశమంతటను స్థాపింపఁబడి యుండుట చేతను మద్రాసుసర్వవిద్యాలయమువారి విద్యార్థిపరీక్షలందు సంస్కృతమునకు నాగరలిపినే యుపయోగింపవలె నని శాసించుట చేతను మన ప్రాంతమందు కూడ కొంచెముగా వ్యాపకము కలిగియున్నది. మహారాష్ట్రగ్రంథములు కూడ నాగరియందె ముద్రింపఁబడుచున్నవి. ఇదిగాక బెంగాలీగుజరాతీలిపులు చాలవఱకు నాగరీలిపిని పోలియున్నవి. కనుక ఈభాషలవారు నాగరిని నేర్చుకొనుట సులభమే. అందువలన నాగరీలిపి హిందీభాషావ్యాప్తికి కొంతవఱకు సహాయము చేయవచ్చును. గాని యందువలనఁ గొంత హానికూడ కలుగవచ్చును. దేవనాగరికి ధార్మికసంబంధమును పవిత్రతను హిందువులారోపించుటవలన మహమ్మదీయులు దానికి విరోధము కనఁబఱచి ఉర్దూ ప్రత్యేకభాష యనియు దానికి పారసీకలిపియే కాని మఱియొకలిపిని వాడఁగూడ దని పట్టుపట్టి హిందీ ఉర్దూలకు కల్పితభేదము నధికము చేయుచున్నారు.

సామాన్యభాషాప్రయత్నములు:—సుమారు 45 సంవత్సరముల క్రింద హిందూదేశపు ప్రస్తుతార్యభాషల భావిస్థితిని చర్చించుచు వీని కన్నిటికి సంబంధించునటు లాంగ్లమున మహావ్యాకరణమును వ్రాసిన జాన్ బీమ్సు దొరగారు బెంగాల్ గుజరాతీ ఉరియా మొదలగు నితరార్యభాష లన్నియుఁ గాలక్రమమున హిందీభాషలో కలసిపోవు ననియు నిట్లు జరుగుట కెంతకాలము పట్టునో యను నదొక్కటియే చర్చింపఁదగిన దనియు వ్రాసియుండిరి. బీమ్సుదొరగారిప్పుడు జీవించి యుండినయెడల నింక నట్లే యభిప్రాయపడుదురా యని సందేహింపవలసియున్నది. ఈమధ్యకాలమున హిందీని సామాన్యభాషగా జేయుట కుద్యమము ప్రారంభింపఁబడినది. కాని యీకాలమందే యన్ని ప్రాంతముల జనులును తమతమ భాషలను యథాశక్తిగా వృద్ధి చేయుటకు కృషిచేయ నారంభించినారు. బెంగాలీభాషయందలి ప్రస్తుతపు వాఙ్మయము ఇతరదేశభాషావాఙ్మయముకన్న నధికముగ పెంచఁబడి వానివాఙ్మయములవృద్ధి కాధార మగుటయే కాక యూరపుఖండపు వాఙ్మయములతో సమానమైన దని లండను టైమ్సు మొదలగువానియందు మెచ్చుకొనఁబడుచున్నది. మఱియుఁ గుజరాతీ, మరాఠీ, అరవము ఈభాషలలో మంచి స్వతంత్రగ్రంథము లేఁటేటను వెలువడుచున్నట్లు తెలియుచున్నది. వీనికన్న హిందీభాషయందలి వాఙ్మయ మెక్కువ యున్నతస్థితికి రానియెడల హిందీభాషకు గౌరవము తగ్గుటయే కాక యీభాష నభ్యసించుటకు జనుల కభిలాష మధిక మగుటకు వీలుండదు. ఇతరభాషలనుండి యుత్తమగ్రంథములను భాషాంతరీకరించుటవలన హిందీవాఙ్మయము వృద్ధి కాఁగలదు. ఆ ప్రయత్న మిప్పటికే చేయఁబడుచున్నది. కాని స్వతంత్రగ్రంథములవల్లనే భాషకు నిజమైన గౌరవమును ఆకర్షకతయుఁ గల్గును. హిందీభాష యితరరాష్ట్రములందు కొంతవఱకు వ్యాపించి జనులచే గ్రహింపఁబడుచున్న దనియు మద్రాసురాష్ట్రమునందే దీనివ్యాపనము మిక్కిలి హీనముగ నున్నందున నీరాష్ట్రమందు వ్యాపించినయెడల హిందీ సామాన్యభాష యగు ననియు గాంధిగారు మొదలగు నాయకు లభిప్రాయపడిన సమాచార మందఱకును తెలిసియుండవచ్చును. ఇది శ్లాఘనీయ

మగు కార్యమే! మద్రాసు రాజ్యమున ద్రావిడభాషలే మాట్లాడఁబడుచున్నందునను ద్రావిడభాషలకును హిందీకిని సంబంధము తక్కువయగుటవలనను హిందీభాషాలిపి యగు నాగరీ యీప్రాంతమున విశేషముగా వ్యాపించి యుండనందునను సామాన్యభాషాసమస్యకు మద్రాసు రాజ్యము ముఖ్యప్రతిబంధకముగా నుండుననుట సత్యమే. మద్రాసీయులకు ప్రతిసంవత్సరమును హిందీ నేర్పుతలంపుతో కాశీప్రయాగలందు హిందీవిద్యాలయములు స్థాపింపఁబడి మద్రాసీయులకు పరీక్షలును జీతములుగూడ నేర్పఱుపఁబడినవి. కాని నేర్చుకొనిన మద్రాసీయులు తమ ప్రాంతమున హిందీని వ్యాపింపఁజేయుటకు నంగీకరింపవలయును. తక్కిన దేశభాషలలోని యుద్గ్రంథములను హిందీలోనికి మార్పించి యాగ్రంథములను ప్రచురించుట కొక సంఘ మేర్పడవలయును. ఈ సంఘమున హిందీ తెలిసిన యితరప్రాంతములందలి విద్వాంసులుగూడ సభ్యులుగ నుండవలయును. ప్రస్తుతము ముఖ్యము లగు మన దేశభాష లన్నిటికిని నాయాప్రాంతములందు సాహిత్యపరిషత్తులు కలవు ప్రతిపరిషత్తునుండియుఁ గొందఱు ప్రతినిధులు కలసి ఒకసంఘముగా గూడి యీకార్యమును నెఱవేర్పవచ్చును. ఈపద్ధతివలన బెంగాలీవంటిభాషలందు ఉద్గ్రంథములు ప్రచురింపఁబడునప్పుడు గ్రంథకర్తృసహాయమున హిందీయందుఁగూడ నాగ్రంథమును సకాలమునకు ప్రచురించుటకు యత్నము చేయవచ్చును. అందువలన దేశభాష లనేకములు నేర్చుకొనక యొక్కహిందీనే నేర్చుకొని ఇతరప్రాంతపు జనులు దేశభాషల యుద్గ్రంథముల సారమును గ్రహింపవచ్చును సాహిత్యపరిషత్తుల ప్రతినిధు లందఱును గలసి యామోదించి గ్రంథప్రచురణము చేయుటవలన సాంకేతిక వైజ్ఞానిక పదము లన్నిభాషలందు నేకరీతిగా నేకార్థకములుగ నుండుటకు వీలు. ప్రస్తుత మిట్టి భావము దెలియఁజేయుటకు దేశభాష లన్నిటియందు ముఖ్యముగ సంస్కృతపదములే వాడఁబడుచున్నను అరవములో నొకయర్థమునను తెలుఁగున మఱియొకయర్థమునను బెంగాలీలో వేఱొకయర్థమునను వాడఁబడుచున్నవి. ఇందువలన వాఙ్మయవృద్ధికి చాల హాని కలుగుచున్నది. బెంగాలీభాషయందువలె నున్నతశ్రేణి నగు మాస దినపత్రికలు హిందీభాషయందు లేవు. భారతమిత్ర యొక్కటియే యాకర్షకముగ నున్నది. పత్రికలు భాషావ్యాప్తికిని వాఙ్మయాభివృద్ధికిని ముఖ్యాంగములు. కనుక వీనికై ప్రత్యేకసంఘములను స్థాపింపవలయును. వెంటనే హిందీ సామాన్యభాష యగుట కష్టమే. కాని హిందూదేశములోని యన్నిభాషల ప్రతినిధులునుకలసి యీసమస్యను పరిష్కరించుట చాల నావశ్యకమై యున్నది. ఆప్రతినిధులు స్వభాషాభిమానము నే ముఖ్యముగా నెంచుకొనక దేశక్షేమమును మనసునందుంచి భాషల పరస్పరభేదములను సాధ్యమైనంతవఱకు తగ్గించి ముఖ్యముగా నేకవిధములగు పారిభాషికపదముల నన్నిభాషలందును వ్యాపింపఁజేయవలయును. యూరపుఖండములోని రాజ్యముల పాలనమును భాషలును వే ఱయినను వైజ్ఞానికపదము లొక్కరీతిగనే యుండును. వానిలిపియు చాలవఱ కొక్కటియే. మనదేశమున నిట్లు చేయుట మిక్కిలి యావశ్యకము. ఈ పనిని నెఱవేర్చుటకు నన్నిదేశభాషలకు నొకటే లిపిని వాడుకలోనికిఁ దెచ్చుట కీసంఘమువారు యత్నింపవలసియున్నది. నాగరీలిపి యిందుకు పనికివచ్చు నని కొందఱ యుద్దేశము. నాగరికన్న రోమను (ఇగ్లీషు చిన్న అక్షరములు) కొలఁదిమార్పులతో నేకలిపిగా నుపయోగించుట మంచి దని నాయభిప్రాయము. అందులకు కొన్ని కారణములను క్రిందటి యాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో "ఏకలిపి" యను శీర్షికతో వ్రాసియున్నాను. రోమనులిపి మూలమున హిందీ, ఉర్దూలకు గల భేదము చాలవఱకు తగ్గిపోవును. ఏకలిపి యేర్పడినయెడల స్వల్పకాలముననే గుజరాతీ, బెంగాలీ మొదలగునవి వేఱుభాషలుగా నెంచఁబడక శాఖాభాషలుగా పరిగణింపబడును.

## ఆశాబంధము

బసవరాజు వేంకటప్పారావు గారు, బి. ఏ.

తిరిగితి నెన్నో దేశమ్ములఁ బడి
దొరకును చక్కని నెల వంచున్
రాగము లెన్నో హాయిగఁ బాడితి
రక్తి దేనఁ గల్గునొ యంచున్.
ఎక్కితి నెన్నో పర్వతమ్ములన్
చుక్కలఁ బట్టుదునో యంచున్

వేవిధమ్ములౌ ప్రేమల సోలితి
ఆప్రేమగుట్టుఁ గాంతునొ యంచున్.
ఇచ్చితి నెందఱకో హృదయపు ధన
మీవిపండు పండునొ యంచున్
ఎన్నో పూవుల పూజల సల్పితి
నీశ్వరుకృపఁ గాంతునొ యంచున్.



Dr. K. Pandalai Garu, డాక్టరు కె. పండలై గారు



Mr. W. Lone Ryan Garu, డబ్ల్యు. లోన్ రాయన్ గారు



Mir Mazar Uddin Garu, మీరు మజరుద్దీను గారు



Sheriff of Madras, మద్రాసు షెరీఫు

J. B. Raju Garu

Shahabuddin Garu, I.C.S. Candidate

Sir Robert stones

Mr. P. Ramanadhan, Solicitor



జే. బి. రాజుగారు



షహాబుద్దీను గారు, ఐ.సి.ఎస్. అభ్యర్థి



సర్ రాబర్టు స్టోన్సు



పి. రామనాథం గారు

K. Narayanappa Naidu Garu



కే. నారాయణప్ప నాయుడు గారు

K. T. Bhashyam Naidu Garu



క. టి. భాష్యం నాయుడు గారు

Dr. C. Natesam Garu, డాక్టరు సి. నటేశంగారు



Dr. T. R. Yathirajulu Naidu Garu



డాక్టరు టి. ఆర్. యతిరాజులునాయుడు గారు

Rao Sahib D. Venkataswamy Naidu Garu, Bangalore



రావు సాహేబు డి. వెంకటసామినాయుడు గారు, బెంగుళూరు

Rao Sahib Venkatapathi Naidu Garu



రావు సాహేబు వెంకటపతినాయుడు

Shanmugam Mudaliyar, Madras



షణ్ముఖము మొదలియారు గారు, మద్రాసు

Rao Bahadur G. Narayanaswamy Chetty Garu



రావు బహదూరు జి. నారాయణస్వామి శెట్టి గారు

# పదిసంవత్సరముల కార్యక్రమము

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు, బి. ఏ. ఎమ్. బి. సి. ఎమ్.

పందొమ్మిదివందల పదునాఱవ సంవత్సరారంభమున మొదలుపెట్టఁబడిన రాజ్యాంగసంస్కరణము లిప్పటి కొకదశను జేరి, ప్రస్తుతపు నిర్ణయము ప్రకారము 10 సంవత్సరములవఱకు మార్పులేకయే ఆచరణలో నుండునట్లు పార్లమెంటుచేఁ దీర్మానింపబడినది. భవిష్య న్నిర్ణయణము ప్రజల భాగ్యాధీనమునను భగవదధీనము నను నుండుటచే నేకాలమునకు నేపరివర్తనము సంక్రమించునో పొడగట్టుట సులభసాధ్యము కాదు. లాయిడ్ జార్జి మంత్రి చెప్పినట్లు ఈ ప్రపంచము కొంతకాలము మందగతిఁ జరించుచు, మఱి కొంతకాలము పెక్కు శతాబ్దముల యభివృద్ధిని ఒక్క సంవత్సరమునందే పూర్తిజేయును. ఇప్పు డిట్టికశకము జరుగుచున్నది. ఇప్పటి సంస్కరణములు అచిరకాలములోనే తిరిగిమార్పుఁబొందియభివృద్ధిఁగాంచ వచ్చును. ఇప్పటివి-అసంపూర్ణము లనియు, అసంతృప్తి కరము లనియు, ఆశాభంగకరము లనియు, దేశీయ మహాసభ తీర్మానించియుండనవి - అయిదారుసంవత్సర ములలోనే విపులము నొందు ననుటకు సందియము లేదు. విపులము నెప్పుడు నొందినను, ఈమధ్యకాలమునందు సంస్కరణములను వినియోగించుకొను బాధ్యత ప్రజలపై నున్నది. అట్టి బాధ్యతను తీర్చుకొనుటకు అవలంబింపవలసిన కార్యక్రమ మెద్దియో యోచించుట మనకు కర్తవ్యము.

పరిపాలనశాఖ లన్నియు ద్వివిధములుగ వర్గీకరింపఁబడినవి. సామ్రాజ్యప్రభుత్వమునకు చెందినవి మొదటివి. రాజధాని ప్రభుత్వమునకు చెందినవి రెండవవి. ఇందులో రాజధానికి చెందినవి మఱల రెండు శాఖలుగ నున్నవి. ప్రజాయత్తము చేయబడినవి అధికారాయత్తము నందే యుంచబడినవి-అని. ఈశాఖల నెల్ల నొక్కొక్క దానిని మనము సూక్ష్మముగ విమర్శించి అందుల ప్రజాసౌఖ్యమునకు వలయు మార్పు లెవ్వియో అవి యెట్లు సిద్ధింపగలవో యోచింపవలసియున్నది. 1. సామ్రాజ్య శాఖకు చెందిన విషయములలో, సేనా నౌకాదళములు ముఖ్యములు. ఇందులో మనకు ననేకసంస్కరణములు గావలసియున్నవి. ఇండియాకు దేశీయులచే నడుపఁబడు టెరిటోరియల్ సేన ఉండవలెను. ఈ సేన నిరంతరముగ నుండ నావశ్యకము లేదు. తగు శిక్ష పొందినవా రెల్లరు తమతమ వ్యాపారములను చూచుకొనుచు అవసరము వచ్చినపుడు దేశరక్షణము నకు తోడ్పడగలరు. హాల్డేన్ ప్రభువు ఇట్టి మార్పు 1907 లో ఆంగ్లదేశమున గావించుటవలననే, ఆంగ్లదేశము 1914వ సంవత్సరమున గలిగిన ఒడుదుడుకును నివారింపగలిగినది. ఇందు మనము కోరవలసిన విషయము దేశీయనాయకత్వము. ఐరోపామహాసంగ్రామమున మన కీర్తిని నిలబెట్టుకొనుటయే కాక, పరాజితము కానున్న సామ్రాజ్యమును సంరక్షింప దగిన భారతీయసైన్యము పాశ్చాత్యనాయకత్వమున నుండవలె ననుట మన కెంతయు నగౌరవము. పిన్నటి ప్రతికళాశాలల యందును, 17-19 వయసుగల బాలురను 'కేడెట్లు'గ సైన్యశిక్ష గఱపవలెను. అంతకు పిన్నవయస్సు గల బాలురకు స్కౌట్‌శిక్షను, సిటిజన్ ఆర్మీ అనుపద్ధతి ననుసరించి 12 సంవత్సరముల మొదలు 25 సంవత్సరముల వఱకు ఆస్ట్రేలియాలో గఱపబడు సైన్యశిక్షను బోలిన శిక్షను ఏడాదికి ఆఱువారముల చొప్పున నేర్పవల యును.

మఱియొకశాఖ ఉప్పుపరిపాలనము. సభ్యత నెందిన దేశములం దెల్ల ఉప్పుపై పన్ను విధించు నాచారము లేదు. ఉప్పు సూర్యరశ్మి వాయువులఁ బోలిన ఈశ్వరదత్తమగు సామాన్యపదార్థము. అట్టివానిపై సర్కారు సర్వాధికారమును వహించి దరిద్రులను నుచితముగ ఉప్పు సంపద జేయక పన్నులను విధించు మార్గము ఆధునిక సిద్ధాంతములకు వ్యతిరిక్తమని మనము నొక్కి నిరూపింపవలెను. పోస్టు ఆఫీసులు సామ్రాజ్య పరిపాలనకు చెందియున్నవి. ఈ విషయములలో పరిపాలన చాల బాగుగ నున్నదని చెప్పక తప్పదు. కాని కృష్ణా మండలమువంటి ప్రాంతమున రెండువేల గ్రామములుండ, 150 పోస్టాఫీసు లుండుట మిక్కిలి హాస్యాస్పదము. కొంచ

నీయము. లజ్జావహము. వెంటనే వేయి జనము గల ప్రతి గ్రామమునందును టపాకచేరీలు స్థాపించునటుల మనము కృషిసేయవలెను. వీనియొక్క ఉపయోగములను గూర్చి విస్తరింప నావశ్యకము లేదు. ఇప్పుడు జరుగబోవు శాసనసభల ఎన్నికల సందర్భములో టపాసౌకర్యము లేమి ఎంత యనర్థదాయకముగ నున్నదో గోచర మగుచున్నది. రైల్వేలు మరియొకశాఖ: ఇవి కేవలము సామ్రాజ్యపరిపాలనకు జెందియుండుటచేతను రైల్వేలు ప్రైవేటు కంపెనీల క్రింద నుండుటచేతను వీరిపై రాజధాని అధికారులకు ఎంతమాత్రము అదుపుచేయుటకు నవకాశములు లేవు. మూడవతరగతి బాటసారుల దురవస్థ ఇంతంత అని చెప్ప నలవికాదు. తగినజాగా లేకపోవుట, పాయఖానాలలో నీటిసౌకర్య ముండకుండుట, అచ్చటచ్చట చక్కని పరిశుభ్రములగు ఆహారశాల లుండకుండుట, టిక్కెట్లు సుకరముగ నందకపోవుట, వేచి యుండు స్థలము శుచిగను విశాలముగ నుండకుండుట, ఇవన్నియు వీరి కష్టములు. ఇవి వెంటనే తొలగింపబడవలెను. దేవాదాయములు ధర్మాదాయములు ముఖ్య విషయములు. మనదేశములో నీయాదాయము లెట్లు దుర్వినియుక్తము లగుచున్నదియు నెల్లరకు దెలిసిన విషయమే. దేవాలయమునకు కొంత భూవసతి యున్నపుడు అది కేవలము పూజారులేయనుభవించుట న్యాయ్యము కాదు. దేవాలయము ఎచ్చట యున్నదో అచ్చట నెల్ల విద్యాలయము లుండవలెను. ఆవిద్య అన్నిశాఖలవారికి సమానముగ గఱపబడు నవకాశము లుండవలెను. అట్టి విద్యార్థులకు అన్నదానసౌకర్యము లుండవలెను కావున దేవాలయపు ఆస్తినుండి విద్యాలయమును అన్నాలయమును గూడ స్థాపించుట న్యాయ్యము. ఇట్టి సదుపాయములు ధర్మకర్తృత్వపు దస్తావేజులనుండి పొందుటకు దగురీతిని శాసనము నూరవలెను.

మనదేశము నిజముగ బాగుపడవలెననిన, ఇప్పుడుద్యోగుల కిచ్చు అమితమగు జీతములఁ దగ్గింపవలెను. వైస్రాయిగారి కౌంసిల్ మెంబరుయొక్క జీతము 5360 పౌన్లు. కాని స్టేటుసెక్రెటరీగారి జీతము 5000 పౌన్లు మాత్రమే. గవర్నరుగారి కౌంసిలు మెంబరుయొక్క జీతము 4265 పౌన్లు. కాని ఇంగ్లండులో ఏశాఖయొక్క ఉన్నతాధికారికిని సాలుకు రెండువేల పౌన్లకు మించిన జీతము లేదు. సివిలియను ఉద్యోగులచే నింపబడు పైయుద్యోగముల జీతము దామాషాను సాలుకు 2000పౌన్లయియుండ, సీమలోకోశాధ్యక్షునియొద్దనుండు ప్రధానోద్యోగికి 1200 పౌన్లు మాత్రమే ఇయ్యబడును. ఇండియాలో కాలేజి ఉపాధ్యాయులుగ నుండు నాంగ్లేయులకు కడపటకు 800 పౌన్ల జీతము లభించును. కాని ఇట్టిపదవికి సీమలోని జీతము 200-500 పౌన్లకు మధ్య నుండును. ఐ. సి. ఎస్. శాఖలోని యుద్యోగులు చాలవఱకు భారతీయులే యుండునట్లు వీరి జీతములు క్రమముగ తగ్గించునట్లు మనము యత్నింపవలెను. సాలుకు పింఛన్లకు మాత్రమే 3½, 4 లక్షల పౌన్లు వ్యయ మగుచున్నవి. ఈ రెండు తరగతుల వ్యయములను వెంటనే తగ్గింపబడు మార్గములను మనము యోచింపవలయును.

సైనికవ్యయమంతయు భారతీయులే భరింప నావశ్యకము లేదు. ఇండియాను సంరక్షించు విధి సామ్రాజ్యమున కంతకును వర్తించు సామాన్యకర్తవ్య మని రాజుగారు తమ ప్రకటనమునందు నిర్వచించియున్నారు. అట్టి నిర్ణయమునుబట్టి మన కగు సైనికవ్యయములో నొకవంతు ఇంగ్లాండు భరించునట్లు మనము పోరాడవలెను.

2. ఇంక రాజధానిశాఖలను గూర్చి ఇంచుక విచారింతము. వీనిలో నధికారాయత్తముగ నున్న వానియందు ముఖ్య మయినవి ల్యాండు రెవిన్యూ పోలీసు న్యాయపరిపాలనశాఖలు. ల్యాండురివిన్యూ శాఖయందు గొప్ప మార్పులు గావలసి యున్నవి. జమీందారీ పద్ధతులలో నమలు జరుగుచున్న శాశ్వతపు సెటిల్ మెంటు రద్దు కాదగిన స్థితి ఆసన్నమయిన దని మన యభిప్రాయము. ఏలయన, ఈజమీందారీల కంతకు శాశ్వతపు పేష్కస్ నిర్ణయింపబడినపుడు, జమీందారీఆదాయము 1 వంతుగాను, పేష్కసు రెండువంతులుగాను విభజింపబడి యుండెను. కాలక్రమమున, పంటల యభివృద్ధి నీటిపారుదల సౌకర్యముల పెంపు, ధరల హెచ్చుదనము మున్నగు కారణములచే పేష్కసు 1 వంతుగను, జమీందారీ ఆదాయము నాలుగు లేక మూడువంతులుగాను పరిణమించినది. కావున పేష్కసు కనీసము ఆదాయములో సగమయినను అయియుండవలెను. ఇట్టి పద్ధతివలననే గ్రామ పారిశుద్ధ్యము ప్రాథమిక విద్యావ్యాపకము తగిన ధన సహాయమును పొంది అభివృద్ధిఁ జెందగలవు.

రైతువారీభూములను గూర్చి విశేషమగు చర్చ జరుపవలెను. ఇప్పుడు గవర్నమెంటువారు ఇష్టము వచ్చినపుడు ఇష్టమువచ్చినరీతిని రీసెటిల్ మెంట్లు చేసి భూమి

పన్నును హెచ్చింపవచ్చును. భూమిపై పన్ను అధికమయిన దనియు, దుర్భరమయినదనియు మన నమ్మకము. అట్టిచో 30 సం॥ కొకసారి రీసెటిల్‌మెంటు లుండవలెనో, దాని ఆధారము లెట్లుండవలెనో ప్రమాణము లెట్లుండవలెనో ప్రజాప్రతినిధులు శాసనసభయందు నిర్ణయించి అందుకుగాను శాసనమును గావింపవలెను. వీలయినచో 10 ఎకరములలోపు భూమి మీఁద పన్నును అసలే తీసివేయవలెను. వర్తకవ్యాపారములు చేసియు, ఉద్యోగము వడ్డీవ్యవహారములు చేసియు, సొమ్ము ఆర్జనచేయువారికి రెండు వేలరూపాయల లోపు ఆదాయముపై పన్ను వేయబడుట లేదు. అట్టిచో ఎకరము భూమి ఉన్నవానికి కూడ 2 మొదలు 6-7 రూ. వఱకు పన్ను విధించుట న్యాయ్యము కాకున్నది. భూస్వామికి ముఖ్యముగ స్వల్పభూమి గల భూస్వామికి భూమిపన్నును తప్పింపవలెను. మఱియొక ఆలోచనతట్టుచున్నది. వ్యవసాయము స్వయముగ జేయు భూస్వామికి భూమిపన్నును తగ్గించుట యుక్తము. ఎప్పుడు భూమి మీఁద విధింపదగిన ఆదాయపుపన్ను లభించునో అప్పుడు ఆ యాదాయపు పన్నునే విధింపదగును.

నీటిపారుదలవిషయములో రైతుల ఇక్కట్లుఇన్ని అని చెప్ప నలవికాదు. నీటిపారుదల పంచాయితీలు పెట్టినగాని వానిలో కొన్నిఅయినను తొలగనేరవు. అటువి పంచాయితీలు ఎంతజయప్రదముగ జరుగుచున్నదియు నెల్లరకు విశదమే. అట్లే ఈపంచాయితీలు గూడ ప్రజల సౌఖ్యమును సుపరిపాలనమును పెంపొందింపఁగలవు. ఈ పంచాయితీలతోఁ బాటు గ్రామపంచాయితీలను స్థాపించి, న్యాయపరిపాలనమును సులభసాధ్యముగను, అధికవ్యయప్రయాస రహితముగను చేయించవలెను. ఎచ్చటి వ్యాజ్యము లచ్చటనే సాటివారి సలహాతో తీర్మాన మగునపుడు అబద్ధపు సాక్ష్యములును అప్రమాణములును తగ్గిపోవును. కాలక్రమమున న్యాయపరిపాలనము నామమాత్రముననే కాక, ఆచరణయందు గూడ ప్రజలకు లభింపగలదు.

కార్యనిర్వాహణశాఖను (ఎగ్జిక్యూటివు న్యాయపరిపాలన శాఖను ఒకదానినుండి రెండవదానిని విడదీయవలెను. అనఁగా తహశ్శీలుదార్లకును, డిప్యూటీ కలక్టర్లకును, కలక్టర్లకును, మేజస్ట్రేటు అధికారము తీసివేయవలెను. ఇప్పుడు పోలీసువారి అధికారి కలక్టరు. పోలీసువారే చార్జి పెట్టెడివారు. వారి అధికారియే తీర్పుచెప్పెడివాడు. ఈసమిష్టిపద్ధతి అంతము కావలెను. మునసబులు, సబ్‌జడ్జీలు జిల్లాజడ్జీలు, మేజస్ట్రేటులు, వీరందఱు న్యాయపరిపాలనశాఖకు చెందియుండి రివెన్యూ ఇనస్పెక్టర్లు, తహశ్శీలుదార్లు, డిప్యూటీ కలక్టర్లు, జిల్లా కలక్టర్లు ఒకశాఖకు చెందియుండవలెను.

3. ప్రజాయత్తశాఖలు: వీనిలో ముఖ్యమయినది విద్య. విద్యకు వన్నె తెచ్చునది జాతీయత. దేశమునకు విద్యయొక్క ప్రయోజనము ఆవిద్య జాతీయతను నిలువబెట్టగలుగునపుడేలభింపగలుగును. స్వరాజ్యమును సంపాదించి, స్వవ్యక్తితను గోల్పోయినఁ బ్రయోజన మేమి? అట్టి వ్యక్తితను గలిగించు విద్యయే జాతీయవిద్య యనంబడు. జాతీయవిద్యను గూర్చి ఈవ్యాసమునందుఁ వ్రాయబూనుట సాధ్యమును యుక్తమును కాదు. జాతీయావబోధమును గల్గించు విద్యను పెంపొందించుట నూతనమంత్రికి కర్తవ్యము. విద్య అందఱకు అందుబాటులో నుండవలెను. ప్రాథమికవిద్య బాలికాబాలకులకు నిర్బంధముగను ఉచితమయినదిగను ఉండవలెను. మాధ్యమికవిద్యయందు జీవనోపాధిని గల్గించు సాధకములను గఱపవలెను. ఉన్నతవిద్య దేశీయపరిజ్ఞానమును పరిశోధించి పెంపొందించునదిగ నుండవలెను. ఇందుకు వలయుధనమును మాత్రము నూతనముగ పన్నులను విధించుటవలన చేకూర్ప యత్నించినను, భూమిపై దుర్భరమగు పన్నును వేయరాదు. విద్యకు సంబంధించినది సహకారోద్యమము. అది కేవలము పరపతి యభివృద్ధికొఱకే ఇంతవఱకు యత్నించియున్నది. తదితరమగు సహకార వ్యాపకమునకు మనము యత్నింపవలెను. పేదవానికి పరపతిసహాయము అందుట లేదు. మన రాజధానియందు క్రయవిక్రయముల కుద్దేశింపబడిన సంఘములు 31 ఉత్పత్తిసంఘములు 89 మాత్రమే యుండి యున్నవి. సహకారోద్యమమునందు జేరిన 127,253 వ్యవసాయకులలో 4,111 మాత్రమే పొలముమీద పనిచేయు పాటకపు జాతివారు. అనఁగా భూమిలేనివారిని సంఘములందు జేర్చికొనుట దుష్కరమగుచున్నది. ప్రతిగ్రామమునందు పరపతిసంఘములు స్థాపింపబడవలెను. భూమి తనఖాబ్యాంకులను స్థాపించుటకు వెంటనే యత్నములు జరుగవలెను. ఆంధ్రదేశమునకు ప్రత్యేకముగ రాజధాని బ్యాంకును పెట్టవలెను.

నిమ్నజాతులకు ప్రత్యేకముగ సహకారసంఘ

ములు పెట్టి వారిని పైకి లేవదీయవలెను. వారికి నివేశనస్థలములను ఇచ్చి, ఇండ్లు కట్టుకొనుటకు ప్రత్యేకపు గృహనిర్మాణ సహకారసంఘములను స్థాపించుట యావశ్యకము. వారికి పాఠశాలలు ప్రత్యేకముగ నుండరాదు. తటాకములు మున్నగు సౌకర్యములను వృద్ధిచేయుచు వీలయినంతవఱకు తక్కిన గ్రామస్థులతోఁబాటు వారికి వీనియందును విద్యాలయములయందును సామాన్యహక్కులను గలిగించవలెను. కొంత కాలమువఱకు వీరిని మ్యునిసిపాలిటీలలోను తాలూకా జిల్లాబోర్డులలోను మెంబర్లుగా దొరతనమువారే విశేషముగ నియమించుచు వారికి ప్రత్యేకపు నియోజక వర్గములు స్థాపించి వారి సంఖ్యకు ననుగుణ్యముగ వారు పరిపాలనా సభవులలో సభ్యులుగ నుండునట్లు ఏర్పాట్లు చేయుట అత్యావశ్యకము. ఇంతియ కాదు. మన దేశములో రమారమి 6 కోట్ల నిమ్నజాతిజనము కలదు. కుటుంబమునకు మొత్తము మీఁద అయిదుగురు జన ముందు రని తలంచినచో కోటి కుటుంబము లుండు నని లెక్కవేయవచ్చును. వీరికి భూవసతిని సమకూర్చుమార్గమును మనము ఆలోచింపవలెను. కుటుంబమునకు 5 ఎకరముల భూమి వేశము వీరికి ఇప్పించవలెను. మన దేశమునందు భూమికి కొఱఁత లేదు. దరఖాస్తు మీఁద మంజూరు చేయు భూములను మాలమాదిగలకే ఇయ్యవలెను. సర్కారువారు వేలమువల్ల భూములను అమ్మకుండ నిమ్నజాతులవారికే భూముల నిచ్చునట్లు ప్రోత్సాహించుట మన కర్తవ్యము. అటుపిమ్మట తక్కువయిన భూమిని మనము కొని వీరి కిప్పించవలెను. కొనుటకు సొమ్ము జాతీయ ఋణమువలన సంపాదింపవలెను. నూరుకోట్ల రూపాయల ఋణమును ప్రస్తుతము మనము తీసికొనవచ్చును. దీనిమీఁది వడ్డియే సాలుకు 5 కోట్లగును. కాని అంతమాత్రము శిక్షను దేశము వీరియెడల చిరకాలోపేక్షకు గాను భరింపవలెను.

మన మ్యునిసిపాలిటీల బిల్లు ఇప్పుడు సంస్కరణ నొందుచున్నది. మిక్కిలి అసంతృప్తికరముగ నున్నది. అచిరకాలములోనే దీనిని విరివిగ సవరించి దేశీయ సాంప్రదాయానుగుణ్యముగ స్థానికస్వపరిపాలనమును మార్పవలెను. రాధాకమలముఖర్జీవంటి పండితోత్తములు సూచించిన రీతిని స్థానిక స్వాతంత్ర్యమును గ్రామకట్టుబడిని పునరుద్ధారణ చేయవలసియున్నది. ఈ స్థానికసంస్థలపై దొరతనమువారి పైతనిఖీని త్వరలో తీసివేయ వలసి యున్నది.

వైద్యసహాయము దేశమునందు చాల తక్కువగ నున్నది. ఆంగ్ల వైద్యవిద్యాధురీణులు తగినంత వచ్చువఱకు దేశము వైద్యసహాయము లేక కాచియుండవలె ననుట హేతువిరుద్ధము. వీలయినంతవఱకు ఆయుర్వేద యునానీవిద్యలను స్థానికస్వపరిపాలనాధికారులు ఆదరించి ప్రజలకు వైద్యసౌకర్యముల నందుబాటు చేయవలెను. పిమ్మట ప్రతితాలూకాకును నొక్కొక్క స్త్రీల యాస్పత్రిని స్థాపింపవలెను. ప్రతి 3 మైళ్లకును ఒక్కొక్క ఆసుపత్రిని స్థాపించవలెను. అనఁగా ఒక ఆసుపత్రికి బోవుటకు మూడు మైళ్ల దూరముకన్న నెక్కువదూరము బోవలసి యుండకుండున ట్లుండవలెను. అప్పుడు కృష్ణాజిల్లాకు 50 ఆస్పత్రు లుండును. రెండు వేల చదరపు మైళ్ల విస్తీర్ణము గలిగి 20 లక్షల జనముగల ప్రాంతమునకు ఏబది ఆస్పత్రులు అధికము గావు.

ఒక గ్రామమునుండి వేఱొక గ్రామమునకు పోవు మార్గములలో వెంటనే రోడ్లు వేయవలెను. పంట కాలువల పైనను మురుగుకాలువల పైనను తక్షణమే బల్లకట్టులను వైచి వీలయినచోట్ల నెల్ల వంతెనలు గట్టవలెను. గ్రామ పారిశుద్ధ్యమును పెంపొందించుటకు దేశమునం దెల్ల నారోగ్యసంఘములను స్థాపించి గ్రామోపాధ్యాయుల మూలమునను గ్రామోద్యోగుల మూలమునను పరపతిసంఘము యొక్కయు ఇతర విధములగునట్టియు పంచాయతీదార్ల మూలమునను ఆరోగ్యాభివృద్ధికరమగు బోధనను ప్రజలకు చేయించవలెను.

కాని యీయత్నములన్నియు సఫలము లగుటకు ప్రజలు తమ దురభ్యాసములను త్యజింపవలెను. మద్యపానము దురభ్యాసములలో మొదటిది. మన మంత్రి 20 సంవత్సరములలో మద్యపానమువలన లభించు రివిన్యూనంతను గోల్పోవలెను. సాలుకు నాలుగున్నరకోట్ల ఆదాయము వచ్చుచున్నది. సాలుకు 20 లక్షల చొ॥ తగ్గించుకొనుచు బోయినయెడల ఇరువది సంవత్సరములలో నీయాదాయము సమసిపోవును. అప్పటికి మద్యపానము నిర్మూలము కావలెను. ఇది గొప్ప మార్పు. ఇంతటిఆదాయము అన్యమార్గములసంపాదించుట కష్టము ప్రజలు తమ దురభ్యాసములను మానుటయుఁ గష్టము. కాని స్వపరిపాలనమే కష్టము. అధికారము మన చేతికి వచ్చిన పిమ్మట సొమ్మే ప్రధానముగ మనము చూడరాదు. ప్రజల శ్రేయస్సే పరమప్రమాణమును ప్రధా

నమును అయియున్నది.

కట్టకడపటి మార్పు కూలివాని స్థితిని సంస్కరించుట. దినమునకు కూలివాఁడు ఎనిమిది గంటల కన్నను ఎక్కువకాలము పని చేయరాదు. వాని జీతము వానికి సరిపోయి యుండవలెను. వారములో ఒకటిన్నర రోజు సెలవు ఉండవలెను. 12 ఏండ్లలోపు వయస్సుగల పిల్లలను పనిలోనికి రానీయరాదు. ఫ్యాక్టరీలయందు పని చేయువారికి తగు నివాస సౌకర్యములు నుండవలెను.

రాబోవు పది సంవత్సరములలో మనము చేయవలసిన మార్పులను కొన్నిటిని మాత్రమే ఇక్కడ సూచించితిని. ఈ పట్టీ సంపూర్ణమైనది కాదు. దీని పూర్వపక్ష సిద్ధాంతముల నిచ్చట జర్చించుట కవకాశము లేదు. వోట్లనిచ్చువారెల్లరు అభ్యర్థులను ప్రశ్నించుటకు మాత్రము ఇవి కొన్ని గుర్తులుగ నుండగల వను నమ్మకముతో వీని నిచ్చట పొందుపఱచితిని.

# తిక్కయజ్వస్మృతి

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహదరు గారు

ఆంధ్ర దేశీయుల కఖిలార్థదంబుఁ గాఁ
బంచమ వేదంబుఁ బ్రబలఁ జేసి
అసమానధోరణి నసమానకవితచే
భాషాపతిత్వంబుఁ బ్రౌఢిఁ గాంచి
మంజులపద వినిర్మాణ పాటవముచేఁ
జతురాస్యభావంబు సంతరించి
సకలార్థవిజ్ఞాన చాతురీమహిమచే
సురబుధజ్యేష్ఠత నొప్పు మీఱి

గీ. హరిహరారాధనైకతత్పరత మించు
నల పురాణకవిబ్రహ్మ నభినుతింతు
నస్మదాదుల కెల్ల నుపాస్యుఁ డయిన
శుభగుణవిరాజి తిక్కన సోమయాజి.

చ. కవులకుఁ బట్టుకొమ్మ, నుడికారపు శైలికి మార్గదర్శి, శా
త్రవులకు నంకుశంబు, ఘనకావ్యగుణంబుల కాటపట్టు, శా
స్త్రవ పదభంగచాతురి కుదారనిదాన, మనంతధైర్యవై
భవమున కాస్పదంబు నగు భారత మీతని జిహ్వఁ బుట్టదే?

మ. స్మృతు లెల్లన్ శ్రుతిమార్గముం బలె నవిచ్ఛిన్నానురక్తిన్, సము
న్నతవైయాకరణప్రసంగమున, ఛందఃప్రక్రియన్ శబ్దసా
ధుత, నుర్విం గవు లెల్ల నెవ్వనివచస్తోమంబు శుంభత్ప్రమా
ణత మన్నించెద రట్టి తిక్కనకవి న్వర్ణింప శక్తుండనే?

చ. దివి బుధవర్యులం దన యుదీర్ణహవిర్మధురాశనంబునన్
నవరసతృప్తులం జలిపి నర్మిలి యజ్వపదంబుఁ గాంచఁ గా
భువి బుధవర్యులం దన యమూల్యవిశుద్ధ వచోమృతంబునన్
నవరసతృప్తులం జలిపి నవ్యకవీంద్రపదంబుఁ గాంచఁడే?

ఉ. వ్యాసమహర్షి చేతను సెబాసను వన్నియఁ దెచ్చి యంత నీ
చేసినకట్ట మర్వర రచింప నొనర్చి జనంబులందుఁ జే
ర్వాసి గడించి, యా ప్రకటవర్ధితపూర్ణయశోధనంబు స్వ
ర్వాసమునందుఁ గాశ్యపిని వడ్డి కొసంగితి మేలు తిక్కనా!

ఉ. ఎన్ని సమంబు లేఁగఁ గవు లెందఱు పుట్టిరి, కావ్యరాజు లు
త్పన్నము లయ్యె నెన్ని, నృపవర్యు లమన్ననఁ గన్న వెన్ని, వి
ద్వన్నుతిపాత్రమై కడు ముదం బిడు నెన్ని, కనంగ నందుఁ ది
క్కన్న! త్వదీయకావ్యములకన్నను మిన్నలఁ గాన నెన్నఁగన్.

చ. ఒకఁడు తెనుంగునందున, మఱొక్కఁడు సంస్కృతమందు, ధర్మమం
దొకఁడును, న్యాయమందొకఁడు, నొక్కఁ డలంకరణంబునందు, వే
దొకఁడు సుశయ్యలం గృతుల నొయ్యన వేలము లాచరించి, నీ
వొకఁడవె తిక్కనా! సకల మొప్పుగఁ జూపితి భారతమ్మునన్.

చ. కృతు లొనరించి యెక్కు డగు కీర్తిఁ గాంచితి కేవలార్యస
త్కృతిని గృతిత్వముం గని కృతికర్తకు నెంతయే మహో
న్నతయశముల్ ఘటించితి, గుణంబు గణించి గణంబు డించి తీ
వ్రతులకవిత్వతత్వపటిమాతిశయంబును గంటి తిక్కనా!

శా. ఉర్విన్ త్వద్రచితాంధ్రభారతము నోహో! చూపుకొం చెప్పుడున్
గర్వంబున్ వహియించుచుండు మిట నిక్కాలంబునన్ మూర్తితో
సర్వజ్ఞుండవు నీవ యున్న యెడ నిచ్చ నిన్ను నాపించు మా
గర్వప్రక్రియ కింత మేర గలదే కన్గొన్న నో తిక్కనా!

మ. పితరులనున్ బితామహులఁ బృథ్విఁ జిరంబు సజీవులై మహో
న్నతదశ నుండఁ గోరుదు మనారతమున్ బ్రకృతిప్రకార మీ
గతిఁ జనుచుండు దీనికి వగన్ బొగులన్ దగ దెందు నందు నం
చితమృతజీవమూర్తి వని చెందుదు నెందు నమందమోదమున్.

ఉ. పంచమవేదమై పరగు భారతసంహిత నాంధ్రభాషఁ గా
వించితి వంచు, యజ్వ వని పేర్మి సురేశుఁడు స్వర్గమందుఁ బూ
జించుచు నిల్పె దేవగురుచిత్తము శాంతివహింపఁ దోడుగా;
వంచన నాటగోలె సుఖపం దలపోయరు వైరు లెన్నఁడున్.

ఉ. తిక్కన! నీప్రయోగమె నుతింపఁగ నెల్లెడ నాంధ్రభాషకుం
దిక్కనఁ జెల్లు, నీదగు కృతిప్రకరంబులె దుర్వివాదపుం
దిక్కు నణంచు, నెక్కుడుగఁ దెల్పఁగ నేటికి లోకమందు నీ
చక్కనిపేరె సత్కవుల స్వాంతమునం జెదరాయకుండెడున్.

మ. తిగకన్నంటకుఁ దిక్క నంచు జను లాడిన్ దప్పుగా నాడిరో?
తగఁ ద్ర్యక్షుం డనఁ దిక్కనంచుఁ దొలుతం దబ్బిబ్బుగాఁ బల్కు
భగవంతుం డగు తండ్రి పిన్నటను బిల్వన్వాసిఁ గన్నట్టి మ [రో
ద్దగు పేరో? ఎది యెట్లు లైన శివనామాంకుండవే తిక్కనా!

క. బ్రహ్మకు మారట మిగులన్
బ్రహ్మజ్ఞానంబు గల్గి వసుధాస్థలి సు
బ్రాహ్మణుఁడ వగుచును గవి
బ్రహ్మ వయితి తిక్కనార్య ప్రస్తుతిఁ గనుచున్.

క. నీవలె వ్రాసితి నన్నన్
నీవలెనే వ్రాయుచుంటి నే నన మఱియున్
నీవలె వ్రాయుదు ననినన్
"నీ" వలెఁ దల వంచెదరు మనీషులు వానిన్.

# చెత్తయొక్క చిత్రము — ప్రత్తిగింజల నూనె

తేకుమళ్ల వెంకాజీ గారు

హిందూదేశము పరిశ్రమలలో నానాఁటికి వెనుకఁబడుచున్నది. సమస్తపదార్థములకుఁ బుట్టినిల్లయినను స్వతంత్రముగ నొక్క పరిశ్రమను నయినను నిర్వహింపలేకున్నది. పూర్వము ప్రపంచ మంతకును మనదేశపు దుస్తులను బంపి ఎంతయో వన్నెకెక్కిన ఈ హిందూదేశము ప్రపంచమం దంతకును హీనస్థితిలో నుండుట యెంత శోచనీయము! ప్రత్తికాడలనుండి కాగితముల నెట్లు తయారుచేయఁగలమో గతవత్సరము ముచ్చటించి యుంటిని. ఇంకను ఆ విత్తులవలన హిందూదేశమునకు ధనము నెట్లు చేకూర్పవచ్చునో యోజింతము. మనము ఈ విత్తులను నిష్ప్రయోజనముగ పాడుచేయుదుము. ఇట్లు చెత్తగ పాఱఁబోయువిత్తులను ఇతరదేశస్థు లెవ్విధమున నుపయోగపఱచి ధనమును సంపాదించి వారి శ్రామికవిద్యను, వారి స్వదేశపరిశ్రమల నెట్లభివృద్ధి నొందించుకొనుచున్నారో చూతము.

హిందూదేశమం దంతకును, పేరునకుఁ దగిన ప్రత్తివిత్తుల యంత్రము పరిశ్రమ యెచ్చటను గానరాదు. ఏదో యొక మాఱుమూల నొకటి సుతారియా కంపెనీవారిచే నడుపఁబడుచున్నది. కాని యిల్లలికినంతనే పండుగ యగునా? ఒకటి ఉండిన మన కున్న సౌభాగ్య మేమి? అదియును మనచేతులలో లేదు. మనవారిచే నడుపఁబడుట లేదు.

మొన్న మొన్నటివఱకు ఈప్రత్తివిత్తులు దూది యంత్రములయొద్ద చెత్తగా పాఱవేయఁబడుచుండెడివి. ఈచెత్త నెట్లు తొలఁగించుట యనునది యొక గొప్ప క్లిష్టతమ మగు యత్న మయ్యెడిది. ఈచెత్త చుట్టుప్రక్కల నివసించు ప్రజలకు బాధకరముగా నుండెడిది. దీనిని తొలఁగింపవలయు నని కొన్ని శాసనములు కూడ ఏర్పడినవి. దానంజేసియే యంత్రకారులు నదులు కాలువలు మున్నగువారి ప్రక్కన వారి యంత్రముల స్థాపించి ఈచెత్త నానదీప్రవాహమువలన తీసివేయుచుండెడివారు. కాని ఈచెత్తయొక్క విచిత్రమగు మహిమను గ్రహించి అమెరికావారు చేసిన యత్నముల నందులకు వలయు పరికరములను యంత్రములను జూచిన మన మచ్చెరువు నొందకతప్పదు.

ప్రతివత్సరము ప్రత్తిపంట అపరిమితముగా హెచ్చుచున్నది. ఆకారణముచేతనే ప్రత్తివిత్తులుకూడ అపరిమితముగా హెచ్చయినవి. వీని నన్నిటిని పాఱవేయుట యొక సమంజస మయిన పని కాదు. వ్యవహారముపట్ల జరుపవలసిన పని కాదు. ఏదోవిధముగ నీచెత్తవలన నుపయోగము పొందవలెను. ఈ విషయమయి యాంకీ కంపెనీవారు తీవ్రముగా నాలోచింపఁగా ఈ విత్తులలో నొకవిధమయిన విలువ గల చమురు గలదనియు ఆపప్పు పొట్టు గొడ్లకు నుపయోగింపవచ్చు ననియు తేలినది. క్రమముగ ఇందలి చమురును తీయుటకు యంత్రముపైని యంత్రములు స్థాపింపఁబడెను. ప్రస్తుతము అమెరికాలో 400 యంత్రములు కలవు. పెట్టుబడి, పెట్టినవారికిని వానిని నడిపించువారికిని చాల లాభము గలుగుచున్న దని తెలియుచున్నది. గొప్పవారందఱు ఈ యత్నమును జూచి నివ్వెరపాటు నొందిరి. నిష్ప్రయోజన మని పాఱవేయబడిన రాళ్లే కదా మేడలను నిర్మించునది. ఈసామెత ఈయత్నములో సఫలమయిన దని జియోర్జియా సంస్థానపు వ్యవసాయకళాశాలలోని డాక్టరు సౌలిగారు నుడివియున్నారు. పూర్వము ముసలమ్మకథలో చింపిరితలమష్టికుఱ్ఱవాఁడు గొప్ప రాజగుట నమ్మఁదగినది కాదంటిమి. కాని ఇంత తుచ్ఛముగ పాఱవేయఁబడినవిత్తులు ఇంతగ నుపయోగపడుట చూడ నాశ్చర్యముగా నున్నది. ఈ యుపయోగము ఒక్కచోటనే కాకుండ ప్రతిదేశమునకును ప్రపంచమంతకును చెందినదై యున్నది. ఈపరిశ్రమవలన, సౌతు

లాండు ప్రతివత్సరము 450 లక్షల రూపాయలను సంపాదించుచున్న దని వినుచున్నాము. సుమారు 40 వేలు 50 వేల కూలీల కీ పరిశ్రమ జీవనోపాధిగా నున్నది. మన జీవనోపాధికి తగిన యేర్పాటు గలుగు చున్నది. మెత్తని తివాసీలు మొదలగువానిని తయారు చేయుటకు తగిన పదార్థము నిచ్చుచున్నది, ఈ పరిశ్రమయే సబ్బు మొదలగు వానిని తయారు చేయుటకు సహాయపడు పదార్థముల నిచ్చుచున్నది. ఇంకను ఈ పరిశ్రమము లనేకవిధముల మనకు తోడ్పడుచున్నవి. పెక్కు వేల పరిశ్రమలకు సహాయభూతముగా నున్నది.

ఈ క్రింది పట్టికవలన నీ పరిశ్రమము అమెరికాలో నెంత యభివృద్ధి నొందినదో తెలియుచున్నది.

| సం॥ రం | యంత్రముల సంఖ్య | ప్రత్తివిత్తుల పంట టన్నులలో | యంత్రము వలన పాట్టు జేయ బడిన విత్తులు టన్నులు | పిండిచేయ బడిన విత్తుల మొత్తము 100 కి చొప్పున |
|---|---|---|---|---|
| 1878 | 30 | 1,300,000 | 52,000 | 4 |
| 1880 | 45 | 2,600,000 | 286,000 | 11 |
| 1890 | 115 | 3,500,000 | 910,000 | 26 |
| 1900 | 357 | 4,700,000 | 2,820,000 | 60 |
| 1910 | 8[illegible]6 | 4,500,000 | 3,269,000 | 7[illegible] |
| 1914 | 885 | | | |

ఈ పరిశ్రమమువలనఁ గలుగు లాభములను పర్యాలోచించి ఈ పరిశ్రమను యూరపుదేశమందలి అన్ని జాతులవారును యంత్రముల స్థాపించి లాభమును పొందుచున్నారు. ఈ క్రింది పట్టికవలన ప్రపంచములోని దేశము లెన్నెన్ని యంత్రములను 1914 సం॥ రమునకు కలిగియున్నారో తెలియుచున్నది.

1914 సం॥రమునకు ప్రపంచములో నున్న ప్రత్తి విత్తుల యంత్రముల సంఖ్య:—

అమెరికాదేశము 885, ఇంగ్లాండు 50, రష్యా 32, పెరూ 11, జెర్మనీ 9, చైనా 9, బ్రేజిలు 7, ఫ్రాంసు 4, ఈజిప్టు 4, టర్కీ (ఆసియాలోనిది) 4, మెక్సికో 1, ఆస్ట్రియా 1, ఛిలీ 1, హిందూదేశము 1, మొత్తం 10,19.

కొన్ని దేశములలో యంత్రములు కేవలము ప్రత్తివిత్తులనుండి నూనెనే తీయక ఇతర విత్తులనుండి కూడ నూనెను తీయుచున్నారు.

ప్రత్తిపంటలో అమెరికాతరువాత రెండవది హిందూదేశమే. అక్కతన, యంత్రము లుండుటలో కూడ మనదేశము ఆవిధముగనే రెండవదిగ నుండవలసి యున్నది. కాని మన దురదృష్టవశమున, ఒక ప్రత్తికాడ యయిన పండని ప్రదేశము దీనికి వలయు విత్తులు మొదలగువానికై ఈజిప్టు హిందూదేశముపై నాధారపడి యున్న యింగ్లాండు మన స్థలము అనగా రెండవస్థలము నాక్రమించియున్నది. ఇంతకన్న దరిద్రమేమన, రష్యా, టర్కీలు కూడ మనల నీ పరిశ్రమలలో నణఁగఁ ద్రొక్కఁ గలిగియున్నవి. మనకన్న నాగరికత లేనివై మన కున్న పంటలో నూఱవవంతయిన పంట లేని యీదేశములు మన పైస్థానముల నాక్రమించుకొని యున్నవి. ఈ పరిశ్రమలో కూడ మనదేశము చివర నేడ్వవలసినదేనా? మన కింక మోక్షము లేదా?

### పశువుల కాహారము

ఇందులకు కారణ మేమన, మనదేశములో నీని నేవిధముగ నుపయోగించుచున్నారో యోజించినఁ దెలియును. సాలునకు నగుటున 16 లక్షల టన్నుల ప్రత్తి విత్తులు మన దేశములో తయారగుచున్నవి. ఇందులో పదవవంతు నాటుట కుపయోగించెదము. 2,50,000 టన్నులు ప్రతి సంవత్సరమును యూరపుదేశముల కెగుమతి యగుచున్నది. అందులో ముఖ్యముగా నింగ్లాండు నకే యెగుమతి యంతయును. ఇంకను సుమారు 12లక్షల టన్నులు మనదేశములో మిగిలిపోవుచున్నవి. ఇవి యేమగుచున్నవో వివరముగా తెలియదు కాని, పశువులకు మేతగా నుపయోగపడుచున్న వని చెప్పవచ్చును.

అమెరికాలో నీ విత్తులు పనికిరాని వని తలంచుట వలన దాని నెట్లుపయోగపఱుచుట యని యాలోచన పుట్టినది. కాని, ఇండియాలో నేదో విధముగ నుపయోగపడుటవలన, దాని నెట్లు ఎక్కుడుగ నుపయోగ పఱుపవలె నని యాలోచన మైన కలుగుట కవకాశము లేదు. అందుచేతనే మన మిం యధోగతికి లోఁబడి యున్నాము. పశువులకు మేతగా నుపయోగించుట వలన నష్టమేమి యని మీరడుగవచ్చును. ఈ విషయమును గూర్చి (Neol Paton) నియాల్ పేటను గారిట్లు

నుడివియున్నారు. "పశువుల మేతక్రింద నీవిత్తుల నుప యోగించుచున్నాము. కొందఱు యంత్రములవలన పిండి చేసి,నూనె తయారుచేసిన లాభ మేమి? యనిన న్నడుగు చున్నారు. విత్తులరూపమున పశువులకు బెట్టిన జీర్ణింపఁ జేసికొనుట చాల కష్ట మయిన పని. నూనెకూడ సంపా దించుటవలన, ధనలాభము గలదు. పశువుల కారోగ్య లాభము గలదు. విత్తులలోని నూనెను పశువుల శరీర మున కేదో విధముగ నుపయోగింపక చాల భాగము నూనె, మలమూత్రముల మూలమున బయటకు వచ్చు చున్నది.

ఈ పరిశ్రమవలన, చాల విలువ అయిన పశు వులమేత పోవు నని కొందఱు వివరింతురు. కాని యెన్ని యంత్రములవలన తీసినను నూటికి 12 వ వంతు నూనె మనకు వచ్చును. తక్కిన 88 వంతులు ఏదో విధమున పశువుల కాహార మగుచునే యున్నది. అందుచేత ఈ పరిశ్రమవలన, పశువులమేత ఏమాత్రము నష్టము కాకుండుటయే గాక, దేశమునకు ధనముకూడ చేరును. ఈ క్రింది పట్టికను బట్టి మనకు కలుగు లాభములను ఊహింపవచ్చును.

12 లక్షల టన్నుల విత్తులు, టన్ను రూ 450 ల విలువ చొప్పున, 120,000 టన్నుల నూనె నిచ్చును. దాని ఖరీదు—రూ. 5,40,00,000.

530,000 టన్నుల పొట్టు తీసిన కప్పు తయా రగును. టన్ను 1-కి రూ 50 లు—దాని ఖరీదు రూ. 2,65,00,000.

550,000 టన్నుల పైపెచ్చు తయారగును. టన్ను 1-కి రూ 20 లు. దాని ఖరీదు-రూ. 1,10,00000.

విత్తులవలన కలిగిన పదార్థముల విలువ— రూ. 9,15,00,000.

ఇందులకు 12,00,000 టన్నుల విత్తు లవసరము కదా. టన్ను 1-కి రూ 50 ల చొప్పున, దాని ఖరీదు- రూ. 6,00,00,000.

మనకు ఖర్చులు పోను కలుగు లాభము— రూ. 3,15,00,000.

ఈ 3 కోట్ల రూపాయిలు మనకు రావలసినది పశువుల మేతక్రింద పోవుచున్నది.

ఇదియును గాక, పశువులకు వలయునది పై పొట్టే గాని విత్తంతయు నవసరము కాదు. ఈ కఱవు దినములలో ఇంత నష్టముపైని ఇంత యనవసరపు తిండి నెవరు ఉపయోగింతురో తెలియకున్నది. దీనిని జా గ్రత్తపఱచి, యుపయోగానుపయోగములను గ్రహించి, సర్కారువా రుపయోగపఱచుటవలననే 1912, 1915 సం॥లలో గుజరాతులోను, 1913 వ సం॥లో అహ మ్మదు నగరములలోను కలిగిన కాటకములలో చాల వఱకు సహాయపడఁగలిగెఁ.

అమెరికాలో పశువులకు ఈ పైపొట్టును మాత్రమే యుపయోగింతురు. 1912—13 సం॥ లో నీ పొట్టు మా త్రమే తిండిగా నుపయోగించిన నష్ట ముండునేమో యని ప్రయత్నములు జరుపఁబడెను. ఏమియు నష్ట ముండ దనియు, విత్తులు పూర్తిగ మేతకై వదలివేయుట యనవసర మనియు నష్టదాయక మనియు వారు చ్చిరి:-

ఇతర దేశములలో నీపరిశ్రమ యెట్లభివృద్ధి పొందు చున్నదియుఁ జూడుఁడు. వారు తయారుచేయు నూనె కాక ఇఁకను వారికి ఎక్కువనూనె కావలసి యున్నది. కావున మన దేశములో పరిశ్రమకు ఇంత ప్రోత్సాహము లేకపోయినను, మనము తయారుచేయు నూనె ఇతర దేశ ములలో కొనబడి యగును. ఈ క్రింది పట్టికవలన అమెరికాదేశములో సాలున కెంతనూనె దిగుమతి యగు నో తెలియును.

| | 1911 టన్నులు | 1912 టన్నులు | 1913 టన్నులు | 1914 టన్నులు | 1915 టన్నులు |
|---|---|---|---|---|---|
| ప్రత్తివిత్తుల నూనె-ముడిసరకు | 8,558 | 6,168 | 1,070 | 8,114 | 4,080 |
| ,, సాఫుచేసినది | 21,909 | 2,666 | 16,586 | 19,866 | 88,771 |
| ,, పిండి | 199,087 | 281,890 | 286,723 | 183,169 | 217,464 |

ఇంకను, మనదేశములో తయారగు నూనె ఇతర దేశములకంటె నెక్కువ ప్రశస్తముగఁ జేయుటకు వీలు కలదు. ఏల యన, ఈ ప్రత్తివిత్తులు రాకపోక లలో వేడిమికి తాఁకుడువలన చెడిపోవుననియును, అందు వలన ప్రశస్తమయిన నూనె దొరక దనియు, ఆ నూనె ఇంచుక వాసన చెడు ననియుఁ గొందఱు వ్రాయు చున్నారు.

ఆ విధమునఁ గాక, ప్రత్తిలోనుంచి గింజలు తీసిన తోడనే, నూనె తయారుచేసిన, ఆ నూనె సర్వవిధములఁ నేతిక్రింద నుపయోగింపవచ్చును. సబ్బులు మొదలగు పరిశ్రమలకు ఉపయోగపడును.

కమర్షలు ఇంటెలిజెన్సు డిపార్టుమెంటు వారు ఈ విషయమై రెండు ఇబ్బందులను సూచించి యున్నారు: 1. విత్తుల రాకపోకలయందును నూనెమెగుమతులందును పన్ను హెచ్చుగ నున్నది. 2. విత్తుల మెగుమతి చాల చవుక. నూనెను డబ్బాలలో పోసి రవాణా చేయుటకు తయారుచేయు ఇబ్బంది.

మొదటిది ప్రస్తుతము మన రాజ్యాంగస్థితులందు మన దేశవర్తకపద్ధతులను బట్టి మన మేమి చేయుటకు వీలు లేదు. ఎగుమతిదిగుమతులకు గల కష్టములు. ఈ నూనెయొక్క చవుకధరలలో కొట్టుకొని పోవును, మూఁడవది అలవాటుమీఁద కుదురును. ఈయిబ్బందులు ఒక లెక్కలోనికిఁ దెచ్చి మన పరిశ్రమలయొక్క భావిస్థితిని డెఁడఁగొట్టుట ధర్మము కాదు.

కావున నో సోదరులారా! చేతులార నీ ధనమును గోల్పోయి, "మనకుఁ బరిశ్రమలు లేవు, మనకు స్వాతంత్ర్యము లేదు, మా కది లేదు. మా కిది లేదు. మా కిదియున్న నెంత చేయుదుమో? మా కదియున్న నెం తెంత ఘనకార్యము లొనరించెదమో" యను నుత్తరకుమార ప్రజ్ఞలతోఁ బనిఁ యేల? కాల మేల వ్యర్థపుచ్చెదరు? సభలపైని సభలు జరుగుచునే యున్నవి. వేనకువేలు ధనము వెచ్చించుచున్నారు. ఇందువలన సభలు వల దని నా యభిప్రాయముకాదు. కాని సభల జరుపుట వేలము వెఱ్ఱిగా నయినది. ఒక్కొక్క సభకు వందలు గావు; వేలు ఖర్చగుచున్నవి. కార్యశూరత్వము క్షీణించుచున్నది. నిష్ప్రయోజన ప్రసంగములు హెచ్చినవి.

కాలము విలువ గలది. ఇఁకనయిన కాలయాపన మొనరింపక, కార్యశూరత్వమునకు గడంగుఁడు. ఈ పరిశ్రమకు పెట్టుబడి యంతగా ననవసరము. ఫల మధికము. కావున నాంధ్ర సోదరులు ఈ విషయమును గూర్చి జక్కగ పర్యాలోచనముఁ జేసి యితర దేశీయులు మన దేశమునకు వచ్చి యీపరిశ్రమ నభివృద్ధిఁ జేయ సమకట్టియున్నారని గుర్తెఱింగి ఆలాభము మన దేశమునుండిబయటకు పోనీయక ఆపరిశ్రమము నభివృద్ధి చేసి రను కీర్తి మన యాంధ్ర దేశమును దాఁటనీయక ఆంధ్రమాతకు యశస్సును సంపాదించెదరు గాక!

## ఆమని

బులుసు రామజోగరావు గారు

చిగురుం గైదువుజోదు ప్రేమసఖుడై ♦ చెన్నారు వాసంతబాం
ధవుడై క్రీడలుసల్పు మారుతుని శ్ర ♦ ద్ధాభక్తి నీరార్చుచున్
ధవళాంభోజపుపాత్తులన్ బొదవి వే ♦ ధాత్రీజముల్ లాలి రా
ఘవ యంచున్ జివురాకు నుయ్యెలను బా ♦ గానుంచి పాడున్ మహిన్.

# భరతఖండపు గ్రామముల స్థితిగతులు

కొమ్మాజోశ్యుల జగన్నాథం గారు, బి. ఏ.

## ప్రాచీనస్థితి

గ్రామప్రభుత్వము:— ప్రతి గ్రామమునకు భుక్త నాయుడు, పటేలు మున్నగు స్థానిక నామములతో ఒక అధికారి యుండెడివాడు. అతనికి సహకారిగా వ్రాతకోతలు జరిగించుటకు ఒక కరణము ఉండెడివాడు. వీ రిద్దరును కలిసి గ్రామము మొత్తముపైని సర్కారుకు కట్టవలసిన పైకమును పరిష్కారము చేసుకొని ఆ యా తరుణములలో కట్టుచుండువారు. ఏవేని పెద్ద అవాంతరములు బందిపోటు (హత్య) మొదలైన (క్రూరకర్మలు) జరిగినప్పుడు, పై అధికారులకు తెలియ చేయుట, దోషులను పట్టి శిక్షించుటలో వారికి సహాయము చేయుట, ఇవి వీరికి సాధారణముగా చేయఁదగిన పనులు. తక్కిన విషయము లన్నియు, పై యధికారుల సహాయము లేకయే వీరు నెఱవేర్చుకొనుచుండిరి. ఈ గ్రామ ప్రభువు లెంతమాత్రమును సర్కారుచే నియమింపబడినవారు కారు. గ్రామస్థు లందఱకు వీరు జామీనుగా నుండి, గ్రామ సౌకర్యమును గురించి సర్కారుకు జవాబుదారు లగుచుండిరి. వేతన పూర్వకమైనది గాక వీరి యుద్యోగము గౌరవపూర్వకమైనదై యుండెను.

పన్నులు, న్యాయపరిపాలన:-పూర్వము సర్కారుకు ఇయ్యవలసిన మొత్తము పన్నులో గ్రామములోని యేయే రయితు లెంతెంత చెల్లించవలెనో, ఏయే పొలములకు ఎంతెంత నీరు పారించుకొనవలెనో, మొదలుగాగల విషయములు తమలో తామే యేర్పాటు చేసుకొనెడివారు. చిన్నచిన్న నేరములు జరిగినప్పుడు, గ్రామాధికారి గ్రామస్థుల సమక్షమున ఆ నేరములను విచారణ జేసి, నేరముచేసినవానికి దండము విధించుచుండెను. బొండకొయ్యలో నుంచుట, కొరడా దెబ్బలు కొట్టించుట, ఫిర్యాదికి పరిహార మిప్పించుట, ముద్దాయికి జరిమానా వేయుట మొదలగు దండనలను విధించు వాడుక కలదు. సివిల్ తగాదాలు గ్రామాధికారివలన గాని, పంచాయితీ మూలమున గాని పరిష్కరింపబడుచుండును. ఇప్పటి కోర్టు తీర్పులవలె సంవత్సరములు పట్టక, ఎప్పటి తగాదాలు అప్పుడే తీర్పఁబడి తత్క్షణమే అమలు జరుపబడుచుండెను. రాజు ఎక్కడ నున్నది గ్రామస్థులకు బొత్తుగ తెలియదు. నాయుఁడు కరణములే వారికి ప్రభువులు. ఇట్టి ప్రభుత్వమును దాల్చినను, గ్రామాధికారులు, గర్వితులై వర్తింపక న్యాయాన్యాయముల సమముగ పరిశీలించి న్యాయ్యమార్గముఁ జూపుచు తమ గ్రామస్థుల యభివృద్ధియే ముఖ్యోద్దేశముగఁ బెట్టుకొని, పాలించుచుండిరి. అట్టిన్యాయ పరిపాలనము జరుగుచుండుటచేత, ప్రజలుకూడ ఈ యధికారులయెడల భక్తి విశ్వాసములు కలిగి తమతోడి గ్రామస్థులయెడల దయాపూర్వకముగ నడచుకొనుచు, అధికారులు చేసెడు మేలులను పొందుచు, అభివృద్ధిఁ జెందుచుండిరి.

వ్యవసాయము:—పూర్వము ఇప్పటివలె అసామివారీ భూములు స్థిరపంపకములు చేయబడ లేదు. పంట పరిమితిని బట్టియు, వాటి నీరసనసరసములు చూచియును భూములను చరపంపకము వేసి, చీట్ల మూలముగా ఎవరికి వచ్చినది వారు 5 లేక 10 సంవత్సరములు సాగు చేసుకొని అనుభవించుచుండెడివారు. నియమితకాలము పూర్తి కాఁగానే తిరిగి పూర్వపురీతిని చరపంపకము చేసికొనుచుండిరి. చెఱువులు, ఏటికాలువలు కొండవాగులు మొదలుగాగల జలాధారములు గ్రామస్థులందఱు సాముదాయికముగా మరమ్మత్తు చేసికొని గ్రామపొలము లన్నింటిని తడుపుకొనుచుండిరి. బీడు భూములు గ్రామస్థులందఱికిని దామాయిషీగా నుండును. గ్రామములో ఉండెడి పసువు లన్నింటిని యాబీళ్లలోనే మేపుకొనువారు. ఎక్కువ పసువు లున్నవారికిని తక్కువగా నున్నవారికిని విచక్షణ లేదు. ఇవికాక గ్రామ సమిష్టిని తోటలుకూడ నుండెడివి. భూము లే గ్రామమున నున్న భూమి ఖామందులు కూడ ఆ గ్రామముననే యుందురు. భూము లొకచోటను భూమి ఖామందు లొకచోటను ఉండుట చాల యరుదు.

గ్రామరక్షణము:—హైందవ ప్రభుత్వములో

బందిపోటుమూకలు పితూరీదార్లు అంతగా ఉన్నట్టు
కానరాదు. మహమ్మదీయ ప్రభుత్వ మారంభించినది
మొదలు (అనగా ద్వంద్వప్రభుత్వములు అచిర ప్రభుత్వ
ములు ప్రబలినది మొదలు) బందిపోటు మూకలు అధిక
మయి గ్రామస్థులను బాధపెట్టి దోచుకొనెడివి. అప్పు
టిలో గ్రామముచుట్టు దిట్టమైన మట్టిగోడలు పెట్టి
ద్వారము లెత్తి గోడలపైని ముండ్లకంచెలను నాటి
గ్రామములో చేవ గలవా రందఱు ఆయుధపాణులై,
గోడ లెక్కి శత్రువులను పారదోలి పశువులను పంట
లను మానధనములను కాపాడుకొనెడివారు. గ్రామ
ములు కేవలము చిన్నవై దోపిడిగాండ్ర సంఖ్య అధి
కమై అధైర్యము కలిగినప్పుడు, గ్రామము మొత్తము
పైని కొంత సొమ్ము లేవనెత్తి దాని నా దోపిడిగాండ్ర
కు ఇచ్చి పరిమితకాలమువఱకు తమ గ్రామముపైకి
రాకుండునట్లు కట్టడ చేసుకొందురు. బందిపోటు
మూకలు వచ్చెడు సంగతి ముందుగా తెలిసినయెడల
ఇరుగుపొరుగున నున్న నాలుగైదు గ్రామములవారు
కలిసి వానిని పారతోలెడువారు.

గ్రామములోని యువకు లందఱు కలిసి రాత్రుల
యందు గ్రామములో గస్తి తిరుగుచు మధ్యమధ్యను
గ్రామస్థులను హెచ్చరించు వాడుక కలదు. కన్నగాండ్రు
దొంగలగుంపులు ఆ యా ప్రాంతములయందు తిరుగు
చున్నట్లు తెలిసినప్పుడు గస్తి తిరగడము చాల జాగ
రూకతతో జరిపెడివారు. యువకు లందఱును గ్రామ
చావడిలో చేరి జట్టులుగా ఏర్పడి, జామున కొక్క
జట్టుచొప్పున గస్తి తిరుగుట కేర్పాటు చేసుకొని, ఒకరి
తరువాత నొకరు రాత్రి యంతయు గ్రామమును కాపాడు
చుందురు. కన్నగాండ్రభయము లేనప్పుడు గ్రామ
ఛారికె యీ గస్తి తిరిగి గ్రామస్థులను హెచ్చరించు
చుండును.

ఆర్థికస్థితి :—ఆకాలములో అన్న వస్త్రములు
కెవరికిని లోపము లేదు. ఆకలిచే కృశించినవా రెవరును
లేరు. ఇప్పటివలెనే రహదారులు దినుసుల మెగుమతి
ధరలు దినదినమును హెచ్చుటలు లేవు. ఏ సంవత్సరము
పండినపంట ఆసంవత్సరమునకు సరిపోయెడిది. బాగుగ
పండినప్పుడు మఱొక సంవత్సరము వఱకు సరిపో
వును. ఎవనికైన అన్నిరకముల పంటలు బాగుగ పండి
వెచ్చమునకు మించి మిగిలినప్పుడు వెండిబంగారములకు
మార్చుకొనెడివారు. నాణెములు చెలామణి అంతగా
లేదు. సాధారణముగ గ్రామస్థులు ఒక వస్తువుకొఱకు
కాని, మఱి యేవిధమైన యవసరమునకు కాని మఱి
యొక యూరికి పోవ నవసరము లేక తమ యూరియందే
తగిన యేర్పాటులను చేసికొందురు. కుమ్మరి, కమ్మరి,
వడ్రంగి, మంగలి, చాకలి, తెలకుల, దేవర, దుకాణ
దార్లు ఏ గ్రామమునకు తగినట్టు ఆ గ్రామముననే యుండెడి
వారు. ఒక్కొక్క వార మొక్కొక్క బస్తీగ్రామములో
సంత కూడేడిది. అట్టి సమయములలో గ్రామములోని
వారు తాముచేసిన వస్తువులను కాని, పండించిన ధాన్యా
దులఁ గాని సంతకు తీసుకొనిపోయి, వాటిని మార్పుగా
నిచ్చి తమకు కావలసిన వస్తువులను తెచ్చుకొందురు.
బంగారపు పనివాండ్రు, బట్టలునేసెడివాండ్రు మొద
లగు సున్నితపు పనులు చేసెడివారు బస్తీలలో తప్ప
ప్రతిగ్రామములోను ఉండరు.

విద్య:— ఉత్తమజాతి బాలకులు చదువుకునే
వారు. బాలికలు చదువుట యరుదు. కేవలము
చదువ లేదని చెప్పుటకు వ్రాయుటకును చదువుట
కును రానివా రందఱును జ్ఞానశూన్యు లనుటకు
వీలు లేదు. అప్పటికాలపు వారి జ్ఞానము వారి బుఱ్ఱ
లోనే యుండెడిది. పుస్తకములలో దాగి యుండ లేదు.
గ్రామములో జరిగెడి పురాణ కాలక్షేపములు పాట
లు, భజనలు, పంచాంగశ్రవణము కాలమానస్థితిని,
గమనించుట, గ్రామసభలలో చేరియుండుట, ఈ మొద
లైన వన్నియు జ్ఞానదాయకములు కావా? విద్యయన
నింతకంటె మఱి యే మున్నది? ఆ కాలమందు బుఱ్ఱలో
మోయలేనంత విద్య యెవనియందును ప్రబలి యుండ
లేదు. ఇప్పటిలో అంతకుమించి విద్య ప్రబలుటచే తల
భారమునకు మించినదానిని పుస్తకములలో సంగ్రహించి
మోయుచున్నాము.

ప్రతిగ్రామమునందును కోళ్లు, గొఱ్ఱెలు, పశు
వులు మెండుగా నున్నను, గ్రామములు చాల పరిశుభ్ర
ములుగ నుండెడివి. పేడ పెంట మొదలయిన తొక్కుం
తయు కుప్పలుగా వేసికొని తరుణమందు వాటిని పొల
ముల కెరువుగా నుపయోగించు కొనుచుండిరి. అట్టి
కుప్పలు ఊరిబైట వేసుకొనెడివారు. స్త్రీపురుషాదు లం
దఱును యథోచితముగ పాటుపడెడివారు. దాదాపుగ
ప్రతియింటను ప్రత్తిరాట్నములుండెడివి. ప్రతియిల్లా
లును నూలు వడికెడిది. బట్టలు కావలసినప్పుడు,
ఎవరి నూలు వారు దేవాంగుల కిచ్చి కూలి నిచ్చి

నేయించుకొనుచుండిరి. పంటలు పోయినప్పుడు అన్ని
సస్యములకు ఒక్కపర్యాయము పోవు. వరిమొదలగు
పల్లపుపంటలు పోయినప్పుడు జొన్న చోడి కొఱ్ఱ ఊద
చామ ఆరిక మొదలగు మెట్టపంటలు పండుటవల్లను
క్షామబాధ ఆకాలపువారిని అంతగా పీడించుట లేదు.
వరుసగా మూఁడు నాలుగు సంవత్సరములు అన్నివిధము
లయిన పంటలును పోయి నీరు లేక పశువులు నశించి
దూరదేశములనుండి ధాన్యము రా వీలులేమి—ఇవి
యన్నియు నేకీభవించినప్పుడు ప్రజలు బాధపడేవారు.
కాని యిప్పటివలె పంటలు హెచ్చుగ నుండి క్షామ
బాధ పడుట లేదు. క్షామబాధ కలిగినప్పుడు వలస
తీసేవారు. సుభిక్షము కాఁగానే తమ గ్రామములను చేరు
కొనేవారు. అన్నివిధములను గ్రామములు మిక్కిలి
స్వాతంత్ర్యము కలిగి, తమ వ్యాపారములను తామే
జరుపుకొనుచు రాజాధికార మెంతవట్టు కవసరమో
అంతమట్టుకు మాత్రమే జొరనిచ్చెడివారు. ప్రతిగ్రామ
ము ప్రజాపరిపాలక మని చెప్పదగిన స్థితిలో నుండెను.

### వర్తమానస్థితి

ఆంగ్లేయప్రభుత్వములో మనదేశ మెట్టి యున్నత
స్థితికి ఎట్టి నాగరకస్థితికి వచ్చినదో, ప్రత్యేకముగా చెప్ప
నవసరము లేదు పట్టణములు అభివృద్ధి చెందినవి. వర్త
కము వర్ధిల్లినది. దొంగభయములు తగ్గి రాకపోకలు
సుఖముగా జరుగుచున్నవి. మొదట కంపెనీవారి యాజ్ఞ,
పిదప చక్రవర్తిగారి యాన ప్రతి పల్లెయందును పట్ట
ణమందును నిరంకుశముగా చెల్లుచున్నది. ఇట్టి పరిపూ
ర్ణాభివృద్ధిలో మన పల్లెటూళ్ల స్థితి యెట్లున్నదో విచా
రింతము.

బ్రిటిషువారు తమ యాజ్ఞ నెల్లెడల నిరాఘాట
ముగఁ బ్రవర్తిల్ల చేయుటలో, తెలిసియో తెలియకయో
మనగ్రామములకు పూర్వమున్న స్వాతంత్ర్యమును పడ
గొట్టిరి. గ్రామాధికారులు గ్రామస్థుల ప్రతినిధులుగా
నుండుట పోయి, సర్కారువారి సేవకులయిరి. వీరికి
కల నౌకరీయినాములు తగుమాత్రము సిస్తుకు వీరి
కిచ్చివేసి జీతములు ఏర్పాటు చేయుటవలన వీరు మఱింత
సేవకులైరి. సర్కారుకు రావలసిన సిస్తు ఒక గవ్వయి
నను పోకుండ వసూలుచేయుటకుగాను వీరు ప్రజా
ప్రతినిధులగుట పోయి సర్కారుప్రతినిధులయిరి. అధి
కారము హెచ్చినది. ప్రజానుమతము తప్పినది. వీరు
ప్రజలను పీడింప నారంభించిరి. ప్రజలకు వీరియందు
నమ్మకమును, గౌరవము తగ్గినవి. ఆకారణముననే వీరికి
సివిల్ క్రిమినల్ అధికారములు తగుమాత్రముగా
నున్నను పల్లెటూరిప్రజలు వీరిమూలముగా తమ తగ
వులు పరిష్కరించుకొనక కోర్టులకెక్కి చీము నెత్తురుగా
కూడబెట్టిన ద్రవ్యమును అక్కడ సమర్పించి గతజల
సేతుబంధన మన్నట్టుగా బుద్ధివచ్చి, ఇల్లు చేరు
చున్నారు. ప్రతి గ్రామమునందును పూర్వపు ఐక
మత్యము పోయి కక్షలేర్పడినవి. ఎల్లప్పుడు తగాదాలు
పెంచుకొని న్యాయసభల కెక్కి న్యాయవాదులను
పెంచుచు, న్యాయసభల సంఖ్య వృద్ధిచేయుచున్నారు.
పూర్వమువలె గ్రామస్థులు తమ గ్రామములో దొంగ
తనములు జరుగకుండ గస్తీ తిరుగుట మానివేసిరి.
దొంగతనము జరిగినతరువాత పోలీసువారికి రిపోర్టు
చేయయుటవలన నెంత లాభమున్నదో అందఱకు తెలి
సిన విషయమే.

పాఠశాలల సంఖ్య రానురాను హెచ్చి, చదువ
నేర్చిన బాలికాబాలకుల సంఖ్య హెచ్చుచున్నను వారి
విద్య వారిని సేవకావృత్తికే పురికొల్పుచున్నది గాని,
స్వతంత్రపరిశ్రమలకు పుఁరికొల్పుట లేదు. ఆంగ్లదేశము
మొదలగు విదేశములలో బట్టలు మొదలగు నేయే
వస్తువులు యంత్రసహాయమువలన ఎంత విరివిగా తయా
రగుచున్నవో, అంతగా మన దేశ పరిశ్రమలు క్షీణిం
చుచు వచ్చినవి. యంత్రకృతము లంత చౌకగా హస్త
కృతములు విక్రయింప వీలు లేదు. ఇందువలన మన
పల్లెటూళ్లలో పరిశ్రమలు క్షీణించుటయే కాక విదేశ
యంత్రములకు కావలసిన కారు పంటలను పండించు
టయే మనవారి పనిగా నున్నది. పంటలు హెచ్చిన
కొలఁది, ధరలు హెచ్చినకొలఁది, పల్లెటూరివారికి
క్రొత్త నష్టములు సంభవించినవి. సర్కారువారు
పన్నులు బిగించుచున్నారు. పల్లెటూరివారు పండిం
చెడు పంటలకు హెచ్చు ధరలు వచ్చినను వారికి కావ
లసిన వస్తువుల ధరలు అంతకంటెను హెచ్చినవి. అంతే
కాక, మునుపటికంటె పలువిధములైన క్రొత్తవస్తువులు
ఆవశ్యకములైనవి. మునుపటి పల్లెటూళ్ల పరిశ్రమలు
నశించినవి. ఈపై నుదాహరించిన మూఁడు నాలుగు
కారణముల వలన, సర్కారువారు పన్నులు వసూలు
చేయుట చేతను, రయితులు వర్తకుల కంట్రాక్టుధరలకు
లోఁబడి, సొమ్ము తెచ్చి సర్కారుకు సిస్తుకట్టి తమయువ

సరములను తీర్చుకొనవలసి యుండుటవలనను సాధారణపు రయితు లందఱును కాలక్రమమున ఋణమగ్నులై పశువులను భూములను అమ్ముకొని, విదేశములకు కూలి చేసికొనుటకు పోవుట కాని, తమగ్రామములోనే హీనస్థితియం దుండుట కాని తటస్థించుచున్నది. అట్టి స్థితిలో కాటకము వచ్చినా, వారి పాట్లు చెప్పనవసరము లేదు. పూర్వ మందఱును కడుపార తిందురు. ఇప్పుడు సుఖభోజనము చేయువా రొకరును ఒక ప్రక్క మాడియున్న వారు పదిమందియు.

### భావిస్థితి

ఇట్టి అవస్థ లన్నియు నొక్కమారు పో అని కాని, పూర్తిగా పోవునని కాని చెప్ప బూనుకొన లేను. కాలము మారినది. పోయిన కాలమానస్థితులు అప్పటి మాదిరిగ తిరిగి రానేరవు. పరరాష్ట్రీయ ప్రభుత్వమున నున్నాము. పూర్వమువలె మన పల్లెటూళ్లు ఒకదానితో నొకటి సంబంధపడుట లేదు. ఇప్పుడు, ఒకయూరి సంగతులు మఱియొక యూరికి కావలసి యున్నవి. మనదేశపు ఉబుసు ప్రపంచమున నుండెడు దేశము లన్నిటికిని కావలసి వచ్చెను. వాటి యుబుసు మనకు కావలసియున్నది ఇట్టి నవీనస్థితిలో, పూర్వపు స్థితికి రాలేక పోయినను, పూర్వపు సౌఖ్యమును వీలయినంతవట్టుకు స్వాతంత్ర్యమును తిరిగి పొందగలుగుటకు ఆధారములు మన మాలోచించవలసి యున్నది. జాగ్రత్తగా పరిశీలనము చేయగా మన యనుభవమువలన బుద్ధిమంతులము కాఁజాలుదు మేని, ఈక్రింది మార్గములు కానవచ్చుచున్నవి. 1. కోఆపరేటివుసంఘములు, 2. గ్రామపంచాయతీలు, 3. క్రొత్త ఇండియా ప్రభుత్వచట్టము-దాని అమలు,4. బాలికాబాలకుల విద్యాభివృద్ధి.

### కోఆపరేటివు సంఘములు

కోఆపరేషను (Co-operative ) అనగా సాముదాయికముగా కార్యములు నెఱవేర్చుకొనుట - అన్ని విధములయిన అభివృద్ధులకు నిది కుంకుటివేరువంటిది. అందులో సర్కారువారి చట్టప్రకారము ఆమోదించి అమలు జరుపుచున్నవి పరపతి (credit) సంఘములు స్టోర్లు. పరిపతిసంఘములు మెంబర్లకు నూటికి మూప్పావులా చొప్పున అప్పు లిచ్చి, ఇతర ఋణబాధల నుంచి తొలగించుచున్నవి. అప్పువాయిదాల పైని తీర్చుకొనుచున్నవి. ఇట్టి సంఘము లిప్పు డక్కడక్కడ నున్నవి. అవి ప్రతి పట్టణములోను, ప్రతి గ్రామము గ్రూపున నొకటి చొప్పునను ఉండవలెను. వీటివలన నిపుడు అప్పులలో మునిగియున్న రయితులు ఆబాధలనుండి తప్పించుకొనవచ్చును. కూడబెట్టిన సొమ్ము భద్రముగా నీసంఘములలో దాచుకొనవచ్చును. తగిన ధర వచ్చిన వఱకు పండినపంటలను నిలవ చేసికొని, లాభముగా నున్నప్పుడు అమ్మవచ్చును. ఇప్పటిలో సాహుకారులు (గ్రామములోని ధనవంతులు, పట్టణములలోని వర్తకులు) వస్తువులు తమచేతిలో చిక్కువఱకు ధరలను హెచ్చనీయక, తరువాత ఏలము పాడినట్టుగా దినదినము ధరలు పొడిగించుచున్నారు. ప్రతి గ్రామములోను పండినపంటలో ఆగ్రామస్థులకు సంవత్సరగ్రాసమునకు విత్తులకు మదుపులకు తగినంతవట్టుకు గ్రామములో నిలవవుంచి మిగిలినదియు ఎగుమతి చేసినయెడల ప్రజలకు కష్టముగా నుండదు. పంటలు సాహుకారుల స్వాధీనములో నుండుటం బట్టి యిట్టి యేర్పాటు చేయుటకు వీలు లేకున్నది. అనేకమంది రయితులకు సాహుకారు అప్పు తీర్పగా రెండుమూఁడు నెలల గ్రాసమయిన నుండదు. సంవత్సరమునకు తొమ్మిదినెలల కాలము ఎక్కువ వడ్డికి అప్పు తెచ్చి హెచ్చుధరలలో వస్తువును కొని కాలక్షేపము చేయు రయితుల కష్టములు వర్ణించ నక్కర లేదు. తిరుగ మార్పులు కాగానే సాహుకారు అప్పు తీర్చకపోతే మఱి అప్పు పుట్టదు. రయితుల నిట్టి బాధలనుండి తప్పించగలవి పరిపతిసంఘములు తప్ప వేఱేవియు గానరావు. ఈసంఘములలో చేరి పనిచేసిన రానురాను, ఇప్పుడు గ్రామములలో నున్న కక్షలు పోయి సంఘీభావము ఐకమత్యము అభివృద్ధి కాఁగలవు. కోఆపరేటివుస్టోర్లు (దుకాణములు) కోఆపరేటివు ధాన్యపుబ్యాంకులు ఏర్పడిన యెడల నిప్పుడు మధ్యవర్తకులకు పోవుచున్న లాభములు ప్రజలే పొందగలరు; ధరలును ఇంతగా హెచ్చవు

### గ్రామ పంచాయతీలు

మన చెన్నరాష్ట్రపు దొరతనమువారు ఈమధ్యనే గ్రామపంచాయతీల శాసన మును చేసినారు. ఈచట్టము ప్రకారము గ్రామస్థు లందఱు చేరి న్యాయ్యమే ప్రధానముగా ఎవరు వర్తింతు రని నమ్మకమో, అట్టి

వారిని అయిదుగురిని యెన్నుకొనవచ్చును. ఈ ఎన్నుటలో సర్కారువారు జోక్యము కలిగించుకొనరు. ఇట్టి పంచాయతీల మూలముగా, 50 రూ॥లకు మించని సివిల్ తగాదాలు, కొన్ని క్రిమినల్ తగాదాలు పరిష్కరించుకొనవచ్చును. ఇందువలని లాభములు గ్రహించినకొలది పెద్దతగాదాలు కూడ పరిష్కరించుకొనిన యెడల, ఇప్పుడు కోర్టులలో తగులుబెట్టుచున్న సొమ్ము ప్రజలకు మిగిలి, సద్వినియోగమునకు రావచ్చును. ఈ చట్టముయొక్క లాభ మంతయు తగిన పంచాయతీదార్లను ఎన్నుకొనుటలో నున్నది.

### క్రొత్త యిండియా ప్రభుత్వ చట్టము

మన చెన్నరాష్ట్ర శాసన నిర్మాణ సభలో సుమారు 120 సభ్యులు ఉందురు. ఇందులో 63 లేక 66 గురిని ప్రజలు ఎన్నుకోవలెను. ఈయెన్నబడిన వారిలో నుండి యిద్దరిని మంత్రిపదములకు నియామకము చేయుదురు. వారిచేతిలో కొంత అధికార ముండును. అందుమూలమున జిల్లాబోర్డు, తాలూకా బోర్డు, గ్రామపంచాయతీలకు, ఎక్కువ అధికార మీయబడును. సభ్యులను ఎన్నుకొన, హక్కు ఇంతకు పూర్వము కొంచెము మందికే కలదు. ఈక్రొత్తపద్ధతి ప్రకారము సర్కారుకు రు 20 లకు తక్కువకాని పన్ను చెల్లించు ప్రతిపురుషునకును ఎన్నికహక్కు వచ్చుటవలన, ఎన్నికగణముయొక్క సంఖ్య పూర్వముకంటె చాల హెచ్చుగా నుండును. ప్రజలు తమకు వచ్చిన యీ అధికారమును క్రమముగా వినియోగించి, తగిన వారిని యెన్నుకొనినయెడల, ప్రభుత్వము ప్రజానుమతముగను, ప్రజాక్షేమకరముగను ఉండును. అప్పుడు గ్రామములకు కావలసిన బాటలు, జలాధారములు గ్రామ పారిశుద్ధ్యము, రోగనివారణ, చికిత్స, విద్య, పరిశ్రమలు మొదలుగాగల విషయము లన్నియు ప్రజల చేతిలోనికి వచ్చును. భారతశాసనసభలోకూడ 120 మంది సభ్యులు ఉందురు. ఇందులో 80 మంది ప్రజలచే నెన్నబడుదురు.

### విద్య

ఈ కాలములో విద్య నేర్చినఁ గాని కార్యములు క్రమముగా జరుగవు. పూర్వము వ్యవహార మంతయు నోటిమాటలలోనే జరిగేది. ఇప్పుడంతయు లేఖనరూపముగా నుండవలెను. చదువుకున్న వారిలో తగుమాత్రముగా నున్న మోసగాళ్లకు లొంగవలసిన అవసర ముండదు. జ్ఞానాభివృద్ధియు, బుద్ధికుశలతయు విద్యవలన వచ్చును. బుద్ధికుశలత గలవారికి లోక మంతయు స్వాధీన మగుచున్నది. కావున విద్యాభివృద్ధి లేనిది దేశాభివృద్ధి కానేరదు.

విద్యాభివృద్ధి మూలమున మన గ్రామములలో క్షీణించిన కొన్ని పరిశ్రమలను అభివృద్ధిచేయవచ్చును. అందులో మొదటిది ప్రతి యింటిలోను నూలువడికి ఆనూలుతో నేయించిన బట్టలే వాడుకొనినయెడల సంసారులకు, సాలీలకు కూడ లాభకరముగ నుండును. రెండవది పశువులను బాగుగ మేపి, ఆ పశువులను వాటి కోడె దూడలను అమ్ముటవలన పాలు, పెరుగు, నెయ్యి అమ్మకమువలనను ప్రతికుటుంబమును ఆదాయము వృద్ధిచేసుకొనవచ్చును. మూడవది కోళ్లను బాతులను పెంచుట, మనము వృథాగా పారవేయు ప్రతివస్తువును, కళ్లములలోని రద్దును కోళ్లకు ఆహారము గనుక, కోళ్లను పెంచినవారు రద్దును వినియోగములోనికి తెచ్చినవారై, ఎక్కువ మదుపుపెట్టకుండ మిక్కిలి లాభమును పొందఁగలరు. వ్యవసాయమువలన వచ్చిన ఆదాయమునకు ఈపరిశ్రమలవలని ఆదాయముతోడుపడినయెడల సుఖముగాఁ గాలక్షేపము చేయవచ్చును.

ఈ విషయము లన్నిఁటి నిందు సూచనగా మాత్రము వ్రాసితిని. ఒక్కొక్కదాని నొక్కొక్క పర్యాయము విపులముగా చర్చించి కొలదికాలములోనే ఆంధ్రపత్రికలో ప్రచురించెదను. ఆంధ్ర సోదరు లందఱు నీవిషయములను గురించి బాగుగ నాలోచించి ఆచరణలోనికి తెచ్చి, దేశాభివృద్ధికని, ప్రజాసౌఖ్యమునకును, తోడ్పడఁగోరుదును.

# మద్యపానము

గొల్లపల్లి సామ్యుయలు గారు

ఏది మనుజుని సర్వవిధముల పాడుచేయుచున్నదో, ఏది మన హైందవులలో లక్షాధికారులనేకులను భిక్షాధికారులనుగా జేయుచున్నదో, అట్టి మద్యపానమును గూర్చి మన విూదినములలో యోజించుట యుక్తమనియు నీ దుర్వ్యసనమును నాశనము చేయు మని దేశనాయకులకు మనవిచేయుట యవసరమనియు నాకుఁ దోఁచినందున నీ చిన్నవ్యాసమును వ్రాయఁబూనితి.

భగవంతుఁడు మానవులమైన మన మేలునిమిత్తమనేకపదార్థములను సృజియించెను. మన యాహారార్థమై నిర్మించిన పదార్థములన్నియు ఘనపదార్థము లనియు ద్రవపదార్థము లనియు ద్వివిధములు. ఘనపదార్థము లేవి యనగా ధాన్యములు, కాయధాన్యములు దుంపలు మొదలైనవి. వీనిని మనము ఇష్టాయిష్టములను బట్టి మితముగా భుజింపవచ్చును. ద్రవపదార్థములు రెండువిధములు: పాలు, పెరుగు, నీరు మొదలైనవి. వీనిని గూడ మితముగా ననుభవించవలెను. "అతి సర్వత్ర వర్జయేత్" యని బుధులు చెప్పినట్లు మితిమించి దేని నైనను మనము అనుభవింపరాదు. భోజనపానాదులందు మాత్రమే గాక వస్త్రధారణమందును ఖర్చుపెట్టుటయందును వాక్కునందును మితముగా నుండవలెను అయితే రెండవతరగతి ద్రవపదార్థములగు ఈతకల్లు తాటికల్లు మొదలగు మద్యముల విషయములో మిత మనుమాట కేవల ముపయోగింపదగదని తోఁచుచున్నది. ఏలయన వీనిని మితముగా నేకాలమునందైన నెవరైన వాడుకొన గలిగినట్లు విని కని యుండలేదు. గనుక పై చెప్పిన రెండవ రకపు ద్రవపదార్థములను మితముగా నైనను నెవ్వరు వాడుకొన వలను గాదు. కేవలము విసర్జనీయము. ఎందుకనఁగా మితము అమితమునకు నడుపును.

దినమంతయు కూలిజేసి యలసియున్న యొకడు, నొకడ్రాము ద్రాగిన హాయి నిచ్చునని యెవరైన ననవచ్చు నేమో! కొంచె మంత సుఖమును కొన్ని గడియలవఱ కిచ్చినను పిదప నది జేయు నష్టము మొదట నిచ్చిన సుఖముకన్న నెన్నియో రెట్లు అధికముగా నున్నది. ఏలా గనఁగా:— సారాయిని ద్రాగిన వెంటనే యది మెదడున కెక్కును. మెదడు జ్ఞానమునకు మూలస్థానమును మనస్సున కాధారము నై యున్నది. గాన వెంటనే మతిహీనుఁడై వెఱ్ఱిమాట లాడును. క్రమముగా నది వాని జ్ఞానహీనునిగాఁ జేసి వక్రకార్యములను జేయించును గనుక సారాయి ఇచ్చెడి సుఖము స్వల్పము. కీడు అమితము.

మద్యపానము దానివలన వచ్చు కీడులు:— శ్రమ. ఆకలిబాధచే శ్రమ నలుగురిలో తిరుగలేనందున మనస్సునందుండు శ్రమ. మఱియును జగడములు మున్నగునవి కలుగును. చింత: త్రాఁగువాని నడిగిన, సంతోషమునకే త్రాగుచున్నా ననును. త్రాగినప్పుడు పండుగుగా నగపడును. గాని వెనుక చింత గలుగును. ఈచింత వర్ణనాతీతము. ఆర్జనమంతయు సారాయి దుకాణమునకు సమర్పించుటచే నింట వంట లేనందున నాకలిబాధచే చింత. మత్తుడై యుండగా మొలనో జేబులోనో యున్న కొద్దిపైకము స్నేహితులని నమ్మినవా రపహరించినందున చింత. పెద్దచిన్నలు చీవాట్లు పెట్టుటవలన చింత. బిడ్డలకు విద్య చెప్పించలేదు గాన వా రుద్యోగములు లేనివారై ముసలికాలమున వెంచలేక పోవుటచేత చింత. ముదిమిని పాటుపడు శక్తిలేదు, భిక్షమెత్త సిగ్గు, సరిగదా అమ్ముకొని దినుటకు యింట సామగ్రియైనను లేనందున చింత. తలదింపు పదామది చింత. దీని వర్ణించ కవులకే చెల్లును. హేతువు లేని గాయములు:— త్రాగి నడుచుచుండగా తూలి మొదలునఱికిన తాడిచెట్టువలె నేలఁగూలగాఁ గాలుచేతులువిరుగును ముఖముపై దెబ్బలు దగులును. ఎవరు గొట్టిరి. ఎవరును గొట్టలేదు. తానే మత్తుచేపడి గాయపర్చబడెను. మందదృష్టి: కాకచేతను నరముల పటుత్వముతగ్గుటచేతను, దృష్టిమాంద్యము గలుగుచున్నది. పరస్త్రీలనుజూచుట: మద్యపానము సమస్తపాపములకు మూల మన్న ప్రకారము నిషాచేత వావివరుసలు దప్పి వర్తించును. తనను తా నెరుగక స్త్రీలను జూచి పండ్లిగిలించును. పరిహాసము లాడుచు నవాచ్యకార్యములను జేయఁగాలు ద్రవ్వును. వక్రపుమాటలు: వీధులలో నెండలో యిట్టిస్థితియందు, పోవుచుండగా మనము జూచితిమి. వారు నిషా తగ్గిన పిదప మఱల నాదారిని వచ్చుటకు భిడియపడుచున్నారు. భ్రమింపజేయును: దరిద్రుని ధనికునిగను బలహీనుని బలముగలవాని వలెను, భ్రమింపజేయును. ఒక ప్రేలితో త్రోసిన తూలిబడు స్థితియందుండియు పదిమందిని గొట్టగల సింహబలుఁడే నని భ్రమింపజేయును. త్రాగుబోతులు దయాహీనులై బిడ్డలను, భార్యలను సదా కొట్టుటయుఁ గొన్ని వేళలయందు నరుకుటయు మనము జూచుచున్నాము. త్రాగ డబ్బు లేనప్పుడు దొంగలించును. మరి యేక్రూరకార్యమైనను చేయ సాహసించును.

త్రాగుడువలన గల్గుచున్న కష్టనష్టములను, తెలుపక మున్న సహాయము చేయు నగత్యము గానబడదు. కాన త్రాగుడువలన నెంతకీడు మనదేశమున గల్గుచున్నదో దానిని మొదట దెలిపి విూసహాయమును గోరుతలంపుచే పైసంగతులను దెల్పితిని. క్రమక్రమముగా బీదలగుచున్న మన సోదరులస్థితిని పరికించుడు. ప్రతి సం॥ సారా కల్లు మొదలగు వానికి ప్రజలు ఖర్చుచేయుచున్న ద్రవ్యము నొకమా రంచనా వేసిచూచిన గుండె లదురుచున్నవి. ఎన్నికోట్లరూపాయి లిందునిమిత్తము వ్యయమగుచున్నవో! పరికించిన పరితాపము గలుగక మానదు. ఎన్నిప్రాణు లాహారము లేక మలమల మాడుచున్నవో తలంచుడు. ఎందఱు వస్త్రహీనులై యున్నారో జూడుడి. బీదలై తిరుగువారు రాబడిలేక కాదు, గాని తమరాబడి నిందు నిమిత్తము ఖర్చుచేయుటవల్ల బీద లగుచున్నారు. ఓపికతో పరీక్ష జేయుడు. తాలూకాకచ్చేరీలకు వెళ్లి భూమిపన్నుల రాబడి హెచ్చుగా నున్నదో సారా మొదలైన వానివలన రాబడి హెచ్చుగా నున్నదో తనిఖీ చేయుడు. అప్పుడు మన సోదరుల స్థితిని బట్టి మనకు దుఃఖము గలుగక మానదు. త్రాగుడు మాన్పవలె నని యాశ పుట్టక పోదు.

నివారక మార్గములు ఓ చదువరీ! నీ విట్టి యలవాటున మునిగియున్న యెడల నిప్పుడే దాని విడువ దైవసహాయమును గోరుము. ఎన్నడు పుచ్చుకొన నని బహిరంగమందు శపథముఁ జేయుము. ఏలయనఁగా రహస్యముగా నొప్పుకొనుట కన్న బహిరంగముగా

నొప్పికొనుట మఱల జేయకుండుటకు శక్తి నొసగును. మంచినీళ్లు మాత్రమే త్రాగుము. మిత్రమండలివారేకమనస్కులై జయించు వఱకును బూనికతో బోరాడినట్లు పెద్దలును సంఘనాయకులును పూనికతో మన దేశమందు వృద్ధినొందుచున్న నీ క్రూరశత్రువును జయింప నడుము కట్టవలయును సుమా.

దొంతనమువారికి దుకాణములను తగ్గించుమని మహాజరులు మిమోరియలు పంపుటవలన ప్రయోజనము లేదు. వారు దుకాణములను తగ్గించుచున్నను చాటుమాటున నమ్మెడి దుకాణములు పుట్టగొడుగులవలె నభివృద్ధి గాంచుచున్న వనియు, నీ విషయము పై యధికారులకు తెలియు ననియు, నీ కలిగిన విషయమే గావ కర్తవ్య మేమనగా త్రాగుడువలని నష్టమును వివరించుటకై వీధులలో బోధనసేయు నేర్పాటులు జేయించుడు. త్రాగుడువలని నష్టమును దెలియజేయు పటములను వీధులలో జూపుటయు, గోడలపై నంటించుటయు, శ్రేష్ఠము. వెవ్వేరు భాషలలో కరపత్రములను వ్రాయించి విరివిగా బంచిపెట్టించిన జాల మేలు గలుగును. దొరతనపువారికి బంపు మహాజరులకన్న నీ యుద్యమము చాలపనిచేయును. కాలుచున్న యింటిలో నున్న మనసోదరుని దప్పించక మన మూరకుండుట యుచితమా? నిన్నువలె నీపొరుగువాని ప్రేమించుమను దేవోక్తి మనము విన్నాము గదా! ఈ శత్రుని మనదేశమునుండి బారద్రోలుటకు చేయవలసిన ప్రయత్నమింకను చేయలేదనిన నన్ను క్షమించుడి.

శ్రీ మహాత్మా గాంధిమహాశయుడు డాఫ్రికాలోని మనవారిని శ్రమలనుండి తప్పించుటకై శ్రమపడినట్లు, అమెరికనులు బానిస వర్తకమును మాన్ప బోరాడినట్లు, మనము నీ పిశాచిని పారద్రోలుటకై పోరాడవలయును. ఇతరులకు బోధించులాగున ప్రతిపట్టణములో బెద్దపెద్ద గ్రామములోను నిషేధక సమాజములను నెలకొల్పుడు! ఇవి చక్కగా జరుగుచున్నవో లేవో చూచుటకై జనరలు సెక్రెటరీని నియమించుట యుక్తము.

దేశాభిమానులార! విరివిగా చందాల నిచ్చి మాతృదేశము నుద్ధరించుడు! మహాయుద్ధనిధికి సహాయపడిన రాజులార! ఈ ఘనకార్యమునకు తోడ్పడి మీధనసహాయమువలన నసేకులను దరిద్రతనుండి తొలగించి వారివన్నవకు పాత్రులు కండు.

# ఆంధ్రభాషాప్రాశస్త్యము

## ముదిగొండ నాగలింగశాస్త్రి గారు

విందులు గాంచుడీ భువనవిశ్రుతభావలఁ జూడఁజూడఁ జ
క్కందన మిందె గాక మఱి కల్గునె యెయ్యెడ నే, న్మరందముం
జిందెడు కుందకుట్మలరుచిం దవు లొందిచరించు తుందిలేం
దిందిర బృంద సుందర రుతిం దలపించెడి ముద్దుపల్కులం
జెంది, మనీషిపఙ్క్తి రసశేవధి ముంచుచు మించు నాంధ్రి నె
మ్మిం దివిషద్వచోవిదులు మెప్పునకై కృతిఁ గోరినన్, శతా
నంద నివాస నిమృత దనంత విభంగ తరంగ సంగతా
మంద కలధ్వని స్ఫూర దమర్త్యధునీ పృథునీరపూర ని
ష్యందనిడంబి కుంభ దుపసంభృత సంభ్రమశోభి గుంభనా
నందిత పండితక్రమమునం బచరింపఁగ వచ్చు దేశ్యసూ
క్తిం దనియింపు మన్న నల తేనెలసోనలు జాలువాఱ లేఁ
తం దగు జంటి గొంటు తెలిగంటుల వాతెఱపంటినంటు తి
య్యందనముం దలిర్ప, మరునమ్మల నిమ్మగు కమ్మతావులుం
గ్రందుకొనం, గొనంబులు కరం బలరన్, రతనాలప్రోకలై
యంద పుమోకలై గొనజలా లలిపల్కుల నానువారికి
న్వ్యం దొసరింపవచ్చు, మఱి తెన్గుఁ గొమ్మయొప్పు తన్ తరళ్
కొందలికై మిడ కిమ్మిమ్మిమ్మత్తాడ వాప్పుపప్పుం వరల్లిర
ల్లిం దను ద్రావిడోక్తి యెన యెట్లగు దీనికి? ఇంకమీఁద ని
ల్లిందయుదన్న రాతుసగలింద విభీషణు కేలి మాడి కూ
డం దను కన్నడంబు సరియా? కన నీగతి నెల్ల భాసలం
దుం దులలేక శోభిలు ననుత్తమభావకు మాల మెంచఁగాఁ
గొందఱు పూని, రెండిటను గొన్ని పదంబులు సేరియుంటఁ జూ
డం దమిళంబు దీనికి స్ఫుటంబుగ బీజ మటందు, రటకనుం
గొంద ఱిలం ద్రిలింగపదగోచరమైన తెలుంగుఁ బండితా
ళిం దనియింపలేని త్రికళింగపదోత్థగ నెంతు, రెంచనీ
కొందఱు తెంకు తెం గనెడి క్రొత్తపదంబులు మూల మందు రే
మందము దీనిఁ బోవిడుపుఁ డారయుఁడీ మఱి యొక్క చిత్రము
న్మందఱి సత్కవీశ్వరుల మూలధనంబును జూడ సంస్కృతం
బందలి పూర్ణపాండితి గదా! ఇఁకఁ గొందఱు గ్రంథకర్తలం
దుం దలపోయ నిప్పు డది తోఁచదుగా సురభారతిం గవుల్
సుందురుగఁ బద్యబంధముల ముచ్చటగా రచియించి నాటకం
బుం దనరం బొనర్పకయ పూర్ణ మహాకవిపట్ట మబ్బదం
చుం దిలకించి వ్యంగ్యములు శోభిల నొక్కటొ రెండు మూఁడొ జా
నొంద రచించుచుండ్రు. మఱియు న్మనముందటి యాంధ్రసత్కవీ
డ్బృందము నోయు నెల్ల హరించెను పద్యనిబంధనంబుతో
నందము గాగ నాటకములన్ రచియించు నదృష్టరేఖ వా
రొందఁగఁ జాల రైరి. యిపుడో మఱి కొందఱు ధీయుతుల్ కృతు
ల్పొందుగ నల్పఁ బూని గణము ల్యతి ప్రాసములుం గడింపఁ గా
నిందు శ్రమంబు గల్గు ననియోఁ దలపెట్టక పద్యకావ్యముల్
ముందుగ నాటకంబులనె పుష్కలతన్ రచియింతు రౌర! మె
చ్చందగుఁ గాలమస్థితినిఁ జయ్యన వెల్వడి దూరదేశము
ల్పొందఁగ ధూమయానము బలెం బహుదూరపు వార్తలాలకిం
పం దగు తంత్రిసాధనము మాడ్కి మహాకవిపట్ట మూరకే
యుంద సుసాధనంబు గన నయ్యెఁ గదా. మఱి వీరు తొల్లి యే
చందపు నోము నోచిరొకొ! చాలిఁక వీరల నిట్టు లీసుతో
నింద నొనర్పఁ గాదు. మఱి నిక్కముగా బుధులార యిప్పుడున్
ముందును గల్గు సత్కవులు ముఖ్యవిశేషము నేర్పరింపఁ గా
డెందమునం దలంచియె సుడీ! ఇఁక నేమన దేవవాణి శో
భం దనరారు ధీయుతులు భాసుర హేతువిమర్శనంబు లిం
పొందఁగఁ జేసి సత్కృతుల నొప్పుగఁ గూరిచి దేశమాతృభా
వం దగునట్లు సూరిజనసంస్తవనీయము గా నొనర్ప వేఁ
డం దొరకొంటి, నియ్యెడ దృఢంబుగ నెవ్వనిపిచ్చి వాని కా
నంద మటన్న నీతిని మనంబున నెంచి మదీయభాషితం
బందలి దోషపంక్తి ముదమారఁ ద్యజించి గుణంబు గల్గినం
బొందికతో గ్రహించి యనుమోదము జూపి యనుగ్రహింపఁ గా
నందనముల్ రచించి, ఇటుపై విరమింప ననుజ్ఞ నొందెదన్.

# మా బావమఱఁది

మంగిపూడి వేంకటశర్మ గారు

కాంచి రమ్మన్నచోఁ గాల్చి వచ్చుటలోను
పవననందనుఁడు మా బావమఱఁది
హాలముఁ బట్టుటలోను నాస్వాదనములోను
బలరామమూర్తి మా బావమఱఁది
జన్నంబుఁ లెల్లను జక్కఁజేయఁగ దీర
భద్రావతారమే బావమఱఁది
పనులఁ జెర్పఁగ కొర్కులను పెంపు చేయంగ
వక్రతుండుండు మా బావమఱఁది
తృణమె మేరువుగా నెంచి తృప్తిపడఁగ
బసవనకు సాటి మా పెద్ద బావమఱఁది
మాపు రే పవతారాలు మార్చు పనికి
పద్మనాభుండు మా చిన్న బావమఱఁది.

సీ. కళ లందమా రోమకళఁ జూచి జాంబవం
తుఁడె పుట్ట లడవులఁ దూరవలయు
అంద మందమ ! మొగ మందాన కనుమంతుఁ
డే కొంకి తోక జాడింపవలయు!
శౌచ మందమ హేమలోచను పగవాని
దాయాదులే తుంగ దలంపవలయు
చాకచక్యం బందమా కాలయముని సుం
దరవాహములు మద్వుఁ జొఱఁగవలయు
గాత్రరుచి యందమా రాధికాధిహారు
ప్రభవమున వసుదేవుని కథయ మిడిన
యతని సంతతి రేవులు వెతుకవలయు
ఇన్నిఁటను మేఁటి మా బావ కెవరు సాటి?

సీ. దాంపత్యములు గూర్పఁ దగునొ లేదో గాని
యింతులపై నస్త్ర మెత్తగలఁడు
క్రౌంచభేదనశక్తి కలదొ లేదో గాని
యన్న పం ట్లూడంగఁ దన్నఁగలఁడు
జలనిధి లంఘింపఁగలఁడొ లేఁడో గాని
పురముల గాల్పంగఁ బూనఁగలఁడు
విస మాని జగ మేల వశమొ కాదో గాని
యుద్ధలు పెండ్లాల నేలఁగలఁడు
భూమిధర మెత్తు శక్తి లే దేమొ గాని
భామినుల వల్వ లపహరింపంగఁగలఁడు
కంతుఁ డనఁ గందుఁ డన హనుమంతుఁ డనఁగ
శంభుఁ డన శౌరి యన నేమి సంశయంబు ?
వర్ణనము సేయ వశమె మా బావయశము?

సీ. బ్రహ్మచర్యవ్రతంబుఁ బట్టడింతే గాని
గుద్దులాడఁగలండు గురులతోడ
శస్త్రాస్త్రవేది కాఁజాలఁ డింతే గాని
నిద్రాణులను జంప నేర్వగలఁడు
శత్రుల నుఱుమాడఁ జాలఁ డింతే గాని
భ్రాతృహత్యకు సిద్ధపడఁగలండు
ముక్తి నీయంగ నశక్తుఁ డింతే గాని
యెంగిలి పండ్లైన నీయఁగలఁడు
శాంతనవునకు ద్రోణాత్మజన్మునకును
పార్థునకు నీశ్వరునకును ప్రతి యనంగ
వివిధగుణగణములతోడ వెలుఁగువాఁడు
కాశ్యపిని వేఁడు మా బావ గారి జోడు.

సీ. దేవతాకార్యముల్ దీర్పఁజాలఁడు గాని
బ్రహ్మహత్యలకు పాల్పడఁగలఁడు
శ్రీరామపదభక్తి సేయఁజాలఁడు గాని
యింటిగుట్టరి కెఱిఁగింపఁగలఁడు
శాపచాపాదుల కోపఁజాలఁడు గాని
జననిపైఁ దెగఁ గొంకు జంకు వడఁడు
బాహాబలాఢ్యుఁడై ప్రబలఁజాలఁడు గాని
దినముల కొలఁది నిద్రింపఁగలఁడు
రాముని విభీషణుని భృగురాము కుంభ
కర్ణునిం జంపి పుట్టిన గడుసువాఁడు
సాహసాదిమహాగుణసమితి వీఁడు
మూఁడు లోకాల మాబావ జోడు లేఁడు.

# స్వాతంత్ర్యరథము

దువ్వూరి రామరెడ్డిగారు

శ్రీ అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నింద్రచాపంపుఁ దోరణ మింపు గులుకఁ
గారుమెఱుగులు నెల్లెడఁ గడలుకొనఁ గ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీథియందు.

చ. జలధరమాలఁ జీల్చికొని
స్యందనకాంతి నభోంతరాళము
జ్వలితముఁ జేసి యంధతమ
సంబులువాఱిన మూలనైన శో
భల నన లెత్తఁ జేయుచుఁ
బ్రభాతవిభాకర బింబమట్లు సొం
పిలుచు నవీనజీవనము
వేడ్కఁగ నింపె సమస్తపృథ్విలోన్.

ఉ. ఆరథమందు దీప్తిమయ
మై కనుపట్టె నిజప్రభావ దు
ర్వారపవిత్రమూర్తి కడు
పండువు సేయుచు, "ధర్మజీవనా
కారమొ! శాంతిబింబమొ!
యకల్మషసత్యనికేతనంబొ! సం
సారఫలస్వరూపమొ! ప్రజా
హృదయంబొ!" యన న్వెలుంగుచున్.

మ. ఒకచేతన్ రుధిరంపుఁ బాత్రమును
వేఱొక్కంటఁ బీయూషపా
త్రికయుం గైకొని సభ్యతా
మిషమునన్ దేశంబులం దెల్ల నిం
తకు ధర్మంబులు గాక నెన్నఁబడు
నన్యాయ్యంబు లీనాఁటితో
వికలంబై చనుఁ గాక యంచుఁ
గరుణావేశమ్ము దీపింపఁగన్.

తే. పచ్చినెత్తుఱు నమృతంపుఁ బాత్రఁబోసి
దివ్యదుగ్ధంబుగను మార్చె దేవి మహిమ!
హాలహాలగర్భ మందైన నమృతరసము
సంభవించు నటం చిలఁ జాట నేమొ?

చ. నిలువదు స్యందనంబు ధర
ణీపతిపాలన దండభీతిచే,
నిలువ దనాథ బాష్పములు
నిల్చిన పల్లపునేల; మోసగిం
పుల మఱపించు క్రించుదనపుం
జతురాత్ముల కాఁగఁబో దన
ర్గళజవ మొప్ప నేఁగెడిని
కన్నులకుం గనరాని-చోటికిన్.

తే. గీ. పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు
మణిమయకిరీటములు, భోగమందిరములు,
చక్రసంఘర్షణంబునఁ జదిసిపోయి
యవియివి యనంగరాక రూపఱెడు నేఁడు.

తే. గీ. లేవు దివ్యతురంగముల్; లేవు కరులు
ప్రజలె యా తేరుమోకులఁ బట్టువారు
వాయుజవమునఁ దారకాధ్వమున నేఁగు
నంతరాయశతంబుల నైన దాఁటి.

తే. గీ. తేరుజాడల నెత్తురు పాఱి పాఱి
బంగరుంబంటఁ బండించె, బక్కనేలఁ
జక్రనేములు దాఁకిన స్థలము లెల్ల
సస్యలక్ష్మికిఁ గల్యాణశాల లయ్యె.

తే. గీ. స్యందనాసీన యగుదేవి "శాంతి శాంతి"
యనుచు మంజులగానమ్ము నలరఁ జేసి
సవ్య నక్షత్ర వీణాస్వనంబులందు
మేళవించెను జనులు విస్మితులు గాగ;

# మన కీదారిద్ర్య మేల?

పల్లపూని వేంకటసుబ్బారావు గారు బి. ఏ.

అనాదినుండియు మనదేశము సకలైశ్వర్యములతోఁ దులఁదూఁగుచుండెడిది. ఇందునకు నిదర్శనము లనేకము లున్నవి. వాని నన్నిఁటి నిచ్చటఁ దెలుపఁ దలఁచినయెడల స్థలము చాలదు. కావునఁ గొన్నిటిని మాత్రము తెలిపెదను. క్రీస్తుపూర్వము 3000 సంవత్సరముల నుండియు మనదేశమునకును ఇతరదేశములకును మంచివర్తకము జరుగుచుండెడిది. ఈవర్తకమువలన ప్రస్తుతమువలె నష్టమేమియును లేక దేశదేశములనుండియు నపారమగు ధనము నాకర్షించుచుండెడిది. ఇందునకు దార్కాణముగా ప్లినీ బెర్నియర్ మొదలుగాఁ గల చరిత్రకారు లందఱు నితర దేశములనుండి మనదేశములోనికి వచ్చుచుండిన ధనమును చూచి అసహనమును చూపియుండిరి. మెగాస్థనిసు ఫాహియన్ హ్యూయనుత్సాంగు మనదేశమును గుఱించి వ్రాయుచు ధనధాన్యములతో నిండియుండి యేవిధమైన లోటును లేకయుండె నని వ్రాసియుండిరి. వీరిలో కడపటి మహనీయుఁడు క్రీ.శ. 644 సంవత్సరప్రాయమున మన దేశమునకు వచ్చియుండెను. అప్పుడు హిందూస్థానమును పాలించుచుండిన చక్రవర్తి శ్రీహర్షుఁడు. ఆసంవత్సరమున నతఁడు ప్రయాగలో బంగారముతోఁ దులాభారముఁ దూఁగి అదివఱకు కేడు సంవత్సరములనుండి బొక్కసమునఁ జేరిన ధనమునంతయు ప్రజలకు దానము చేసియుండెనఁట! ఇట్లుఁ దాను రాజ్యముచేసిన ముప్పది సంవత్సరములలోను ప్రతి యైదుసంవత్సరముల కొకసారి చేసియుండె నఁట! ఈమహోత్సవము 75 దినములు జరుపఁబడునఁట! ఈసందర్భమున వెచ్చింపబడిన ధనమును గూర్చి తెలిసికొనవలె ననిన, నొక యుదాహరణమును దెలిపెదను. 10,000 సన్న్యాసుల కొక్కదినమున నొక్కొక్కనికి 100 బంగారునాణెములను ఒక మంచిముత్యము నొక వస్త్రము చొప్పున నిచ్చియుండె నఁట! ఇట్లు లక్షలకొలఁది జనులకు ఈవిధమున నీయఁగలుగుటకు మనదేశ మాకాలమున నెంతటి యైశ్వర్యములో నుండి యుండవలెనో గదా! ఇంకను మహమ్మదీయుల పాలనమునందుఁ గూడ ఈయైశ్వర్యమున కంతగ భంగపాటు కలిగినట్లు కాన్పింపదు. కాని 17 వ శతాబ్దిని మన దేశమున మొట్టమొదట శ్వేతముఖులు పాదమును బెట్టిననాఁట నుండి మన యైశ్వర్య మడుగంట నారంభించినది. ఆనాఁటి ప్రపంచమందెల్ల మిక్కిలి భాగ్యవంతమై యలరారుచుండిన మనదేశము ఈనాఁడు అధోగతిఁ బడి దారిద్ర్యపిశాచపీడితమై నవయుచున్నది. ఈ విపరీత పరిణామమునకుఁ గల కారణములఁ గొన్నింటిని చూపుటయే యీ వ్యాసమునకు ముఖ్యోద్దేశము.

ఈ విషయమై యిదివఱకే దాదాభాయి నౌరోజీ (వీరి 'పావర్టీ అన్డ్ బ్రిటిషురూలు' అను గ్రంథ మాంధ్రమున ననువాదితమైన మేలుగా నుండును.) రమేశచంద్రదత్తు హిన్డ్మన్ డిగ్బీ బెసంటు మొదలుగాఁగల మహనీయులు విపులముగాఁ జర్చించి యున్నారు. కాని వారివ్రాఁత లన్నియును ఆంగ్లభాషనే యుండుటచేత ఆ భాష తెలియని మన సోదరుల కంతగా నుపయోగింప వని తలఁచుచున్నాను. నా కీ వ్యాసముల వ్రాయుటలో ముఖ్యముగా ఆని బెసంటుగారి "ఇండియా ఎ నేషన్'ల అను గ్రంథము సాయపడినది.

ఇట్టి దురవస్థకు మనల నీడ్చిన కారణములను సంక్షేపముగా ముందు తెలిపి అనంతరము వానినిగూర్చి కొంత విపులముగఁ జర్చించెదను. (1) మనదేశమునుండి పన్నుల మూలమున వసూలుచేయఁబడి ఇంగ్లాండులో నుండు ఇండియా ఆఫీసు పోషణనిమిత్తమును ఇంగ్లీషు ఉద్యోగీయుల యుపకార వేతనములకును ఇనుపదారులు మున్నగువానిమీఁద వెచ్చింపఁబడిన ఆంగ్లేయుల ధనముపైని వడ్డీల విధముగను ప్రతి సంవత్సరమును బోవుచున్న ధనప్రవాహము మొదటిది. ఈ మహాప్రవాహమే మనదేశపు నిరంతర దారిద్ర్యమునకును వినాశకరములగు క్షామములకును కర్షకులఋణగ్రస్తతకును కారణభూత మగుచున్నది. ఈఋణగ్రస్తత ప్రస్తుతము 300 కోట్ల రూపాయలవఱకు నున్నది. మఱియును సాధారణముగ వచ్చుచుండు కఱవులను నివారించునిమిత్తము వెచ్చింపఁబడు నపారమగు ధనమును మన దేశపు లాభముకొఱకుఁ గాక సామ్రాజ్యసంరక్షణనిమిత్తమై చేయఁబడిన యుద్ధముల వ్యయమును గూడ గమనింపవలసి యున్నది. (2) ఈ కఱవులకును ఈ రైతుల ఋణగ్రస్తతకును ముఖ్యకారణముగా నెన్నఁదగు పన్నులవిధానము. (3) బ్రిటిషుపరిపాలనకొఱకగు నపారమగు వ్యయము. ఈ సందర్భమున గమనింపవలసిన విషయము లేవి యనఁగా గొప్ప గొప్ప జీతములపైని యూరపియను ఉద్యోగుల నియమించుట. పెద్దజీతములు గల ఉద్యోగములసంఖ్య రానురాను వృద్ధి చేయుట. ఏఁటేఁటను సీమకుపోవు ఈయుద్యోగుల నిల్వధనము (మొత్తమును నిర్ణయించుట దుస్తరము) స్వదేశీయుల కిచ్చు అత్యల్పపు జీతములు. (4) స్వదేశపరిశ్రమలయెడ ప్రభుత్వమువారికిఁ గల విముఖత. ఇందున కుదాహరణములు: (అ) సీమనుండి మనదేశములోనికి వచ్చు నూలుబట్టలమీఁద వేసిన పన్నునకు పరిహారముగా మనదేశములో తయారగుచున్న బట్టలమీఁద పన్ను విధించుట. (ఇ) పైనుండి వచ్చు ఉప్పుధర దేశములోఁ జేయఁబడు ఉప్పుధరకంటె హెచ్చుగా నుండకుండుట. దేశీయు లందఱకు మిగుల కష్టకరముగఁ బరిణమించిన యుప్పుపన్ను. (ఉ) ఇంకను శైశవమున నున్న స్వదేశపరిశ్రమలను సంరక్షింప నొల్లకుండుట. (ఋ) దీనిమూలమున దేశమునుండి పైకిఁ బోవుచున్న (Raw materials) పైనుండి పదింతల ధరలతో దేశములోనికి వచ్చుచున్న (Manufactur d foods) నీటిపాలుదల పరిశుభ్రత విద్యావ్యాప్తి మున్నగు దేశమున కుపకరించు పనులయెడల ప్రభుత్వవర్గమునకుఁ గల నిరాదరణము. దీనికి వారుచెప్పు కారణము సొమ్ము చాలదని. 1, 3 విషయములలో ననవసరముగ నంతధనమును పాడుచేయకుండినయెడల స్థితిగతు లెట్లుండెడివో కదా!

## ధనప్రవాహము

ధనప్రవాహ మని దీనిని పిలుచుట కొందఱకు కష్టముగా నుండియుండును. కాని యిదియే దానికి సరియగు పేరు. కాదనిన నిక మనకుఁ గల మాట శాలిస్బరీ ప్రభువు ఉపయోగించిన "రక్తము

తీయుట." దీని నుపయోగించుట మఱింత కష్టముగా నుండును గదా! 1880 వ సంవత్సరమున వెస్టుమిన్స్టర్ రివ్యూలో వ్రాయుచు డబ్ల్యు. టి. తారనన్ "ఇనుపదారులు మంచివియే. నీటిపారుదలకుఁ గలసౌకర్యములును మంచివియే కాని యిందులో నేదియును గూడ ఇండియా దేశముయొక్క హృదయసీమనుండి నెత్తురును పీల్చుచుండిన ధనప్రవాహమునకు సరియైన పరిహారము కానేరదు" అని వ్రాసెను. 1900 సెప్టెంబరు నెల (New England Magazin) లో రెవరెండు సదర్ లాండు—మనదేశములోని క్షామములనుగూర్చి వ్రాయుచు, నియ్యవి వర్షములు సరిగా లేకపోవుటచేతఁ గాని జనసంఖ్య హెచ్చగుచుండుటవలనఁగాని కాక, ప్రజలయొక్క హేయమును భయంకరమును నగు దారిద్ర్యమువలనఁ గలుగుచున్న వని నుడివియుండెను. ఈ మహాదారిద్ర్యమునకు కారణములు విదేశీయులకు మనము కట్టుచున్న కప్పమును ప్రపంచములోనెల్ల నెక్కుడు వ్యయహేతు వగు ప్రభుత్వవర్గమును సేనలును విదేశములతోడ యుద్ధములును (వీనివిషయమై మనదేశము ధరించిన ఖర్చు పదికోట్ల సవరనులు. అందు ఇంగ్లండు ఇచ్చినది ఒకమాఱు ఏబదిలక్షలు మఱియొకమాఱు 500000 సవరనులుమాత్రమే) అని పేర్కొనెను. డిగ్బీ "ఇది యంతయు బలీయమగు నొకదేశము బలహీనమగు మఱియొక దేశముయొక్క రక్తమును పీల్చుటే" అని వ్రాసెను. హిన్డుమన్ తాను వ్రాసిన "హిందూదేశముయొక్క దివాలా" (బాంక్రప్ట్సీ ఆఫ్ ఇండియా) అను గ్రంథములో మన గొప్ప వలసరాజ్యముయొక్క జీవాధార మగు రక్తమును తీసివేయుచున్న తెఱవబడిన రక్తనాళము" అని వ్యవహరించియున్నాడు. ఆ గ్రంథములోనే హిందూదేశము రానురాను మిక్కిలి బలహీన మగుచుండుట మనము కనుగొనగలము. జనబాహుళ్యముయొక్క జీవరక్త మంతయు మనపరిపాలనములో అతిత్వరితగతిని క్షీణించుచున్నది" అనెను. ఈ విధముగ నెన్నియో యుద్గ్రంథములనుండి యుదాహరణములను పెక్కులు జూపింపవచ్చును. కాని యేమిలాభము? హిన్డుమన్ చెప్పినట్లు దీనికంతకు నుత్తరవాదులు ఆంగ్లదేశమునందలి వోటర్లే యని చెప్పక తప్పదు.

దేశమునుండి తీసికొనబడిన పన్నులు దేశములోనే వెచ్చపెట్టిన దేశమున కంతగా కష్టము తోఁపదు. కాని మనదేశముపట్ల నట్లుగాక ధన మంతయు పైకి ప్రవహించుచున్నది. దీనినిగూర్చి సర్. జార్జి 'విన్ గేటు' అను పాత్రమున నిట్లు చెప్పియుండెను:

"ఏదేశమునుండి తీయబడిన పన్నులా దేశముననే ఖర్చుపెట్టుటకును వానిని యితర దేశములలో ఖర్చుపెట్టుటకును చాల తారతమ్యము గలదు. అట్లు తీయబడిన మొత్త మంతయు పన్ను విధింపబడిన దేశమునకు నాశన మయ్యె ననియే యెంచదగును. మనము హిందూదేశములో ఇంతకాలమునుండియు విధించుచుండిన పన్నులన్నియు నీ విధమువే! ఈపన్నులా దేశముపట్ల నెంత క్రూరముగను వినాశహేతువుగను పరిణమించుచున్నవో కొంత యూహింపఁగలము."

రమేశచంద్రదత్తు కూడ నీసంగతినే చెప్పి ఈవిషయమున నాంగ్లముసల్మానుల పరిపాలనములకు గల భేదమును ఇట్లు వివరించెను:

"మొగలాయీల రాబడి యంతయు నీదేశములోనే వెచ్చింపబడి వ్యవసాయమునకును పరిశ్రమలకును అనేకవిధముల తోడ్పడుచుండె నని మనము మఱచియున్నాము. సేనలవిషయమై ఖర్చుపెట్టబడి ఆ సేవకులకు జీవనాధార మొసంగుచుండెను. దివ్యభవనములు నిర్మించుటయందును భోగముల నిమిత్తమును వెచ్చింపబడి కళలకును చేతిపనులకును చేయూత నొసంగుచుండెను. బాటలకొఱకును, కాల్వలకొఱకును వెచ్చింపబడి వ్యవసాయమును వృద్ధి నొందించుచుండెను. కనుకనే మనలనుండి పన్నులవలన తీయబడు సొమ్ము ఏదూరదేశమునకో పోయి అక్కడి వర్తకమునకును పరిశ్రమలకును తోడ్పడక, తిరిగి మనకే చేరుచుండినయెడల ఈ పన్నులభారమును మన మిప్పటికంటె నెక్కుడు సులువుగా వహించియుండెడివారము."

ఇంతియకాక పన్నులను పరులు విధించుటకంటె దేశీయులే విధించుకొనినయెడల నంతగా నసంతృప్తియుండదు. మింటో-మార్లే సంస్కరణముల యనంతరముకూడ శాసనసభలలోని సభ్యుల కంతగా దేశమునుండి పన్నులను విధించుట వానిని ఖర్చుపెట్టుట - ఈ విషయములలో నంతగ స్వాతంత్ర్యమే లేదు.

"ప్రపంచములోనెల్ల నారవభాగము జనసంఖ్య గలిగి ఆదినుండియు నాంగ్లస్వాతంత్ర్యాశయములచేతనే పోషింపబడుచుండిన హైందవుల నెప్పటికిని వారి దేశపాలనవిషయమున జోక్య మీయక యుంచగలుగుదు మని నేను విశ్వసింపలేను. 'ప్రాతినిధ్యము లేనిది పన్నులు కూడదు.' అను మహామంత్రము నుపదేశించిన మనము స్వదేశీయులకు ఆదాయవ్యయవిషయములయెడల నధికార మేమియును లేక యుంచగలుగుదు మని నేను నమ్మను" అని సర్ విలియము గారు వ్రాసిరి.

ఇంకను ఈ ధనప్రవాహము దినదినము ప్రవర్ధమాన మగుచున్నది గాని తగ్గుచున్నట్లు సూచనలు గాన్పింపవు. హిన్డుమన్ వ్రాసిన కాలమునకంటె నిప్పు డెక్కువగా దేశము దివాలా అగుటకు సిద్ధముగా నున్నది. ఈచేటు మాన్పగలందులకే మన కిప్పుడు ముఖ్యముగా స్వరాజ్య మవసరముగా నున్నది. ఇండియా ఐశ్వర్యముతో నుండుట ఇంగ్లాండునకు కుడిభుజముగాదా? దారిద్ర్యములో నుండినయెడల భారము గాక అదితర మెట్లగును? ఇప్పుడైను మేల్కొని దానిని వారింప ప్రయత్నింపనియెడల హిందూదేశము నాశనమగుట నిశ్చయము. దానితోపాటు ఇంగ్లాండును ధ్వంసము కాఁగలదు.

కొందఱీ ధనప్రవాహము మనకు విదేశీయు లొనర్చు సేవలకొఱకు మనము న్యాయ్యముగ నీయవలసిన ఉపహారము అనియెదరు. కాని, యీ సేనలు, విరివిగా పోషింపఁబడుచున్న యీ యుద్యోగులు, మనయిష్టము లేకయే ఏర్పాటైన వనియు, మనకే స్వతంత్రత అవంతయేని యున్నచో, మనవారే చేసియుండెద రనియు, అప్పుడు ఈధన మంతయు మనయొద్దనే యుండెడి దనియును మఱచుచున్నాము.

## దుర్భరము లగు పన్నులు

ఇఁకను రాళ్లనుండి రక్త మేవిధముగా పిండబడుచున్నదో విచారింతము. రాళ్లనఁగా కేవలము రాళ్లు గావు. కాని జీవముగల రాళ్లు—కష్టసుఖములను విచక్షణ చేయగలిగిన రాళ్లు—మంచిచెడ్డల వివేకము గల రాళ్లు—పూర్తిగా కడుపునిండ రెండుపూటలు భుజింప దిండిలేని సేద్యగాండ్రు, అన్నమన్న నేమియో నెఱుగక తుదకు రోజున కొకమారైనను త్రాగ గంజినీళ్లైనను కని కూలివాండ్రు; ప్రాణములమాత్రము పోకుండ నిలువఁబెట్టుకొని తాముసు మనుష్యులవలె సంచరించుచున్న యస్థిపంజరములు రుధిరమాంసములు లేని బక్కమృగములు. రాళ్లు — "మనరైతులు సంవత్సరము పొడవునను పూర్తిగా తమ ఆకలిని తీర్చుకొనుట యన దాని నెఱుఁగ రని చెప్పుటకు

నే నెంతమాత్రము సంశయింపను! పదికోట్ల జనులు ఆబాలగోపాలము ఎల్లప్పుడును ఆకలిచేఁ బీడింపఁబడుట దీనికి కారణము దుర్భరమగు పన్నులు వీని నింకను హెచ్చింపఁ బ్రయత్నించినయెడల నిష్ఫలమనోరథుల మగుదుము" (డిగ్బీ) భూమినుండి విధింపఁబడు పన్ను రైతునకు సరిగా తిండికి కావలసినంత గూడ విడువనంతగ నెక్కుడుగా నున్నదని రణడే, గోఖలే మొదలగు మహనీయులు చెప్పిరి.

ఈమహాదారిద్ర్యమునకు పండుగలు పబ్బములపట్ల రైతులు ఖర్చుపెట్టు ధనమే కారణమని సర్ అంటనీ మెగ్డానల్ (సంయుక్తరాష్ట్రములకు లెప్టినెంటు గవర్నరుగా నుండెను) చెప్పెను. కాని ఈ భోగములకుగాను వారికి మిగులునది ఏపాటి? ఒకవేళ మిగిలినను ఆంగ్లయుద్యోగి యొకడు క్లబ్బులలో నొక్కమాఱు వ్యయపఱచు ధనములో నెన్నవవంతో? డిగ్బీ మనరైతుల ఆదాయవ్యయముల లెక్కలు తయారుచేసి యుండెను. అందునుండి యొక యుదాహరణమును చూపెదను. సంయుక్తపరగణాలలో 5½ ఎకరముల భూమి ఒక జత యెద్దు ఒక నాగలి గలిగిన రైతునకు ఖర్చులు పోగా సంవత్సరమునకు మిగిలినది రూ 45-14 అణాలు. వానికి కుటుంబమున నైదుగురు. కనుక తల యొకటికి సంవత్సరమునకు 9-2-10 దాదాపు అగును. ఇట్టి వనేకములు గలవు. రివరెండు మెక్ఫర్ సేను గారు:—"రెండు మూఁడు రోజుల కొకసారి యొకపూట నేదో తిని ప్రజలు జీవించుచున్నారు. ఈ భోగమును కూడ లేనివా రున్నారు. నాతో నొక క్రైస్తవుఁ డిట్లు చెప్పెను. "రెండు రోజుల కొకపూట తిండి యుండిన మా కింక కావలసిన దేమియును లేదు. ఆహా! అనాదినుండియు ఐశ్వర్యముతో తులఁదూఁగుచుండిన భారతదేశము నేఁ డిట్టి దుస్థితికి వచ్చినది. దానికి చాలవఱకు కారణము ప్రస్తుతరాజ్యాంగవిధానము. దూరదృష్టి లేక తాత్కాలిక లాభమును గోరు ప్రభుత్వవర్గము. "వారి ఐశ్వర్యమే మాబలము" అని శ్రీవిక్టోరియా మహారాజ్ఞి నుడివి యుండెను గదా! వారి దారిద్ర్యమో!!

## ఆంగ్లపరిపాలనవ్యయము

డిగ్బీ యిట్లు చెప్పెను:—"ఇండియామంత్రి యొక్క వేతనము 90,000 హైందవుల సంవత్సరాదాయమునకు సరిపోవును." అన్నతమా? ఇట్లు పరిపాలననిమిత్తము పోవు ధనప్రవాహము గాక దేశములో అగుచున్న ఖర్చు వైస్రాయిగారికి సంవత్సరమునకు రు 250,800. ముగ్గురు గవర్నరులకు సం॥మునకు రు 3,60,000, లెప్టినెంటు గవర్నరులకు రు 1,00,000. ఇట్లే మిగిలిన ఉద్యోగుల జీతములును ఉన్నవి.

వీనికిఁగాక క్రైస్తవదేవాలయములకై బోలెడుసొమ్ము వెచ్చింపబడుచున్నది. ఇదియును, హైందవులను ముసల్మానులను పారసీకులను నిరసనభావముతో చూచుచు వారిలో వారికి నిరంతరము అనైకమత్యమును గలుగఁజేయఁజూచు క్రైస్తవస్వాములకొఱకగుచున్నది

స్వరాజ్య ముండినయెడల అనవసరముగ మనలను పీడించుచుండిన ఖర్చులలో చాలభాగము తగ్గగలదు. దీనినిగూర్చి సర్కార్ ఇట్లు వ్రాసెను. ఇండియా ఇంగ్లాండునకు లోఁబడి యున్న పెద్ద రాజ్యము. దాని అస్వతంత్రతవలన చాలమంది ఆంగ్లోద్యోగులను నియమించుకోవలసి యున్నది. వీరి కిచ్చు ఉపకారవేతనములును, ఉద్యోగమునుండు ఆతి వీరుచేర్చిన నిలువలును, ఇంగ్లాండునకు పంపఁబడుచున్నవి. ఆంగ్లేయులు మనదేశమున పెరుఁగఁజాలరు. కనుక వారి పిల్లలను నాలుగేండ్లు రాఁగానే చదువునకుఁ గాను వారు సీమకు పంపుదురు. తండ్రుల జీతములలో చాలభాగము (ఒక్కొక్కప్పుడు 3 పాళ్లుగూడ) వారినిమిత్తము సీమకు పంపఁబడుచుండును.

ఇవి గాక విద్యా న్యాయాపథశాఖలలో గొప్పవేతనము లనుభవించువా రందఱును చాలభాగము శ్వేతముఖులే! ఏలయన—ఆశాఖలకు సాధారణముగ ఆంగ్లపరీక్షలయం దారితేరినవారు గావలెను. హైందవు డెవఁడైన వీనిలో దేనికైన ఆశించెనా సీమకు పోయి సంవత్సరమునకు మూఁడువేల రూ॥ల చొప్పున ఖర్చుపెట్టి అక్కడిపరీక్షలో తేలి రావలెను. ఇది యంతయును ధనప్రవాహమునకు తోడే కదా! ఇది తగ్గుటకు సివిల్ సర్వీసు మొదలగు పెద్దపరీక్షలను మనదేశమునందున్ను ఉంచవలసిన దని మన మనేకసార్లు పెట్టిన మొఱ్ఱ నెడచెవిని పెట్టిరి.

## దేశీయపరిశ్రమలు

పూర్వకాలమున నసఁగా తెల్లవారు మనదేశమునకు రాకపూర్వము మనదేశ మెక్కుడైశ్వర్యము ననుభవించుచున్నట్లు తెలిసితిని. ఈ ఐశ్వర్యమునకు కేవలము వ్యవసాయమే గాక పరిశ్రమలు గూడ కారణములే! హిందూదేశమునందు తయారుచేయు బట్టలు మొదలుగాగల వస్తువు లనేకములు దేశదేశములకు గొంపోబడి ఆయాదేశీయుల కాశ్చర్యమును పురికొల్పుచుండెడివి. ప్రస్తుతము ఇంగ్లాండులోనికివలె, ఆనాఁడు మనదేశములోని కెక్కడలేని ధనమును అనర్గళముగా ప్రవహించుచుండెడిది. కాని యిప్పుడు కారణాంతరములచేత నవన్నియు నశించినవి. ఎక్కడనైన తిరిగి నెలకొల్పబడినను ప్రభుత్వమువారికి వానియందు గల అభిమానాభావముచేత నడుగంటుచున్నవి. ఇందుల కొక యుదాహరణము.— బొంబాయి నగరమున కొంతకాలము క్రిందట బట్టలు నేయు యంత్రములు స్థాపింపబడినవి. సీమనుండి వచ్చు బట్టలకు వీనిమూలమున నష్టము వచ్చునేమో యని వీనిమీద పన్ను విధించిరి. ఉప్పుపన్ను గూడ నీరకమదే. కనుక మొత్తమున మనదేశములో పరిశ్రమలు సున్న. పండిన మోటుపదార్థముల నన్నిఁటిని పరదేశముల కెంతయో చౌకగా పంపి అక్కడ తయారై వచ్చిన సరకులను మిగుల హెచ్చుధరలకు తిరిగి మనకే పంపుచుండుట తటస్థించినది. ఈకొఱంత దీర్ప స్వదేశోద్యమము కొంతవఱకు తోడ్పడెను గాని, స్వరాజ్యప్రాప్తి యైనచో జర్మనీ, జపాను యునైటెడ్ స్టేట్సులో వలె మనమును మన పరిశ్రమలను తగురీతిని సంరక్షించి పెంపొందించుకొనఁగలము.

## పబ్లిక్ వర్క్సు

మన రాజకీయసంస్కర్తలు సాధారణముగా పెట్టుచుండిన మొఱలలో నిది యొకటి. దేశముయొక్క పురోభివృద్ధికి ఎక్కువగా తోడ్పడు ఇరిగేషన్ ఎడ్యుకేషన్ శానిటేషన్ కంటె నెక్కువ ఖర్చు ఇనుపదారులు మొదలగువానిమీద పెట్టుచుండుట. ఈ యినుపదారులమీఁద ఖర్చుచేసిన సొమ్ము దేశీయులది. దీనివడ్డీకి గవర్నమెంటే హామీగా నుండుటే గాక దేశమునుండివచ్చిన ఆదాయములో కొంతభాగము వేరుపెట్టియున్నారు. 1914-15 వ సంవత్సరములో ఇందునిమిత్తమైన ఖర్చు రు 1,16,000,00. ఇరిగేషన్ గురించి 12,00000, ఎడ్యుకేషన్ 83,20000 వైద్యము ఆరోగ్యముకొఱకు 15,00000.

లాభ మెక్కువగల ఇరిగేషన్ ఎడ్యుకేషన్ మొదలగువాని మీఁద గాక, రైలుమార్గములమీఁద ప్రభుత్వమువారేల యెక్కుడుగ సొమ్ము వ్యయపెట్టవలయునో కొంత యోజించిన ప్రజాలాభము

కంటె వాంగ్లభాగస్వాముల లాభము నే వారు ఎక్కువగా గోరుచుం దురని తేటపడఁగలదు.

ఈ విషయము లన్నియును చూడ—దేశమునకు ధనలాభము గలుగజేయు వ్యవసాయము పరిశ్రమలు మొదలగునవి క్షీణించు చుండుట, వానియెడల ప్రభుత్వమునకు గల నిర్లక్ష్యభావము, వీనికై నంతవఱకు ధన మంతయును దుర్భరమగు పన్నులమూలమున పీల్చ బడుచుండుట, ఇవి మన ప్రస్తుతపు దారిద్ర్యమునకు గల కారణము లలో కొన్ని. దారిద్ర్యమువలన క్షామము. దానివలన కాటకము. ఈ రెండింటివలన ప్రతిసంవత్సరమును కోట్లకొలది మనసోదరులు మర ణించుట తటస్థించుచున్నది. ఇంతయేల? ప్రపంచములో నెల్ల మన దేశములో జీవనకాలపరిమితి చాల తక్కువగా నున్నది. సగటున ఇంగ్లాండులో 40 వత్సరములును న్యూజీలండులో 60 వత్సరములును ఉన్నది. కాని మనదేశమున నది 25 లోపలనే యున్నది. ఈస్థితి ప్రతిభారతీయునకును ఒడలు ఝల్లుమనిపింపక మానదు. ఇందులకు గత్యంతరము ఒక్కటియే! ప్రభుత్వములో మనకు చాలవఱకు జోక్య ముండవలయును. ఆదాయవ్యయములు మన యిష్టము వచ్చినట్లు జరుగుచుండవలెను. ఇంత యేల? మనకు స్వరాజ్యము రావలయును. అప్పుడీ యిక్కట్టు లన్నియు నడుగంటును. మనదేశము తిరిగి ఐశ్వ ర్యములోనికి రాగలుగును. మనకు తినుటకు తిండియును కట్టుటకు గుడ్డయును లోటు లేక యుండును. మన మిట్లు బాగుండుటవలన ఇంగ్లాండునకును సామ్రాజ్యమునకును కూడ మనదేశము మఱింత లాభకారిగా నుండగలుగును. కనుక స్వరాజ్యప్రాప్తికొఱకు ప్రతి హైందవుడును విసుగులేక పని చేయవలసియున్నది. ఇట్లు పనిచేసిన వాంఛాసిద్ధి అచిరకాలముననే తప్పక కలుగగలదు. ఇది భగవదిచ్ఛ. దీనిని తప్పింప నెవరితరమును గాదు. కనుక కార్యసిద్ధి బడయువఱ కును ప్రతి భారతీయుఁడును పాటుపడును గాక!

# కతిపయసుభాషితములు

బుక్కపట్టణము రామానుజయ్య గారు

ఎన్నఁడును జెప్పరాదు తా నెఱుఁగు టెల్ల;
ఎవ్వఁ డెఱిఁగిన దంతయు నితరులకును
జెప్పఁ బూనునో, యాతఁ డెల్లప్పుడుఁ దన
తెలిసినంతకంటెఁ దెలియఁ బలుకుచుండు. ౧

ఆ. వినెడిమాట లెల్ల విశ్వసించునతండు
వినినయంతకంటె నినుమడిగను
విశ్వసించుచుండు వివరించి యిది మిథ్య
మనుచు నేర్పరించు నను తెఱుఁగమి. ౨

ఆ. ఇచ్చవచ్చినట్టు వెచ్చింపఁ గా రాదు;
ఆయ మెఱిఁగి వ్యయము సేయవలయు;
మితములేని వ్యయము మిడుకుచుఁ జేయువాఁ
డప్పు సేసి తుదకు ముప్పుఁ జెందు. 3

ఆ. మితము మీఱి యెపుడు మెక్కంగ వలవదు
అట్లు సేయువాని కగు నలుకువ;
దాన రక్తము చెడి హీనబలుం డగు
రోగయుక్తుఁ డగును బాగు తప్పి. ౪

ఆ. కాలనియతి లేక కడు నిద్ర పోరాదు
నిద్రయందుఁ గూడ నియతి వలయు
నధికనిద్ర యెపుడు హానిప్రదము సుమ్ము
పగటినిద్ర యెందలె తగదు తగదు. ౫

క. మితముగ భాషించుటయును
మితముగ భుజియించుటయును మితముగ సతమున్
మితముగ వెచ్చించుటయును
మితముగ నిద్రించుటయును మే లొనగూర్చున్. ౬

ఆ. 'అమిత మయ్యె నేని యమృతంబు సైతము
విష మె యగు' నటంద్రు విబుధవరులు;
కనుక సకలకార్యకరణంబునందును
మితమె యుక్త మగుచు మేలు గూర్చు. ౭

క. కాలఁదికి మీఱిన పనులను
సలుపం దలపడిన మాత్ర సాధ్యం బగునే?
కాలఁదికిఁ దగు పనులను దాఁ
జలుపం దిపురంగ వలయు సఫలతకొఱకున్. ౮

క. వేగిర మొప్పదు పనులను
జాగును మఱి యొప్ప దటులె; శ్రద్ధను గార్యో
ద్యోగంబు సేయు నెడలను
బాగుగఁ గొనసాగు నంచుఁ బలికిరి విబుధుల్. ౯

క. ఈయఁగ రా దమితంబుగ
ఈయక మఱి యుండరాదు; హేయం బదియున్;
ఈఁకుఁగవలయును తగుగతిఁ
బాయని ప్రేమంబుతోడఁ బరులకు నెపుడున్. ౧౦

# బసవేశ్వరుఁడు

బండారు తమ్మయ్య గారు

మండఁగి వంశ భూషణుఁడు మాదయ,
తత్సతిమాదమాంబ బ్ర
హ్మాండవికీర్ణ గీతయశు నంబుజ
లోచన ముఖ్యదేవతా
మండల సేవ్య ధీరగుణ మండితు
శ్రీబసవేశ్వరాఖ్యు నే
దండితపంబు మైఁగనిరో! ధన్యతఁజెంది
నిజైక పుత్రుగాన్.

సీ. ఫాలాక్షభక్తక ల్పక మెవ్వఁడనిన వీఁ
డను జిహ్వకు నమృత మైన వాఁడు
భక్తిసీమంతినీ వరుఁ డెవ్వఁ డనిన వీఁ
డని చూపుటకు లక్ష్య మైన వాఁడు
అకలంకధర్మరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
డని యెన్నుటకు నాద్యుఁడైన వాఁడు
సర్వజ్ఞమూర్తి నాఁ జను నెవ్వఁడనిన వీఁ
డను పల్కునకు రూఢి యైనవాఁడు

గీ. బిజ్జల క్ష్మాతలాధిపోద్వేలరాజ్య
రక్షణను దక్షుఁ డపరఫాలేక్షణుండు
భరతజనయిత్రి సల్పిన వ్రతముఫలము
ప్రథితగుణహారి! మాదయ బసవశౌరి.

సీ. ఉరు రాష్ట్రపతి యయ్యు నుద్ధతిఁ జూపకే
వీరమతాప్తిఁ గావించినాఁడు
గురుఁడు శ్రీసంగమేశ్వరుఁ డొనర్చినబోధ
లెల్లను లీలఁ బాలించినాఁడు
లింగాయతులఁ గాంచి యంగజహరు లని
యెంచి సద్భక్తిఁ బూజించినాఁడు
ప్రతివాదిచయము నుద్భటవివాదముల జ
యించి యశశ్శ్రీ వహించినాఁడు

గీ. జననుతంబుగ సంగమేశ్వరునిగుడికి
నేఁగి యాదివ్యమూర్తిఁ బల్కించినాఁడు
శర్వునధికత నుర్విని జాటినాఁడు
మనుజమాత్రుండె బసవనామాత్య వరుఁడు.

ఉ. భక్తియె జ్ఞానసాధనము
భక్తియె మోక్షరమాలవాలమున్
భక్తులె రుద్రమూర్తు లిల
భక్తుల యంద వసించు లోకముల్
భక్తులఁ గొల్వఁ దత్ఫలము
భర్గునిఁ జెందు నటంచు నెంచు నీ
ప్రాక్తనజన్మవాసనల
ప్రాభవముం గణుతింప శక్యమే?

చ. కలియుగమందు సంఘమున
కన్నను మించిన శక్తి లేదు భ
క్తులయెడ జాతిభేదమును
కూర్చుట పాప మటంచు వీరదీ
క్షుల దయచేసి ప్రేమమున
సర్వ సమత్వపు దృష్టి నన్నిజాఁ
తుల పరికించు నీ వపర
ధూర్జటి వౌటకు శంక యున్నదే!

# కవితాకుమారి

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

కలఁ గన్న హరిణంబు వలె లేచి కూర్చుండు
తనుమధ్య యర్ధరాత్రంబువేళ
నోట మాటలు రాక మాటిమాటికి నట్టె
కమలాక్షి కన్నీరు గార్చుచుండు
ననుఁ గాచువార లంతము నొందిరే యంచు
నేణాక్షి భోరున నేడ్చుచుండు
గర్భదరిద్రు లీక్ష్మాతలేంద్రు లటంచు
కోమలాలక పండ్లు కొఱుకుచుండు
కృష్ణరాయనరేంద్ర! నీ వెచట నుంటి
వనుచుఁ బరుగిడు నిర్జనోద్యానములకు
పోయి యటునిటుఁ బరికించుఁ బుష్పరాజిఁ
దళ్కులమిటారి మాకవితాకుమారి.

సీ. నీకోరికలఁ దీర్చి నీముద్దుఁ జెల్లింప
నువిదరో పెద్దనార్యుండు లేఁడు
నినుఁ జెంతఁ జేర్చి తియ్యని పల్కులను దేర్ప
బాల! కృష్ణావనీశ్వరుఁడు లేఁడు
నిను ముద్దుఁగొనుచు శయ్యను జేర్చి లాలింప
రాజీవముఖి! కవిరాజు లేఁడు
కన్నకూఁతుని రీతిఁ గాంచి నిన్ బ్రేమింప
లోలాక్షి! పోతనార్యుండు లేఁడు
పట్టణంబులపై నాసపడకు మింక
నీకు నిలువంగ మాయుండ నీడ లేదు
నిర్జనారణ్య సీమలే నీకు దిక్కు
తళ్కులమిటారి! యో కవితాకుమారి!

సీ. కాంతారములలోనఁ గలకంఠములఁ గూడి
పాటఁ బాడఁగ నెంచు నాఁటి తలఁపు
కాసారసార పంకజ రంగముల పైన
నాట్య మాడఁగ నెంచు నాఁటి తలఁపు
పొదరిండ్లలో నక్కి, పోమెడి ముగ్ధకాం
తారచారుల గెల్చునాఁటి తలఁపు
గహనధాత్రీధరాగ్రములపై నెక్కి తాం
డవపాటవముఁ దెల్పునాఁటి తలఁపు
తలఁపు లన్నియు దీర సంతసము మీఱ
మునిసతీ ఖేలనాలోల జనితబుద్ధి
గహనముల కేగు శ్రీరాముకాంతవోలె
కాననంబుల కేఁగఁ బొమ్ము కలికిమిన్న!

సీ. ధనకాంక్షచే నిన్ను దరిఁ జేర్చుకొన నెంచు
నదయాత్ములను జేర నరుగ కమ్మ!
కామశాంతికి నిన్ను గామింపగా నెంచు
చండాలబృందమ్ముఁ జేరకమ్మ
కీర్తివాంఛను నీదు కేలుఁ బట్టఁ గడంగు
జీవచ్ఛవంబులఁ జేరకమ్మ
వక్తృత్వమున నిన్ను భయపెట్ట నేతెంచు
వదరుఁబోతులఁ గాంచి బెదరకమ్మ!
నీటిబుగ్గలు నీ వెంత? నేఁడు గాని
బ్రహ్మకల్పాంత మందురే బాల! చెపుమ!
నిత్యకల్యాణివి గదమ్మ నీవు తలఁప
తళ్కులమిటారి! యో కవితాకుమారి!

The Hon. Mr. T. Arumunatham Pillai



గా. టి. అరుమునాథంపిళ్లె గారు

The Hon. Mr. Madhava Rajah



గా. మాధవరాజా గారు

The Hon'ble Khan Bahadur
Habibullah Sahib Bahadur



గా. హబిబుల్లాసాహేబు గారు

The Hon. R. Littlehailes M. A.
(Director of Public Instruction)



గా. ఆర్. లిటిల్‌హేల్సు గారు

The Hon. T. R. Ramachandra Iyer



గా. టి. ఆర్. రామచంద్రయ్యరు గారు

The Hon'ble Dr. Usman Sahib



గా. డాక్టరు ఉస్మానుసాహేబు గారు

The Hon'ble Dewan Bahadur
A. Subbarayulu Reddiar



గా. ఎ. సుబ్బరాయులురెడ్డి గారు

Mr. Sadulla Badsha Sahib



సదుల్లా బాషాసాహేబు గారు

The Hon. Khan Bahadur Ahmed Thambi Maracar



గౌ. అహమ్మదు తంబి మరకాయరుగారు

The Hon. The Rev. E. M. Macpail M.A.B.D



గౌ. రివరెండు మెక్ఫైలు దొరగారు

Sir Clement Simpson



సర్ క్లెమెంటు సింప్సన్ దొరగారు

The Hon. Mr. M. C. Raja (Panchama Member)



గౌ. ఎమ్. సి. రాజాగారు, (పంచముల తరఫున సభ్యుడు)

# ఆంధ్రులు - గ్రంథముద్రణము

దేశాభ్యుదయ మహాసౌధనిర్మాణమునకు విజ్ఞానవ్యాప్తి ప్రధాన సాధనము. విజ్ఞానవ్యాప్తికి గ్రంథనిలయములును, వానికి శేముషీధురంధరు లనఁదగిన కవిమనీషుల గ్రంథరాజములును ఆదికారణములు. ఇట్టి గ్రంథరాజముల యుపచయాపచయములపైనను, వ్యాప్త్యవ్యాప్తులపైనను దేశాభ్యుదయమహాసౌధ మాధారపడి యుండును. మహాసౌధముయొక్క స్థైర్య సౌకుమార్య సౌష్ఠవములకు కారణభూతములైన తదవయవములలో, ఏకారణమువలననైనఁగాని ఎచ్చోటనైనను ఏమాత్రము శైథిల్యముగాని వైకల్యముగాని పొరయునేని, ఆమహాసౌధపు అందచందములకును చిరస్థాయితకును మాత్రమే లోపము వాటిల్లుటయేగాక, ఒక్కొకప్పుడు అనిమిత్తాగమములగు భయప్రమాదములకు తనలో వసించువారితో గలసి చుట్టుప్రక్కల వారిని సయితము లోనగునట్లు చేయుటయుఁ గలదు. కావున దేశీయ మహాభ్యుదయ సౌధనిర్మాణ చికీర్షువు లగు నాయకులు సౌధనిర్మాణ చికీర్షువులవలెనే తమకుఁగల దూరదర్శకతా మనీషావిశేషములను అప్రమత్తతతో, అనితరసాధారణ మగు నేర్పుతో వినియోగించి తొలుతనుండియును సర్వవిషయములఁ బరీక్షించుచును, అప్పటప్పటికి సంభవించు వాటిల్లు లోపములను, తన్నివారణోపాయములను, అందుమూలమున ప్రత్యవయవమునకు దార్ఢ్యముఁ జిరజీవితను ఆపాదించు తెఱఁగులను, నిర్దేశించి, దేశముకాలము పాత్రము పరిస్థితి మున్నగువాని ప్రవృత్తినివృత్తిప్రమాణములను లెక్కించి తదనుసారముగ, దేశాభ్యుదయ మహాసౌధమును దృఢముగను నిరుద్ధముగను అందముగను, అనుపమానముగను తీర్చుచు, విజ్ఞానవ్యాప్తికి పరంపరాకారణము లగు గ్రంథములను తద్భాండాగారములను ప్రచారపథమునకుఁ గొనివచ్చుటకై ప్రయత్నించుట ధర్మ్యము. కావునఁ బ్రకృత మీ వ్యాసమునందు ఆంధ్రులు గ్రంథముద్రణము అను విషయములను గురించి కొన్ని సంగతులను వివరింపఁబూనితిని.

## ఆంధ్రులు

మన యాంధ్రమహాజనులు మిగులఁ బ్రాచీనకాలముననే స్వతంత్రులై నాగరకాగ్రేసరులై భరతఖండమునందు సుప్రసిద్ధప్రజాపరిపాలకులలో నొకరుగ నున్నట్లు ఆదికావ్య మగు వాల్మీకి రామాయణమునందలి సీతాన్వేషణావసరకథితము అగు శ్లోకోక్తిచే నూహింప వీలగుచున్నది. ఇట్టి మన ఆంధ్రులు ఉదారహృదయులు నగుటచేతఁ గాబోలు తొల్లిటినుండి నేటివఱకును లోకకల్యాణసంధాయకములగు నూత్నసంస్కారము లనిన నత్యంతము సంతుష్టహృదయులై ముందంజవైచెడి స్వభావము గలవారని చరిత్రము సహస్రముఖముల నుద్ఘోషించుచున్నది. క్రీ. పూ. 800 నుండి క్రీ. శ. 230 వఱకును ఆంధ్రదేశమును పాలించిన ఆంధ్రరాజులలోనివాఁడని పేర్కొనబడిన హాలుఁడే దేశభాషానిబద్ధాదరుఁడై విశ్వచమత్కారనిధి యనఁదగు బృహత్కథను ప్రాకృతభాషలో వ్రాయించి వెలయించె నను వార్త అనుపూర్విగ వచ్చుచున్నయది. ఇంతయేల? ఆంధ్రులు నాగరకోత్తములై తదితరులకు అన్నివిధములను ఆదర్శప్రాయులైరనిన అతిశయోక్తి కానేరదు. చరిత్రముఁ జూడుఁడు. అహింసా పరమోధర్మః యను బౌద్ధమతవ్యాప్తికి కారకు లాంధ్రులు. అశోకవర్ధనుని సామ్రాజ్యధూర్వహు లాంధ్రులు. సంకుచితహృదయులై నాటిదేశములవా రున్నప్పుడు ఉదారహృదయతను ప్రదర్శించి సముద్రయానము స్త్రీజనమునకు విద్యాస్వాతంత్ర్యాదులు మున్నగువానిని ఆచరణమునఁ బెట్టిన సంస్కర్త లాంధ్రులు. ఇది చాల పురాతనపుమాట. కాని ఇప్పటికిని మనవారిలో నిట్టి యుదారగుణశోభితు లగు మహాజనులు లేక పోలేదు.

## గ్రంథముద్రణావశ్యకత

తొల్లిటి సంప్రదాయ మెట్లున్నను ప్రకృతము మహాత్మపరిశ్రమార్జితము లగు గ్రంథరత్నములలోని విజ్ఞానకళికలను దేశమున వెదజల్లవలయు ననిన గ్రంథముద్రణముకంటె నుత్తమమగు సాధనసంపద వేఱొకటి కానరాకున్నయది. ముద్రణములేని ప్రాచీనకాలమునందు గ్రంథములకు వ్యాప్తిలేదా? యని ప్రశ్నింప వచ్చును. కాని అది ఏకదేశోక్తి. పూర్వులలో-అనితరసాధారణములగు శారీరక మానసిక పరిశ్రమల నారితేరినవారికి నైనను తొలుత గ్రంథార్జనమును, అటుపైని పరిశుద్ధముగ సందర్భలేఖనమును, పిమ్మట క్రిమికీటకాదులనుండి పరిరక్షణము మున్నగు క్లేశబాహుళ్యముతో సిద్ధించుచుండెడిదే కాని ఇప్పటివలె పండిత పామరులకు సమీపదేశ దూరప్రదేశస్థితులకు సమముగా శుద్ధముగ నింపుగ గ్రంథములు లభించుట లేదనుట సత్యేతరము కాఁజాలదు. మనవారు పరంపరగ లిఖితగ్రంథాంతములయందు వ్రాయుచువచ్చిన ఈ శ్లోకము, గ్రంథలేఖకపరిశ్రమమును వ్యక్తీకరింపఁ జాలును.

శ్లో. భిన్నపృష్ఠకటిగ్రీవ స్తబ్ధబాహు రధోముఖః,
ప్రయత్నేనాలిఖం గ్రంథం యత్నేన పరిపాల్యతామ్.

ఇట్టి క్లేశబాహుళ్యములను పర్యాలోచించి బుద్ధిమదగ్రగణ్యులగు పెద్దలు గ్రంథములను ముద్రించురీతిని కనిపెట్టినారు. దీనివలన గ్రంథములను వ్రాయించుకొను కాలమునుండి కలిగిన కాల, ధన, మనఃక్లేశములు చాలవఱకు అంతరించినవన వచ్చును.

## గ్రంథముద్రణపు ఆద్యచరిత్ర

లేఖన మన నేమో ఖండాంతరవాసుల కెవ్వరికిని పొడగట్టకమున్నే నాగరకతామూలకమగు లేఖనమునకు ఆద్యోపజ్ఞను గడించిన మన భారతఖండమునందు తొలుత గ్రంథముద్రణ మున్నదో లేదో

స్పష్టముగ చెప్పఁజాలము. కాని గ్రంథముద్రణమున కనురూపకము లైన కొన్ని చిహ్నములు కలవనుటలో నేమియును సందియము లేదు. అయినను ప్రస్తుతకాలపు పరిష్కృతము లగు పరదేశీయచరిత్రలఁబట్టి ఈయశమును శ్వేతద్వీపవాసులకే ఇచ్చుట సమంజసముగా నుండును. గ్రంథముద్రణము తొలుతఁ బదియవ శతాబ్ది ప్రథమభాగమునఁ జీనాయందు కనిపెట్టఁబడి 18 వ శతాబ్ది ఆరంభమునాఁటికి దాదాపు జర్మనీవఱకు వ్యాపించెనని చారిత్రికులమతము. జర్మనీలోని మెంట్సు నివాసులగు గ్యూటెంబర్గు జోహన్నాఫాస్టు లనువారు తొలుత కఱ్ఱదిమ్మెలతో ముద్రణయంత్రమును సిద్ధముచేసిరి. ఇవియే చాల కాలమువఱకు వాడుకలో నుండెనఁట. తరువాత 18 వ శతాబ్దిలో అమెరికాలోని జార్జి కైపరు అనునతఁడు కొలంబ్రియను అను క్రొత్త యంత్రమును వాడుకలోనికి తెచ్చెనఁట. పిమ్మట క్రమముగా నీముద్రణకార్యమునందు చిత్రచిత్రములగు పనితరములఁ, కళాకౌశలములు ప్రదర్శింప ననువగునట్టులు ఆద్వీపవాసులు చేసియున్నారు. మఱియును గ్రంథముద్రణము ఆరంభమున రాగిరేకులు, ఒకపాటి మెత్తఁదనము గలరాళ్లు మున్నగువానిపై చెక్కుట మూలముగా వ్యాపించినది. శాసనములు శిలాలేఖలు మున్నగునవి ఈజాతిలో చేరినవే. అజంతాగుహలలోని గోడలనిండ బుద్ధుని విలాసకథలు ఈరీతిగానే చెక్కఁబడియున్నవని ఒకరివలన వినియున్నాను. చెక్కుటపు పని కొంత ప్రాతపడినపిదప, లిథోముద్రణము వ్యాప్తిలోనికి వచ్చినది. కాని అందును సరియగు సౌలభ్యము కుదురలేదు. అటుపైని టైపు ముద్రణమారంభమై ఇప్పుడెక్కడ చూచినను తానయై విశ్వరూప స్ఫురణతో రాజిల్లుచున్నది. హిందూదేశమునం దీగ్రంథముద్రణము క్రైస్తవమత పీఠాధిపతుల పరిశ్రమము మూలమున నంకురించియున్న దెసల నల్లుకొనిన దనుటలో అన్యథము ఇసుమంతయు లేదు. ఇందులకు ప్రతిభారతీయుఁడును వారియెడల కృతజ్ఞత వహించి యుండవలెననుట నిక్కము.

## ఆంధ్రుల గ్రంథముద్రణపు ఆద్యచారిత్రము

పదునేడవ శతాబ్ది ప్రథమార్థములో క్రైస్తవమత బోధకులు కొందఱు ఆంగ్లదేశమునుండి వచ్చి కలకత్తాకు సమీపమున నున్న శ్రీరామపురమున నివసించి మతప్రచారమును చేయుచు, మతగ్రంథములను దేశీయభాషలలో ముద్రింపవలయునని సంకల్పించుకొని చెన్నపురి కలకత్తా బొంబైలయందు ముద్రణయంత్రములను స్థాపించిరనియును ఆయంత్రములయందే ప్రప్రథమమున నాంధ్రగ్రంథముగ వారి మతగ్రంథమును ముద్రించిరనియును విజ్ఞానసర్వస్వలేఖకులు వ్రాసిరి. ఇఁకను అన్యదేశీయుఁడైనను ఆంధ్రమును ప్రేమపూర్వకముగఁ బఠించి ఆంధ్ర విజ్ఞానమును గడించిన బ్రౌను దొరగారు తాము వ్రాసిన తెలుఁగు ఇంగ్లీషు డిక్షనరీ యుపోద్ఘాతమునందు ఆంధ్రమునందు గ్రంథముద్రణము పదునేడవ శతాబ్ది ప్రథమార్థములోఁ గాక, 1806-వ సంవత్సరములో ప్రారంభింపఁబడిన దని సూచించియున్నారు. సంవత్సర నిర్ణయమునందలి ఈ స్వల్పమాత్రపు భేద మెట్లున్నను సమస్తదేశముల నుండి పండితుల రావించి సభచేయించి సంస్కృతాది భాషలలో క్రైస్తవమతాచార్యులు తమ బైబిలును వ్రాయించుట నిక్కము. పదునెన్మిదవ శతాబ్ది సగభాగము గడచువఱకును ఆంధ్రగ్రంథముద్రణకార్యము అంతగా వ్యాప్తిఁ గాంచక ఏకదేశవ్యాప్తికి పాత్రమై యొప్పుచుండెను. అయినను ముద్రితములగు గ్రంథములు దేశమునందు వ్యాపించుకొలఁదిని ప్రజలలో పండితపామరుల కుభయులకును, పరంపరగ వచ్చుచున్న తాళపత్రములయం దగు లేఖన ప్రయాసాభిలాష సడలి ముద్రితగ్రంథములపై నొకవిధమగు నాదరము జనించినది. ఈయవకాశమును కనిపెట్టి విశాఖపట్టణము నెల్లూరు మున్నగు స్థలముల ముద్రణాలయములు నెలకొల్పఁబడినవి. అయిననవి చెన్నపురిలో స్థాపితములైన వానివలె జయావహములు కాలేదు. ఇందులకు ముఖ్యకారణము ముద్రణ పరికరములు మున్నగునవి మద్రాసులో వలె తక్కినచోట సులభముగ లభింపకుండుటయే!

## తన్మధ్యకాలస్థితి

పదునెన్మిదవ శతాబ్ది ముక్కాలుభాగము గడచునప్పటికి ముద్రణకార్యము సర్వసాధారణ్యము నొందినది. సంస్కృతభాషానిబద్ధము లగు గ్రంథములను ఆంధ్రాక్షరముల ముద్రించువారును ఆంధ్రగ్రంథములను ముద్రించువారలును, వైద్యము, జ్యోతిషము, మున్నగు నితర విషయిక గ్రంథములను ముద్రించువారును ఆ కాలమునఁ బ్రబలిరి. తొలుదొలుత మనవారు జనాదరమును గడించుటకై గాఁబోలును, గ్రంథములను పండితులచే చక్కగా పరిష్కరింపఁజేసి ముద్రించినను, రాను రాను ధనలాభైకపరాయణు లగుటచేత పండితపరిష్కృతితోఁబాటు పత్రపరిష్కృతిని గూడ త్యజించి చేత దొరకిన చెత్తనెల్ల ముద్రించి కట్టఁగట్టి అధికమూల్యమునకు ఈయ నారంభించిరి. ఇప్పటికిని అట్టివా రున్నారు. అయినను గుణగ్రహణపారీణ మగు నాంధ్రదేశ మిసుమంతయేని ఏఁగింపును చూపక పూర్వగ్రంథములపై, గ్రంథకర్తలపైఁ గల ప్రేమచేత, ఆ చెత్తనే ప్రియపూర్వకముగ చేకొనుచువచ్చినది. ఈ స్థితి దాదాపు పందొమ్మిదవ శతాబ్ది యారంభ మగునంతవఱకు నున్నదనియే చెప్పవచ్చును. కాని ఈ మధ్యకాలమున ఆనందముద్రణాలయమువారు వావిళ్లవారు మున్నగువారు ఆంధ్రగ్రంథ ముద్రణమున నొకవిధ మగు నందమును చందమును గల్పించి పాఠకులకు గ్రంథపఠనాభిలాషను హెచ్చునట్లు చేసిరి. ఈ సందర్భమున ననేకములఁ బూర్వగ్రంథములను ముద్రించిన కీ. శే. పోలవరం రాజా గారికి ఆంధ్రులు కృతజ్ఞతఁ జూపవలసియున్నది. ఇందులకు చేఁదోడు వాఁదోడుగా ఆంగ్లవిద్యలఁ బరిశ్రమఁ జేసిన మన యాంధ్ర మహాజనుల యాదర భావమును పనిచేసినది.

## ప్రస్తుతస్థితి

అనిర్వచనీయ సామర్థ్య విరాజితమగు కాలము ప్రభావమునఁ బ్రస్తుతము అనేకములు పరివర్తనములు జరుగుచున్నవి. ఎన్నెన్నియో మరుభూములు శాలిసస్యపూరితములుగను, ఎన్నెన్ని శతాబ్దులనుండి

రో ఆధికారము నొందుచున్న జాతులు సర్వోన్నతస్థానమును పొంది శోభిలుచున్నవి. ప్రపంచమునం దెచ్చటఁ బట్టినను ఉప్పులు తెప్పలుగా నున్న విద్యుద్వ్యాపినులు, యంత్రపరికరములు ఈయపూర్వవిషయమై ప్రత్యక్షసాక్ష్యము నిచ్చుచున్నవి. ఇట్టిస్థితిలో మనవారి గ్రంథముద్రణము మాత్రము మార్పునొందక యుండునా ? ఉండఁజాలదు. కనుకనే, ఈయుద్యమము క్రమముగా నాంధ్రదేశమునం దంతటను వ్యాపించినది. ఊరూరను పల్లెపల్లెను ముద్రణాలయము లేర్పడినవి. నవలలు నాటకములు ప్రబంధములు కట్టుకథలు, రోగములు, పురాణములు, మున్నగు ననేకగ్రంథములు అనుదినమును వింత వింత రూపులలో బయలువెడల సాగినవి. ముద్రణయంత్రము లున్నచోటుల నెల్ల గ్రంథమాలిక లేమి, నవలారాజము లేమి, నాటకప్రకటనలేమి, వాణిజ్యసూచకవిజ్ఞప్తులేమి లెక్కకు మిక్కుటము కాసాగినవి. పదిపదునైదువత్సరముల క్రిందటి చరిత్రమునకును ఇప్పటి స్థితికిని చాల భేదము కలదు. ఒక్కశతాబ్దిలో జరుగవలసిన మార్పు ఈపదునైదేండ్ల కాలములో గన్పట్టుచున్నది. ఇన్నియున్నను, మనలో విజ్ఞానము వ్యాపించుట లేదు. ఆర్థికవిషయములు, రాజకీయవిషయములు, సాంఘిక విషయములు, నైతికవిషయములు సాహిత్యచారిత్రాదులు మున్నగువానిలో నింతవఱకు ఏవోకొన్ని వ్రేళ్లపైని లెక్కపెట్టదగిన కొన్ని గ్రంథములు మాత్రమే యున్నవి. కాని ఆయావిషయములలో నాంగ్లము మొదలగు విదేశభాషలలోవలె కాకున్నను భారతఖండము లోని ఉత్తరదేశమువారి హిందీ బెంగాలీ మున్నగు భాషలలో నున్న

1909 మొదలు 1919 వఱకు ముద్రితములైన ఆంధ్ర గ్రంథములు.

| సంవత్సరము | కథా గ్రంథములు | జీవిత చరిత్రలు | నాటకములు | నవలలు దేశచరిత్రములు | సాహిత్య గ్రంథములు | శాస్త్రీయ గ్రంథములు | వైద్య గ్రంథములు | జ్యోతిషములు | వేదశాస్త్రములు | మత గ్రంథములు | గణిత శాస్త్రములు | విజ్ఞాన శాస్త్రములు | బాలశిక్షలు | నైతికములు | ఆర్థికములు | రాజకీయములు | ఇతర గ్రంథములు | గ్రంథముల మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1909 | 7 | 2 | 44 | 12 | 81 | ... | 7 | ... | 48 | 128 | 9 | ... | 2 | ... | ... | 1 | 32 | 318 |
| 1910 | ... | ... | 25 | 10 | 15 | 2 | 3 | 1 | 26 | 99 | 4 | 4 | 4 | ... | ... | ... | 33 | 241 |
| 1911 | 8 | 10 | 25 | 27 | 24 | 2 | 6 | ... | 34 | 151 | 4 | 4 | 4 | ... | ... | 1 | 55 | 381 |
| 1912 | 8 | 2 | 41 | 32 | 48 | 3 | 56 | 2 | 58 | 105 | 7 | 2 | 5 | ... | ... | 1 | 14 | 374 |
| 1913 | 2 | 13 | 73 | 69 | 48 | 1 | 5 | ... | 100 | 187 | 8 | 1 | 24 | ... | ... | 2 | 100 | 683 |
| 1914 | 8 | 14 | 66 | 98 | 66 | 1 | ... | 2 | 79 | 209 | 2 | 2 | 10 | ... | ... | ... | 102 | 154 |
| 1915 | 2 | 18 | 62 | 92 | 64 | 1 | 8 | 1 | 57 | 200 | 8 | 1 | 24 | ... | 2 | 1 | 103 | 689 |
| 1916 | 6 | 51 | 20 | 110 | 68 | 1 | 12 | 4 | 46 | 191 | 2 | 4 | 19 | ... | 1 | 3 | 102 | 685 |
| 1917 | ... | 23 | 45 | 84 | 74 | 2 | 15 | 1 | 69 | 165 | ... | 4 | 15 | ... | ... | 3 | 184 | 684 |
| 1918 | 2 | 12 | 30 | 32 | 55 | ... | 18 | ... | 74 | 142 | 9 | 8 | 8 | ... | ... | ... | 118 | 495 |
| 1919 | 3 | 7 | 32 | 27 | 62 | ... | 5 | 6 | 62 | 185 | 8 | 8 | 4 | ... | ... | 2 | 130 | 491 |

మాత్రమైనను గ్రంథములు లేకున్నవి. ప్రాచీన సంప్రదాయసిద్ధము లగు కావ్యనాటకపురాణేతిహాసాదులకంటెను ప్రకృతము రాజకీయార్థిక నైతిక విషయములలో మనవారికి విజ్ఞాన మలవడఁ జేయఁదగిన ఆంగ్లగ్రంథములు పెక్కులు మన భాషలలోనికి తర్జుమా చేయవలసి యున్నది. మనలోని విద్వచ్ఛ్రేష్ఠుల సహాయమున నిట్టివే స్వతంత్రగ్రంథములును వలసియున్నవి. ఈ ప్రక్కను గనఁబడుచున్న దొరతనమువారి వార్షిక గ్రంథముద్రణ పట్టికను సునాతత్వముగా సహృదయులై పాఠకులు గమనించినచో స్థాలీపులాకన్యాయమున, మనదేశములోఁ గల గ్రంథవ్యాప్తియును, ప్రస్తుతము మనకు ఆవశ్యకము లైన గ్రంథజాలపు విభాగమును స్పష్టిఁ బొందింపఁదగిన విషయములును మనస్సునకు స్ఫురింపఁగలుగును.

ఈ పట్టికలో చెన్నరాజధానియందలి ఇతర భాషలలోని గ్రంథముల పట్టికను ఈయ వలనుపడినది కాదు. కాని మొత్తముపైని 2 కోట్ల జనులు గల యాంధ్రమండలములలో పంద్రెండింటిలోను, ఇంత స్వల్పముగ గ్రంథసంఖ్య యుండుట మాత్రము చాల పరితాపమునకు కారణ మగుచున్నది. చెన్నరాజధాని భాషలలో ఆంధ్రము ముద్రణ విషయమున 2-వ స్థానము నాక్రమించినను భారతఖండము నందలి తక్కిన భాషలతోఁ బోల్చినచో మనకుఁ గల హీనస్థితి వెంటనే మనస్సునకు గోచరించును. విషయానుసారముగ గ్రంథములు వేర్వేఱుగ ఇందు సూచింపఁబడి యున్నవి. వీటిని జాగ్రత్తతోఁ బరికించి చదివిన మన గ్రంథకర్తలు ప్రస్తుత కాలమునందు ఏ యే విషయములలో గ్రంథరచనను సంపూర్ణస్థితికి తీసికొనిరావలసి నదియును తెల్లమగును. ఈ పట్టిక ప్రభుత్వమువారి సూచికనుండి సంగ్రహింపఁబడినది. వారు పట్టికను నిర్మించుటలో స్థూలదృష్టితో మాత్రమే ప్రవర్తించిరి. మత గ్రంథములలో నెన్నియో పద్యగ్రంథములు మున్నగునవియును, ఇతరగ్రంథములు అనినవానిలో కొన్ని భిన్న జాతీయములును గలవు. ఆంధ్రగ్రంథకర్తలు ఆర్థిక రాజకీయ నైతిక గ్రంథములు అతిబాల్యదశలో నున్నవని గ్రహింపవలయును. దేశముయొక్క భావిశుభోదయము చాలవఱకు ఈ గ్రంథముల యుపచయము పైననే ఆధారపడి యుండును. నూతన సంస్కారణములు, క్రొత్తక్రొత్త పరిపాలన పద్ధతులు, ఆర్థికసుపరిపాలనము, నైతికజీవనము వీనిని మనవారికి అలవఱుచఁ బ్రయత్నింప వలయును. గ్రంథకర్తలు ఈ విషయములను గ్రాంథిక గ్రామ్యవివాదములతోఁ బెనఁగక, లలిత మగు భాషలో తెలియించి ప్రచారమునకు తెచ్చుటకై నడుముకట్టుకొనవలయును. ఇయ్యది చాల ముఖ్యవిషయము. మఱియు, ఇచ్చట నింకనొక్క ముఖ్యమగు విషయము గలదు. గ్రంథముద్రణమునకు ముఖ్యముగా నడ్డువచ్చుచున్న — పరికరముల దరిద్రమును ధనికులును, రాజకీయశాసన నిబంధనములను దొరతనములో పేరుగాంచి పలుకుఁబడిగల రాజకీయవేత్తలును, భాషాసౌష్ఠవమున కైన దేవులాటను భాషాభిమానము గల పండితకవులును, తీర్చుటకై విశ్వప్రయత్నములను జేయఁగలసి యున్నది. ఈ రీతిగా మనవారు సర్వులును ఏకకంఠముగఁ

పని చేసినచో మనకు ఈప్సితార్థసిద్ధి మిగుల నచిరకాలములో ప్రత్యక్షీభవించును.

## గ్రంథప్రచారమునకై మనము చేయవలసినపని.

పైపట్టికను జూచినవారికి మన మిపుడు చేయవలసిన కార్యపు తెఱంగు కొంత బోధపడియుండవచ్చును. మన గ్రంథములను పురాతనములని అధునాతనములని ద్వివిధముగ విభజించి ప్రాచీనములలో నింతవఱకు ముద్రితములు గాని గ్రంథములను, నూతనములలో వ్యాప్తికి తీసికొని రావలసిన గ్రంథములను చక్కగ ముద్రించుటకును, ముద్రింపదగిన గ్రంథసముదాయమును విభజించి ఏర్పరించుటకును, అందుల కగు వ్యయప్రయాసాదులను భరించుటకును శక్తి గలుగునట్లు ఒక సంఘమును ఏర్పాటుగావించిన బాగుగనుండును. ఒక్కరిద్దరు ప్రకాశకులు మోయలేని ఎంతటిభారమునైనను సంఘముగా జేరినచో సులువుగా వహింపఁ గలిగియుండును. ఇట్టిసంఘమును ఏర్పాటుచేసినచో, ప్రాచీనములు నవీనములునగు గ్రంథములు సులభముగా ప్రచారమునకు రాఁగలుగును. దీనివలన ప్రకృతము ఏవిధమైన సాయముగాని లేక కలిగిన కొంచెముపాటిధనమును అచ్చుదిమ్మల క్రిందను కాగితముల క్రిందను కర్చుచేసి అటుపైని వైయాకరణభూసూచులను బోలి కూర్చొనిన మన ప్రచురణ కర్తలకును, ఎన్నిదినములో కష్టించి మహాప్రయాసమున నొక్క గ్రంథమును రచించి, దానిని తాపై ప్రచురింపఁజాలక, ప్రకాశకుల సహాయము నపేక్షించి ప్రతిఫల విషయమునఁ ద్రిశంకుస్వర్గతిని జూఱఁగొను గ్రంథకర్తలకును, ఎన్నిదినములు చదివినను ఒకడే కల్పనము ఒక్కడే భావముగల యొక్క పుస్తకమునే చదివి చదివి విసిగి దేశభాషలలో గ్రంథప్రకటనమునకు త్రోవ లేదనుకొను గ్రాహకులకును, ఇంకను ఇతరుల కనేకులకును, అమూల్యమైన సహాయము లభించుటయేగాక, ఇప్పటికంటెను నూరురెట్లెక్కువగఁ బనిచేసి దేశమును సర్వసంపత్సమన్వితముగను స్థిరతర ప్రతిష్ఠితముగను చేయుట కవకాశ ముండును. కావున కార్యశూరు లని ప్రఖ్యాతి గడించిన యాంధ్రపుత్రులీ విషయమును మఱవక, ఎట్టిపైనను నెఱవేర్పఁ బ్రయత్నములను సల్పి కృతార్థులు కావలయునని ప్రార్థించెదను. ఆంధ్రులు తమ ప్రతిభాప్రభావములను ప్రకటించెదరు గాక.

ముఖ్యముగా నింకనొక్క విషయమును మనవి చేయవలసి యున్నది. మనలో ననేకులు గ్రంథముద్రణము నిప్పటికిని సామాన్యకార్యమని తలంచుచున్నారు. కాని గ్రంథముద్రణము ప్రత్యేకముగా నభ్యసింపఁదగినయొక కళ. ముద్దులు మూటగట్టునట్లున్న ముద్రితగ్రంథములు సర్వోత్కర్షకములుగ నుండఁవనుటలో నేమియు వింతలేదు. ముద్రణమన కేవలమును అచ్చుగుద్దుటయే కాదు. గ్రంథసందర్భము తత్పరిశోధనము సుముద్రణము మున్నగునవి యథాయోగ్యముగ నుండవలయును. సందర్భ గ్రథనము మొదలగు కొన్నిఁటిని ప్రశే తలపైని వదలినను తక్కినవి చాలవఱకు ముద్రణాలయాధికారులు ఏర్పఱచు పరిశోధకులపైని యాధారపడును. (Proof readers) పరిశోధకులకు బహుగ్రంథసందర్భపరిచయ మావశ్యకము. తెలుఁగు గ్రంథములను ముద్రించుటలో మనవారు అందు అనుభవము పూర్ణముగా లేని ఎవరినో యొకరిని యత్కించిద్ జ్ఞానవిశిష్టుని నియోగించుచున్నారు. కేవల మొక్కని నియోగించుట మాత్రమే గాక వారి యోగ్యతను లేఖకుల (writer) యోగ్యతకంటెఁ దక్కువగాఁ జూచుచున్నారు. ఇది కేవలము న్యాయ్యము. దీన నెన్నియో యనర్థములు రాఁగలవు. ఓరితక్కువసామెత ఈవిషయమునందు విస్పష్టమగును. మనవారనుకొనినట్లుగాక పరిశోధకుఁడు బహుగ్రంథ సందర్భముల నెఱిఁగి, గ్రంథకర్త్రభిప్రాయము ఇసుమంతయైనఁ దొసఁగిపోకుండ విషయానుసారముగు శోధనను జేయు నలవాటుపడియుండవలయును. ఇత్యాది చిరకాలపరిశ్రమమువలనఁగాని చేకూఱదు. ఇట్టి గ్రంథకర్త్రవస్థానిర్ణయమునఁగూడ నెఱుఁగవలయును. ఈచెప్పిన చొప్పున మన దేశీయుఁ గ్రంథకర్తలను తత్పరిశోధకులను ఏర్పఱచి వారిని తగినరీతిని సత్కరింగలుగుదు రేని అప్పుడే మనకభివృద్ధియును సిద్ధించును. మఱియు మనము ఎప్పుడో ముందు బహుకాలమునకుగాని సంసిద్ధులు కాఁజాలని శోధకులకై కాచుకొని యుండనక్కఱలేదు. ప్రస్తుతము ఇందుల కుపయోగించుటకు పండితులు పెక్కురు గలరు. ఏవిధమయిన జీవనోపాధియును లేక పెక్కండ్రు అల్లాడుచున్నారు. వారిని నాలుగయిదు మాసములు శిక్షితుల చేయఁగలమేని మన యభీష్టము ననుసరించిన పరిశోధకవర్గమును పండితవర్గమును చేకూఱును. ఇట్లు మన వారిని శిక్షితులఁజేయుటకును అప్పటప్పటికి సమావేశమై ఆంధ్రదేశాభివృద్ధికి వలయు గ్రంథసందర్భమును నిర్ణయించి వానిని నిర్మింపఁజేయుటకును ఒకసంఘ మావశ్యకమని యిదివఱకే చెప్పియున్నాము. అట్లు చేయవలయు నని ఆంధ్రుల నందఱను ప్రార్థించుచున్నాము.

## ముగింపు.

ఆర్యులారా! ఈవ్యాసమునందు ఎన్నో విషయములను వివరింపవలసియుండుట నిక్కము. అయినను ప్రస్తుతపు అవకాశములఁబట్టి మనస్సునకుఁ దోఁచిన కొన్ని విషయములను మాత్రమే ఇందు వివరించితిమి. చదువరులందులకు మన్నింపఁ బ్రార్థించెదము. మఱియును మన గ్రంథకర్తలకును గ్రంథముద్రాపకులకును ఇతోధికమగు నుత్సాహమును కార్యాచరణశక్తియు కర్తవ్యపరిజ్ఞానమును ప్రస్ఫుటములగు నను నుద్దేశముతో నీ క్రింద గతవర్షమునందు ముద్రితములైన ఆంధ్రగ్రంథములయొక్కయు, తద్గ్రంథకర్తలయొక్కయు వివరములను ఇచ్చుచు ఆంధ్రులకు నాంధ్రదేశమునకు సర్వోత్కృష్టమగు విజయము కావలెనని పరమేశ్వరుని ప్రార్థించుచు నింతటితో ముగించుచున్నాము.

# ౧౯౧౯-౨౦ సంవత్సరమున ముద్రితము లగు నూతనాంధ్ర గ్రంథములు

## 1. పద్యకావ్యములు—

అనంతగిరి విలాసము:— గ్రంథకర్త కే. ఓబరాజకవిగారు, తరిమెళ, అనంతపురముజిల్లా. వెల 0-12-0.

అన్నపూర్ణాపరిణయము:— శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులు గారు ప్రణేతలు. రాజమండ్రి.

అభినవ సుమతిశతకము:— గ్రంథకర్త హెచ్. మహబూబుమియ్యాగారు. ప్రొద్దుటూరు. వెల 0-4-0.

ఆంధ్రకవిప్రశంస:— గ్రంథకర్త. వాడ్రేవు మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు. మచిలీపట్టణము. వెల 0-4-0.

ఈశ్వర స్తవము:— గ్రంథకర్త చింతలపల్లి నరసింహశాస్త్రి గారు. బళ్లారి. వెల 0-1-0.

ఒంగోలు మహామారి:— గ్రంథకర్త. పిశుపాటి చిదంబరశాస్త్రిగారు. కరవది, గుంటూరుజిల్లా. వెల 0-?-6.

కృతకసూత్రము:— గ్రంథకర్త. వేలూరి శివరామశాస్త్రి గారు, శతావధాని. చిరివాడ, కృష్ణాజిల్లా. వెల 0-12-0. ✓

కుశలవ రామాయణము:— గ్రంథకర్త జి. అమ్మయలింగం గారు. కాకినాడ.

చిత్రకేతు చరిత్రము:— గ్రంథకర్త. చింతపల్లి నరసింహ శాస్త్రిగారు బళ్లారి. వెల 0-12-0.

చింతామణీ విలాసము:— గ్రంథకర్త. పులకపల్లి పెదశేష గిరిరావుగారు. కూరుపూరు, గోదావరిజిల్లా. వెల 1-0-0.

జనకస్మృతి:— గ్రంథకర్త. కే. రాఘవయ్యగారు. పెంటపాడు, కృష్ణాజిల్లా.

జాతీయకీర్తనలు:— గ్రంథకర్త. అయ్యంకి వెంకటరమణయ్యగారు. బెజవాడ.

జారవిచారము:— గ్రంథకర్త. కే. మృత్యుంజయశర్మగారు. కాకినాడ. వెల 0-?-6.

తిమ్మనాయనిచరిత్ర:— గ్రంథకర్త. ఆర్. దాసంరాజు. వెల 1-0-0.

దళరత్నములు:— ప్రకాశకులు. ఏ. సత్యనారాయణమూర్తి గారు. విశాఖపట్టణము. వెల 0-1-0.

దశావతారములు:— ప్రకాశకులు. ఏ. సత్యనారాయణమూర్తి గారు. విశాఖపట్టణము వెల 0-1-0.

దాంపత్యధర్మబోధిని:— గ్రంథకర్త. మం. భుజంగరావుగారు ఏలూరు.

దీనకల్పద్రుమము:— గ్రంథకర్తలు. ప్రకాశకులు. సోమా వెంకటస్వామిగుప్తగారు, రామభజనసమాజ సభ్యులు. వెల 0-1-6.

ధర్మోపదేశము:— ప్రకాశకులు. పి. వి. నరసింహారావుగారు రాజమండ్రి.

నాపిత మదభంగము:— గ్రంథకర్త. ఏ. సూర్యనారాయణ గారు. కాకినాడ. వెల 0-0-6.

నీతిమాలిక:— గ్రంథకర్త. ముడుంబి వెంకటరమణాచార్యులు గారు. ప్రకాశకులు. మై. హనుమంతరావుగారు. మద్రాసు.

నీతిపద్యరత్నావళి:— ఇది ఆంధ్రమునందలి భారత భాగవతములనుండి కూర్చిన పద్యరత్నములు గలది. ప్రకాశకులు. వి. తిరునారాయణమూర్తిగారు. బ్రాహ్మణకోడూరు, గుంటూరుజిల్లా.

పండుగకట్నము:— గ్రంథకర్త. భో. నారాయణమూర్తి గారు.

పూలమాల:— గ్రంథకర్త. ప్రకాశకులు. పి. వెంకటరావు గారు. పార్వతీపురము. వెల 0-2-0.

ప్రబంధకుసుమావళి:— ప్రకాశకులు. సి. వేంకటనరసింహ రావుగారు. రాజమండ్రి. వెల 1-0-0.

ప్రభురత్నము:— ప్రకాశకులు కే. వెంకటసుబ్బారెడ్డిగారు. ప్రొద్దుటూరు.

భారతమాతృవిలాపము:— గ్రంథకర్త. జే. సీతారామస్వామి గారు. పిఠాపురము. వెల 0-2-0.

మల్లిక:— వరశుల్కములను నిరసించు గ్రంథము. గ్రంథకర్త. మోచెర్ల హనుమంతరావుగారు. కాకినాడ. వెల 0-2-0.

మహాలక్ష్మీపరిణయము:— గ్రంథకర్త. పి. వెంకటరమణయ్యగారు. ప్రకాశకులు. ఏ. సుందరరామయ్యగారు. కొమరిపాలెము గోదావరిజిల్లా.

మిత్రద్రోహము:— గ్రంథకర్త. బి. వేంకట్రావుగారు.

మీనాక్షీస్మృతి:— గ్రంథకర్త. వి. శ్రీరంగనాయకులు పంతులుగారు. గొడుగుపేట, బందరు.

ముక్తాలత:— గ్రంథకర్త. శతావధాని. వేలూరి శివరామశాస్త్రిగారు. చిరివాడ, కృష్ణాజిల్లా.

రాజశేఖరశతకము:— గ్రంథకర్త. టి. ఏకామ్రరావుగారు, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా. వెల 0-8-0.

రుక్మిణీకళ్యాణము:— గ్రంథకర్త. ద్వి. నారాయణశాస్త్రి గారు. వెల 0-3-0.

వినాయక పంచరత్నములు:— గ్రంథకర్త. రామపిళ్ల బైరాగి గారు. బెజవాడ.

విదురుడు:— గ్రంథకర్త. సి. నరసింగరావుగారు. బళ్లారి. వెల 0 2-0.

వీరేశలింగసంకలి:— గ్రంథకర్త కాళ్లకూరి నారాయణరావు గారు. వెల 0-1-0.

శ్రీసాధుని లేఖలు:— గ్రంథకర్త. అధికారుల సూర్యనారాయణరావుగారు. పార్వతీపురము. వెల 0-2-0.

శ్రీహరిశతకము:— గ్రంథకర్త. కే. మృత్యుంజయశర్మగారు. కాకినాడ. 0-1-6.

సరోజిని, లేక కన్నీరుకథ:— గ్రంథకర్త. ఏ. వెంకటేశ్వర్లు గారు. నూతనపక్కి గ్రంథము. పార్వతీపురము. వెల 2-0-0.

సర్వేశ్వరశతకము:—యథా వాక్కుల అన్నమయ్యగారు. (పూర్వకవి) ప్రకాశకులు ఆంధ్రసాహిత్య పరిషదధిపతులు, మదరాసు, 0-3-0.

సీమంతినీ కల్యాణము:—గ్రంథకర్త పెనుమళ్ల సోమమంత్రి (పూర్వకవి) ప్రకాశకులు చెలికాని లచ్చారావుగారు, చిత్రాడ గోదావరి జిల్లా 0-14-0.

సీతాచరిత్రము:—ప్రకా. ఎస్. యస్. రాజు. మద్రాసు.

సుందరరామచరితము:—గ్రంథకర్త పి. వి. వెంకటరమణయ్య గారు, పార్వతీపురము. వెల రూ 0-2-0.

సుకవిసూక్తి సుధాసారము:—ప్రకాశకులు తిక్కన పబ్లిషింగ్ కంపెనీవారు, నెల్లూరు 0-8-0.

సునీతిముక్తావళి:—గ్రంథకర్త వి. సుబ్రహ్మణ్యము గారు పార్వతీపురము 0-3-0.

సోహ్రాబు:—గ్రంథకర్త మోచర్ల హనుమంతరావు గారు, కాకినాడ, 0-8-0.

చాడేశ్వరశతకము: గ్రంథకర్త కే. అచ్చయ్యగారు వేటపాలెము 0-4-0.

విజయనందన విలాసము: గ్రంథకర్త మంగళగిరి ఆనందకవి గారు ప్రకాశకులు సి. లచ్చారావుగారు చిత్రాడ 0-72-0.

పుణ్యపురుషస్తుతి: గ్రంథకర్త ఎమ్. బుచ్చిరామకవి.

దీనావనశతకము: గ్రంథకర్త పి॥ బుచ్చిరాజుగారు కాకినాడ గ్రంథమునందు కరుణరసము చిప్పిలునట్టి పద్యములు పెక్కులుంగలవు. వెల 0-2-6.

ప్రణయవిజయము: తిరుమలసెట్టి జగన్నాథకవిగారు వెంకటగిరి 0-12-0.

భువనమోహినీవిలాసము: గ్రంథకర్త ఆర్. కృష్ణమూర్తికవి గారు విజయనగరము 0-6-0.

చంద్రగిరిపాలశతకము: గ్రంథకర్త బి. కృష్ణశాస్త్రిగారు, ప్రకాశకులు జి॥ లక్ష్మినారాయణగారు బెజ్జూరు.

కృష్ణశతకము: ప్రకాశకులు కే. లక్ష్మణమొదలిగారు మద్రాసు 0-1-0.

హితబోధిని: కే॥ నమశ్శివరావుగారు విశాఖపట్టణము.

భారతి: గ్రంథకర్త దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు నెల్లూరు 0-10-0.

నలచరిత్ర: (ద్విపద) గ్రంథకర్త చక్రపురి రాఘవాచార్యులు గారు, ప్రకాశకులు బి. యతిరాజులునాయుడుగారు 0-2-0.

గోపాలనక్షత్రమాల: గ్రంథకర్త కే. శ్రీరాములుగారు ఈమని, గుంటూరుజిల్లా.

గోవిందకృష్ణ యాచేంద్రవిజయము: గ్రంథకర్త రత్నాకరము సుబ్బరాజకవిగారు, ప్రకాశకులు పి. సుందరరామశాస్త్రులు మద్రాసు.

వాల్మీకిచరిత్రము: చెలికాని లచ్చారావుగారు చిత్రాడ, గోదావరిజిల్లా 0-12-0.

సకలజనమనోభిరంజనము: గ్రంథకర్త ఎస్. వీరరాజకవిగారు ప్రకాశకులు కే. కృష్ణకుమార్ కాకినాడ 0-12-0.

## 2. గద్యగ్రంథములు—

ఉత్తరరామాయణసారము:—గ్రంథకర్త డి. సీతారామయ్య గారు. ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు 0-8-0.

కంసవాశనము:—గ్రంథకర్త కే. వెంకటరమణయ్యగారు నెల్లూరు. 0-10-0.

కవిత్వతత్త్వము:—గ్రంథకర్త కే. కోదండరామయ్య గారు. బెజవాడ. ఆంధ్రమున కవిత్వము శైలి మున్నగు విషయములపై విమర్శనము లిందు గలవు 0-9-0.

కుమారోపదేశము :—అనువాదకులు. సి. వెంకటనరసింహారావుగారు రాజమండ్రి. 0-12-0.

పద్మవ్యూహము :—గ్రంథకర్త డి. యస్. రామారావుగారు రాజమండ్రి.

పరశురామచరిత్రము.—ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు. 0-10-0.

పరీక్షిజ్జననము:—గ్రంథకర్త. కే. వెంకటరావుగారు ప్రకాశకులు సి. అమ్మయ్యగారు, నెల్లూరు. 0-8-0.

ప్రచ్ఛన్నపాండవము:—గ్రంథకర్త. చిలకమర్తి లక్ష్మినృసింహముగారు. రాజమండ్రి, 1-0-0.

బాలగుణితము:—ఎస్. చలపతిరావుగారు ఏలూరు. 0-3-0.

బాలరామాయణము:—ఏ. మాధవయ్యగారు. ప్రకాశకులు మాక్మిలన్ కంపెనీవారు. మద్రాసు.

భాసనాటక కథాసారము:—గ్రంథకర్త కపిస్థలము కృష్ణమాచార్యులుగారు. ప్రకాశకులు మాక్మిలన్ కంపెనీవారు, మద్రాసు రు. 0-6-0.

భాగవత కథాసారము. ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు, రు 0-10-0.

భీష్మచరిత్ర:—గ్రంథకర్త బుక్క పట్టణము-రామానుజయ్య, 58 పేరంబాలుసెట్టివీథి, చాకలపేట. వెల రు. 0-14-0.

మధురలాలస:—గ్రంథకర్త. ఎస్. వి. రంగాచార్యులుగారు. కుంభకోణము, 0-12-0.

మహాభారతము:—(సభాపర్వము) గ్రంథకర్త, కలిదిండి వీరరాజుగారు (పూర్వకవి) ప్రకాశకులు స్టూడెంట్సు క్లబ్బువారు. అనంతపురము.

మీరాబాయి:—గ్రంథకర్త. ఎస్. చలపతిరావు గారు, ఏలూరు. 0-2-0

✓మహాభారత కథలు:—గ్రంథకర్త డి. సీతారామయ్య అ. 12.

✓విక్రమార్కుని కథలు:—గ్రంథకర్త. మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు మద్రాసు. 0-14-0.

శబ్దోచ్చారణరత్నమాల:—బి. ఎస్. రామశర్మగారు 0-2-0.

సిరియాళ చరిత్రము:—గ్రంథకర్త. శ్రీ కొత్తపల్లి సూర్యరావు గారు. ప్రకాశకులు వన్నె యంభట్టారక విలాసమువారు. చింతాద్రి పేట, మద్రాసు.

సీతాదేవి:—గ్రంథకర్త. ఎస్. చలపతిరావుగారు. 0-2-0.

సీతాదేవి:—గ్రంథకర్త. ఎస్. హనుమంతరావుగారు 0-1-0.

సీతారామము:—గ్రంథకర్త్రి. కలగర అన్నపూర్ణమ్మగారు వెల 1-0-0.

✓సోముడు:—గ్రంథకర్త. శతావధాని వేలూరు శివరామ శాస్త్రిగారు. చిరివాడ కృష్ణాజిల్లా వెల 1-4-0.

హరిశ్చంద్ర చరిత్రము:—గ్రంథకర్త. ఎన్. జలదుర్గాప్రసాద రావు గారు. రాజమండ్రి, 0-12-0.

✓ఆంధ్రవచనభారతము: గ్రంథకర్త పూర్వకవి యగు శశిక వీరరాజు 0-8-0.

సావిత్రి: ఎస్. చలపతిరావుగారు ఏలూరు 0-2-0.

మొదటి హిందీవాచకమునకు తెలుగు అనువాదము: ప్రకాశకులు హిందీసాహిత్య సమ్మేళనమువారు, మద్రాసు.

నానార్థ సంగ్రహము: వెల 0-1-6.

భీమ్మచరిత్ర: గ్రంథకర్త వి. రామానుజయ్యగారు 58, పేరంబాలు సెట్టివీథి, రాయపురం పోస్టు, మదరాసు 0-14-0.

ప్రహ్లాదచరిత్రము: గ్రంథకర్త కే. సీతారామస్వామిగారు పీఠాపురము 0-6-0.

## 3. చరిత్ర గ్రంథములు—

తేళచరిత్రము:—గిడుగు వేంకటసీతాపతి గారు గ్రంథకర్త. ప్రకాశకులు వెంకటేశ్వర కంపెనీవారు మద్రాసు 0-8-0.

నానారాజన్య చరిత్రము:—గ్రంథకర్త శ్రీ శాస్ వీర బ్రహ్మము గారు. మచిలీపట్నము రు. 8-0-0.

మచిలీపట్టణము: గ్రంథకర్త ఎమ్. అప్పారావుగారు మచిలీ పట్టణము.

## 4. వైద్యగ్రంథములు—

ఆరోగ్యవిషయములు:—గ్రంథకర్త. డై. యస్. హనుమంత రావు గారు. ప్రకాశకులు ఏలూరు రామా అండు కంపెనీవారు. 0-2-0.

ఇక తొమ్మిదింబా:—గ్రంథకర్త. బి. శ్యామసుందర రావుగారు బరంపురము, 0-8-0.

కొన్ని ప్రశస్తయోగములు: గ్రంథకర్త ఆచంట లక్ష్మీపతి గారు మద్రాసు 0-4-0.

ఆరోగ్యసర్వస్వము: గ్రంథకర్త వి. వాసుదేవశాస్త్రిగారు కాకినాడ 0-8-0.

శ్రీబాలవైద్యసుధాబ్ధి: గ్రంథకర్త జి. వెంకటసుబ్బయ్య రాయగుప్తగారు గుంటూరు 2-8-0.

ధన్వంతరి:—మల్లంపల్లి భైరవమూర్తిగారు, బందరు 4-8-0.

## 5. రాజకీయములు—

ఇండియా ప్రభుత్వపుబిల్లు:—ప్రకాశకులు సి. అర్. పార్థ సారథి అయ్యంగారు చిత్తూరు.

హైందవ స్వరాజ్యము:—జి. హరిసర్వోత్తమ రావు గారు. అనువాదకులు 1-0-0.

## 6. కళాగ్రంథములు—

మనశ్శక్తి:—గ్రంథకర్త ఎమ్. వి. మూర్తిరాజు గారు. మోదుకూరు తెనాలి తా॥ 1-0-0.

సంగీతగానమనోహరి:—గ్రంథకర్త్రి. వీణ అమ్మణ్ణిగారు. ప్రకాశకులు ఎస్. ఆళవందారు నాయుడు, మద్రాసు.

## 7. వేదాంతగ్రంథములు.

ఆత్మానాత్మవివేకము:—గ్రంథకర్త కే. పట్టాభిరామశర్మ గారు, కోవూరు, నెల్లూరుజిల్లా వెల 0-2-0.

ఆంధ్ర వేదాంతాద్వైతసిద్ధాన్త చింతామణి:—గ్రంథకర్త వజ్ఝల నారాయణశాస్త్రి ప్రకాశకులు. ఏ. వి. జగ్గారావు గారు, విశాఖపట్టణము వెల 0-12-0.

తత్త్వానుసంధానము:—అనువాదకులు డి. ఆదినారాయణ రెడ్డి మున్నగువారు, మరువాడ, నార్తార్కాడుజిల్లా వెల 4-0-0.

విశిష్టాద్వైత సంగ్రహము:—వావిలాల వేంకటశివావధానులు గారు, గ్రంథకర్త, బందరు వెల 0-6-0.

ఈశ్వరప్రమాణములు, బ్రాహ్మసిద్ధాంతములు: ప్రకాశకులు ఆంధ్రబ్రాహ్మమండలీవారు కాకినాడ 0-8-0.

న్యాయదర్శనపరిచయము: ఆర్య. నారాయణమూర్తి గారు హిందూపురు.

## 8. జీవితచరిత్రలు.

అడిదముసూరకవి:—గ్రంథకర్త అడిదము రామారావుగారు విజయనగరమునందలి ఆంధ్రపారిజాత గ్రంథమాలికలోని తొలికుసుమము వెల రు 1-4-0.

కబీరుదాసు చరిత్రము:—గ్రంథకర్త శిరిపి ఆంజనేయులు గారు వెల 0-8-0.

గంధిమహాత్ముడు:—గ్రంథకర్త పి. నరసింహముగారు విజయనగరము వెల 0-1-0.

వన్నమ్మ జీవితచరిత్రము:—గ్రంథకర్త లవకొండు ప్రోటు దొరగారు, మద్రాసు.

సిద్ధార్థచరిత్రము:— గ్రంథకర్త చిలకమర్తి లక్ష్మీనరసింహ ముగారు, రాజమహేంద్రవరము వెల 0-12-0.

రావు జగన్నాథరాయుని జీవితము: గ్రంథకర్త సూరిదాస కవి తిరుపతి, వెల లేదు.

## 9. కల్పనాగ్రంథములు.

అపూర్వప్రతిజ్ఞ:— కే. ఆర్. కృష్ణారావుగారు గ్రంథకర్తలు. ప్రకాశకులు సి. లచ్చారావుగారు, చిత్రాడ వెల 0-12-0.

ఆంధ్రరాజులకథలు:— గ్రంథకర్త టి. కేశవరావుగారు. ప్రకాశకులు ఆంధ్రవాణీ గ్రంథమాలా సంపాదకులు, ఇనగల్లు, గుంటూరుజిల్లా వెల 0-2-0.

ఇచ్ఛినీకుమారి:— గ్రంథకర్త శేషభట్ల వెంకటశాస్త్రిగారు, వెల 1-8-0.

కథాగీతములు:— చెల్ల పాపయ్యగారు వెల 0-4-0.

కరికృష్ణస్తోత్రము:— పి. యతిరాజముగారు, మద్రాసు.

క్రీస్తుమనుపూలదండ:— కే. రాజరత్నముగారు బరహంపురము వెల 0-2-0.

గోదావరి:— గ్రంథకర్త యాతగిరి లక్ష్మీకాంతరావుగారు, ప్రకాశకులు వి. ఆర్. జగపతివర్మగారు, పెద్దాపురము.

జయచంద్ర విజయము:— గ్రంథకర్త ఎస్. వెంకటనరసింహ రావుగారు, భీమవరము. 1-8-0

త్రిలింగ చిన్నకథలు:— గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంత ముగారు, ప్రకాశకులు ఆంధ్రవాఙ్మయసమితివారు గుత్తికొండ, పిడుగురాళ్లపోష్టు.

దుర్బుద్ధి:— గ్రంథకర్త ఎమ్. రాఘవాచార్యులుగారు, ప్రకాశకులు రామాకంపెనీవారు ఏలూరు.

ధీరవల్లి:— గ్రంథకర్త కే. వెంకట్రావుగారు కాకినాడ 0-1-0.

పల్నాటివీరుల కథలు:— గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంత ముగారు 0-8-0.

పిచ్చివానికథ:— ఎమ్. హనుమంతరావుగారు గ్రంథకర్త కాకినాడ 0-0-6.

మదనకామరాజు చరిత్రము:— ప్రకాశకులు, ఎ. బాలకృష్ణ నాయకరు, మద్రాసు.

మనోహర విజయము:— ఎస్. వాసుదేవరావుగారు 0-12-0.

మయసభ:— గ్రంథకర్త పిల్లలమర్రి గోపాలకృష్ణయ్యగారు ప్రకాశకులు చెలికాని లచ్చారావుగారు, చిత్రాడ 0-10-0.

ముక్తాంబ:— పిల్లలమర్రి గోపాలకృష్ణయ్యగారు, ప్రకాశకులు పి. రామకోటేశ్వరరావుగారు కూచిపూడి, గుంటూరుజిల్లా.

యుగంధరవిజయము:— గ్రంథకర్త దొడ్ల వెంకటరామరెడ్డి గారు. ప్రకాశకులు ఎమ్. ఆర్. కృష్ణాకంపెనీవారు నెల్లూరు 2-4-0.

రాజరత్నము:— గ్రంథకర్త చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతు లుగారు, రాజమండ్రి 0-12-0.

రుద్రమదేవి:— గ్రంథకర్త సీతారామచంద్రరాయశాస్త్రి గారు (ఒద్దిరాజు)

రేచుక్క పగటిచుక్క కథలు:— ప్రకాశకులు కుప్పుసామి మొదలి మద్రాసు 0-1-0.

లోకతంత్రము:— ఎస్. చలపతిరావుగారు ఏలూరు 0-12-0.

వచనకళాపూర్ణోదయము:— ప్రకాశకులు సి. వెంకటనర సింహారావుగారు రాజమండ్రి, వెల. రు 1-8 0

శశికళ:— గ్రంథకర్త కే. రంగయ్యగారు, నరసాపూరు 0-4-0.

శుకసప్తతికథలు:— ప్రకాశకులు టి. బాలకృష్ణనాయకరు, మద్రాసు 0-4-0.

విధిలేని దత్తత: గ్రంథకర్త డి. అప్పయ్యశాస్త్రిగారు గుం టూరు 0-1-0.

విద్యుత్ప్రభ: గ్రంథకర్త భాగవతుల చెన్నకృష్ణమ్మగారు గుంటూరు 1-0-0.

బాలవినోదకథలు: గ్రంథకర్త ఎస్. చలపతిరావుగారు ఏలూరు.

గిరిబాల: గ్రంథకర్త రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారు, ప్రకాశకులు సి. శ్రీనివాసరావుగారు అనంతపూరు 0-8-0.

అశోకుడు: గ్రంథకర్త కే. యల్. యస్. సోమయాజులు రాజమండ్రి 0-12-0.

ఎదుమకాలితన్ను కుడిచెంపముద్దు, ఇతడువాడుగడు, అతడు బాహాతురిమగడు: గ్రంథకర్త ఏ. సుందరరామయ్య కొమరిపాలెము 0-4-6

## 10 నాటకములు.

ఆంధ్రమాళవికాగ్నిమిత్రము:— గ్రంథకర్తలు మహామహోపా ధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు మద్రాసు 0-12-0.

ఆంధ్రీకృతాభిజ్ఞానశాకుంతలము:— గ్రంథకర్త మంత్రిప్రెగడ భుజంగరావుగారు, ఏలూరు 0-12-0.

చారిత్రనాటకపంచకము:— గ్రంథకర్త వి. వేంకటలక్ష్మీనర సింహముగారు, కాకినాడ 0-10-0.

చింతామణీమాలామహానాటకము:— గ్రంథకర్త కల్లుల నారా యణశాస్త్రిగారు, ప్రకాశకులు వి. వి. సత్యేశశర్మగారు శ్రీకాకు ళము 0-12-0.

చిరకారినాటకము:— ప్రకాశకులు వి. కృష్ణమాచార్యులు కం పెనీవారు, బళ్లారి. -0-0.

తపతీసంవరణము:— అనువాదకులు వాకర్ల కొండలరాయుడు గారు, కొవ్వూరు, కృష్ణాజిల్లా 0-12-0.

నందిపాటిమిత్రవిందాపరిణయము:— గ్రంథకర్త్రి యస్. శే షాంబగారు, ప్రకాశకులు ఏ. పి. కవి. అనంతపూరు 0-8-0.

పద్మవ్యూహము:— గ్రంథకర్త కాళ్లకూరి నారాయణరావు గారు 1-0-0.

పాదుకాపట్టాభిషేకము:-- టి. యస్. రామస్వామి అయ్యంగారు కుప్పము, నార్తార్కాడుజిల్లా.

పౌరాణికకథానాటకములు:-- ఏ. వి. నరసింహముపంతులు గారు, ప్రకాశకులు ఆర్. వెంకటాచలము కంపెనీ ట్రిప్లికేన్, మద్రాసు 0-4-0.

ప్రతిజ్ఞావిజయ రామరాజీయము:-- గ్రంథకర్త భాగవతుల నరసింహశర్మగారు బరంపురము.

ప్రచ్ఛన్న పాండవము:-- గ్రంథకర్త గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు మద్రాసు 0-12-0.

భర్తృహరిప్రబోధము: - అనువాదకులు దాసరి లక్ష్మణ స్వామిగారు పిఠాపురము 0-12-0.

మదనసాయకము:-- గ్రంథకర్త ఎల్లాపంతుల జగన్నాథము పంతులుగారు బరంపురము.

మనోహరము:-- గ్రంథకర్త కల్లా ప్రౌఢ వెంకటసుబ్బారావు గారు శనివారపుపేట, ఉచితము.

రఘుకౌత్సీయము:-- గ్రంథకర్త టి. యస్. రామస్వామి అయ్యంగారు కుప్పము, నార్తార్కాడుజిల్లా. 0-2-0.

వసంతకోకిల:-- గ్రంథకర్త ఏ. అంజనేయశాస్త్రిగారు. ప్రకాశకులు టి. నరసింగరావుగారు బందరు 1-0-0.

వీరసంయుక్త:-- గ్రంథకర్త కోలాచెల్ల హనుమంతరావుగారు, కాశీవాసి 1-0-0.

శ్రీకృష్ణతులాభారము:-- గ్రంథకర్త బి. సీతారామరావుగారు బందరు 0-12-0.

సత్యవతీవిలాసము:-- గ్రంథకర్త ఎల్. వెంకటరమణకవిగారు ప్రకాశకులు బి. త్యాగరాయశాస్త్రిగారు మద్రాసు. 0-4-0.

సావిత్రీ నాటకము:-- గ్రంథకర్త ఏ. గోపాలకృష్ణయ్యగారు రాజమండ్రి.

సావిత్రీనాటకము:-- గ్రంథకర్త బి. సీతారామరావుగారు బందరు 0-12-0.

సుగ్రీవపట్టాభిషేకము:-- గ్రంథకర్త కస్తూరి సుబ్బారావు గారు అనంతపురము.

హరిశ్చంద్రనాటకము:-- రావుబహద్దరు భవానందంపిళ్లెగారు మద్రాసు. 0-8-0.

హిందూకథానాటకము: గ్రంథకర్త ఏ.వి. నరసింహము పంతులుగారు. ప్రకాశకులు ఆర్. వెంకటాచలము కంపెనీవారు 0-4-0.

బ్రాహ్మణపల్లె చంద్రహాసనాటకము: గ్రంథకర్త కే. సింగయ్యగారు, ప్రకాశకులు ఏ. పి. కవి అనంతపురము వెల 0-8-0.

లంకాదహనము: గ్రంథకర్త డి. సీతారామరావుగారు, ప్రకాశకులు కే. సుబ్బారావుగారు భీమడోలు వెల 0-8-0.

ప్రతిజ్ఞాపాండవము: గ్రంథకర్త ఏ. సుందరరామయ్యగారు, ప్రకాశకులు యస్. వి వి. నారాయణరావుగారు కొమరిపాలెము 0-10-0.

సత్యభామామనోల్లాస నాటకము: గ్రంథకర్త ఎల్. తాతాచార్యులుగారు నరసారావుపేట.

వీరసేనవిజయము: గ్రంథకర్త ఏ. వెంకటహనుమంతరావు గారు పండూరు గోదావరిజిల్లా 0-10-0.

✓ అకటవికటనాటకము: గ్రంథకర్త ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గుంటూరు 0-4-0

## 11. మతగ్రంథములు

అనార్యమతఖండనము:--- గ్రంథకర్త దుర్భాక సీతారామ శాస్త్రులుగారు బుక్కపట్నము.

అనుభవశతకము:-- నల్లా చినకోటయ్యగారు. పాలకొల్లు. కృష్ణాజిల్లా 0-1-0.

ఆంజనేయదండకము:-- ప్రకాశకులు వావిళ్లవారు మద్రాసు. వెల 0-2-0.

అంతరంగిక జీవితము:--ఇది ఇమిటేషను ఆఫ్ క్రీస్తు అను దాని కనువాదము. అనువాదకులు నిడమర్తి వెంకటనరసింహరావు భీమవరము 0-12-0.

ఆత్మానంద బోధానందశతకము:-- గ్రంథకర్త బి. వెంకటాచలశర్మగారు. కోసరారిపల్లె, చిత్తూరుజిల్లా.

ఆదిత్యహృదయము:-- ప్రకాశకులు. వి. సూర్యనారాయణ గారు, ఏలూరు 0-1-0.

ఆరాధనక్రమము:-- గ్రంథకర్త. రెవరెండు పి. బి. ఎమ్మెటు గారు. కర్నూలు

ఆర్యానంద సంకీర్తనలు:-- ప్రకాశకులు. బి. సుబ్బయ్యగారు. ఏలూరు 0-4-0.

ఆలూరు రంగనాయక మాహాత్మ్యము:-- గ్రంథకర్త. బి. వెంకటాచార్యులుగారు 0-8-0.

ఈశ్వరతారావళి:-- గ్రంథకర్త, జే. సీతారామస్వామిగారు. పిఠాపురము.

ఈశ్వరిశతకము:--సెనగల సోమయ్యగారు పాలపర్తి. గుంటూరుజిల్లా 0-2-0.

కపోతేశ్వరశతకము:-- గ్రంథకర్త, ఏ. సీతారామస్వామి గారు, పిఠాపురము.

కీర్తనలు:--అద్దంకి దావీదుగారు. గ్రంథకర్త తెంసాలాదు (దక్కను) 0-1-6.

కృష్ణదండకము:-- కే. యస్. రాఘవాచార్యులు కడప.

కృష్ణస్తోత్రము:--వెంకటాచార్యులుగారు ఏలూరు.

కోటీశ్వరస్వామిదండకము:-- గ్రంథకర్త, పాపరాజు వెంకట కృష్ణయ్యశర్మగారు. నరసారావుపేట 0-1-0.

క్రీస్తుమసుభూలదండ:-- గ్రంథకర్త. కే. రాజరత్నముగారు. శరభాపురము. గుంటూరుజిల్లా 0-2-0.

క్రైస్తవమతోపదేశము:-- ప్రకాశకులు, క్రిశ్చియన్ లిటరరీ అస్సోసియేషనువారు మద్రాసు 0-1-0.

గణపతి:-- సత్యసుబ్రహ్మణ్యకవులు 0-0-6.

జగన్నాయికాస్తవము:-- గ్రంథకర్త. ఎస్. వీరరాజుగారు. చరలూరు. కర్నూలుజిల్లా 0-1-0.

జ్ఞానాంబాదండకము.-- గ్రంథకర్త కే. సుదర్శనదాసు గారు వెల 0-0-6.

తిరుమంత్రార్థసారఘట్టము:-- గ్రంథకర్త బి. రాఘవదాసు గారు వెల 0-1-0.

తెలుగు కీర్తనలు:-- గ్రంథకర్త కనకెంపు ఘంటెటు గారు మెదకు, నైజామయిలాకా.

దీనసంరక్షణశతకము:-- గ్రంథకర్త మోచర్ల హనుమంతరావుగారు కాకినాడ 0-4-0.

ధన్వంతరి దండకము:-- గ్రంథకర్త చివుకుల సత్యనారాయణశాస్త్రి వెల 0-1-0.

నాగబ్రహ్మశతకము:-- శంకరరెడ్డిగారు 0-4-0.

నారసింహ నక్షత్రమాల:-- గ్రంథకర్త బి. సత్యనారాయణమూర్తిగారు బెజవాడ 0-0-6.

నిజలింగచిక్కయ్య చరిత్రము:-- గ్రంథకర్త ఎస్. పెద్దరంగయ్యగారు కర్నూలు.

పంచముఖలింగశతకము:-- గ్రంథకర్త ఏ. పాపారావుగారు పినతాడివాడ, విశాఖపట్నంజిల్లా 0-1-0.

పరమపదవిలాసము:-- గ్రంథకర్త ఎమ్. చెంగల్వరాయప్ప బసరింగుపేట 1-0-0.

ప్రత్యక్షీకరణము:-- ద్వితీయకాండము.

పానకాలు నృసింహస్మరణము:-- ఎమ్. ముత్యముగారు మంగళగిరి 0-1-0.

పానకాలస్వామిస్తోత్రము:-- పి. సుబ్బరావు తెనాలి 0-1-0.

పార్థసారథిశతకము:- ఎస్. రామయోగికవిగారు విజయనగరము 0-2-0.

పెరుంబూదూరు మాహాత్మ్యము:- 0-2-0.

భక్తకల్పద్రుమశతకము:-- కే. అమరయ్యశాస్త్రిగారు బయ్యవరము, గుంటూరుజిల్లా 0-2-0.

భక్తజనమనోరంజనము:-- గ్రంథకర్త దాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము 0-4-0.

భక్తిశతకము:-- సి. వెంకటరమణయ్యగారు, విశాఖపట్టణము వెల 0-4-0.

భక్తిజ్ఞానకీర్తనలు:-- గ్రంథకర్త ఏ. నాగలింగాచారి గారు, ప్రకాశకులు కంటెద్దు నాగయ్యకంపెనీవారు రాజమండ్రి 0-2-0.

భగవద్గీతార్థమంజరి:- గ్రంథకర్త కోపూరి పట్టాభిరామయ్యగారు 0-2-0.

భగవదనుభవము:-- డి. సూరయ్య, వల్లపల్లి.

భజనకీర్తనలు:-- గ్రంథకర్త బి. నరసింహదాసుగారు, ప్రకాశకులు పి. రంగనాయకులుగారు తిరుపతి 0-1-6.

భద్రకాళీశతకము:- గ్రంథకర్త జి. రామభద్రరాజుగారు, ప్రకాశకులు జి. సూరపరాజుగారు బరగపూడి, గోదావరిజిల్లా 0-2-0.

భద్రాచలాధీశ్వరశతకము:-- గ్రంథకర్త్రి పొదవరపు లక్ష్మీనరసమాంబగారు 0-2-0.

మతశిఖ:-- ప్రభాకర ఉమామహేశ్వరశాస్త్రిగారు గ్రంథకర్త, నరసారావుపేట 0-4-0.

మల్లేశ్వరకీర్తనలు:-- గ్రంథకర్త జి. వెంకటసుబ్బరాయగుప్త గారు.

మహాశక్తిస్తోత్రము:-- ఐ. నరసింహస్వామిగారు తోకేరు, కృష్ణాజిల్లా 0-1-0.

మహోన్నతసేవ:-- ప్రకాశకులు క్రిశ్చియను లిటరరీ అసోసియేషనువారు మద్రాసు వెల 0-1-0.

మానసశతకము:-- బి. సీతారామరాజకవిగారు పులపల్లి, గోదావరిజిల్లా 0-1-0.

మీరాబాయిచరిత్రము:-- కే. సంజీవమూర్తిరావుగారు బళ్లారి వెల 0-1-0.

ముకుందశతకము:- గ్రంథకర్త పి. శ్రీనివాసరావుగారు ఏలూరు 0-2-0.

ముక్తికాంత ఎఱుక:-- ప్రకాశకులు రామయ్య అండు సన్సు కాకినాడ.

మోక్షకాంతచిద్విలాసము:-- గ్రంథకర్త కే. కాశయ్యదాసుగారు 0-4-0.

మోక్షమార్గ ప్రదీపిక:-- పి. త్యాగరాయచెట్టిగారు మద్రాసు.

మోక్షమార్గ నిజస్వరూపబోధ:-- గ్రంథకర్త. కే. బంగారయ్యగారు 0-4-0

రంగనాథ సంకీర్తనలు. ఏ. సుబ్బారెడ్డిగారు పొందుటూరు కృష్ణాజిల్లా

రాజయోగసారము... ప్ర. పి. త్యాగరాయ శెట్టి గారు మద్రాసు.

రామచంద్రశతకము:... నారాయణ పిళ్లె గారు, చిత్తూరు.

రామశతకము:... గ్రంథకర్త. టి. సీతారామాచారి గారు కాపూరు, గుంటూరు జిల్లా.

రామేశ్వరమజిలీలు:... గ్రంథకర్త్రి. కే. వెంకటరంగనాయకమ్మగారు బెజవాడ. వెల 0-8-0.

విద్యున్మాల:... గ్రంథకర్త, హైదరుబురుద్దీన్. ప్రకాశక్. వి. రామదాసు పంతులుగారు. విశాఖపట్టణము వెల 0-4-0.

విష్ణుపురాణకథాసారము.... ప్రకాశకులు. జి. లక్ష్మణశాస్త్రి గారు బెజవాడ.

వీరాంజనేయతారావళి.... ప్ర. పి. శేషయ్యగారు నరసారావుపేట.

వెంకటకృష్ణభారతము:—(హరికథ) గ్రంథకర్త. పాపరాజు వెంకటకృష్ణయ్యగారు నరసారావుపేట. వెల 0-1-0.

వెంకటాచలరమణశతకము:— గ్రంథకర్త. పి. శ్రీరాములు నాయుడుగారు బందరు.

వెంకటేశ్వర మేలుకొలుపులు:— గ్రంథకర్త. కే. వెంగయ్య దాసుగారు. 0-1-6.

వేదవాక్యపాఠములు:— గ్రంథకర్త. గ్లైటనుగారు. 0-10-0.

వేదాంతరత్నాకరము.— గ్రంథకర్త కే. వీరభద్రయ్యగారు గుంటూరు. వెల 0-?-0.

శివశతకము:... వి. వెంకటకవిగారు. కాకినాడ.

శివతారావళి:— గ్రంథకర్త. బంకపల్లి వెంకటనృసింహ సిద్ధాంతి శ్రీకాకుళము.

శ్రీరామశతకము:— గ్రంథకర్త. రాధామాధవరావు గారు కాకినాడ. వెల 0-2-0.

శ్రీహరిశతకము:—సి. వెంకట్రామాచార్యులు గారు ఏలూరు, వెల 0-4-0.

శుద్ధనిర్గుణతత్త్వములు:— గ్రంథకర్త్రి. సేలమూరుల వెంకట సుబ్బమ్మగారు. ప్రకాశకులు. రామా కంపెనీవారు ఏలూరు.

షట్స్థలగురుబోధసారము:—గ్రంథకర్త్రి వాగంటి వీరమాంబగారు రాజమండ్రి. 0-8-0.

సంగమేశ్వరశతకము:— గ్రంథకర్త. డి. భవానీసింగు గారు కంబంమెట్టు.

సిద్ధాసిద్ధాంతపద్ధతి:— ప్రకాశకులు కంచెర్ల సత్తిరాజుగారు కాకినాడ. వెల 0-1-6.

హనుమజ్జీవితము:— ఎస్. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు గ్రంథకర్తలు. గుంటూరు. 0-12-0.

ఆధ్యాత్మరామాయణకీర్తనలు: ప్రకాశకులు కే. అప్పయ్య రాజమండ్రి.

మతపాఠములు: ప్రకాశకులు క్రిశ్చియను లిటరేచరుసొసైటీ వారు మద్రాసు.

సత్యరత్నము: గ్రంథకర్త కే. ధారిపాటిశర్మగారు కొట్నూరు, అనంతపురము.

ఉడిపిక్షేత్రమహిమ: గ్రంథకర్త పి. సుందరావు గారు ఉడిపి 0-8-0.

అద్వైతబ్రహ్మేశ్వరీ తారావళి: బి. కోదండపాణిగారు ప్రకాశకులు జి. యస్. ఏ. నారాయణహరిరావుగారు చెరుకుపల్లి గుంటూరుజిల్లా 0-2-0.

రామతారావళి: ప్రకాశకులు బి. కోటిరెడ్డిగారు కంకల గుంట, నరసారావుపేట తాలూకా.

క్రైస్తవజీవ్యపునియమములు: జి. జి. లారీగారు బెంగుళూరు 0-0-6.

తత్త్వరహస్యములు: గ్రంథకర్త నాగభూషణముగారు ప్రకాశకులు పి. త్యాగరామశ్రేష్ఠిగారు మద్రాసు, 0-1-0.

భ్రమరి: గ్రంథకర్త ఎమ్. నాగవీరేశ్వరశాస్త్రిగారు సికందరాబాదు (దక్కను) 0-4-0.

ప్రాటెస్టెంటుమతఖండనము: గ్రంథకర్త పాద్రివాలీగారు ఏలూరు 0-9-9.

✓శ్రావణపరివర్తనశాంతము: ప్రకాశకులు పి. బుచ్చిరామయ్య గారు బెజవాడ.

సింహాగిరిశతకము:— వరహగిరి నారాయణశర్మగారు.

తిరుపతి వెంకటేశ్వర కర్ణామృతము: గ్రంథకర్త యస్. సూరిదాసకవి తిరుపతి 0-4-0.

ఆర్తరక్షామణి: గన్నవరపు సూర్యనారాయణమూర్తి గారు బరంపురము 0-4-0.

వెంకటేశ్వర కీర్తనలు: జి. తిమ్మాదాసుగారు, ప్రకాశకులు పి. త్యాగరాయశెట్టిగారు మద్రాసు.

లక్ష్మీచెన్నకేశవశతకము: పోలా వెంకటకృష్ణదాసుగారు, ప్రకాశకులు బి. వెంకటప్పయ్య బెజవాడ 0-4-0.

త్రిపురసుందరీశతకము: గ్రంథకర్త సి. వెంకట్రామయ్యగారు కాకినాడ 0-4-0.

అమ్మవారిదండకము: ప్రకాశకులు ఏ. సన్యాసినాయుడు గారు బెజవాడ 0-1-0

ఎడ్లరామదాసుచరిత్ర: ప్రకాశకులు బి. యతిరాజులునాయుడుగారు మద్రాసు 0-4-0.

సూర్యనారాయణాష్టోత్తరశతము: వి. వెంకయ్యదాసుగారు రాజమండ్రి.

## 12. ఇతర గ్రంథములు.

అంటరానివాళ్లా?— ప్రకాశకులు శ్రీకృష్ణాశ్రమము వారు పెదపాలెము. వెల 0-2-0.

అబ్బికోట:— గ్రంథకర్త. యాతగిరి లక్ష్మీనరసింహారావు గారు ప్రకా. జగపతివర్మగారు పెద్దాపురము. వెల 0-4-0.

✓అంజనేయరగడలు:— ప్రకా. జి. పాపయ్య గారు ముత్యాలమ్మపేట.

ఉపన్యాసమాలిక:—గ్రంథకర్త. కే. చినరఘుపతిరావు, పిఠాపురము.

ఊర్మిళనిద్ర:— ప్రకాశకులు. ఏ. సూర్యనారాయణమూర్తి గారు విశాఖపట్టణము.

✓ఏకశిలానగరద్వయవివాదసంగ్రహము:—గ్రంథకర్త. వావిలికొలను సుబ్బారావుగారు మదరాసు.

✓ఒరంగలు ఒంటిమిట్ట వివాదము:— గ్రంథకర్త. పొద్దిబొట్ల వీరయ్యపంతులుగారు బెజవాడ.

కన్యకాంబాచరిత్రము:—గ్రంథకర్త. నారాయణభాగవతులుగారు. ప్రకాశకులు చెదలువాడ సుందరరామశాస్త్రిలుగారు.

కమ్మకులాభ్యుదయము:... ఎస్. వెంకటకవి గారు ఏలూరు. వెల 0-8-0.

కలియుగచర్య:... గ్రంథకర్త. ఏ. వెంకటరత్నము గారు. పిఠాపురము. వెల 0-4-0.

కాంభోజరాజు:...ప్రకా. కుప్పుస్వామిమొదలిగారు మదరాసు.

కైకేయీ ప్రబోధము:... గ్రంథ. నారాయణ భాగవతులు. ప్రకా. సి. సుందరరామశాస్త్రిగారు మద్రాసు. వెల 0-2-0.

గయోపాఖ్యానము:...(వచనము) గ్రంథకర్త. టి. రామబ్రహ్మముగారు. ప్రకా. ఏ. సత్యనారాయణమూర్తి గారు, విశాఖపట్టణము. వెల 0-1-6.

గీతావళి:...ప్రకాశకులు. బి. నరసింహారావుగారు చిత్తూరు.

గోహత్యానిషేధనము:... కే. వి. కృష్ణారావుగారు గంపలగూడెము కుమారరాజాగారు.

గ్రంథాలయోద్యమము:...గ్రంథకర్త. యాతగిరిలక్ష్మీనరసింహ

గారు కాకినాడ. వెల 0-2-0.

చవిలిచందురునికథ:... గ్రంథకర్త. పొడుగు రామబ్రహ్మము గారు విశాఖపట్టణము.

జాతీయవస్త్రధారణము:—గ్రంథకర్త. కే. సుబ్బారాయులు గారు అనంతపురము. వెల 0-2-0.

డింజాస్వాన్:— కే. యల్. యస్. సోమయాజులు రాజమండ్రి.

✓ తిరుపతివేంకటేశ్వర్ల సాహిత్యము:— ప్రకాశకులు. ఎ. సత్యనారాయణగారు, విశాఖపట్టణము.

దయగలరోగి:— ప్రకాశకులు. పి సంజాండేప్పగారు పారిగ అనంతపురుజిల్లా.

నారాయణప్రశ్నరత్నమాల:... ప్ర. కా. టి. పురుషోత్తము గారు బెజవాడ. వెల 0-2-0.

✓ నిరుద్యోగులఫార్సు:...గ్రంథకర్త. కే. యల్. యస్. సోమయాజులుగారు రాజమండ్రి. వెల 0-4-0.

నాశాచరిత్రము:... ప్రకాశకులు దువ్వూరి జగన్నాథశర్మ గారు. కాకినాడ. వెల 0-2 6.

పాటలు:... జే. రామలక్ష్మమ్మ. బందరు. వెల 0-4-0.

పాటలు:...గ్రంథకర్త. చినగల హనుమయ్యగారు వడ్లమూడి గుంటూరు. వెల 0-4-0.

ఫార్సుపాటలు...ప్ర. కా. వి కుప్పుముదలి. మద్రాసు.0-4-0.

పెండ్లిపాటలు,...ఎన్ వెంకటరామకవి ఎనుగుబాల గుంటూరు జిల్లా.

పొడుపుగీతములు ...ఎన్. చలపతిరావు ఏలూరు.

ప్రస్తుతపాఠశాలలు,...రామకోటిశాస్త్రి. గుంటూరు.

✓ ప్రొద్దుపొడుపుపువ్వులు,...ప్ర. కా. ఓలేటి పార్వతీశముగారు. పిఠాపురము. వెల 0-12.0.

ప్రహ్లాదచరిత్ర,...ప్ర. కా. ఎ. సత్యనారాయణగారు విశాఖపట్టణము.

బమ్మెరపోతరాజవిజయము: ప్రకాశకులు పోతరాజసమాజమువారు కడప వెల 0-12-0.

బాతాఖానీ: బి. సుబ్బారావు 0-4-0.

బాలకృష్ణలీలలు: ప్రకాశకులు ఏ. సత్యనారాయణగారు విశాఖపట్టణము 0-0-2.

బాలభటునికవాతు: అక్షరావధానము గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

బాలభటపటాలమును కూర్చుట ఎట్లు: గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

బాలభటులమై యుండు టెందులకు? : గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

భూసాక్ష్యలక్షు: ప్రకాశకులు అభినవ కవిసమాజమువారు కొంగనపాడు, కర్నూలుజిల్లా.

మల్లమ్మదేవిచరిత్రము ప్రకాశకులు కే. కాశయ్యశెట్టి గారు వెంకటగిరి 0-8-0.

మహామ్మదీయవిలాసము: గ్రంథకర్త ఎమ్. వెంకటపతిదాసు గారు ప్రకాశకులు కే. కాశయ్యశెట్టిగారు.

మూర్ఖచాదస్తము: మృత్యుంజయరావుగారు గుడివాడ 0-4-0.

మైరావణచరిత్రము: ప్రకాశకులు వి. కుప్పుముదలిగారు.

రామాయణబోధితప్రధానధర్మములు: గ్రంథకర్త సి. సుందర రామశాస్త్రులుగారు మద్రాసు 0-4-0.

రామకథామృతము: గ్రంథకర్త కారుపల్లి శివరామదాసు గారు బెంగుళూరు 0 1-0.

రామకథాసంగ్రహము: పొడుగు రామబ్రహ్మము గారు విశాఖపట్టణము 0-0-8.

రుక్మాంగదచరిత్రము: ప్రకాశకులు ఎన్. వెంకటరామయ్య గారు నిడదవోలు.

లంకాయాగము: గ్రంథకర్త రఘుపతికవిగారు ప్రకాశకులు వి. కుప్పుముదలి మద్రాసు.

✓ లంకదాలబోటు: గ్రంథకర్త ఎమ్. రాఘవాచార్యులుగారు ఏలూరు 0-1-0.

లక్ష్మణమూర్ఛ: గ్రంథకర్త పి. బుచ్చన్నపంతులుగారు ప్రకాశకులు ఏ॥ సత్యనారాయణ గారు విశాఖపట్టణము 0.0-9.

వివిధదంపతీవిలాసము: ప్రకాశకులు పి లక్ష్మయ్యగారు కర్నూలు 0-4-0.

✓ వృద్ధవరప్రహసనము: గ్రంథకర్త నూరి సుందరరామశాస్త్రి గారు బెజవాడ.

✓ వేగుజుక్క కథలు: 5, 6, 7, 8, 10 నంబర్ల సంచికలు ఒక్కొక్కటి 0-8-0. ప్రకాశకులు వేగుజుక్కకథావళీమండలివారు బరంపురము.

సంగీతసత్యహరిశ్చంద్ర: గ్రంథకర్త్రి పింగళి అనంతమ్మ గారు హనుమకొండ 0-3-0.

సత్యత్వలక్షణము: ప్రకాశకులు ఎన్. ఆనందరావుగారు ఏలూరు.

సీసపంచరత్నములు: వి. ఎటుకయ్యగారు పెరుకలపూడి, గుంటూరుజిల్లా.

హరిశ్చంద్రోపాఖ్యానము: గ్రంథకర్త వి. అప్పలదాసు పార్వతీపురము 0-8-0.

వ్యవసాయమార్గబోధిని: పి. అప్పారావుగారు తిరుపతి 0-2-0.

జాలిపక్కశాస్త్రము: గ్రంథకర్త ఈ. భాగవతయ్యగారు విశాఖపట్టణము 0-4-.

దేసింగురాజుకథ: ప్రకాశకులు బి. యతిరాజులుసెట్టిగారు మద్రాసు 0-1-6.

✓ రాద్ధాంతపంచాంగము: గ్రంథకర్త కే. వి. కృష్ణారావుగారు విజయనగరము 0-1-6.

నందనందనచరిత్రము: గ్రంథకర్త బి. కృష్ణశాస్త్రిగారు, ప్రకాశకులు జే. లక్ష్మీనారాయణరావుగారు జొజ్జూరు, నందిగామ తాలూకా.

ఘోషా: గ్రంథకర్త సి. లచ్చారావుగారు చిత్రాడ, గోదావరిజిల్లా 0-8-0.

హితుడు: గ్రంథకర్త ఎన్. నరసింహము నాయుడుగారు గుంటూరు.

సప్తాహవర్ణనము: జే. రామకృష్ణశాస్త్రిగారు, మూచర్లపల్లి.

మద్యపానము: గ్రంథకర్త మల్యాల సాంబశివరావుగారు ప్రకాశకులు బి. రామానుజయ్య చిత్రాడ.

అభ్యుదయము: గ్రంథకర్త కే. శివరామదాసుగారు బెంగుళూరుసిటి 0-1-0.

విజయము: ప్రకాశకులు క్రిశ్చియను లిటరేచరు సొసైటీ వారు మద్రాసు.

# సుకృతి ప్రశస్తి

## * జ్యోతిషరత్నాకర సిద్ధాంతి శివశంకరశాస్త్రులు గారు

శివముగ శంకరుఁ డా రా
ఘవుఁ డా వాల్మీకికృతిని శుభ మెలకొలిపెన్
శివశంకరుండు శ్రీ యాం
ధ్రవాల్మీకిప్రోక్తకృతికిఁ బ్రాముఖ్య మిడున్.

క. కవి సాష్టాంగనమస్కృతి
సవినయత సమర్పిత మని సత్కృతి నిడుటన్
చవిగొనక యుండఁ దగ దని
సవివేకత నాదుకొంటి సద్వినయములోన్.

క. పుట్టిరి కవు లెందఱో, మఱి
గిట్టిరి కావ్యంబు లెన్ని గిట్టం బుట్టెన్
ఇట్టిపరిస్థితి నేఁ గవి
భట్టారకుఁ డనుచుఁ గాదు భావింపంగన్.

క. అయిన స్వాన్యాశయమున్
సమోత్తమం దెల్పువాఁడ నార్యు ల్వర్యల్
దయచే మదుక్తి భావము
స్వయంమతిప్రథ నెఱింగి స్వస్తి వచింపన్.

క. సద్యః పరనిర్వృతికై
సూద్యము మొదవుటయు విజ్ఞసూచక మందున్
హృద్యకృతిరూప మగుట యు
విద్యానిర్భేద మనుట విదితార్థం బౌ.

క. ఎటు లన శ్రుతిసారం బని
పటుమతు లరసిరి పదార్థ పరిణతిచే సం
స్ఫుటముగ దాకృతి నొక్కటి
పటుతమతారకము రామపద మని తాజే.

క. ఆ దివ్య రామనామమె
భేదాభేదప్రపంచ భిన్నార్థంబున్
మేదిని దనరూపున నుప
పాదించెం ద్రివిధజన్మపరతత్త్వముచే.

క. సకలపురాణంబులలో
నకళంకము నాదిపరిక మని వినుతింపన్,
ప్రకటప్రభావమహిమన్
సుకవీంద్రుఁడు పుట్టఁబట్టె సుయశం బందెన్.

క. ఆ వాల్మీకిమునీంద్రుఁడె
భూవినుతుం డమ్మై భవ్యభూతిం గనుటన్
భావింప నతఁ డెటఁ గ మా
యావల్మీకమున నడఁకి యాత్మానందున్.

క. అమ్ముని వచోగభీరత
నిమ్ముగ మది నెఱుఁగ నేర నెందఱో విజ్ఞుల్
సమ్మదమునఁ బారాయణ
సమ్మతిఁ గడదేలు దుండ్రు సకలము ధాత్రిన్.

క. అట్టి మహాకావ్యంబుం
గట్టిగ సరికట్టఁ బూని కను సాహసి యై
తుట్టతుదవఱకుఁ దీర్చుడు
పట్టు గదా! యిట్టి గట్టిపట్టే పట్టౌ.

క. వ్యక్తీకరించె నిర్మల
భక్తిప్రాభవము! పూర్వభవపుణ్యంబో!!
సూక్తిక్రియామనస్క-
ప్రోక్తం బెద్దియును భువినిఁ బూర్ణత నందున్.

క. ఏవంవిధ కావ్యంబుం
గావింపన్ శాంతముగను కర్త యొకం డౌ
భావింపఁగ నని యడిగెద
రా వావిలికొలను సుబ్బరాయుండె యగున్.

క. అంతటి సుకృతం బబ్బుట
వింత యనం దగదు చూడ విధివిహితం బౌ
శాంతరసైకనిధాన
స్వాంతుం డై యొప్ప నతఁడు సత్కవి గానన్.

క. విరుదుగ వెలసెన్ సత్కవి
వరుముదమున నాంధ్ర వాచలూరూఢ్యపుఁడౌ
ధరణి నితం డని మెచ్చుట
వరయంగా నింతకన్న నధికుఁడు కలఁడే.

క. ఇక్కవి గద ధన్యుం డన
నొక్కఁడె విలసిల్లు చుండె మూర్తిరతుఁడై
తక్కంగలాంధ్రు లెందఱొ
గ్రక్కున సామాన్యు లైరి గ్రామ్యుల్గాకే.

---

* వీరు మద్రాసు ప్రెసిడెన్సీకళాశాలలోఁ గర్ణాటక పండితులుగ నున్న యాంధ్రులు. భాషాత్రయకవిత్వశోభితు లఁట. వీరి యాంధ్ర కవితాశైలి తెలియుటకై ఆంధ్రవాల్మీకిరామాయణముపై నిచ్చిన తత్త్వాత్మిక మగు అభిప్రాయపత్రమునుండి కొన్ని పద్యములు ఇందు ప్రకటితములు — సంపాదకుఁడు.

క. సౌమ్యకృతి నెంద ఱతికై
వమ్యమతిం గ్రామ్యకృతికిఁ జాటఁగ సేమా
రమ్యని దోషాకరుఁ డన
రమ్యత కే హాని గాని రాఁగలదె కవన్.

క. ప్రాజ్ఞంమన్యు ల్గొందఱు
స్వజ్ఞానవశంబు జగము సర్వ మనుచు న
ల్పజ్ఞతఁ దమలో నెంచక
సుజ్ఞకృతిం దెగడి తెగడి సొంపఱుదు రొగిన్.

క. లక్షణ మలక్షణం బను
పక్షమె భగవత్కథాఢ్యపద్యంబులలో
లక్షితము గా దనుచు స్వా
పేక్ష స్మృతులను దూఱు విజ్ఞులె యజ్ఞుల్.

క. తన యాశ్వాసము మునుపె యు
పనిషత్సారంబు నింపి పాశురము లనం
గనకపుఁగుంభము లిడి భువి
జనసామాన్యం బటంచుఁ జాటించినటుల్.

క. గాయత్ర్యాదిక మహిమ క
పాయము రామండ నదియె పరిణామం బై
యీ యాంధ్రమానం దుండఁగ
ప్రాయంగా నెవనికరము ప్రాజ్ఞుఁ డితండా.

క. దుష్ప్రజ్ఞాభావతతులన్
నిష్ప్రత్యూహోక్తకార్యనిర్వాహతయున్
దుష్ప్రభుసేవాభావ ము
దుష్ప్రాప్యముఖ్యము నిరస్తదురితఫలంబుల్.

క. ఇన్నిఁటి నందిన సత్కవి
కన్న స్మృతియొకఁడుఁ గలఁడె ఘనుఁ డీయిలలో
నన్ని యటులుండ నిందు ప
రోన్నతి ననుమానయుఁ డగుట నభినుతగుణుఁడా.

క. సాజము గాదా విష్ణుని
తే జానకభూప్రభుత నుతిం గనఁ గలరే
రాజవరేణ్యుఁడు రాముఁడె
రాజిల్లెం బీఠికాపురప్రభువరుఁ డై.

క. మద్గురుపూర్ణాత్రయునిన్
సద్గుణవంతున్ సుగుప్తసద్దానపరున్
తద్గుణలేశాకృష్ట ను
హృద్గణకై యిట్లు చెప్పి హృష్టుఁడ నగుదున్.

క. * పుట్టగ వచ్చిన గుణములు
కట్టెలతో గాని పోవె కలుషాత్మకునన్
గట్టిగఁ జెప్పిన బుద్ధులు
పట్టునె మనసమునకు నిలుపఁబడు నేరితరమై? (ఆం.వా.రా.అర.53౮)

క. ఇప్పద్యప్రకరణమున
నొప్పుగ నర్థంబుఁ బూని యూహించినచో
దప్పని నేఁ జెప్పను మఱి
తప్పకఁ దానిట్లు చేయఁ దగు నని తోఁచున్.

క ఎవని కెది దృఢగుణం బగు
వివర్జితం బగుట యద్ది వివశం బయిగన్
జెవిఁగోను కుమతుల యింట
న్నివసింపదు ధర్మ మచలని దై కదరా.

క. దోషమెయి? ఇది బుధులకు, మఱి
దోషాభాసంబా? చూచి తోఁచినదంకిన్
దూషించిన భూషించిన
దూషణభూషణలు లేవు తుష్టాత్ములకున్.

క. భూసురుఁడవు వానకవీ
భాసిల్లగ భాసురమతి వ్యాసోక్తులకున్
వ్రాసెద వీవ నీ సుగుణము
వాసయుఁగదు వాసి కెక్కి భాసిల్లు నిలన్.

క. పుణ్యం బగు నీతం డని
గణ్యం బగు నీతఁ డనియుఁ గవితాసరణి
పుణ్యం డని ధన్యం డని
గణ్యగుణుం డనియు ధాత్రిఁ గంటివి ఖ్యాతిన్.

క. కవి యాయుష్మన్ముఖవృద్ధులఁ
ప్రవిమలమాపాదికావ్యప్రాచుర్యమునన్
అవిరళకీర్తినిఁ దన ద్విజ
సువిధా సాశీస్సు నాము సూక్తి ఘటింతున్.

క. ఆనంద రామసత్కృతి
నానందించితిని మఱియు నాంధ్రుఁడ నగుటన్
ఆనందము నాంధ్రమునం
దానీతసుధోక్తులందు నందితిని గదున్.

క. భాషాత్రయకవితావా
గ్యోషాపాదారవింద యుగళీభూరి
భూషానిరస్తదోషకు
నీసాధ్వత నిచ్చి ప్రోచు నల్ భారతియే.

క. శివుఁడును వరదుండును శంభుఁడు
కవిగమ్యుఁడు కలుఁడు శాస్త్రకరుఁడు నరయ శ్రీ
స్తుతరహితుఁ డాత్మసిద్ధాం
తివిహితకృత్యుఁ డని పంక్తి శ్రుతి రఘువరుఁడే.

---

* 'శామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుం, న హి దుష్టాత్మనా మార్య మావస త్యాలయే చిరమ్.' (వా. మూలము)

# కౌమారభృత్యము

ఆయుర్వేదవిశారద, చావలి రామమూర్తిశాస్త్రి గారు

కుమారుల రక్షణ మనునది యాయుర్వేదాష్టాంగములలో నొక ముఖ్యమయినది. శిశువులకు కలుగు దినదినాభివృద్ధియు సంభవించెడు వ్యాధుల చికిత్సయు, నీభాగమున విపులముగా విమర్శింపఁ బడినవి. ఈభాగము కేవలము మన యాయుర్వేదముననే కాక ఆంగ్ల యూనాని వైద్యము లందును విమర్శింపఁబడినవి. కాని ప్రకృతము మనదేశమున కాయుర్వేదీయ పద్ధతులంతటి యుపకారకము లితరములు గావని యెల్ల రెఱింగిన విషయ మగుటను ఈ పద్ధతులు మన దేశమున విశేషవ్యాప్తిలో లేనందునను జనసామాన్యము చాలఁ గష్టములకు లోనగుచున్నది. కావున నీవిషయమును గొంచెము వివరింపఁ బూనితిని.

శిశువు జనించినతోడనే సైంధవ లవణముఁ గలిపిన తేనె నేయి శరీరమునకుఁ బూసి శరీరము నావరించియుండు మావిని తీసివేయవలయును. అనంతరము ప్రసవమువలనఁ గలిగిన ఆయాసముపోవుటకై బలాతైలము మున్నగు తైలములచేఁ జక్కఁగ శరీరమును తడుపవలెను. సైంధవలవణము కలిపిన తేనె నేయిని వ్రేలితో శిశువునోటియందు రాయుటవలన కఫము మున్నగుదోషములు హరించును. నేతితో గర్పూరమును గలిపి దానిని శిరముపైని ప్రత్తిపింజతో వేయవలయును. పిదప నాభినాళమును నాలు గంగుళములకుపై నొక దారము గట్టి యక్కడ ఛేదించి యా నాళశకలమునకుఁ గూడిన సూత్రమును శిశువు మెడలో గట్టవలయును. ఛేదించిన నాళమును చెంగల్వకోష్టుచే కాచిన తైలముతో లేపనము చేయవలయును.

తరువాత పాలుగలచెట్ల ఆకులు మొదలగువని వేసి కాఁచిన నీరును, సుగంధద్రవ్యములచే కాఁచిననీరును బంగారు, వెండి, మొదలగు లోహములు వేసి కాఁచిననీరు నగు నీళ్లతో గాని గోరువెచ్చని నీళ్లతో గాని శిశువులకు ఆకాలములయందుండు దోషములకుఁ దగినట్లు వెలఁగయాకు మొదలగువానిని వేసి కాఁచిన జలములోఁ గాని స్నానమును జేయింపవలయును.

## స్తన్యపానక్రమము.

శిశువునకు మొదటి దినమున నల్లసుగంధిపూల చూర్ణము తేనె నేయి వీనిని గలిపి మూఁడుపూటలు నాకింపవలయును. రెండుమూఁడు దినములందు లక్ష్మణ యను మూలికతోఁ దయారుచేసి నేతిని త్రాగింపవలయును. మూఁడవదినమునఁ గాని నాలవ దినమునఁ గాని తల్లికి స్తన్యము ఆవిర్భవించును. అప్పటినుండియుఁ దల్లిపాలు పిల్లల కాహారముగా నుపయోగింపవలయును. మొట్టమొదటిసారి చేఁపినపాలను మొదటఁ గొన్ని ధారలను పైన పిండివేయవలయును. అట్లు చేయకున్న బిడ్డకుఁ బ్రమాదము వాటిల్లును. తల్లిపాల నిచ్చుటయే పిల్లలు క్రమక్రమాభివృద్ధి నొందుటకు ముఖ్యకారణము, ఒకవేళ తల్లిపాలు లేనియెడలఁ బిల్లయందు మిక్కిలి ప్రేమగలదియును, సమానజాతి గలదియును ఆరోగ్యవతియును రోగములేనిదియు లేనిదియును వ్యసనము లేనిదియు లేనిదియును జీవద్వత్సయును సమృద్ధిగాఁ బాలు గలదియును నగు స్త్రీని శిశువునకుఁ బాలిచ్చుటకై నియమించినయెడల ఆశిశువునకు సదా ఆరోగ్యము నంది బలమును గలుగును. శిశువులకు శుద్ధమయిన స్తన్యము నుపయోగింపవలయును. శుద్ధస్తన్యలక్షణము వాగ్భటమున నిట్లు వివరింపఁబడినది. పాలను నీటిలో వైచినతోడనే భేదములేకుండ నీటిలోఁ గలసిపోయినయెడల నవి శుద్ధ మగు పాలు. వాతదూషిత మగు పాలు నీటిలో వేసినతోడనే నీటిపైని తేలుటయు, నురుగు గట్టుటయు మొదలగు గుణము లగపడును. ఆపాలను సేవించినచో మలమూత్రబంధము గలుగును. పైత్యదూషిత మగు స్తన్యము నీటిమీఁద వేసినతోడనే పచ్చని రంగుగీత లగపడును. వానిని సేవించిన సర్వాంగతాపము గలుగును. కఫదూషిత స్తన్యము నీటిమీఁద వేసినతోడనే నురువు గట్టినీటిలో మునిఁగిపోవును వాని నుపయోగించిన నగ్నిమాంద్యము గలుగును.

వీనిలో రెండేసి దోషము లున్నయెడల ద్వంద్వజము లనియు మూఁడు దోషము లున్నయెడల సాన్నిపాతికదూషితము లనియు నెఱింగి శుద్ధ మగు స్తన్యమునే బిడ్డల కుపయోగింపఁదగును. ఒకవేళఁ బైని జెప్పిన లక్షణములు గల యుపమాత (పాలతల్లి) లభింపనియెడల మేకపా లిచ్చుట యుక్తము. అదియు దుర్లభ మయినచో నావు పాలను మేకపాలతో సమానగుణము గలవానిగాఁ జేసి యుపయోగింపవలయును. వాగ్భటాచార్యుఁడు "ఆవుపాలలో ముయ్యాకు పొన్న కొలపొన్న వాఁకుడు నేలములఁగ పల్లేరు వీని వేళ్లుగాని, ముయ్యాకుపొన్న కొలపొన్నల వేళ్లను మాత్రమే గాని వేసి కాఁచి కొంచెము చక్కెరఁ గలిపినచో నవి మేకపాలయందు లాఘవాదిసుగుణములు గలవి యగు"నని చెప్పియున్నాఁడు. బిడ్డ కాఱుమాసములు గడచువఱకును బా లిచ్చువారు గాని పోయువారు గాని మిగుల వివేకముతో మెలంగవలయును. తెలివిలేమిని బిడ్డ యేడ్చినప్పుడెల్లఁ బాల నిచ్చినచో నజీర్ణము గలుగును. ప్రస్తుతము మనదేశమునందలి శిశుమరణముల కిది యొక హేతు వనుట నిస్సంశయము. కావున నదివఱకు త్రాగించిన పాలు బాగుగ జీర్ణించిన వని తెలిసికొని తిరిగి పాలిచ్చుచుండవలయును. ఆఱు మాసములకు లోఁబడిన శిశువునకు క్షీరాదుఁ డనియును (పాలుమాత్ర మాహారముగాఁ గలవాఁడు) ఆటుతరువాత క్షీరాన్నాదుఁ డనియు సంజ్ఞలు గలవు. ఆఱు మాసములు గడచిన

పిదప శిశువునకు మామూలురీతి పాలను లఘువును బృంహణమును నగు నన్నమును గూడ నీయవచ్చును. దంతములు మొలచిన పిదప శిశువునకు క్రమముగాఁ దల్లిపాలు మానిపింపవలయును. మానిపించుటలో మిక్కిలి లఘువును బుష్టికరమును నగు నన్నమును నుపయోగించుచుండవలయును. శిశువునకు దంతము లంకురించినపిదప (1) పేర పప్పు, అతిమధురము, తేనె, పేలపిండి, కలకండ, వీనిని జక్కఁగఁ గలిపి ఆవిరిపై నుడికించి యంత్రముగాఁ జేసి యిచ్చిన మంచి పుష్టి కలుగును. (2, మారేడుపిందెలు, ఏలకులు, పేలపిండి, చక్కెర, వీనిని ఆవిరిచే నుడికించి యంత్రముగా నుపయోగించిన జఠరాగ్ని చక్కఁగ వృద్ధి యగును. (3) ఆరెపువ్వు, చక్కెర, పేలపిండి, మఱియును తృప్తికరములు బలకరములు నగు నితరవస్తువులను జేర్చి పైరీతి నంత్రములు చేసి యిచ్చినచో నజీర్ణ విరేచనములు మొదలగువాని బాపి శిశువున కారోగ్యము నిచ్చును. శిశువునకు పదునెనిమిది మాసములు గడచినపిదప స్తన్యమును క్రమక్రమముగా మాపివేయవలెను. కొందఱు పాలుగల తల్లులు తమబిడ్డలకు అయిదారేండ్లు వచ్చు వఱకును స్తన్యము నిచ్చుచుండుట నక్కడక్కడ కలదఁట. అది పిల్లలకుఁ జాల బుద్ధిమాంద్యమును గలుగఁజేయును. కావున నీ దురభ్యాసమును మానవలెను. అనయమ్ము చిన్నపిల్లలు చాపల్యమున నేచేని యనర్థము లగు పనులు చేయుటయు వారి నితరులు భయపెట్టుటయుఁ గలదు. అట్లు భయపడిన శిశువునకు బాలగ్రహాదివ్యాధు లతిసులభముగ సంభవించును. కావున నట్టిసందర్భములనుండి శిశువులను గాపాడుకొనవలయును. మఱియుఁ బిల్లలనుముఱికిబట్టలనుండియు, చెడుగాలినుండియు గృహింపఁజేయు జాహారవిహారములనుండియు రక్షింపవలయును. సంతతము బిడ్డలనెత్తికొని నలిపివేయరాదు. ఈవిషయములను చక్కఁగ గమనింపనియెడల గొప్ప అనర్థము వాటిల్లును. ఈ విషయమున వాగ్భటాచార్యులు 'శస్త్రవాతా ర్కరస్పర్శా త్పాలయే ల్లంఘితాచ్చ తమ్' అని తెలిపియున్నారు. ఈవయసు కలుగు బాలురకు బ్రాహ్మ్యాదిఘృతమును వచాదిఘృతమును ఇచ్చిన జాలలాభము గలుగును. బ్రాహ్మ్యాది ఘృతము:—మండూకబ్రాహ్మి తెల్ల అవాలు వసకొమ్ము సల్లసుగంధి పాల చెంగల్వకోష్టు సైంధవలవణము పిప్పళ్లు వీనిని సమభాగములుగా తీసుకొని అందు నీళ్లు పోసి స్వరసమును దీసి దానికి నాల్గవ భాగము నేతిని కలపి యథావిధిగ నేయి మిగులునట్లు కాచుకొనవలయును. దీని నుపయోగించినచో బిడ్డలకు వాక్పటుత్వము బుద్ధిపాటవము జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి గలుగును. మఱియును పిల్లలకు పీడ పోకుట గ్రహబాధ ఉన్మాదము మున్నగునవి నశించును.

వచాదిఘృతము.—వస తిప్పతీగ కచ్చోరములు కరకకాయలు తెల్లదంతెన వాయువిడంగములు సొంటి ఉత్తరేణి వీనిని సమభాగములుగా గ్రహించి కల్కము చేసి ఆవునేతిలో జేర్చి విధిప్రకారము పాకము జేసి యిచ్చిన శిశువునకు బలము బుద్ధి జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి వాక్పటుత్వమును గలుగును. ఇట్టిసులభములు నుత్తమములు నగు ఔషధము లెన్నియో యాయుర్వేదమునఁ జెప్పఁబడి యుండినను తెలియక పోవుటచేత బిడ్డలను పాడుచేసికొనుచున్నారు. ప్రజ లిఁకనైనను శిశురక్షణమున బద్ధాదరు లగుదురు గాక యని ప్రార్థించెదను.

## మధురకవిత

అ. రామలింగస్వామిగారు

మలయ నగమునందుఁ బుట్టి మందమంద గతుల మెట్టి
వాసనలతో నాసలతో వరలు చుండెదన్.

లతికల నుయ్యాల లూఁగి యతిమధురరసంబుఁ ద్రాగి
కేళితోడ, హాళితోడఁ గెరలు చుండెదన్.

సెలయేటను స్నానమాడి యళుల పాట పోయిఁ గూడి
చలువడితోఁ గలరుతితో నలరు చుండెదన్.

గాలి పడగములఁ దేల్చి ఘనతరుసుమనములఁ దాల్చి
వేడుకతోఁ బోడిమితోఁ గ్రీడఁ జేసెదన్.

ఘన మహీజములను మీటి వనధుల నవలీల దాఁటి
బలముతోడఁ జలముతోడఁ జెలఁగు చుండెదన్.

జిలిబిలి చెమరించు బాలి కల కపోలములను సోలి
త్రాఁచు నోటఁ దగిలియోటఁ దరలి పోయెదన్.

ఏమి జన్మ మేమి చేవ? ఏల బ్రతుకె యారె! జీవ సౌఖ్య మింత * జరుగుచుండ సమసి పోయినన్.

# హస్తివర్మ ఉర్లాము శాసనము.

మొదటి ప్రక్క.



రెండవ రేకు—మొదటి ప్రక్క.



రెండవ రేకు—రెండవ ప్రక్క.



మూండవ రేకు—మొదటి ప్రక్క.



మూండవ రేకు—రెండవ ప్రక్కను.



మొదటి ప్రక్కను.

శ్రీస్వస్తి సర్వర్త్తు సుఖరమణీయా ద్విజయ కలిఙ్గ నగరా త్సకల భువన నిర్మ్మాణైక
సూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామిన శ్చరణకమలయుగల ప్రణామా దపగత
కలికలఙ్కో వినయనయ సమ్పదా మాధారః స్వాసిధారా పరిస్పన్దాధిగ
తసకల కలిఙ్గాధిరాజ్య శ్చతు రుదధితరఙ్గ మేఖలావనితల ప్రథి
తామలయశాః అనేక సమరసంక్షోభజనిత జయశబ్దో గాఙ్గా
మలకుల ప్రతిష్ఠః ప్రతాపానితయానామిత సమస్త సామన్త చూడా

రెండవ రేకు—మొదటి ప్రక్క

మణి ప్రభామఞ్జరీపుఞ్జరఞ్జిత చరణో మాతాపితృ పాదానుధ్యాతః పరమ
మాహేశ్వరః శ్రీ మహారాజో హస్తివర్మ్మా క్రోష్టుకవర్త్తన్యాం హాంఙ్గోలకగ్రామే స
ర్వ్వా సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదితమస్తు వోయథాస్మాభి

అస్మి న్గ్రామే గ్రహారిక సకాశాత్క్రీత్వా ద్వ్యర్ధహాలస్య భూశ్చేది కృత్వా చన్ద్రార్క
ప్రతిష్ఠ మగ్రహారఙ్కృత్వా సర్వకరైః పరిహృత్య మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభి వృద్ధయే
ఉరామల్ల నివాసినే వత్సనగోత్రాయ వాజసనేయసబ్రహ్మచారిణే జయ

రెండవ రేకు—రెండవ ప్రక్క.

శర్మణే కార్తికకృష్ణాష్టమ్యా ముదకపూర్వం [౦] సంప్రత్తా తద్వదిత్వా స్వభూమి మనుపాల
యతాం న కేనచి త్పరివాధా కార్యేతి । సీమాలిఙ్గానిచాత్ర పూర్వేణ వల్మీక స్తతః
క్షేత్రపాలీ తతో ఘోమణవాప్యాః పశ్చిమపాలీ తతః పునరపి క్షేత్రపాలీ
దక్షిణేన హ్యుత్తరవన్న సీమాన్తికాపవ పశ్చిమేన క్షేత్రపాలీ తతోవల్మీకః
తతఃకృత్రిమా పాషాణపఙ్క్తిః ఉత్తరేణాపి క్షేత్రపాలీ తతోవల్మీకః పునర్వల్మీకః
[త]తో పూర్వం వల్మీకమనుప్రాప్తేతి । భవిష్యద్రాజభిశ్చాయ స్థానధర్మోను పాలనీయః

మూఁడవ రేకు—మొదటి ప్రక్క.

తథాచ వ్యాసగీతాః—బహుభిర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్యయస్య
యదాభూమి స్తస్యతస్య తదాఫలం-స్వ దత్తాం పరదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిరమహీ [౦]
మహిమతాంశ్రేష్ఠ దానా చ్ఛ్రేయోనుపాలనం షష్టింవర్ష సహస్రాణి మోదతేదివి
భూమిదః ఆక్షేప్తా చానుమన్తాచ తాన్యేవ నరకేవసేదితి । ప్రవర్ధమాన విజయ
రాజ్యసంవత్సరా అశీతి ౧౦ం కార్తికదిన ౭ ॥ ఇదం వినయచన్ద్రేనభాను
చన్ద్రిస్యనూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా ।

మూఁడవ రేకు—రెండవ ప్రక్క-ను.

మణ్డలాగ్రాగ్రనిష్పేష నిష్పిష్టా రాతిసమ్హతేః
శ్రీమతో ప్రతిభూజ్ఞస్య రణాభీతస్య శాసనమ్ ।

## తెలుఁగున అర్థ వివరణము

శుభము. సర్వర్తు సుఖ రమణీయ మైన విజయ కళింగనగరము నుండి:—సకల భువన నిర్మాణైక సూత్రధారుఁడును భగవానుఁడును నగు గోకర్ణస్వామియొక్క పాదద్వంద్వ ప్రణామము వలన నశించిన కలికల్మషము గలవాఁడును, వినయ నయసంపదల కాధారుఁడును, తన అసిధారయొక్క సంచలన మాత్రముచేత వశపఱచుకొనిన సమస్త కళింగరాజ్యము కలవాఁడును, చతుస్సముద్రిక భూమండలమునఁ బ్రసిద్ధి గాంచిన నిర్మల మగు కీర్తికలవాఁడును, అనేక రణరంగములయందు జయశబ్దము సార్థించినవాఁడును గాంగాములకుల ప్రతిష్ఠుఁడును ఎదతెగని ప్రతాపముచే వినమితు లగు సమస్త సామంతరాజుల చూడామణి ప్రభామంజరీ పుంజములచే రంజితము లగు పాదములు కలవాఁడును, మాతా పితృ పాదసేవకుఁడును పరమ మాహేశ్వరుఁడును అగు శ్రీ హస్తివర్మ మహారాజు గారు, క్రోష్టుకవర్తని ప్రదేశమునందున్న హిందోళగ్రామమునందు కూడియున్న కుటుంబుల నందఱను ఇట్లు ఆజ్ఞాపించుచున్నాఁడు :—మీకు తెలియుఁగాక, ఏమనఁగా — మాచేత నిచ్చట అగ్రహారికుల యొద్దనుండి అధ్యర్థహాల పరిమాణము గల భూమి విక్రయించుకొనఁబడి, విభక్తమై ఆచంద్రార్క ప్రతిష్ఠముగా నగ్రహారమునుగా ఏర్పాటు చేసి, ఏ విధమైన పన్నులు లేకుండఁ జేసి, మా తల్లి తండ్రుల యొక్కయు మా యొక్కయు పుణ్యాభివృద్ధికై, ఉరామల్ల నివాసియును వత్సగోత్రుఁడును వాజసనేయ శాఖీయుఁడును అగు జయశర్మకొఱకు కార్తిక కృష్ణాష్టమియందు ఉదకధారాపూర్వముగ నీయఁబడినది. ఈ విషయమును ఎఱింగి, స్వభూమిని పాలించుకొను ప్రతిగ్రహీతలకు ఎవ్వరును ఏ విధమైన బాధను చేయఁదగదు.

దాన మీయఁబడిన భూమికి హద్దులు ఇవి:—తూర్పున కొలపుట్ట, అటుపైని క్షేత్రపాళి, అటుపైని స్థావణవాపియొక్క పశ్చిమపాళి, అచ్చటినుండి పలుల క్షేత్రపాళి. దక్షిణమునం దుత్తరమునందు వలెనే హద్దులు. పశ్చిమమున క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, అటుపైని కృత్రిమ మగు పాషాణపంక్తి. ఉత్తరమునందు క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, పిమ్మట మఱియొక వల్మీకము కూడ, తరువాత మొదటి వల్మీకము అనుక్రమముగా వచ్చును. రాజులు ఈ దానధర్మములను అనుమోదించి పాలింపఁదగుదురు. వ్యాస గీతలు కూడ ఇట్లే కలవు.

ఎట్లనగా:—అనేకులు వసుధను దానము చేసిరి. ఇట్లే అనేకులు అనుపాలించిరి. భూమి ఏ యే కాలమున నెవ్వ రెవ్వరి వశమున నుండునో అప్పుడు వారివారికి తత్ఫలము లభ్య మగును. ధర్మజా!—స్వదత్తమును కాని పరదత్తమును కాని భూమిని బాధ నొందనీయక రక్షించుచుండుము. మహానుభావులలో నుత్తముఁడ వగు ధర్మజా! భూమిని దాన మిచ్చుటకంటెను ఇతరు లిచ్చినదానిని అనుమోదించి పాలనము చేయుట యుత్తమము. ఇట్లు చేసిన దాతయును అనుపాలకుఁడును అరువదివేలేండ్లు స్వర్గమునఁ గ్రీడింపఁగలఁడు. ఇందులకు ఆక్షేపించువాఁడును, ఆక్షేపకుని అనుమోదించువాఁడును అరువదివేలేండ్లు నరకమునఁ గూలియుండెదరు. అనుక్రమముగా జరుగుచు వచ్చుచున్న విజయరాజ్య సంవత్సరములు ౮౦ అగునేటి కార్తిక కృష్ణ ౮ దివసమునందు ఈ శాసనము భానుచంద్రనామఁ డగు విజయచంద్రుని చేత రాజసింహుఁ డగు హస్తివర్మయొక్క ఆజ్ఞ ననుసరించి లిఖిత మైనది. శరవాగ్రమునఁ దిప్పిదిప్పి గాఁ గొట్టఁబడిన శత్రురాజులు గలవాఁడును, శ్రీమంతుఁడును రణాధిపుఁడును నగు గాంగవంశీయునిది ఈ శాసనము.

---

కడచిన సంవత్సరమున (1919) జూను నెలలో మామిత్రులైన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఉర్లాము రాజాగారివలన తమకంపఁబడిన యొక తామ్రశాసనమును పరిశోధనార్థమై నాకొసఁగిరి. ఈ శాసనము మూఁడు రాగిరేకులమీఁద వ్రాయఁబడినది. ఈ రేకులు ఒక యుంగరమువలన బంధింపఁబడియున్నవి. రాజదత్తములగు తామ్రశాసనముల యందు ఉంగరములమీఁద రాజముద్రిక యుండుట యాచారము. కాని ఈ శాసనపు టుంగరముపై నుండు ముద్రిక యెవ్వరో యెట్లో ఛేదింపఁబడినందున, దీనిపై నది యిప్పుడు కానఁబడుట లేదు. కాఁబట్టి ముద్రికవలన తెలియఁదగిన విశేషవిషయములను తెలిసికొను నవకాశము నాకుఁ గలుగలేదు. ఈ శాసనము నందలి రాగిరేకులలో మొదటిదానికి ఒక్క ప్రక్కను మాత్రమే అక్షరములు కలవు. తక్కిన రెండింటికిని రెండు ప్రక్కలను అక్షరములు కలవు. ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనమైనది. ఆంధ్రాక్షరములలో వ్రాయఁబడిన యీ శాసనము క్రీ॥ శ॥ నాలుగవ శతాబ్దమునాఁటిదై యుండవచ్చును. ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనమైన దనుట కెంత మాత్రమును సందేహము లేదు. ఈ శాసనము ఇప్పటి కించుమించు పదునాఱు శతాబ్దములకు ముందు వ్రాయఁబడినను, అక్షరము లెంత మాత్రమును అఱిగిపోక, స్ఫుటములై నిన్ననో నేఁడో వ్రాయఁబడినట్లున్నవి. ఈ శాసనము ఉర్లాము సంస్థానములో ఏగ్రామమునందు ఎప్పుడు ఏ ప్రదేశమున ఏ సందర్భమునందు దొరకినదో శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు విచారించి ప్రచురింపఁ గర్తలు. ఇది ఊఁకతో నిండిన మట్టికుండయందు భూస్థాపితమై దొరకినట్లు తెలియవచ్చుచున్నది. అందువలననే ఇందలి యక్షరము లంత స్ఫుటముగా నున్నవి. లేనియెడల నీరేకులు చిలుముపట్టి మట్టిచే తినఁబడి యెప్పుడో శీర్ణదశకు వచ్చియుండును. ఈ శాసనము త్రికళింగ మను నాంధ్రరాజ్యము మహోచ్ఛదశయం దున్న ప్రాచీనకాలమున నాదేశపు చక్రవర్తులలో నొక్కఁ డగు హస్తివర్మ మహారాజుచే వ్రాయింపఁబడినది. ఈతఁడు గాంగవంశజుఁడు. ఈ శాసనముయొక్క పాఠమును ఆ ప్రతిబింబములను ఎదుర నున్న పేజియందు ఇచ్చితిమి.

మన మిప్పు డీ శాసనముయొక్క కాలనిర్ణయము చేయవలసి యున్నది. మహారాజైన హస్తివర్మ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములు 80 అగు కార్తిక కృష్ణాష్టమినాఁ డీదానము చేసినట్లు మాత్రమే మన కీ శాసనము తెలుపుచున్నది. కాని, యీ హస్తివర్మ తండ్రితాత లెవ్వరో, ఈ అశీతి (80) సంఖ్యను శాలివాహనశకమునకు గాని, హూణశకమునకు గాని మార్చుట యెట్లో—మున్నగు విషయములు మనకుఁ దెలియరావు. సముద్రగుప్తునితో యుద్ధముచేసి యోడిపోయిన హస్తివర్మయొక్కఁడు కలఁడు గాని, యాతఁడు వేంగి దేశాధిపుఁడైనట్లు గయాక్షేత్రమునందలి స్తంభముపై వ్రాయఁబడిన శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కళింగనగరాధిపుఁడైన మన శాసనములోని హస్తివర్మయు ఆ హస్తివర్మయు నొక్కరే యనుటకు తగినంత యాధారము దొరకకుండుటను, ఆహస్తివర్మను మన శాసనములోని హస్తివర్మనుగా నూహింప వీలులేకున్నది. అందువలన నీ శాసనకాలమును మనము వేఱుసాధనములవలన నిర్ణయింపవలసి వచ్చుచున్నది. "గాంగామలకులతిలకో" అను శాసనములోని సమాసమువలన నీహస్తివర్మ గంగవంశపు రాజైనను, కళింగదేశపు చరిత్ర మింకను స్పష్టముగా వ్రాయఁబడకపోవుటచేతను, పాశ్చాత్యపరిశోధకులు వ్రాసిన కొన్ని విషయములు అన్యోన్యవిరుద్ధములై యుండుటచేతను, గంగరాజుల చరిత్రమును నేను శాసనప్రమాణానుసారముగా నిచ్చోట ముందు నిర్ణయించి, ఆవెనుక నే హస్తివర్మకాలనిర్ణయము చేయవలసియున్నది.

శాసనములవలనఁ దెలియఁబడిన సంగతుల ననుసరించి, త్రికళింగ రాజులను రెండుశాఖలవారినిగా మనము విభజింపవలసి యున్నది. అందు రెండవశాఖవారిలో నొకఁడైన కామార్ణవుఁడను రాజు తత్పూర్వపు కళింగవంశపు రాజులను జయించినట్లు అనంతవర్మ చోడగంగదేవుని సింధురాపురపు శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ రెండవశాఖవారి వంశవృక్షము కొన్ని శాసనముల ననుసరించి యీ క్రింద వివరింపఁబడినది. ఒక్కొక్కరాజుయొక్కయు రాజ్యపరిపాలనకాలముకూడ దీనివలనఁ దెలియఁదగును. ఈ శాసనమును ఇతరశాసనములతోఁగూడఁ బోల్చిచూచి, సరియైన కళింగరాజుల పట్టికను ఈ వ్యాసాంతమునందుఁ జేర్చుచున్నాను.

**మహావిష్ణువు**
⋮
**చంద్రుఁడు**
⋮
**గాంగేయుఁడు**
⋮
**కోలాహలుఁడు**
(గంగవాడిలో కోలాహలపురాధిపుఁడు)
|
**విరోచనుఁడు**
⋮ 81 మంది రాజులు — సంతతి పారంపర్యముగా
**వీరసింహుఁడు**

- కామార్ణవుఁడు I — ఇతఁడు బాలాదిత్యుని జయించి కళింగరాజ్యై 36 ఏండ్లు రాజ్యపాలనము చేసెను (1)
- దానార్ణవుఁడు — 40 సంవత్సరములు (2)
  - కామార్ణవుఁడు II — నగరము రాజధానిగా 50 సం॥ రాజ్యమేలెను (3)
    - రణార్ణవుఁడు 5 సం॥ (4)
      - వజ్రహస్తుఁడు II 15 సం॥ (5)
      - కామార్ణవుఁడు III 19 సం॥ (6)
        - గుణార్ణవుఁడు II 27 సం॥ (7)
          - గుండమరాజు 3 సం॥ (10)
          - పేరు తెలియదు
            - కళింగాంకుశుఁడు 12 సం॥ (9)
          - జితాంకుశుఁడు 15 సం॥ (8)
          - కామార్ణవుఁడు IV 35 సం॥ (11)
            - వజ్రహస్త అనియాంకభీముఁడు 35 సం॥ (13)
              - కామార్ణవుఁడు ½ సం॥ (14)
                - వజ్రహస్తుఁడు 33 సం॥ (17)
                  - రాజరాజు 8 సం॥ (18)
                    - అనంతవర్మ చోడగంగదేవుఁడు.
              - గుండమరాజు 3 సం॥ (15)
              - రెండవ భార్య
                - మధుకామార్ణవుఁడు 19 సం॥ (16)
          - వినయాదిత్యుఁడు 3 సం॥ (12)
- గుణార్ణవుఁడు I
- మారసింహుఁడు
- వజ్రహస్తుఁడు

కానవచ్చుచున్నది. అచ్యుతాపురపు తామ్రశాసనములవలన కళింగ రాజ్యాధిపుడగు నింద్రవర్మ యను రాజేంద్రుడు గాంగేయ వర్షములు 87 లో వరాహవర్తనియందలి సిద్ధార్థక గ్రామమును గౌతమ సగోత్రుడగు దుర్గశర్మకు ఒసంగినట్లు తెలియుచున్నది. ప్రకృతము మన మనము విమర్శించుచున్న శాసనము గాంగేయవర్షములు 80 వ సంవత్సరమునకుం జెందియున్నది. గాంగేయము 87 వ సంవత్సరము నాటి ఇంద్రవర్మయొక్క శాసనమును గాంగేయవర్షములు 80 నాటి మన ప్రకృతశాసనమును వ్రాసినవా డొక్కడేయని "ఇదం వినయ చంద్రేణ భానుచంద్రస్య సూనునా శాసన రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా" యను శ్లోకములవలం దెలియుచున్నది. హస్తివర్మ తరువాతిరాజే ఈ యింద్రవర్మ యని తెలుపుటకే 87 వ సంవత్సరపు శాసనముకంటె ప్రబలాధారము లెవ్వియు నవసరములేవు. ఆశాసనము నీ దిగువ నుదాహరించుచున్నాము.

1. ఓం స్వస్తి సర్వర్తుక రమణీయా ద్విజయ కళింగనగరా త్సకలభువన నిర్మాణైక,

2. సూత్రధారస్య భగవతో గోకర్ణస్వామిన శ్చరణ కమల యుగల ప్రణామా,

3. దపగత కలికలఙ్కో వినయనయ సంపదా మాధారః స్వాసిధారా పరి,

4. స్పందాధిగత సకలకళిఙ్గాధి రాజ శ్చతురుదధి తరంగ మేఖ లావనీత,

5. ల ప్రథిత కామలయశాః అనేక సమరసంక్షోభ జనిత జయశబ్దో,

6. గాఙ్గామలకుల ప్రతిష్ఠః ప్రతాపావనతారా తిమ కుమస్త పాదు స్త,

## Second Plate First Side.

7. చూడామణి ప్రభామఞ్జరీపుఞ్జ రంజిత చరణో మాతా పితృ పాదానుధ్యాతః,

8. పరమమాహేశ్వరః శ్రీమహారాజేన్ద్ర వర్మాక వరాహ వర్తన్యాం సిద్ధార్థకగ్రామే,

9. సర్వాన్ సమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాపయతి విదిత మస్తువో యథాస్మి న్గ్రామే,

10. మే రాజతటాక పిత్రేవాలస్య భూ శ్చతుర్దిశ్యత్య సర్వక రైః పరిహ,

11. తేనా చన్ద్రార్క ప్రతిష్ఠ కృత్వా మాతాపిత్రోరాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే గౌత,

12. మసగోత్రాయ ఛన్దోగస బ్రహ్మచారిణే దుర్గశర్మణే మాతృ భట్టారికా,

## Second Plate Second Side.

13. పాదానా న్తటాక ప్రతిష్ఠాపన ముదకయాసే ఉదక పూర్వ కేకుమాక్షి స్సంప్రదత్తా,

14. తద్విదిత్వా స్మభూమి కుసుపాలయతా [స్న] కేనతి త్పరివాధా కాయ్యేనేమే విజ్ఞాని,

15. పూర్వేణ రాజతటాక పావపైదవక్షిణేన పశ్చిమేన పరిపాల్యా వల్మీక త్రయా,

16. ఉత్తరపాల్యా కపాటవన్ధ పరిపాషాణ స్తతః నేష్టకో న్యః పాషాణ,

17. స్తతో ధి మారతసుద్వయా తతః కారకవృక్ష శ్చేతి తటా కో జేకబన్ధ మాన్తే నకేనచి,

18. ద్వ్యహూతః కాయ్యోన్నతి భవిష్య ద్రాజభిశ్చా రు న్దాన ధర్మోన్నమహ్య ప్రధాన వ్యాసగీతా

## Third Plate.

19. బహుభి ర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్య యస్య యదాభూమి స్తస్య,

20. తస్య తదాఫలం॥ షష్టింవర్ష సహస్రాణి మోదతే దివి భూమిదః ఆక్షేప్తా చాను,

21. మన్తాచ తాన్యేవ నరకేవసేత్ ॥ స్వదత్తాం పరదత్తాం వా యత్నా ద్యుధిష్ఠిర,

22. మహీమహిమతాం శ్రేష్ఠః దానా చ్ఛ్రేయోనుపాలన మితి ప్రవర్ధమాన విజయ,

23. రాజ్య సంవత్సరా సప్తాశీతి (87) చైత్రామావాస్యాం ఇదం వినయ చన్ద్రేణ,

24. భానుచన్ద్రస్య సూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా ॥

ఈ శాసనమునకు కాలనిర్ణయము చేయునపుడు బాలాదిత్యుడు ఎప్పుడు రాజ్యపదభ్రష్టుడయ్యెనో తెలియవలసియుండును. శకసంవత్సరము 591 లో ఈతడు కామార్ణవునిచే జయింపబడినను ఈ శాసనము అంతకు పూర్వపు కాలము నాటిదే యగుట నిశ్చయము. సత్యవర్మ యొసగిన శాసన మొకటి గాంగశకము 351-కి చెందియున్నందున బాలాదిత్యునికి పూర్వము 351 సంవత్సరములు గాంగులు రాజ్య మేలినమాట సిద్ధము. మన హస్తివర్మ శాసనము గాంగవర్షమునకు 80 నాటి దగుటచే ఇతడు సత్యవర్మకు 351—80=271 సంవత్సరములకు మునుపటి వాడు. సత్యవర్మ శకవర్షము 591 లోనె రాజ్యమునకు వచ్చుటయు ఆయేటనే బాలాదిత్యునిచే ఓడింపబడుటయు అదే సంవత్సరముననే బాలాదిత్యుడుగూడ కళింగ రాజ్యమునుండి తొలగింపం బడుటయు సంభవమగునేని గాంగవర్షములు 351 ని శకవర్షములు 591 గ పరిగణింపవచ్చును. అట్లైన సత్యవర్మకు 271 సంవత్సరములకు ముందున్న హస్తివర్మ 591—271=320 శకవర్షమునాటి వాడగును. కాని పై మూడును ఏకకాలముననే జరుగుట అసంభవ మగుటచేతను పేరునుబట్టి బాలాదిత్యుడు వర్మరాజులలోనివాడు గాక చాళుక్య వంశజుడుగ కానవచ్చుటచేతను చాళుక్యచక్రవర్తులు శకవర్షములు 528, 556, సంవత్సరములలో సైతము కళింగముతో పోరాడుచుండుటచేతను ఒకప్పుడు కళింగ రాజ్యమునకు ప్రధానపట్టణము రాజమహేంద్రవరమై యుండినట్లు హాయన్‌త్సాంగు చెప్పుచుండుట చేతను

ఈశాసనమునందలి లిపి మిక్కిలి ప్రాచీనమగుటచేతను ఇదివరకు మనకు దొరికియుండిన ప్రాచీన పూర్వచాళుక్య శాసనములలోని లిపికంటెను గూడ నందలి లిపి యెక్కువ ప్రాచీనముగ గానవచ్చుటచేతను బాలాదిత్యుడు కామార్ణవునిచే జయింపబడిన 891 వ సంవత్సరమునకును సత్యవర్మయొక్క గాంగశకవర్షములకు 261 కిని నడుమ 50 సంవత్సరముల వ్యవధియుండునటుల తలంచుట అసంభవము కాదు. అప్పుడు హస్తివర్మశాసనము 86–2[illegible]=350 లేక హూణశకవత్సరములు 270 × 18=348 అగును. ఇదియే సముద్రగుప్తునిచే వెంగిరాజు ఓడింపబడినట్లు తెలుపుచున్న గయాక్షేత్రములోని ప్రసిద్ధశాసనముయొక్క కాలము ఎట్లు చూచినను ఈహస్తివర్మయే సముద్రగుప్తునిచేత ఓడింపబడిన హస్తివర్మగ గానవచ్చుచున్నాడు. అట్లు కాకపోయినను ఈతడు శకవత్సరములు 270 లేక హూణవత్సరములు 348 కాలమువాడను టకు సందేహమేమిలేదు. అప్పుడు సత్యవర్మ రాజ్యమునకు వచ్చుటయు రాజ్యమును పోగొట్టుకొనుటయు బాలాదిత్యుడు రాజ్యమునకు వచ్చుటయు, బాలాదిత్యుడు రాజ్యభ్రష్టుడగుటయు రెండవ వంశపు గాంగులు కళింగాధిపులగుటయును వీనికన్నిటికిని 50 సంవత్సరములు వ్యవధియుండును. కాబట్టి ఈ హస్తివర్మయే సముద్రగుప్తుని కాలమునాటి హస్తివర్మగ మనము ఊహించుకొనవలయును.

పాశ్చాత్యపరిశోధకులు గాంగశకవర్షములను హూణశకవర్షములనుగా మార్చు పద్ధతిని ఇంకను కనిపెట్టలేదు. ఈశాసనములవలన మనము ఇంచుమించుగ దీనిని తెలిసికొనవచ్చును.

సముద్రగుప్తుడు క్రీస్తుశకము 326 మొదలుకొని 375 వరకు పరిపాలించినట్లు చరిత్రమువలన తెలియుచున్నది. ఈతడు 330 క్రీ॥శ॥ సంవత్సరములో సింహళద్వీపరాజగు మేఘవర్మచేత బహుసత్కారముల నందినవాడు. ఈతడు 11 రాజ్యములను జయించినందునను, అందు వెంగిరాజ్యము కూడ నుండినందునను, ఇతర రాజ్యముల జయించిన వెనుకనే ఈతడు దక్షిణరాజ్యములకు వచ్చినందునను వెంగిరాజ్యము నీతడు జయించిన నాటికాలము ఇంచుమించుగ క్రీస్తుశక వర్షములు 350 అయియుండును. అదియే హస్తివర్మకాలమగుటచేతను ఈహస్తివర్మ తరువాత కేము సంవత్సరముల నాటికి ఇంద్రవర్మ కళింగరాజై యుండుటచేతను గాంగశకవర్షములు 80 ని క్రీ॥శ॥ వర్షములు 350 గ మనము కొంతవరకు పరిగణించుకొనవచ్చును. కాబట్టి 350–80 క్రీస్తుశకము 270 లో లేక గాంగశకము ఆరంభమైనట్లు ఊహింపవచ్చును. దీనివలన గాంగశక వర్షములకు 270 కలిపిన యెడల క్రీస్తుశక వర్షములు వచ్చునని తేలుచున్నది. కాని ఇంచుమించుగ కొంతవరకుమాత్రమే దీనివలన సంవత్సరపరిమితి తేలగలదు. ఈహస్తివర్మయు ఈతనివంశపువారును శైవులు. "పరమమాహేశ్వర" అనుపదము ఈవంశపు రాజులకు సామాన్యమైయున్నది. వీరు అఖండశివపూజాధురంధరులై శైవమతము ప్రతిష్ఠించినటుల దీనివలన నిశ్చయింపగచ్చును.

The Boy Scout's Camp, Guntur



బాలభటశిక్షాశిబిరము, గుంటూరు

Volunteer's Khilafhat Conference, Madras



ఖిలాఫతు సభా స్వచ్ఛంద సేవకులు చెన్నపురి

K. H. V. Satyanarayana garu, B.A.,
Narasapur



కె. హెచ్. వి. సత్యనారాయణ గారు, బి.ఎ.,
నరసాపురము

Tadepalli Narasimha Rao Pantulu garu,
Nizam's State



తాడేపల్లి నరసింహరావుపంతులు గారు,
నిజాము రాష్ట్రము

Rao Saheb K. Yegyanna Pantulu garu, B.A.,
Narsapur



రావుసాహెబు కె. యజ్ఞన్న పంతులుగారు, బి.ఎ.,
నరసాపురము

Mr. Taylor, Narsapur



టైలరు గారు, నరసాపురము

Mr. Venkataswarulu



వేంకటేశ్వరులు గారు,
(నవలా గ్రంథమాలా అధిపతి)

Narayana Tirtha
author of the Krishna Lila Tarangini



నారాయణతీర్థులు వారు,
(శ్రీ కృష్ణలీలాతరంగిణీ గ్రంథకర్తలు)

సూక్ష్మశరీర మగు మనోమయశరీరమునకును సత్త్వరజస్తమోగుణములను త్రిగుణములు కలవు. వాతపిత్తశ్లేష్మముల హెచ్చుతగ్గులచే స్థూలశరీరమున వ్యాధులు పుట్టునట్లు సత్త్వరజస్తమోగుణముల యాధిక్యాల్పత్వములచే సూక్ష్మశరీరమందును వ్యాధులు గలుగును. స్థూలశరీరవ్యాధులకు సుశ్రుతచరకాదులవలె సూక్ష్మశరీరవ్యాధులకు పాతంజల వాసిష్ఠాది యోగశాస్త్రములవలన చికిత్సలు విధింపఁబడెను. మానసిక శాస్త్రజ్ఞు లగు చికిత్సకులు, మనోవ్యాధి పీడితు లగు మానవుల మనస్సును (Psychometer) మనస్తత్త్వమాపక యంత్రసాధనముచేఁ బరీక్షించి మానసిక శాస్త్రమున విధింపఁబడిన చికిత్సలచే చికిత్సల నొనరించి యారోగ్యవంతులఁ గావింతురు. దీనికి దృష్టాంతముగ కోపవ్యాధికి చికిత్స కనుగొనదగు.

కోపము రజోగుణమువలన జనించి తమోగుణమువలన వర్ధిల్లును. ఇతరుఁడు తనకోరికకు భంగముఁ గావించినను, తన్ను నవమానించినను, తనవస్తువు నష్టపఱచినను, ద్వేషకార్యముల నొనరించినను అతనిమీఁద తనకు కోపము కలుగును. ఇది స్వకృతము. పరులవలన తనకుఁ గలుగునది పరకృతము. ఇట్టిది అంకురితావస్థయందు కోపము; కుసుమితావస్థయందు రోషము; ఫలితావస్థయందు క్రోధము అని చెప్పఁబడును. పాశ్చాత్యమానసిక శాస్త్రజ్ఞులును కోపము (Anger) రోషము (Rage) క్రోధము (Wrath) అని త్రివిధముగ విభజించియున్నారు.

శ్లో. ఉత్తమే క్షణకోపస్స్యాత్ మధ్యమే ఘటికాద్వయం
అధమే త్వహోరాత్రం నీచేతు మరణాంతకమ్.

తాటియాకుమంటవలెను చొప్పచెత్తమంటవలెను మండి చిరకాల ముండక వెంటనే చల్లారునది కోపము. ఇయ్యది ఉత్తములయెడ (గొప్పవారిపట్ల) క్షణకాల ముండును. పిమ్మట తగ్గిపోవును. చొళ్ళపుల్లల నిప్పువలెను జిల్లేడు రాగి జమ్మి పుల్లల నిప్పువలె రెండుగడియ లుండి, చిరకాల ముండక చల్లారునది రోష మనఁబడు. ఇయ్యది మధ్యములయెడ రెండుగడియ లుండును; పిమ్మట తగ్గును. తుమ్మకట్టెల నిప్పువలెను చింతకట్టెల నిప్పువలెను అహోరాత్రము మండి సెగ గలది క్రోధ మనఁబడును. ఇయ్యది అధములయెడఁ గన్పట్టు. అహోరాత్రము మాత్ర ముండి పిమ్మట తగ్గును.

ఇంజను లోనుండి యెప్పుడు చల్లారక తీవ్రముగ మండుచు నంతట సెగగొట్టునది. ఉత్కట క్రోధము. (ఈసు) ఇయ్యది పరమనీచులయెడ నుండు. బతిమాలుకొనినంత క్షమాపణముచేత నుత్తముల కోపము తగ్గును. స్తుతివాక్యములచేత కాళులు చేతులు పట్టుకొనుటచేత మధ్యముల కోపము తగ్గును. తగినవారిచేఁ జెప్పించుటచేతను ద్రవ్యసమర్పణముచేతను దైన్యము వహించుటచేతను ప్రణామముచేతను అధముల కోపము తగ్గును. శత్రువుయొక్క మరణము గాని పరాభవము గాని ఆత్మబంధుజన వియోగముగాని జూచి ప్రహారణ మిచ్చి గాని నీచునికోపము తగ్గదు. నల్లత్రాఁచువంటివాఁడు తాను పట్టినపగకు ప్రతిఫలముఁ జూచుకొని గాని అధమాధముఁడు విడువఁడు. కోపము గలిగిన పురుషునకు పెదవు లదరును. కన్ను లెఱ్ఱఁబాఱును. ముఖము జేవురించును, చెక్కిళ్లు కుంకుమవన్నెగ నుండు. నరములు చలించు. రక్తము ఉడుకును. తాపజ్వరమువలె నిది దేహ మంతయు వ్యాపించి పీడించును. ఈ వ్యాధి ముదిరినపుడు క్రుద్ధుఁడై పెద్ద పిన్న బంధువు సఖుఁడు మిత్రుఁ డను భేదము తెలియక నోరికి వచ్చినట్లు వదరును (తిట్టును). ఆ సమయమున చేతిలో కఱ్ఱగాని కత్తిగాని యేది యుండినను దానితో కొట్టును; దుముకును; పీడించును; కొఱుకును; చంపును. ఏదేని గావించును. దయ్యము పట్టినవానివలె క్రోధభూతావిష్టుఁడై అకృత్యములఁ గావించును. మానసిక వ్యాధులన్నింటిలో నిది దుర్భరమైన వ్యాధి. చికిత్సకు మిగుల కష్టము చికిత్సకుని దగ్గఱ చేరనీయని వ్యాధి. క్రోధావిష్టునిఁ జూచి ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞ చికిత్సకులు తొలఁగుదురు.

నిర్మలమైన జలమును సొగసైన సోపానములును తులసిచెట్లును అనుష్ఠానప్రదేశములును గల మహానదిలోనికి వర్షాకాల ప్రవాహము ప్రవహించి, జలమును మాలిన్యము గావించి, మెట్లను నీటిలోఁ గనఁబడనీయక ముంచివైచి, అనుష్ఠాన ప్రదేశములను ఛిన్నాభిన్నము గావించివైచిన విధంబున, క్రోధప్రవాహంబును మానవుని మానసనదిలోనికి నుత్కటముగఁ బ్రవహించి వృత్తులను గల్లోలపఱచి, నీతిమర్యాదలను బోఁగొట్టి, ముంచివేయును. ప్రవాహము తీసినతర్వాత నది స్వస్థావస్థఁ జెందినవిధంబున, పురుషుఁడును క్రోధవేగము తగ్గినపిమ్మట, తాను ఆ యవస్థలోఁ జేసిన యకృత్యములకు సిగ్గుపడును. చింతించును. వ్యథ జెందును. ప్రయోజనం బేమి? కాఁబట్టి క్రోధవ్యాధి స్వరూపమును గాంచితిరా? దీనికి తగినట్లు చికిత్సఁ గావింపవలయు. శ్లో. క్రుద్ధే స్మేరముఖావధీరణ మఘో. అను శ్రీకృష్ణమిశ్రులవారు ప్రబోధచంద్రోదయమున నుడివినట్లు, ఇతరుఁడు తన కపకార మొనరించినను ఇష్టభంగము గావించినను అవమానించినను అతనియెడ దాక్షిణ్యవంతుఁడై యుతఁ డవివేకి, జ్ఞాని యైనచో నితరునిని దూషింపఁడు. అపకారము నవమానముఁ గావింపఁడు. అజ్ఞానితో సమానముగఁ గలహించుట జ్ఞానికి యుక్తము కాదని తనకన్న తక్కువవారివలనఁ గలిగిన ద్వేషావమానాపకారాదులను సహించుకొనవలయు. ఇతరుని దండింపఁగల యధికారశక్తి తనయెడ నుండియు దండింపక సైఁచుకొనుటవలన క్షమాగుణవంతుఁ డగు. తనకన్నఁ గొప్పవారివలన, సధికునివలన తుల్యునివలన నభీష్టభంగ ద్వేషావమాన అపకారాదులు గలిగినపుడు చాలని కాలమున పూర్వకర్మపరిపాకమువలనఁ గలిగిన దనియు అట్టివారి కట్టిబుద్ధి పొడముట తనగ్రహస్థితి తప్పు వేఱు కాదనియు దుష్టకాలమున హరిశ్చంద్రనలాదులు కష్టమును సహింపలేదా యని తార్కాణముఁ జూచుకొని చిత్తసమాధానముఁ గావింపవలయు. ఇతరుఁడు తన్ను దూషించుచున్నపుడు, తనపాపమును అతఁడు గైకొని అతఁడు తనపుణ్యము నిచ్చుచున్నాఁడని అతనియెడ కనికరము గలిగియుండు. రజోగుణమునుండి సత్త్వగుణములోనికి మార్చుకొనవలయు. కోపము గలిగినపుడు, తన చిత్తవృత్తిని వేఱొక విషయము మీఁదికి మరలించుకొని, శాంతమూర్తుల స్వభావము భావించుచుండవలయు. లేక అంకములను 24 వఱకు లెక్కింపవలయు. క్రోధమువలనఁ గలుగు నష్టముల నొక యాంతరంగిక పుస్తకమున వ్రాసిపెట్టుకొని వెంటనే చూడవలయును. ఇట్టిచికిత్సలు ఉపాయాంతరములు అనేకములు. పర్యాప్తమానసిక శాస్త్రమున విశదీకరింపఁబడియుండినందున నింతటితో విరమించుచున్నాఁడను. కోపమునకు చికిత్స గావించినట్టులే కామాదివ్యాధులకును చికిత్స గావింపవలయు. మానసిక శాస్త్రజ్ఞుఁడు వ్యాధి పీడితుని తత్త్వమును స్వరూప స్వభావములను గని పెట్టి చికిత్స గావింపవలయు.

# చిత్రపటముల వివరణము

రావుసాహేబు పులమతి ఆదిమూర్తి రావుగారు.- వీరు అనంతపురం తాలూకాబోర్డు ప్రెసిడెంటుగ నున్నారు. సుప్రసిద్ధ న్యాయవాదులు. అనంతపురములో జరిగిన ఆంధ్రమహాజనసభకు ఆహ్వానసంఘాధ్యక్షులుగ నుండిరి.

హ త్తి రామచంద్ర రావుగారు:— వీరు పోలీసు యిన్స్పెక్టరు పనిచేసి ఉపకారవేతనము నందుచున్నారు. ప్రావిడెంటుఫండుకు అధ్యక్షులుగను, ఆనరరీ మేజిస్ట్రేటుగ నున్నారు.

హత్తి శివరావుగారు:— అనంతపురమునందలి సుప్రసిద్ధ న్యాయవాదులు. జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగ నున్నారు. ఆజిల్లాలో జరుగు మంచికార్యముల కెల్ల ముందంజవేయువారు. ఆంధ్రసభలు అనంతపురములో జయప్రదముగా జరుగుటకు ముఖ్యకారకులు.

హత్తి శంకరరావు బి. ఎ. గారు:— వీరు ధర్మవరమునందలి న్యాయవాదులు. అఖిలభారత దేశీయసంఘ సభ్యులు. ధర్మవరంతాలూకాబోర్డు ఉపాధ్యక్షులు. దేశోపకార విషయముల పాటుబడువారు. అనంతపురమునందు జరిగిన ఆంధ్రసభలకు ప్రధానకార్యదర్శులుగ నుండి పనులు జరిపిరి.

ఆంధ్రనిర్బంధవాసులు:— గత సంవత్సరము రంగూను ఆంధ్ర సమ్మెకట్టునకు ప్రోత్సాహకులని వీరిని బర్మాప్రభుత్వమువారు దేశసంరక్షక శాసనము క్రింద రెండేండ్లకాలము నిర్బంధావాసమున నుంచిరి. కాని కొంతకాలమునకు బర్మాదేశపు లెప్టెనెంటు గవర్నరు సర్ కెలిసాల్డు క్రాడకుగారు వీరు నిర్దోషులని గ్రహించి విడుదల చేయించిరి.

చెలసాని పట్టాభిసీతారామయ్యగారు:— వీరు కృష్ణామండలవాసులు. సంస్కరణాభిలాషులు. తమసంఘోద్ధరణమునకు సర్వశక్తుల పనిచేసి తమ బీదవిద్యార్థుల కనేకులకు విద్యాదానము చేసిన మహనీయులు. సుమారు 12 సంగల క్రిందట కీర్తిశేషులైరి.

ఏ. ఎస్. రావుగారు:— వీరు చెన్నపురియందు ప్రెస్ టిరోకు యజమానులు. ఆంగ్లదేశమందలి భారతదేశమందలి పలువార్తాపత్రికలకు ప్రత్యేక విలేఖకులు. వీరు తయారుచేసిన ఛాయాపటములనేకములు ఆంగ్లపత్రికల మెప్పును బడసినవి.

పి. సుబ్బారావుగారు:— వీరు ఇండియన్ డిఫెన్సుఫోర్సులో చాలకాలము శిక్షణమును బొందియున్నారు. సైనిక విషయమున చాల యుత్సాహముతో పనిచేయుచున్నవారు.

బుక్కపట్టణము రామానుజయ్య గారు:— వీరు చెన్నపురి వాస్తవ్యులు. ఆంధ్రసాహితీగ్రంథమాలకు సంపాదకులు. ఆంధ్రగ్రంథము లనేకములను వ్రాసిరి.

శ్రీమతి సుబ్బలక్ష్మమ్మగారు:— వీరు ప్రభుత్వమువారి వితంతుశరణాలయమున అధ్యక్షురాలు. వితంతువుల విద్యాభివృద్ధికై మెగా కెంతయు పాటుపడుచున్నారు. ఇండియా ప్రభుత్వమువారు వీరిసేవను సంతుష్టించుచు కేసరి హిందీపతకమును చక్రవర్తిగారి జన్మదిన మహోత్సవ సందర్భమున బహుమానముగ నిచ్చియున్నారు.

శ్రీమతి తిరువేంగడాచారమ్మగారు:— స్మాలుకాజుకోర్టు ముఖ్యన్యాయమూర్తుల సతీతిలకము. స్త్రీలక్షేమోదాయకమునకు చెన్నపురిలో పనిచేయుచున్నారు.

శ్రీమతి తూరుపాటి సన్యాసమ్మగారు:— వీరువిశాఖపట్టణమండల వాస్తవ్యులు. గొలజా గ్రామమున గొప్ప గ్రంథాలయము నొకదానిని స్థాపించి, స్త్రీవిద్యాభివృద్ధికి సేవచేయుచున్నారు.

మండ సుబ్బారావుగారు:— వీరు చోడవరవాస్తవ్యులు. ప్రఖ్యాత న్యాయవాదులు. గత సంవత్సరపు విశాఖపట్టణ మండలసభ కధ్యక్షులు. స్థానిక స్వపరిపాలన విషయమున నెక్కువ అనుభవజ్ఞులు.

ఉప్పల వెంకటేశ్వర రావుగారు:— వీరు విశాఖపట్టణ మండల వాస్తవ్యులు. స్త్రీవిద్యాభిమానులు. మండలమున ననేక గ్రంథాలయముల నెలకొల్పి, గ్రంథాలయోద్యమాభివృద్ధి కెంతయుపనిచేసినవారు. గత సంవత్సరము విషజ్వరమువలన పరలోకగతులైరి.

కొత్తమాసు వెంకటరంగం శ్రేష్ఠిగారు:— శ్రేష్ఠిగారు చెన్నపురివాసులు. గొప్పవర్తకులు. దానకర్ణులు.

దువ్వూరి రామిరెడ్డిగారు:— వీరు నెల్లూరుమండలవాసులు. సాహిత్యమున నూతనపద్ధతు లవలంబించి గ్రంథము లనేకములను వ్రాసియున్నారు. రెడ్డిసభవారు వీరి కవిత్వమును శ్లాఘించుచు, బంగారుపతకము నొకదాని నిచ్చి సత్కరించియున్నారు.

శివలెంక అమృతలింగము గారు:— వీరు గుడివాడ వాస్తవ్యులు. గొప్ప పండితులు. శైవసిద్ధాంతులు.

బ్రహ్మశ్రీ, భైరవజోస్యుల మహానందయ్యగారు:— నంద్యాలపుర వాసులు. తమ స్వధర్మముల విడువక సంఘసంస్కరణాభిలాషులై నంద్యాల పురంబున ఆంధ్రోద్యమముపట్ల సానుభూతి చూపినవారిలో నగ్రగణ్యులు. మహానందిక్షేత్రమును జీర్ణోద్ధారణ చేయుటకై రెండులక్షల రూప్యములను ప్రోగుచేసి స్ఫటికతుల్యమైన జలరాశి చుట్టు మంటపములను కట్టించి యాత్రికులకు విజనప్రదేశమునందు సౌకర్యముల సమకూర్చిరి. నిమ్నజాత్యుద్ధరణకు నంద్యాలలో రాత్రిపాఠశాల లేర్పరచి మహానందిలో నుండు అనాగరకులకు విద్యాసౌకర్యముల నేర్పరచిరి. అన్ని విధముల దేశాభ్యుదయమునకు తోడ్పడిరి. వ్యాజ్యములను పంచాయతీ మూలముగా పైసలు చేయుచు సంఘాభివృద్ధికి తోడ్పడుచున్నారు.

డాక్టరు పండాలైగారు:— వీరు ప్రఖ్యాత న్యాయవాదులు. ప్రస్తుతము స్మాలుకాజుకోర్టులో న్యాయమూర్తులుగ నున్నారు.

డబ్లియు. లోన్ రాయిన్ గారు:— వీరు చెన్నపురి ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరు. క్రింది యుద్యోగులపట్ల వీరి కెక్కువ సానుభూతి, ప్రేమ గలదని వినికిడి.

మీరుమజరుద్దీనుగారు:— వీరు హైదరాబాదు రాజ్యపు పోస్టుమాస్టరు జనరలు.

కె. బి. రాజాగారు:—వీరు చెన్నపురి వాస్తవ్యులు. తత్త్వశాస్త్రవేత్తలు. ప్రభుత్వమువారు వీరి సామర్థ్యమును కనుగొని ఇండియను విద్యాశాఖలోనికి దీసికొనినారు. ప్రస్తుతము అలహాబాదు కళాశాలలో పండితులుగ నున్నారు.

పి. రామనాథము గారు:— వీరు చెన్నపురి యందలి ప్రఖ్యాత న్యాయవాదులు. సహకారపరపతి సంఘములకు అసదరి అసిస్టెంటు రిజిస్ట్రారుగా ఈ మధ్యనే ప్రభుత్వమువారిచే నియమింపబడినారు. సహకారపరపతి సంఘముల నేకములను దక్షిణాదిలో నెలకొల్పియున్నారు.

డాక్టరు ఎతిరాజులు నాయుడు గారు (Ayurvedic Specialist for Appendicitis) :—వీరు మద్రాసునందు సుప్రసిద్ధిం జెందిన ఆయుర్వేద వైద్యులలో నొక్కరు. ఆంధ్రులు. ఆంధ్రాభిమానము గలవారు. వీరి వైద్యపరీక్షను మూలమున, పాశ్చాత్య వైద్యశిఖామణులని పేరొందిన డాక్టరులు సయితము కుదుర్చలేనివని. ఆమాశయ వ్రణములు (Appendicitis) ఆంత్రికవ్యాధులు, బొల్లి మొదలగు నసాధ్యరోగములు నిర్మూలమునొంది ఎందరో స్వస్థచిత్తులు గాగలిగిరి. నాయుడుగారు ఆమాశయ వ్రణములు (Appendicitis) మొదలగు మస్తిష్క సన్నిపాతిక వ్యాధులు మున్నగువానిని కుదుర్చుటలో నిపుణులు. వీరు చేయు చికిత్సావిధానమున ప్రమాదకరములగు శస్త్రచ్ఛేదనములు గాని దౌర్బల్యము నాపాదించు లంఘనాదులు గాని లేవు. రోగులకు వీలైనంత వైనము స్వస్థతను కలిగించుటయే వీరి యుద్దేశము. ఆయుర్వేదముయొక్క ప్రాముఖ్య ప్రాశస్త్యాదులను వివరించుచు వీరొక గ్రంథమును ఆంగ్లమున బ్రచురించియున్నారు. పెరంబూరు మున్నగు స్థలములలో వీరు వేలకొలది రోగులకు ఔషధములు నిచ్చి స్వస్థతను ఉజ్జీవింపజేసిరి. ప్రజలకీ విషయములో వీ రొనరించిన సేవలను, వారికి వీరియందు గల ఆదరమునకును వీరికి అనేకులు ప్రముఖులు ఇచ్చియున్న పెక్కు బంగరు పతకములు, వజ్రపు ఉంగరములు, తోడాలు మున్నగునవి ప్రబలమగు సాక్ష్యము నీయగలవు.

పి. నారాయణప్ప నాయుడుగారు:—వీరు చెన్నపురి వాస్తవ్యులు. గొప్ప వర్తకులు.

కే. టి భాష్యం నాయుడుగారు:— వీరు చెన్నపురి నివాసులు. ప్రఖ్యాత వర్తకులు. దానకర్ణులు.

డాక్టరు, సి నటేశం గారు:—వీరు చెన్నపురి యందలి ప్రఖ్యాత వైద్యులు. కార్పొరేషను సభ్యులు.

డి. వెంకటస్వామి నాయుడు గారు:— వీరు బెంగుళూరు వాస్తవ్యులు. దానకర్ణులు. యుద్ధఋణముల విషయమున పెక్కు పని చేసిరి, ఒక్కదినమున 20 వేల రూపాయలకు పైగా ధనమును ప్రోగుచేయించిరి. వీరి సేవను ప్రభుత్వమువారు శ్లాఘించుచు, రావుసాహేబు బిరుదను నిచ్చిరి.

వెంకటపతి నాయుడు గారు:—వీరు చెన్నపురి వాస్తవ్యులు. కార్పొరేషను సభ్యులు. చెన్నపురిలో నచ్చెటకోట్ల ధర్మప్రతిష్ఠాలయము అనేకములను స్థాపించియున్నారు.

మణ్ముఖము మొదలియారు గారు :—వీరు కార్పొరేషను సభ్యులు. బ్రాహ్మణేతరోద్యమ ప్రచారకులు. గొప్పవర్తకులు.

జి. నారాయణస్వామి శ్రేష్ఠిగారు:—వీరు చెన్నపురి వాస్తవ్యులు. కార్పొరేషను సభ్యులు. విక్టోరియా పురమందిరపు కార్యదర్శులు.

టి. అరుణాచలనాథం పిళ్లగారు:—వీరు లోకము కాథలిక్కులు. శాసనసభాసభ్యులు. చెన్నపురిలో ఇండ్ల అద్దెలు హెచ్చింపబడకుండ ప్రభుత్వమువారు తగిన శ్రద్ధ దీసికొనుట కీ మధ్యనే యొక చట్టమును శాసనసభలో ప్రవేశపెట్టియున్నారు. క్రైస్తవుల శ్రేయమునకు వీ రెంతయో పాటుపడుచున్నారు.

గౌ. మాధవరావు గారు:— వీరు మలబారు వాస్తవ్యులు. శాసనసభాసభ్యులు. జిల్లా బోర్డు అధ్యక్షులు.

హాబీబుల్లా సాహేబు గారు:—వీరు ప్రస్తుతము చెన్నపురి కార్పొరేషను కమిషనరుగ నున్నారు. స్థానిక స్వపరిపాలన నిర్వాహణమున వీరికి పెట్టినది పేరు. చాలకాలము ఉత్తరార్కాటు జిల్లాబోర్డుకు అనధికారాధ్యక్షులుగ నుండిరి. సర్ రాజగోపాలాచార్యులుగారు సెలవుమీద నున్న కాలమున, చెన్నపురి ప్రభుత్వ కార్యనిర్వాహక సంఘమున ఆరునెలల కాలము సభ్యులుగ నుండియుండిరి. ప్రభుత్వమువా రీమధ్యనే సి. ఐ. ఇ. బిరుదము నిచ్చి సత్కరించిరి.

లిటిల్ హెయిల్స్ గారు:—వీరు ప్రస్తుతము ప్రభుత్వపు విద్యాశాఖాధ్యక్షులుగ నున్నారు. భారతీయాశయముల పట్ల వీరి కెక్కువ సానుభూతి గలదు.

గౌ. రామచంద్రయ్యరు గారు :—వీరు చెన్నపురి వాస్తవ్యులు. న్యాయవాదులు. దక్షిణాది భూస్వాముల తరఫున శాసనసభలో ప్రతినిధులుగ నున్నారు వర్ణాశ్రమధర్మసంఘమున నెక్కువ పట్టుదలతో పనిచేయుచున్న వారు

గౌ. సుబ్బరాయులు రెడ్డి గారు:—వీరు దక్షిణార్కాడు మండల వాస్తవ్యులు. ఆంధ్రులు. గొప్పభూస్వాములు. జిల్లాబోర్డు అనధికార అధ్యక్షులు. శాసనసభాసభ్యులు.

యదుల్లా బాతుసాహేబు గారు :— వీరు చెన్నపురి వాస్తవ్యులు. గొప్ప వర్తకులు. చెన్నపురి కాంగ్రెసు కమిటీ కార్యదర్శులు. ఖిలాఫత్తుసభా కార్యదర్శులు. రాయకీయోద్యమము లన్నిటిలో వీరు పాలుపుచ్చుకొని పనిచేయుచున్నారు.

గౌ. అహమదు తంబి మరిక్కారు గారు :— వీరు గొప్ప వర్తకులు. నాగపట్టణము వాస్తవ్యులు. శాసనసభా సభ్యులు.

గౌ. ఎం. సి. రాజాగారు:—వీరు పంచముల తరఫున చెన్నరాజధాని శాసననిర్మాణసభలో ప్రతినిధులుగ నున్నారు. గొప్ప విద్యాభిమానులు. కార్మికోద్యమములలో యోగ్యము పుచ్చుకొని పనిచేయుచున్నారు.

రావుసాహేబు కృష్ణారావు భోన్సలే గారు :— వీరు మహారాష్ట్రులు. ప్రభుత్వపు విద్యాశాఖకు కార్యదర్శులు.

దివాను బహద్దరు పరాంకుశము నాయుడుగారు:— వీరు ప్రస్తుతము చెన్నపురమున పోలీసు కమీషనరుగ నుండి పని చేయుచున్నారు. ప్రభుత్వమువారు వీరు చేయుచున్న సేవను గోరియాడుచు ఐ. ఎస్. ఓ. బిరుదము నిచ్చి సత్కరించియున్నారు.



PARROT
Cigarettes
10 CIGARETTES 10
MANUFACTURED BY
THE CALCUTTA
CIGARETTE Co. LTD.
INDIA.


కె ఎస్. ముత్తయ్యా
కంపెనీవారు
వారి మితిలేని ఖాతాదారుల సౌకర్యార్థమై
మద్రాసునందు
గోవిందప్ప నాయకవీధి
నెం. 188 భవనమునందు
ఒక బ్రాంచిని తెరచియున్నారు.
టెలిఫోను నెం, 1216. పోస్టుబాక్సు నెం, 99
తంతివిలాసము: ముత్తయ్యా కో.
Telephone No. 1216
Post Box No. 99
Telegram.-MUTHIAH Co.
K.S. MUTHIAH & Co
SILK HOUSE
BENARES CITY

# క్రౌన్ కాఫీగింజలు

## నీలగిరిలో ఉత్పత్తి



మా ప్రసిద్ధికెక్కిన కాఫీగింజలు అందరికిని తక్కువధరకు దొరుకుట కై ఈ ఏర్పాటు చేయబడినవి. మా కంపెనీలో ఎక్కువగా వ్యాపారము జరుగుటచే కావలసినవారలు ముందు గా వ్రాసి తెప్పించుకొనవలెను. ఈ సమయము తప్పిన దొరుకుట దుర్లభము. నోటీసు ఇవ్వకనే మా మొత్తపు ధరలు లేక చిల్లర ధరలు మార్చబడును.

దరఖాస్తు పంపినచో వ్యాపారపు ధరలపట్టీ పంపబడును. జాబులన్నియు ఇంగ్లీషులో నే వ్రాయవలయును. ఏజెంటులు కావలయును.

## ధరల యొక్క వివరము

| ఒక్కొక సంచిలో యుండు నది. | క్రౌను కాఫీ. | | పార్చిమెంటు కాఫీ. | | పీబెర్రీ కాఫీ. | | పార్చిమెంటు కాఫీ టోకు ధరలు మణుగు 1-టికి. | | | | పీబెర్రీ కాఫీ టోకు ధరలు మణుగు 1-టికి. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | రూ. | అ. | రూ. | అ. | రూ. | అ. | మాదిరి. | రూ. | అ | | మాదిరి. | రూ. | అ. |
| 3 పౌన్లు. | 2 | 4 | 2 | 2 | 2 | 4 | ఓ | 16 | 0 | 1000 మణుగులకు. | పీబెర్రీ నెం. 1. | 22 | 0 |
| 6 ,, | 4 | 6 | 4 | 0 | 5 | 10 | ఏ | 15 | 8 | | ,, నెం. 2. | 21 | 8 |
| 12 ,, | 8 | 8 | 7 | 13 | 11 | 0 | బి | 15 | 0 | | వల్లది. | | |
| 24 ,, | 16 | 0 | 15 | 4 | 21 | 8 | సి | 14 | 8 | | త్రైరియేజ్. | | |

బి. వి. ఎస్. అయ్యర్, సెక్రటెరి అండు ఆర్గనైసర్.

(2152)

క్రౌను కాఫీ కంపెని, మేటుపాళయం.

**Crown Coffee Company.**

**Mettupalaiyam. (S.I.Ry.)**

# అమృతాంజనం డిపోవారి ఔషధములు

## అమృతాంజనము.

గాయము పుండ్లకు ఘనమయిన మందు.

చక్కని డబ్బీలో సహా సీసా 1-కి రూ. C-10-0.

ప్రతియింట నుండదగినది.

అమృతాంజనము లోకప్రసిద్ధిని బడసియున్నది.

అమృతాంజనము అన్ని నొప్పులకు సిద్ధామృతము.

అమృతాంజనము అమృతశబ్ద మాదినిగల మాయమందు గాదు.

నకలు మందులవలన మోసము గలుగును.

పంచభావ. చీటిని చూచికొనిన మోసము గలుగదు.

అమృతాంజనము అంజనశబ్ద మంతమున గల నకలుమందు గాదు.

అమృతాంజనమునకు సాటియైనమందు అమృతాంజనమే.

అమృతాంజనపు జగత్ప్రఖ్యాతివలన దేశమునందంతటను

అమృతములు అంజనములు వెలసినవి.

## దంత చూర్ణము

డబ్బీ 1-కి 0-[illegible]-0 డజను రూ. 1-4-0.

ఈ దంతచూర్ణముతో పండ్లు తోముటవలన చిగుళ్లనుండి రక్తము స్రవించకుండును. నోట దుర్గంధములేక యుండును. పండ్లు ముత్యములవలె తెల్లగా నుండును. అనేకులవల్ల ప్రతిరోజు వాడబడుచున్నది. సర్వ సామాన్యముగ వాడుటకు దగియున్నది.

ఒకసారి వాడి పరీక్షించి చూచుట యుక్తము.

పండ్లపోటుకు తీపులకు మంచిపొడుము.

పండ్లకు బలమునిచ్చును. ప్రతివారము వేలకు వేలు డబ్బాలు క్రయము

## తామర తైలము

తామర, తీటు, గజ్జికి మంచితైలము

డబ్బీ 1-కి 0-6-0.

తామర ఒకవిధమైన పురుగులవలన చర్మము మీదగాని, వెంట్రుకలలోగాని, గోళ్లలోగాని, పుట్టుచున్నను. పురుగులలోని భేదమునుబట్టి తామరలోను రెండు మూడు భేదములు గలవు.

రాజారాణి గుర్తుగల తామర తైలము పూర్తి శాశ్వతముగను చాలమంచి మందులతో తయారుచేయబడి ప్రఖ్యాతిగాంచినది. అనేకయేండ్ల నుండియున్న తామర సాలుసైదు పారులు రాచిన తోడనే పోయినవని వేలమంది మాకు వ్రాసియున్నారు. కాన తామర తీట వీనుగజ్జి మొదలగునవి గలవారందరు ఈ తైలమును ఒకసారి వాడి చూడదగినదము. దీనిని రాచిన మంటయుండదు. చర్మము పలుపై కప్పదు, పుండు పడదు.

## మోహిని తైలము

5 తులములుగల నూనె సీసా 1-కి రూ. 0-12-0.

స్త్రీ పురుషులు వాడుటకు యోగ్యమైనది. మెదడుకు చలువ చేయును. కండ్లకు చలువచేయును. వెంట్రుకలు పెరుగును. మనోహరముగా నుండును. సువాసన గలిగియుండును. సుఖనిద్ర, విశ్రాంతి నిచ్చును.

## జ్వరహారి

సీసా 1-కి వెల రూ. 0-12-0. వి. పి. సహా రూ. 1-0-0

జ్వరము శరీరమందు రక్తభేదము, రక్తగతి భేదమువలన గలుగును సాధారణముగా నీటి, గాలి, స్థలపు మార్పువలనను దేహమునకు గాసివలనను జ్వరమువచ్చును. జ్వరహారిని అయిదు పూటలు సేవించిన పట్టున పసుపు జ్వరములు, చలి పురాణజ్వరములు మొదలగు సమస్త జ్వరములు మానును; ఆకలి హెచ్చును; మలబద్ధము మానును రక్తశుద్ధియగును; కొద్దిదినములు సేవించిన శరీరము యథాస్థితిజెంది ఆరోగ్యము గలిగియుండును.

## వజ్రగుళికలు.

20 మాత్రలు గల డబ్బీ 1-కి రూ. 1-0-0.

ధాతుపుష్టికి, బలమునకు, ప్రాణమునకు రక్తపుష్టియు, నరపటుత్వమును కారణములు. రక్తపుష్టికి మంచి ఆరోగ్యము మూలము. ఆరోగ్యము బహిరంగ శరీరవ్యాయామమువలనను, జితేంద్రియత్వమువలనను గలుగును. వ్యభిచారము, సుఖరోగములు, దురభ్యాసములు, విశ్రాంతి లేకుండుటయు, ఆరోగ్యమునకు హానినిచేయును. దీనివలన శుక్లనష్టము, స్ఖలనము, శక్తిలేకుండుట, అగ్నిమాంద్యము, భయము, కంపము, ముఖవదనము లేకుండుట మొదలగునవిగలుగును. పైజబ్బులకు వజ్రగుళికలు వజ్రాయుధమువంటివి.

## కుసుమారి మాత్రలు

డబ్బీ 1-కి 10 మాత్రలు వెల రూ 1-0-0

కుసుమ జాడ్యముగలవారలకు ఋతుకాలగాని, సకాలమునకు ఋతుమతులు గాకుండుటగాని, రజోస్రావము తక్కువగాని తక్కువ రోజులుగాని వెడలుట సంభవించును. దీనివలన ఆకలితగ్గును. జ్వరము ఆయాసము వచ్చును. ముఖకాంతిచెడును. గర్భధారణకు భంగము గలుగును. ఈ మాత్రల సేవించిన క్రమముగ ఋతుమతులై ఆరోగ్యముగలిగి గర్భధారణకు వీలగును.

**అమృతాంజనం డిపో, మదాసు-బొంబాయి**

# అమృతాంజనం డిపోవారి ఔషధములు

## కఫహారి

సీసా 1-కి రూ. 1-0-0. వి. పి. రూ. 1-4-0.

దగ్గు శ్వాసకోశములందు బలహీనతవలన ఏర్పడును. ఇది అనేకవిధములు. 1. శైత్యమువల్లన ఏర్పడినదగ్గు 2. శీతకాలమున ప్రబలించుదగ్గు. 3. శ్వాసకోశముల సూక్ష్మనాళములందు ఏర్పడు దగ్గు. 4. ఉబ్బసము. 5. క్షయదగ్గు. దగ్గుకు సేవించవలసిన మందు దగ్గు విధమును బట్టియుండును. శ్వాస పిల్లికూతలు ఎగరొప్పు ఆయాసము మొదలగు కఫరోగములు శ్వాసకోశముల సూక్ష్మ నాళములయందు ఏర్పడు బొగ్గు పులుసువాయువు త్వరలో ప్రాణవాయువునకు మార్చనందున కలుగును. కఫరోగములు మేహ కారకమునబుట్టి శరీరమున బలహీనత ఏర్పడినకొలది వృద్ధిజెందును.

ఈ ద్రావకమును కొద్దిరోజులు సేవించిన శ్వాసకోశములకు పుష్టికలుగును. కఫము తెగిపడును. ఆయాసము ఎగరొప్పు మానును. గుండెల దడ దడ ఆగును. కొంతకాలము సేవించిన క్రమముగతగ్గును. చాలాకాలమునుండి దగ్గువలన బాధపడువారును ఉబ్బసము క్షయ వలన బాధపడువారును కఫహారిని త్రాగుచు హైపోఫాస్ ఫైట్సును వాడుట ముఖ్యము.

## జంతువాతహారి

డబ్బీ 1-కి 10 మాత్రలు వెల రూ. 1-0-0.

దీనివలన అజీర్ణము, కడుపులో నొప్పి ముఖము పాలిపోవుట ఉదరపాట్టి, జ్వరము, చెమటలు పోయుట, కొన్ని సమయములందు విరేచనములు సంభవించును. 12 ఏండ్లలోపల పిల్లలు ముఖ్యముగా వీటివలన బాధపడుదురు. రెండు సారులు ఈ మందును సేవించిన శరీరము ఆరోగ్యము జెందును.

## గ్రహాణిమాత్రలు

20 మాత్రలు డబ్బీ 1-కి రు 0-8-0 వి. పి 0-12-0

రక్తవిరేచనములు, బంకవిరేచనములు, జిగటవిరేచనములు, అజీర్ణవిరేచనములు, నీటివిరేచనములు, మొదలగునవి ఈ మాత్రలను మూడుపూటలు సేవించిన తోడనే నిలిచిపోవును. వీటిని పిల్లలకు కూడ వాడవచ్చును వెంటనే గుణ మిచ్చును.

## నేత్రాంజనము

డబ్బీ 1. కి రూ 0-4-0 వి పి సహా 0-7-0

ఈ కాటుకను విడువక కొద్దిదినములు పెట్టుకొనిన కంటిమంటలు, ఎఱుపులు పుసికట్టుట, కండ్లు అంటుకొనుట, కంటిదురదలు, కండ్లనుసకలు మొదలగునవి మానును. డబ్బీలో పావులాయెత్తు కాటుకమాత్రమే యుండును

## పగుళ్లకు తైలము

వెల డబ్బీ 1-కి రు 0-6-0 వి. పి. తో 0-10-0

అరికాళ్లు, అఱచేతులు, చర్మము కారకమువలన, శీతగాలి వలన పగిలి నీరు కారుటయు జిలపుట్టుటయు సంభవించును. ఈ తైలమును రాచిన పగుళ్లుమాని జిలపోయి మంచిచర్మము రాగలదు. పగుళ్లనొప్పియు నయమగును. స్వల్పక్రయము కాలి పగుళ్ళకు ఈ తైలము అత్యంతోపయోగకరము.

## మూలశంకకు తైలము

వెల డబ్బీ 1-కి రూ. 0-12-0.

మూలశంకవలన ఆసనముదగ్గర చర్మము లావుబారి క్రమముగ చిన్నచిన్న మొలలు ఏర్పడును. ఇది పైత్యకోశపు మందతవలన (Torpid liver) గలుగును. అతికారం, బడలిక, విశేషకాలము ఒకచోట కూర్చుండుట, మలావరోధమువలన బహిర్దేశమునకు పోయినపుడును ఇతరసమయములందును రక్తముపడును. దీనివలన బాధపడువారు కారము, ఆవ మొదలగు పదార్థములను తగ్గించి తినుటయు, విరేచన సాధకములగు కూరగాయల తినుటయు యుక్తము. ఈతైలమును మొలలపైరాచిన బాధవెంటనేపోయి రక్తముపడుట మానును. జులాబీమాత్రలవలన సుఖవిరేచన మగును. ఈరెండు మందులను విడువక కొంతకాలము వాడిన మూలశంక రోగము తగ్గగలదు.

## జీర్ణరసాయనము

25 మాత్రల డబ్బీ వెల రూ. 1-4-0.

1. ఆకలి లేకపోవుట, 2. అగ్నిమాంద్యము, 3. మలబద్ధము, 4. కడుపులోశూల, 5. అరుచి, పుల్లత్రేపులు, 6. వికారము, గుండెలలోను రొమ్ములోను మంట, బరువు, 7. తలనొప్పి, తలదిమ్ము, 8. చిక్కిపోవుట, 9. జ్వరము, 10 వెన్నుపూసమీదను ప్రక్కను గూళ్లలోనుపోటు ఆయాసము మొదలగునవి. అజీర్ణలక్షణములు కనుపించిన వెంటనే జీర్ణరసాయనము మాత్రలను సేవించిన జీర్ణశక్తి హెచ్చును, మలబద్ధము మానును. రక్తము పుష్టిజెందును. ఆకలి హెచ్చును.

## కలరా మాత్రలు

డబ్బీ 1-కి 12 మాత్రలు. వెల రూ. 0-6-0

ఈ కలరామాత్రలు లోపల ఇమిడిన వెంటనే విషపురుగుల జంప ప్రారంభించి వాంతిభేదుల తగ్గించి మాత్రము వెడలించి నాడికి పుష్టికలుగజేయును. తగిలిన వెంటనే మందును తినుట ఆవశ్యకము. కలరాయున్నచోట నీటిని కాచి త్రాగుటయు యుక్తము.

# అమృతాంజనం డిపో, మద్రాసు-బొంబాయి

# ఎల్లప్పుడును జింతానునే ఉపయోగించుడు.

జింతానుకు సమానమైన దేదియు లేదు.

జింతానుకు బదులుగా నేదియు లేదు.

ట్రేడ్ మార్కును గమనించి చూడుడు.

జింతాను జగత్ప్రసిద్ధి చెందినది.



జనానురంజకమైనది.

ఇది శ్రేష్ఠమైనందుచేతనే ఇంత గొప్పపేరు బడసినది.

ఇది మిక్కిలి ఉపయోగకరమైన ఔషధము, ప్రతి కుటుంబమునకు ఆవశ్యకమైనది.

వ్యాధులను ఆటంకపరచుటకును, కుదుర్చుటకును ఇది ఉపయోగించబడుచున్నది.

అన్ని వ్యాధులను పోగొట్టుటయందు దీనికి మాత్రమే అత్యద్భుతమైన శక్తిగలదు.

ఇన్‌ఫ్లూయెంజా, కలరా, ప్లేగు మొదలగు అంటువ్యాధుల సమయమందు

ఇది వ్యాధి అంటకుండ ఆటంకపరచుటయందు పేరు పొందినది.

ఇది సర్వవ్యాధి నివారణియే గాక ప్రతిదినము

తాంబూల్ బీడారుగా నుపయోగించబడుచున్నది.

జింతానును ప్రతిదినమును ఉపయోగించిన జలుబు,

విరేచనములు, నెత్తురుభేదులు, వమనములు, అజీర్ణము

మొదలగు వాటిని అద్భుతముగ కుదుర్చును.

ధరలు:— 16 మాత్రలు గల ప్యాకెట్టు 1-కి రూ 0—1—0

65 మాత్రలు గల ప్యాకెట్టు 1-కి రూ 0—4—0

260 మాత్రలు గల ప్యాకెట్టు అద్దముతో గల మెటలు కేసు సహా రూ 1—0—0

టోకుగా కొనువారికిని వ్యాపారస్థులకును డిస్కౌంటు ఇవ్వబడును.

అన్ని షాపులలో జింతాను అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

సోల్ ఏజంట్లు :—

## ఎస్. వైద్యా అండు కో., పార్కు టౌను, మదరాసు.

**Sole Agents :**

## S. VAIDYA & Co., Park Town, MADRAS.

**Town Branches** 1. Esplanade, Madras.
2. Triplicane, Madras.

**Branches :** 3. Bangalore
4. Trichinopoly
5. Colombo, Ceylon.

N B:— ఇది మాత్రమే గాక ఈ కంపెనియందు ప్రసిద్ధిచెందిన ఔషధములు,

ఇత్తడి మైనపు వత్తుల స్టాండు, మేలైన పన్నీరు దొరకును.

# అమృతాంజనము

చక్కని డబ్బీతో సహా సీసా ౧-కి అణాలు ౧౦ మాత్రమే.




అమృతాంజనము అమృతశబ్దమాదిని గల మాయమందుగాదు. నకలుమందుల వలన మోసము గలుగును. పంచభాష చీటిని చూచుకొనిన మోసముగలుగదు. అమృతాంజనము అన్ని బాధలకుపరమామృతము. తలనొప్పుల మాన్పును. వాయువుపోట్ల బాపును. పార్శ్వపు నొప్పుల బారదోలును. పోట్ల పోగొట్టును. వనమూలికలచే తయారుచేయబడిన మంచిమందు. అమృతాంజనమునకు సాటియైనమందు అమృతాంజనమే. అమృతాంజనము జగత్ప్రఖ్యాతివలన దేశమునందంతటను అమృతములు అంజనములు వెలసినవి. అమృతాంజనము అన్ని నొప్పులకు సిద్ధామృతము. అమృతాంజనము సర్వవిధనొప్పులకు సంజీవినివంటిది. అమృతాంజనము పలువిధములైన నొప్పులకు పరమామృతమువంటిది

గొప్పగొప్పవారిచే వేనకువేలు యోగ్యతాపత్రములు పొందియున్నది. వేనకువేలు విక్రయము. అమృతాంజనమును విదేశములలో కూడ వాడుచున్నారు.

అమృతాంజనము డిపో { 109 ఫ్రేరిరోడ్డు, ఫోర్టు, బొంబాయి.<br>లక, 7 తంబుశెట్టివీథి, మద్రాసు.

---

## మన్మథ మోహిని లేహ్యము.

ఈ మన్మథ మోహిని లేహ్యము వీర్యవృద్ధి, రక్తవృద్ధి గలుగజేయు అనేక మూలికలతోడను, అంబరు, శిలాజిత్తు సాలామిశ్రి అక్రోటు, ఉటంగణి, తూదరి సఫేద్ కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, మొదలగు వెలగల యూనానిమందులను జేర్చి శాస్త్రోక్తముగా తయారుచేయబడినది.



ప్రాణమునకు రక్తము ముఖ్యము. ఇది చెడిపోయిన అనేకవిధములయిన రోగములను గలుగజేసి క్షీణదశకు తెచ్చి తుదకు ప్రాణహాని గలుగజేయును. కనుక రక్తమును వృద్ధిపరచుటకు స్త్రీ పురుషులు ప్రయత్నింపవలెను. డబ్బు ఖర్చుకు లోభింపరాదు ఈ లేహ్యము ప్రతిదినము ప్రొద్దున 1 తులము, సాయంత్రము 1 తులము సేవించిన, అజీర్ణమును హరింపజేసి, రక్తవృద్ధి నరములపుష్టి, వీర్యపటుత్వము, బలము, తేజస్సు, జ్ఞాపకశక్తి, ఎండిన్మ్రానుచిగిర్చిన చందమున ఈ లేహ్యమువలన పునర్జీవనముకలిగి యౌవనము సిద్ధించి మంచి సంతానము కలవారై చిరకాలము సుఖింపగలరని వక్కాణించి చెప్పగలము. 25 తు॥గల డబ్బీ వె. రు. 2-0-0.

ఆర్. నరసింహారావు,

రెడ్డివీధి, విల్లివాక్కంపోస్టు, పెరంబూరుమార్గం, మదరాసు.

---

క్రొత్తసరకు! ధరసరసము!!

## ఫౌంటెన్ కలములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| వాటర్ మెన్ సేఫ్టి | 8 | 8 | 0 |
| కామరాన్ సేఫ్టి | 8 | 8 | 0 |
| సెల్ఫ్ఫిల్లర్ నెం. 210 | 4 | 0 | 0 |
| డిటో. కంపాక్టో | 8 | 12 | 0 |
| స్వాన్ | 5 | 0 | 0 |
| బ్లాక్ బర్డ్ | 3 | 0 | 0 |
| డిటో. బంగారుపాళి | 1 | 8 | 0 |
| వెండి క్లిప్పు | 0 | 14 | 0 |

విద్యార్థుల ఉపకరణములు.

Exercise Graph Bound నోటు పుస్తకములు, ఇతర స్టేషనరీ వస్తువులు, యావత్తు ఫౌంటెన్ కలములు హోల్‌సేల్‌గాగాని చిల్లరగాగాని మావద్ద సరసమైన ధరలకు దొరకును.

గిరి బ్రదర్సు, స్టేషనర్సు,

ట్రిప్లికేన్, మద్రాసు.

**GIRI BROTHERS,**

TRIPLICANE, MADRAS.

# అమృతాంజనము

## గాయములు పుండ్లకు ఘనమయిన మందు




చక్కని డబ్బితో సహా సీసా 1-కి రూ. 0-10-0. ప్రతియింట నుండదగినది.

అమృతాంజనము లోకప్రసిద్ధిని బడసియున్నది. అమృతాంజనము అన్ని నొప్పులకు సిద్ధామృతము.

అమృతాంజనము అమృతశబ్ద మాదినిగల మాయమందుగాదు.

నకలు మందులవలన మోసము గలుగును.

పంచభావ చీటిని చూచికొనిన మోసము గలుగదు.

అమృతాంజనము అంజనశబ్ద మంతమున గల నకలు మందు గాదు.

అమృతాంజనమునకు సాటియైనమందు అమృతాంజనమే.

అమృతాంజనపు జగత్ప్రఖ్యాతివలన దేశమునందంతటను అమృతములు అంజనములు వెలసినవి.

## తామర తైలము.

తామర, తీట, గజ్జికి మంచి తైలము, డబ్బీ 1-కి 0-6-0.

## దంత చూర్ణము.

ఒకసారి వాడి పరీక్షించుట యుక్తము. డబ్బీ 1-కి 0-2-0 డజను రూ, 1-4-0.

## మోహిని తైలము.

స్త్రీపురుషులు వాడుటకు యోగ్యమైనది, 5 తులములుగల సీసా 1-కి రూ, 0-12-0.

## అమృతాంజనం డిపో, మదరాసు, లేక ఫోర్టు, బొంబాయి.

## మా ధరలు నరసములు.

ఆర్డర్లు చేరిన వెంటనే వస్తువులను బట్వాడా చేయుదుము.

### ఈ డిపార్టుమెంటులో

నిర్మాతలనుండి నేరుగా తెప్పించబడిన అన్ని రకముల గడియారములు, గడియారముల మరమ్మతు చేయువారికి కావలసిన పరికరము లన్నియు లభింపగలవు.

### గడియారముల వ్యాపారములో

మాకు అనేక సంవత్సరముల నుండి అనుభవము గలదు.

అన్నిరకముల గడియారములను గడియారపు గొలుసులను, గడియారముల మరమ్మతుకు కావలసిన హేర స్ప్రింగులు, అద్దములు, నిమిషముల, సెకండుల హ్యాండులు, అవి యివి యననేల మీకు కావలసిన అన్ని సామానులను మేము సప్లయిచేయగలము. మా మాట నమ్మకమును మాచుటకు ఒకసారి మా కార్యాలయమును దర్శింపుడు.

1872-వ సంవత్సరమున స్థాపితము.



## మరచిపోవద్దు.

పి. లక్ష్మయ్యశ్రేష్ఠి అండు సన్సు,

(ప్రొప్రైటరు: పి. గోవిందరాజులుశ్రేష్ఠి)

### వాచ్ హౌస్,

2/196, ఎస్ల్పనేడు, చెన్నపురి.

# T. SAMMI'S WONDERFUL MEDICINES

TRADE MARK

## టి. సామిగారి అద్భుతమైన ఔషధములు

ఈ యౌషధముయొక్క గుణాతిశయములకు మెచ్చి యెగ్జిబిషన్ కమిటీదార్లవల్ల బంగారు పతకమున్ను, వెండిపతకములును బహుమానములుగా నొసగబడి యున్నవి.

**హిందుతైలము:**—నరుమునొప్పి, నరము బెణుకుట, కీళ్లవాయువు, పక్కనొప్పి, కాళ్లు చేతులు పట్లు, పార్శ్వవాయువు, తలనొప్పి, యింకా యితరవాయువు నొప్పులు, అతి శీఘ్రముగా స్వస్థపడును. దీని వెల 0-8-0. పెద్దడబ్బి 2-8-0.

**హిందుకషాయము:**—కడుపునొప్పి, కడుపులో పేగులుకూయుట, అజీర్ణము, ఓకిలింపు, భేది, వాంతిభేది, శీతభేది, రక్తభేది, నోటిపుండు, పండ్లనొప్పి, జన్ని, తేలుకుట్టడం, జలుబు, స్త్రీలకు ఋతుకాలములయందు కలిగెడు కడుపునొప్పి మొదలయినదిన్ని యింకా కడుపులో కలిగే నానావిధమయిన నొప్పులున్ను అతిశీఘ్రముగా స్వస్థపడును. దీని వెల రు. 0-10-0 లు, 1-2-0, 2-0-0.

**జ్వరనివర్తి:**—సాధారణమైన దినాలపోకిట నుండెడి జ్వరములును, చలిజ్వరములు అడవికొండ జ్వరములు, పిత్తజ్వరములు, యింకా పలువిధములైన జ్వరములును బహుత్వరగా నివర్తియగును. దీని వెల రు. 0-8-0, 0-15-0.

**రక్తశుద్ధి:**—(బ్లడ్ ప్యూరిఫైయర్) ఇది కంఠమాల కారకము ప్రమేహపొడలు, మేహవ్రణములు, గ్రంథివ్రణము, కురుపులు మొదలయినవాటిని స్వస్థముచేసి యేకారణము చేతి చెడియుండినను రక్తమును శుద్ధిచేసి వృద్ధిచేయును. వెల రు. 1-0-0.

**వెల్లకాక:**—వెల్లకాక, పచ్చకాక, మూత్రద్వారమున తాళగూడని మంట, దుర్గంధము వెడలుట మొదలగు మూత్రద్వారమున కలిగెడు స్త్రీసంబంధరోగములను 8 దినములలో కుదుర్చును. దీనివెల, చిన్నసీసా 2-0-0. పెద్దసీసా 4-0-0.

**దగ్గుమందు:**—ఇది దగ్గు, ఉక్కిరిదగ్గు, రొమ్మునొప్పి, గొంతు కమ్ముట, కఫము మొదలయిన దగ్గులకు మంచిఔషధము. వెల 1-8-0.

**పుష్టికాయము:**—ఇది నానావిధముల కలిగిన బలహీనమున్ను, నిద్రలో ఇంద్రియస్ఖలిత మగుటయున్ను, ఇంద్రియలోపమును, స్వస్థపరచి యింద్రియమును వృద్ధిచేసి పుష్టిని కలుగజేయును. మగతనము లేనివాండ్లకు మగతనమును కలుగజేయును. దీని వెల 1-0-0

టి. సామి అమ్మకపు ఔషధశాల, 92, అణ్ణాపిళ్ళవీధి, సాహుకారుపేట, చెన్నపట్టణము.

THE OLDEST FIRM OF PHOTOGRAPHERS

ALSO

**The Best Firm in Madras**

FOR

***BROMIDE ENLARGEMENTS***

FROM

**PHOTOGRAPHS**

**Price from Rupees 5 Upwards.**

*ORIGINAL RETURNED UNINJURED*

**Wiele and Klein, Mount Road**
***Madras.***

Holders of many Medals and appointments to Governors and Rajahs.

# Special Offer

Enlargement 12 "X 10"

Mounted on Card Board 18 "X14"

**Rupees Ten Only**

**WIELE AND KLEIN**

***180 Mount Road,***

**MADRAS.**

# FOR SALE



**Nitric Acid**

**Sulphuric Acid**

**Hydrochloric Acid**

**Citric Acid**

**Tartaric Acid**

**Sacharine**

**Lemon Oil**

**Soluble Essences**

**Liquid Colours**

**Soda Water Machines**

**Empty Soda water bottle**

**Rubber Rings, Brushes**

## A. Saminatha Mudaliar & Sons.

**Post Box 521, Park Town, MADRAS.**

**Established 1880.**

# పి. శి. ఏ. అండు కంపెనివారి శ్రేష్ఠమయిన ఔషధరత్నములు.

(మాకార్యస్థానము పొందూరునుండి పెరిదేపికి మార్చబడినది)

## మదనకామేశ్వర లేహ్యం

దుర్బలులపాలిటి కల్పవృక్షము. వీర్యవృద్ధిని కలిగించుటలో అత్యుత్తమము. మేహము, నిస్త్రాక, శుక్లనష్టము, అతిమూత్రము, కాళ్లు లాగుట, దుర్బలత్వము, మొదలగువాటిని హరించి మంచిబలమును, వీర్యవృద్ధిని, కామసుఖమును, సంతానప్రాప్తిని కలిగించు వరప్రసాదము. 2 డబ్బీలుచాలును.

20 తులముల డబ్బి రు 1-4-0.

## పాలసుగంధి లేహ్యము

ఇది రక్తశుద్ధికి శ్రేష్ఠ మయినది. సవామేహములు, మేహపొడలు, పుండ్లు, మచ్చలు, ఇతరచర్మరోగములు, కీళ్లనొప్పులు, రసపట్లు, మలబద్ధము, మొదలగువాటిని హరించి రక్తశుద్ధిని జేయుటలో అమృతతుల్యము 4 డబ్బీలుచాలును. 20 తు॥ డబ్బి రు 1-4-0.

## పంచతిక్తఘృతగుగ్గులు

ఇది సమస్తరోగములకు బ్రహ్మాస్త్రము. సమస్తవాయిలు, కొరుకువ్రణములు, పుండ్లు, కురుపులు, కుష్ఠువు, పొడ(బొల్లి) వా పువులు, తీట, గజ్జి, సమస్త చర్మరోగములు, భగంధరములు, గండమాలలు, లూటీవ్రణములు, మొదలగువాటి నన్నిటిని నిర్మూలము జేయును. 40 రోజులకు తగ్గక 6 మాసములవరకు పుచ్చుకొనిన ఎట్టిమొండివ్యాధు లైనను తప్పక కుదురును. 20 తు॥ డబ్బి రు 2-8-0.

## ఘనసారచందిని

ఇది ఎరుపు, తెలుపు, పసుపు మొదలగు అంటు సెగరోగములను స్త్రీల కుసుమవ్యాధులను తప్పక ఖండించును. 2-3 సీసాలు చాలును. సీసా రు 1-8-0.

## బృహచ్చంద్రోదయ లేహ్యం

అత్యుష్ణము, అతిదారుణమును హరించి దేహమును చల్లబరుచుటలో అమృతతుల్యము. మేహము, అతిమూత్రము, సెగరోగము, వాట్లవలన గలుగు కాళ్లనొప్పులు, నడుముల నొప్పులు, మలబద్ధము, పాలుమాలిక, నోటిపూత కండ్లు కాళ్లుమంటలు, దేహవేడిమి, యిలాంటి వ్యాధులను హరించి బలమును కలిగించును.

2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు 2-8-0.

## రోజాపుష్ప లేహ్యము

ఇది మలబద్ధమును ఖండించుటలో ఉత్తమమయినది. సాపుగా కాలవిరేచనమును జేయును. 15 తు॥ డబ్బి రు 0-10-0.

## క్షయాదిష్ట ము

ఇది సమస్తవిధములగు దగ్గులు, శ్వాస, కాస, ఉబ్బసము, అల్ప, క్షయ, మొదలగు వాటిని హరించి గుండెకు బలమిచ్చును.

## మహాఖండార్ద్రక లేహ్యం

20 తు॥ డబ్బి 1 కి రు 1-4-0.

ఇది సమస్తపైత్యములు, పుళ్లేత్రేపులు, నోటనీరూరుట, అన్నద్వేషము, మలబద్ధము, మొదలగువాటిని హరించి మంచి ఆకలిని జీర్ణశక్తిని కలిగించును.

20 తు॥ డబ్బి రు 1-4-0.

## ప్రతాపకస్తూరిమాత్రలు

ఇవి మిక్కిలి ఘాటుగలిగి సువాసనగా నుండును. తాంబూలములోగాని, విడిగాగాని 1-2 మాత్రలు పుచ్చుకొనిన ఆనందముగా నుండుటయేగాక శైత్యము, వాయువు, జలుబు, జ్వరము, సన్నిపాతము, చిన్నబిడ్డగుణము, దగ్గు, ఉబ్బసము, మొదలగువాటిని హరించును. ప్రతిగృహమం దుండదగినది.

250 మాత్రల సీసా 1 కి రు 0-4-0.

(డజను) 12 సీసాలు రు 2-4-0.

## సంజీవనకల్పము

ఇది గొప్ప నవీనయోగము, సమస్త వ్యాధులకు వజ్రాయుధము. ఉష్ణాధిక్యము, మేహవాతము మొదలగువాటిచే గలుగుజ్వరములు, జ్వరమాంద్యము, తాపము, దాహము, అల్ప, కీళ్లనొప్పులు, నడుములనొప్పులు, మూత్రకృచ్ఛ్రము (మూత్రమువిగించుట) శరీరవేడిమి, మొదలగు వ్యాధులకు బ్రహ్మాస్త్రము. నిర్భయముగా ప్రతివారు వాడవచ్చును. ప్రతిగృహమం దుండదగినది. ప్రతివైద్యుడు వాడదగినది. 5 తులముల పౌడర్ డబ్బి రు 1-0-0.

## అమృతకల్పము

ఇది లోపలకు పుచ్చుకోవచ్చును. పైన రాయవచ్చును. జ్వరములు, వాయువులు, తలనొప్పులు, వాతనొప్పులు, దగ్గు, ఉబ్బసము, కడుపుశూలలు, బురుశూలలు, పండ్లనొప్పులు వాంతులు, అజీర్ణభేదులు, కలరా, ప్లేగు, విషజ్వరము, సన్నిపాతము, తేలుకాటు, మొదలగు అన్నివిధములగు వ్యాధులకు రామబాణము ప్రతిగృహస్థుడును కలిగియుండవలెను. ప్రతివైద్యుడు వాడవలెను.

పెద్దసీసా రు 1-4-0. చిన్నసీసా రు 0-12-0.

## తామరతైలము

తామర, తీట గజ్జికి రామబాణము.

డబ్బి 1 కి 0-5-0.

వి. పి. ఖర్చులు ప్రత్యేకము. క్యాటలాగు ఉచితము. 5 రూ॥ పైబడిన ఆర్డర్లకు రు. 1-కి 0-2-0 కమీషనిచ్చెదము.

**అడ్రసు: పి. శి. ఏ. అండుకంపెనీ, ఆయుర్వేదసమాజము,**

పెరిదేపి, నెల్లూరుజిల్లా, ఒంగోలుస్టేషన్.

# WEST END

## Watches



### The "COMPETITION" KEYLESS LEVER WATCHES.

*Movement fully jewelled with 15 best quality rubies, of which 3 are in screwed sockets, double roller lever escapement, real compensation chronometer balance, hard tempered isochronal hair-spring; extended and raised barrel with perfected main-spring. The wheels, pinions and pivots are made from the highest grade materials. Very clear enamel dial with sunk seconds. For neatness of shape, finish of the case, clearness of dial, we have followed the best traditions of our firm in making the "Competition" pleasing to the eye and practical for use.*

| 18''' Size | Open Face | Hunting. | Half-Hunting. |
|---|---|---|---|
| NICKEL SILVER | Rs. 25 | Rs. — | Rs. — |
| STERLING SILVER | 35 | 40 | 43 |
| 14-ct. GOLD, Metal inner dome | 90 | 115 | 120 |
| 18-ct. " Metal inner dome | 120 | 150 | 155 |
| 18-ct. " Gold inner dome | 145 | 175 | 180 |
| **16''' Size** | | | |
| NICKEL SILVER | 25 | — | — |
| STERLING SILVER | 35 | 40 | 43 |
| 14-ct. GOLD, Metal inner dome | 78 | 100 | 105 |
| 18-ct. " Metal inner dome | 102 | 127 | 132 |
| 18-ct. " Gold inner dome | 120 | 145 | 150 |

*Our Fully Illustrated Catalogue sent post free on application*

West End Watch Co

BOMBAY - CALCUTTA




*The Dawn of Hope for the Fever Stricken*

TO BE OBTAINED FROM ALL CHEMISTS.

PRICES
8 Annas
1/- Rupees
1/8 ..
2/12 ..

# JVARA-HARI

# జ్వరహారి

దీనియొక్క నామధేయము తెలుపురీతియే జ్వరమును హారించుట కిది సాటిలేనిమందు. ఇది మలేరియా (విషవాయు) జ్వరములకును, విడిచివిడిచివచ్చు జ్వరములకును ఎత్తినది. కొయినా పుచ్చుకొనుటవల్ల కలుగు సెబ్బరలు జ్వరహారివల్ల కలుగవు. కాబట్టి నిర్భయముగ జ్వరముండు సమయమందును యీ ఔషధము పుచ్చుకొనిన నేలాటి సెబ్బరజ్వర మైనను బొత్తిగా నిలిచిపోవును.

ఈ ఔషధమునుగూర్చి వ్రాసిన అనేకులలో నొకరియొక్క ఉత్తరము:—

హాఫీజ్ షాఫిఉల్లాఖాన్—చౌకుబజారు, భోపాల 4-12-1918 తేదిన యిట్లువ్రాసిరి:—

తాము వెనుకపంపిన జ్వరహారి మోస్తరు 20 ఔన్సులబుడ్డి నొకదానిని వి. పి. ద్వారా పైవిలాసమునకు పంపుడు. ఈ మందు మిగుల నుపయోగకరమైనది. ఇన్‌ఫ్లుయన్జా జ్వరమును పోగొట్టుటయందు మిగుల ప్రసిద్ధి కెందినది. ఈ ప్రాంతములందు సుమారు 5,000 జనులు ఈ మందును సేవించి ఇన్‌ఫ్లుయన్జా జ్వరమును పోగొట్టుకొనిరి. ఈ మందును శీఘ్రముగ నాకు వి. పి. ద్వారా పంపుడు.

ఇప్పుడే ఒక సీసాను కొనుము. ప్రతి ఔషధషాపులోను వర్తకులవద్దను చిక్కును.

సీసా ఒకటి వెల రూ. 1-0-0, 1-8-0, 2-12-0, 11-0-0.

మీకు యీ ఔషధము దొరకడము దుర్లభమైన, నేరుగా యీ క్రింది విలాసమునకు వ్రాయుడు.

## హెన్రీస్ గ్రేట్ ఇండియన్ రెమిడీస్ కంపెని

15, అరమనకారవీధి, మదరాసు.

**The Madras Pharmaceutical Syndicate Successors to**

# Henry's Great Indian Remedies Company

## 15, Armenian Street, MADRAS.

